# రెడ్డిసంచిక

సంపాదకులు:

**శ్రీ వడ్డాది అప్పారావుగారు, బి. యే., బి. యల్.,**

రాజమహేంద్రవరము.

సంపాదకీయసంఘము:

శ్రీ వడ్డాది అప్పారావుగారు, బి.యే., బి.యల్.,

శ్రీ రాళ్ళబండి సుబ్బారావుగారు, ఎం.ఏ., ఎల్.టి., ఎం.ఇ.ఎస్., (రిటైర్డు),

శ్రీ మల్లిడి అన్నారెడ్డిగారు, యం.ఏ., యల్.యల్.బి.



ప్రకాశకులు:

గౌరవకార్యదర్శి,

**ఆంధ్రేతిహాస పరిశోధక మండలి,**

రాజమహేంద్రవరము.

37 లగాయితు 44, 97 లగాయితు 200 పేజీలవరకు సుజనరంజని ప్రెస్, రాజమండ్రి

441 లగాయితు 448 పేజీలవరకు చింతామణి ప్రెస్, రాజమండ్రి

మిగతా పేజీలు రాజన్ ఎలక్ట్రిక్ ప్రెస్, రాజమండ్రి

యందు ముద్రింపబడెను.

1947.

 [వెల రు. 8/ లు పోస్టేజీగాక.

# సంపాదకుని పీఠిక.

"ఇదం కవిభ్యః పూర్వేభ్యో నమోవాకం ప్రశాస్మహే".

శ్రీ [illegible] ఈ రెడ్డిసంచిక, ఆంధ్రేతిహాస పరిశోధకమండలివారు తెలుగులో ప్రచురించిన, నాలుగవ గ్రంథము. ఇది కాకతీయ రాజ్యము నాశనమైన తరువాత ఆంధ్రదేశము లోని విశేషభాగము నేలిన రెడ్డిరాజుల చరిత్రము. ఇందులో, క్రీ. శ. 1323 మొదలు కొని క్రీ॥ శ॥ 1440 వరకు, సుమారు ఒక శతాబ్దకాలములోని ఆంధ్రదేశ చరిత్రము కలదు. రెడ్డిరాజులు కొండవీడు రాజధానిగా ఆంధ్రదేశములోని పెక్కు భాగములను ఏలిరి. రాజమహేంద్రవర రెడ్డిరాజ్యము ఈకొండవీటి రాజ్యాంతర్భాగమే. ఈ సంచిక యందు రాజకీయ చరిత్రమును గూర్చిన వ్యాసములును, వాణిజ్య, సాంఘికాదివిషయము లకు సంబంధించిన వ్యాసములును, రెడ్డిరాజులు పోషించిన కవులను గూర్చిన వ్యాసము లును కలవు. ఇందలి సంపాదకీయ వ్యాసములను వ్రాయుటలో నేను పూర్వోక్త చరిత్ర కారుల గ్రంథము లన్నిటి సాహాయ్యమును పొందితిని. కీర్తిశేషులు కందుకూరి వీరేశ లింగంపంతులు, కొమర్రాజు లక్ష్మణరావు, చిలుకూరి వీరభద్రరావు, జయంతి రామయ్యపంతులుగారలు రెడ్డిరాజులు, వారి కవులను గూర్చి వ్రాసిన వ్యాసములును, సుప్రసిద్ధ చారిత్రక పరిశోధకులు శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మగారు, డాక్టరు నేలటూరి వెంకటరమణయ్యగారు, బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు మొదలగువారు వ్రాసిన అమూల్య వ్యాసములును, నాకు ఎక్కువగ తోడ్పడినవి. వీరికి నేను మిక్కిలి కృతజ్ఞుడను. నాకు రెడ్లచరిత్రమందు అభిమానమును కలుగజేయుటకు బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి శృంగారశ్రీనాథము కారణము. శ్రీశాస్త్రిగారు నాకు గురుతుల్యులు.

ఈ వ్యాసములను వ్రాయుటలో, ఎపిగ్రాఫియా ఇండికా, దక్షిణ హిందూదేశపు శాసన సంపుటములు, ఇండియన్ ఆంటిక్వెరీ మొదలగు గ్రంథములు ఉపకరించినవి.

"రెడ్డిరాణి" పత్రికాధిపతులు శ్రీ॥ శ్రీ॥ మల్లిడి సత్తిరెడ్డిగారును, "భారతి" పత్రికాధి పతులు విశ్వదాతలు శ్రీ॥ శ్రీ॥ కా. నాగేశ్వరరావుగారును, వారిపత్రికలలో ప్రకటింపబడిన శాసనములను, కొన్ని వ్యాసములను, ఇందు నేను ప్రకటించుటకు అనుజ్ఞ నిచ్చిరి. వారికి నేను కృతజ్ఞుడను. ఈ సంచిక ప్రకటనలో అయిన ఆలస్యమును గూర్చి మండలి గౌరవకార్యదర్శిగారు వారి విజ్ఞాపనలో తెలియపరచినారు.

ఈ సంచిక నేను ఇప్పటికయినను ప్రచురించుటకు శ్రీ రాళ్ళబండి సుబ్బారావు, శ్రీ మల్లిడి అన్నారెడ్డిగార్లు చేసిన ప్రోత్సాహ సాహాయ్యములే ప్రధాన కారణములు. ఈ సంచిక భిన్నకాలములయందు భిన్న ముద్రాశాలయములయందు ముద్రింపబడుట చేతను అచ్చుప్రతులు దిద్దుటలో నాలోపమువల్లను అనేక తప్పులు పడినవి. వానికి చదువరులు నన్ను మన్నింప ప్రార్థించెదను. తప్పొప్పులపట్టిక ఇందు ప్రకటింపబడినది.

వడ్డాది అప్పారావు
సంపాదకుడు

## మండలి గౌరవకార్యదర్శి విజ్ఞాపన.

శ్రీ రాజమహేంద్రవరమున సుమారు 25 సం॥రములక్రిందట మాఆంధ్రేతిహాస పరిశోధకమండలి స్థాపింపబడుటయు, మేము ఆంగ్లమున ప్రకటించిన 60 చరిత్రాత్మక మగు పరిశోధకభాగములును, ఆంధ్రమున యింతవరకును ప్రకటించిన 3 చారిత్రక సంచికలును విద్వల్లోకమునకు తెలిసినవిషయములే. 1939 లో ఈగ్రామమున రెడ్డిరాజ్య వర్ధంతినిజరిపి అనేక కారణాంతరములచేత రెడ్డిసంచికను యింతవరకును ప్రకటింపలేక ఇప్పుడు మండలివారు ప్రకటించి సఫలీకృతులగుట ముదావహము.

మాకీసందర్భమున ఆహ్వానసంఘాధ్యక్షులుగానుండి సహాయపడినట్టియు, శ్రీశ్రీశ్రీ గద్వాల్ మహారాణిగారివల్ల 500 రూపాయిలు మండలికి విరాళముగా నిప్పించినట్టియు, శ్రీ డా॥ కట్టమంచి రామలింగారెడ్డిగారికిని, మాచేఏర్పాటుచేయబడిన చారిత్రకవస్తుప్రదర్శనమును బహిర్గతమొనర్చిన అప్పటిజిల్లాకలెక్టరు శ్రీ యం.వి.సుబ్రహ్మణ్యం, ఐ.సి.యస్ గారికిన్ని, ప్రదర్శనమునకు పాల్గొన్న మద్రాసు ఆర్కియాలాజికల్ శాఖవారికిన్ని, రెడ్డిరాజ్యవర్ధంతిసభకు అధ్యక్షులుగనుండి జయప్రదముగ సభను నడపింపగలిగిన శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారికిన్ని, యీ పనికై దయతో విరాళములనిచ్చిన మహాజనులందరకున్ను (విరాళముల నొసంగినవారిపేర్లు, మొత్తములు యిందు ప్రకటించడమైనది) ముఖ్యముగా మా మండలికి అధ్యక్షులును రాజపోషకులును ఇదివరలో ఇచ్చిన భూరివిరాళములకు తోడుగా ఇప్పుడు తిరిగి రు 116 లు ఇచ్చిన శ్రీ న్యాపతి కామేశ్వరరావుపంతులుగారికిన్ని, మా కృతజ్ఞతాపూర్వక నమస్కారములు. మండలి సాంప్రదాయములనుబట్టి ఊరేగింపుటుత్సవము,(నాగస్వరము, వేదపఠనములతో) రెడ్డికాలమునాటి

గ్రంథములను (శ్రీనాథుని, ఎఱ్ఱాప్రగడ మొదలగువారి గ్రంథములు) పల్లకియందుంచి రాజవీధిగుండ ఊరేగించుట, అప్పటి మండలి కార్యకర్త శ్రీ భావరాజు వేంకటకృష్ణరావు గారివల్ల కార్యనివేదికను సభ్యులకు సమర్పించుట, చారిత్రక వస్తుప్రదర్శనముయొక్కయు శ్రీ రెడ్డిరాజ్యవర్ధంతియుత్సవమున పాల్గొన్న ముఖ్యసభ్యుల ఛాయాపటములను తీయించుటయు, చారిత్రక సారస్వత మహాసభలు రెండురోజులు జయప్రదముగ జరిపినతరువాత కొందరు పరిశోధకులచే రెడ్డిచారిత్రక ప్రదేశములకు పరిశోధకయాత్రలు జరుపుటయు జరిగినవి. ఈ గ్రంథమున ప్రకటించిన కొరుకొండ దేవాలయపు చిత్రములు ఆర్కియాలజికల్ శాఖవారి అనుమతితో ప్రకటింపబడినవి. మండలికి విరాళములు సంపాదించినవారిలో ముఖ్యులు శ్రీ మల్లిడి అన్నారెడ్డి, యమ్.ఏ., ఎల్.ఎల్.బి., గారై యున్నారు. సంపాదకులయొక్క యితరపనితొందరలవల్లనేమి, ముద్రణాలయములలో జరిగిన ఆలస్యములవల్లనేమి, యుద్ధకాలపు అలజడులవల్లనేమి, ఈ రెండు మూడు సంవత్సరములనుండి అమలులోనున్న కాగితపు నిబంధనలవల్లనేమి, విరాళములనిచ్చిన దాతలున్ను, చదువరులున్ను ఎంతయుత్సాహపడినను యింతవరకును మేమీ రెడ్డిసంచికను ప్రకటించలేకపోయినందుకు మిక్కిలి చింతిల్లుచున్నారము. దానినితప్పు దండముతో సరియనునట్లు ఆలస్యముగనైనను యీ గ్రంథమును విద్వల్లోకమునకు అందజేయగలిగినందులకు సంతోషించుచున్నాము. ఇదివరకే ఆలస్యమగుటచేతనున్ను, ముద్దముద్దకు బిస్మిల్లా యనునట్లు ఒక్కొక్కపుటకు అధమము ఒక్కొక్కవారము ఆలస్యమగుటచేతనున్ను, కొన్ని వ్యాసములను ప్రకటింప వీలులేకపోయినది. వ్యాసకర్తలు మన్నింతురుగాక.

ఈ మండలిలో ముఖ్యసభ్యులును, కమ్మవారి చరిత్ర గ్రంథకర్తయు అగు శ్రీ కొత్త భావయ్య చౌదరీగారు ఎంతో ప్రయాసతో వ్రాసిపంపిన రెడ్డిచరిత్ర మను పద్యరచనమును మాత్రము చిగురున అచ్చొత్తించగల్గినందుకు సంతోషించుచున్నాము.

12—8—1947,
ఆంధ్రేతిహాస పరిశోధకమండలి,
రాజమహేంద్రవరము.

ఇట్లు బుధవిధేయుడు,
రాళ్లబండి సుబ్బారావు,
ఎం.ఏ., ఎల్.టి., ఎం.ఇ.యస్., (రిటైర్డు)
గౌరవ కార్యదర్శి.

# రెడ్డిసంచిక — తప్పొప్పుల పట్టిక.

| పేజి. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 12. | — | pursucd. | pursued. |
| | | Gat | Gate |
| 20. | 10 | 1317 | 1351 |
| 20. | 16 | 13 | 1359 |
| 32. | Fn. | వ్రితోప | వ్రితాప |
| 52. | | ఫుట్ నోట్ 27 | 25 |
| | | ఫుట్ నోట్ 26 లో కళింగపంచిక — | Local Records Vol. II-210. |
| | | 25 ఫుట్ నోటు | తీసివేయుడు |
| 119. | 18 | దళమ | దళము |
| 120. | 24 | యిసడ్డ | ఈసడ్డ |
| 123. | | 12 ఫుట్ నోటు | తీసివేయుడు |
| 225. | | (హెడ్డింగు) రెడ్డిరాజులనాటి సాంఘికచరిత్ర | పదునాల్గవ శతాబ్ది పూర్వార్ధ రెడ్డివీరుల యున్నతి. |
| 303. | 14 | "వీలులేదు" తర్వాత | "దొరకిన యీశాన సంహితా భాగములో షట్శ్లోకము కానరాదు". అను మాటలు చేర్చవలెను. |
| 307. | 25 | ఈధార్ధారః | ఈధార్ధాకరః |
| 311. | 5 | సారస్వతపత్రిక | సారస్వతిసర్వస్వపత్రిక |
| 315. | 13 | గూర్చినాడు | నోర్చినాడు |

328 వ పేజి తరువాయి 331 వ పేజిలో 3వ పంక్తినుండి చదువవలెను.

333 వ పేజి 4వ పంక్తితర్వాత 329 వ పేజి మొదటినుండి చదువవలెను.

| పేజి. | పంక్తి. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 354. | 28 | దానక్రాంతి | దానకాంతి. |
| | 29 | భూయింష్ఠః | భూయిష్ఠః |

| తప్పు. | ఒప్పు. | తప్పు. | ఒప్పు. |
|---|---|---|---|
| 367. | 369. | 371. | 373. |
| 368. | 370. | 372. | 374. |
| 369. | 371. | 373. | 375. |
| 370. | 372. | 374. | 376. |



శ్రీ న్యాపతి కామేశ్వరరావు పంతులుగారు, బి.ఏ.,బి.ఎల్.,
ఆంధ్రభాషా పరిశోధకమండలి అధ్యక్షులు,



డాక్టరు కట్టమంచి రామలింగారెడ్డి, ఎం. ఏ.(కాంటబ్) డి. లిట్.(ఆంధ్ర)

# విషయసూచిక.

## వ్యాసములు.— వ్యాసకర్తలు.

# విషయసూచిక.

## అనుబంధము—శాసనములు.

## రెడ్డిసంచికకు విరాళములనిచ్చిన దాతలు.

| | | |
|---|---|---|
| 1. | శ్రీశ్రీశ్రీ గద్వాల మహారాణి సాహెబాగారు రు. | 500/- |
| 2. | శ్రీ తటవర్తి సీతారామశాస్త్రిగారు | 50/- |
| 3. | పి. హెచ్. రామారెడ్డిగారు, మద్రాసురాజధాని డైరెక్టరు ఆఫ్ అగ్రికల్చరు. | 25/- |
| 4. | శ్రీ ద్వారంపూడి శేషయ్యగారి కుమారుడు వెంకన్నగారు, తొస్సిపూడి | 25/- |
| 5. | శ్రీమతి ద్వారంపూడి వెంకటారాయుడుగారి భార్య బుచ్చెయ్యమ్మగారు | 25/- |
| 6. | శ్రీ పసలపూడి రెడ్డిమహాజనులు— డాక్టరు కె. బి. రెడ్డిగారిద్వారా | 116/- |
| 7. | శ్రీ కొవ్వూరి సత్యనారాయణరెడ్డిగారు, బలభద్రపురపు పంచాయితీబోర్డు ప్రెసిడెంటు | 25/- |
| 8. | శ్రీ పత్తి చినవెంకటరెడ్డిగారు, వెదురుపాకసావరం | 25/- |
| 9. | శ్రీ పత్తి సుబ్బన్న; గంగిరెడ్డిగార్లు, సావరం | 25/- |
| 10. | శ్రీ మలిరెడ్డి వీరాస్వామిగారి కుమారుడు సుబ్బిరెడ్డిగారు, వంతలపాక. | 40/- |
| 11. | శ్రీ మల్లిడి శేషయ్యగారి కుమారుడు అబ్బాయిగారు, వంతలపాక | 30/- |
| 12. | శ్రీ ద్వారంపూడి వెంకయ్యగారు, సావరం | 25/- |
| 13. | శ్రీ కొవ్వూరి అబ్బాయిరెడ్డిగారు, బలభద్రపురం | 25/- |

# రెడ్డిసంచిక

## రెడ్ల చరిత్రము

వడ్డాది అప్పారావు

## 1

### కాకతీయరాజ్య చరమదశ.

క్రీ॥ శ॥ 13 శతాబ్దాంతమువరకును వింధ్యాద్రికి దక్షిణమున నున్న భారతీయ స్వతంత్రరాజులు మహమ్మదీయుల సంసర్గము లేక వర్ణాశ్రమధర్మముల ననుసరించి, ప్రజారంజకముగా పరిపాలన నడపుచుండిరి. ఖిల్జీవంశపు అలాఉద్దీను ప్రప్రథమమున దక్షిణహిందూస్థానమందలి దేవగిరి యాదవరాజ్యముపై క్రీ॥ శ॥ 1294 వ సంవత్సరమున దండెత్తెను. క్రీ॥ శ॥ 1302వ సంవత్సరములో నాతడు త్రిలింగదేశమును జయించుటకు ఉలూగ్ ఖానుఅను సైన్యాధిపతి నంపెను.[1] సుల్తానుసైన్యములు ఓరుగంటికోటను ముట్టడించెను. కొందరు మహమ్మదీయచరిత్రకారుల మతమున ప్రతాపరుద్రుడు ఉలుగు ఖానుతో సంధిచేసుకొని కప్పముల నిచ్చి పంపివేసెను కాని ఈదాడివలన సుల్తానుకు త్రిలింగదేశము స్వాధీనము కాలేదు. అందుచే త్రైలింగదేశమును జయించి వశము చేసుకొనుటకు సుల్తాను 1309 సంవత్సరమున అల్లాయుద్దీను తన సుప్రసిద్ధ సేనానియగు మాలికాఫూరును రెండవసారి పంపెను. మాలికాఫూరు విశేషమగు సైన్యముతో ఓరుగంటికోటను ముట్టడించెను. కొంతకాలము ముట్టడిజరుగగా, ప్రతాపరుద్రుడు సంధి

---

1. "In the year 702 H (1302—1303) the Imperial army marched against Tilang. When they reached their destination, the Rai of Tilang — who had under him innumerable elephants, horse and foot dared not oppose the Imperialists and took shelter in the fort. The Royal forces beseiged the fort and laid waste and plundered the surrounding country. The Rai of Tilang sought for quarters and having sent elephants and treasure as a present, made his homage. The Imperial army returned to Delhi.

Tarikh-i-Mubarakshahi — P. 78.

చేసుకొనెను. ఈ దాడివలనకూడ ఢిల్లీచక్రవర్తుల ఉద్దేశములు నెరవేరలేదు. త్రిలింగ సామ్రాజ్యముక్షీణించలేదు. సుల్తానుకు రాజ్యము వశముకాలేదు. అందుచే అల్లాఉద్దీను చనిపోయినతర్వాత కుతుబుద్దీన్ ముబారక్ షా తన సేనాని ఖుస్రూఖానుని 1318 సంవత్సరమున ఓరుగంటికోట నాక్రమించి, దేశము వశముచేసుకొనుటకు పంపెను. ఈదాడి కూడ ఏమియు కార్యకారికాలేదు. కుతుబుద్దీన్ ముబారక్ షా చనిపోయిన తరువాత ఘియాసుద్దీన్ తుఘ్లక్ చక్రవర్తి తనకుమారుడైన ఫఖ్రుద్దీన్ జూనా అనెడి ఉలుగుఖానును 1321 సంవత్సరములో తిరిగిపంపెను. కాని కొలదికాలము ముట్టడిజరిగిన తరువాత ఉలుగుఖాన్ ఎవరికిని తెలియకుండ ఢిల్లీపలాయనమయ్యెను. 1323 వ సం॥రమున తిరిగి మరల ఉలుగుఖాను ఓరుగల్లును ముట్టడించి, కోటలోనికి జొచ్చి, ప్రతాపరుద్రుని చెఱగొని, బందీగా ఢిల్లీకి మాలిక్ బీదల్ అనుసేనాని వద్దలో పంపెను. కొందరి మహమ్మదీయచరిత్రకారులమతమున, త్రైలింగదేశమంతయు సుల్తానుస్వాధీనమై, అతనియధికారులపాలనములోనికి వచ్చెను. జియాఉద్దీన్ బార్నీ అను చరిత్రకారుని ప్రకారము ఓరుగంటికి సుల్తానుపూరు అను నామకరణము చేయబడెను. 'ఈదాడితో కాకతీయ సామ్రాజ్యము కూలిపోయెను. ప్రతాపరుద్రుడు కొందరి మహమ్మదీయచరిత్రకారుల ప్రకారము ఢిల్లీకిపోవుమార్గముననే మరణించెను.[2] ఇది క్రీ॥శ॥ 1323 నాటిమాట.

ప్రతాపరుద్రుడు బందీగా కొనిపోబడినతరువాత తిరిగి స్వదేశమునకు వచ్చెనా? రాజ్యము తిరిగి ఏలెనా? అను విషయము చాల సంశయములకు లోనైయున్నది. క్రీ॥శ॥ 1323 సంవత్సరముతరువాత కూడ నాతడుబ్రతికియుండి రాజ్యమేలినటుల కొన్ని శాసనములబట్టి సందేహము కలుగుచున్నది. క్రీ॥ శ॥ 1326 సంవత్సరమునాటి కొలని రుద్రుని శాసనమొకదానిలో ఆతడు తనస్వామి ప్రతాపరుద్రుని పుణ్యమునకు దానమిచ్చినట్లు తెలుపుచున్నది.[3] బళ్ళారిజిల్లాలోని హంపీగ్రామములోని నరసింహస్వామి దేవాలయములోని మహాసామంతజగధాళ ఇమ్మడి దేవరడ్డిపుత్రుడు పోలిరడ్డి దండనాయకుడు ప్రతాపరుద్రదేవ మహారాజులు ఓరుగంటను పృథ్వీరాజ్యము చేయుచుండగా శక. 1248 లో నృసింహస్వామికి రజితచషక సమర్పించివేయించినటుల మరియొకదాన

---

2. Elliot & Dowson Vol. III page 367 "when Sultan Mahomed sent the Rai of Telingana to Delhi the Rai died upon the road."

3. E. R. no. 308 of 1915.

శాసనముకన్పట్టుచున్నది. 4 వీనినిబట్టి ప్రతాపరుద్రుడు 1323 సంవత్సరముతరువాత ఓరుగంటినుండి రాజ్యము సాగించునటుల కనుపట్టును. కాని వీని ప్రామాణ్యమింకను పరిశోధింప తగియున్నది. కాకతి ప్రతాపరుద్రుడు బందెనుండి సుల్తానుచే సగౌరవముగ విడిచిపెట్టబడి మంథన కాళేశ్వరసమీపమున విడిసియుండ రాజగురువు శివదేవయ్య రాజునుదర్శించి ఓరుగంటిప్రయాణము నిలపి రాజుతమ్ముడు అన్నమదేవుని, సామంతులను, ప్రజలను మంథెన కాళేశ్వరమునకు రప్పించినటులను, రాజచటనేయుండి యోగయుక్తుడై శివలోకము చేరెననియును, ప్రతాపచరిత్రమునందు వ్రాయబడినది. ప్రతాపరుద్రమహారాజు తిరిగి స్వదేశముచేరి విరాగియై, స్వచ్ఛందముగ దేహము చాలించినటుల పైదానినిబట్టి గ్రహింపవచ్చును. ప్రస్తుతమున్న చారిత్రకాధారములతో ప్రతాపరుద్రుడు తిరిగి రాజ్యముచేసెనని విశ్వసించుటకు అవకాశము చాలదు. 5

## కాకతీయులనాటి రాజ్యాంగము.

భారతీయ రాజ్యతంత్రమునందు స్వామ్యమాత్యసుహృత్కోశ రాష్ట్రదుర్గబలములనెడివి ఏడును రాజ్యాంగములు. వీనియందు రాష్ట్రమనగా రాజు ఏలుబడినెఱపుచున్న దేశము. కాకతీయులకాలమున రాష్ట్రము, వ్యవహార,పరిపాలనాసౌకర్యస్థితులననుసరించి, గ్రామము, నగరము, పట్టణము, స్థలము, సీమ,నాడు మొదలగు భేదములతో నొప్పుచుండెడిది. ప్రజాసంరక్షణార్థమును, బలకోశాదులగు శక్తిని, శత్రువుల ప్రతిఘటించి వారిని భంగపరచి వారిసేనలను నాశనముచేయుటకును, యంత్రాదిసాధనపరికల్పితమైన దుర్గము ప్రధానరాజ్యాంగము. భారతీయరాజనీతిలో దుర్గరచన, సంరక్షణములు అతిముఖ్యమై

4 రెడ్డికులనిర్ణయచంద్రిక. పుట 88 89, ఈ శాసనము గవర్నమెంటు శాసనశాఖవారిచే ప్రచురింపబడినట్లు తోచదు. ఈ ప్రోలరెడ్డి శాసనమింకొకటి రెడ్డికులనిర్ణయచంద్రికలో నీయబడినది. పుట 90.

కాకతీయసంచిక అనుబంధములోకూడ ఈ శాసనపు నకలీయబడినది. పుట 88.

పైయాధారముల ప్రామాణ్యము చాల సంశయాస్పదము. కాకతీయరాజ్యము క్రీ॥ శ॥ 1323 తో అంతమయ్యెనని మనము రూఢిగా నమ్మవచ్చును.

5. ఈవ్యాసము నేను వ్రాసినపిమ్మట శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు 1942 సంవత్సరము మార్చినెల భారతిలో ప్రోలయనాయకుని విలస శాసనోపోద్ఘాత వ్యాసము ప్రకటించినారు. శాసనమందు స్పష్టముగ ప్రతాపరుద్రుడు ఢిల్లీకి బందీగా కొనిపోబడుచుండగా నర్మదాతీరమున చనిపోయినట్లు తెలుపబడినట్లు వారు వ్రాసినారు. దీనినిబట్టి ప్రతాపరుద్రుడు తిరిగి స్వదేశమునకు వచ్చినటులగాని పరిపాలించినటులగాని ఊహించుటకు వీలులేదని స్పష్టము.

నవి. కాకతీయుల కాలములలోగాని మరియెన్నడు గాని దుర్గము సీమాదులవలె రాష్ట్ర విభాగము కాదు.[6] కాకతీయులీ రాజ్యాంగవిధానము ననుసరించియు ఆకాలపు దేశస్థితి గతుల పరిగణించియు, తమదేశమునందు శత్రుదుర్భేద్యములగు తావులలోను, కొండలపైనను దుర్గముల నిర్మించియుండిరి. వారు పరభూము లాక్రమించి రాష్ట్రమును వృద్ధిపరచినపుడు, శత్రుదుర్గముల నాక్రమించుకొని, దుర్గమములుగా చేసి తమనాయకుల వశముచేసి, తద్ద్వారా పరిపాలన నడపుచుండిరి. ఈనాయకులీ దుర్గముల నుండి తమతమ స్వాధీనమందున్న సీమాదుల నేలుచుండిరి. కాకతి చక్రవర్తులకాలమున త్రైలింగరాజ్యమునందు ఇట్టివి డెబ్బదిరెండు దుర్గములుకలవు.[7] అవిచక్రవర్తిబంధువులును, ఇష్టులును, ధీరోత్సాహులు నగు సామంతనాయకుల అధీనమందుండెడివి. ఈనాయకులు

---

6. Dr. N. Venkataramanayya observes in his Vizayanagara Origin of the City and Empire page 107. "It is evident that the highest district was Durga: and sima and Nadu came after it".

7. "నానాదుర్గాధీశ్వరులైనదేశాధిపతులు" ప్రతాపచరిత్రము, ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక vol. 7p.2 9 మరియును కొలనియాది గణపతి కృతమైన శివయోగసారమున పీఠికాభాగములో అనేక చరిత్రాంశము లిమిడియున్నవి. దీనిలో

క. ఆహవమున వారిరిపువ్యూహంబుల పదలుపఱచి యొక్కటఁగొనరే
బాహత్తరిదుర్గంబులు సాహసులై రుద్రమాంబ శౌర్యము కతనన్,
కాకతీయ సంచిక అనుబంధము పుట 13. సుభాషి పుట 26.

సీ. కాకతిరుద్రాంబ గాదిలిసుతయైన రుయ్యాంబ బెండ్లాడి రూఢికెక్క
అద్రిజలకుమాంబలన విలసిల్లెడు కులభామినుల మక్కువ వరించె
వడిఁ దాఁగెలిచిన డెబ్బదిరెండు ఘనదుర్గములనెల్ల దనబంధువుల నిలిపె.

కాక. సంచిక అనుబంధము పుట 14; సుభాషి. పుట 28.

సీ. ధరణి ప్రతాపరుద్రవిభుడు.......బాహత్తరి దుర్గనాయకుడు నగుచు
ఘనముగ నాయగదాపిఱుడై చిరమతిరాయచౌహత్తమల్లుడగుచు
మాండలికచౌహత్తమల్ల శృంగారుడై వెండియు నిరువతుగండడగుచు.

కాక. సం. అను. పుట 10. సుభాషి. పుట 34.

లక్షలకొలది కాల్బలములను, వేలకొలది గుఱ్ఱపుబలములను సేకరించి చక్రవర్తికి పర భూములాక్రమించుటయందును, శతృరాజులు రాష్ట్రముపైనెత్తివచ్చిన ఎదిరించి యుద్ధముచేయుటకును సిద్ధులైయుండిరి. చక్రవర్తి వీరికి నాయకత్వమిచ్చుటచే వీరు ఏటేట ఆతనికి కప్పములు చెల్లించవలసియుండెను. ఇట్టినాయకులలో ముఖ్యులు ముప్పిడినాయకుడు కొలని (ఇందులూరి) రుద్రదేవుడు రేచెర్లరుద్రుడు, జట్టయల్లంక, గొంకారెడ్డి, ముషునూరి ప్రోలానాయకుడు దేసటి ప్రోలయవేముడు, మొదలగువారలు.

కాకతీయరాజ్యము నాశనమైనవెనుక సుమారు 100 సంవత్సరములకు వ్రాయబడిన అనితల్లి కలువచేఱు శాసనములో ప్రతాపరుద్రుడు చనిపోయినతరువాత త్రిలింగదేశములో నేమిసంభవించినదియును వర్ణించియున్నాడు. 8 "అప్రతాపరుద్రుడు స్వచ్ఛందమరణమును (స్వేచ్ఛతో మరణమును) పొందగానే త్రిలింగభూమి యవనమయమాయెను. మహాజలములందు మునిగినభూమి నుద్ధరించిన ఆదివరాహమూర్తివలె, ప్రోలయనాయకుడు యవనోదరస్థమగుభూమిని పైకెత్తి ప్రతిష్ఠించెను. ప్రోలయనాయకుడు చనిపోయినవెనుక కాపయనాయకు డాభూమిని పాలించెను.

8. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక. సంపుటము 2 పుటలు 106_107.
"తస్మిన్ ప్రతాపరుద్రే స్వేచ్ఛయైవ స్వస్థానం యాతవతి ।
అథసా భూర్యవన మయీ జాతైవాహో, మహమహోమహిమా ॥
వరాహవద్వారిధి వారిమగ్నాం ధరామ శేషాంయవనోదరస్థాం
సముద్ధరన్ ప్రోలయనాయకేంద్ర స్తతః ప్రతిష్ఠాపయతిస్మతద్వత్ ॥
స్వర్గాతిథౌ ప్రోలయభూమిపాలే విశ్వేశ్వరాజ్ఞా మధిగమ్యగత్వా
అపాలయత్కాపయనాయకేంద్ర స్తదియ్య రాజ్యం తరణి ప్రతాపః॥
అథపంచోత్తర సప్తతినాయక సంసేవ్యమాన పదపద్మః
కాపావనీశ్వరః శ్రీవిశ్వేశ్వర కరుణయా క్షితిమరక్షత్ ।
తుస్మిన్నేక్ల సమా క్రాంతాస్తే చాన్యే కాపభూభుజా ।
అగ్రహారాః పునర్దత్తా భూయోభువ మభూషయన్ ।
విశ్వేశ్వరాయ వివిధాం ప్రవిధాయ సేవాం యాతే విధౌదివిచతత్పద సేవనాయ ।
తైనాయకైస్వనగరాణ్యధి గమ్యసద్యైస్సంరక్షితా గతవిరోధిక థైస్వదేశాః ।
తేషాం వేమనరేశ్వరః క్షితిభుజాం ధర్మాత్మ నామగ్రణీః॥

పైశ్లోకములోని స్వేచ్ఛయైవ అనుశబ్దమునకు, బందె (కారాగారము) నుండి విముక్తుడై అని అర్థము చెప్పుచున్నారు. అది సరియైనదికాదు. ప్రతాపరుద్రుడు (భీష్మునివలె) స్వచ్ఛంద మరణమును పొందెనని మాత్రమే దానియర్థము.

కాపానాయకుడు శ్రీ విశ్వేశ్వరుని అనుగ్రహముచే, డెబ్బదియైదుగురు 9 నాయకులచే సేవింపబడుచు, భూమిని పాలించెను. తురుష్కులచే ఆక్రమింపబడిన అగ్రహారములను బ్రాహ్మణులకు పునర్దత్తముచేసియు దానముచేసెను. మరికొన్ని క్రొత్త అగ్రహారములను గూడ ఆతడు భూదేవి కలంకారముగ నిచ్చెను. కాపానాయకుడు విశ్వేశ్వరుని పదముల గొల్చుటకై కైలాసమునకేగినపిమ్మట ఆ (డెబ్బదియైదుగురు) నాయకులు శత్రునాశనముగుటచే తమతమ నగరములకేగి పరిపాలనమొనర్చిరి. వారలలో పంటవంశోద్భవుడగు వేమనరేశ్వరుడొకడు.

---

9. ఈనాయకులసంఖ్య ఎంత? డెబ్బదిరెండా? డెబ్బదిఏడా? ప్రతాపచరిత్రమునందును, వెలుగోటివారి వంశావళియందును నాయకులు డెబ్బదిఏడుగురు. శివయోగసారపీఠికలో డెబ్బదిఇద్దరు. ఈశాసనములో డెబ్బదిఐదుగురు. ఇందేదియు నిజమని నిర్ధారణచేయలేము.

నావద్దనున్న వెలుగోటివారివంశావళి వ్రాతప్రతిలో ఈక్రింది నాయకులు పేర్కొనబడినారు.

వారల సంఖ్య 72.

1. రేచర్ల ప్రసాదిత్యుడు
2. మద్దేవపాత్రుడు
3. అనాచి మద్దేవుండు
4. అల్లురుద్రదేవుండు
5. మురారి మద్దేవుండు
6. సంగరాజు
7. మేడుకూరి రామనాధుండు
8. అమ్మనబోలి రుద్రదేవుండు
9. సోమరాజు రుద్రయ
10. నాచిరాజు భీమయ
11. పంబాయ దేవుండు
12. పోతికంటి మైలు
13. ఇందుమాళి
14. కొండపర్తి గణపతిదేవుండు
15. దాదినాగదేవుని సమాదేవుండు
16. మహాదేవనాయని సమాదేవుండు
17. మల్లికార్జునసేండు
18. కొలిపాక నాగిరెడ్డి
19. తాడిపర్తి గన్నారెడ్డి
20. చంద మల్లారెడ్డి
21. బాచిబూచారెడ్డి
22. గడ్డి మన్నారెడ్డి
23. బాచిపెంచల మల్లారెడ్డి
24. బెడదకోట భైరవదేవుండు
25. కోవూరి నాచిదేవుండు
26. కాల్లయముగ్గండు
27. కొఱవి నిశ్శంగుండు
28. మగదల గణపతిదేవుండు
29. గుండయనాయుండు
30. చెఱకుతోట చెన్న
31. పట్లవారి బాలయ
32. కుమారగణపయ
33. యత్తడి బాలయ
34. గోన కోటారెడ్డి
35. మల్లాది పోతయ
36. మూరయసాహిని

## ఈ నాయకులెవరు?

కొందరుచరిత్రకారులు ఆంధ్రదేశములో నాయంకర నాయకవ్యవస్థ కాకతీయుల ప్రత్యేకసంస్థయనియును ఇది ప్రప్రథమమున కాకతి రుద్రాంబ ప్రతాపరుద్రులకాలములో ప్రవేశపెట్టబడెననియు తలచుచున్నారు.[10] ఇది సరికాదని తోచుచున్నది. ఈ వ్యవస్థ బహుపూర్వమునుండియు ఆంధ్రదేశమునందున్నట్లుల దృష్టాంతములనేకములున్నవి. చాళుక్యుల కాలములోను నాయకులును నాయంకరములును కలవు. ఏపక్షములోను కాకతి రుద్రదేవుని కాలములోను గణపతిదేవుని కాలములోను నున్నట్లుల సుస్పష్టము.

శా॥శ॥ 1191 లో కాకతిరుద్రుని అంగరక్ష బొల్లినాయంకులు తమ స్వామి రుద్రదేవ మహారాజులకు ధర్మువుగాను తమ నాయంకరములో కాంజకల్యాణ కేశవదేవరకు ధర్మువుగా 10 పుట్ల క్షేత్రము పెట్టెను.[11] కాకతిరుద్రుడు ఇందులూరి నానగా

| | | | |
|---|---|---|---|
| 37. | రుద్రదేవుండు | 54. | మల్లు |
| 38. | ఎఱ్ఱసాహిని | 55. | కరణకుమారుండు |
| 39. | మచ్చరుద్రదేవుండు | 56. | గోవులపోచినేడు |
| 40. | వీరభల్లుండు | 57. | నాగనాథుండు |
| 41. | శ్రీకంఠుండు | 58. | మాణిక్యదేవుండు |
| 42. | పెదకూచి రుద్రదేవుండు | 59. | గుండయంగండు |
| 43. | చినకూచి రుద్రదేవుండు | 60. | సామిగాజారోలు |
| 44. | ఇందులూరి అన్నమదేవుండు | 61. | అభంగరాహుత్తరాయడు |
| 45. | అప్పక మల్దేవుండు | 62. | అన్నమదేవుని వెంక |
| 46. | చోక (చోడ) దేవుండు | 63. | ఝుంట వెంక |
| 47. | కరిదేవుండు | 64. | గోవువెంక |
| 48. | దేవరాజు | 67. | మాచర్ల నాగువెంక |
| 49. | వీరన్న | 68. | కాటమల్లవెంక |
| 50. | విస్సన్న | 69. | మంకుగన్న వెంక |
| 51. | విశాలాక్షుండు | 70. | పారువారబ్రహ్మవెంక |
| 52. | వీరసోమ్మయ | 71. | ఉండవిల్లివెంక |
| 53. | వెంకటేశ్వరుండు | 72. | థిట్టకామవెంక. |

పైవారలలో నానాజాతులవారున్నారు. బ్రాహ్మణులు, రెడ్లు, వెలమలు, కాయస్థులు, క్షత్రియులు. వీరలలో చాలమంది చారిత్రకపురుషులుగానే కనుపట్టుచున్నారు. కొందరనుగూర్చి శాసనాధారములు కలవు. ఈ నాయకులవిషయమై పరిశోధనలింకను జరుపవలసియున్నది.

10. Vizayanagara Origin of the city and the Empire. P. 111.
11. S. I. I. IV Nos. 705· 707; 743 (of the year Saka 1158).

ర్యుని కుమారులు పెదమల్లనకు నాయకత్వమును, చిన్నమల్లనకు కరణికము ఇచ్చినట్లును శివయోగసారములో చెప్పబడినది.

"అనుమకొండపురంబు గాదని యావిభుండిల నోరుగ
ల్లను పురంబు ఘటించి యచ్చటి కచ్చుగా నరుదెంచి యా
మ్మనుజ నాథుడు నాయకత్వము మల్లమంత్రికి చిన్నమ
ల్లనకు ధారుణిపెద్దసంప్రతి నాతతంబున నిచ్చెనన్." [12]

రేచర్లరుద్రుని ప్రధాని రాజనాయకుడు, గణపతిదేవునికాలమున మిక్కిలి ప్రసిద్ధికెందిన సేనానాయకుడు. గణపతిదేవునికాలములోనే బయ్యననాయకుడు చక్రవర్తి రెండవశరీరమని ఉప్పరపల్లిశాసనమున వర్ణింపబడెను. వీనినిబట్టి మనమీ నాయకవ్యవస్థ కాకతిరుద్రునికాలమునుండియు నుండెనని యూహింపవచ్చును. [13] ఈ వ్యవస్థ ప్రతాపరుద్రునికాలములో ప్రథమమున ప్రవేశపెట్టబడినట్లు ప్రతాపచరిత్రమున నున్నటుల శ్రీ డాక్టరు నేలటూరి వెంకటరమణయ్యగారు వ్రాసియున్నారు.[14] కాని ప్రతాపచరిత్రమున, గణపతికాలమునుండియు ఈవ్యవస్థ ఉండినటులనే వ్రాయబడియున్నది. అందు గణపతిమహారాజునాయకత్వము అనర్హులపైబెట్టుటచే, ఓరుంగంటికోట సంరక్షణము మొక్కవోయినటులను, అన్నివిధములను అర్హులగువారికే నాయకత్వము ఇవ్వవలెనని నియమముండుట అవసరమని ప్రతాపరుద్రుడు, నిర్ణయించిపద్మనాయకులకు ఓరుగంటి కోటసంరక్షణ మొసగినట్లును చెప్పబడినది. [15]

శ్రీ వెంకటరమణయ్యగారు తాముమద్రాసుయూనివర్సిటీనిమిత్తము ప్రచురించిన వెలుగోటివారివంశావళిలో రుద్రాంబకాలములో నిది రేచెర్లప్రసాదిత్యునిచే ప్రప్రథమమున అమలులో పెట్టబడినట్లుతలచుచున్నారు. ఇదిసరికాదు. చతుర్థకులజులగు నాయకులకు

12. కాకతీయసంచిక అనుబంధము పుట 12.

13. Hyd. Arch. Series No. 3 Upparapalli Inscription.

14. See Introduction to Velugoti Vari Vamsavali page 4. "But tradition embodied in Pratapacharitram on the contrary gives credit to introducing this reform to Rudramba's grandson and successor Pratapa Rudra."

15. ప్రతాపచరిత్రము ఆం॥సా॥ప॥ప 7 పేజీ 287 "గణపతిమహారాజు నానావర్ణంబులవారికి నాయకత్వంబిచ్చుటంజేసి బహునాయకంబైయున్నదిగనుక మొక్కవోయెను. ఇందుకు, తగినయుత్తమజాతులువారు గాని నాయకత్వంబునకు అర్హులుగారని రాజిట్లనియె."

బలిజ, రెడ్డి, కమ్మ, వెలమ, మొదలగు ఉన్నతశూద్రజాతులకు చెందినవారలకు, మొదట నాయకుడు, నాయుడు, నాయక ఇత్యాదిబిరుదము కాకతీయులకు పూర్వమునుండియు వాడబడుచుండెను. రాను రాను క్షత్రియజాతియును, క్షత్రియ సేనానాయకులును గతించగా, ఈ నాయకశబ్దము ఎక్కువగా నానాజాతినాయకులకును వాడుకలోనికి వచ్చినట్లు తోచడిని. 16 కాకతీయులకాలములో క్రమముగా ఈ వాడుక ఎక్కువై వారియనంతరము విజయనగరసామ్రాజ్యపు రాజ్యాంగములో ఇది సైనిక వ్యవస్థలో ముఖ్యమైన విభాగ మాయెను.

ప్రతాపరుద్రదేవచక్రవర్తి 1323 లో బందీగాకొనబడుటతో కాకతీయరాజ్యమంత మొందినను, రాజ్యాంగపు కట్టుబాట్లుమాత్రము సుస్థిరముగా నుండెను. కాకతీయ నాయకులు తమతమ నాయంకరములలో నుండి, దేశము స్వాధీనములో నుంచుకొని పాలించుచునేయుండిరి. ఏలూరు మొదలు సింహాచల పర్యంతప్రదేశము ఇందులూరి రుద్రదేవుని పాలనలో నుండెను. వీరిక్రింద కొప్పులరెడ్లు పిఠాపురము రాజధానిగా, కోరాము, తత్పరిసరప్రదేశముల నేలుచుండిరి. కోరుకొండ రాజధానిగా ముమ్మిడినాయకుడును, తొయ్యేఱు ముఖ్యనగరముగా ముసునూరి కాపనాయకుని సోదరపుత్రుడు అనపోతరెడ్డియును, రేకపల్లి ప్రధానస్థానముగా, ప్రస్తుతపు భద్రాచలము పాలవంచ ప్రాంతముల ముసునూరి ప్రోలయనాయకుడును ఆమనగల్లు రాజధానిగా కాపయనాయకుడును నాయకత్వము నెరపుచుండిరి. కమ్మనాటిలో చెఱకువంశపురెడ్లును, పల్నాటిసీమయందు దేవరినాయుడును, తంగెడయందు శ్రీగిరినాయుడును, వెలనాటియందు సోమయాజుల రుద్రసేనానియును, వర్ధమానపురమునుండి గోనవంశపురెడ్లును, పాకనాటిలో ముప్పిడినాయకుడును, ములికినాడు, రేనాడు, పెన్నాతవాడి, సకలి, ఏఱువ, పొత్తపినాడు, మార్జవాడి మొదలగు దక్షిణాంధ్రదేశభాగములను జుట్లయల్లంక, గొంకారెడ్డిగారలును, ఇంకను అనేకులగు నాయకులును కాకతీయ రాజ్యమునందలి ఇతరభాగములను తమ స్వాధీనమందే ఉంచుకొని ఉండిరి. ఓరుగంటి దుర్గపతన మాత్రమున మహమ్మదీయులకు యావత్కాకతీయరాజ్యమును స్వాధీనము కాలేదు.

16. చాళుక్యరాజ్యాంతమున తెలుగుదేశమునేలిన కాకతీయ, రెడ్డి, వెలమ ప్రభువులు క్షత్రియరాజ్యసంస్థానముల నాశనముచేసినటుల దృష్టాంతము లనేకములు కనవచ్చును. "క్షుద్రక్షత్రియ శిక్షణవిధాప్రోక్షిప్తకాక్షేయకాః" అని ప్రతాపరుద్రీయము,

దుర్గము స్వాధీనము కాగానే ఓరుగంటికి ఉలుగుఖాను సుల్తానుపూర్ 17 అని నామకరణము చేసెను. జియాఉద్దీన్ బార్నీ, యహియాబిన్ అహ్మద్ అను మహమ్మదీయచరిత్రకారులు తిలాంగ్ దేశమంతయు క్రీ॥శ 1323 లో సుల్తాను స్వాధీనములోనికి వచ్చినటులను, వ్రాసియున్నారు. ఈ వ్రాతలు విశ్వాసార్హములు కావు. ఒరంగలు పరిసరప్రాంతములుమాత్రమే మహమ్మదీయుల స్వాధీనములో నుండెననుటకు సంశయింప పనిలేదు. ఓరుగంటికోటనుండి దేశము పరిపాలించుటకు ముక్తియార్లను మేనేజర్లను మహమ్మదీయ చరిత్రకారులు వ్రాసినటుల, ఉలుగుఖాను నియమించి ఉండవచ్చును. కాని వారధికారముచేసిరని చెప్పుటకు ప్రమాణములు చాలవు. కాకతీయనాయకులు స్వదేశ, స్వమత, స్వధర్మరక్షణకు బద్ధకంకణులై, ఏకసంఘముగ మేళగించి సుల్తాను నియమించిన సేనలను నగ్గునూచముగగొట్టి ముక్తియార్లను దేశమునుండి తరిమివైచిరి. ఆంధ్రదేశ చరిత్రములోనే కాదు. యావద్భారతదేశచరిత్రములోను ఇట్టి సంఘశక్తిచూపిన అపూర్వ సన్నివేశము మరియొకటి లేదనియే చెప్పుట అతిశయోక్తికాదు. ఈ సంఘటనకు మూలకారకులు ముషునూరి ప్రోలయ, కాపయనాయకులను మహావీరులు.[18] వీరల నామములు ప్రాతస్మరణీయములు. వైదికధర్మస్థాపనకును కాకతీయ రాజ్యమును నిలుపుటకును వీరు బద్ధకంకణులై మహావీరకృత్యముల నిర్వర్తించిరి.

17. Elliot and Dowson Volume III, p. 231-233 "The name of Arangal was changed to Sultanpur and all the country of Tilang was conquered. Officers were appointed to manage the country. five years tribute was taken." Tarikh-i-mubarakshahi, page 96 "The whole Tilang was brought under control and mukhtars and managers were appointed."

18. ఈ ప్రోలయనాయకుని పేరు అనితల్లి కలువచేరు శాసనము బయలుపడువరకును చరిత్రకారులకు తెలియదు. అనితల్లిశాసనములో ప్రోలయనాయకుడు గతించినవెనుక కాపయనాయకుడు భూమిని పాలించినటుల తెలుపబడినది. కాని వారిసంబంధమేమో తెలుపలేదు. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు ప్రకటించిన కాపయనాయకుని పోలవరపుశాసనములో వీరిసంబంధము స్పష్టముగా తెలుపబడినది. ఆ శాసనములోకూడ ప్రోలయనాయకుని మహత్త్వమేమియు విశేషించి తెలుపబడలేదు. ఇప్పుడు శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు మార్చి 1942 సంవత్సరపు భారతిపత్రికలో ప్రకటించిన ప్రోలయనాయకుని విలసతామ్రశాసనములో ఈ మహావీరపురుషుడు ప్రతాపరుద్రుని అనంతరము త్రిలింగరాజ్యలక్ష్మి నుద్ధరించుటకై చేసిన వీరసేవ, ఉగ్గడింపబడి ఆంధ్రదేశ చరిత్రకారులకు ఆమోదమును గూర్చుచున్నది ఈశాసనమును ప్రకటించి శ్రీ శర్మగారు చరిత్రకారుల కృతజ్ఞతకు పాలుపడియున్నారు.

మహమ్మదీయులను వీరు దేశమునుండి తరిమివేసినను త్రైలింగసామ్రాజ్యము ఏకచక్రిముగా నిలువలేదు. రెడ్డివెలమరాజ్యములుగా చీలిపోయెను.

## II

### ప్రోలయనాయక, కాపయనాయకులు; హిందూధర్మ పునస్థాపనము.

ఈ ప్రోలయనాయక కాపయనాయకులు రెడ్లు. వీరి ఇంటిపేరు ముసునూరివారు. ఇక వీరల వంశక్రమము. త్రిలింగభూమి యవనాక్రాంతము కాగానే హిందువులకు జీవనము దుర్భర మాయెను. ఇదివరలో భరతఖండమందలి రాజులు జిగీషువులై పరస్పరము పోరాడుకొనుచుండినను, ఈ యవస్థ నెరుగరు. యుద్ధములు జరుగుచున్నను జనసామాన్యమున కెట్టి యిబ్బందియు లేకుండెను. మహమ్మదీయులు దేశమును కొల్లగొట్టిరి. ప్రజలను దోచుకొనిరి. కాఫర్లని, దైవదత్తమైన కురాను యందు విశ్వాసములేనివారని, నిర్దోషులగు హిందువుల చంపిరి; హింసించిరి; స్త్రీలనుచెర గొనిరి; దేవాలయములను కూలగొట్టిరి; పూజార్హములగు విగ్రహములను ముక్కలుగ విరుగగొట్టి కాళ్ళతో మట్టివైచిరి. పూజనీయులగు బ్రాహ్మణులను హింసించిరి. వారి యగ్రహారముల లాగుకొని వారిగ్రామములనుండి తరిమివైచిరి. ఈ హృదయవిదారకమగు పరిస్థితి ప్రోలయనాయకుని విలసతామ్రశాసనమున కవిసోత్కంఠముగ ఇట్లు వర్ణించినాడు. [19] "పాపులయిన యవనులు బలాత్కారముగా వ్యవసాయము చేసినందువలన పంటపర్యాయములు లాగుకొనుటచేత దరిద్రులు, ధనికులు అను భేదములేక రైతుల కుటుంబములెల్ల నాశనములయిపోయినవి. ఆమహావిపత్కాలమున, ధనము, భార్య మొదలగు దేనియందును ప్రజలకు స్వాయత్తతాభావము పోయినది. కల్లుత్రాగవలెను; స్వచ్ఛందవిహారము చేయవలెను; బ్రాహ్మణులను చంపవలెను; ఇది యవనాధముల వృత్తి. ఇంక భూమిమీద ప్రాణిలోకము బ్రతుకుటెట్లు? ఈవిధముగా రాక్షసులవంటి తురుష్కులవలన పీడింపబడిన త్రైలింగదేశము రక్షించువారెవరును మనస్సునకుగూడ తట్టక, కార్చిచ్చు చుట్టుకున్న అడవివలె సంతపించిపోయినది." ఇది తత్కాలమందు

19. భారతి వృష-ఫాల్గునము-పుట 311. నేను శ్రీశర్మ గారి వాక్యములనే ఇచ్చట ఉల్లేఖించినాను.

స్వయముగా కంటితో చూచి వ్రాసిన కవివాక్యములు [20]

వీరల వంశక్రమమిట్టిది. [21] పోతననాయకుడు వంశకర్త ఆతనికి పోచ, దేవ, కామ, రాజనాయకులను నలుగురు కుమారులు అందు పోచానాయకునకు పోలానాయకుడు, ఎఱ పోతానాయకుడును పుత్రులు. దేవనాయకునకు కాపానాయకుడు ముమ్మడినాయకుడు అను ఇర్వురుసుతులు. కామనాయకునకు ఇమ్మడీకుడు, దేవనాయకుడు అనువారలు కుమారులు వీరలలో రాజరెడ్డి నాయంకరము, తొయ్యేఱు. ఈతొయ్యేఱు ప్రస్తుతపు తూర్పుగోదావరిజిల్లాలోని మన్నెపుతాలూకాయగు చోడవరములోనిది యనుటకు ఎట్టిసందేహమును లేదు. ప్రోలయనాయకుని రాజధాని గోదావరీప్రాంతప్రదేశమున మాల్యవంత సమీపమున రేకపల్లి అను దేశివ్యవహారనామముగల గ్రామము [22] గణపేశ్వరపు శాసనములో [23] కాపయనాయకుడు అనుమనంగంటి పురవరాధీశ్వరుడని తెలుపబడినాడు.

ఈ అనుమనగల్లే ఆమనగల్లనియు, ఆవనగల్లనియు వ్యవహరింపబడుచున్నది. ఇది ఇప్పుడు నైజాము రాష్ట్రములోని నల్లగొండజిల్లా మిరియాలగూడెం తాలూకాలో నొక గ్రామము ఆ పైశాసనములో "కాపయనాయకేశ్వరుని నిజభృత్యుండైన తుంమ్మడి ఉప్పలపుంబ్రోలువెంక తన స్వామియైన కాపయనాయనింగారికి ధర్మముగా దివిగణపతీశ్వరునకు క్షేత్రము పెట్టినట్లు" తెలుపబడినది. వీనినిబట్టి కాపయనాయకుని నాయంకరము ఓరుగంటికి ఆగ్నేయదిశను కృష్ణాగోదావరి మధ్యప్రాంతమం దుండెననియు

---

20. ఇందతిశయోక్తి ఉన్నటుల తోచదు. See. E.D. III, page 365.

The Brahmin must either become a Mussalman or burned. ......the brahman refused to accept it. The brahman was tied hand and foot and cast into fire" (pile of faggots) .......and the pile was lighted."

E.D. III, p. 551. "They then struck the idol with an iron hatchet and opened its head."

E.D. III, p. 559. "They (the muslims) pursued the enemy to the gat and set everything on fire. They burnt down all those gardens and groves. That paradise of idol worshippers became like hell."

21. J.B.O.R.S. Vol. XX 260-274
22. భారతి మార్చి 1942 పుట 312.

(23) South Indian Inscriptions Vol. IV. No. 950.

ప్రస్తుతము కృష్ణాజిల్లాలోని గుడివాడ తాలూకా కూడ అతని ఆధీనముననే యుండె ననియును స్పష్టము కాగలదు.

పైన వ్రాసిన దానినిబట్టి ఈ సుప్రసిద్ధమైన ముషునూరి కుటుంబపు రెడ్లు కాకతీయనాయకులనియును, వీరల నాయంకరములు కృష్ణాగోదావరీనదుల నాశ్రయించి త్రిలింగదేశపు ఆగ్నేయ భాగమునుండెననియును మనమూహింపవచ్చును.[24]

ప్రోలయనాయకుడు మహావీరపురుషుడు. సకలక్ష్మాధినాథుడు ప్రతాపరుద్రుడు దివికేగి, తెలుగుసీమ యవనాక్రాంతమై, రెబ్బడియిద్దరునాయకులు నాథులు లేనివారై, వైరోధ్యపరులగు మహమ్మదీయులకు దేశమువశమైన దీనదశయందు, ధైర్యము కోల్పోక దేశరక్షణకు అతడు బద్ధకంకణుడయ్యెను. చెదరిపోయిన నాయకులను తన నాయకత్వముక్రిందకు చేరదీసెను. నాయకులకందరకును తాను నాయకుడై మహమ్మదీయుల చిమ్మి చెండాడి, వారాక్రమించిన ఒక్కొక్క దుర్గమునందియు వారల వెడలగొట్టెను. మహమ్మదీయులు వచ్చినవార్తవినగానే దుర్గాధిపతులు అశ్వభటాకులముతైన దుర్గములందలి భయాకులులై అడవులపాలగుచుండిరి. "ఆయాతా యవనా ఇతి క్షితిభుజః శ్రుత్వైవ వార్తాముహో | దుర్గాణ్యశ్వ భటాకులానిసభయాస్త్యక్త్వావనా

24. కాపయనాయకుని నాయంకరమైన ఆమనగల్లు అతని కాకతీయుల సుప్రసిద్ధసేనానులగు రేచెర్ల రెడ్ల నాయంకరము. వీరల శాసనములనేకములు హైదరాబాదురాజ్యములోని అన్నవరము, పిల్లలమర్రి, సోమవరము, నాగులపాడు మొదలగు గ్రామములలో కలవు. చూడుము:_ తెలంగాణాశాసనములు_ పుటలు 35, 37, 39, 40; హైదరాబాదు ఆర్కియాలజికల్ సీరీసు నంబరు 3, పాలంపేటశాసనము. వీరు ఆమనిగంటి పురవరేశ్వరులని పైశాసనములలో వర్ణింపబడినారు. వీరిప్రశంస శా. శ. 1157 పరువాత కనుపడదు. ఈవంశ మేకారణముచేతనో రుద్రాంబ కాలముతరువాత నశించినట్లూహింపవలసియున్నది. కొందరు చరిత్రకారులు పై రేచర్ల వంశమును వెలుగోటివారి వంశముగా భ్రమించియున్నారు. చూడుము_ సూఫనారి వంశచరిత్రము, పుట 9. వంశవృక్షముల పరిశీలించిచూడగా ఈ రెండుకుటుంబములును భిన్నములనియు, వేర్వేరు కాలపువి అనియును గోచరించును. వెలుగోటివారి మూలపురుషునకు అనుమనగంటితో సంబంధము కలుగదు. చేతిరెడ్డి అనుమనగంటిగోత్రప్రభవుడు. ఆయూరి పాటిచేలోని కర్షకుడు. కాని అనుమనగంటిప్రభువు కాడు. చేతిరెడ్డికి బేతాళుని దయలభించినపిమ్మట కాకతిగణపతి అతనికి "చెన్నుమీరంగ లక్ష్మీసునిచ్చి"......పిల్లలమర్రి బేతాళగాపని పేర్కొనబడెను. (వెలుగోటివారి వంశావళి- మద్రాసు యూనివర్సిటీ ప్రచురణము- పుట 4) మరియొకచోట రేచెర్లపురవరాధీశ్వరుడనికూడ చేతిరెడ్డివంశావళిలో ప్రస్తుతింపబడెను. (వె. వంశా పుట 7) రేచెర్లరెడ్ల అనంతరము ఎప్పుడు, ఏసందర్భములో కాపయనాయకునకీ ఆమనగంటి నాయంకరము లభించెనో తెలియదు. కాపయనాయకుని అనంతరము పద్మనాయకు లీ నాయంకరము నాక్రమించుకొనిరి.

న్యావిశన్॥25 కొలదికాలములోనే అట్టిదుర్దినములు ప్రోలానాయకుని ఆధిపత్యమున గడచినవి. పరిస్థితులు తారుమారై యవనులకట్టిస్థితి సంభవించెను. ప్రోలయనాయకుని విలసతామ్రశాసనములో "ముసునూరి వంశజుడయిన ఆప్రోలభూపతి విశృంఖలమును, విశ్వమునకు జీవనాధారములైన తన బాహుబలముచేత యవనుల ఆధిపత్యమును నాశనముచేసెను. ఆయవనాధములకు అతనిపేరు ఉచ్చాటన కర్మకారియయిన మంత్రమాయేమి? ఏలనన ఆపేరుచ్చరించిన మాత్రమున ఆదీనులు దుర్గముల విడిచిపెట్టి, ఎక్కడికో పోయెడివారు. యవనులచే బాధింపబడినవారే వారిని (ఆ తురుష్కులను) చంపివేసిరి. ... ... ... ... ప్రోలభూపతి ఈవిధముగ ప్రబలులైన యవనుల జయించి" —26 అందుచేతనే కాపయనాయకుని ప్రోలవరశాసనమున ఇతడు "అవక్రవిక్రమయశస్స్వభావ్య బాహార్గలుడ" ని అభివర్ణింపబడినాడు. యవనమహార్ణవములో మునిగిన త్రిలింగభూమి నాతడు సముద్ధరించెను. కలువచేరుశాసనములో "వరహావద్వారిధి వారిమగ్నాం, ధరామశేషాం యవనోదధిస్థాం సముద్ధరన్ ప్రోలయనాయకేంద్రస్తతః ప్రతిష్ఠాపయతి స్మగాద్వత్" అని ఆదివరాహమూర్తి సామ్యము కల్పింపబడినది. విలసతామ్రశాసనములో 'విష్ణువు గన అంశతో అవతరించినట్లు ప్రోలమహీపతి అవతరించి భూభారమువహించినట్లు తెలుపబడినది. ఆనాటి పరిస్థితులలో ప్రోలయనాయకుడు నిర్వర్తించిన మహాకార్యములు విమర్శించగా ఈ వాక్యములు ఎంతమాత్రమును అతిశయోక్తులుకావు.

ప్రోలయనాయకుడు నద్బంధుచింతామణి. రాజ్యకాంక్ష లేనివాడు. శాత్రవజయమయినతరువాత ఆతడు ఏకచ్ఛత్రాధిపత్యముగ త్రిలింగభూమి నేలుటకు అర్హుడైనను, బలాత్కరించి రాజగుటకు ఇచ్ఛయించలేదు. తనతో కూడివచ్చిన నాయకుల స్వాతంత్ర్యమును ఏమియు హరించలేదు. ప్రోలయవేమాడు యవనసంహారములో పాల్గొనియుండెనుటకు సందేహింపబనిలేదు. కాని కార్యానంతరము వారివారినాయంకరములకు వెడలిపోయిరి. ప్రోలయనాయకుని రాజధాని ఈ విజయానంతరముకూడ రేకపల్లియనియే విలసశాసనమున కలదు. ప్రోలయవేమాడుపై అధికారము నెరపుచున్నట్లు ఏశాసనమునుబట్టి ఆధారముకనపడదు. ప్రోలయవేమాదులు కలువచేరుశాసనములో చెప్పబడినటుల తమనగరములకుపోయి రాజ్యములను స్థాపించిపాలించుకొనుచుండిరి.

25. S. I. I. Vol. VI, page 111.

26. భారతి _ వృష _ ఫాల్గుణము _ పుటలు 311, 312 శ్రీ సోమశేఖరశర్మ గారి వాక్యములనే ఉల్లేఖించినాను.

ప్రోలయనాయకుడు లేవదీసిన ఈ యుద్ధములో నాయకులేకాక, యావత్కాకతీయ రాజ్యమందలి తెలుగుప్రజలును ఉత్సాహముతో అందుకొని, పనిచేసిరి. వారికి శౌర్య సాహసములు లేకపోలేదు. ప్రతాపరుద్రుడు బందీకృతుడుకాగానే వారు నిరుత్సాహులైరి. ప్రోలయనాయకుడు తెలుగుప్రజలకు, విలసశాసనములో చెప్పినటుల, మనువలె ఆశ్రయుడయ్యెను. ఆయాశ్రయమున వారు తమను హింసించిన, ఆ తురుష్కుల నెదుర్కొని జయించిరి. తెలుగుభూమినుండి తురుష్కులు పూర్తిగా వెడలగొట్టబడిరి. ప్రజలు తురుష్కులదాస్యమునుండి విముక్తులైరి.

ఈ మహాకార్యమునందు ప్రోలయనాయకునకు అతని పినతండ్రికుమాళ్లు అండమై నిలచిరి. అందు కాపయనాయకుడు ముఖ్యముగా ప్రోలయునిభుజమైయుండెను. ప్రోలయనాయకుడు మహాసాహసి: కాపయనాయకుడు సాహసుడేకాక నయోపపన్నుడుకూడ. ప్రోలయ యవనసంహారానంతరము తిననాయంకరమునకుపోయి ధర్మార్జనతత్పరుడై శాంతియుతముగ జీవనము గడపెనని విలసతామ్రశాసనమునందలి విషయములనుబట్టి ఊహింపవచ్చును. ప్రోలయనాయకుడు వదలినపని, అనగా యావత్త్రిలింగభూమిని, ఏకచ్ఛత్రములోనికి తీసుకొనివచ్చు భారము కాపనాయకుడు వహించెను.

## ఈ తురుష్కులెప్పుడు త్రిలింగ రాజ్యమునుండి వెడలగొట్టబడిరి.

ఈ త్రిలింగదేశమున, తుఘ్లకుచక్రవర్తుల పాలన మెప్పుడంతమయ్యెను? ఢిల్లీ సుల్తానుసైన్యము లెప్పుడు జయింపబడి, వెడలగొట్టబడెనను విషయమున చరిత్రకారుల మతములు వైవిధ్యముగనున్నవి. మహమ్మదీయ చరిత్రకారుడగు ఫెరిస్తా సుల్తాను కీపరాజయము క్రీ. శ. 1344 వ సంవత్సరములో కలిగెనని వ్రాసియున్నాడు. డాక్టరు నేలటూరి వెంకటరమణయ్యగారు ఈ వ్రాతలను విమర్శించి, ఫెరిస్తా చెప్పిన తేదీ చాల ఆలస్యముగ ఉన్నదనియును, ఢిల్లీసుల్తాను సేనలు కాపయనాయకునిచే త్రిలింగదేశమునుండి క్రీ. శ. 1336 సంవత్సరములో తరిమివేయబడెనని సూచిపరచియున్నారు.[27] కాని కాపయనాయకుడు త్రిలింగదేశమునుండి యవనులను వెడలగొట్టినది క్రీ. శ. 1330 వ సంవత్సరమునకు పూర్వమేయని చెప్పుటకు శాసనాధారములు కలవు. ప్రోలయ వేముడు, యవనులను కాపయనాయకత్వముక్రింద త్రిలింగదేశమునుండి వెడలగొట్టినతరువాత, తన

27. Indian Culture. Vol. V, pages 135 to 146.

నాయంకరమునకు పోయి స్వతంత్రు డయ్యెను. చుట్టుపక్కల దుర్గముల నాక్రమించి, ధర్మరాజ్యమును స్థాపించి, బ్రాహ్మణులకు అగ్రహారముల దానము చేసెను. శా.శ. 1252 లోని వర్ధ్వేరుశాసనమును, శా. శ. 1254 లోని న్యూరికంటిశాసనమును, శా.శ. 1257 లోని చీమకుర్తిశాసనమును కాపయనాయకుని స్వాతంత్ర్యావాగమను పోషించు చున్నవి. ఆంధ్రదేశము ఢిల్లీసుల్తాను వశమునుండినయెడల ప్రోలయవేముడు పూర్వ సముద్రాధీశ్వరుడననియును, వేదరాజ్యస్థాపనాచార్యుడననియును, ఏకసింహాసనాలం కారుడననియును, చెప్పికొనుట తటస్థించియుండదు. చీమకుర్తిశాసనములోని "మన్నుభ జాదండపరిపాలనమైన సామ్రాజ్యమంతయు శ్రీశైలభూమిని" అనిసగర్వముగా చెప్పికొనుట సంపూర్ణస్వాతంత్ర్యమును వ్యక్తీకరించును. డాక్టరు నేలటూరి వేంకటరమణయ్యగారుగూడ యిట్టిఅభిప్రాయమునే తమ క్రొత్తపుస్తకము- The Early Muslims Expansion in South India అనుదానిలో కొంచెము సూచించినారు.[28] కాని వారు త్రిలింగ లో కొన్నిభాగములలో మహమ్మదీయుల పాలనము అంతమయియుండునని ఊహించి నారు. కాని ఆంధ్రదేశములో క్రీ. శ. 1330 వ సంవత్సరమునాటికే యే భాగమును మహమ్మదీయులకు లోబడిలేదు. ఓరుగంటిప్రాంతమును కాపయనాయకుడు పరిపాలించు చుండెను. దక్షిణాంధ్రదేశము ప్రోలయవేముని స్వాధీనమం దుండెను. ఈ ప్రత్యేక పరిపాలనము ఆంధ్రదేశము మహమ్మదీయుల పరిపాలనములోనుండుటను సూచింపదు.

## III

### కాపయనాయకుని పరిపాలనము.

### A. D. 1330—1368.

ప్రోలయనాయని యనంతరము[29] కాపయనాయకుండు రాజ్యమును వహించి అచిరకాలము లోనే త్రిలింగభూమిని స్వాధీనము చేసెను. ఇతడు ఓరుగంటినగరమున

28. "The date on which Prolaya unfurled the standard of revolt is not precisely known. Ferishta places it in 1344 A.D ... ..... The rebellion broke out some seven years earlier in 1336 -1337 .... ..... Contemporary evidence clearly indicates that in certain parts of Tilang, Muslim authority came to an end in 1330 A. D." The Early Muslim Expansion in South India—page 1

"Maqbul helds way over eastern Tilang until about 1336, When he was expelled by Kapaya Nayak. — Ibid- page 159.

29. భారతి - వృష- ఫాల్గుణము—పుట 31౨.

రాజ్యాభిషిక్తుడయ్యెననుటకు సందేహింప పనిలేదు. గణపేశ్వర శాసనములో[30] ఈతడు సమస్తరాజాశ్రయుడనియును, సమస్తజనపరివృతాలంకృతుండనియును, పిల్లలమఱ్ఱిశాసనములో[31] "ఆంధ్రదేశాధీశ్వరుడనియును" వర్ణింపబడినను, అనుమనగంటిపురవరాధీశ్వరుడని నాయంకరత్వమును సూచించు పదముకూడ వాడబడినది. కాని పోలవరశాసనములో[32]

తస్యానంతర మంతరంగవిమలో భావప్రభావోదయః
శ్లాఘ్యప్రస్ఫుట ధర్మకర్మ చతురః శ్రీకాపపృథ్వీపతిః ।
కాశ్యాం విశ్వపతేః ప్రసాదమహిమా ప్రాప్తాఖిలప్రాభవః
క్షోణీం తూర్ణదతు దక్షిణభుజస్తంభో జరీజృంభతే॥
ప్రతాపరుద్రప్రతిమప్రభావః
శ్రీకాపభూపః కరుణాకలాపః
అశాదశేషాం భువమద్భుతశ్రీః
ఏకోపన్నేకశిలానగర్యాం॥

ఏకశిలానగరినుంచి తానొక్కడును కాపపృథ్వీపతి భూమిని పరిపాలించుచున్నటుల స్పష్టముగా తెలుపబడినది. కాపయనాయకుడు "Wali of Telingana" అని మహమ్మదీయచరిత్రకారులు వక్కాణించియున్నారు.[33] వీనిబట్టి ప్రతాపరుద్రుని అనంతరము కాపయనాయకుడే త్రిలింగభూపాలుడని తెల్లమగుచున్నది. అనితల్లికలువచేరు శాసనములో[34] కాపావనీశ్వరుడనియును, ముమ్మడినాయకుని ఆర్యవటశాసనములో[35] "ప్రఖ్యాతాంధ్రసురత్రాణుడని" యును అభివర్ణింపబడినాడు. ప్రతాపరుద్రునికి వీరభద్రుడను కుమారుడుండెననుటకుగాని, అతడు ఏకొలదికాలమైనను రాజ్యముచేసెనని చెప్పుటకు కాని, సరియైన శాసనాధారములు ఇంతవరకును కానరావు. ప్రతాపచరిత్రములోని వీరభద్రప్రశంస కల్పితగాథయే.

ప్రతాపరుద్రుడు పరిపాలించిన దేశమంతయు కాపయనాయకుని పాలనములో లేదు. యవనవిక్రమణము కాగానే పోలయవేముడు అద్దంకిరాజధానిగా రాజ్యము

30. S. I. I. IV, 950.
31. తెలంగాణాశాసనములు, పుట 163.
32. J. B. O. R. S. XX — 272.
33. Burhan-i-masir, I.A. XXVII, Page 145.
34. ఆం॥ సా॥ ప॥ ప॥ సం. 2, పుట 93—112.
35. ఆంధ్రభారతి, సం. 3. సం. 4.

ను స్థాపించి విజృంభించి అనేకదుర్గములు వంచించి, బంధుసామ్రాజ్యముగ జేసి, అనుజ తనుజ బంధువుల సహాయముతో రాజ్యము చేయుచుండెను. అతని రాజ్యము ప్రథమమున గుండ్లకమ్మ ఉత్తరమున వ్యాపించియుండెను. కాపయ స్వాధీనములో తెలింగాణ మంతయు నుండెను. ప్రస్తుతపు గోదావరి కృష్ణాజిల్లాప్రదేశములున, హైదరాబాదు రాజ్యమందలి మెదకుసీమ, ఇందూరు, కైలాసకోట, నల్లగొండ, పానుగల్లు, దేవరకొండ, భువనగిరి ప్రాంతములును కాపయ రాజ్యములోనివే. కాపయ త్రిలింగరాజ్యమునకు దక్షిణమున కృష్ణానదియును, ఆగ్నేయమున గుండ్లకమ్మయు సరిహద్దులు. దౌలతాబాదు రాజ్యమునకును, కాపయ పాలితమైన త్రిలింగ దేశమునకును మధ్య గోదావరి నది కొంతవరకును, మంజీరనది కొంతవరకును సరిహద్దులు. చిరకాలమునుండి సేవుణ, కాకతీయ రాజ్యములకుకూడ సరిహద్దు లివియే.

## కాపయనాయకుడు — బహ్మనీసుల్తానులు

అలావుద్దీన్ హసన్ షాగాంగు బహ్మని అనువాడు A.D. 1347 లో దౌలతాబాదు రాజ్యసింహాసన మెక్కి, కల్లోలముల నణచివేసి పరిపాలింపసాగెను. ఈతడు బహుసమర్థుడు. తనరాజ్యమును నలుదిక్కుల వ్యాపింపజేయుటకు అనేకదండయాత్రలు సాగించెను. కాని త్రిలింగరాజ్యమువంక నీతడు అడుగుపెట్టుటకు సంశయించెను. ఈతడు రాజ్యమునకు వచ్చునప్పటికే కాపయనాయకుడు త్రిలింగ దేశమున స్థిరపడి, శత్రుభయంకరుడై యుండెను. ఢిల్లీసుల్తాను మహమ్మదు బిన్ తుఘ్లకు చక్రవర్తి కాపయనాయకునిచేబడిన పాట్లును, కడగండ్లను అలావుద్దీన్‌కు పూర్తిగా తెలిసియుండుటచే ఆతడీతనియెడ ఆరంభమున జాగరూకుడై సుహృద్భావమును వహించియేయుండెను.

అలావుద్దీన్ బహ్మనీరాజ్యమునకు వచ్చిన ఒకటి రెండు సంవత్సరములలోనే సికందర్‌ఖాను అను సేనాని నంపి విదర్భదేశమును (Bidar) వశపరచుకొనెను. సికందర్‌ఖాను విదర్భదండయాత్ర ముగిసినవెనుక కాపయనాయకునకు యేనుగులకొన్నింటిని సుల్తానుకు కానుకగా పంపవలసినదని కోరి, ఉత్తరమువ్రాసినటులును, అందుపై కాపానాయకుడు భయపడి, సుల్తానుకు తనవిధేయతను, అణకువను తెలుపుకొనుచు, సంధిపత్రమును వ్రాసి పంపుకొనుచు సికందర్‌ఖాను దర్శనమును కోరెననియును, సికందర్ విశేషసైన్యముతో తెలింగాణ ప్రాంతమునకురాగా కాపయనాయకుడు వారిని కలసుకొని, గజములను, ధనకనకవస్తువాహనములను ఉలుపాలనిచ్చి పంపెననియును

బుర్హానిమాసిర్ అను చరిత్రయందు సయ్యద్ అలీ బిన్ అజీజ్ ఉల్లాటబాటబా యను చరిత్రకారుడు వ్రాసియున్నాడు.36

పై వ్రాతలు విశ్వాసార్హములుకావు. అల్లాయుద్దీను సిదండయాత్రనాటికి అనగా (క్రీ. శ. 1340-50 నాటికి) కాపయనాయకుని భయపెట్టదగిన బలసంపత్తిలో లేడు. కాపయస్నేహము నేకోరి, తన రాజ్యమునకు తూర్పుదెసనుండి ఒత్తిడిలేకుండ కాపాడుకొనుటకు కాపయతో సంధిచేసికొనెను. కాని క్రీ. శ. 1356 నాటికి సందర్భములు మారిపోయెను. పిల్లలమఱ్ఱిశాసనమునుబట్టియును, ఫెరిస్తావ్రాతలనుబట్టియు అల్లాయుద్దీను క్రీ. శ. 1357 సంవత్సరమునకు కొలదిగా మాపూర్వమే తెలింగానముపై దాడివెడలి,

---

36. Burhan-i-ma'asir — I.A. 28--145.

"Sikandar khan after his return sent a letter to Kana bayand, who was the Wali of Telingana, asking him to send a present of some elephants for the use of his army. When Sikandar khan's letter reached Kanabayand and he understood the contents, he wrote a reply tendering his *submission*, and sending a written treaty to that effect; he also expressed a great wish to see him. Accordingly Sikandar khan with a large force proceeded towards Telingana and a meeting between the two took place. Kanabayand presented many offerings and was made hopeful of much favour of the king. He sent two elephants and other suitable presents to the king through Sikandar khan. The latter on arrival ... ... sent the elephants to the Sultan and informed him of the good will of Kanabayand. The Sultan wrote a commendatory letter to Sikandar khan and elevated him to the umbrella: he also conferred royal favour on Kanabayand"

ఈగ్రంథపు అసలు వ్రాతప్రతియందు 'కనాబాయందు', 'కనానాయుందు'. 'కబాబాయందు' అని వైవిధ్యముతో ఈపేరు కనబడును ఈగ్రంథముయొక్క బ్రిటిష్ మ్యూజియములోని వ్రాతప్రతియందు కబానందు అనియును, కనానీదనియును కలదు. జియాఉద్దీన్ బార్నీ, కన్యానాయకుడనియును, ఫెరిస్తా కృష్ణనాయకుడనియును ఈపేరినే వ్రాసియున్నారు. పైరూపముల నన్నిటిని పరిశీలింపగా, కాపానాయకుడు కాపానీడు, కాపానీండు అనునామమే మహమ్మదీయచరిత్రకారుల నోళ్ళ అక్షరపు తారుమారులచే వైవిధ్యము నొందినట్లు తెల్లము. వారందరు కాపయనాయకుని ఉద్దేశించియే వైవిధములగు పేళ్ళను వాడిరి. డాక్టరు నేలటూరి వెంకటరమణయ్యగారు, తమ Vizayanagara Origin of the City and the Empire Bulletins of the department of Indian History and Archaelogy No. 4) appendix C లో 1,1_176 పుటలలో A note on Kanya Nayak అను వ్యాసమందు జాగ్రతగా చర్చించియున్నారు.

దేశమును కొల్లగొట్టి, పంటలను నాశనముచేసి, దేవాలయమును భగ్నముచేసినటుల తెలియుచున్నది. ఈదండయాత్ర ఇందూరు (ప్రస్తుతపు నైజామాబాదు) కైలాసకోట (దీనినే మహమ్మదీయచరిత్రకారులు కౌలాస్ అనివాసిరి) భువనగిరివరకును వ్యాపించెను. ఫెరిస్తావ్రాతలనుబట్టి కైలాసకోట, ఇందూరు, ఈదండయాత్రలో కాపయనాయకునకును అల్లాయుద్దీన్ హసన్ షాకును జరిగిన సంధిప్రకారము తెలింగాణమునుండి వీడి, బహ్మనీరాజ్యములో కలిసిపోయినది.[37] కాపయనాయకునకు తిరిగి ఇందూరు, కైలాసకోట అల్లాయుద్దీను జీవితకాలములో లభించలేదు. ఈభాగములు పద్మనాయకుల నాయంకరములై యుండెను.[38]

డాక్టరు నేలటూరి వెంకటరమణయ్యగారు కైలాసప్రాంతములు తెలింగాణము నుండి హరింపబడినది — 1317 వ సంవత్సర మైయుండునని తలచుచున్నారు. దీనికి ఫెరిస్తా నాధారముచూపినారు.[39] ఇది సరికాదు. ఫెరిస్తా, అల్లాయుద్దీను కైలాసప్రాంతముల జయించి కలుపుకొనెనని మాత్రమే వ్రాసినాడు; కాని 1351 సం॥రములో నని సంవత్సరము తెలుపలేదు. పైనవ్రాసిన పిల్లలమఱ్ఱిశాసనాధారమున కైలాసకోటపతనము 1357 సంవత్సరమునకు అచిరపూర్వమున జరిగినట్లు ఊహింపవలసియున్నది. కాపయనాయకుడును, పద్మనాయకవీరులును ఈకైలాసప్రాంతములు విశ్వప్రయత్నముల చేసి తిరిగి ఆక్రమించుకొనియుండిరి. అల్లాయుద్దీను 1357 సం॥మున కాలముచేసెను. ఈతనియనంతర మీతని పెద్దకొడుకు మహమ్మదుషా బహ్మనీ గద్దె నెక్కెను. ఈతడు తండ్రియంత బలవంతుడు కాడు; సింహాసన మెక్కినక్రొత్తలో కొందరు సేనానాయకు లీతనికి వ్యతిరేకులైయుండిరి. కాపయనాయకుని నెదుర్కొని యుద్ధముచేయుటకు తగిన సేన ఈతనికి రాజ్యప్రారంభమున లేకుండెను. అందుచే కాపయనాయకుడు పద్మనాయకుల ప్రోత్సాహమున విజయనగరరాజగు మొదటి బుక్కదేవరాయల సహాయమున ఇందూరు, కైలాసకోట ప్రాంతముల తిరిగి క్రీ. శ. 1360 లేక 1361 లో స్వాధీనము

37. Ferishta, Vol. II—293. "He wrested kaulas also with its dependencies from the Raya of war angole with whom he formed a treaty of alliance.

38. L. R. 19, పేజి 150. సింగమనాయనిగూర్చి వ్రాయుచు "ఈయన పశ్చిమరాజ్యమందు మెతుకూ, కైలాసకోటా ప్రాంతమందు కొంతసీమ జాగీరు అనుభవిస్తూవుండెను" —
Ferishta Vol. II, p. 301—304.

39. Velugotivari Vamsavali – Intro. Page 12.

చేసుకొనెను.

## కాపయనాయకుడు—పద్మనాయకులు.

పైనవ్రాసినదానినిబట్టి పద్మనాయకులు కాపనాయకునకు హిందూరాజ్య పునస్సంస్థాపనములో సహాయులైయుండి తెలింగానారాజ్యములో అతని సేవకులైయుండిరి. కాని పరాక్రమశీలురగువారా స్థితిలోనుండుటకు ఇష్టపడలేదు. ప్రోలయవేముడు స్వతంత్రరెడ్డిరాజ్యమును స్థాపించి విజృంభించుచుండుటకూడ వారి తిరుగుబాటునకు ప్రోద్బలకారణమయ్యెను. అనపోతమాదానాయులతండ్రి సింగమనాయుడు కాపయనాయకుని ఓడించినటుల వెలుగోటివారివంశావళిలో ఒకపద్యములో కలదు.[40] ఈసంఘర్షణమునకు సన్నిహితకారణమేమో తెలియదు. కాని లింగమనాయని కాలములో చెప్పబడిన పైపద్యము సంగతము గాలేదు. నిజమని నమ్ముటకు యితర ఆధారములు లేదు. సింగమనాయని కుమాళ్లు అనపోతానేడు, మాదానేడు. వీరు తమతండ్రి శత్రువుల జల్లిపల్లిలో ఓడించి పద్మనాయకవీరుల నందరిని చేరదీసి కాపయనాయకుని అణగద్రొక్కుటకు వేచియుండిరి. క్రీ॥ శ॥ 1368-లోనో 1369-లోనో భీమవరమువద్ద వీరు కాపయనాయకుని ఓడించి ఓరుగల్లు వశపరచుకొనిరి. ఈ అంశము అయ్యనవ్రోలిలోని అనపోతానాయని క్రీ॥శ॥ 1369లోని శాసనములోని "సింగమనాయని అనపోతానాయనింగారు ఓరుగల్లు, శ్రీభువనగిరి, రాజుకొండ, సింగపురము మొదలైన తెనుంగుదేశము......... ధర్మరాజ్యముచేయుచు దిగ్విజయ యాత్రాప్రసంగానను ఓరుగంటి దక్షిణాన అయ్యనవోలువచ్చినట్లు వ్రాయబడినవాక్యములవలన నిస్సందేహమగుచున్నది.[41] ఈశాసనములో అనపోతానాయనికి ఆంధ్రదేశాధీశ్వర బిరుదములేదు. ఈ దిగ్విజయ అనంతరమే ఆబిరుదమీతనికి వాడబడినది. పైశాసనములోని శ్రీ భువనగిరి, రాజుకొండ, సింగపురము అనపోతానాయని పైతృకదాయమే. కాపయరాజ్యధానియైన ఓరుగల్లుమాత్రము అనతి పూర్వము జయింపబడినది. వెలుగోటివారి వంశావళిలోని ఒకవచనములో "భీమవరమువద్ద కాపానేన్నిచంపి ఖడ్గనారాయణ, గాయగోవాళ, హిందూరాయ సురత్రాణ బిరుదులు,[42] అనపోతామాదానీలు తెచ్చినటుల స్పష్టముగా తెలుపబడినది. కాపయనాయకునితో తెలంగాణములో రెడ్డిరాజ్య మంతమయ్యెను. పద్మనాయక స్వతంత్రరాజ్యచరిత్రము ప్రారంభమయ్యెను. ప్రోలయవేమునివంశ్యులకును,పద్మనాయకరాజులకును కృష్ణాగోదావరీ పరిసరప్రాంతముల ఆధిపత్యమునకై అర్ధ శతాబ్దికాలము ఘోర. భీభత్సయుద్ధములు ప్రారంభమయ్యెను.

40 వెలుగోటివారి వంశావళి పుట 43 పద్యము 120 లింగమనేనిగూర్చిన పద్యములలో "చెలగి మీ ముత్తాత సింగక్షితీసుండు కాపభూపతిగాల్చె కదనమున—

41. సురభివారి వంశచరిత్రము పుట 39.

42. వెలుగోటివారి వంశావళి పుట 36. ఈభీమవరము పశ్చిమగోదావరిజిల్లాలోనిదికాదు. ఇది తెలంగాణములోని గ్రామమే.

# పంటరెడ్లు—కొండవీటిరాజ్యము.

## ప్రోలయ వేమారెడ్డి

## I
## 1326—1350.

ముసునూరి ప్రోలయనాయకునకు ఆంధ్రదేశమునుండి మహమ్మదీయుల తరిమికొట్టి, హిందూధర్మ పునస్థాపనము చేయుటలో సహాయపడిన డెబ్బదిఇద్దరు నాయకులలో వేమారెడ్డి ముఖ్యుడు. యవనసంహారణము ముగిసిన వెనుక వేమారెడ్డి స్వనగరమునకు పోయి, దక్షిణాంధ్రమున పూంగిదేశమున రెడ్డిరాజ్యస్థాపనమునకై బద్ధకంకణుడయ్యెను. ఈమహాకార్యములో వేమారెడ్డికి చేదోడుగా అతనిసోదరులు మల్లునను, మేనమామ నాగసేనానియును ఉండి పౌరుష ఉత్సాహ బలపరాక్రమములను చూపియుండిరి. వీరసంఖ్యాకసైన్యముల గూర్చుకొని స్థలదుర్గ గిరిదుర్గముల సాధించి,బహుభూములాక్రమించిరి.

వేమారెడ్డి తండ్రి ప్రోలయ; తాత వేమయ; ఈవేమయయే వీరివంశకర్త.[1] ఈతడే కాకతీయ రుద్రమదేవి కొలువున సైన్యాధిపతిగనుండి కుటుంబమునకు పేరు ప్రతిష్ఠ దెచ్చెను. ప్రోలయకూడ ప్రతాపరుద్రుని సేనానాయకులలో నొకడని చెప్పుటకు సందియములేదు. ముట్లూరి శాసనమున "పుత్రస్త్వ స్వభుజాద్వ నిర్జితరిపుః ప్రోలక్షమాధీశ్వరః" అని ఈతడు వర్ణింపబడినను, స్వతంత్రుడగు రాజుకాడు. క్షమాధీశ్వరత్వ మిక్కడ నాయంకర పాలకత్వమును మాత్రమే సూచించును. ప్రోలయయు వేమయయు ప్రతాపరుద్రుని కాంచీదండయాత్రలో పల్గొనియుండిరనుటకు ప్రోలయవేముని పాండ్యరాయగజసింహ, అప్పయగోపయ దిశాపట్ట సంగ్రామ,[2] అలగియవరద శిరఃఖండన,[3] పల్లవాదిత్య, బిరుదములు తార్కాణములు.

ప్రోలయవేముని మాతామహుడు దొడ్డయ సైన్యనాయకుడును, మేనమామ 'నాగసేనాపతి' యును,[4] క్రీ.శ. 1323లో ప్రతాపరుద్రునికిని, ఢిల్లీసుల్తాను మహమ్మదు బిన్ తుఘ్లాకు చక్రవర్తికిని జరిగిన యుద్ధములలో పాల్గొనియుండిరి. ఓరుగంటి కోటముట్టడిని విడిపించి ప్రతాపరుద్రునికి జయముచేకూర్చుటకై రెడ్డిరాజులు ఎన్నిపాట్లు బడినను, చక్రవర్తి దైవోపహతుడగుటచే అన్నిప్రయత్నములును విఫలములాయెను. విలసతామ్రశాసనములో చెప్పినట్లు "భూలోకమునందలి ప్రజల భాగ్యము తరిగి పోవుటచేత ఆవీరరుద్రమహారాజు రాజనీతియందు దప్రతిమానుడైనను, బలాధికుడైనను, సహాయసంపత్తిగలవాడైనను కడకు ఆతురుష్కాధిపతికి వశుడయ్యెను.[5] కాని ప్రతాప రుద్రుని సేనానాయకుల లోపమేదియునులేదు.

1. ముట్లూరు శాసనము-రెడ్డిరాణి చూ॥ అనుబంధము 1 పుట 10.
2. EP. Ind. Vol. 21, pp 271-272. 3. S.I.I. Vol. VI, p. 213.
5. ముట్లూరిశాసనము - రెడ్డిరాణి Vol. 3, P. 365. చూడుడు అనుబంధము I. పుట 9.
4. భారతి-వృష. ఫాల్గునము. పుట 311



కోదండదేవాలయములోని ముమ్మడినాయకుడు — లక్ష్మీదాసి.

## ప్రోలయ వేముడు ప్రతాపరుద్రునికి ద్రోహియై తిరుగుబాటొనర్చెనా?

కొందరు చరిత్రకారులు ప్రతాపచరిత్రమందలి గాథల నాధారముచేసుకొని ప్రతాపరుద్రునిచే పద్మనాయకులు అధికముగా గౌరవింపబడిరనియును, రెడ్లు తీసివేతగా చూడబడిరనియును, "అజ్ఞాతగోత్రులనియును"[6] (అనగా రాజుచే గౌరవముచేయబడనివారని) వారు యీగౌరవమునకు ప్రతీకారముగా మహమ్మదీయులవలన లంచమును గ్రహించిరనియును, బొబ్బారెడ్డి అధిపత్యమున యుద్ధభూమిని విడచిపోయిరనియును వ్రాసియున్నారు. మరియు నీ క్లిష్టపరిస్థితులలోనే ప్రోలయ వేముడు ద్రోహియై, ప్రభువుపై తిరుగుబాటొనర్చి, ధరణికోటలో స్వతంత్రరాజ్యమును స్థాపించి కాకతీయ రాజ్యము భ్రష్టమగుటకు కారణమయ్యెననియును తలచుచున్నారు.

ఈయూహ యుక్తమైనదికాదు. ప్రతాపచరిత్రలోని బొబ్బారెడ్డికథ నిజమని నమ్ముటకు తగిన సరియేయితర ఆధారమును ఇంతవరకును చూపట్టలేదు. ప్రతాపరుద్రునికాలములో రెడ్డినాయకులు చులకనచేయబడిరనిగాని, అవమానపరుపబడిరనిగాని నమ్ముటకు తగిన యాధారము లేదు. ఓరుగంటిదుర్గసంరక్షణమున నియోగింపబడినవారిలో అధికసంఖ్యాకులు పద్మనాయకులైనను, ఇతరజాతులవారును రెడ్లునుకూడ కలరు. వీరుకాక అనేకులగు రెడ్డినాయకులు రాజ్యమందంతటను చక్రవర్తికి భక్తులైయుండిరి. ప్రతాపరుద్రుని యాసంగరము కాకతీయరాజ్యసంరక్షణకు బద్ధకంకణులైన ప్రోలయ, కాపనాయకాదులు రెడ్లే. కాపనాయకుడు ప్రోలవరశాసనమున "ప్రతాపరుద్ర

6 కాకతీయసంచిక-పుట-75.

"క్రీ॥ శ॥ 1320లో నాంధ్రసామ్రాజ్యనాశమున కంకురార్పణ మొనర్పబడెను. కంపిలపై కేగిన సైన్యములింకను మరలియుండలేదు. ఇంతలో నుల్కలవలె నుత్తరమునుండి మహమ్మదీయులు దండెత్తి వచ్చుచుండిరనువార్త వినవచ్చెను. రాజధానీనగరమునందుండిన బలములను చక్రవర్తి యుద్ధమునకై సిద్ధముచేయుచుండుసమయమున దక్షిణదేశమునుండి ప్రోలయవేమారెడ్డి మున్నగువారలు ధరణికోటకేగి స్వాతంత్ర్యమును ప్రకటించినదుర్వార్త యేతెంచెను. ఇయ్యది ప్రతాపరుద్రుడు పద్మనాయకులయెడచూపిన పక్షపాతమునకును, దమకు గండికోటలో నొనర్చిన పరాభవమునకును రెడ్లొనర్చిన ప్రతీకారము. అతిశీఘ్రముగ చక్రవర్తి కొన్ని సైన్యములను ధరణికోటకు బంపెను. కాని ప్రోలయవేముడు బలములను సులభముగ నిర్జించి వినుకొండదుర్గమును చేరి పరిసరప్రాంతమును నాక్రమించి యధికారము చేయసాగెను.

పుట 77. సామ్రాజ్యము జీవన్మృత్యుసమస్యకు లోనైయుండిన సమయమున ప్రోలయవేమాదిరెడ్డి రాజులొనర్చిన రాజ్యద్రోహము మొదటిప్రహారణము. ఇంతటితో దృప్తినొందక రెడ్లునంగ్రామము ఘోరముగా జరుగుచుండిన సమయమున మత్సరపిశాచపీడితులై యొకదుష్కార్యము నొనర్చినటుల ప్రాచీన వంశచరిత్రములనుండి తెలియుచున్నది. యుద్ధరంగమున శౌర్యమును స్వామిభక్తిని జూపుటకు మారుగ నింకను జక్రవర్తిబలములలోనుండిన రెడ్లు తమ మేధాబలమును వ్యర్థపరచి స్వామిశాసనమునొనర్చిరి. పద్మనాయకవీరు లద్వితీయముగ పోరుచు శత్రుసంహారమొనర్చుచుండ, ప్రోలయవేమాదుల స్వాతంత్ర్యప్రకటనము నాలకించి, రెడ్డికులజులు బొబ్బారెడ్డి యాధిపత్యమున తురుష్కులతో కుట్రచేయ మొదలిడిరి. మహమ్మదీయులనుండి కొంతధనమును గైకొని వారలాకనాటి యుద్ధమునం దాంధ్రుల పక్షమున యుద్ధముచేయకుండుటకై యొడంబడిక చేసుకొనిరి"

ప్రతిమ ప్రభావు”డని వర్ణింపబడినాడు. ప్రతాపరుద్రునకు ద్రోహమొనర్చినవాడు తనను గూర్చి ప్రతాపరుద్ర ప్రతిమ ప్రభావుడని వ్రాయించుకొనునా? ప్రోలయవేముడు ప్రతాపరుద్రుని జీవితకాలములో 1320-వ సంవత్సరముననే ప్రతాపరుద్రునిపై తిరుగుబాటొనర్చి, ప్రతాపరుద్రుని సైన్యములను ధరణికోటలో ఓడించినటుల ఊహించుట కెట్టి ప్రమాణములును మాకు కాన్పించలేదు. ఇది నిజమే యైనయెడల ఎఱ్ఱాప్రగడగాని, వేముడొనర్చిన అగ్రహార దానకృతుల రచించిన మహాకవులుగాని, ప్రోలయవేముని ప్రతాపరుద్రుని జేతగానే వర్ణించియుందురు.

ఈ ప్రోలయవేముడు 1345 నాటి ముట్లూరిశాసనమున ‘మ్లేచ్ఛాబ్ధి కుంభోద్భవుడని’ యును, హరివంశమున ఎఱ్ఱాప్రగడచే “యవనన్పవబలాబ్ధి వ్యాసిఖడ్గార్వవేగుడనియును, వసుంధర నుద్ధరించినవాడనియును, సమదమహోద్దారుసైన్యుడనియును, ప్రతిభట వేదండఖండన ప్రచండుడనియును, అనియమునంగలికరగండడనియును, దారితారాతి దుర్గుడనియును వర్ణింపబడెను. ప్రోలయవేమునితమ్ముడు మల్లారెడ్డి ‘అల్లావదీనాది తురుష్క’ మల్లులను జయించినటుల ఒక శాసనములో కలదు. కాని ముట్లూరిశాసనములోని మ్లేచ్ఛరాజు 1347 లో రాజ్యమునకువచ్చిన అల్లాఉద్దీన్ బహ్మనీ కాజాలదు. ప్రోలయవేముడు జయించిన మ్లేచ్ఛసైన్యములు ఢిల్లీసుల్తాను మహమ్మదు బిన్ తుఘ్లకు చక్రవర్తికి సంబంధించినవే అగుననుటకు సంశయింప పనిలేదు. ప్రతాపరుద్రుడు బందీగా పట్టుకొనబడి చనిపోయినపిదుపాటి ప్రోలయనాయకుడు లేవనెత్తిన ఉద్యమములో ప్రోలయవేముడుకూడ నన్నటుల అనితల్లి కలువచేరుశాసనమునకలదు.

## ప్రోలయవేముడెపుడు స్వతంత్ర రెడ్డిరాజ్యమును స్థాపించెను?

ఈ రెడ్డిరాజ్యము, ఢిల్లీ పాదుషా మహమ్మద్ బిన్ తుఘ్లకు సైన్యములను వేముడు ప్రోలయనాయకునితో కలసి ఆంధ్రదేశమునుండి తరిమి వేసినతర్వాత స్థాపించబడినది. 1323-వ సం॥ం తర్వాత దీనికి రెండు మూడు సం॥ముల కాలముకన్న ఎక్కువపట్టియున్నటుల తోచదు. ప్రోలయవేముడు తననాయకునికి ముందు కేగి తనదింపి ప్రోలయ నంపాదించిన ద్రవ్యముతో సేనలగూర్చుకొనెను.[7] అదెని వీరల నాయకుం డెంమేదియో నిర్ధారణగా తెలియదు. కొన్ని కొన్ని కారణములచే వీరు గండికోట, ములికినాడు, పల్లెనాడు, పూంగినాడు, సకలి, యేఱువ, పొత్తపినాడు మొదలగు విషయముల నేలు మహామండలేశ్వర మండలీక బ్రహ్మరక్షసగండ పెండార అంబదేవ మహారాజు సామంతులని, ఊహించవలసియున్నది. ఈ స్వతంత్ర రాజ్యమును స్థాపించుటలో నీతిని ప్రోత్సహించి నడపించినది గంగదేవుడు. ఇతడే

---

7. మంచాళ్లశాసనము “యదృచ్ఛయాన్వర్ణకర ప్రసిద్ధిం లబ్ధ్వాన్న మాంబాపతిరాబభూవ” అను ప్రోలయనుగూర్చిన వాక్యము. ఈశాసనము ప్రోలయవేముని కాలమున రచింపబడినది. ఆనాటికి జనులలో ప్రబలియున్న ప్రవాదము విచట గ్రహించినాడు. ప్రోలయభాగ్యమునుబట్టి ప్రజలాతడు పరుసవేదిచే బంగారమును చేయగలడని నమ్మియుండిరి. ప్రోలయ విశేషమువర్ణము సార్జించెనని చెప్పుటకే సంకేతము లేదు.

ఘోడెరాయ గంగదేవుడని వ్యవహరింపబడుచుండెనేమో.... ఇతడు శ్రీశైల తూర్పుద్వార పాలకుడైన త్రిపురాంతకదేవుని భక్తుడు; మహాపాశుపతయోగి; అంబదేవునిమంత్రి; గురువు; రాజనీతివేత్త; మహావీరుడు. ఈఘోడెరాయగంగదేవుడే లేకున్న ప్రోలయ వేముడు రెడ్డిరాజ్యమును స్థాపించనేరడు. ఈ రెడ్డిరాజ్యస్థాపనమునకీ పురుషుడు కారణభూతుడని అనేకప్రమాణములు కనబడుచుండినను, చరిత్రకారులు గుర్తింప కష్టమాయెను. హరివంశము ఉత్తరభాగమురెండవయాశ్వాసమున మొదటిపద్యమిట్లున్నది:

శ్రీ పార్వతీశభక్తి వ్యాపిగుణ ఘోడెరాయ గంగ గురుకృపా।
స్థాపిత సామ్రాజ్యసము ద్దీపిత వేమక్షితీంద్ర దీప్తిదినేంద్రా॥ 8

వావిళ్ళవారు అచ్చువేసిన హరివంశపు ప్రతిలో, పై రెండవ యాశ్వాసము మొదట శ్రీమాద్యదాంధ్రదేశ....... అను పద్యమున్నది. ఆప్రతిలో నాల్గవ యాశ్వాసము మొదటకూడ ఈపద్యమే స్వల్పమార్పులతో ఇవ్వబడ్డది. కాని దాని క్రింద అధోజ్ఞాపిక పెట్టబడి, పుటయడుగున శ్రీ పర్వతేశయను పద్యమివ్వబడినది. రెండవ పాదమున యతిభంగముగుటచే వారికిష్టమువచ్చిన మరొక పద్యమునిచ్చి ఎఱ్ఱాప్రెగడచే వ్రాసినపద్యమును చరిత్రభాగము కలుగునను భయములేక తీసివేసిరి. రెడ్లశాసనములలోకూడ ఈఘోడెరాయగంగదేవుని సాహాయము వర్ణింపబడినది. క్రీ॥ శ॥ 1345 నాటి అతుకూరుశాసనములో[9] "శ్రీపల్లవ త్రినేత్రాంకో, ధన్యో వేమమహీపతిః। శ్రీఘోడెరాయ గంగాఖ్య గురుపదాబ్జషట్పదః॥" అనియును, ద్రుజ్జవరపుశాసనములో[10] "తేషాం ప్రశస్తమహిమా పరపారిజాతః, శ్రీవేమభూమిరమణో జగనొబ్బగండః। శ్రీఘోడెరాయ గురువర్యదయావిశేషా త్పృథివీం ప్రశాస్తి సకలామకలంక వృత్తిః॥" అనియును కలదు.

ఎఱ్ఱాప్రెగడ కంఠోక్తి రెడ్డిసామ్రాజ్య స్థాపనహేతువు ఘోడెరాయగంగదేవుని కృపయనియే. ఈఘోడెరాయగంగునిగూర్చి లోకల్ రికార్డు సంపుటములలో విశేషముగా కలదు. ఇతనిశాసనములు త్రిపురాంతకములో కలవు. నెలందలూరు కైఫీయతులో ఇట్లు వ్రాయబడినది.[11] "ఘోడెరాయ గంగిదేవయ్యగారు తన్నేలిన యంబదేవమహారాజులకు పుణ్యముగానుశకవరుషంబులు 1209 (క్రీ.శ. 1287) అగు నేటి సర్వజితుసంవత్సరములో బహుళ 5 శుక్రవారమునాడు మకరసంక్రమణ పుణ్యకాలమందు అత్తిరాలనున్న పరుశరామేశ్వర దేవాలయము చుట్టు మంటపము కట్టించి నారికేళవృక్షములున్నూ వేయించి, ఆ దేవునికి మాన్యమున్నూ యిచ్చి, అస్థలమున మహేశ్వరులకు

8. Telugu Academy mss. No. 4535 of Hari Vamsam.
9. Ep. I.Vol. VIII, Page 13. (అనుబంధము 1, పుట 11).
10. రెడ్డిరాణి—Vol· III. పుటలు 137-140.
11. Local Records Vol. 45 Page 12.

అన్నసత్రము పెట్టించి, ఇంకా కొన్నిగ్రామములయందు చెరువులు కాలువలు త్రవ్వించి పొత్తపినాటిసీమకు నేలకొలిపించి పొలికాటమరెడ్డి అడుగునకు ముప్ఫైరెండు కొలకట్టించి అత్తిరాలలోపరశురామేశ్వరుని దేవాలయం గోపురంవద్ద శిలాశాసనం వేయించినారు.” ఈతడుకాయస్థుడనితోచుచున్నది. క్రీ.శ. 1254లోని ఒకశాసనములో[12] కాయస్థ గండపెండెర గంగసేనాపతిభార్య కమలాంబా కవలయి తనపేరిట కమలేశ్వరుని స్థాపించెనని చెప్పబడినది. పైశాసనములోని గంగసేనాపతి ఘోడెరాయ గంగిదేవస్థు యని మా యభిప్రాయము. హరివంశములో ఎఱ్ఱాప్రగడ వర్ణించిన గంగిదేవయయు నెలందులూరు కైఫీయతులోని ఘోడెరాయగంగిదేవయయు ఒక్కడే. ఈతడే రెడ్డిసామ్రాజ్యస్థాపకుడు.

‘ఘోడెరాయ’లను బిరుదు సేనానాయకులకు-ముఖ్యముగా అశ్వసాహిణులకు చిరకాలమునుండి వాడుకలోనున్నది. క్రీ॥ శ॥ 1189 కాలచుర్య భిల్లమునికాలమునాటి ముత్తగిశాసనములో (Ep. Ind. XV. Page 33.) ఆతని సేనాపతి పేయయసాహిణి ఇట్లు వర్ణింపబడియున్నాడు “ఆయుతకీర్తివినుత శ్రీయుక్తం పట్టసాహిణాధీశనెసలు, సేయయసాహిణి ఘోడెరాయం పేశల్ వ్యాత్తపధిక జనరాధేయం” అనియును, “స్వస్తిసమస్తప్రశస్తి సహితం శ్రీమన్మహాప్రధానం, బాహత్తర నియోగాధిపతి, పట్టసాహిణాధిపతి, సకలలక్ష్మీపతి ఘోడెరాయం పేయయ సాహిణియగుమ్-దావాళదేశములో 12-వశతాబ్దములో ఇది సాహిణిలకు బిరుదుగా వాడబడుచున్నదనుట పైదానిని బట్టి నిస్సందేహముగా చెప్పవచ్చును.

ఈఘోడియరాయ గంగిదేవునిమొక ఈరెడ్డిరాజులకు విశేషభక్తిగౌరవములు. ఈగంగదేవుడొక శైవపీఠమును స్థాపించియుండెను. గంగదేవుని తర్వాత సీపీఠమును ఘోడియరాయత్రిపురారి జియ్యంగారు అధిష్ఠించెను. ఈత్రిపురారిజీయంగారి ఆత్మభవుడు “రాయగురు పరమేశ్వర సాధుజనవిధేయ ఘోడెరాయ సకలకళాధామాది బిరుదభాస్వరుండగు” భీమేశ్వరుడు. ఈఘోడియరాయలు మొదట త్రిపురాంతకము నందుండిరి. కాని యేకారణముననో కుమారగిరిరెడ్డి రాజమహేంద్రముఖరాజ్యమును కాటయవేమారెడ్డికిచ్చినపుడు కాటయవేముడు యీత్రిపురారిజీయను రాజమహేంద్రవరము కొనివచ్చియుంచెను. ఈతడు కాటయవేముని ఆస్థానమున చాలపలుకుబడి గలిగియుండి రాజగురువుగనుండెను. ఈత్రిపురారి ప్రశస్తి, శాసనములలోకూడ కలదు. కాటయవేమారెడ్డి కొమరుకుమారుడు అనితల్లి, యీఘోడియరాయత్రిపురారిజీయంగారి యును ఘోడియరాయ పినజియ్యంగారియును ఆనతిక్రమాగను శా॥ శ॥ 1345 సంవత్సరమున, మార్కండేయేశ్వరసన్నిధిని బ్రాహ్మణులకు సర్వమాన్యము ధారవోసెను.[13] ఈఘోడియరాయపినజీయంగారే, త్రిపురారి కైలాసవాసి కాగానే ఘోడియరాయభీమేశ్వర నామధేయముతో రాజగురువై అనితల్లి, వేమ, వీరభద్రారెడ్ల రాజ్యమందు

12. E. R. 304/05 (ss. 1176).
13. S I. I. Vol. V, No. 114.

రాజ్యతంత్రము నడపించుచున్నట్లు స్పష్టము. శ్రీనాథుడు తన భీమేశ్వరపురాణములోను, కొమ్మన తన శివలీలావిలాసములోను, ఈభీమేశ్వరదేవరను విశేషస్తుతి చేసియున్నారు. శ్రీనాథుడుకూడ భీమేశ్వరదేవుని శిష్యుడైనట్లు చెప్పవచ్చును. ఈ భీమేశ్వరదేవుడు పట్టిసక్షేత్రములో స్థిరనివాస మేర్పరచుకొని తపస్సొనర్చుకొనుచుండెను.
శివలీలావిలాసములోని

"నిపుణత్వంబున బ్రస్తుతి పవలయున్ శ్రీవీరభద్రాచలా
గ్ర దివ్యాతత భర్మ్యహర్మ్యతల జాగ్రద్వీరభద్రా......
.......................... సంపూర్ణ భీమేశ్వరున్
త్రిపురాంతకేంద్రగురూత్తమాత్మభవుడుం దేవేంద్రకోలాహలుల్."

"వీరలవంశగురుడును
దారగుణోత్తరుడునగుచు తత్త్వమహత్త
శ్రీరుద్ర ఘోడేరాయపదారాధకుడు
భీమదేశికాధిపుడొప్పున్." అను పద్యము లితని గురించినవే.

పట్టిసక్షేత్రములో నీతనిసభ దేవేంద్రసభవలె రాజిల్లుచుండెను. రాజమహేంద్రవర రాజుల దర్శనార్థమై వచ్చుపండితులు పట్టిసములో భీమేశ్వరదేవుని దర్శనముచేసి పరీక్ష పొందినగాని రాజదర్శనము లేదు. ఘోడేరాయలు వేదశాస్త్రాది సమస్తవిద్యలు నేర్చినవారు. పట్టిసములో వీరు నిరతాన్నదానము చేయుచు పాశుపతమతమును వ్యాపింప చేయుచుండెడివారు. త్రిపురారియు, భీమయదేవుడును, నైష్ఠిక బ్రహ్మచారులని తోచుచున్నది. "త్రిపురారీంద్రగురూత్తమాత్మభవుడుం—" త్రిపురారిదేవుని హస్తమస్తకసంయోగమువలన దీక్షనివ్వబడినవాడై నందున కుమారుని క్రిందనే కవి వర్ణించియుండెను. వీరలాకాలమున శైవమతవ్యాప్తికి విశేషము తోడ్పడియుండిరి.

ఈరెడ్డిరాజ్యమునకు శంకుస్థాపన మెప్పుడు జరిగెనో తెలియరాదు. క్రీ॥ శ॥ 1380 నాటికే వేమభూపాలుడు గ్రామదానములను స్వతంత్రుడై చేయుచుండెను. మద్దులపల్లి గురుబ్రహ్మశర్మగారి కొండవీటిసామ్రాజ్యమందు అనవేమమహీపాలుడు 1252 (అంగీరస) సంవత్సరములో గౌతమేశ్వరుని ప్రతిష్ఠించి భూదానమొనర్చినట్లు చెప్పెడి శ్లోకమొకటిచ్చియున్నారు. ఇందు వేముడు బిలపర్వతము, లేక బిలముకొండ అనగా ప్రస్తుతపు బెల్లంకొండపాలకుడుగా చెప్పబడినాడు. ఈశాసనము మూలము మాకు దొరకలేదు. 1352 నాటికే ప్రస్తుతపు గుంటూరుజిల్లాయంతయు ప్రోలయవేముని స్వాధీనములోనికి వచ్చినటుల నెకరికంటి శాసనమువలన స్పష్టము. 1335 నాటి చీమకుర్తి శాసనముచాల ముఖ్యమైనది. ఆనాటికి వేమునిరాజ్యము "సామ్రాజ్య"మైనది. ఆనాటికే శ్రీపర్వత అహోబల పర్వతసోపానము నిర్మాణమైనది. వేముడు కంది, పరిఘా, సహ్యజా, పరిసర

వేమనృపతి కిర్వురు కుమారులని మాత్రమే చెప్పబడినది. అది సరియైనది. కోమటి అన వేముని వాడుకవు సంగ్రహనామమే.

కోమటి ప్రోలారెడ్డి పెద్దకొడుకు మాచారెడ్డి, ఆదిరాజన్యతుల్యాచారనిధి యని హరివంశమునందున్న,[21] మహాభిమానియును, శిలాకతినకాకుబంధుడనియును, ధనదపుర ప్రభృతముల జయించినవాడనియును, వేమభూపాలచరితమందున్న,[22] వర్ణింపబడెను. ఎఱ్ఱాప్రగ్గడ తత్సమకాలవువాడై వేమారెడ్డిసోదరుల నెఱిగినవాడు. అతడు బలపరాక్రమములకు అన్నారెడ్డిని మల్లారెడ్డిని వర్ణించి, వారలు వేమునకు సామ్రాజ్యనిర్మాణమునం దెట్లు సహాయపడిరో చెప్పి, మాచారెడ్డిని వర్ణించుచు, "ఆదిరాజన్య తుల్యాచారనిధి" యని మాచారెడ్డి ధర్మగుణశీలములమాత్రమే ప్రాధాన్యముగా వర్ణించుట చూడ మాచారెడ్డి శాంతియుతముగ నెక్కువగా పురాణకాలక్షేపము చేసినట్లు తోచెడిని. మాచారెడ్డి ప్రోలయసంతానములో పెద్దవాడైనను, వేమారెడ్డి సింహాసన మెక్కుటకు కారణము సామ్రాజ్యము పరాక్రమముచే వేమునకు స్వార్జితమగుటయే. వేమారెడ్డి పరాక్రమముచే బహుభూము లాక్రమించి, అనుజతనుజబాంధవుల కిచ్చెను.

## అన్నయరెడ్డి.

ఈతడు ప్రోలయవేముని తరువాతివాడు. మల్లారెడ్డికంటె పెద్దవాడు. ఈతని గుఱించి ఎఱ్ఱాప్రగ్గడ 'సకలాగమసమన్వితుడు, అన్నదానసంపన్నుడు, బాహుబలరాశి, భవాంఘ్రిసరోజపూజనాసన్మతి తత్పరాత్ముడు, అవసన్నవిరోధి యని వర్ణించినాడు. ఈ పైవిశేషణములయందు అన్నయరెడ్డి భక్తిభావము, ధర్మతత్పరత విశేషించిగోచరించుచున్నవి. కాని అన్నయరెడ్డి పరదుర్గములపై దాడులలో వేమునకు విశేషముగ సహాయపడినట్లును శౌర్యపరాక్రమములను ప్రదర్శించినవాడనియును ఎఱ్ఱాప్రగ్గడ వ్రాసెను.

"దైతేయారికి మాటలచేతుల క్రియనొప్ప రెండు జేదోడై వి
ఖ్యాతులు తమ్ములు వేమక్ష్మాతలపతి కన్నవిభుడు మల్లప్రభుడున్."

అని విష్ణుబాహుసాదృశ్యమును సూచించుటచే పరాక్రమము వ్యక్తమగుచున్నది. ఈ అన్నయరెడ్డి ఏయుద్ధమునందో వీరమరణము నొందినట్లు తోచుచున్నది. ఈతని పుణ్యమునకుగాను శ్రీశైలమందు మల్లికార్జునస్వామి దేవాలయములోని నందిమండపమునకు సమీపమున వీరశిరోమండపమనునది "(వీరమండపమనునది)" 1377 సంవత్సరములో అన్నవేమునిచే నిర్మింపబడినది.[23] ఈ వీరమంటపమందు వీరులనేకులు మహాసాహసకృత్యముల నొనరించుచుండెడివారు. తలలు, నాలుకలు, కండగత్తెరచే ఛేదించుకొనుచు

21. హరివంశము — పూ భా. ఆ. 22.

22. వేమభూపాలచరితము — ఉచ్ఛ్వాసము 3, పుట 101.

23. (1) F. R. 20 of 1915.

భక్తిని సాహసమును చూపినారని ఆశాసనమునందే వర్ణింపబడినది. ఈశాసనము ప్రోలయవేముని తమ్ముడగు అనవేమారెడ్డి కాలములోనిది. శాసనాంతమున తనతండ్రి అన్నయరెడ్డి పుణ్యార్థమై ఈమండపము కట్టింపబడెనని కలదు. శాసనశాఖవారు ఈఅనవేముడు చక్రవర్తియైన అనవేముడేయని అభిప్రాయపడుచున్నారు.[24] ఈయభిప్రాయము సరియైనదికాదు. ఈ శాసనము వ్రాసినది అనవేమచక్రవర్తి ఆస్థానకవి యగుటయు, శాసనాంత్యమున "అన్నవేమయ" బిరుదములు కొన్ని అనవేమారెడ్డికిగల బిరుదములగుటయు ఇది అనవేమారెడ్డిదని చెప్పుటకు ప్రోద్బలముగానుండుటచే శాసనశాఖవారును, మరియితరపరిశోధకులును అట్లభిప్రాయపడియుండవచ్చును. కాని శాసనములో స్పష్టముగా మంటపదాత అన్నయరెడ్డికుమారుడగు "అన్నవేమయ" యని చెప్పబడినది[25] తన తండ్రి, పెదతండ్రి, పినతండ్రుల బిరుదముల నితడు వహించుటలో తప్పేమియునులేదు. రాజబంధువులును, మహాసేనాపతులును తమ ప్రభువుల బిరుదులు తాము ధరించి శాసనములలో వ్రాయించుకొనుట ఆనాటి సాంప్రదాయము. దీనికనేక దృష్టాంతములు శాసనములలో కనవచ్చును. ఈ అన్నవేమయచక్రవర్తి అనవేమరెడ్డికి ఇష్టుడును, రాజకుటుంబములోనివాడును అగుటచే ఆస్థానకవియైనబాలసరస్వతి ఈశాసనమున వ్రాసెను. ఇతడు రాజమహేంద్రవర, నిరవద్యపురస్థల దుర్గముల నాక్రమించి, అనవేమారెడ్డికి జయముల నొసగూర్చియుండెను. ఈ అన్నవేమయను గూర్చి మరెక్కడను ప్రశంస కానరాదు.

---

24. (?) G. R. 20 of 1912, part II, page 115.

The statement at the end of the Telugu portion that the Mandapa was built by Annavemaya for the merit of his father Annaya Reddi suggested that he was the son of Vema; he had high regard for his father's brother Anna Bhupa and respected him as his father.

25 ఈ వీరమంటపముకట్టిన శిల్పి పంచభిక్షం మల్లయ. రామనకుమారుడు, శైవాగమవిహిత, మంత్రదీక్షాపరుడు పై వీరమంటపశాసనము తుదిని ఈక్రింది సీసపద్యము కలదు.

శ్రీపర్వతస్థలిచెలువగు శ్రీమల్లికార్జునస్వామి దేవాంగణమున
మహనీయమగు వీరమంటపం అనేకప్లవిలసితంబగు పుణ్యస్థలినొప్ప
కట్టించి జగనొబ్బగండ న్నవేమవిభుని... ...శ్వర ధర్మకీర్తి
సకలదిక్కులనిండ సాంద్రమై ఆచంద్రతారకస్థితి నుర్వి తనరజేసె
కాంక్ష రాగమమంత్రదీక్షావిభూతి దంచితాచారుం డగుచున్న పంచభిక్షం
రామనసుతుండు నిర్మ... ...వంశుండు మల్లనాఖ్యుండు శివభక్తిమార్గరతుండు.

రజతోత్సవ సంపుటము. ఆం. సా. ప. పుటలో పల,

శ్రీ రామయ్యపంతులుగారు - అనేకప్ల - అను శబ్దమేదియో తెలియుటలేదని వ్రాసి

(అనేకోప్ల.) అని దీని సుష్ఠురూపము. అనేకశిలలతో గూడిన అని అర్థము.

మల్లారెడ్డి:— ప్రోలయవేముని సోదరు లందరిలోను మల్లారెడ్డి మహావీరుడు. బాహాదర్పము గలవాడు. ఇతడును, మేనమామ నాగ సేనానియును వేముని సేనానాయకులు. చతుర్విధ దుర్గముల సాధించుటలోను మండలీకుల భూముల్నాక్రమించి రాజ్యము వృద్ధిచేయుటలోను వీరిసాహాయ్య మపారము. ఈమల్లారెడ్డి వీరుడేకాక విశేష విద్యావంతుడు, కవిత్వప్రియుడు. ఇతనియందు సమస్తసద్గుణములును మూర్తీభవించియుండెను. ప్రోలయవేముని కితనియందు చాల ప్రేమ. ఇతడు రాజనీతినిపుణుడు. వేమునిరాజ్యము మొదటలో గుండ్లకమ్మ కిరువంకలను వ్యాపించియుండెను; కాని తూర్పుసముద్రతీరమంతయు శత్రురాజుల స్వాధీనములో నుండుటచే రాజ్యమున్ని దిక్కులను శత్రువులచే చుట్టుకొనబడియుండెను. రెడ్డిరాజ్యము సుస్థిరముగా ప్రతిష్ఠింపబడవలసినచో తూర్పుసముద్రతీరమువరకును ఈరాజ్యము వ్యాపించియుండుటఅగత్యము. ఇది పర్యాలోచించి మల్లారెడ్డి ప్రోలయ రాజ్యప్రారంభములోనే ప్రయత్నముచేసి వేముని "పూర్వసముద్రాధీశ్వరుని" చేసెను. ఈ పూర్వసముద్రతీరమునందనేక పరదేశములతోను సమస్త దీవులతోను, విశేష బేహారముల నడుపు పట్టణములు కలవు. వానిలో మోటుపల్లి ఆదినములలో సుప్రసిద్ధమైనది. ఈ మోటుపల్లిని శత్రురాజుల ద్రోలి వశపరచుకొనెను.[26] ఇది 1335 సంవత్సరమునకు పూర్వమే జరిగెను. ఈమోటుపల్లి వశమయినతర్వాత వేముని బొక్కసము సుంకములచే విశేషముగా నిండెను...... అమరావతీ శాసనములోని "కరదస్సాగరసస్యవ్యక్షాగోత్ర వేమభూపతిః" అను వాక్యము సార్థకము. ఈరేవుపట్టణమును స్వాధీనపరచుకొనుటకు విజయనగరరాజులు ప్రయత్నములు చేయుచువచ్చిరి. ఇది రెండుమూడుసారులు చేతులుమారుచువచ్చెను. ప్రోలయవేముని రాజ్యకాలములోనే ఇది తిరిగి పరరాజ్యగతమవగా అతని యనంతరము అనపోతారెడ్డి తిరిగి దీనిని స్వాధీనపరచుకొని ఒకశాసనము వేయించెను. హరివంశము ఈమోటుపల్లి జయమును విశేషముగా ప్రశంసించియుండెను.[27]

ఈ ఎఱ్ఱాప్రగ్గడను మహాకవిగా గ్రహించి చేరదీసి పోషించిన దీమల్లారెడ్డియే. ఆతడే శంభుదాసుని (ఎఱ్ఱాప్రగ్గడను) వేమునికిచ్చెను. ఈవిషయము హరివంశములో చక్కగా వర్ణింపబడినది. వేముడు ఎఱ్ఱనార్యునితో

"నాతమ్ముండు ఘనుండు, మల్లాధినీనాధుండు నిన్నాతత
శ్రీతోడన్ సముపేతు జేసి యొలమిం జేపట్టి మాకిచ్చుటం"

జేసి, రామాయణమును చెప్పించినానని చెప్పినాడు. మల్లారెడ్డి గుణగ్రహణపారీణత

26. See Appendix Pages 19, 20.
27. బాహాదర్పమునం బ్రతాపధరణీపాలావలిం ద్రోలియు
త్సాహోదగ్రుడు మోటుపల్లి గొని సమస్తద్వీపసద్వస్తు సం
22. దోహంబున్ దనకిచ్చు వెచ్చెలి సముద్రుం బ్రీతిగావించుచున్
23. (1, మాహాత్మ్యంబువహించె మల్లరథినీనాథుండు గాఢోద్ధతిన్.

తెలుపుట కొక్క విషయమే చాలును. ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశమునందు తిరిగితిరిగి మల్లారెడ్డి ప్రశంసచేసినాడు. మల్లారెడ్డియందు ఎఱ్ఱనార్యుని గుణపక్షపాతము స్పష్టము.[28]

ఈ మల్లారెడ్డి నాయంకరము కురుములూరి పురమని తెలియుచున్నది. ఈ కురుములూరే కుడుములూరను పేరుతో కడపజిల్లాలోని సిద్ధవటము తాలూకాలోనున్నది.[29] క్రీ. శ. 1352 సంవత్సరములో అల్లాయుద్దీన్ బహ్మనీ రెండవసారి ఆంధ్రదేశముపై దండెత్తి కొల్లగొట్టెను. ఈ దండయాత్ర విసరు ఎక్కువగా తెలంగాణముపై సాగెను. కృష్ణానది దాటి దక్షిణముగా అల్లాయుద్దీను వేముని రాజ్యములోనికి కాలిడగానే మల్లారెడ్డి ఆతని విశేషసైన్యములతో ఎదుర్కొని వెనుకకు తరిమివేసెను. ఈ విషయము కల్వాముల శాసనములో[30]

వేమాధిపస్యా వరజోపిచ మల్లభూవల్లభో సౌజగదేకమల్లః
అల్లావదీనాది తురుష్కమల్లాన్ సముల్లసద్భంగ గణాన్విజజ్ఞే.

అని ప్రశంసింపబడినది.

మల్లారెడ్డి క్రీ. శ. 1355 సం॥రమునకు కొద్దికాలమునకు పూర్వమే వీరస్వర్గము నందియుండెను. ప్రోలయవేమునకిది గొప్పదెబ్బ. మల్లారెడ్డి అక్షయపుణ్యార్థమై అమరేశ్వరస్వామి గుడిమీద సువర్ణకలశలు అయిదున్ను పసిండిపట్టమున్ను కల్పాంతరస్థాయిగా సమర్పించెను.[31] మరియు ప్రస్తుతపు వంగవోలు తాలూకాలోని చెదలువాడ గ్రామమందు మల్లారెడ్డి రామలక్ష్మణ ప్రతిష్ఠచేసి దేవాలయము గట్టించెను. క్రీ. శ. 1355 సంవత్సరమందు వేముడా గ్రామమునకు రెడ్డిమల్లవరమని తనతమ్ముని పేర

ఉ॥భా. 7 _ 285. శ్రీమల్లచమూపతి సేవామధురి మనిత్య సుముఖవామవిచార
వ్యామోహవిముఖ యర్పిత వామాగాంగ పరిత త్త్వవాసవసత్త్వా-

ఉ॥ భా॥ 2 _ 189. బహుజలధిద్వీపాంతర మహీశ్వర ప్రహిత కనక మణి మౌక్తిక హస్తిహ
యార్పణసేవా బహుమతి మల్లగధనీశ భక్తిప్రీతా॥

,, 3 _ 247. "ధీయుక్తమల్ల రధినీనాయక మంత్రప్రయుక్త నయపూర్వక కార్యాయత్త ఖడ్గవిభవ—

,, 5 _ 249. రత్నాకరనాయక గుణగతోజ్జ్వల రెడ్డిమల్లగాజిత

28. హరి. పూ॥భా. 2 వ ఆశ్వాసము, 237 _ "మల్లచమూవర సర్వంచకసోదరత్వనిత్యారాధ్యా-
,, 3 ,, 249 _ మల్లచమూవరేణ్య సేవితపాదయా"
హరి. ఉ॥భా. 1 ,, 13
శ్రీమల్లచమూవల్లభ, మానాథ చతురుపాయ సామర్థ్య నవ
శ్యామంతోజ్జ్వలవైభవసామగ్రీ లబ్ధ సఫలసౌభాగ్యశ్రీసభా॥

29. హరి॥ పూ॥ భా॥ 198.
సకల ద్వీపాంతర రత్నకలాప, నిరంతరార్చనా కలనారం
భక, కురుములూరి పురనాయక మల్లచమూవరేణ్య హరిని షేవ్యా.

30. L. R. III—469.

31. S. I. I. Vol VI no. 213.

పునర్నామకరణము చేసి దేవభోగముగా మల్లారెడ్డి ప్రతిష్ఠించిన రామదేవాలయమునకు దేవభోగముగా నిచ్చెను.[32] ఈ మల్లారెడ్డి కుమారుడు పినకోమటి.

## మాంకయనాయకుడు : నల్లమాంకయ.

వేముని మాతామహుండు దొడ్డయనాయకుడని చెప్పియేయున్నాము. ఇతని కుమాళ్ళు పోతయ, చిట్టయ, నాగయ యనువారలు. వీరిలో నాగసేనాని వేముని దండయాత్రలలో పాల్గొని రాజ్యవృద్ధికి కారకుడై యుండెను. ఇతడు వేముని జీవితకాలములో క్రీ. శ. 1343 కు పూర్వమే వీరమరణము నొందెను. ఈనాగసేనానికి పుణ్యార్థమై నాగపురమని పేరుపెట్టి, ముట్లూరను గ్రామ మష్టభోగసహితముగా జొన్నలగడ్డ మృత్యుంజయార్యునికి ఏకభోగముగా దానముచేసెను. చిట్టయకుమారుడు మాంకయ; ఇతడుకూడ నాగసేనానితోపాటు వేమారెడ్డి కార్యములయందు పాల్గొని ఓటమి యెరుగకుండెను. ఇతడు "వేమధాత్రీపతికి పరమమిత్రుండును, సకలజగజ్జైత్రుండును, మాతులప్రియపుత్రుండును, అని ఎఱ్ఱాప్రెగ్గడచే ప్రశంసింపబడినాడు. ఈ మాంకయ కుమారుడు నల్లమాంకయకూడ విశేషపరాక్రమవంతుడు. ఈ నల్లమాంకయకు వేమారెడ్డితమ్ముడు అన్నారెడ్డికూతురు వేమాంబిక నిచ్చి వివాహము చేసిరి. ఈనల్లమాంకయ కూడ క్రీ.శ. 1375 వ సంవత్సరమునకు పూర్వమే మరణించెను.[33]

## వేముని శీలము.

రెడ్డిరాజ్యస్థాపకుడగు వేముడు అన్నదమ్ములలో 'గుణజ్యేష్ఠుడు.' చిన్నతనమునుండి కాకతీయసేనానియై యుండి, షాడ్గుణ్యప్రయోగముల నెఱిగినవాడు.[34] విశేషించి విలువిద్య నేర్చినవాడు. ఆనాటికి ప్రయోగములలోనున్న సమస్తశస్త్రాస్త్రక్రియలయందును పరిచితి గలవాడు. చతుర్విధోపాయప్రజ్ఞావంతుడు.[35] మహావీరాన్వితుడు. త్రిపురాంతక, విశ్వనాథదేవ పాదారవిందసక్తమానసుడు, మహాశివభక్తుడు.

వేముని శీలమునకు వైదికధర్మస్థాపనము బీజము. ఆగమశైవము కీలకము. సామ్రాజ్యస్థాపనమునకు, శ్రీపర్వతేశ భక్తివ్యాపిత ఘోడెరాయగంగ గురువర్యుని ఆశీర్వచనము ప్రోద్బలకారణము. ఇతడు రాజ్యస్థాపనముచేయుటకుముందు విశేషకోశ సంగ్రహణము చేసెను. ఆనాడేమి, ఈనాడేమి కోశదారిద్ర్య మున్నచో 'సమదమహోద్దామ' అసంఖ్యానీకసైన్యము లెట్లుప్రోగగును? ఇతని కోశాగారాధికారిగా కుమారగిరిరెడ్డి భండారియగు తిప్పయపూర్యుడు అవచిసెట్టి యుండెననుటకు హరవిలాసములోని ... "రెడ్డివేమజగతీపతికిన్ ప్రాపైన యవచిధీమణి" యనువాక్యము

32. N. D. I. III no. 73 (Mallavaram).
33. E.R. 572 of 1925—26, L.R. 12—P. 200.
34. వేమభూపాలచరితము. పుట 102.
35, S.I.I. Vol. VI, P- 213.

స్ఫోరకము. వేమభూపాలచరితమందు వామన భట్టబాణు డీవిషయమునుగురించి "కమలాకర ఇవ.....విహితకోశసంగ్రహాశ్చ" అని వర్ణించెను.

వేముడు రాజ్యప్రారంభములోనే శ్రీశైల, అహోబల, సోపాననిర్మాణము గావించి, తన ఈశ్వరభక్తిని ప్రకటించుకొనెను. ఈ సోపాననిర్మాణము రెడ్డిరాజుల సమస్తశాసనకృతులయందును ప్రశంసింపబడినది. ఈసోపాననిర్మాణకాల మెప్పుడో స్పష్టముగా చెప్పజాలము. హరివంశములో ఎఱ్ఱాప్రెగ్గడ ఈ సోపాననిర్మాణప్రశంశయే చేయలేదు. హరివంశరచనమునాటి కీ నిర్మాణము కాలేదేమో. క్రీ. శ. 1335 నాటికి సోపానరచనము పూర్తిఅయినట్టు సీమకుర్తిశాసనమునుబట్టి తెలియుచున్నది. వేముడు అనేకఅగ్రహారములను విద్యాతపోవృద్ధుల కిచ్చెను. వీనిలో ముఖ్యములు:—

వర్వేరుగ్రామము బ్రహ్మభట్లు అను బ్రాహ్మణునకు 1330 లోను, చిట్టమంచి తిమ్మనభట్టుశాస్త్రిలవారికి శ్రీశైలభూమిని, అమ్మనబ్రోలిసీమలో రామతీర్థం 1335లో సర్వాగ్రహారముగను, చీమకుర్తి, భీమేశ్వరం, పులికొండ, మైలవరం, కొమరిపురం గ్రామములలో కొన్నిభూములు సర్వమాన్యములుగానున్నూ, క్రీ. శ. 1344లో ఈలకూచి వల్లభశిష్టకు మంచాళ్ళగ్రామము ముఖ్యాగ్రహార దానముగాను,[35] జొన్నలగడ్డ మృత్యుంజయార్యునకు క్రీ.శ. 1343లో ముట్లూరుగ్రామము ఏకభోగముగాను, కృష్ణానది ఉత్తరపుటొడ్డున ఆతుకూరుగ్రామము అగ్రహారముగాను, 1365లో చెదలువాడ రెడ్డి మల్లవరమను పేరుతో దేవభోగముగాను దానమిచ్చెను. ప్రతాపరుద్రచక్రవర్తి దానమిచ్చిన విప్రాగ్రహారములు మ్లేచ్ఛులపహరించిన వానిని తిరుగ ఉద్ధరించి పునర్దానములొనర్చెను. చెరువులు గుళ్ళు ప్రతిష్ఠించెను. సత్రములు, చలిపందిళ్ళు, తోటలు నిధులు నిలిపెను. హేమాద్రి దానఖండములో చెప్పినదానములన్నియు నిర్వర్తించెను. వేముడు మహాశైవుడైనను విష్ణుగాథలయందు హెచ్చుగా రుచిగలవాడు. రామాయణము, హరివంశమును నిత్యమును వినుచుండెడివాడు. తత్కథాప్రసంగమతి[36] వేముడు చుట్టపు మేరువు. సోదరులు, మాతులుడు, మాతుల పుత్రులు వీరందరను సామ్రాజ్యమునందు ముఖ్యపదవులయందుంచి వారలను తనసౌహార్దముచే వశపరచుకొని సామ్రాజ్యభారము నిర్వర్తించుచుండెను. ప్రజలయందీతడు మిక్కిలి యనురాగము గలిగి వారి కేయపాయము రాకుండ కంటికి రెప్పవలె గాచుచుండెను.

## వేముని రాజ్యాంగము.

వేముడు గిరిదుర్గముల నాక్రమించి వాటియందు తనబంధువులను సైన్యముతో నుంచి పాలించుచుండెను. క్రొత్తదుర్గముల నిర్మించెను. మంచాళ్ళ శాసనమందు వేముడు

35. ముఖ్యాగ్రహారమనగా పౌరోహిత్య, యాజకత్వ, ప్రభుత్వ. జ్యోతిస్సార, హేమముద్రా పరీక్షా, సాముద్రి, లేఖక, యాజమానములనెడు భోగాష్టకములతోను, నిధనిక్షేప, జలాశ్మసార, అక్షీణ అగామి, సిద్ధసాధ్య, మను అష్టతేజస్సులతోను, స్వామ్యదానాధికారములు కలిగినగ్రామదానము.

36. హరివంశము పూ. భా. 7—249.

చౌసీతిదుర్గముల నిర్మించినట్లు చెప్పబడినది. ఈ దుర్గములలో అశ్వ, గజ, భటులనుంచెను. కాకతీయ సామ్రాజ్యమందలి ఇతర కట్టుబాట్లన్నియు సుసిరముగనే యుండెను.

## వేముడు — కాపయనాయకుడు.

ప్రోలయనాయకుడును, కాపయనాయకుడును, ప్రోలయ వేముడును, ఇతరనాయకులును కలసి మహమ్మదీయుల నాశనమొనర్చినతరువాత ప్రోలయ వేముడు స్వనగరమునకేగి స్వతంత్ర రాజ్యస్థాపనకు అంకురార్పణ మొనర్చెనని ఇదివరలో వ్రాసియున్నాము. వేముడు క్రమక్రమముగా రాజ్యమును వృద్ధిచేయుచు, గుండ్లకమ్మ కిరుప్రక్కలను కృష్ణానదికి దక్షిణముగాను, శ్రీశైలమునకు తూర్పుభాగమునను రాజ్యమును వ్యాపింపజేసెను. తెలింగాణమంతయు ఆంధ్రసురత్రాణుడగు కాపయనాయకుని ఆధిపత్యముననే యుండెను. కాపయ ఒరంగల్లునుండి తెలింగాణమును, వేముడద్దంకినుండి దక్షిణాంధ్రదేశమును పరిపాలించుచుండిరి. వీరిద్దరును వారి జీవితకాలములలో ఒకరినొకరు ఎదుర్కొనియుండలేదు. రెండు రెడ్డిరాజ్యములును స్నేహభావముతోనే ఉండెను. ప్రోలయ వేముడెన్నడును కాపయనాయకుని లెంక కాడు. తురుష్కుల తరిమివేయుటలోకూడ ప్రోలయనాయకుడు కాపయనాయకుని ఆధిపత్యమును అంగీకరింపలేదు. ఒకేఉద్దేశముతో యిరువురును పాటుపడిరి. ప్రోలయ కాపయనాయకుల నాయకత్వమున ఆపనిని నెరవేర్చిరి. అంతమాత్రమున ప్రోలయవేముడు కాపయనాయకుని లెంకయని చెప్పుట సమంజసముకాదు. చీమకుర్తి శాసనములో 'ఏకరాయస్థాపనాచార్య, ఏక సింహాసనాలంకార' యను విశేషణములు ప్రోలయవేమునికి వాడబడినవి. వీనియర్థము కొంచెము మరుగుగానున్నను డాక్టరు వెంకటరామయ్యగారి[37] విశేషణములు ప్రోలయనాయకునికి వర్తించునని వ్రాసియున్నారు. అదియుక్తముకాదు. ఆశాసనమందలి విశేషణములన్నియును ప్రోలయవేముని కన్వయించునవియే. ఏకసింహాసనాలంకారుడు వేముడే. ఏకరాయస్థాపనాచార్యుడును వేముడే.

శాసనములలోని ఏకరాయుడు ప్రోలయవేమునికంటె భిన్నుడని వాదించుట కవకాశమున్నది. ఏకసింహాసనాలంకారుడొకడును, ఏకరాయడొకడును వేరనుటకు ఉపపత్తి లేదు. ఏపక్షములోను ఏకరాయుడు ప్రోలయనాయకుడు కాడు. ప్రోలయనాయకుడు సింహాసన మధిష్ఠించలేదు. పరశురామునివలె అతడు, దేశము నిర్యవనముగాజేసి ధర్మార్జనతత్పరుడై రాజ్యభారమును కాపయనాయకుని వశముజేసెను.

వేముని బిరుదములలో "కృష్ణవేణీ గోదావరీమహానదీ తటీద్వయన్మధ్యదేశానేకాగ్రహార" దాతయని కలదు. ఈ కృష్ణవేణీ గోదావరీనదీ తటీద్వయమధ్యదేశ మప్పుడు కాపయనాయకుని స్వాధీనములోను, కాపయనాయకుని సన్నిహితబంధువుల స్వాధీనానుభవములోను ఉండెను. ప్రోలయవేము డీదేశముపై దండెత్తిన, అతనికిని కాపయ

37. Vide The Early Muslim Expansion in South India, p. 173.

కును సంపూర్ణము కలిగియుండెడిది. దొరకినంతవరకును వేముని దానశాసనగ్రామము లన్నియును కృష్ణకు దక్షిణభాగములోనివే. కృష్ణాగోదావరీనదీతటద్వయ మధ్యదేశములోని దేదియును లేదు. బహుశః వేమవరశాసనములో చెప్పినటుల ప్రతాపరుద్రునిచే నివ్వబడి, మ్లేచ్ఛపరిపాలనములో అపహరింపబడి, వేమునిచే ఉద్ధరింపబడిన కృష్ణాగోదావరీమధ్యదేశమునందలివి యీ యగ్రహారములై యుండును. కాని తాను పరిపాలించు దేశములోని యగ్రహారము లెంతమాత్రమును కావు.

చీమకుర్తిశాసనములోని కలింగరాయ మానమదమర్దన, మంనియరాయ వేంటకార, వొడ్డియరాయ నిర్దూమధామ, జంతుర్నాటరాయహల్లకల్లోల, బిరుదములు చరిత్రకారులను, వేమునివిజయములగూర్చి మభ్యపరచుచున్నవి. వేముడు క్రీ.శ. 1335 నాటికే తూర్పుసముద్రతీర మంతయును, ఒరిస్సాలోని కటకముపరకును గజపతులనోడించి ఆక్రమించుకొనెనని కొందరు చరిత్రకారు లూహించుచున్నారు. ఇది నిజముకాదు. పైబిరుదములలో కలింగరాయ మానమర్దన, జంతుర్నాటరాయ హల్లకల్లోలయను బిరుదములు వేముడు కాకతీయసేనానాయకుడుగా నున్నపుడు జరిగిన కళింగదేశ దండయాత్రలకు సంబంధించినవి. పైవానిలో కళింగరాయ మానమదమర్దన, ఒడ్డియరాయ నిర్దూమధామయను రెండుబిరుదములను, ఒరిస్సారాజులను గురించికావు. ఈ ఒడ్డియరాయడు, కటకము రాజధానిగాగల ఒరిస్సాదేశప్రభువుకాడు. కాకతీయ శాసనములోని, ఒడ్డియ రాజదిశాపట్ట వొడ్డియరాయ దళవిఫాళ, బిరుదులును, కాకతీయ నాయకుల బిరుదావళుల లోని ఒడ్డియబలశాసనాధీశ్వర "వొడ్డియదేశసప్తాంగహరణ", "వొడ్డియదేవుని సర్వదళవిఫాళ వొడ్డియదేశాధి సామంత గర్వాపహరణ" బిరుదులును, కళింగదేశమును ఏలిన ఓఢ్రరాజులవికావు. కపిలేశ్వర గజపతి క్రీ. శ. 1435 సంవత్సరములో సింహాసన మెక్కువరకును, కళింగమును గాంగవంశజులగు రాజులు పరిపాలించుచుండిరి. వీరిలోకడపటివాడు నాల్గవ భానుదేవుడు. ఈకళింగ గాంగవంశజులకు "ఒడ్డ" రాయలని సంజ్ఞలేదు. వీరలగూర్చి శాసనముల లోగాని, కావ్యములలోగాని, కళింగరాయలనియే వ్యవహారము. కపిలేశ్వర గజపతి నాటి నుండియు ఒడ్డెరాజ్యము ప్రారంభమైనది. ఈతని కాలమునుండియే ఒడ్డెరాజ్యమని కళింగ రాజ్యమునకు పేరు వచ్చినది. అంతవరకును ఒడ్డెరాజ్యము లేనేలేదు. ప్రకృతశాసనమందలి ఒడ్డెరాయలు వేరు. కడపజిల్లాలోని సిద్ధవటము తాలూకాలో ఈ వడ్డెరాజుల శాసనము లనేకములు కలవు 38. ఈ వడ్డెరాజులు చాలపరాక్రమవంతులు. వీరు రెడ్లయినట్లు నిదర్శనములు కనుబడుచున్నవి. వీరిరాజ్యము ఘండికోట రాజ్యములోని భాగమయి ఉండెను. వీరు అంబదేవుని సామంతులయి, ప్రతాపరుద్రదేవునిపై తిరుగుబాటొనర్చుటచే, అతడు

38 L. R. 18-183 "వడ్డెప్రభువు బ్రహ్మిరెడ్డి అనె వొడ్డెప్రభువులు అన్నరమందు రాజధాని కట్టుకొండేవారు —"

సంవత్సర ప్రాంతమున ఖుండికోట రాజ్యముపై దండెత్తి అంబదేవుని, ఆతని సామంతులలో నివారగు ఈ వోడ్డ్రప్రభువులను ఓడించెను. ఆనాటినుండియు, ప్రతాపరుద్రుడును, ఆదాడిలో పాల్గొనిన సామంతనాయకులును. "వొడ్డియరాయ దిశాపట్టవైరి," "వొడ్డియరాయ దళ విఫాల బిరుదముల" ధరించుచు వచ్చిరి పైకారణములబట్టి చీమకుర్తి శాసనములోని ఒడ్డియరాయ నిర్ధూమధామ యనునది, వేముడు ప్రస్తుతపు కడపజిల్లాలోని సిద్ధవటము తాలూకా నాక్రమించుకొని, వల్లూరు రాజధానిగానున్న వడ్డెరాజుల నాశనముచేసి, ఈబిరుదము ఆర్జించెను. ఈవేముడు మహానదివరకును దిగ్విజయయాత్ర చేసిననిగాని, గాంగవంశపు రాజులను ఓడించెననుటకుగాని ప్రమాణములేదు. శ్రీ చిలుకూరి వీరభద్రరావు పంతులుగారు, "కటకాధిపతియైన గజపతి దండెత్తివచ్చినపుడు దోర్గర్వమున వానినెదుర్కొని కృష్ణానదీ తటమున నోడించినట్లు" ఆంధ్రులచరిత్రముల వ్రాసియున్నారు 39. వీనికాధారము హరివంశములోని,

బహుళ హయగజేంద్ర స్ఫారసేనాసహాస్ర
ప్రహతకాటకరాష్ట్రభ్రష్ట విధ్వస్తసంప
ద్గ్రహణపరమ ధనోద్యదగ్రధాటీ భటశ్రీ
మహిత జయవిజృంభా మంజురాజ్యోపలంభా॥— 40

వీరభద్రరావుగారిందలి "ప్రహాతకటక, రాష్ట్ర" యనుపదముల యర్థమును సరిగా చేసుకొనలేదని చెప్పవలసి యున్నది. కటకమనగా రాజధాని. కటకమను నగరముకాదు. రాజధానులనుండియు, రాజ్యములనుండియు వెడలగొట్టబడిన శత్రురాజుల సంపదలు గ్రహించిన దాడులుగలవాడు, వేముడని ఎఱ్ఱాప్రెగ్గడగారు వ్రాసియున్నారు. పైపద్యము కటకముపైగాని, కటకరాష్ట్రముపైగాని వేముడు దండెత్తినట్లు చెప్పుటకు ఆధారముకాదు. కళింగగజపతి ప్రోలయవేముని కాలములలో ధరణికోట వరకును దండెత్తెనని వ్రాయుటకు, ఏయాధారమును లేదు. ప్రోలయవేముని రాజ్యమునకు కృష్ణయే ఉత్తరపు సరిహద్దు. కాపయనాయకుడు భీమవరమువద్ద రేచెర్ల అనపోత, మాదానాయలచే ఓడింపబడి చంపబడిన తరువాత తెలింగాణము వారల వశమయ్యెను. కృష్ణాగోదావరీ మధ్యదేశమందున్న కాపయసామంతులను జయించి వశపరచుకొనుటకు, రేచెర్లరాజులు ప్రయత్నించి దాడుల చేయమొదలిడిరి. ప్రోలయవేముడీ నాటికి స్వర్గస్థుడయ్యెను. అనపోతారెడ్డి రాజ్యమునకువచ్చి, కృష్ణాగోదావరీ మధ్యదేశము రెడ్డిరాజ్యములో కలుపుకొనుటకు సైన్యములగూర్చుకొని దండెత్త ప్రయత్నించుచుండెను. అంతటనుండి 50 సంవత్సరములు, అనపోత, అన్న వేమా రెడ్లకాలమంతయు, పద్మనాయకులతో, ఈప్రదేశములో ఘోరమగు పోరు సంభవించెను.

---

39 ఆంధ్రుల చరిత్రము రెండవ భాగము పుట 165.

40 హరివంశము పూ। ఆ॥ 198.

## ప్రోలయవేముడు—బహ్మనీసుల్తానులు.

క్రీ. శ. 1347 లో అల్లాఉద్దీను బహ్మన్‌షా, గుల్బర్గాబాదులో రాజ్యమును స్థాపించెను. ఈ రాజ్యమునకు తూర్పుసరిహద్దు కాపయపరిపాలితమైన తెలింగాణరాజ్యము అల్లాయుద్దీనుకును, కాపయనాయకును మొదటలో సఖ్యమే—కాని అల్లాయుద్దీను రాజ్యమందు స్థిరపడినతరువాత తెలుగుదేశముపై రెండు దండయాత్రలనొనర్చెను. ఈ రెండవ దండయాత్ర అల్లాయుద్దీను స్వయముగా నడపియుండెను. ఈ దండయాత్ర ఒక సంవత్సరము పట్టెననియును, అందాతడు, యావదాంధ్రదేశమును కొల్లగొట్టెననియును, మహమ్మదీయ చరిత్రకారులు వ్రాయుచున్నారు.41 ఈ దండయాత్ర క్రీ. శ. 1357 లో జరిగియుండునని కొందరు చరిత్రకారులు, తలచుచున్నారు. వేమారెడ్డితమ్ముడు మల్లారెడ్డి అల్లాయుద్దీను నెదుర్కొని రెడ్డిరాజ్యమునుండి తరిమెనని ఇదివరలోనే వ్రాసియున్నాము. వేమనకును అల్లాయుద్దీనుకును సంఘర్షణ మీదండయాత్రలోనే. మల్లారెడ్డిపాల్గొనిన యుద్ధములుకూడ ఇప్పటివే. ఈ దండయాత్ర క్రీ. శ. 1357 లో జరిగెననుటకు ఆధారములేదు. 1357 లో జరిగినది అల్లాయుద్దీను కర్నాటక దండయాత్ర. మల్లారెడ్డి 1355 సం॥కు పూర్వమే చనిపోయియుండెను. • అమరావతీశాసనము మల్లారెడ్డి చనిపోయినతర్వాత వేయించబడినదే. మల్లారెడ్డి పోరినయుద్ధములు 1355 పూర్వమే అయిఉండవలెను. ఈ దండయాత్రలో అల్లాయుద్దీను భువనగిరివరకును తెలింగాణరాజ్యము ఆక్రమించుకొనెనని మహమ్మదీయ చరిత్రకారులు వ్రాసియున్నారు. వేముని రాజ్యములోని దేభాగమును అల్లాయుద్దీనుకు సంక్రమించియుండలేదు. ప్రోలయవేముని జీవితకాలములో, రెడ్డిరాజ్యముపై తిరుగ మహమ్మదీయుల దండయాత్ర రాలేదు

## వేముడు—విజయనగరరాజులు.

విజయనగరరాజ్యమందు వేముని సమకాలికుడు మొదటిహరిహరరాయలు పాలించుచుండెను. వీరిరువురును మైత్రి పాటించియేయుండిరి. వేముని రాజ్యము కృష్ణానది మొదలు కందుకూరువరకును వ్యాపించియుండెను. ప్రస్తుతపు నెల్లూరి జిల్లాలోని దక్షిణభాగము రెడ్డిరాజ్యములో చేరి యుండలేదు. శాసనములలోగాని, కావ్యములలోగాని, వేమునకును హరిహరరాయలకు నెట్టియుద్ధములుగలవని చెప్పబడియుండలేదు హిందూ స్వాతంత్రతనుపోషించుటకై పుట్టిన ఈ రాజ్యములు రెండును, బహ్మనీరాజుల నెదిరించుటలో కలసిమెలసియుండెను. డాక్టరు వెంకటరమణయ్యగారు వేముని యవసానదినములలో రెడ్డిరాజ్యములోనిదగు, వినుకొండ క్రీ. శ. 1352 సం॥ర మునకు పూర్వమే బుక్కరాయలు తన రాజ్య

41 Burhan I. masir.—I. a. 28—152

ములో కలుపుకొనెనని వ్రాసియున్నారు. దీనికొరకట్టియుద్ధములును జరిగినట్లు తోచదు. ఈ విషయమింకను విచార్యము.42

## II

### అనపోతారెడ్డి—క్రీ. శ. 1850—1870

ప్రోలయవేమారెడ్డి స్వర్గస్థుడుకాగా అతని పెద్దకొడుకు అనపోతారెడ్డి, అద్దంకిలో సింహాసనమెక్కెను. హరివంశ రచనాకాలమునాటికే యీతడు యువరాజుగ నుండినట్లు ఈ క్రింది పద్యమువలన స్పష్టము:

వితతయువరాజ విభవోన్నత పోతయసైన్యనాథ నయమార్గస మీా
హిత సంతతసేవావిలసితపుత్ర శ్రీ సమృద్ధ శివగుణసిద్ధా.1

ఈతడు యువరాజుగనుండి రాజనీతియు, తంత్రమును, తండ్రినుండియు, దండనీతియు యుద్ధకౌశలమును పినతండ్రి మల్లారెడ్డి, మేనమామ నాగారెడ్డి, మేనమామ కొడుకు నూంకమరెడ్లనుండియు నేర్చి విశారదుడై యుండెను. ఈతనివశమునకూడ, కొన్ని సైన్యములుంచబడి, దాడులలో నడుపబడుచుండెను. అనపోతారెడ్డి మహావీరుడగుట లోకములో "వీరాన్నపోతనృపతి" యని పిలువబడుచుండెను. అనపోతారెడ్డి పితృక్రమాగతమైన రాజ్యము చిన్నది. ఈ రాజ్యము వృద్ధిచేయుభారమును, కోశమును వృద్ధిపరచుకొను భారమును ఈతనిపై బడెను. ప్రోలయవేముడు నయమార్గసంపన్నుడు గావున, రాజ్యము సుస్థిరముగ చేసుకొనువరకును కృష్ణానదికి ఉత్తరభూభాగమును వశపరచుకొనుటకు ప్రయత్నించలేదు కృష్ణాగోదావరీనదీద్వయ మధ్యప్రదేశమాతని రాజ్యములో చేరియుండలేదని ఇదివరలోనే వ్రాసియున్నాము. అన్నపోత అన్నవేములీభాగమునుజయించి తమ రాజ్యములో కలుపుకొని పాలించుటకు ప్రయత్నములుచేసి తుదకు జయముగాంచిరి. వీరిరువురొనర్చిన యుద్ధములన్నియు ఈప్రదేశముకొరకే.

### అనపోతారెడ్డి మొదటి దండయాత్ర.

గద్దెనెక్కిన మూడునాలుగు సంవత్సరములలోనే, అనపోతారెడ్డి బహుళసైన్యములగూర్చుకొని, కృష్ణదాటి, కాపయనాయకుని సామంతులతోపోరి గోదావరీతీరమువరకును దండయాత్రసాగించెను.

---

42 Triveni Vol. VI No. 3 page 278. "The R
Vizianagara-origin of the city & Empire Page 124.

1 హరి—ఉత్తర—9—260

అనపోతారెడ్డి రాజ్యమునకు రాగానే చేసిన మార్పులలో మొదటిది, రాజధాని అద్దంకికి మార్చుట. తన తండ్రినాట అద్దంకి రాజధానిగానుండినను, కొండవీడుకూడ ముఖ్యమైన దుర్గముగా నుండెడిదనియును, అందుండికూడ ప్రోలయవేముడు రాజ్యపాలన మొనర్చుచుండి ఉండవచ్చుననియును ఇదివరలో వ్రాసియున్నాము. అనపోతారెడ్డి రాజ్యము పశ్చిమమునకు విస్తరించుటకు సావకాశము లేదు. అక్కడ సంగవంశపు రాజులు, ఆనెగొందినుండి రాజ్యము చేయుచు, తూర్పునకు తమ రాజ్యమును విస్తరింపచేయుటకు ప్రయత్నించుచుండిరి. ఉత్తరమునకు కాపయనాయకునిక్రిందనున్న తెలింగాణముండెను; కాన ఆదిక్కునకు రెడ్డిరాజ్యము విస్తరింప వీలులేకుండెను. ఈశాన్యముగా తూర్పు సముద్ర తీరము మొదలుకొని సింహాచలమువరకునుగల దేశము చాలభాగము మండలేశ్వరుల క్రిందనుండెను. వారలు, వారలలో కలహించుచుండిరి. కాన కృష్ణా గోదావరీద్వయ మధ్యభాగము జయించి స్వాధీనపరచుకొనుటకు ప్రయత్నములు చేయుట ఆవశ్యకమాయెను. అద్దంకి చిన్న నగరము. అందు బలమైన దుర్గము లేకుండెను. పరరాజులకు దుర్గమమగు, గిరిదుర్గమొకటి రాజధానీస్థానముగనుండి, బలముగ రక్షింపబడవలసియుండెను. అట్టి దుర్గము కొండవీడు. అనపోతారెడ్డి కొండవీటి దుర్గమును బలపరచి, క్రొత్తదుర్గముగ చేసి రాజధానినక్కడకు మార్చివేసెను. మున్యమాపురపు శాసనములో[2] ఈ విషయమిట్లు స్వాభావికముగా వర్ణింపబడినది.

తతోన్నవేమ నృపతిః । పటుః పాలన కర్మణి ।
అపాలయత్త స్వపుత్రః । తదంతేంధ్రి వసుంధరామ్॥
కొండవీడుం రాజధానిం సచిత్రామకల్పయత్ ।
దృష్ట్వాత్వష్టాపి వైచిత్ర్యమభూద్యస్యాః స్వవిస్మయః ॥
ఉచ్చైశ్శ్రవతుల్య బలైస్తురంగైః కల్పద్రుమామాశైశ్చవ దాన్యవర్యైః ।
రంభోపమానైః రమణీజనైశ్చ । సాభాతి భూమావమరావతీవ ॥
సోన్నపోత నృపస్స్వేన నిర్మితాయాం పురిస్థితః॥
కుర్వన్ హేమాద్రిదానాని చిరంభువమ పాలయత్ ॥

పై శ్లోకములలో "అన్నవేమనృపతిః" అనుచోట, అన్నపోతనృపతిః అని ఉండవలెను. తరువాత శ్లోకములో అన్నపోతనృపతియనియే యున్నది. అనపోతారెడ్డి దుర్గమునకు బలమైన ప్రాకారములు నిర్మించి, దుర్గమును యంత్రోపరికల్పితముగా చేసెను. దుర్గములోని గ్రామము రమణీయముగాచేసి, నివాసయోగ్యముగా చేసెను. కొండవీడుదుర్గము "పరరాజ్య, పరదుర్గ పరవైభవశ్రీల తెగనాడునదై, 'ముగ్గురు రాజులకును' మోహంపు యురిత్రాడై కొన్నిశతాబ్దములు వెలసెను. కొండవీడు పాడుపడి నేడుకూడ తన ప్రాచీన వైభవమును చాటు

(2) L. R. Vol 3

చున్నది. కొండవీడు రాజధానిగా మార్చుటచే అనపోతారెడ్డి నిర్భీకుడై తూర్పుదేశము జయించుటకు బయలువెడలుటకు అవకాశము కలిగెను అనపోతారెడ్డి రాజనీతి కౌశలము చూపుటకు ఈకొండవీటి దుర్గనిర్మాణ మొక్కటియే చాలును.

క్రీ. శ. 1855 సంవత్సరములోనిది ద్రాక్షారామ శాసనము మొకటి3 ఈతని విజయముల ప్రశంసించునది గా ఉన్నది—అందీతడు 'ద్వీపజేతా' యని ప్రశంసింపబడినాడు. ద్వీపజేత యనగా, కోనసీమను జయించినవాడు. ఈదండయాత్రవలన విశేషఫలమేమియును రాలేదు. అనపోతారెడ్డి ఈ ప్రదేశమును సుస్థిరముగా తన రాజ్యభాగముగా చేయవలెనన్న, కాపయనాయకుని జయించవలసి ఉండెను. కాని ఆతడు తనసామంతులైన రేచెర్ల పద్మనాయకుల ఒత్తిడివలన తెలింగాణమువదలి రాలేకుండెను. అనపోతారెడ్డి చేసినపనులలో మొదటిది మోటుపల్లి రేవునుగూర్చిన సంస్కరణములు. ఈమోటుపల్లె ఆదినములలో మహాప్రసిద్ధికెక్కిన రేవుపట్టణము. వివిధ ద్వీపాంతరములనుండి వ్యాపారమీ రేవుద్వారా జరుగుచుండెడిది. ఈపట్టణపు సుంకములు రాజు ధనాగారమును నింపుచుండెడివి. కాని ఏకారణముననో సాంయాత్రికులు ఆ రేవును వదలిపోవుచున్నట్లు కనుపడుచున్నది. దానివలన వ్యాపారముతగ్గి, సుంకాదాయము విశేషముగా తరిగిపోయెను. క్రీ. శ. 1858 సంవత్సరములో అనపోతారెడ్డి మోటుపల్లికి విజయంచేసి, సాంయాత్రికుల బాధలువిచారించి, ధర్మశాసన స్తంభమెత్తెను. 3 ఇది అనపోతారెడ్డి రాజ్యపాలనా కౌశలమును ఘోషించును. ఈధర్మశాసన మెత్తించుటలో సోమయామాత్యుడను మంత్రివిశేష శ్రద్ధవహించెను. 4 ఈధర్మశాసనము, మోటుపల్లి కాపురంవచ్చే వర్తకులకునూ, వ్యవహారనిమిత్తమైవచ్చే కరపట్టాల ద్వీపాంతరాల వ్యవహారులకున్నూ చేయబడినది. ఏవర్తకులు మోటుపల్లికి వచ్చినను వారిని గౌరవించి మన్నించుటకును, వారినెప్పుడును మరియొకతావునకు పోకుండగను—వారేయూరికి పోయెదమనిని, వారి నాటంకపెట్ట కుండుటకును, వారే యూరిసరకుదెచ్చినను తమ ఇచ్ఛలవిడినమ్ముకొని, కావలసినచోటులకు సరకు కొనిపోవుటకును వారినేవిధముగను అడ్డుపెట్టకుండగను అనపోతారెడ్డి అభయహస్తమిచ్చెను. అపుత్రికమను పన్నును, సుంకాదాయమును మానివేసెను. బంగారమునకు సుంకము తీసివేసెను. భగ్నమునకైన ఓడలోనిసరకులలో పూర్వాచారము ప్రకారము కొంతపుచ్చుకొనుట కేర్పాటుచేసెను. పైఏర్పాటులనుబట్టి పోలయవేమని కాలములో సుంకమర్యాద చాలకఠినముగ నున్నట్లును, సుంకముల వసూలుచేయుటలో బేహారులను రాజనియుక్తులు

---

3 మోటుపల్లి, బాపట్లకు 17 మైళ్ళ దూరమున సముద్రతీరముననున్నది. దీనిని అనపోతారెడ్డి శాసనములో "ముకుళాన్వయపుర"మ అనగా ముకుళపురమని పిలచినాడు. కాకతీయ గణపతి శాసనమొకటి మోటుపల్లిలో కలదు. See Epi. Ind xii 188 దానియందు ఈపట్టణముపేరు "దేశాయకొండపట్టణమని కలదు. (E. R. 605 of 1909) (V. R. Vol. II Guntur-Bapatla. 106 ఇందు దేశియుయ్యకొండపట్టణమనికలదు" E. R. 606 of 1909 లో వేలానగరమని పిలువబడినది. దీనిసామాన్యనామము మోటుపల్లియే. మార్కోపోలో అను యాత్రికుడు దీనిని 'మూటఫిలి'యని పిలచినాడు.

4 See appendix page 19–20

చాలబాధపెట్టు చున్నట్లును ఊహించవలసియున్నది. రేవు పూర్వమువలె వృద్ధినందుట కయి అనపోతా రెడ్డి విశేషశ్రమపడెను. ఈయేర్పాట్లఫలితముగా సముద్రవ్యాపారము ద్వీపాంతరములతోను, హిందూదేశమండలి ఇతరరేవుపట్టణములతోను విరివిగా పెరిగెన నుటకు సందేహములేదు. కుమారగిరిరెడ్డికాలమునాటికిది పెచ్చుపెరిగి అవచితిప్పయవంటి కోటీశ్వరులు తెలుగు దేశమునందుండిరి. ఈసముద్రవ్యాపారము యొక్క ఉచ్ఛస్థితి శ్రీనాథుడు హరవిలాసములో వర్ణించినాడు. రెడ్డిరాజుల ఆర్థికస్థితి యనుకూలముగనుండి బొక్కస మెప్పుడును నిండి యుండుటకీ వ్యాపార మాధారమై యుండెననుటలో అతిశయోక్తిలేదు.

## అనపోతారెడ్డి—రేచెర్లపద్మనాయకులు.

అనపోతారెడ్డి జీవితమంతయు నీపద్మనాయకులతో పోరాటములలో గతించెను. ఈ రేచెర్లపద్మనాయకులు కాపయనాయకుని సామంతులు. వీరలనాయంకరములు తెలింగానా (North West భాగమునందు) లోని కైలాసకోట, ఇందూరు మెదకుప్రాంతముల యందుండెను. వీరు కాపయనాయకుని విజృంభణము సహింపజాలక అతనిపై తిరుగుబా టొనర్చిరి. ఈతిరుగుబాటొనర్చినవారిలో ప్రథముడు ఎఱ్ఱదాచానాయని కొడుకు సింగభూపతి ఈసింగభూపతి బహుపరాక్రమవంతుడు. ఈ రేచెర్లపద్మనాయకులు క్షత్రియ సామంతులపై దాడివెడలుచు వారలనాశనముచేయుచు వారలనాయంకరముల నాక్రమించు కొనుచుండిరి. వెలుగోటివారి వంశావళియందు ఈయెఱదాచానాయని సింగడు కదనమున కాపభూపతి గెల్చినటుల చెప్పబడినది. 5 ఇది యేసంవత్సరమో చెప్పజాలము. కాని రెడ్డి, వెలమలమధ్య కలహాగ్ని, రాజుచునే యుండెను. ఎఱదాచానాయని సింగడు చింతపల్లి సింగమనాయని భావమఱదిని క్షత్రియులు జల్లిపల్లికోటలో బంధించియుండగా విడపించుటకై, (సింగానాయడు) జల్లిపల్లికోటను ముట్టడించియుండగా క్షత్రియుల పోత్సాహముచే తంబళబొమ్మ జియ్య మాయోపాయమున పొడిచిచంపెనట. ఈపగదీర్చికొనుటకై సింగానాయనిపుత్రులు, అనపోతానాయడును, మాదానాయడును, జల్లిపల్లిపై దండెత్తి క్షత్రియకులమును, పరశురామునివలె నిక్షత్రముగా జేసిరి. ఈజల్లిపల్లియుద్ధము "శార్వరి కార్తికశుద్ధ పక్షమునయని వ్రాయబడినది. 6 ఇది క్రీ. శ. 1361 అయిఉన్నది. ఇది వెలుగోటివారి వంశావళిలోని విషయము. ఇది ఎంతవరకు సత్యమో తెలుసుకొనుటకు తగిన ఇతరయాధారము లేవియును ప్రస్తుతములేవు. కాని పద్మనాయకులు విజృంభించి తెలింగాణములో కాపయను లెక్కచేయనటుల వీనిని బట్టి స్పష్టపడుచున్నది. ఇదివరలో కాపయనాయకుని నాయంకరము అనుమనగల్లని వ్రాసియున్నాము. ఈ అనుమన

(5) వె. వం పుట 43
(6) ,, పుట 23

గల్లు జల్లిపల్లయుద్ధమయినతర్వాత అనపోత మాదానాయకులు "బ్రాహ్మణోత్తముల కగ్రహారంబులిచ్చి, చక్రవరము నొకరాజు భట్టుకగ్రహారంబుగా నొసగి యనుమగల్లు పాలించిరనియును," "అనుమనగంటి పురవరాధీశ్వరులనియును," వంశావళియందు గద్య వ్రాయబడినది. 7 దీనినిబట్టి వారు కాపయనాకుని నాయంకరము నాక్రమించుకొనిరని స్పష్టము. ఇంతటనుండి కాపయ నాయకునకును, అనపోతమాదా నాయనలకును స్పర్ధ హెచ్చయ్యెను. చివరకు కాపయకును వారికి భీమవరమువద్ద ఘోరసంగ్రామము నడచెను. అందు కాపయనాయకుడు హతుడయ్యెను. తెలింగాణపు రెడ్డిరాజ్యము పద్మనాయకుల వశమయ్యెను. వారు కాపయనాయకుని "ఆంధ్రదేశాధీశ్వర, ఖడ్గనారాయణ, గాయ గోవాళ, హిందూరాయసరత్రాణాది" బిరుదముల ధరించి తెలింగాణము పాలింప నారంభించిరి 8 ఇది క్రీ. శ. 1365 లేక 1366 సంవత్సర ప్రాంతముల జరిగియుండును. అప్పటికి అనపోతారెడ్డి సుమారు 15 సంవత్సరములకాలమై పరిపాలనము సల్పుచుండెను. ఇప్పుడు కృష్ణాగోదావరీ ద్వయమధ్యదేశమునకయి, అనపోతానాయడు మాదానాయన లతో, అనపోతారెడ్డికి పోరు సంప్రాప్తమయ్యెను. అనపోతారెడ్డి సైన్యముతో కృష్ణదాటి విడిసియుండగ మాదానాయడు సైన్యముతో మీాదబడెను. వెలుగోటివారి వంశావళి యందు అనపోతారెడ్డి యుద్ధముచేయకయే పారిపోయెనని వర్ణింపబడినది.

"వాడె సింగయమాదడు వచ్చె వేగ
కాచు తెండని రవుతులు చీరఁ బోత
భీతి నన్నపోతారెడ్డి బిరుదులన్ని
వీటిబోవంగ దన్నాలకోటబయట" 9

మరియొకదారి తిరిగి ధరణికోటవద్ద అనపోతారెడ్డికిని పద్మనాయకులను యుద్ధము జరిగెను. దీనిలో అనపోతారెడ్డి గజ, హయ, రథాదిసాధనములన్నియును హతమాయెను. అనపోతడు ప్రాణములకై పారిపోయెను ఇదియును వంశావళిని బట్టియే తెలియు చున్నది.

దన్నలకోటముందర మదగ్రిమిలోద్ధతి గంగదారి సం
పన్నబలుండు సింగజనపాలుని మాదడు రెడ్డిపోతనిఁ
బన్నినసేనలు దునిమిపాఱగదోలె"—ననియును
...మాధవాధిపునిధాత్రీ భీతివిభ్రిష్టసాధనుడై దన్నలకోట

యొద్ద ననపోతారెడ్డి మానంబుసిగ్గును బోనాడి రయంబునఁ బాఱె 10 ననియును వ్రాయబడినది. వీని సత్యమింకను విచార్యము. కాని రెడ్లకును, పద్మనాయ

(7) వెలు వం॥ పుట 21
(8) ,, పుట 36
(9) ,, పుట 80
(10) ,, పుట 80

కులకు కృష్ణా గోదావరీ మధ్యప్రదేశమునకు జరిగిన యుద్ధములలో రెడ్లు ఓడిపోయిరని యును ఊహించవచ్చును. ఇంతమాత్రముచే రేచెర్లపద్మనాయకులకు ఆరాజ్యము లభించలేదు. అనపోతారెడ్డి 1358 వ సంవత్సరమునాటికే దివిసీమ, గుడివాడ విషయము ప్రస్తుతము బందరు తాలూకాప్రదేశములను ఆక్రమించుకొని పాలించుచుండె ననుటకు నిదర్శనములు కలవు. శాలివాహనశకము 1280 సంవత్సరమున అనపోతారెడ్డి కొల్లూరి గ్రామమునకు అన్నపోతపుర మని పేరుపెట్టి, బ్రాహ్మణులకు సర్వాగ్రహారము ధారాపోసెను. ఈ కొల్లూరు మలాపహానదీతీరమున నున్నటుల వ్రాయబడినది. ఈ మలాపహా నదీతీరమందలి గ్రామములు మరికొన్ని యితరప్రభువులచే ఇంతకుపూర్వమందును బ్రాహ్మణులకు కూడ దాన మివ్వబడినవి. సుప్రసిద్ధపరిశోధకులు ఈ మలాపహానది ఏది, యను విషయమున భ్రమపడుచున్నారు. అన్నపోతారెడ్డి స్వబాహుబలముచే జయించిన దేశములోని దీనదియును, గ్రామమును గావున దీనియునికి నిశ్చయించుట అవసరము.

మలాపహా, మలాపహారి, మలఘ్ని అను పేళ్ళతో వుదహరింపబడిన దీ యేరు. ఇప్పుడిది కనపడదు. కాపయనాయకుని గురజ శాసనములో దత్తగ్రామము పోలవరమీ మలఘ్నీనదీతీరమున నున్నటుల వర్ణింపబడినది. పై శాసనములోని గ్రామసీమాచిహ్నములలో సరిహద్దు గ్రామపు పేరు వేరొకటిలేదు. తుప్పలు, కొంకలు, పొదలు మాత్రమే సీమాచిహ్నములుగా తెలుపబడ్డవి.[11] ఈ శాసనమును ప్రకటించిన సోమశేఖరశర్మగారు, తమ సంపాదకీయవ్యాఖ్యనందు మలఘ్ని యనునది కృష్ణా, గోదావరీ, గుంటూరి మండలములలోగాని నైజాముమండలములోగాని లేదనియును, కోటిపల్లిదరిగా ప్రవహించు గౌతమీశాఖ "మాతృగమనాపహారి" యను పేరిటిదనియును, అదియే మలఘ్ని యనియును వ్రాసినారు. తత్సమీపమున వెనుకగా అమలాపురము తాలూకాలోని ముమ్మడివరసమీపమున గోదావరీతటమున పోలవరము కలదనియును అదియే శాసనోదాహృతమైన పోలవరగ్రామ మనియును వ్రాసిరి. కోటిపల్లిదగ్గర నదికి గౌతమి యనియే వ్యవహారము. స్థలపురాణములో దాని మాహాత్మ్యము వర్ణింపబడినది మాతృగమనాపహారి యని గౌతమికి విశేషణము. అచ్చట స్నానము మాతృగమనాపహా దోషహరము. నదిపేరది కాదు.

అనపోతారెడ్డి పై శాసనములోని దత్తగ్రామము మలాపహానదీతీరమందలి కొడూరుగ్రామము. దీనికి సరిహద్దుగ్రామములు సంకనిపల్లి విన్నకోట కనుమెళ్ల, పొట్టి

---

11. J. B. O. R. S. 20 — 260-274.

పాడు, కలువపూడి, గురుంజకోడు, పాలపత్తి, వట్లూరిగ్రామములు, కృష్ణాజిల్లా, గుడివాడ తాలూకాలోనివి. గురుంజ, గురజ; పులపట్టు, పులిపాడు; సంకనిపల్లి, సంకర్షణపురము; సందేహములేక మలాపహారి గుడివాడతాలూకాలోని యేఱని ఊహించవచ్చును. డంకేఱు, వన్నేఱు దీనిలోనికి ప్రవహించు గడ్డలు. పెదకోమటివేమారెడ్డి తమ్ముడు మాచారెడ్డి బంక మల్లయ్య అను బ్రాహ్మణునికి ఏకమూరు అను గ్రామము దానము చేసెను. ఈ ఏకమూరు నూజవీడుతాలూకాలోనిది. ఈ శాసనములో ఏకమూరు మలాపహారిణీ భీమరథ్యంతర్వేది సంస్థితమని చెప్పబడినది. ఈ మలాపహారికియును, భీమరథియును కలసినవనియును వీనిమధ్యనున్న ఖండమందు—అంతర్వేదియందు—ఏకమూరు కలదనియును ఊహించవచ్చును. అనంతామాత్యుడు భోజరాజీయములో తనయూరు పెరుమగూరు అనియును, అది కృష్ణవేణీ, భీమరథీనదీత్రయాంతర్వేదిలో నున్నదని చెప్పినాడు. భీమరథికూడ కృష్ణాజిల్లాలోని ఏఱే. కృష్ణ కానకట్ట కట్టబడినతరువాత భీమరథి, మలాపహారుల పూర్వస్వరూపములు మారి కాలువ లైనవి. భీమరథి, భీమకాలువ, అనుపేరుతో మురుగుకాలువగ నున్నది. కోడూరు, జుజ్జవరము, గురజవిన్నకోట పుల్లేటిసమీపమున నుండుటచే, పుల్లేరు మలాపహారియని గుర్తింపవచ్చును. అనవేముని దృజ్జవరపుశాసనములో ఈమలాపహారి ప్రశంస కలదు. దృజ్జవరము మలాపహారీతటమందు కలదు. "మలాపహారీతటే కర్తీదేశే, గ్రామోయమేధతే" మలాపహారి ఒడ్డున కర్తీదేశమందీగ్రామము వర్ధిల్లుచున్నదని వ్రాయబడినది. ఈ గ్రామసరిహద్దులలోని పెరికపల్లి గుడివాడతాలూకాలోనిదే. కాపవరమును, దగ్గుబల్లి, దగ్గుమిల్లియు అచ్చటివే. తాపట్టు, బెజవాడగట్టు కృష్ణాజిల్లాలోనివే. దీనినిబట్టి కోడూరు గుడివాడతాలూకాలోనిదని చెప్పుటకె తిమాత్రమును సందేహింపపనిలేదు. ఈ ప్రాంతము అనపోతారెడ్డి పరిపాలనక్రిందకు వచ్చియుండెను. ధరణికోటలోని పరాజయములవల్ల అనపోతారెడ్డికి రాజ్యభంగ మేమియు కలుగలేదు. పద్మనాయకుల కీప్రదేశము తరువాతకూడ నెన్నడును స్వాధీనము కాలేదు.

### అనపోతారెడ్డి — చోడభక్తిరాజు.

అనపోతారెడ్డికి కృష్ణా గోదావరీద్వయ మధ్యదేశము అంతయు స్వాధీనము కాలేదని వ్రాసియున్నాము. ఆనాటికి ఈప్రదేశము పాలించుచున్న సుప్రసిద్ధ మాండలికవంశములు తిరిగి తిరిగి అనపోతారెడ్డిని యెదుర్కొని గొప్పయుద్ధములు చేయుచు వచ్చిరి. ఈ మండలికవంశములలో ముఖ్యములు మూడు, నాలుగు కలవు.

ప్రస్తుతపు పడమటిగోదావరిజిల్లాలోని భీమవరముతాలూకా, నూజవీడుతాలూకాలను, జల్లిసీమయును ఉండిరాజుల వశమునందుండెను. వీరు సూర్యవంశపు క్షత్రియులు. హరితసగోత్రులు. రావులపర్తిశాసనమందు[12] వీరి రాజధాని కూరవరపట్టణమని[13] చెప్పబడినది. ఇది నూజవీడుతాలూకాలోని గ్రామము. దేవరాజు ఈ వంశమూలపురుషుడు.

వీరు చోడులతో సంబంధబాంధవ్యములు కలిగియుండిరి. చోడభక్తిరాజకుమారుడు అన్నదేవుడు, శ్రీ చక్రవర్తి కుమార్తెయును, పినయుండి రాజు సోదరియునగు ఇరుగాంబికను వివాహమాడెను[14] ఈ చక్రవర్తి క్రీ. శ.[15] 1382 లో రాజ్యము చేయుచున్న ఈ ఉండిసకు (పెదఉండ్రాజునకు) ఎట్టిజ్ఞాతియో తెలియుటలేదు. బహుశః ఈతడు యుండిరాజు, పినతండ్రికొడుకై యుండవచ్చును. రావులపర్తిశాసనము పెదఉండిరాజు, వెంగు అను వారలచే ఇవ్వబడి తద్దానపత్రిక వారల స్వహస్తాక్షరముల కలిగియున్నది. రాజమహేంద్రవర మ్యూజయమునందలి శాసనములో అనదేవుని భార్య ఇరుగాంబిక పినయుండిభూపుని తోబుట్టువనియున్నది. ఈపినయుండి సహాయముతోనే అనదేవుడు కాంకజపర్తి యుద్ధములో కన్నడరాజుసేనలను వధించెను. ఈఉండ్రాజుల పేరనే, ఉండ్రాజవరము, ఉండీశ్వరపురమిత్యాది నామాంకితములుగల గ్రామములు వెలసి నేటికి వారల కీర్తిప్రతిష్ఠలను వ్యాపింపచేయుచున్నవి. వీరు స్వతంత్రులై వైరి జన భయంకరులైన మాండలికులుగా నుండిరి. వీరీప్రదేశమును చిరకాలమునుండి పరిపాలించుచు, నిడుదవోలి చక్రవర్తులతోను, వేఱువ భీమునివంశ్యులగు చోడులతోను సంబంధములు కలిగి బలవంతులై ఇప్పటి పడమటి గోదావరిజిల్లా కృష్ణాజిల్లాలోని భాగములను, అనగా నూజవీడు, ఏలూరు, భీమవరము తాలూకాలు వశమందుంచుకొనిరి. ఈ ఉండిరాజులు, పడగోటమల్ల రాజవేశ్యాభుజంగ, యోధనందిమేరు, అన్నదాన దీక్షా గుర్వాది

12 కూరవరపట్టణము నూజవీడు తాలూకాలోనిది. ఇది మాండలికుల రాజధానిగా చిరకాలము నుండి, ఉండినట్లు తోచుచున్నది. శివయోగిసారములో ఇందులూరి అన్నయదేవుడు, వేగిధరిత్రిలోవిలసిల్లు కూరవరమున గన్నయరుద్రుడుండి జల్లిసీమను పరిపాలించుచున్నట్లు వ్రాసినాడు. కాకతీయసంచిక అనుబంధము పుట 14 కూరవరము, ఉండికి నామాంతరమేమోయని వీరభద్రరావుగారు సందేహపడినారు. కూరవరము వేరు ఉండి, వేరు.

13. (ఆంధ్రులచరిత్రము. vol. 3 page 19) M.E.R. Part II-1917-18. C.P. No. 16

14. J. A. H. R. S. vol. 1 page 172—189; G. P. Nos. 26—42—48

15. M. E. R. Part II (1917 & 18) C. P. 16

బిరుదులగలవారు ఈ ఉండికులు. శంకరభక్తులు. పరమశైవులు రావులవర్తికి ఉండేశ్వరమును పేరిడి ఈ ఉండిరాజుచే గ్రామము శా 1304 శలో దానమివ్వబడినది. ఈ వంశమువారు సుమారొక అర్ధశతాబ్దకాలము కొండవీటిరెడ్డిరాజులకు పక్కలోని బల్లెముపలెనుండిరి. వీరిని జయించువరకు గోదావరీ పర్యంతదేశము కొండవీటిరెడ్లకు స్వాధీనము కాలేదు.

నిరవద్యపురము లేక నిడుదవోలు. నిడుదవోలురాజధానిగా మానవ్యసగోత్రీకులగు చాళుక్యులు తత్పరిసరప్రాంతముల పరిపాలనచే చిరకాలమునుండి చేయుచుండిరి. వీరు విశేషరాజ్యము ఏలకపోయినను, వీరికి ఆంధ్రదేశమున గౌరవము మెండుగనుండెను. ఈవంశములోని ఇందుశేఖరుని కుమారుడే వీరభద్రుడు. ఈ వీరభద్రుడే కాకతిరుద్రమదేవిభర్త. ఈతడు యువవయస్సులోనే మరణించెను. ఇందుశేఖర మహారాజునకును ఉదయమహాదేవికిని బుట్టిన కుమార్తె-చాళుక్య వీరభద్రుని చెల్లెలయిన-అక్కమాంబాదేవి, కోనమండలాధిపతియు హైహయవంశజుడును అగు భీమరాజు భార్య. వీరికుమారుడే కోనగణపతి. వీరికి కోనగణపతి దేవునకు, నిడుదవోలిచక్రవర్తి మహాదేవరాజు కూతురైన ఉదయమహాదేవినిచ్చి సంబంధము కలుపుకొనినారు.[16] పోలయ వేమారెడ్డి, అనపోతారెడ్లకాలములో, ఈ మహాదేవరాజు నిడుదవోలినుండి రాజ్యముచేయుచు, వారలనెదుర్కొనెను.

<u>కోనహైహయులు</u>:—వీరు నిడుదవోలిచక్రవర్తులతో సంబంధులు. ఫలవంతమగు కోన చిరకాలము హైహయవంశజుల స్వాధీనములోనుండెను. క్రీ. శ. 1256 లో అనపోతారెడ్డి కోన జయించినపుడే హైహయులపై విజయము సాధించియుండెను[17] కాని సమూలముగ ఇంతమాత్రమున పెకికివేయబడలేదు.[18] వీరిలో చివర పరిపాలించినది కోనగణపతిగా కనుపట్టుచున్నాడు.

ఏలువచోడులు: - భక్తిరాజు:

రెడ్లరాజ్యము తూర్పున విస్తరించుటకు సుమారు యాభై సంవత్సరములు అడ్డుకొన్న దీ ఏలువచోడవంశము. వీరి వంశకర్త ఏలువభీముడు. ఈతనికే నల్లభీముడని

16. కొలను పాకశాసనము—తెలింగాణా శాసనములు—Page. 80–82.
ఆంధ్రులచరిత్రము—కాకతీయయుగము—vol. V-(1936) పుట 467–469.
17. S. I. I. vol. V. Nos. 121; 122; 123; 124; 125; 127;
18. S. I. I. vol. IV. Nos. 1387.

నామాంతరము.[19] వీరి వంశపుపట్టు కడపమండలములోని ఏఱువ ఇప్పుడు జీయేఱువగ్రామము నశించిపోయినది. ఇది కమ్మనాటికి పశ్చిమభాగమునను, అనగా కడపజిల్లాలోని బదివేలు, సిద్ధవటము తాలూకాలోను, కర్నూలుమండలములోని మార్కాపురం తాలూకాలోను చేరియుండను. కడపజిల్లాలోని ప్రొద్దుటూరితాలూకాలోని ఏఱువ పలెము పూర్వపు ఏఱువకు సమీపమున నుండెనని ఊహింపవచ్చును. ఈ ఏఱువమాండలికులు సూర్యవంశపు క్షత్రియులు; కరికాలచోడుని వంశజులని వీరి వంశప్రశస్తులు. మనకు దొరకిన కంద్వకొలను, రాజమహేంద్రవర మ్యూజియం శాసనములలో వీరికూటస్థుడు పైనవ్రాసిన ఏఱువభీముడను నల్లభీముడు. ఈతని తండ్రిపేరు తెలియరాదు. చాళుక్యములలో విశేష అవదానస్తుతిపాత్రుడైన మైలమభీముడును, నల్లభీముడు అనబడు ఏఱువభీముడును ఒక్కడేయని నేనొకప్పుడు అభిప్రాయపడితిని. శ్రీ ప్రభాకర శాస్త్రులవారుకూడ అట్టిఅభిప్రాయమునే వెలిబుచ్చిరి. కాని భక్తిరాజు కంద్వకొలను శాసనమును ప్రకటించిన టి. యన్. రామచంద్రన్ గారును, సుప్రసిద్ధచరిత్రకారులగు డాక్టరు నేలటూరి వెంకటరమణయ్య గారును దీనిని శంకించియున్నారు. అనదేవుని రాజమహేంద్రవర శాసనములో ఏఱువ భీమభూపాలుని తండ్రిపేరుగల రాగిరేకు పోయినది. దొరకిన భాగములో "యుద్ధాంగణమందు చనిపోయిన ఆ వీరవరుని భార్య అన్నమాంబ; 'జాతి స్తనూరంభవ దేఱువ భీమభూపః" వారలపుత్రుండు ఏఱువభీముడు" అని యుండుటచే ఏఱువభీముడు అన్నమాంబాపుత్రుడని బలవత్తరమైన యూహ పొడముచున్నది. ఇది సరియైనచో ఏఱువభీము డన్నమభీముడగును; కాని మైలమభీముడు కాజాలడు. మైలమభీముడుకూడ ఏఱువరాజవంశములోనివాడే. ఈతనితల్లి మైలమదేవి శాసనమొకటి। శా. శ. 1043 నాటిది దాక్షారామ దేవాలయమున కలదు.[20] ఈశాసనమును బట్టి ఆపెభర్తపేరు ఏఱువతొండయరాజయినట్లు తెలియుచున్నది. అందు "సమధిగత పంచమహాశబ్ద, మహామండలేశ్వర, వీరమాహేశ్వర, కోడూరుపురవరేశ్వర, సూర్యవంశోద్భవకులతిలక, కాశ్యపగోత్ర, కరికాలాన్వయాది సమస్తప్రశస్తి" సహితులని ఏఱువతొండని బిరుదావళి కలదు. ఈతడు పశ్చిమచాళుక్యచక్రవర్తి యగు త్రిభువనమల్లుని సామంతుడు. నల్లభీముడను నామాంతరము కలిగిన ఏఱువభీమునకీతొండనికిని ఎట్టి సంబంధముకలదో నిర్ణయింప వీలుచిక్కలేదు. చోడవంశవ్యాసమునందు వడ్డాది శ్రీరామ

---

19. చోడభక్తిరాజు కంద్వకొలనుశాసనములోని వంశావళియును, అనదేవుని రాజమహేంద్రవర శాసనములోని వంశావళియు పోల్చిచూచిన, ఈ విషయము తెలియవచ్చును.

20. S.I.I., IV — No. 1216.

చంద్రమూర్తి "అన్నమాంబ ఏఱువతొండయరాజుల రెండవ భార్యయనియును, మైలమ మొదటిభార్యయనియును, నల్లభీమ, మైలమభీమ, ఏఱువభీమ నామములొకేవ్యక్తి సంకేతములనియును వ్రాసి, యుపపత్తులను చూపినాడు.[21] కాని వీరియూహ సరియైనదనుటకు ప్రస్తుతమున్న ప్రమాణబలము చాలదు. మైలమభీమ, నల్లభీములు వేరని చెప్పుటయే సమంజసమనియును, రామచంద్రన్, డాక్టరు వెంకటరమణయ్యగార్ల అభిప్రాయములు సరియని ఒప్పుకొనవలసియున్నది.[22] వీరివంశవృక్ష మీక్రిందివిధముగ నున్నది.

=అన్నమాంబ
|
నల్లభీముడనెడి ఏఱువభీముడు = పోలాంబిక
|
దామన్నపాలుడు = లక్ష్మి
|
సోమభూపతి = సూరాంబిక
|
గంగాధరుడు=ఇరుగాంబిక. ఈ ఇరుగాంబిక సోమవంశపు కామరాజు కుమార్తె; [వెంగభూపాలుని సోదరి.
|
భక్తిరాజు లేక కామరాజు = అన్నమాంబ
|
అనదేవుడు = ఇరుగాంబిక. పినయుండిరాజు సోదరి; శ్రీచక్రవర్తి కుమార్తె.

వీరభద్రుడు.

ఇందు వంశకర్తగా పేర్కొనదగిన ఏఱువభీముని సాహస, పరాక్రమములు చాటువులందు వర్ణితమైనవి. కాళ్ళప్రొద్దుటూరునందలి శాసనములో ఈ ఏఱువభీము డొక్కధాటీవిజృంభణమున వీసరనాడును, చక్రగొట్టమును, మన్యమును, వడ్లకేల్కియయును, వేంగి, కళింగాది మండలముల జయించినట్లు చెప్పబడినది.[23] ఈ దేశములను ఏఱువ

---

21. ఆం సా. ప. ప. 29, పుట 77-84

22. చిక్కభీమ, మైలమభీము లొక్కరు కారు. వేర్వేరువంశములలోని పురుషులు. చూడు- శ్రీరామచంద్రమూర్తిగారి చోడవంశము. ఆం సా. ప ప. 20—77, 84.
,, 30. 30—112, 115.

23 శాసనపద్యమంజరి- పుట 94. ఇందులోనిపాఠమునకును శ్రీ ప్రభాకరశాస్త్రిగారి చాటుపద్యమణిమంజరి (2 వ భాగములోని 59) పద్యమునకు పాఠమునకును కొంచెము వ్యత్యాసము కలదు.

భీము డెవ్వడు యేసందర్భమున జయించెనో చెప్పుటకు ఆధారములు చాలవు. పశ్చిమ చాళుక్య సామంతులైన ఏఱువతొండని కాకతీయులు జయించి, ఏఱువ విషయమున కాకతీయులు తమ సామ్రాజ్యములో కలుపుకొనియున్నారు. కాకతీయనాయకులలో 'ఏఱువతొండ గోధూమ ఘరట్టఘరట్ట' యని గోన గన్నారెడ్డికిని, "ఏఱువభీముని సప్తాంగహరణకారి" యని పలచెళ్ళవారికిని, "ఏఱువరాజు రాజ్యస్థాపనాచార్య" యని ఏటుకూరివారికిని, "ఏఱువతొండభూపతి తలగుండుగండ" యని నిడిమానివారికిని బిరుదులు గలవు. ఈ యేఱువ, బ్రహ్మరాక్షస గండపెండేర గంగయసాహిణి మహామండలములోనిది.[24] గంగయ్యసాహిణిని కాకతిగణపతిదేవుడు నిర్జించి, మండలాధిపతిగ నియమించెను. గంగయసాహిణి సామంతులగు ఏఱువమాండలికులు బహుపరాక్రమవంతులై అనేకులగు నాయకుల పైనధికారులై యుండిరి.

తూర్పుదేశ కాకతీయుల చక్రవర్తుల విజయయాత్ర అనగా వేగి, కళింగ, మన్నె రాజ్యములు తూర్పుదేశవిజయయాత్ర ఏఱువమాండలికులు ప్రధానస్థానమునువహించినట్లు తోచెడిని. ఈ యేఱువ భీముడుకూడ కాకతీయరుద్రమదేవి కాలమున నుండెనని ఊహించ వచ్చును. ప్రతాపరుద్రుని డెబ్బదేడ్గురు నాయకులని వర్ణింపబడినవారిలో కొందరు యేఱువ రాజులకింద సామంతులు గానున్నట్లు తోచుచున్నది. అరవెల్లి నాయకులు ఏఱువ తొండని దక్షిణ భుజాదండములనియును, పెంటాలివారు, ఏఱువరాజ్య మూలస్తంభులనియును, కొమరవెల్లివారు ఏఱువరాజు మూలస్తంభులనియును, ఏఱువతొండ దక్షిణభుజాదండములనియును, బిరుదులు వహించినారు. అలఘుచర్ల పద్మనాయకుల బిరుదావళిలో, ఏఱువ రాజులకు, ఒక పల్లవరాజునకును జరిగిన యుద్ధము వర్ణింపబడినది. "పల్లవుండను రాజు, ఏఱువ సింహాసనంబునకెత్తినడచిన, ఏఱువరాజు తన అలఘుచర్ల నాయకవర్గంబుల బిలపించి, కదనంబున కేర్పరిచి, తురంగంబుల...ఆయుధప్రవీణులై పంచమహాశబ్దంబులతో పురంబువెడలి, యుద్ధసన్నద్ధులై తలపడి, భద్రగజంబులు కదళ్యంబున కేసిరినట్లు సింహంబులు పోరాటంబునకు చేరినట్లు, ఒండొరులమీద తమదండంబులెత్తి మొత్తిన తుత్తునియలై ... ... శరణంబు వేడిన గాచి పల్లవులబిరుదులు గైకొని, తమ్మేలిన ఏఱువరాజు సముఖంబునబెట్టి విన్నవించిన, ఆన్నపాలుడు మెచ్చి యిచ్చినబిరుదంబులు"—అలఘుచెర్లవారానాటినుండియు, ఏఱువరాజ్యస్థాపనాచార్యులని బిరుదువహిం

24 L. R. VII, 80. అంబదేవుడు "గండికోట, ములికినాడు, రేనాడు, పెన్నాతవాడి, పెడకల్లు, సకిలి యేఱువ పొత్తపినాడు" మొదలగు దేశములు పాలించినట్లు వ్రాయబడినది.

చిరి. కాని తరువాత ఎప్పుడో, ఏఱువసింహాసనమునుండి ఈ చోడులు వెడలగొట్టబడి నారు. ఈ ఏఱువ భీముడు మూర్తిట్ల పద్మనాయకులవలన సంహరింపబడినట్లు వారి బిరుదములోని ఏఱువ భీముని శిరచ్ఛేదనయను బిరుదువలన తోచుచున్నది. జూపల్లివారి ప్రశస్తిలోని

ఏఱువసింహాసనమున
కేరిపాలింపరాజు కీలస్త్రెమునన్
నేరువున కలిమిబలిమిని
శూరతనిన్నన్నియెన్న జూపలిచెన్నా"

పద్యముబట్టి ఏఱువవిషయము చోడుల హస్తములలోనుంచి జూపల్లె పద్మనాయకులచేతు లలోనికి వచ్చినదని నిస్సంశయముగ చెప్పవచ్చును. ఏఱువ భీముని యనంతరము అతని వంశస్థులు కృష్ణా గోదావరీ మధ్యదేశమునందు మండలికులై యుండి, 1323 సంవత్సరములోని విప్లవములో, స్వతంత్రులైరి. అంతేకాని వారికేఱువలో ఏఱువ భీముని యనంతరము ఎట్టిరాజ్యమును లేదు. భక్తిరాజు కిందవ్రోలను శాసనములో కాని, రాజమహేంద్రవరశాసనములో కాని, భక్తిరాజుకు పూర్వపువారెవరును ఏ రాజ్యమును పాలించినటుల చెప్పలేదు.

భక్తిరాజు విజయములు:— కామరాజు అనెడి భక్తిరాజు తనపేరిట కామపురి యనెడి నగరమును నిర్మించెను. ఈ కామపురవర్ణన విశేషముగా రాజమహేంద్రవరశాసనమున చేయబడినది. ఇది బహుశః ఎల్లవరము డివిజన్‌లోని కామవరమయి యుండును.[25] భక్తిరాజు రాజ్యవిస్తీర్ణము ఎంతయును కాన్పించుటలేదు. కాని భక్తిరాజు కుమార్డు అనదేవుడు మన్నెము, వేసినాడు, వేంగినాడు, ములయము. భీమవ్రోలసీమ, తూర్పు నాటి అగ్రహారాల సహితమైన సమస్తభూమియు యేలెను. భక్తిరాజు కాలములో కూడ ఈభూమియే ఈచోడులవశమందుండెననుట నిర్వివాదము. భక్తిరాజు మహా వీరుడు. యౌవనవయసుననే గుల్పూడి సమీపమున ఇతడు బొగ్గరాది యవనులను జయించెను. తూర్పుదిక్కున గజపతిని పంచనాళ్లనడ్డ నోడించి, కొప్పులపతికి పట్టముగట్టెను.

25. చూడుడు — ఈసంచికలోని కొప్పులవంశమను వ్యాసము — పుటలు 145-162

26. కళింగసంచిక పుట-632 to 635

27. నేను అనదేవుని రాజమహేంద్రవరపు శాసనమును ఆంధ్రపత్రికా పరిశోధకమండలివారి పత్రికలో ప్రకటించి నిపుడిది కామవరపురోలయని ఊహించితిని. కాని అది సరికాదేమో అని తోచుచున్నది.

సింగభూతలపతిని భరణిపాటిసమీపమున కొట్టెను. డబరుఖాను మొదలగు యవనులను పెదకొండపురివద్ద జయించెను; పీరాన్నవోతన్నపతిని, సూరవరసమీపమున క్రీడయందువలె, వినోదముతో నిర్జించెను.

భొగ్గరాదియవను లెవరో తెలియరాకున్నది. ఈ యవనులను భక్తిరాజు చిన్న వయసుననే జయించెననుటచే, ఈవిజయము 1323 సంవత్సరము తర్వాత తుఘ్లుకు చక్రవర్తిపైననుటకు సందేహము లేదు. ఈయుద్ధము జరిగిన స్థలము గులపూండి సమీపమున నున్నదని చెప్పబడినది. ఈ గులపూండి ప్రస్తుతపు పడమటి గోదావరిజిల్లాలోని నూజవీడు తాలూకాలోనిది అని చెప్పవచ్చును. ఈ గులపూడి ఏలువ సమీపగ్రామము కానేరదు. ఏలువభీముని కాలములోనే ఏలువవిషయము అన్యాక్రాంతమై పోయియుండెనని పైన వ్రాసియున్నాము. భీముని కుమారుడో, పౌత్రుడో, గోదావరిసమీప ప్రాంత దేశము మాండలికత్వము సంపాదించియుండును.

భక్తిరాజు పంచధార్లవద్ద జయించిన గజపతి కళింగరాజగు మూడవ నృసింహదేవుడో (1328-1352) లేక అతని కుమారుడగు మూడవ భానుదేవుడో (1353-1378) నిశ్చయముగ చెప్పజాలము.[28] కొప్పులవారి రాజ్యము పిఠాపురము మొదలు సింహాచలము వరకును వ్యాపించియుండెను. కొప్పులకాపయ 1338 మొదలు 1360 వరకును, అతని కుమారుడు ప్రోలయ 1361-1368 వరకును పరిపాలించియుండిరి.[29] ఈ కొప్పుల వంశ్యులలో రెండవకాపయ మిగులసమర్థుడు. ఈతడు చనిపోయిన తరువాత నీతనికుమారుడు ప్రోలయనాయకుడు రాజయ్యెను. బహుశః ఈసమయములో, కళింగరాజగు మూడవ భానుదేవుడు కొప్పులవారి రాజ్యముపై దండెత్తిరాగా, భక్తిరాజు సహాయములో, కొప్పుల ప్రోలయనాయకుడు పంచధారాంగణమున కళింగ గజపతిని జయించి యుండును. అనదేవుని శాసనములో భక్తిరాజు గజపతిని జయించుటయేకాక కొప్పులపతికి పట్టాభిషేకమొనర్చినట్లు కూడ చెప్పబడినది. ఇది క్రీ. శ. 1361 ప్రాంతమున జరిగియుండవచ్చును. ఈ యుద్ధములో గజపతికి కోరుకొండ రెడ్లు సహాయము చేసిరని చెప్పుటకు ప్రమాణము లేదు. కోరుకొండ రెడ్లు కొప్పులవారి రాజ్యమునకును, భక్తిరాజు రాజ్యమునకును మధ్యనుండుటచే, వారిరువురకును వ్యతిరేకముగ కళింగునకు సహాయమునకు పోవుటగాని, కొప్పులవారిపై దాడి వెడలుటగాని సంభవించదు. అతరు

28. కళింగ సంచిక పుట—632 టు 637.

29. చూడుము—ఈ సంచికలోని "కొప్పులవంశమను వ్యాసము—పుటలు 145—162

ణములో భక్తిరాజు కొప్పులవతులు కోరుకొండరాజ్యమును సులభముగ ఆపోసనము పట్టియుందురు. మంచికొండ రెడ్లకును, కొప్పుల రెడ్లకును విరోధమున్నట్లు చెప్పుట కెట్టి యాధారమును లేదు.

### భక్తిరాజు—సింగభూపతి.

భక్తిరాజు, భరణిపాటిపురీసమీపమున యుద్ధమందుజయించిన 'సింగభూతలపతి' ఎవరు? ఆకాలమందు 'శింగ' నామధేయులు ఇద్దరుండిరి. వారిలో ఒకరు రేచెర్లాన్వ యులు. రాచకొండరాజధానిగా ఎఱదాచానేనిపుత్రులైన సింగానాయునివారు. రెండవ వారు మంచికొండ గోత్రిజులు. కోరుకొండ రాజధానిగా, ఉభయగోదావరీ మధ్య దేశములైన చెంగర, కరవ్వాట, కోన, పానారములను పాలించిన ముమ్మిడినాయకుని తమ్ములు సింగనాయకులు. ముమ్మిడినాయకుడు ఒక తమ్ముని సింగయనాయకుని కోటి గ్రామమందును, మరియొక తమ్ముని గంగయనాయకుని తాడిపాకయందును నిలపి తాను కోరుకొండయందుండి రాజ్యపాలన సాగించుచుండెను. అర్యవట శాసనములోని[30]

కోట్యాంపురి శ్రీ సుభగోరు కోట్యాం సతాడిపాకే సుకృతైకపాకే।
యథాక్రమం తావనుజేనిధాయ తాభ్యాం సమేతో వసుధాం ప్రశాస్తి॥

ఈ సింగయనాయకుడు శా॥శ 1290 సంవత్సరమున సుప్రసిద్ధ ఆయుర్వేదవైద్యుడగు వరహితాచార్యునికి, అక్కలపూడియను గ్రామమునకు ముమ్మిడిసింగవరమని పేరుపెట్టి అగ్రహారముగా నొసగెను. ఈసింగవరపు రెల్లలు శాసనమునం దివ్వబడినవి. ఇది రాజమహేంద్రవరం తాలూకాలోని గ్రామము. వంగలపూడి యస్టేటునకుచెంది ఇప్ప టికిని సింగవరమని పిలువబడుచున్నది. ఈ కోరుకొండనాయకుల శాసనములబట్టి వీరు ఇతరదేశములపై దాడివెడలినట్లుగాని, శౌర్యసాహసములు చూపినట్లుగాని కనపడదు. కొప్పులరెడ్లకును వీరికిని విరోధమున్నట్లు చెప్పుటకు కారణములు లేవు. కొందరు చరిత్ర కారులు, ముమ్మిడినాయక సింగయనాయకులు కొట్టాము (ప్రస్తుతము తునిడివిజన్) వరకును గల కొప్పులవారి రాజ్యము ఆక్రమించుకొనుటచే వైరమేర్పడినదని అభిప్రాయ పడుచున్నారు.[31] ఇది తప్పుటూహ. సింగయనాయకుడు "కోట్యాంపురి" యం దుండి రాజ్యముచేయుచుండెనని వ్రాయబడినది. ఈ "కోట్యాంపురి" అనగా కొట్టా

30. ఆంధ్రభారతి—సంపుటము 3—పుట 4 Ep. Ind. XIII—259

31. E.P. Ind. XXVI page 24.

మని వారభిప్రాయపడియున్నారు. కీర్తిశేషులగు శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు కూడ కోట్యాంపురిని కోట్టాముతో సరిపెట్టినారు.[32] ఇది యసంగతము. కొట్టామునుండి సింగానాయకుడు ఎన్నడును పరిపాలన జరుపలేదు. కోటియనునది రాజమహేంద్రవరపు తాలూకాలోని గ్రామము. కోటీ అనుదానికి సప్తమీ ఏకవచనము "కోట్యాం" శాసనములో పురియనునది 'పురే' అని ఉండవలయును. "కోట్యాంపురే" అనగా కోటియను నగరమందు అనియర్థము. ఈ కోటి సింగయనాయకుని రాజధాని. దానమిచ్చిన సింగవరముకూడ రాజమహేంద్రవరపు తాలూకాలోనిదే. కోటికి దగ్గరదే. శ్లోకములోని "సతాడిపాకే సుకృతైకపాకే" అను సప్తమ్యంతములుపైన వ్రాసినదానినే దృఢపరచుచున్నవి. విభక్త్యంతమును పేరిలోనిభాగముగా వీరభద్రరావుగారు పొరపడియున్నారు. శాసనములో 'కోట్యాపురియని లేదు.' కోట్యాంపురీయని స్పష్టముగానున్నది. కొత్తాముకును 'కోట్యాంపురీ' కి శబ్దసాదృశ్యమైనను లేదు. పైరెంటిని నొకటిగా ఊహించుటకు అవకాశమేమియు లేదు. పొరపాటువలన కొవ్వూలవారి కొత్తామునుండి సింగయనాయకుడు పరిపాలనము చేసినటుల ఊహించుట కవకాశము కల్గెను. కొత్తామెన్నడును కోరుకొండరెడ్ల స్వాధీనములోలేదు. మంచికొండ ముమ్మిడినాయకుడు, భక్తిరాజునకును ఎట్టివైరమును ఉన్నటుల గాని యుద్ధములు జరిగినటులగాని ఎట్టియాధారమును లేదు. భక్తిరాజు నిర్జించిన సింగభూతలపతి, మంచికొండసింగయకు కాడని సుస్పష్టము. ఇక అప్పటి రెండవ "సింగభూతలపతి" రేచెర్ల ఎఱదాచానాయుని కొడుకగు సింగానాయుడు. ఈతడు బహు పరాక్రమవంతుడు. ఈతడు బహుశః క్రీ. శ. 1320 మొదలు 1360 వరకును తెలింగానమునందు రాజుకొండను పాలించుచుండెను.[33] ఈతని వీరకృత్యములను వర్ణించు పద్యము లనేకములు వెలుగోటివారి వంశావళిలో కలవు. ఈతడనేక దాడులు దిగ్విజయార్థమై చేసెను[34] ఈతడే మొదట ముసునూరి కాపయనాయకునిపై తిరుగుబాటుచేసెను. "కాపభూపతిని కదనమున" సింగనాయుడు గెలిచినటులనె వంశావళిలో చెప్పబడినది. ఈతడు కృష్ణాగోదావరీద్వయమధ్యదేశముపై చేసిన దాడులలో, భక్తిరాజునకును ఈతనికిని సంఘర్షణము పొడమి, భరణివాటివద్ద భక్తిరాజుచే జయింపబడియుండును.

32. ఆంధ్రుల చరిత్రము—సంపుటము—3—పుట 123.

33. V.V.C. Introductions page 10. The beginning of Anapota and mada's reign is given as 1360.

34. V. V. C. పుట 16. చూడుము పద్యములు 55, 56, 57, 58, 59.

<u>అనపోతారెడ్డి - భక్తిరాజు.</u> భక్తిరాజు వీరాన్నపోతనృపతిని సూరవరమువద్ద జయించె. ఈ వీరాన్నపోతనృపతి ఎఱదాచానాయని సింగని కుమారుడు అన్నపోతానాయడా? లేక ప్రోలయవేముని కుమారుడగు అనపోతారెడ్డియా? అనపోతానాయుడు గోదావరీపర్యంతదేశమును ధాటీయాత్రచేసినటుల ఆధారములు లభించుటలేదు. అనపోతారెడ్డి క్రీ.శ. 1355 నాటికే కోనహైహయులనుజయించినటుల కలదు. తరువాతకూడ ఈతడు పునఃపునః గోదావరీపర్యంతదేశముపై దాడులజరిపెను. ఈతరువాతిదాడు లేయేసంవత్సరములలో జరిగినదిని చెప్పుటకు ఆధారములులేవు. అనపోతారెడ్డి శాసనములలో ప్రత్యబ్దమును ఈతడు ప్రతిపక్షదేశములను జయించుటకు దాడిసల్పుచున్నట్లు వ్రాయబడినవ్రాతలు సత్యదూరములుకావు. కావున భక్తిరాజు సూరవరప్రాంతములను ఉండిరాజుల సహాయముతో నెదురుకొని ఓడించిన దీరెడ్డి, అనవోతునే.[34] సూరవరము ప్రస్తుతపు నూజవీడుతాలూకాలో ఉన్నది. ఇది చిరకాలమునుండి దుర్గముగానుండెను. శివయోగసారములో "వేగిధరిత్రిలో విలసిల్లునెడ శూరవరమునా దనపురవరముచేసి" అన్నయదేవుని రుద్రుడు పరిపాలన చేయుచున్నట్లు చెప్పబడినది.[35]

భక్తిరాజు క్రీ. శ. 1367 నాటివరకు జీవించియుండెను.[36] అతని జీవితకాలములో అనపోతారెడ్డికి గోదావరీపరిసరప్రాంతము లెంత ప్రయత్నించినను స్వాధీనముకాలేదు. చోడులు, హైహయులు, ఉండీశులు, నిడుదవోలు చక్రవర్తులు కలసి రెడ్డివిజృంభణము నరికట్టిరి. అనవేమారెడ్డికాలములో గాని ఈ గోదావరీప్రాంతములు రెడ్డిరాజ్యములో భాగములు కాలేదు. అప్పుడుకూడ వీరు విశేషకలవరము కలుగజేయుచుండిరి. కాటయవేముడు, అల్లయవీరభద్రులు, శ్రమించి ఈప్రాంతములు సుస్థిరముగ రెడ్డిరాజ్యములో ఉండునటుల చేసిరి.[37]

35 సుభాషి—1—32 కాకతీయసంచిక—అనుబంధము పుట—14.

36. L. R. II—210.

37. జిత్వాశ్రీయః పోతభూతలపతి ర్వీరానరాతీన్ బలా
దా కృష్ణాతటినీ తటాద్భవ మవత్యా గౌతమీ స్రోతసః।
ఆవిఃఖ్యాదితి యత్కవీంద్ర వచనం తస్యావదానస్తుతౌ।
ప్రత్యబ్దం ప్రతిపక్షదేశ జయిన స్తత్పూర్వపక్షాయతే॥

ఈశ్లోకము కొన్నియపోహలను కల్పించుటకు కారణమైనది. ఇందలి ఆకృష్ణాతటినీ తటాద్భవమవత్యా గౌతమీ స్రోతసః అను వాక్యమున శబ్దార్థమును నిజమని భ్రమించి అనపోతారెడ్డి కృష్ణాతటమునుండి గౌతమీతీర

## అనపోతారెడ్డి ధర్మములు

అనపోతారెడ్డి తండ్రివలెనే ధార్మికుడు. రాజ్యమందలి ముఖ్యపదవులలో బంధుజనులను స్నేహితులను ఉంచి రాజ్యతంత్రమునడపెను. దీనినే శాసనములలో "రాజ్యం ప్రాజ్యం సుహృద్భోజ్యంయః కురుతేర్థినా" మ్మని వ్రాయబడినది. యవనులచే అపహరింపబడిన అగ్రహారముల పునర్దానముచేయుటయేగాక తాననేకగ్రామముల బ్రాహ్మణులకు ఇచ్చెను. ఇతడు ప్రస్తుతపు తెనాలితాలూకాలో: కొల్లూరుగ్రామమును అనేక బ్రాహ్మణులకు అగ్రహారదానముచేసెను. ఈశాసనము పూర్తిగా మనకు లభించలేదు. ప్రతిగ్రహీతలలో యర్రియప్రెగడగారికి "తాడినగరవు పొలమున ఇరువుట్టి 57 వేమూరి పొలాన 57 బెరసి కేసరిపాటి 53 ఖండ్రిక." ఈ ఎఱ్ఱయపెగ్గడగారు శంభుదాసుడేమో యని సందేహముకలుగుచున్నది. ఈశాసనము శా. శ. 1286 (1364) సం॥రంలో బయలుదేరినదని తోచుచున్నది. అయినచో ఎఱ్ఱాపెగ్గడ అప్పటికి వృద్ధుడై జీవించియుండవలెను. అనపోతుని యాస్థానము కవులతోను జ్యోతిష్కులతోను ధర్మశాస్త్రవేత్తలతోను వేదవేత్తలతోను పండితులతోను నిండియుండెను. అనపోతుని యాస్థాన విద్వాంసుడు బాలసరస్వతి. ఈతని శాసనకావ్యముల పెక్కింటిని ఆతడే రచించెను. అనపోతారెడ్డి యనంతరముకూడ ఇతడు జీవించి అన్నవేముని యాస్థానమునకూడ అలంకరించెను. శాసనముల చివర "అన్నపోతనరేంద్రస్య విద్వాన్ బాలసరస్వతిః అకరోదా కరోవాచాం నిర్మలం ధర్మశాసనం॥ అని వ్రాసెడివాడు.

కృష్ణజిల్లాలోని గుడివాడతాలూకాలోని ఉప్పుగల్లు పూర్వనృపాలురచే చిరకాలముక్రింద యపహరింపబడిన యగ్రహారము. అనపోతారెడ్డి ఆగ్రామమును పూర్వపు టగ్రహారికులకు తిరిగి యథాంశముగా ధారవోసెను. వినుకొండసీమ

---

మువరకు రాజ్యమును పాలించినటుల చారిత్రకాంశ మిందున్నట్లు కొందరూహించుచున్నారు. ఇదిసరికాదు. ఆపద్యములో శ్లోకములో "అవింధ్యాత్" అను మాటకు అన్వయ మెట్లు? దాని యర్థమేమి? అనపోతారెడ్డి వింధ్యపర్వతమువరకు పాలించినది చారిత్రకముగ నిజమా? పైశ్లోకము అర్థమిది:- కవీంద్రులు అనపోతారెడ్డి శూరకార్యముల స్తుతించుసందర్భమున, "ఆతడు వీరులగు శత్రువుల జయించి "అకృష్ణాతటినీ తటాత్ ఆగౌతమీ స్రోతసః, అవింధ్యాత్ భువమవతి" "కృష్ణాతటము మొదలు గౌతమీతీరపర్యంతమును, వింధ్యాద్రి పర్యంతమును భూమిని పాలించుచున్నాడను" వాక్యములు, ప్రతి సంవత్సరమును నూతన శత్రు రాజ్యముల జయించు నాతనిచే (అనపోతారెడ్డిచే) పూర్వపక్షము చేయబడుచున్నవి." తాత్పర్యమేమనగా అనపోతారెడ్డి ప్రతిసంవత్సరమును శత్రురాజ్యముల జయించుచుండెను.

లోని నాగళ్ళయను గ్రామమును శా. శ. 1278 లో "అనపోతయ రెడ్డిగారు కంభంపాటి కొండు శాస్త్రులుంగారికి అలవణం అకరంగా సర్వాగ్రహారంగా ధారాగ్రహీతం" చేసెను.[38] కోడితాడిపఱ్ఱుయను గ్రామమును శా. శ. 1286 (1364) జమ్మలమడక పురుషోత్తమసోమయాజికి దానమిచ్చెను. దొరకిన శాసనములనుబట్టి వీనిని గుర్తింప గల్గితిమి. ఇంకను అనేక గ్రామముల దానమిచ్చినట్లు ఆంధ్రదేశమున తత్తత్ స్థానికుల లో ప్రవాదము కలదు. ఈతడు మంత్రియును ధాన్యవాటీ దుర్గాధిపతియునుఅగు కేతయ మల్లవేము శౌరిచే అమరేశ్వరదేవరను శా. శ. 1283 లో పునఃప్రతిష్ఠాపనము చేయించెను. ఈ అమరేశ్వరదేవాలయము 1323 ఆప్రాంతమున తుఘ్లకుచక్రవర్తి సైన్యముల చేతనో క్రీ. 1357 ప్రాంతమున అల్లాయుద్దీను దండయాత్రలోనో నాశనము చేయబడి, దేవునివిగ్రహము భగ్నముచేయబడియుండును.

## అనపోతా రెడ్డి—అనవేమా రెడ్డి.

అనపోతా రెడ్డి రాజ్యమునకు రాగానే, అనవేముని యౌవరాజ్యమునకు పట్టము గట్టెను. అనవేముడు రాజ్యభారములో కొంతభాగము తానుకూడ వహించి అన్నగారికి యుద్ధములయందును, పాలనమునందును సహాయుడుగానుండెను. అనపోతా రెడ్డి తండ్రి కాలములో యౌవరాజ్యమునకు పట్టముగట్టబడి, రాజనీతియం దసమాన్యప్రావీణ్యము గల పినతండ్రి మల్లయరెడ్డియొద్దను అనేకులగు మహామంత్రులయొద్దను రాజ్యతంత్ర శిక్షితుడాయెను.[39] శాసనములలో ఇతనికి "పటుఃపాలన కర్మణి" యని విశేషణ ముపయోగింపబడినది—సార్థకమే వినుకొండ, బెల్లముకొండ, కొండవీడుదుర్గముల నితడు శత్రుదుర్గమములుగా రచించెను. ఇదియొకటియే ఈతని నీతివేత్తృత్వమునకుచాలిన ఉదాహరణము. 1323 నాటి విప్లవములో దేశములో కృషియు వాణిజ్యమును నశించి పోయెను. మహమ్మదీయసైన్యములు పంటపైరులను నాశనమొనర్చియు, అపహరించియు, కర్షకుల గ్రామముల పరశురామప్రీతి గావించియు, వారిస్త్రీల నగౌరవపరచియు, గ్రామస్థుల జీవితమును దుర్భరముగ నొనరించిరి. కర్షకులు ప్రాణరక్షణార్థమై అడవులకు పోయిరి. వణిజుల ధనధాన్యములు, వస్త్రములు, రత్నరాసులు బంగారము నెల్ల కొల్ల

---

38. కొల్లూరి అగ్రహారదానసందర్భమున ఈతడుగూడ ఆమహాజనులకే వేమూరిలో 15 పుట్లు, తాడినగరి పొలంచుట్టూ 35 పుట్ల క్షేత్రమును, అన్నతోకూడ దానమొనర్చుట వీరల సౌభ్రాతృత్వమును చెప్పక చెప్పుచున్నది.

39. Nellore Inscriptions—Ongole 78—page 1033.

గొట్టిరి. అందుచే అనపోతారెడ్డి వాణిజ్యమునకును, తద్ద్వారా కృషికిని పునఃప్రాణము పోసెను. బేహారులకు ఉపద్రవములనుండి అభయహస్తమిచ్చెను. వైదిక, స్మార్త, జ్యోతిష, ఆయుర్వేదాది విద్యలకు ప్రోత్సాహమిచ్చెను. అందుచేతనే ప్రజారంజకుడై యుండెను.

## అనపోతారెడ్డి మంత్రులు.

మల్లనమంత్రి. అనపోతారెడ్డికి రామాప్రెగ్గడ వంశములోని మల్లన మంత్రిగా నుండెను. ఈతనినిగూర్చి విశేషమేమియును తెలియదు.

సోమయమంత్రి. ఈసోమయమంత్రియే మోటుపల్లిరేవు నభివృద్ధిలోనికి తీసుకొని వచ్చుటకు కారణభూతుడయ్యెను.[40] మోటుపల్లిరేవులో ఎగుబడిదిగుబడి సరకులవిషయమయి చేయఁబడిన మర్యాదలీతనిచే ఏర్పాటుచేయబడి అనపోతారెడ్డిచే ఆమోదించబడినవి. ఈతడీఏర్పాటులన్నిటిని చెక్కించి శాసనస్తంభము వేయించెను.

కేతయమల్లినాథవేమన. ఈవేమనంగారు అనపోతారెడ్డి కులక్రమాగతమైన మంత్రిసేనాపతి. ఈ మంత్రిసేనాపతిపదవి ఆనాడు, రాజ్యాంగములో చాల ముఖ్యమైన పదవి. వీరు దుర్గాధ్యక్షులై విశేష అశ్వగజభటసైన్యముల నాయకులై యుండిరి. "అనుజతనుజబంధువులగు" రథినీనాథులతో సమానమైన గౌరవప్రపత్తు లీవేముని తండ్రి మల్లినాథునికి ప్రోలయవేముడిచ్చెను. ఈతడు వేమునికి జయలక్ష్మిప్రదుడని యును, రాజ్యధురంధురడనియును, ఈశాసనములో వర్ణింపబడినాడు.[41] ఈమల్లినాథునికి లక్కాంబికయందు జనించిన కుమారుడు వేమన. ఈతడు అనపోతారెడ్డికి కుడిభుజము. ఈతడు అల్లాయుద్దీను బహ్మనీదండయాత్రలో పాల్గొని, వారలను ఓడించి తరిమి కొట్టెను. ఈతడు ధరణికోటదుర్గమును పాలించుచుండెను. కృష్ణగోదావరీద్వయ మధ్య దేశమందలి దండయాత్రలన్నియును ఈవేమనంగారి అధ్యక్షతను జరిగినవే. అమరేశ్వరుని పునఃప్రతిష్ఠాపన ఈతనిచే చేయబడెను. అందీతనికి ప్రోలయవేమారెడ్డి బిరుదము లన్నియును వాడబడినవి. ఈతడు బ్రాహ్మణుడు కాడు. తనను వేమశౌరి యని వ్రాయించుకొనెను. శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు ఈ కేతయమల్లచమూపతి నియోగిబ్రాహ్మణుడేయని శాసనములో కృతసోమపానయని వ్రాయబడి

40. అనుబంధము—పుట 20.

41. S. I. I. Vol. VI—111—114.

యుండుటచే సందియము కలుగుచున్నదని వ్రాసినారు.[42] కాని ఇది నిజముకాదు. శాసనములో పురోహితకృత సోమపాన అనియున్నది. ఈతడు చతుర్థవంశజుడైన మహా మంత్రి సేనాపతి. అమరావతి శాసనములో ఈతడు విశేషముగ వర్ణింపబడినాడు. అనపోతారెడ్డి యాదరణమున ఆశాసనమున వెలసినది. అందీతనిగురించి

అనపోత మహీశ బాహుదండః
ప్రథితారాతిని కాయకాల దండః॥
భువికేతయ మల్లవేమశౌరి స్సదయం
రక్షతిరమ్య ధాన్యవాటీం॥

అని చెప్పబడినది. ఇది యుక్తమే.

## III

### అనవేమారెడ్డి.

### 1370-1385

అనపోతారెడ్డి యనంతరము, ఆతని తమ్ముడు అనవేమారెడ్డి, పైతృకమగు సింహాసనమెక్కెను. ఈ అనవేమారెడ్డి ధర్మవేమన యని విశేషమగు కీర్తినిగడించిన వాడు. అనపోతారెడ్డి రాజ్యము చేయుచుండగనే, ఈతడు యౌవరాజ్యమునకు పట్టము గట్టబడినట్లు దోచుచున్నది. అనపోతారెడ్డి కుమారుడు కుమారగిరి పిన్నవయస్కుడగుట దక్షుడగువాడు సింహాసన మధిష్ఠించనిచో రాజ్యమందు విప్లవములు కలుగునని ఎంచి అనపోతారెడ్డియే ఆతని మరణకాలమున ఇట్టి ఏర్పాటు మంత్రుల ఆలోచనతో చేసి యుండెనని యూహించుట కవకాశము కలదు. ఈతడు కుమారగిరిని ద్రోహముచేసి గద్దెనెక్కెననియును, ఈతనికి సింహాసన మెక్కుటకు హక్కులేదనియును కొందరు చరిత్రకారులు తలచుచున్నారు.[1] ఈయూహ భ్రమమూలకమే. అనపోతారెడ్డి చనిపోవునాటికి కృష్ణా గోదావరీ మధ్యప్రాంతదేశము ఆతని స్వాధీనములో నుండెనని యును, కాని రాజద్రోహులు పితూరీల లేవదీసి, దేశమునందు అలజడిపుట్టించిరనియును

42. ఆం—చ III—page 167.

1. Ep. Ind. 26—page 27 F. note I.

అట్టివానిని అనవేముడు అణచివేసి ఆ అవకాశమును తీసుకొని రాజ్యము అపహరించె ననియు తలంచుచున్నారు. అనపోతారెడ్డి కీదేశము స్వాధీనమై తిరిగితిరిగి రాజద్రోహ ముచే తిరుగుబాటులుకలిగినవను సిద్ధాంతముతప్పు. ఈదేశము అనపోతారెడ్డి కెన్నడును స్వాధీనమై ఆతని పాలనమందు లేదని ఇదివరలోనే ఋజువుపరచియున్నాము. కావున దేశములోని అరాజకస్థితిని ఆధారముగా చేసుకొని అనవేముడు భ్రాతృపుత్త్రునికి ద్రోహ మొనర్చి సింహాసనమెక్కెనను సిద్ధాంతము ఆంధ్రదేశమునేలిన మహాధర్మప్రభువులలో అగ్రేసరుడగు అనవేముని కీర్తికి అకారణకళంక మాపాదించుట. ఇదియే నిజమైనచో కుమారగిరి శాసనములలో అనవేముని ప్రశంసయే యుండక వును. కాని కుమారగిరి అను పలితిశాసనములోని,[2]

హేమాద్రి దానాభరణోన్నతస్య తస్య క్షితీశస్య సదావభూతాం
శ్రీ యన్నపోతక్షితిపాన్న వేమమహేశ్వరౌ శాశ్వత ధర్మలోకా.

పైశ్లోకములో యన్నపోత, యన్నవేమన రేండ్రులు శాశ్వత ధర్మలోలురని కంఠోక్తముగ చెప్పబడినది. బాలుడగు తనను వంచించి గద్దె నపహరించిన ద్రోహి నిట్లు కుమారగిరి తన తండ్రితో సమముగా ధర్మతత్పరుడని వ్రాయించియుండునా? కాటయవేముని శాసనములలో అనవేముడు 'సుజనుడని' వర్ణింపబడినాడు.[3] కాటయ వేముడు సామాన్యుడు కాడే. తన స్వామిని ద్రోహమొనర్చినవానిని సుజనుడని వ్రాయించునా? పెదకోమటివేముడు తనకూరిమి పినతండ్రి అనవేముడు "విశ్వోత్తరుం డన్న వేమభూపాలుండని" చెప్పెనే![4] ఆవంశములో నెవ్వరును అనవేముని రాజ్యా పహర్తయని చెప్పలేదే! శ్రీశైలశాసనములోని రాజ్య రమారమణీస్వయంవర లబ్ధ నాయకయను వాక్యమున కపార్థము కల్పించుకొని కొందరు చరిత్రకారులు ఈఅపనింద కల్పించియున్నారు. ఆవాక్యమున్న శ్లోకమిది:—

"సోయం భ్రాతురనంతరం, నిజమహాభారం వహన్ పైతృకం।
రాజ్యశ్రీ రమణీస్వయంవరపతి శ్రీయన్న వేమప్రభుః
పూర్వం మ్లేచ్ఛనృపాల కైరపహృతాన్ శిష్టాగ్రహారాన్ బహూన్
దాతుం కౌతుకవానుదారచరితో, జాగర్తి లోకోత్తరః॥

ఈశ్లోకము అనవేముని శాసనములు చాల వానిలోకలదు.[5] ఇందులో వ్యంగ్యముగా

2. J. A. H. R. S. XI—pages 191—213.
3. J. A. H. R. S. XI—page 209.
4. J. T. A. Vol. IX—319—328.
5. చూడుముత్ప్రజ్జవరం శాసనము appendix—page 29. Ep. Ind. XXI—27.

తన అసత్కార్యమును చెప్పునటుల గ్రహించుట విరుద్ధము. తండ్రి యనంతరము పైతృకమగు రాజ్యభారమును వహించుచు, రాజ్యరమచే అనవేముడు స్వయముగా వరింపబడెను. పైతృకమనిచెప్పుటచే, రాజ్యము తాను క్రమప్రకారము వహించినటుల స్ఫురకమగుచున్నది. సింహాద్రి పర్యంతము దేశమును తాను సులభముగా జయించి వృద్ధిచేయుటచే రాజ్యరమారమణి స్వయముగా వరించినటుల అతిశయోక్తిగా చెప్పబడినది. పైగా అనవేముడు లోకోత్తరుడని చెప్పబడినది. దీని తాత్పర్యము అనవేముడు దొంగతనముగా రాజ్య మెత్తుకొనిపోయెననియా? ఇది యపార్థము. అన్నకుమారులు చిన్నవారై యుండగా తమ్ములు యౌవరాజ్యాభిషిక్తులై అన్న యనంతరము రాజ్యమునకువచ్చు ఆచారము చిరకాలమునుంచి కలదు. కొరుకొండపాలించిన ముమ్మిడిరెడ్డి అనంతర మాతనితమ్ముడు సింగారెడ్డి రాజ్యమును పాలించెను. సింగనితరువాతనే ముమ్మిడీందుని కుమాళ్ళు రాజ్యమేలిరి. ఇది సంప్రదాయానుసారమే అయియున్నది. ఇందసందర్భముకాని అన్యాయముగాని యేమియును లేదు.

అనవేమారెడ్డి రాజ్యమునకువచ్చిన ఒకటిరెండుసంవత్సరములకాలము అన్నగారు ఒప్పజెప్పిన రాజ్యమంతయు సుస్థిరముగాజేసుకొనుటలో గడచిపోయెను. అనపోతారెడ్డికి సాధ్యముకాని గోదావరీపర్యంతప్రదేశమునందలి స్వతంత్రులగు మండలేశ్వరుల నిర్మూలముగా నొనర్చి తద్దేశముల స్వాధీనము చేసుకొనుటకు ఈతడు సంకల్పించి బహుళసైన్యముల గూర్చుకొని శా.శ. 1294లో దాడి బయల్వెడలెను. కృష్ణానదీ ముఖద్వారమందలి దివిసీమను అనపోతారెడ్డిజయించియుండెను. కాని తరువాత ఆతనికాలములోనే దివిసీమ పద్మనాయకుల స్వాధీనమయినట్లు తోచెడిని. అందుచే నాతడు మొదట నీదివిసీమను జయించి, ముందుసాగెను. శూంవరపట్టణము రాజధానిగానున్న యండిరాజులను, కామవరము రాజధానిగానున్న భక్తిరాజును, నిరవద్యపురపుకోట స్థానముగాగల చాళుక్యరాజులను ఈతడు జయించి రాజమహేంద్రవరదుర్గమును ముట్టడించెను. నిడదవోలు, రాజమహేంద్రవరపుదుర్గములు భేదింపబడెను. తరువాత హైహాయుల జయించి జలదుర్గమగు కోనసీమ స్వాధీనపరచుకొనెను. ఈతరుణముననే ప్రస్తుతపు రాజవోలు తాలూకా (దానికానాడు పానారసీమయని పేరు) కూడ వశపరచుకొనెననుటకు సందేహములేదు. ఈసందర్భములోనే చంద్రగ్రహణసమయమున ఆతడుతనచెల్లెలు వేమసాని పుణ్యార్థమయి కోనసీమయందలి నడుపూరు గ్రామమును వేమవరమని పేరుపెట్టి శా॥శ॥ 1296లో బ్రాహ్మణులకు దానముచేసి, తామ్రశాసనము వేయించెను. అనవేముడు ఈ దాడిలో తాను రాజమహేంద్రవరమున నిలచిపోయి, తన దండనాయకుడగు చెన్నమ

నాయని రాజమహేంద్రివర పూర్వదేశమును జయించుటకై పంపెను.[6] ఈతడు మొదట పిఠాపురము రాజధానిగా నేలుచున్న కొప్పులనామయ నాయకుని జయించి అతనినే అనవేమారెడ్డికింద మండలాధిపతిగా నియమించి, సింహాచలమువరకునుజయించుటకై సాగి పోయెను. కొప్పులనాయకుని జయించుటచే కొండవీటిరెడ్డిరాజ్యము పిఠాపురము(కొప్పులవారి)కోటాము, ఎలమంచిలి కళింగమువరకును వ్యాపించెను. సింహాచలప్రాంత దేశమానాడు మత్స్యవంశ్యులగు రాజుల పరిపాలనలో నుండెను. వీరి రాజధాని శారదా నదీతీరమందున్న వడ్డాది. ఇది ఇప్పుడు విశాఖపట్నంజిల్లా చోడవరంతాలూకాలో చోడవరమునకు సుమారు 10 మైళ్ళదూరమునందున్నది. చిరకాలమునుండి ప్రసిద్ధినిగన్న మాడెములకుపోవుమార్గమీ వడ్డాదిమీదనుండియే. ఈమత్స్యవంశీయులు చిరకాలమునుండి ఈరాజ్యమును పాలించుచుండిరి. ప్రసిద్ధిగన్న సింహాచల మీరాజుల రాజ్యములోనిదే. వీరు చిరకాలమునుండి కాళింగగజపతుల సామంతులుగా నుండిరి. వీరిరాజ్యము కళింగరాజ్యమునకును త్రిలింగరాజ్యమునకును మధ్యనుండుటచేతను, త్రిలింగరాజ్యముసింహాచల పర్యంతమునునమ్మకము చిరకాలము నుండియుండుటచే వీరికి కళింగరాజులవల్లను, త్రిలింగరాజులవల్లనుకూడ ఒత్తిడికలుగుచుండెడిది. వీరుతరచుగ ఉభయరాజ్యాధిపతులతోను మైత్రితో మెలగుచుండిరి. కొప్పులరెడ్లు ఈమత్స్యవంశపురాజులనోడించి జయించిరనికాని, మత్స్యరాజ్యము వీరలపాలనములో నుండెనని చెప్పుటకుఆధారములేదు. వీరుసింహాచలస్వామికి దానముచేసిన అందలాపల్లి గ్రామము, మత్స్యరాజ్యములోనిదికాదు. ఈగ్రామము ప్రస్తుతపు నరసీపట్నం తాలూకాలోనిది—కొప్పులవారి పరిపాలనములోనిది.

క్రీ॥ శ॥ 1375 సంవత్సరములో అనవేమారెడ్డి కాలములో ఈ మత్స్యరాజ్యము వీరార్జునదేవుని పరిపాలనలోనుండెను. చెన్నమనాయకునకును అర్జునదేవునకును యుద్ధము జరిగియుండును; కాని చెన్నమనాయకుడు గెలచినట్లు ఊహించుట కవకాశములేదు. బహుశః చెన్నమనాయకునకును వీరార్జునదేవునకును సంధియైయుండును. చెన్నమనాయకుడు శా॥శ॥ 1297లో సింహాచలస్వామికి దానమిచ్చినభూమివీరార్జునదేవునిచేబడసెను.[7] ఆ శాసనములో "శ్రీమాన్ చెన్నమనాయకో గుణనిధిః భూదేవ దేవద్రుమః| శ్రీమీనాన్వయ మేదినీశ తిలకో: సంప్రాప్య వీరార్జునాత్ | గ్రామం శ్రీకరమగ్రహారమకరోత్తం గోటివాడాభిధం" అనియును "అనవేమయరెడ్డి ప్రధానివారణదాసులకొడుకు చెన్నమనాయుండు తనకు ఒడ్డాది అర్జునదేవరాజుచేం బడసిన ఊరు, గొట్టివాడం.......అరువుట్ల జలక్షేత్రము వెట్టెను."... మఱిన్ని అనవేమయరెడ్డిగారు తమకు అభీష్టార్థసిద్ధికి

6 and 7. S. I. I. VI No. 785.

గాను.........పెట్టితిమి"..........అనవేమారెడ్డి పేరితోనుతన పేరితోను దానమిచ్చి నవాడు చెన్నమనాయకుడే. తానువిజయియై వీరార్జును నోడించిన ఒడ్డాదిరాజ్యమున కధిపతి అనవేమయ యగును. వీరార్జునునిచే గ్రామము "పడయుట" అనవసరము. అనవేమారెడ్డివలననే గ్రామము వడసియుండును. ఒడ్డాదిరాజ్యమును సింహాచలపర్యంత దేశమును అనవేమయరెడ్డికి లభించలేదనుట నిశ్చయము. కొందరు చరిత్రకారులు[8] కొన్ని శాసనములలోని[9]

"శ్రీశైలాదాసింహాశైలం తతః క్ష్మాంధత్తో ధర్మేణాన వేమక్షితీశః"॥

వాక్యము ఆధారంగా గొని "అనవేమభూపాలుడు కందుకూరు మొదలుకొని విశాఖపట్టణము మండలములోని సింహాచలము పర్యంతమును జయించి పరిపాలించెనని అభిప్రాయ పడుచున్నారు. ఇది సరికాదు. పైశ్లోకములోని సీమానిర్ణయము స్థూలారుంధతీ న్యాయముగా చేయబడినదైనను కావచ్చును. లేక కవుల అత్యుక్తియైనను కావచ్చును.

ఈ అనవేమారెడ్డి పరిపాలనకాలమున కళింగదేశమునునాలుగవనరశింహదేవుడు పరిపాలన మొనర్చుచుండెను. ఈతడు క్రీ॥శ॥ 1379 సంవత్సరములో రాజ్యమునకువచ్చి క్రీ॥ 1414 వరకును రాజ్యము జేసెను.[10] ఒడ్డాదిరాజులీతని సామంతులనుటకు ప్రమాణములకలవు. ఈ నరసింహదేవుని భార్య పార్వతి మహాదేవి శా॥శ॥ 1328 సంవత్సరమున నృసింహస్వామికి భూదానముచేసి శాసనము వేయించెను. "కళింగదేశమందున, అనకపల్లి,నావులపల్లి, పిళినకవాడ, ఏడువాక నడుమను, ముమ్మిడివాడ క్రయంగావించి" దానముచేసినట్లు వ్రాయబడినది. దీనిసిబట్టి అనకాపల్లివరకును గలదేశము నాల్గవనరశింహుని పాలనక్రింద ఉండెనని యూహించుట న్యాయము. కళింగాధిపతిభార్య అనవేమారెడ్డిగారి రాజ్యములోని గ్రామముకొని దానమివ్వవలసిన అవసరమేమి? భర్తరాజ్యములో కొనుటకు ఊళ్ళేలేవా? శా॥ శ॥ 1299 (1377 A D) లో కళింగపరీక్ష పాత్రధర్మదానజీయన అధికారమందు శ్రీనరశింహదేవరకు ఒడ్డాది అర్జునదేవరాజు, తన కీర్త్యార్థ సిద్ధిగా భోగముపెట్టెను. ఈ అర్జునదేవుని కూతురు పూరసానిగాణికూడ అప్పుడే ఒక నిబంధమేర్పాటుచేసెను.[11] ఈ కళింగపరీక్ష సుప్రసిద్ధమైన కళింగరాజ్యాంగములోని యధికారి. ఈతడు నాల్గవ నరసింహుని యధికారి. అర్జునదేవుడు కళింగసామంతుడు గానిచో ధర్మదానజీయన అధికారమందు భోగమేర్పాటుచేసెనని చెప్పుటలో అర్థమేమి?

8. ఆంధ్రులచరిత్రము III page 174.
9. మన్యమాపురపు శాసనము. — L. R. III — 234. S.S. (1304).
10. కళింగసంచిక_పుట 635.
11. S. I. I. VI. No. 876.

అనవేమారెడ్డి కెన్నడును సింహాచలప్రాంత దేశముకాని, ఒడ్డాదిరాజ్యముకాని స్వాధీనముకాలేదనియు, పైనున్యమావుర శాసనములోని, సింహాద్రి పర్యంత మేలెనను మాటల నాదరణీయములు అప్రామాణికములనియు చెప్పుటకు రెడ్ల శాసనాధారములే కలవు.

కుమారగిరిరెడ్డి క్రీ॥ శ॥ 1385 లో రాజ్యమునకువచ్చెను. ఆ సంవత్సరమునే ఈతడు దిగ్విజయము నొనర్చుటకు ప్రయత్నమొనర్చి, తన అక్క పెనిమిటియును, సామ దానభేద దండోపాయ తంత్ర ప్రవీణుడును, తన రాజ్యనిర్వాహణ దక్షుడును అగు కాట యవేముని మహాదండనాయకునిగా నియమించి ఆతనితో ఇట్లు చెప్పెను:

"ఉదీచ్యా దాక్షిణాత్యశ్చ ప్రతీచ్యాశ్చ మహీశ్వరాః
ఆచరంతి సదా మైత్రి మస్మాభిరతి కౌతుకాత్ ।
తస్మా త్సింహాద్రి పర్యంత ప్రాచ్యా ఏవ మహీశ్వరాః ।
జేతవ్యా స్త న్మహీపాలా నధునా జయలీలయా"॥

మనకుత్తర, దక్షిణ, పడమటి దిక్కులనుండు రాజులు మనతో సదా మైత్రిని పాటించుచున్నారు. కావున సింహాద్రి పర్యంతమునన్న తూర్పునాటి రాజులిప్పుడు మనచే జయింపబడవలసియున్నారు." [12] ఈనాటికి రాజమహేంద్రవరపు రాజ్యముసుస్థిరముగా కొండవీటి రెడ్ల చేతులలోనున్నది. కుమారగిరిరెడ్డి జేతవ్యులని చెప్పిన రాజులు తూర్పునాటి రాజులు ఎలమంచిలి కళింగులు, ఒడ్డాదిమత్స్యరాజులు, జంతెనాటిగంగరాజులు, వీరఘట్టము, నప్తమాడియములు, బారహా, దోంతి మన్నెరాజు, కళింగరాజు మొదలగువారు. వీరిని జయించి కొండవీటిరాజ్యమును సామ్రాజ్యముచేసి, ప్రోలయవేముని మహోద్దేశము ఫలింపజేయుపని కుమారగిరిరెడ్డి చేయుటకు సంకల్పించి కాటయవేముని నియమించి తన ఏకపుత్రిని ఈ దండయాత్రలో పాల్గొనుటకు పంపియుండెను. కావున సింహాద్రి పరిసర ప్రాచ్యదేశము అనవేమారెడ్డి జయించి ఏలెననుట అసమంజసము. ఈదేశము జయింపబడలేదు. జయింపబడి హస్తచ్యుతము కాలేదు. ఈ గోదావరీ పరిసర ప్రదేశములు 1374, 1375 సంవత్సరములలో నిష్కంటకముగా అనవేముని రాజ్యములోనికి వచ్చెను. కాని ఏఱువచోడులుమాత్రము కామవరమునుండి రామవరపుదుర్గమునకు రాజధాని మార్చుకొని అనవేమునికిలోబడకుండిరి. అనవేముడు రాజమహేంద్రిదుర్గమున అధ్యక్షుని నిలిపి తిరిగి కొండవీడు చేరెను.

---

12. J. A. H. R. S. XI 203, 204.

## అనవేముని రాజ్యపాలనము.

అనవేముడీ దిగ్విజయమైనతరువాత ఏయుద్ధయాత్రలను సాగించినటుల కనపడదు. కొండవీటినుండి రాజ్యము "ప్రజాతోషకారి"యై పరిపాలించుచుండెను. ఈతని సభలు కవులతోను గాయకులతోను, వందిమాగధులతోను, బహుదేశపాలకులతోడను నిండియుండెను. విద్యలు పోషింపబడెను. ఈతనిపేరోలగము వానపల్లిశాసనమందీవిధముగా వర్ణింపబడినది:

> కేచి ద్దేశాధిపత్యం కతిచనశిబికాచామరచ్ఛత్రశోభాం
> కేచిదాగ్రిజ్యం స్వకీయం కతిచన విభవై ర్గ్రగహారాను దారాన్ ।
> విందంతే లోకరక్షా విధిమహిప మహాభాగధేయేన్న వేమ
> క్షోణీపాలే సభాయాం సకలగుణనిధౌ రత్నసింహాసనస్థే॥

మోటుపల్లి రేవునుండి వర్తకము విరివిగా సాగుచుండెను. నానాద్వీపాంతరములనుండి వర్తకులు సామగ్రుల గొనివచ్చుచుండిరి. నానాదేసి బేహారులకును వేమునిరాజ్యము స్థానమయ్యెను. దేశమందు అలజడులు తగ్గి శాంతి హెచ్చయ్యెను. శాంతియుతమగు పాలనము రాగానే ధనధాన్యములును, పాడిపంటలును హెచ్చయ్యెను. విదేశబేహారములవలన ధన, కనక, వస్తువాహనమాణిక్య గాణిక్యములు ప్రజల కబ్బినవి. బొక్కసము పూర్తిగా నుండెను. మనసు సుఖమునుగోరు అవకాశము లభించెను. కస్తూరీ, కుంకుమ ఘనసార సంకుమద హిమాంబు, కాలాగరు, గంధసార ద్రివ్యంబులు కుప్పతిప్పలుగా తెప్పించి రాజున కిచ్చుచుండిరి. అనవేముడువిద్యారసికుడు. వాత్స్యాయనాదులు కామశాస్త్రజ్ఞులు తెల్పినట్లు కవి, గమకి,వాది,వాంశిక, వైతాళికాదులకు నుత్సాహ మతిశయిల్లునట్లుగా అతడు వసంతోత్సవముల జరుపనారంభించెను. అందు అర్థులకుఅతడు అమితదానముల ప్రతిసంవత్సరమును చేయుచుండెను. ప్రజలందరీతనిని "వసంతరాయుడని" పిలుచుచుండిరి. ఈ వసంతోత్సవములో కస్తూరి, పచ్చకర్పూరము, మొదలగు వస్తువులు విరివిగా వాడబడుచుండెను. ఆనాడా వసంతోత్సవములకు రాజధానికి నానాదేశములనుండియు ప్రజలు వచ్చుచుండెడివారు. ఒకకవి యిట్లీ వసంతరాయని వర్ణించినాడు:—

> సపోత్రిలమంబా తనయః కృతార్థో వసంతకాలీం ప్రతివర్ష ముర్వ్యాం ।
> కస్తూరికా కుంకుమ గంధసార హిమాంబు కర్పూరముఖైశ్చ కార ।
> వసంతరాయశ్చ వసంతకేళౌ కస్తూరికా రేణుచయాంబువాహః ।
> శ్రీ స్తం హిమాంభో ఘనవర్ష ధారాః కర్పూరఖండాః కరకావికీర్ణాః॥ 13

ఈవసంతోత్సవమునే ఈతని తరువాత కుమారగిరి ఇతోధికముగా సాగించినాడు.

13. దృష్ణవరము శాసనము అనుబంధము page 32.

## అనవేముడు - వీరశిరోమండప నిర్మాణము.

అనవేముడు ఆగమశైవాచార తత్పరుడు. ఇతని కులదైవతము త్రిపురాంతక దేవుడు. రెడ్డిరాజ్యము 'త్రిపురాంతక దేవేనదత్తమ్మ' నికదా ప్రతీతి. క్రీ॥శ॥ 1377 లో అనవేముడు శ్రీశైలయాత్ర వెడలి అచ్చట వీరశిరోమంటపమును నిర్మించెను.14 ఈ వీరశిరోమండపమునందు అనేకవీరులు వీరశివభక్తియుక్తులై తలలను,నాలుకలను గండకత్తెరతో కత్తిరించుకొని వెంటనే కైలాసమును పొందుచుండిరట. ఈవీరశిరోమంటపము అన్నవేమారెడ్డి తనతండ్రి అన్నయరెడ్డిపుణ్యార్థమయికట్టించెను. ప్రోలయవేముని కాలమున పాతాళగంగకు సోపానములుకట్టిన పంచబిడుం రామలింగమీ వీరశిరోమంటపంకట్టెను. కానిఅన్నయరెడ్డి అనవేముని తండ్రికాడు. తండ్రితమ్ముడు. ఈవిషయము కొంచెము గూఢముగానున్నది. నడుపూరి శాసనములో 15 తన "స్వసుఃపుణ్యార్థం" సోదరిపుణ్యార్థమయి నడుపూరిగ్రామమును అగ్రహారదానముచేసినట్లు అనవేముడు వ్రాయించినాడు. ఈ సోదరి "వేమసాని" లేక వేమాంబిక పుణ్యుడగు అన్నయరెడ్డి కొమార్తె. ఈమెను పైశాసనములో అనవేముడు తనసహోదరిగానే వ్రాయించినాడు. వీనినిబట్టి ఈ అన్నవేముని చిన్నతనమునుండియు అన్నయరెడ్డి పెంచియుండెనేమోయని బలవత్తరమగుఊహ కలుగుచున్నది. లేనియెడల యిట్టిప్రేమకును భక్తికిని అన్నయరెడ్డియు వేమసానియు పాత్రులైయుండరు. అన్నవేమారెడ్డి ఎంత సౌహార్ద హృదయుడో ఈ శాసనములు చెప్పక చెప్పచున్నవి.

> తస్యాన్న వేమచంద్రస్య లక్ష్మీరివ సహోదరీ
> శ్రీనల్లనూంకస్య మహిషీ విష్ణుతేజసః।
> వేమసానీతి విఖ్యాతా సప్తసంతానశాలినీ
> నిత్యం హేమాద్రికల్పోక్తదానరీవ్రతవిధాయినీ॥

ఎంత ప్రేమ భక్తి గౌరవముల ప్రకటించుచున్నవో పైశ్లోకములు! ఈమెయే వేల్పూరి రామేశ్వరదేవునికి ధర్మములుచేసి శాసనము వేయించినదని ఇదివరలోనే చెప్పియుంటిమి.

## అన్నవేముని కవులు.

అనవేముని కవితారసికతను పొగడుచోటుశ్లోకములు,పద్యములు పెక్కులుకలవు. ఆతని యాస్థానియందు, బాలసరస్వతి—అనపోతారెడ్డి విద్వాంసుడు—విద్యాధికార

14. A. R. 20/1915.
15. Ep. Ind. III-287.

పదవియం దుండెను. ఇమ్మడి లంకశాసనకృతిపతి త్రిలోచనాచార్యుడు కూడ గొప్ప కవియే. ఇతనికి శారదావల్లభుడను బిరుదుకూడగలదని తోచుచున్నది. తన కవిత్వమును గూర్చి అతడు ఇట్లు చెప్పుకొనినాడు:

మహానట జటచ్ఛటా నటనమందాకినీ
కలక్వణిత కంకణ ప్రోజవిజృంభి వాగ్గుంభనః ।
కవిః కవికులోద్భవో భువన భవ్యదివ్యోదయః
శ్శైవాగమవిశారదో జయతి శారదావల్లభః ॥

కాని వీరు రచించిన కావ్యములేవియు ఇంతవరకును దొరకలేదు.

## అనవేమారెడ్డి—మంత్రులు—దండనాయకులు.

అనవేమారెడ్డికి కులక్రమాగతమైన మంత్రిశ్రేష్ఠులుండిరి. వారి రాజనీతినిపుణతచే అతని ప్రయత్నములు అనాయాసముగాసిద్ధించుచుండెను. అట్టివారిలో మావిండి పెద్దన్న యొకడు. ఈ మావిండిమంత్రులు చిరకాలమునుండి ఈ రెడ్డికొల్వులో యుండిరి. వీరి మూలపురుషుడు పెదతూర్కు—న.16 తత్సంతానక్రమమున "విక్రమసింహపురి సింహాసనాధ్యాసియైన" చిటిపెద్దనజన్మించెను. ఈతనికుమారుడు మామిడన్న. మామిడన్నమంత్రికి పెద్దన, వీరభద్ర, మారన, నామన యను నలుగురు కుమాళ్ళు. వారిలో పెద్దన విద్యాబుద్ధులలోకూడ మిగిలిన మంత్రులకంటె పెద్దయే. ఈతడుఅనవేమారెడ్డికి దండనాయకుడును మంత్రియునుకూడ. ఈతడు "అనవేమాధిప రాజ్యభార భరణవ్యాపార దక్షుడని" ప్రశంసింపబడినాడు. ఈతని కుమారుడు సింగనామాత్యుడును పెదకోమటి వేమారెడ్డి ప్రధానమంత్రి సింగన యున్నలు. వేమన్న ప్రెగడన దండనాయకులు. కుమారగిరి రెడ్డి కొల్వు ఏల సింగనామాత్యుడు వదలెనో తెలియదు. అనవేమారెడ్డి మరియొక మంత్రి ఇమ్మడిందుప్రిడు17 లోహితగోత్రుడు. మల్లయమంత్రి కుమారుడు. సకలార్థవేది. గొప్ప పరాక్రమవంతుడు. సమస్తశాస్త్రవేది. ఈతనిగూర్చి వానపల్లిశాసనములో

"నీతౌ మంత్రీశ్వరో, విద్యాగోష్ఠీషు విబుధాగ్రణీః।
మిత్రంహితోపదేశేషు భూభుజా మిమ్మడీశ్వరః॥ అని చెప్పబడినది. ఈ ఇమ్మడిందునకు అనవేముడు శా॥శ॥ 1300సంవత్సరములో ఇప్పటిగోదావరీమండలములో రాజమహేంద్రవరముతాలూకాలోనిదై యుండుఇమ్మడిలంక అనుగ్రామమును దానముచేసెను. ఇమ్మడిందుప్రడాగ్రామములో సగము తానుంచుకొని మిగిలిన సగభాగము బ్రాహ్మణులకు దానముచేసెను. అనవేముని దండనాయకులందరిలోను మిన్న అల్లాడరెడ్డి.

16. శ్రీనాథుని నైషధము I_20_44.
17. Ep. Ind. III—59—66.

## అల్లాడరెడ్డి.

ఈతడుకూడ అనవేముని మంత్రి సేనాపతియే. ఈతనివి అనవేమునకు రాజమహేంద్రిరాజ్యమును జయించుటకును, పాలించుటకును ఏర్పరిచియుండెను. ఈతని శక్తి సామర్థ్యములవలననే తూర్పునాటిదేశము రెడ్డిరాజ్యములో భాగమయ్యెను. ఈతనిని గూర్చి రాజమహేంద్రి రెడ్డిరాజ్య చరిత్రములో విశేషములు తెలుపబడును.

## మూలగూరమ్మ.

కొండవీటిరెడ్ల కులదేవత మూలగూరమ్మ. ఈమె దేవాలయము గుంటూరుజిల్లా సత్తెనపల్లి తాలూకాలోని అమీనాబాదు గ్రామమందున్నది. ఈపంట దేసటిరెడ్ల కీమె యెడల భక్తి అధికము. తూర్పునాటిసీమలలో పొందిన జయమునకు అనవేముడు మూలగూరమ్మను క్రీ.శ. 1377 లో దర్శించి ఆమె యంగరంగభోగములకు కోటభూమిలోని పడిదరము, మూలగూరు, అమ్మనపల్కలూరు అను మూడు గ్రామముల ధారవోసెను. ఈశాసనములు ఉనికి మొదట శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు స్థానికచరిత్రలో కని పెట్టి కొ॥ శ్రీ లక్ష్మణరావుగారికి చూపగా[18] వారాశాసనమును సవ్యాఖ్యానముగా ఆంధ్ర సాహిత్యపరిషత్పత్రికలో ప్రకటించిరి.[19] అదిఅసమగ్రము. శాసనమునందలి రెండు సీస పద్యములను మాత్రమే స్థానికచరిత్రల సంపాదకులు అందువ్రాసిరి.[20] ఈశాసనములోని పద్యములు పెదకోమటిరెడ్డి కాలములో రచింపబడి చెక్కబడినవి. కాని శాసనోత్కీర్ణ కాలము ఈ పద్యములలో లేదు. అది తరువాతిపంక్తులలో నుండుననుటకు సందేహము లేదు. మొదటి సీసపద్యపాదమున స్థానికచరిత్రపాఠమున తప్పులు కలవు. ఆపద్యమిది:—

శాకాబ్దములు సహస్రమును యిన్నూట తొంబై యొనిమిదియు ననుభవ్యసంఖ్య
గలిగియొప్పారెడు నలవత్సరంబున మాఘమాసము పున్నమాదినమున
విశ్వోత్తరుండైన వేమభూపాలుండు దన కులస్వామిని కమ్రతకిరణ
రేఖావతంసమూల గూరమ్మకు నఖిలజగన్మాత కంగరంగ
భోగసంసిద్ధికై ధారపోసి యిచ్చె
గ్రామములు మూడు శ్రీకోట భూమియందు
పడిదరము మూలగూర మ్మనపల్కలూరు
దానఖచరేంద్ర డాచంద్ర తారకముగ.

---

18. L. R. Vol. 48 page 86. మరి
19. అం. సా. ప. ప. 9_319_325. చుటకు
20. శృంగారశ్రీనాథము_అనుబంధము_పుట 19. ఈ క్రిందివిధముగా శ్రీ ప్రభాకర శాస్త్రులు తన్ను వ్రాసినారు. "ఈశాసనము నమీనాబాదుకు పోయి నేనే పరిశీలించి వచ్చితిని.

ఈపద్యమునం దనేక తప్పులు కలవు. దీని సరియైన పాఠమును శ్రీ ప్రభాకర శాస్త్రులవారిచ్చి యున్నారు.21 ఇందలి "విశ్వోత్తరుండైన వేమభూపాలుండు" అనుమాట లక్ష్మణరావుగారిని భ్రమపెట్టి ఈశాసనకాలము శాలివాహన శకము 1298 లోనిదని యును కాలమిదియే యనియు వారికి తోపించినది. సరియైన శాసనపాఠము "విశ్వోత్తరుండన్న వేమభూపాలుండు". ఈవిషయము శ్రీప్రభాకరశాస్త్రులవారు కనిపెట్టినారు. శా|శ| 1298 లో తన కూరిమి పినతండ్రి విశ్వోత్తరుండన్న వేమభూపాలుండు చేసిన గ్రామ త్రయ దానమును తరువాత నెప్పుడో తాను క్రమపరిప్రాప్త రాజ్యసింహాసనాధ్యాసియై స్థిరపరచి వానికిసర్వమాన్యత నొసగెను. శాసనములోని పద్యములయభిప్రాయము పెద కోమటివేముడు శాసనమునువ్రాయించి చెక్కించెననుట. సంవత్సరము, శాసనము అరిగి పోవుటచేదొరుకలేదు. పైపొరపాటువలన లక్ష్మణరావుగారు పెదకోమటి రాజ్యప్రారంభ కాలమును గూర్చి "ఈశాసనమునుబట్టి క్రొత్తగా తెలిసిన విషయమేమన క్రీ. శ. 1400 బహుకాలము పూర్వమే క్రీ.శ. 1377 లోనే పెదకోమటి వేమారెడ్డి కొంత దేశమునకు ప్రభువుగ నుండెను. కొంతవీటిరాజ్యమునకు రాకపూర్వమే దానధర్మాదులుచేసి శాసన ముల వేయించుచుండెను. కొండవీటికి వేరురాజులున్నను ఈవంశమువారుకూడ సామ్రాజ్య సింహాసనాధ్యాసి రాజాధిరాజపరమేశ్వరాది బిరుదుల ధరించుచుండిరి." అనివ్రాసిరి. ఇదిసరియైనసిద్ధాంతము కాదు. అపపాఠము ననుసరించి చేసిన రాద్ధాంతము. పైశాసనము శా|శ| 1298లో వేయబడినదికాదు. పెదకోమటి వేముడు కుమారగిరిరెడ్డి అనంతరము క్రమపరిప్రాప్తరాజ్యసింహాసనాధ్యాసియై రాజాధిరాజ పరమేశ్వరాది బిరుదములధరింప నర్హతకలిగిననాడు వ్రాయింపబడినదీశాసనముకాని అనవేముని రాజ్యకాలము వ్రాయింప బడినది కాదు. పెదకోమటివేముడు మూలఘూరమ్మకు భువనమోహనమును అభ్రంకష మునుఅగు గుడియు, గోపురము, ప్రాకారములును తిరిగి కట్టించినపుడు పినతండ్రి దాన మును తిరుగ తన శాసనములో నిమిడ్చి చెక్కించియుండెననుటకు సందేహము లేదు. ఈశాసనోద్దేశ్యము అనవేముని దానమును అంగీకరించి స్థిరముచేయుటయే.

---

మీద గుడికడ జారుబండపై చెక్కబడి యున్నది. ఇరువదిబంతులున్నవి 8½ బంతులు స్పష్ట ముగా చెక్కబడినవి. అవి యాం దపహరింపబడిన రెండు పద్యములు. 11½ బంతులు అక్షర ములు పయిపయిన చెక్కబడినవగుటవలన కొంత కొంత చదువవలయుచుటచే తెలిసికొనగలి గాను. అందు పడితరము, మూలఘూరు, పలకలూరు గ్రామముల సీమాచిహ్నములు వ్రాయబడి నట్లు కొంతకొంత చదువుటచే తెలుసుకొనగల్గినాను. విశ్వోత్తరుండన్న వేమభూపాలుండు అని స్పష్టముగా గానబడుచున్నది. ఆరెండు సీసపద్యములును ఒకనిచే చెక్కబడినవే పెద కోమటి వేమారెడ్డి నాటివే అనవేముని ధర్మమును చెప్పునవే.

శృం. శ్రీ—అను—పుట 19.

## అనవేముని శీలము.

కొండవీటిరెడ్లందరిలోను అనవేమారెడ్డి ధర్మాత్ముడని ప్రఖ్యాతి యావద్భారత దేశమున గడించెను. హేమాద్రి దానకాండమందు చెప్పినధర్మముల చేసెను. నిస్సీమ భూదానములను అగ్రహారదానములను బ్రాహ్మణులకు చేసి విద్యలనుపోషించెను. ఈతడును తండ్రితాతలవలెనే ఆగమశైవాచారతత్పరుడు. శ్రీశైలకుమారాదులపంచారామము లందు తనపేరితో నిత్యనైవేద్యములగు కట్టళ్ళ నేర్పాటుచేసెను. ఈకాలపు రెడ్లందరు కాశీవిశ్వేశ్వరభక్తులు. అనవేమారెడ్డికూడ శ్రీకాశీవిశ్వేశ్వరున కనేకభోగముల దత్తము చేసెను. ఈతడు శైవాచారతత్పరుడని విష్ణుద్వేషము లేదు. శ్రీకూర్మమందును సింహాచలమందును కూడ భూదానాదికముల కావించెను. అంతమాత్రము బాహ్యాడంబరమేకాదు. నిత్యమును అరుణోదయ, తపనోదయ, సంగవ, మధ్యాహ్న, సాయంకాల, అర్ధరాత్రుల నెడి షట్కాలములందును శివపూజసేయు భక్తుడాతడు. అనవేముడుకూడ వీరాన్న వేమనృపతియని పేరొందిన రాజు. యుద్ధములం దీతని ధైర్యసాహసము లనన్యములు. అందుచేతనే ఈతడు "ఛురికాసహాయుడని" వర్ణింపబడినాడు.

## IV

### కొమరగిరిరెడ్డి 1385—1407.

అనవేమారెడ్డి అనంతరము అనపోతారెడ్డి కుమారుడు కొమరగిరిరెడ్డి క్రీ॥ శ॥ 1385 సింహాసనమెక్కెను. ఈతని తల్లిపేరు మనుమాంబిక. కుమారగిరీశ్వరుని ప్రసాదమువలన జన్మించినవాడగుటచే కుమారగిరియని ఈతనికి నామకరణము చేయబడెను. ఈతనికి సింహాసనమెక్కునాటికే ఒకకుమారుడు, ఆతనికి తనతండ్రిపేరు 'వీరాన్నపోతు' అని పెట్టెను.

సుప్రసిద్ధులగు కొందరు చరిత్రకారులు ఈతడు సింహాసనమెక్కుటకు చాల శ్రమపడెనని తలచుచున్నారు. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు[1] "అనవేమారెడ్డి అనంతరము కొమరగిరిరెడ్డికి తనకొండవీటిపైతృక రాజ్యమంత సుకరముగ వశముకాలేదు. ధర్మరాజునకు కృష్ణుడేవిధమున రాజ్యమును సంపాదించి యిచ్చి యాతనిని సింహాసనమున గూర్చుండబెట్టెనో అట్లే కాటయవేముడు కొమరగిరిరెడ్డిపాలిటి కృష్ణుడయి యాతనికి రాజ్యము సంపాదించియిచ్చి యాతనిని సింహాసనమున గూర్చుండబెట్టెను. క్రీ॥ శ॥ 1391 పూర్వము కొమరగిరిరెడ్డిశాసనములు కానరాకపోవుటకు ఈరాజకీయ క్షోభముకే కారణమయియుండును. కొమరగిరిరెడ్డి పరిపాలనము సుస్థాపిత మొనరించుటకు కాటయవేముడు చాల దండయాత్రలు సాగించి పెక్కుయుద్ధము లొనరించినట్లు కన్ప

ట్టును." వ్రాసినారు. పైనవ్రాసినది యథార్థమైనట్లు తోచదు. కొమరగిరిసింహాసనమధిష్ఠించుటకు అడ్డంకు లేదిక్కునుండి వచ్చినదియును వారు తెలుపలేదు. కొమరగిరిశాసనరాహిత్యమును పురస్కరించుకొనియు కాటయవేముని తొత్తరముడిశాసనము[2] లోని

"సింహాసనే నిధాయా సౌకుమారగిరి భూధరం
అతేజయా స్మహా తేజా శ్రీకృష్ణ ఇవధర్మజం"

కాటయవేముడు కుమారగిరిని సింహాసనమందుంచి శ్రీకృష్ణుడు ధర్మరాజునువలె ప్రకాశింప జేసెను, అను వాక్యములవలనను, పైయభిప్రాయమునకు వచ్చిరని ఊహించుచున్నాము. కాని అనుపలబ్ధిశాసనము[3] బయలుపడకపూర్వమే దక్షిణహిందూదేశసంపుటములలోని కొమరగిరిమంత్రులు దండనాయకుల శాసనముల[4] పరిశీలించినచో కొమరగిరి సుస్థిరముగా సింహాసనమందుండి పూర్వదిగ్జయయాత్ర సాగించుచుండెనని చెప్పవచ్చును. అనుపలబ్ధిశాసనము ఆంధ్రేతిహాస మండలి పత్రికలో ప్రకటింపబడినతరువాత సందేహమునకు తావేలేదు. రెడ్డిరాజ్యమునకు ఉత్తర, దక్షిణ, పడమటి దిక్కులరాజులు కుమారగిరితో కౌతుకముతో అత్యంతమైత్రి నెరపుచుండిరని ఆశాసనమువలన తెలియుచున్నది. ఇట్టియెడలలో నెవ్వరివద్దనుండియు భయమునకు సావకాశము లేనేలేదుకదా. పైతృకమగు సింహాసనమును కొమరగిరి ఏవిధమైన చిక్కులులేక సుకరముగనే అధిష్ఠించెననుట నిర్వివాదాంశము. కాటయవేముని తొత్తరముడిశాసనములో "సింహాసనే నిధాయా"ది అంశములు ముందు విమర్శింపబోవుచున్నాము.

పోలయవేముని కాలమునుండియు రెడ్డిరాజ్యము పూర్వసముద్రము తూర్పు హద్దుగాను శ్రీశైలము దక్షిణసరిహద్దుగాను, ఉత్తరమున సింహాచలము సరిహద్దుగాను విస్తరింపజేయు ఆశయము తీవ్రముగా నున్నటుల శాసనములలోని స్తుతిపూర్వకములగు దానముల వర్ణనలబట్టి తెలియుచున్నది. ఈయాశయము ననుసరించియే అనపోత, అనవేమారెడ్డులు తమరాజ్యమును విస్తరింపచేసిరి. కుమారగిరిరెడ్డికి సింహాద్రిపర్యంతము రాజ్యము వ్యాపింపజేయుభారము పైబడెను. "తస్మాత్సింహాద్రిపర్యంత ప్రాచ్యావివ మహేశ్వరైః జేతవ్యాః" అను నిశ్చయమాతనికి కలిగెను.

కుమారగిరి రాజ్యమునకు రాగానే తనప్రియకుమారుని వీరాన్నపోతును యావరాజ్యాభిషిక్తుని చేసి[5] ఆతనికి కౌమారభుక్తికై సింహాద్రిపర్యంత దేశమును జయించి

2. Ep. Ind. IV—318.
3. J. A. H. R. S. XI—202—205.
4. S.I.I. V—nos. 155 (of A.D. 1385) Vol VI—no. 781 (of A.D. 1386).
5 "అథతస్మై కుమారాయ యౌవరాజ్యవిభాసినే"—J.A.H.R.S. Vol. XI, 203 మండలివారి పత్రికలోనిపాఠము సరియైనది కాదు.

యివ్వగోరెను. అందునిమిత్తమై తన యప్ప దొడ్డాంబిక భర్తయును, సామ్రాజ్యనిర్వాహకుడును, చతుర్విధోపాయనీతిప్రవీణుడును, మహాప్రభావుడును అగు కాటయవేముని పిలచి, దిగ్విజయప్రస్థానమునకు ఆజ్ఞ యిచ్చెను. కాటయవేముడు కొండవీటినుండి బయలుదేరి రాజమహేంద్రవరమునకు వచ్చి, నగరికోటలోని శ్రీ వేణుగోపాలస్వామికి తాను విజయియై వచ్చినయెడల గ్రామ మర్పణచేసెదనని మ్రొక్కుకొని, బహుళ సైన్యముల గూర్చుకొని తూర్పునాటిరాజులను జయించుటకు బయలుదేరెను. ఈ సంగతులు క్రీ. శ. 1385 లోనే జరిగియుండును. ఆ సంవత్సరము శ్రావణ బహుళ పాడ్యమినాటిదైన కాటయవేముని భూదానశాసన మొకటి పాలకొల్లు, క్షీరారామేశ్వరుని దేవాలయములో కలదు.[6] అందు కాటయవేముడు "జగవొబ్బగండ, కేళాదిరాయ, అనియమండలీకరగండ, జగదోపాల, భుజబలభీమ, పాండ్యరాయగజసింహ,సంగ్రామధనంజయ, పల్లవత్రిణయన, పల్లవాదిత్య, జగరక్షకాది బిరుద మహాహాన్మహు" డని వర్ణింపబడినాడు.

ఈ దేవసందర్శనము రాజమహేంద్రవరము కాటయవేముడు వెళ్ళుచున్నపుడు త్రోవలో చేసినదయియున్నది. కీ. శ. 1386 సంవత్సరములో కార్తికమాసంలో తన యిష్టార్థసిద్ధియగుటచే సింహాద్రినరసింహస్వామికి 'నిత్యమున్ను ఒకదండ వనమాల' పెట్టుటకు చేసిన దానమైయున్నది.[7] ఇందీతడు 'కొమరగిరిరెడ్డి ప్రధాని' అని చెప్పబడినాడు.

### కాటయవేముని తూర్పునాటి దండయాత్ర.

ఈ తూర్పునాటి దండయాత్రనుగురించి విశేషాంశములనుగురించి తెల్పు శాసనములు దొరకలేదు. ఏయేదుర్గముల నాక్రమించినదియును మాత్రము కాటయవేముని "కుమారగిరిరాజీయ" వ్యాఖ్యావతారికలో చెప్పబడినది.

"ధాటీ ఘోటీ ఖురాగ్రత్రుటిత గిరితటే యుత్రి మొల్లేటిదుర్గం।
దుర్భేదం వజ్రకూటం జితవతిరభసా, రామగిర్యాఖ్యదుర్గం।
విఖ్యాతం వీరఘోటం గలితమస్పృహదాం వీరసన్నాహధాష్ట్ర్యం।
దుర్గం కిమ్మూరుసంజ్ఞం దలితరిపుబలే దుర్గమం బెండపూండిమ్॥

ఇందు చెప్పబడిన దుర్గముల నిర్దేశము చేసినయెడల కాటయవేము డెవరిని జయించెనో యేదేశమును స్వాధీనపరచుకొనెనో తెలియును. పైన చెప్పబడినవానిలో వజ్రకూటము, కిమ్మూరు, బెండపూడి దుర్గములు ప్రోల్నాటిలోనివి. అవి ఇప్పటి పెద్దాపురంతాలూకా

6. S.I.I Vol. V, No. 155.
7. S. I. I. VI, No. 781.

తుని డివిజనులలో కలవు. బెండపూడి చిరకాలమునుండి ప్రసిద్ధిచెందిన దుర్గమమగు దుర్గము. దీనిని స్వాధీనపరచుకొనుటకు కాకతీయరాజు లెంతశ్రమపడినదిని చెప్పు కథ యొకటి స్థానికచరిత్రలలో కలదు. తరువాత కాకతీయు లీదుర్గమును బలపరచి, పెద్ద సైన్యము నందుంచిరి.[8] మొల్లేటిదుర్గముకూడ ప్రోల్నాటిలోనిదే. ఇప్పుడిది చోడవరం తాలూకాలోనున్నది. 'మాక్లేది' యను కొందరిపాఠ మపపాఠము. ఈ మొల్లేటిదుర్గము చిరకాలము ప్రసిద్ధమైనది. క్రీస్తు 17 శతాబ్దమువాడగు ఏనుగు పెద్దలక్ష్మణకవికాలజ్ఞ మహాత్మ్యములో పెద్దాపురసంస్థాన వర్ణనలోని యీ క్రిందిపద్యములో మొల్లేటిదుర్గము పేర్కొనబడినది.

వీటికాపురి, కొమ్ముర్యు, బిక్కవోలు ।
తునియు గొత్తాము మొల్లేరు ఘనతనేలె ।
వత్సవాయ తిమ్మభూపాల వరుసినుతుడు ।
రాజమాత్రుండె రాయవరాజశౌరి॥

ఈపైదుర్గములన్నియును కొప్పులవారి రాజ్యములోనివి. ఆనాడు పిఠాపురము రాజధానిగా పంచధార్లవరకునుగల ప్రదేశము—అనగా ఇప్పటి పెద్దాపురం తాలూకాలోని కొంతభాగము, తునిడివిజన్, నర్సీపట్నం తాలూకాలోని కొంతభాగము, ఎలమంచిలి తాలూకాలోని కొంతభాగము—కొప్పులరెడ్లు పరిపాలించుచుండిరి. వీరిరాజ్యము రాజమహేంద్రి రెడ్డిరాజ్యమునకు సరిహద్దు. క్రీ॥ శ॥ 1385లో ఈ కొప్పులరెడ్లరాజ్యాధిపతి ప్రోలయనాయకుడు. ఈతనిని కాటయవేముడు జయించి, రాజ్యమును కొమరగిరిరాజ్యములో కలిపివేసెను. ఈ దండయాత్రతో కొప్పులరెడ్లు నిర్మూలమైనట్లు తోచెడిని.[9]

వీరఘట్టమని పైశ్లోకములో పేర్కొనబడినది శాసనములలో వీరకూటమనియును, బీరకూటమనియును, బీరంగొట్టము బీరగొట్టమను పేర్లతో కనబడుచున్నది. ఇది కళింగదేశమందలి ముఖ్యమగు అంతర్భాగములలో నొకటి. ఈ వీరకూటమును భారద్వాజగోత్రులగు క్షత్రియులు చిరకాలమునుండి పాలించుచుండిరి. శాసనములబట్టి క్రీస్తుశకము 1350 మొదలు 1400 వరకును పురుషోత్తమరాజును, నరసింహరాజును, పురుషోత్తమరాజును పాలించిరి. ఈ రెండవ పురుషోత్తమరాజునకు సౌభాగ్యరాజు, నరసింహరాజును ఇద్దరుకుమారులు. వీరలలో సౌభాగ్యరాజు రాజ్యమును క్రీ॥ శ॥ 1400—1420 వరకు పాలించియుండెను. కాటయవేముడు బీరకూటముపై దాడివెడలినప్పుడు పైనచెప్పినవారలలో రెండవపురుషోత్తముడు పాలించుచుండెను. కాటయవేముడు ఈతని దేశములో కొన్నిదుర్గములను జయించి స్వాధీనపరచుకొనియుండెను.

8. L.R. 19, page 84.
9. కొప్పులవంశమును వ్యాసమును ఈ సంచిక 145—162 పేజీలలో నున్నది. చూడుడు.

వీరకూటరాజ్యమంతయు కాటయవేమునకు లోబడినట్లు తోచదు. ఈవీరకూటపురాజులు స్వతంత్రులై క్రీ॥ శ॥ 1420 వరకును పరిపాలించుచున్నటుల శాసనాధారములు కలవు.[10] ఈ వీరకూటపురాజులలో కొందరి శాసనములలో మానవ్యస కులజులనియును, విష్ణువర్ధన బిరుదాంకితులనియునుకూడ కలదు. వీరకూటపుదాడితో విజయయాత్ర చాలించుకొని సింహాచలస్వామిని దర్శించి, కాటయవేముడు తిరిగి కొండవీడు క్రీ॥ శ॥ 1387లో చేరియుండును.

పైశ్లోకములో రామగిరియను దుర్గమొకటి కాటయవేముడు జయించినటుల చెప్పబడినది. ఇది యెక్కడిది? డాక్టరు నేలటూరి వెంకటరమణయ్యగారు తమ వెలుగోటివారి వంశావళిలోని ఉపోద్ఘాతములో ఈ రామగిరి తెలింగాణములోనిదనియును, కాటయవేముడు దీని నాక్రమించుకొనుటచే రెండవ సింగమనాయనికిని ఆతనికిని వైరమేర్పడెనని వ్రాసినారు.[11] ఆ వైరముసంగతి అటుంచి రామగిరి తెలింగాణములోనిదా యని పరిశీలింతము. రామగిరిదుర్గమిప్పుడేపేరుతో నున్నదియును స్థలనిర్దేశము వారు చేయలేదు. కాటయవేముడు తెలింగాణముపై దాడిచేసినటుల చూపు శాసనాద్యాధారము లేమియును మాకు తెలిసినంతవరకు లేవు. పైన వర్ణింపబడిన దాడి "ప్రాఙ్నృపతుల"పైన యనియును, రాజమహేంద్ర సింహాద్రి మధ్యదేశముపైననియును అనువటితి శాసనములో స్పష్టముగానున్నది. పైశ్లోకములోకాని, శాసనములలోకాని పేర్కొనబడిన దుర్గములు రాజ్యములు తూర్పునాటివేకాని తెలింగాణములోనివికావు. అట్టిస్థితిలో రామగిరిదుర్గమును తెలింగాణములోనికి కొంపోవుట ఉచితముగాదు. ఇది ప్రస్తుతపు తూర్పుగోదావరిజిల్లాలోనే యుండవలెను. ఈ రామగిరిదుర్గమింతవరకును ప్రకాశముగాక దాగియున్నది. దీనియునికి తెలసుకొనుట రెడ్లచరిత్రమునకుముఖ్యమైయున్నది. ఇది ప్రస్తుతపు రామవరపుదుర్గమని చెప్పబడుచు తూర్పుగోదావరిజిల్లాలో చోడవరంతాలూకాలోనున్న కుగ్రామము. గవర్నమెంటువారి గ్రామపట్టికలలో ఇది కనపడదు. రాజమహేంద్రవరమునకు 20 మైళ్ళదూరములో నున్నది. ఇది యీనాడును దుర్గమము. దీని ప్రాచీనపు ఘనతను చూపు చిహ్నములు శిథిలావస్థలో కలవు. ఇది వనదుర్గమును, గిరిదుర్గమునుకూడ. ఇదియే అనదేవచోడుని ముఖ్యపట్టణము. దీని నాక్రమించియే ఆతడు రెడ్లను అనేకసార్లోడించి, క్రీ॥ శ॥ 1416 ఆప్రాంతమువరకును వారలకు ప్రక్కలో బల్లెమైయుండెను. ఈ దుర్గప్రశంస లోకల్ రికార్డులలో కలదు.[12] అనదేవ

10. S. I. I. Vol. VI. nos. 961; 988; 989; 999; 1101.

11. V.V. Madras University Publication. Introduction page 17 "Rama. giri one of the forts subjugated by Kataya Veema was included in Telingana"

12. L. R. 60 page 37. "అటుతరువాత సూర్యవంశోద్భవుడైన.........మహారాజా రామవరపు దుర్గమందు పట్టంకట్టుకొని ముప్ఫయి సంవత్సరములు రాజరికం చేసినాడు, తర్వాతయనకుమారుడు అన్నదేవ భూపాలుడు రామవరపట్టం పట్టాభిషిక్తుడై భీమవోలుసీమ గోదావరితీరంమొదలుకొని తూర్పుకోన పర్యంత రాజరికం చేసినాడు, తరువాత వేంగినదేశం రెడ్లవారి స్వాధీనం అయినది,

చోడుడు సింహాసనమెక్కినపుడు వేయించిన శిలాశాసనమొకటి రాజమహేంద్రవరములో నుండెను. దానినకలు మెకంజీ సర్వేయర్లు లోకల్ రికార్డులలో భద్రపరచియున్నారు. దానిలోకూడ రామవరపుదుర్గము అనవేమచోడుని దుర్గమని స్పష్టముగా గలదు.13 కాటయవేముడు పైనవ్రాసిన శ్లోకములో ఈ రామగిరిదుర్గమునే భేదించినట్లు వ్రాసినాడు. అన్యముకాదు. తాత్కాలికముగా కాటయవేముడు గెలచినను అన్నదేవచోడుడు లొంగలేదు. తరువాత 30 సంవత్సరములు కాటయవేమారెడ్డి అల్లాడరెడ్డి,వీరభద్రారెడ్లకు వీనినిజయించి సంహరించుటకుపట్టినది.14 ఈదుర్గము తెలింగాణములోనిదికాదు. వెలమరాజులకు దీనితో సంబంధములేదు.

## కొమరగిరిరెడ్డి పరిపాలనము.

రాజమహేంద్రవర సింహాచల మధ్యప్రదేశము కాటయవేముడు, అల్లాడరెడ్డి సహాయముతో జయించి కొమరగిరికి సమర్పించెను. ఈ పూర్వరాజ్యమునకు రాజమహేంద్రవరము రాజధాని. కొమరగిరి దీనిని తన ప్రియపుత్రుడు అనపోతారెడ్డికి యావరాజ్యము పట్టముకట్టెను. కాటయవేముడు కొండవీటినుండి మహామంత్రిగా రాజ్యతంత్రము నడపుచుండెను. అనపోతునకు రాజమహేంద్ర రాజ్యపాలనములో మంత్రి సేనాని - అల్లాడరెడ్డి. అనుపఱితి శాసనములో గజపతి మత్తద్విపముల కొమరగిరికి అర్పణ చేసినట్లు చెప్పబడినది. ఇది అతిశయోక్తి యనియే భావించవలసియున్నది. పై విజయముతో కొమరగిరిరెడ్డికి పరరాజ్య ఆక్రమణయందలి అపేక్ష వీడిపోయెను. అతనికి తన చుట్టునున్న రాజు లందరితోను మైత్రియేయుండెను. ఒకరిరాజ్యముపై నొకరికి ఆశ లేదు. చతుర్విధోపాయసంపన్నుడగు అతనిరాజ్యముపై ఇతరులకు కన్నెత్తిచూడ వీలు లేదు. కాని డాక్టరు నేలటూరి వెంకటరమణయ్యగారు, తాము ప్రకటించిన వెలుగోటి వంశావళ్యుపోద్ఘాతములో15 తెలింగాణములోని భాగమైన రామగిరిదుర్గమును కాటయవేముడు సాధించుటచే రెండవ సింగానాయునివారి యాగ్రహమునకు గురియైనదనియును అందుచే సింగానాయుని కొడుకులు దాచానాయుడు, మాదానాయుడు, కొమరగిరిరెడ్డి నవమానపరచి రనియును, విశ్వేశ్వరకవి చమత్కారచంద్రికలోని ఒక శ్లోకములో సింగానాయునికిని గౌతమీపరిసర క్షుద్రరాజులకును యుద్ధము జరిగినట్లు తెలుపుచున్నదనియును, ఈ క్షుద్రరాజులు, కొమరగిరిరెడ్డియును తద్భృత్యగణమనియును సింహాచలములోని సింగానాయుని శాసనమునుబట్టి వెలమరాజులీరెడ్డిరాజ్యముపై క్రీ. 1887 ఆ ప్రాంతమున దాడివెడలిరనియును, గజపతి కుమారగిరులు సంధి గావించుకొని రనియును

13. L. R. II—210. "సకలదేవాది బిరుద అన్నదేవ భూపాలుండు రాంవరపు పట్టణమందు పట్టాభిషిక్తు డగుచున్నూ... ... ...ఇచ్చిన శిలాశాసనము"

14. ఈ విషయము రాజమహేంద్ర రెడ్డిరాజ్య చరిత్రమందు విపులముగా వ్రాయబడినది.

15. V. V. pages 17—18.

వ్రాసియున్నారు. ఇదివరలో మేము రామగిరిదుర్గము తెలింగాణములోని భాగముకాదనియును, అనవేమచోడుని రాజధాని దుర్గమనియును ఋజువుచేసియున్నాము. అందుచే డాక్టరు వెంకటరమణయ్యగారు ప్రతిపాదించిన యుద్ధకారణము వ్యర్థమగుచున్నది. క్రీ॥ శ॥ 1387 సంవత్సరపు సింహాచలశాసనమునుబట్టిమాత్రమే కుమారగిరిపైనను గజపతిపైనను సింగానాయుడు దండెత్తినట్లూహించ వీలులేదు. ఆశాసనములో దండయాత్ర ప్రసక్తిలేదు. అది స్వామిని దర్శించి వేయించిన సామాన్య దానశాసనమని చూపట్టుచున్నది. ఇక మిగిలినది విశ్వేశ్వరకవి చమత్కారచంద్రికలోని శ్లోకము అది యిది:

నిషిద్ధసంభవోయథా:—
సామోల్లాసిని పారసీక నృపతౌ సంధాను సంధాయకే ।
కన్యారత్న సమర్పణాత్ గజపతౌ సంబంధ గంధస్పృశి ।
రాచెర్లాన్వయ శార్ఙిణం నరపతిం ద్రష్టుం రణే సాహసం ।
సంభావ్యం సహిగౌతమీ పరిసరక్షుద్ర క్షమాభృద్గణే॥
ఏవం విధనాయక సంరంభ సహన సాదరాత్ క్షుద్రక్షత్రియేషు(న)
సంభావ్యమితి నిషేధా న్నిషిద్ధసంభవః॥ 16

విశ్వేశ్వరకవి రెండవ సింగానాయుని ఆస్థానకవి. ఆతని నాయకునిగా చమత్కారచంద్రికయను అలంకారగ్రంథము రచించెను. నిషిద్ధసంభవమను అలంకారమున కుదాహరణమీ శ్లోకము. పైశ్లోకము తాత్పర్యమేమన

చతుర్విధోపాయములలోని సామోపాయము నాశ్రయించి సంధినికోరు పారసీకరాజుగాని, కన్యారత్నమునిచ్చుటచే సంబంధగంధము తగిలిన గజపతిగాని, రేచర్ల గోత్రమం దుద్భవించిన రణసాహసుడైన సింగానాయుని శార్ఙిని చూచుటకు సంభావ్యము తగినది; కాని గౌతమీపరిసరముల నున్న చిన్నక్షత్రియరాజులకు, చూచుట సంభావ్యమా? చూచుట సంభావ్యము కాదు.

డా॥ వెంకటరమణయ్యగారు దీనినిబట్టి గజపతితో యుద్ధముజరిగెననియును, అందాతడు ఓడెననియును, పిల్లనిచ్చి రాజీచేసుకొనెననియును తలచుచున్నారు. ఈ యూహలకును బలపరచు చారిత్రకాధారములు ఏమియును లేవు. పైశ్లోకములోని విషయములు

16. Velugotivari Vamsavali. Intruoduction page 17, 18.
ఇది నావద్దనున్న చమత్కారచంద్రిక తాటాకుప్రతిలోని పాఠము. దీనికిని వెంకటరమణయ్యగారిచ్చిన శ్లోకమునకును స్వల్పపాఠభేదములు కలవు.

యుదార్థములైనచో బహ్మనీ సుల్తానుతో సింగానాయుడు యుద్ధముచేసి గెల్చెనని యును, వారు సంధికోరుకొన్నట్లును, చారిత్రకాంశముగా చెప్పవలెను. కాని వెంకట రమణయ్యగారు అంతదూరముపోలేదు. పైశ్లోకమును దాని లక్షణమును కలిపి చదివిన ట్లయిన గోదావరీ పరిసరమందలి చిన్నక్షత్రియరాజులు లక్ష్యముగా గ్రహింపబడగా డా॥ రమణయ్యగారు వారలలో కొమరగిరిరెడ్డినికూడ గ్రహించుట న్యాయముకాదు. గాతమీ పరిసరమందు రాజ్యముచేయుచున్న చిన్నక్షత్రియరాజ్యములు ఆనాడు రెండే కలవు. ఒకటి ఉండ్రాజులది; రెండవది అనదేవచోడునిది. వీరు కుమారగిరి బ్రతికియుం డగా రెడ్లకు లోబడలేదు. తూర్పుకనుమలు మొదలుకొని సముద్రమువరకును గల గోదావరిలోయ కుమారగిరికి లోబడియుండెననుదానికి ఆధారములేదు. పోలవరము తత్పరిసర మన్యప్రాంతములు భీమవోలుసీమ, వీసరినాడు, కాసరినాడు, మన్నెము, అనదేవుని పాలనలో నుండెను. ఉండ్రాజుల స్వాధీనములో ప్రస్తుతవు పడమటి గోదావరిజిల్లాలోని కొన్నిభాగములు స్వతంత్రములుగా నుండెను. ఈ క్షుద్ర క్షత్రియులతో కుమారగిరిని కలవుటకు అవకాశములేదు. వారు ఆతని సామంతులు కారు. ఏవిధముగా చూచినను సింగానాయుడు కుమారగిరితో క్రీ॥ 1387 ఆ ప్రాంత మున యుద్ధముచేసెననుటకుగాని ఓడిపోయి సంధి గావించుకొనెననుటకుగాని పైశ్లోకము ఆధారముకాదు. అనపర్తిశాసనములో కుమారగిరి తనతో దక్షిణ, ఉత్తర, పశ్చిమ దేశపురాజులు అతికౌతుకముతో మిత్రులయినట్లు వ్రాయించుకొనగా చరిత్ర కాంశములన్నియు దానికి బలమగుచుండగా పైశ్లోకములోని మూరుమూాల అలంకార మునకు లక్ష్యముగానిచ్చిన సందేహాస్పదములగు అత్యుక్తులకు విశేష గౌరవమిచ్చి, కుమారగిరిరెడ్డి పౌరుషమునకు కళంక మారోపించుట న్యాయముకాదు. కుమారగిరికిని వెలమలకును విరోధమున్నట్లుగాని, యుద్ధములు జరిగినట్లుగాని చెప్పుటకు సరియైన ఆధారములు ఇంతవరకును లేవు.

## కుమారగిరి—గజపతులు.

కుమారగిరికాలమున కళింగదేశమును నాలుగవ గాంగ నృశింహదేవుడు పరిపా లించుచుండెను. ఈతనినాటికి గాంగరాజ్యము క్షీణదశలోనుండెను. గాంగరాజ్యమం దలి దక్షిణభాగములు రెడ్లాక్రమించుకొనదొడగిరి. క్రీ॥ శ॥ 1399 సంవత్సరములో గజపతి—నాలుగవ నృశింహదేవు—రాజమహేంద్రరాజ్యముపై విశేషసైన్యముతో దాడిచేసెను. కుమారగిరిరెడ్డి కుమారుడు వీరాన్నపోతు గజపతిని "విహారణగిరి"ముందు ఎదుర్కొని గొప్పయుద్ధములో ఓడించెను. ఈయుద్ధమునందు వీరాన్నపోతునకు గొగ్గ

యనాయకునికుమారుడు దేవనాయకుడు చాల శౌర్యముతో పోరాడినట్లు తోచెడిని.[17] ఈ విహారణగిరి ఎక్కడిదో తెలియదు. బహుశః యిప్పటి పెద్దాపురం, తుని డివిజన్ల లోనిదై యుండవచ్చును. ఆటకొంత అనుదానికి తిరుగుడుమెట్ట అనుదానికి "విహారణగిరి" సంస్కృతీకరణము. ఈ యుద్ధానంతరము దేవనాయకుడును వీరాన్నపోతరెడ్డియును సర్వవరభావ నారాయణస్వామిని దర్శించి దానశాసనముల వేయించిరి.[18] ఈ యుద్ధములో గజపతి ఓడిపోవుటచే కాటయవేమ, అల్లాడవేమ, వీరభద్రారెడ్లు క్రమముగ చిలకసముద్రమువరకును ఆక్రమించుకొని రాజమహేంద్రి రెడ్డిరాజ్యమును విస్తరించిరి. కపిలేశ్వర గజపతి రాజ్యమునకు వచ్చువరకును వీరిధాటికి అడ్డంకిలేకుండెను.

కొమరగిరి—విజయనగర రాజులు.

విజయనగరరాజ్యమందు కొమరగిరి సమకాలీనుడు రెండవ హరిహరరాయలు. వీరిరాజ్యము రెడ్డిరాజ్యమునకు దక్షిణ, పశ్చిమములలో వ్యాపించియుండెను. నెల్లూరు జిల్లాలోని ఉదయగిరిదుర్గము వీరి రాజ్యములోనిదయియుండెను.[19] విజయనగరరాజులు క్రమముగా ఉత్తరవుదిశ రెడ్డిరాజ్యముపై ఒత్తిడి కలుగజేయుచుండిరనుటకు సందేహము లేదు. అనవేముని రాజ్యాంతకాలమందును, కొమరగిరిరాజ్య ప్రారంభకాలమందును, (క్రీ॥ 1385—1390 మధ్యకాలమందు) విజయనగరాధీశులు రెడ్డిరాజ్యముపై దండెత్తి వచ్చినటుల వారల శాసనములబట్టి ఊహింపగును.[20] ప్రౌఢ దేవరాయలు అద్దంకి రాష్ట్రములోని పరచూరుగ్రామమును బ్రాహ్మణునికి దానమిచ్చెను. మోటుపల్లి పట్టణములో సుంకముల విధించు శాసనమొకటి దేవరాయలది కలదు. త్రిపురాంతకమందు కూడ వారలశాసనము లీనాటివి కలవు. వీనినాధారముగా చరిత్రకారులు త్రిపురాంతకమును అద్దంకియుకూడ కొమరగిరిరాజ్య ప్రారంభకాలములోనే పోయెనని తలచుచున్నారు. కాని అనుపఅతిశాసనములోను, యితరశాసనములలోనుకూడ శ్రీశైల త్రిపురాంతకములు కుమారగిరిరాజ్యములోనివిగా చెప్పబడుటచేతను, కాటయవేముడు విజయనగరాధీశులతో సంబంధగంధము కలిగినట్లు శాసనములబట్టి తెలియుచుండుటచేతను దాక్షిణాత్యులైన నృపతులు తనతో అత్యంత మైత్రితో మెలగుచుండిరను కొమరగిరి వాక్యములవల్లను, త్రిపురాంతకమువరకునుగల దేశము రెడ్డిరాజ్యములోనుండి నష్టపో

17. S. I. I. Vol. VI—no. 1.
18. L. R. II—page 258.
19. L. R. 46—277. శా. 1265 (స్వభాను సంవత్సరములో ఉదయగిరిదుర్గము కంపణ్ణ ఒడెయరు స్వాధీనమందుండెను).
20. Nellore Incriptions Vol. I; page 1, A.R. 270/1905; L.R. 42 p. 422-423

లేదని ఊహించుట కవకాశము కలదు. ఈ విషయమునుగూర్చి తగిన ఆధారములు లేవు. ఇంకను విమర్శింపతగియున్నది.

### కొమరగిరి — కుమార అన్నపోతు.

కొమరగిరికి ఏకైకపుత్రుడు - అనపోతారెడ్డి. తాతవలెను మహాపరాక్రమవంతుడని చెప్పబడినాడు. తండ్రి కితనియందు విశేషప్రేమయని వేరే చెప్పవలెనా? తాను రాజ్యాభిషిక్తుడు కాగానే భ్రాతృరామభీమేశ్వరుని కుమారునితో దర్శించి, ఆతనితొడపై నిడుకొని తులాపురుష దానము చేసెను. క్రీ. శ. 1390 కి ఆతనికి యావరాజ్య పట్టాభిషేకముచేసి, దిగ్విజయాక్రాంతమైన సింహాద్రిపర్యంత రాజమహేంద్రి రాజ్యము ఆతనికి ఇచ్చెను. ఆ సందర్భములోనే రాజమహేంద్రవరపు కోటలోని గోపినాథదేవరకు అనువఅతిగ్రామమును అనపోతారెడ్డి, కాటయవేముల ప్రేరేపణచే దానమిచ్చెను. ఈ అనపోతు క్రీ.శ. 1399 లో గజపతిని ఓడించిన ట్లిదివరలోనే వ్రాసియున్నాము. తరువాత నీతడెప్పుడో అకాలమరణము చెందెను. ఇది బహుశః క్రీ.శ. 1405, 1406 ఆప్రాంత ..ల జరిగియుండెను. ఈ దెబ్బ తిన్నతర్వాత కుమారగిరి తేలలేదు. క్రమముగా క్షీణి... శ. 1407 ఆప్రాంతమున చనిపోయెను.

### కొమరగిరి - కాటయవేముడు.

కొమరగిరికిని కాటయవేమునకును గల సంబంధము ఈ రెడ్లచరిత్రములో ఒక అపూర్వసన్నివేశము. శాసనములను, కుమారగిరిరాజీయములోని శ్లోకములను సమన్వయము చేసుకొని, ఆలోచించినకొలదిని వీరల బంధుమైత్రి ఆశ్చర్యమై తోచుచుండును. కాటయవేముడు కొమరగిరిని పెంచి పెద్దవానిని చేయుటచే పితృతుల్యుడు; విద్యాబుద్ధులు, షాడ్గుణ్యము నేరిగించుటలో గురుకల్పుడు; స్వామిహితైకపరుడగు మహామం..; చతుర్విధోపాయనయజ్ఞుడగు మహాసేనాని; రాజ్యపాలనాదక్షుడగు అమాత్య..; సమస్తశాస్త్ర సంపన్నుడగు వ్యాఖ్యాత. వీనిని సర్వథా దృష్టియందుంచుకొని కొమరగిరి కాటయవేమునియెడల గౌరవానురాగములతో నుండెను. అనవర్తిశాసనములోని "చతుర్విధోపాయ నయప్రవీణం, సామ్రాజ్యనిర్వాహ మహాప్రభావం। స్వసుః పతిం కాటయవేమ భూపం రాగాద వాదీదతి గౌరవేణ" అన్న వాక్యము సార్థకము. కాటయవేమునకు కొమరగిరియందు ఎంత వాత్సల్యము! ఎంత స్వామిభక్తి! కొమరగిరి ఆచంద్రార్కస్థాయిగా అంథ్రావని నిలిచియుండుటకు యెన్నిదానములు చేసినాడు! ఎన్నికొమరగిరిపురములు వెలయింపచేసినాడు!

కొమరగిరి కాటయవేమునకు, అతడు తనకుచేసిన సేవకుగాను, అతని పరాక్రమమునకు రాజమహేంద్రినగరీముఖమైన రాజ్యమును ఇచ్చివేసెను. దీనికి చరిత్రకారులితనిని పరిపరివిధముల నిందించిరి. శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు, "కుమారగిరిరెడ్డి యెన్ని వసంతోత్సవములు గావించి యెంతకీర్తి గడించినను, విద్వాంసుడై విద్వాంసుల బూజించి, విద్వాంసులచే స్తుతు లెన్నిగాంచినను, తండ్రితాతలు పోయినమార్గమున పోక రాజ్యమును విభాగించి, మేనమామకు రాజమహేంద్రపురరాజ్యము నొసంగుట సర్వానర్థములకు మూలమయ్యెను. గావున నా కార్య మవివేకకార్య మనిపించుకొనక మానదు."[21] అని సామ్రాజ్యవిభాగమును గర్హించియున్నారు. కాని కొమరగిరి చేసిన దానిలో గర్హింపదగినది లేదు. ఏలనన, కాటయవేముడు స్వపరాక్రమమువలన సంపాదించిన ఆతని దేశము ఆతనికిచ్చుటలో విశేషమేమి? పైతృకమగున దేదియును కాటయవేముని కివ్వలేదు. రాజ్యవిభాగమువలన రాజ్యాంగబలహీనత కాలేదు. కాటయవేముడు చివరవరకును కొమరగిరిని తన స్వామిగానే ఒప్పుకొనియున్నాడు. రాజమహేంద్రరాజ్యము స్వతంత్రరాజ్యము కాలేదు. కొండవీటిరాజ్యమునకు లోబడియే యుండెను. కుమారగిరి కుమారుడును, కాటయవేముని కుమారుడును బ్రతికియున్న యెడల ఈ రెండురాజ్యములకు వైర మేర్పడుటకు అవకాశమే లేకపోయియుండును. వారివురు చిరజీవులైయుందురని ఆశించియే వారీపనిచేసిరి. దైవము మరొకవిధముగ తలచునని వా రనుకొనలేదు. ఈ విభాగమునకు కారణము కొమరగిరికి కాటయవేమునియందు గల ప్రేమయే కారణముగాని అన్య మేమియునుకాదు.

ఇదివరలో చరిత్రకారులలో చాలమంది కొమరగిరి జీవిత కాలములో కొడుకు అనపోతారెడ్డి చనిపోవుటచే పెదకోమటివేమారెడ్డి సింహాసనమునకు సన్నిహిత వారసుఅయి రాజ్యమాతనికి పోవుట కాటయవేమునకు సహింపరానిదయ్యెననియును, కాటయవేముడు తానే సింహాసనము ఆక్రమించుకొనుటకు ఆశించెననియును, దానికి పెదకోమటివేముడు తగాయిదా చేసెననియును, అందుచే తునితగవుగ కొమరగిరిరాజ్యమును రెండుముక్కలుగ చేసెననియును వ్రాసియున్నారు.[22] ఈ యూహ కుమార అనపోతారెడ్డి చనిపోయినతరువాత రాజమహేంద్రవర రాజ్యదానము జరిగినదని తలచుట. ఇదిఅసంగతము. కుమార అనపోతారెడ్డి క్రీ॥శ॥ 1399 వరకును బ్రతికి

21. ఆంధ్రుల చరిత్రము, Vol. III — 193-194.

22. Trirevani Vol. VI—279—280 Velugotivari Vamsavali *Introduction* page 19.

యుండెనని, సర్వవరపు భావనారాయణస్వామి ఆలయముపైనున్న ఆతనిశాసనమునబట్టి యిదివరలోనే నిర్ణయించియుంటిమి. "కుమారగిరి భూనాథోయస్మై విక్రమతోషితః" అను రాజ్యదానశ్లోకము శా॥శ॥ 1315 క్రీ॥శ॥ 1315 నాటి కాటయవేముని గోపవరశాసనములోనేయున్నది. ఈశాసనము ప్రవర్తింపబడిన 4 సంవత్సరములు కుమార అనపోతారెడ్డి బ్రతికెనని చెప్పుటకు ఏమియు ఆక్షేపణలేదు. అట్టిస్థితిలో ఆతడు చనిపోయిన తర్వాత రాజ్యవిభాగము జరిగెననుట సరికాదు. హేతువుకూడ విసర్జనీయమే.[23]

## కొమరగిరి మరణము.

కొమరగిరిరెడ్డి క్రీ॥శ॥ 1400 మరణించెనని శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారును[24] క్రీ॥శ॥ 1403 వరకును పరిపాలించినటుల డాక్టరు నేలటూరి వెంకటరమణయ్యగారును వ్రాసియున్నారు.[25] బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు "కొమరగిరి 1400, 1404 వరకు రాజ్యమేలెను" అని వ్రాసియున్నారు [26] వీరియుద్దేశప్రకారము "అతడు (కొమరగిరి) అటుతర్వాతకూడ నాల్గయిదేండ్లు జీవించినట్లున్నాడు" అని రాజ్యచ్యుతిని సూచించియున్నారు. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారుకూడ "కొమరగిరిపాలనము క్రీ॥ 1400 లో ముగియుచున్నది. కాని యితడు క్రీ॥ శ॥ 1402 వరకయినను జీవించియున్నటులు శాసన ప్రమాణము కలదని వ్రాసియున్నారు.[27] మేమీ యభిప్రాయములతో సేకీభవించము. కొమరగిరి క్రీ॥ శ॥ 1399లో జీవించియున్నటుల సర్వవరములోని గొగ్గయదేవనాయకుని శాసనమువలనను, క్రీ॥ శ॥ 1402లో జీవించియున్నటుల తాళ్లూరి సాతానిమఠములోని భండారుశెట్టిప్రభువు శాసనమునుబట్టి తెలియుచున్నది. తాళ్లూరిశాసనములోని "స్వస్తి శ్రీశకవరుషంబులు 1324 అగునేంటి చిత్రభాను సంవత్సర పుష్య బ॥ నాడు మకరసంక్రమణ పుణ్యకాలమందును కాటమరెడ్డి వేమారెడ్డిగారి అనతిని కొమరగిరి రెడ్డింగారికిని వారిదేవులకును శాశ్వతమైన కీర్తి సుకృతములు కలుగునట్లుగా..."స్వస్వామినః తద్వనితా జనస్య యశో, ధనశాశ్వత ధర్మహేతోః॥ అను వాక్యములనుబట్టి కొమరగిరిరెడ్డి జీవించియున్నట్లు గ్రహించవచ్చును. కొమరగిరిరెడ్డిభార్యల ప్రశంసయున్నదికాని అనపోతారెడ్డిమాటలేదు. బహుశః అనపోతారెడ్డి అప్పటికి చనిపోయియుండవచ్చును. ఇట్టి

---

23. J. A. H. R. S. Vol. XI page 212.
24. ఆంధ్రులచరిత్రము—III—193.
25. వెలుగోటివారి వంశావళి—ఉపోద్ఘాతము— పుట 19.
26. శృంగారశ్రీనాథము—పుట—61.
27. భారతి— సంవత్సరాది సంచిక —పుట—285.

సాక్ష్యములే సర్వవరములో గాక 1327 నాటి మరియొక శాసనమందున్నవి. వానిను దాహరిం తును. "శకవరుషంబులు 1327 అగు నేంటి పార్థివ సంవత్సర నిజఆషాఢ శుద్ధ ౧ బుధ వారం కాటమరెడ్డి వేమారెడ్డింగారు తమస్వామి కొమరగిరిరెడ్డింగారికిన్ని అమ్మంగార్ల కున్నూ పుణ్యమవునట్లుగా" వసంతరాయమంటపము కట్టించెను.[28] ఇ దలి "కీర్తిసుకృత మవునట్లుగా" పుణ్యమవునట్లుగా అనుమాటలు జీవించిన వారినిగురించి చెప్పునవియే అయియున్నవి. మధురపూడి శాసనములో[29] కాటయవేముడు "తనస్వామి కొమరగిరి రెడ్డిగారికి అక్షయసుకృతమౌనట్టుగా దానముచేసినది శక 1327 సం. క్రీ॥శ॥ 1405లోని శాసనమునుబట్టికూడ కొమరగిరి అప్పటికి జీవించి రాజ్యముచేయుచుండెనని ఊహింప వచ్చును. కొందరు "అక్షయసుకృతమనుమాటలు మరణించినవారినిగూర్చి వ్రాయుదు రని అభిప్రాయపడుచున్నారు. అది సరికాదు. అనేకశాసనములలో ఈ పదము బ్రదికి యున్నవారలగూర్చి వ్రాయబడినది. చూడుడు. సర్వవరములోని శాసనములో[30] కడి యం మాచినేని......తనకు స్వామియయిన కాటమరెడ్డి వేమారెడ్డిగారి కొమారుడు కొమరగిరిరెడ్డిగారికిని,వారి దేవులకున్నూ అక్షయసుకృతమౌనట్లుగా......శక 1336లో శిలామండపము కట్టించెను. ఆనాటికి కాటయవేముని కుమారుడు బ్రతికియున్నట్లు ఇతర శాసనాధారము కలదు. శా॥శ॥ 1328, క్రీ॥శ॥ 1406 లోని మరియొక శాసనములో[31] కాటమరెడ్డి వేమారెడ్డిగారికిన్ని, వారి దేవులకున్నూ, కాటమరెడ్డి వేమారెడ్డిగారికుమార్డు కొమరగిరిరెడ్డిగారికిన్ని వారిదేవులకున్నూ అక్షయసుకృత మౌనట్లుగా ద్రాక్షారామ భీమేశ్వరస్వామికి తిరుచుట్టుమాలె కట్టించినట్లు గలదు. ఆనాటికి కాటయవేముడును అతని కుమారుడు కొమరగిరియును బ్రతికియున్నారనుట నిర్వివాదము. కావున కొమర గిరి క్రీ॥శ॥ 1405 తరువాత నెప్పుడో చనిపోయియుండునని యూహించుట సమంజసము.

కొమరగిరి శీలము.

ఈతడు భోగైకపరాయణు డనియును, వారాంగనాచింతితబుద్ధియనియును, అస మర్థు డనియును, వీరుడు కాడనియును, ఈతనిమూలమున రెడ్డిరాజ్యమునకు వినాశ కాలము దాపురించెననియును, చరిత్రకారులు బహుగా ఈతనిని గర్హించివ్రాసినారు.[32]

28. L. R. II—258.
29. L. R. 19—111.
30. L. R. II—125. శృంగార శ్రీనాథము_అనుబంధము_పుట_8.
31. E. P. Ind. IV—page 390.
32. Triveni, Vol. VI—page 299. Anavema ... was succeeded by his incompetent nephew Kumaragiri who was more at home in the company of

ఈ యూహలు సరియైనవి కావు. కొమరగిరి వేయించిన శాసనములు నిన్న మొన్నటిదాక దొరకలేదు; అవియైనను కొద్ది. ఈతనినిగూర్చి కాటయవేముని కుమారగిరిరాజీయము లోని ప్రశస్తిశ్లోకములవలనను, శ్రీనాథుని హరవిలాసములోని కొమరగిరి వసంతోత్సవముల వర్ణనవల్లను పండితుల కెక్కువగా తెలియును. అవచి తిప్పయ సుగంధభాండాగార అధ్యక్షతను ప్రశంసించుపట్ల వసంతోత్సవముల వర్ణించెను. దానిని బట్టి కుమారగిరి భోగైకపరాయణు డనుట యుక్తము కాదు. కాటయవేముని మాళవికాగ్నిమిత్ర వ్యాఖ్యలోని

"భాగ్యంనామ సమగ్రమీదృశ మతిస్నేహైకపాత్రం యతో
వీరం కాటయవేమ ముద్ధత రిపుక్ష్వంసే నియుజ్యస్వయమ్
నిత్యం నందతి నర్తనైరభినవైః కాంతైర్వసంతోత్సవైః
సంతానాభ్యుదయైః కుమారగిరిభూపాలో నృపాలోత్తమః—

అను శ్లోకము స్వోత్కర్షరూపమగు కాటయవేముని వీరత్వమును, రాజ్యపాలనదక్షత్వమును, కొమరగిరిభాగ్యమును, వైభవమును, సప్తసంతానశాలిత్వమును మాత్రమే సూచించును. అంతేనే కాని కొమరగిరి నిత్యము వారాంగనానాట్యములతో ఆనందించువాడని, మిగతా యేపనీ చూడలేదను చారిత్రకాంశమం దిమిడియున్నటుల గ్రహించుట న్యాయముకాదని మా యభిప్రాయము. ఇట్టివానిని అనుసరించి కొమరగిరియెడల పూర్వచరిత్రకారులు దుర్భ్రమ చెందినారు. కొమరగిరిపాలనకాలము ఆంధ్రదేశచరిత్రములో గొప్పఘట్టము. కొమరగిరి విద్యానగర రాజులతోను, బహ్మనీసుల్తానులతోడను, వెలమ రాజులతోడను చెలిమి పాటించియుండెను. వారీతనిపై ఎత్తిరాలేదు. కొమరగిరి వారలపై పోలేదు. దేశము నిరుపద్రవ మగుటచే లలితకళలు విస్తరించెను. వసంతోత్సవములు, కవిపండిత పరీక్షలకును, సంభావనకును సమయ మయ్యెను. కొమరగిరి ఆంధ్రప్రజల ప్రేమకు పాత్రుడయ్యెను. అతని నాట్యశాస్త్రపాండిత్యము, అభినయ విద్యకు ప్రోత్సాహక మయ్యెను. "జయతి మహిమా" ఇత్యాదిశ్లోకము కొమరగిరి వేశ్యాలంపటు డగుటను తెల్పునది యనువారల యభిప్రాయము మాకు సమ్మతము గాదు. కొమరగిరివీరుడు. అనపర్తిశాసనములో అతడు ప్రతాపాభరణుడని చెప్పబడి

---

scholars and dancers than among his solidiers. The task of defending the kingdom fell upon his brother-in-law and minister, Katayavema."

శృంగారశ్రీనాథము, పుట 86. ఆంధ్రులచరిత్రము, పుట—194

Vizianagara—Origin of the City and Empire — page, 125. "The decline of the Reddi kingdom began with the accession of Kumaragiri."

నాడు. కాటయవేముని కొమరగిరి పురశాసనములో[33] అతని ప్రతాప మిట్లు వర్ణింపబడినది.

యస్యాస్తాం విజయే సమస్తవిదితౌ శ్రీశైల సింహాచలౌ।
స్తంభౌ పశ్చిమపూర్వ దిగ్విభజన వ్యాఖ్యాన వైజ్ఞానికౌ॥
త్వంగత్త్వైర్య తురంగ నిష్ఠుర ఖురశ్రేణీ కృపాణ।
హేతుస్ఫూర్జచ్చంద్రకరాజి రాజిత లిపిస్తోమాంకితాదిత్యకౌ॥

## గృహరాజసౌధము.

కొమరగిరి అనేకములగు లీలాగృహములు నిర్మించెను. తాను నివసించుటకై గృహరాజసౌధమనెడి మహోన్నతమైన ప్రాసాదము నిర్మించెను. దీనిప్రతిభ ఆనాడు దేశదేశములు వ్యాపించెను. కొండవీటికైఫీయతులో "ఈకోనేటికి పశ్చిమం హద్దు అనుకుని గృహరాజు మేడదిబ్బ" అనిన్నీ "రెడ్లవారు ప్రభుత్వంచేసే కాలమందు కోమటి వేమారెడ్డిగారు ... ... వంటిస్తంభంమేడ కట్టించి, తమకు యిష్టమైన ఆదిలక్ష్మి, కామేశ్వరి అమ్మవారికి సింహాసనస్థానముగా నేర్పరచి"...అనిన్నీ ఉన్నది. గృహరాజసౌధము పెదకోమటివేమారెడ్డిచే నిర్మించబడినట్లున్నది. అప్పటికున్న ఆధారములనుబట్టి[34] శ్రీవేటూరి ప్రభాకరశాస్త్రులవారు దీని నంగీకరించిరి.[35] ఆంధ్రేతిహాసమండలివారి పత్రికలో ప్రకటింపబడిన కాటయవేముని శక. 1330 సం॥రపు కొమరగిరిపురశాసనమునుబట్టి ఈగృహరాజసౌధము కొమరగిరిచే నిర్మింపబడినట్లు స్పష్టముగా చెప్పబడినది. పెదకోమటివేముడీగృహరాజసౌధమున తాను రాజైనతరువాత నివాస మేర్పరచుకొన్నట్లును, సంతానసాగరశాసనములోని ఈక్రింది శ్లోకమువలన తెలియుచున్నది.

"అశ్రాంతం గృహరాజసౌధ నివసల్లక్ష్మీ కరాభ్యంతర।
క్రీడాం భోరుహ తాళవృంత నటన ప్రస్తావవిస్ఫూర్జితః।
వాయుః కేసరవాసనా సురభితో యస్యార్థిచింతామణేః।
దారిద్ర్యగ్లానిహతి దానకేళిజనితం స్వేదాంభసాం జాలకమ్॥"

## VI. పెదకోమటి వేమారెడ్డి. 1407—1420

కొమరగిరిరెడ్డి కీర్తిశేషుడుకాగా, అతని సన్నిహితజ్ఞాతియగు పెదకోమటి వేముడు

---

33. J.A.H.R.S. Vol. XI, page 209.

34. లీలాగృహాః కనకరత్న మయైరశేషాః। ప్రాసాద మున్నతశిఖర గృహరాజసంజ్ఞమ్॥
J.A.H.R.S. Vol. XI; 209-210. 35. శృంగారశ్రీనాథము, పుటలు 106-120.

కొండవీటి సింహాసన మెక్కెను. కొమరగిరి జీవితకాలములో నీతనికి రాజ్యము కలదా యని పరవివాదము విద్వాంసులలో నేర్పడినది. ఇది ఫిరంగిపురపు మూలగూరమ్మ గుడి పైని శాసనపు అపపాఠముపైని శ్రీ కొ॥ లక్ష్మణరావుగారు చేసిన వ్యాఖ్యానముపై నేర్పడినది. కాని కొమరగిరిరెడ్డి కాలములో నీతనకి స్వతంత్ర రాజ్యముండెనని యూహించుటకు ఆధారములు లేవు. పెదకోమటి రెడ్డి తండ్రి మాచారెడ్డి కాలమునుండియు వీరికి కొన్ని "స్థలములు" భుక్తికై యివ్వబడి, వారల స్వాధీనములో నుండెనని యూహించుట కవకాశము కలదు. ప్రోలయవేముడు "పరాక్రమమున బహుభూములాక్రమించి, అనుజ తనుజ బాంధవ మిత్రజనులకిచ్చె" నని హరివంశమునందు కలదు. ఇట్టి సంప్రదాయము అనాటి భారతీయ రాజ్యాంగములో కలదు. వేమభూపాల చరితమందు ఇట్టి యూహను బలపఱచు వాక్యములు కలవు. ప్రోలయవేముని అన్న మాచారెడ్డిని గూర్చి "ధనదపుర ప్రభృతినిఖిల నగరాణి" అనగా ధనదపురము లేక చందవోలు, నగరములను జయించి నాడనియును, "భువన భారముద్వహన్" అనుటచే సామంతరాజ్య మేలెననియును, యూహించవచ్చును. అందే, పెదకోమటి రెడ్డినిగూర్చి, "తతః క్రమేణ గుణజ్యేష్ఠోపి శేషతః పాలయితా బభూవ చతుర్ణవ మేఖలా యాధరాలక్ష్మ్యాః.........పెద్దకోమటేంద్ర ఇతి రాజనికరా వదాతచరితో రాజరాజ ప్రభావో రాజా-"అని చెప్పుటచే పెద్దకోమటిరెడ్డి కూడా, తన తండ్రి సామంతరాజ్యమున కేలికై నట్లూహించవచ్చును. పెదకోమటి వేమారెడ్డి కొండవీటి గద్దెనెక్కక పూర్వమీ సామంతరాజ్యము పాలించెనని చెప్పుట సమంజసమేయగును. పెదకోమటి వేమారెడ్డి రాజ్యమునకు వచ్చినతరువాత తనతమ్ముడగు మాచారెడ్డికి కొండపల్లి స్థలమిచ్చెను. దీనినిగూర్చి బలిజేపల్లి శాసములో "తస్యానుజో వేమనృపస్య మాచక్షితీశ్వరో లబ్ధమహీవిభాగః శ్రీ కొండపల్లీం నిజరాజధానీం కృత్వాము ఖదీవ్యతి ధర్మధుర్యః" [1] ఇందు వర్ణింపబడిన మహీవిభాగము ఔపచారికముగా గ్రహింప వలసినదే.

పెదకోమటి వేముడు కొండవీటి రాజ్యమెప్పుడెక్కెననునది చాలచిక్కగు అంశముగా నున్నది. కొందరు చరిత్రకారులు కుమారగిరిరెడ్డి జీవితాంతపు కాలములోనే పెదకోమటివేముడు రాజ్యమాక్రమించెనను వాదమొకటికలదు. [2] దీనినిసాధించు ప్రమాణములు మాకు కనబడలేదు. మూలగూరమ్మ కొండమీదనున్న శాసనములోని [3]

---

1. శృంగార శ్రీనాథము అనుబంధము పుటలు 10_11.

2. ఆంధ్రుల చరిత్రము—3భా. పుట 196. 3. శృం॥ శ్రీ॥అనుబంధముపుట 19.

"క్రమపరిప్రాప్త సామ్రాజ్య సింహాసనాధ్యాసి యై అఖిల రాజాధిరాజ
పరమేశ్వరుండాజిపార్థుండు పెదకోమటన్న వేమాధీశుడు............"

అనుమాటలు ఈతడు కుమారగిరి పరిపాలనముచేయుచు కాలధర్మము నొందినతర్వాత, క్రమపరిప్రాప్త సామ్రాజ్య సింహాసనాధ్యాసియైనట్లు స్పష్టము చేయుచున్నవి.

## పెదకోమటి వేముడు—కాటయ వేముడు.

కుమారగిరి జీవితకాలములోనే రాజమహేంద్రి ముఖ్యరాజ్యమును కాటయవేమునికిచ్చివేసెనని ఇదివరలోనే వ్రాసియుంటిమి. ఈ రాజ్యమును జయించి ఆక్రమించినవాడు కాటయవేముడు. కొమరగిరి ప్రధానిగానే దీనిని జయించెను. ఇది కొండవీటిరెడ్డి రాజ్యములోని భాగమే అనిచెప్పవలెను. కాని కుమారగిరి దీనిని కొండవీటి రాజ్యములోనుండి వేరుపరచెను. కొండవీటి సామ్రాజ్యములో తిరుగ దీనిని కల్పుకొనుటకై పెదకోమటి విస్తారమగు సైన్యముల గూర్చుకొని రాజమహేంద్రవర రాజ్యముపై దండెత్తెను. కాటయవేముని వియ్యంకుడును, రాజమహేంద్రవర రాజ్యసర్వసేనాధిపతియునగు అల్లాడరెడ్డి వేముని సైన్యములను రామేశ్వరమువద్ద నెదుర్కొని, ఓడించెను. ఈ విజయ ప్రస్తావము అల్లయవేముని కోరుమిల్లి శాసనములోను కొమ్మన శివలీలావిలాసములోను కలదు. "హత్వా కోమటివేమ సైన్యనికరంభూయోపి రామేశ్వరాత్" అని[4] ఈ యుద్ధములో కోమటివేముని సైన్యములు నిశ్శేషముగ ఖండింపబడెను. కోమటివేముడు వెనుకకుమరలిపోయి తిరుగ రాజమహేంద్రి రాజ్యముపై కన్నెత్తి చూడలేదు. రాజమహేంద్రిరాజ్యము శత్రునిష్కంటకమయి స్థిరపడెను.

పెదకోమటి వేమారెడ్డి కాలమునాటికి తెలింగానములోని వెలమరాజ్యము బలిష్ఠముగాలేకుండెను. వీరిరాజ్యము పశ్చిమమున గుల్బర్గా మహమ్మదీయరాజ్యపు ఒత్తిడిచేతను దక్షిణపుతూర్పుటెల్లల విజయనగర కొండవీటి రాజ్యముల ఒరపిడిచేతను విస్తరించలేకుండెను. పెదకోమటి, ఫిరోజిషా బహ్మనీసుల్తానుతో మైత్రినెరపుచుండెను. వెలమరాజులకును ఫిరోజిషాబహ్మనికిని సంఘర్షణమేర్పడెను. ఇట్టిస్థితిలో కుమారవేదగిరి కొండవీటిపైదండెత్తెను. అందు వేముడోడిపోవుటయు, వేముని తమ్ముడగు మాచారెడ్డి తలగొట్టి కుమారవేదగిరి "తమ్మపడిగమున" పెట్టుటయు సంభవించెను.[5] ఈ యవమాన

---

4. Ep. Ind. XIII—241.

5. ఆ కొమారవేదగిరి వాడే యనవేమారెడ్డి తమ్ముని మాచారెడ్డినిగొట్టి తమ్మపడిగానబొదిగించిన నా యనవేమారెడ్డి పినవేదగిరినేనిజంబి తమ్మపడిగానబొదిగించెను.

మును భరింపలేక పెదకోమటి వేమారెడ్డి గొప్పసైన్యముతో వెలమరాజ్యముపై దండెత్తి కుమార వేదగిరినేని జంపి అతని తలతమ్మపడిగాగానబెట్టించెను.[6] వెలమలు వెంటనే ప్రతీకారముచేయుటకు శక్తిలేక వేచియుండిరి. ఈ కలహమింతటితో ఆగక కొండవీటి రెడ్డి రాజ్యభగ్నమునకు కారణమయ్యెను.

పెదకోమటి ఈవిజయానంతరము కొండవీటనుండి శాంతియుతముగ రాజ్యము చేయనారంభించెను. వేముడు రెడ్డిరాజులందరికంటెనురసికుడు. స్వయముగ మహాకవి. పండితుడు. అలంకారశాస్త్రవేత్త. సంగీతశాస్త్రజ్ఞుడు అందుచేతనే.

చూడామణిర్నృపాణాం దుర్మదపరివంథి శిఖరిదంభోళిః
సర్వజ్ఞచక్రవర్తీ పెద్దకోమటి వేమభూపతిర్జయతి॥

అను శ్లోకము దేశదేశములవ్యాపించెను. ఇతని విద్యారసికతను గ్రహించియే విద్యానగరరాజుల ఆస్థానియుండలి వామనభట్టబాణుడీతని నాశ్రయించెను. రసికుడు కావుననే శ్రీనాథుడీతని ప్రాపుచేరెను. గృహరాజసౌధము సరస్వతీమందిరమాయెను. దేశములనుండియు. పండితులు కవులు విద్యాపరీక్షణలనొంది సమ్మానితులగుచుండిరి. ఈపరిస్థితులు వాఙ్మయాభివృద్ధికిస్ఫోరకములుగదా! వేముడు సాహిత్యచింతామణియను అలంకార శాస్త్రగ్రంథమును, సంగీత చింతామణియను సంగీత శాస్త్రగ్రంథమును, వీరనారాయణచరితమను భాణమును శృంగారదీపికయను అమరుకకావ్యవ్యాఖ్యానమును, హాలుని సప్తశతిలో నూరు ప్రాకృతగాథలకు వ్యాఖ్యానమును రచించెను. ఇది చూడ, వేమునియాస్థానమున దేశభాషయగు తెలుగుకంటె దేవభాషయగు సంస్కృతమునకే ప్రాముఖ్యత అయినట్లు తోచుచున్నది. వేముని యాస్థానకవి వామనభట్టబాణుడు. శ్రీనాథుడు ఆస్థానవిద్వాంసుడు; విద్యాధికారి. శ్రీనాథుని తెలుగుకవితాచమత్కృతిని ఆకాలమందలిరాజులు మెచ్చియుండరా? ఉన్నచో వారేల అతని కృతిభర్తలు కాలేక? ఏకారణమున కాశీఖండ భీమఖండములవంటి మహాకావ్యములకు మంత్రులే పోషకులైరి? హరవిలాసమువంటి ఉత్తమకావ్యము అవచితిప్పయసెట్టికి ఏల అంకితము ఆయెను? చాళుక్యరాజరాజు ప్రారంభించిన దేశభాషాపోషకత్వము, కాకతీయులనా

6. పెదకోమటివేమునకును మాచారెడ్డికిని రామలక్ష్మణులకిద్దరకునుగల సౌభ్రాత్రముగలదనితోచెడిని.

వేమాధిపోమాచ విభుశ్చనందనా । శ్రీ కోమటీంద్రస్య గుణైకసంశ్రయా ।
భూలోకమోహోదర జన్మవాంఛయా । భూరావతీర్ణావివ రామలక్ష్మణా ।

అను అలపాటి శాసనములోని మాటలు సార్థకములు.

డును, రెడ్డనాడును, వెలమలనాడును అంతరించినది. వీరు సంస్కృతమునే యాదరించిరి. వీరిమంత్రులు, దండనాయకులు సామంతులు, దేశభాషనాదరించిరి. కాళిదాస భవభూత్యాదులతో పోల్చుటకైనను వీలులేని వామనుడుకవియని ప్రగల్భించుటయును సంస్కృతప్రాకృతములలో అనేకులగు మహాకవులకద్దియైన శ్రీనాథుడు "విద్యాధికారీ శ్రీనాథోవీర శ్రీవేమభూపతేః" అని చెప్పకొనుటయును నేడు మనకువింతగా తోచవచ్చును. అది సంస్కృతసాహిత్యముయొక్క ప్రతిభ. తిరుగ కృష్ణదేవరాయలు కాలమువచ్చువరకును, దేశభాషా ప్రాధాన్యము గుర్తింపబడలేదు.

వేముడు మహాదానముల ననేకములచేసెను. అనేకాగ్రహారముల పాత్రులగు శాస్త్రపండితులకిచ్చెను. వైద్యశాస్త్రమునుపోషించెను. ఆయుర్వేదశాస్త్రపారంగతుడు వరహితునివంశమందుజన్మించిన భూలోకధన్వంతరియగు భాస్కరార్యునికిపొన్నుపల్లె వేమవరము శా॥శ 1326 లో దానమిచ్చెను. పెరియవిళ్ల మునిమనుమడునుభట్ట భాస్కరార్యునిమనుమడును విళ్లయార్యునికొడుకును అగు సింగనామాత్యునికి పొన్నుపల్లెను దానమిచ్చెను. ఈ పెరియవిళ్లకూడ, అష్టాంగమగు ఆయుర్వేదశాస్త్రపారంగతుడు. పైగా శివభక్తుడు. కర్మబ్రహ్మమీమాంస, పతంజలి మహాభాష్య, న్యాయశాస్త్రముల నభ్యసించినవాడు. మరియొక అగ్రహారప్రతిగ్రహీత పెద్దియజ్వ జ్యోతిష శాస్త్రపండితుడు. బ్రహ్మసిద్ధాంత, సూర్యసిద్ధాంతముల నభ్యసించినవాడు, త్రికాలవేత్త. ఇతడు వేముని వలన శా॥శ॥ 1326 సంవత్సరము కల్వపాములగ్రామమును పడసెను. శాలివాహనశక 1341 సంవత్సరమున గంగాధరజ్యోతిషికుని పెద్దకుమారుడును బ్రహ్మ సూర్య సిద్ధాంత వేదియునగు రామచంద్రజ్యోతిషికునకు రుద్రవరమగ్రహారముగాచేసి అందు 33 భాగముల నీతనికిచ్చెను.[7]

తండ్రి తాతలవలెనే వేమారెడ్డికూడ పాశుపతశైవమునందభినివేశము కలవాడు. వేమారెడ్డి తమ్ముడు మాచారెడ్డి పాలగుమ్మి శ్రీకంఠగురు శిష్యుడును, పంచాక్షరమంత్రవరుడును అగు పోతనార్యునకు బజ్జేపల్లి నగ్రహారమునిచ్చెను. వేముడు స్వయము శా॥ శ॥ 1327 సంవత్సరమున శివరాత్రి పుణ్యకాలమున, పినపాడు గ్రామమును, శ్రీశైలమున శంకరదేశికునకు అగ్రహారమిచ్చెను. ఈ శంకరగురుని వంశమువారిప్పటికిని పినపాటి యుంటున్నారనియును, ఉద్భటారాధ్య సంతతివారనియును శ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రులువారు వ్రాసియున్నారు. వేముని మంత్రి మామిడిసింగామాత్యుడు "శ్రీగురు శంకరమాని దయాగారవ నిత్యవర్ధితాన్వయుడు" పైశంకర దేశికుడును ఈ గురుశంకర

7. వేమునిమంత్రియగు సింగనామాత్యుడు క్రీ॥శ 1418 లో సోమసిద్ధాంతమునకు వ్యాఖ్యరచించిన, కాశికశిఖామణి.

హానియును ఒక్కరేయనుటకు సందేహములేదు. వేముని ఆస్థానకవి వామన భట్ట బాణుడునుకూడ శైవమతాభిమానియే! వీరనారాయణ చరితమునందు వేమభూపాల చరితములో నాతడు వింధ్యవాసినీ దేవాయతనమున, పెదకోమటి వేముని సర్వోపకరణ సమగ్రమగు పూజను విపులముగా వర్ణించెను. 'జయమహాదేవీ—జయతు విభురాదికాపాలికః—జయతు భైరవతంత్రమ్—' ఇత్యాదివాక్యములపట్టి, వేముడును, వామనుడును కూడా కాపాలికభైరవ తంత్రోపాసకులని నిరభ్యంతరముగా చెప్పవచ్చును. లేనియెడల చక్రవర్తి విజయప్రశస్తి గూర్చిన గ్రంథములో ఈ విపులవర్ణన మనావశ్యకము—వేమునికిష్టము లేనిది వ్రాసియుండడు—విద్యాధికారియగు శ్రీనాథుని శైవమతాభినివిష్టతను గూర్చి వేరేచెప్పనక్కరలేదు. అయినను వేముడు సమస్తమతసహనము కలవాడు. కల్వపాముల అగ్రహార ప్రతిగృహీత పరమ విష్ణుభక్తుడు—

అతనివర్ణనమిట్టిది:—

“కారకబ్రహ్మ తత్త్వార్థస్తాపింఛదళమేచకం
లక్ష్మణానుచరంధామ రామాఖ్యంయస్యదైవతం”

ఆలపాటి వేమరాగ్రహార ప్రతిగృహీత విశ్వేశ్వర విద్వాంసుని తండ్రి శాపానుగ్రహదక్షుడగు లక్ష్మీనరసింహ మంత్రసిద్ధుడు' పొట్లపాటిని అగ్రహారముగ పడసిన, పిసిపాటి రామచంద్ర సోమయాజి, “బ్రహ్మవిద్వాంసుడు”. వేముడు పోషింపని విద్యలేదు. గౌరవించి ధనమొసగని పండితుడులేడు; ఆదరింపని కవిలేడు; అయాచితాన్నదానమునకు ఏర్పాటుచేయబడని దేవాలయము లేదు. ఈ శ్లోకములు చూడుడు:

శ్రీశైలేస్థిర మూలకాముపగతోవృద్ధిం కుమారాచలే
పంచారామ తవేప్రతానసుమహా సింహాచలేంద్రేతతః॥
శ్రీకూర్మే పురుషోత్తమే కుసుమితాయద్ధర్మకీర్తిర్లతా
కాశ్యాంవిశ్వపతేః పురః ఫలవతీ నిత్యోపహారోచితా॥
కావేర్యాం త్రిపురాంతకే జయపురే కాశీపురే గోకతే।
పంచారామపురీషు పట్టసపురే మార్కండ శంభోః పురే
గంగాసాగర సంగమేషు నిరతం శ్రీ కొండవీటిపురే
చాళుక్యామయాతాన్నదాన నిరత శ్రీ వేమభూపప్రభుః—

అతనిగుణముల నొకకవి ఇట్లు వర్ణించెను:—

“శ్రీ తపోషణ తిపుశోషణ
బుధతోషణ సత్యభాషణాదిగుణాన్।

కథతే దశరథరామః

ప్రాగద్యకలాసు కోమటివిభువేమః॥"

ఇట్టివేముని కథానాయకునిగా చేసి వామనభట్టు బాణుడు వేమభూపాల చరితము అను గద్యకావ్యమును బాణుని కాదంబరీకావ్య శైలి ననుసరించి వ్రాసెను. వాస్తవ చారిత్రక విషయములను వదలి, యీ కవి అభూత కల్పనలతో యీ గ్రంధమును నింపి యున్నాడు. ఇందలి దిగ్విజయవర్ణన కాళిదాసుని రఘువంశ కావ్యమందలి రఘుమహారాజు దిగ్విజయ వర్ణనను పోలియున్నది. పెదకోమటి వేముడట్టి దిగ్విజయయాత్రను చేసినటుల చారిత్రకాధారములు ఏమియును లేవు. వేమారెడ్డి కాశీయాత్ర చేసినసందర్భమును పురస్కరించుకొని ఛప్పన్న దేశాధిపతులను జయించినట్లు అసత్యకల్పన చేసినాడీకవి. అయినను వేమభూపాల చరితమందు చరిత్రకారులకుపయోగములగు కొన్ని విషయములు కలవు. అందుచే దానిలోని ముఖ్యాంశముల నిచ్చుచున్నాము—చతుర్ధవర్ణమందు, కృష్ణాగోదావరీ నదీగర్భితమగు త్రిలింగదేశమును కామాభిధానుడగు రాజు అద్దంకి రాజధానిగా పాలించుచుండెను. అతని మహావంశమందు పిన్నవయసుననే రాజ్యమును వహించిన "ప్రోలు" డను రాజుపుట్టెను. ఆతడొకనాడు మృగయాకుతూహలియై అరణ్యమునకు వెడలెను. అందు ఆశ్చర్యరూపియైన వారిణము నొకదానిని చూచి దానిని తరుముకొని వెళ్లి, వెళ్లి, ఒక ఉద్యానవనములో నొకసుందరాంగిని చూచి ఆనందించుచుండగా, తన విదూషకుడు ఒక రాక్షసునిచే పీడింపబడి కేకవేయగా రాజాతని విడిపించుటకు వెళ్లి, తిరిగివచ్చుసరికి ఆ సుందరాంగి కానరాకపోయెను. మరునాడు తిరిగి రాజు ఆ ఉద్యానవనమున వెదకుచుండగా తనకు చిత్రఫలకమొకటి కంటబడెను.

ఆ చిత్రఫలకము వెదకుచు వచ్చిన పరిచారికను ప్రశ్నించి తాను కోరిన సుందరాంగి విక్రమసింహపురీపాలకునకు స్కందుని వరమువలన జన్మించిన కుమార్తెయని* యును, అనంతాంబికా నామధేయ యనియును తెలుసుకొనెను. ప్రోలుడు ఆ కన్యకపాణిగ్రహణమును కోరుచు సందేశము పంపి, ఆమెను వివాహమాడెను. ఆమె యందాతనికి మాచ, వేమ, దొడ్డ, అన్న, మల్లారెడ్లనెడు ఐదుగురు పుత్రులు కలిగిరి. అందు వేమారెడ్డి 'ధనుష్మతా మగ్రగణ్యః షాడ్గుణ్యప్రయోగకుశలః కృతపారదృశ్వా' యనియును, జగనొబ్బగండడనియును, రూపనారాయణుడనియును, "యవన మహాప్రళయార్ణవమధ్యపతిత" యగు వసుంధరనుద్ధరించినవాడనియును పరశురామునివలె క్షత్రియకులముల నాశనము చేసినవాడనియును వర్ణింపబడెను. మాచారెడ్డికి రెడ్డిపోత, పెద్దకోమటి, నాగెం

* వాణీవిలాస ముద్రణాలయమున ప్రచురించబడిన వేమభూపాల చరితములో విక్రమసింహపురి రాజు పేరు "భూపతి" అనియును, కుమార్తె పేరు అనంతాంబిక యనియును కలదు. ఇది సరియైన పాఠమనితోచదు.

ద్రిలనెకి ముగ్గురుకుమారులు. అందు శ్రేష్ఠుడు కాకపోయినను గుణశ్రేష్ఠుడగు పెద్దకోమటి రెడ్డి రాజయ్యెను. అతడు యవనకుల కాలకూట కబలనమహాకాలుడు. అతనిభార్య అనంతాంబిక. అతనికి చిరకాలము సంతానము లేకపోగా, ఇంద్రునారాధించి వేముడను పుత్రుని బడసెను. ఆవేమునకు మూడవసంవత్సరములోనే అక్షరశిక్షయాయెను.

పెదకోమటివేముని తమ్ముడు మాచారెడ్డి "వర్ణవ్యవహార నిర్ణయనిపుణుడనియును, సద్గుణప్రయోగ కుశలుడనియును, రంజిత ప్రకృతియనియును, ధర్మబలచారిత్రుడని యును, సాహిత్య సంగీత జీవాతువనియును, వీణా వేణు వాదన ప్రథమసంప్రదాయి యని యును, విద్వన్మణి ఘర్షణనికషుడనియును, శంకరచరణ సరసీరుహ పరిమళ్బ్వరణు డనియును" వర్ణింపబడినాడు. ఈ మాచారెడ్డి సహాయముతో పెదకోమటివేముడు భూమిని పరిపాలించుచుండగా శరత్కాల మాసన్నమాయెను. దిగ్విజయ కుతూహలియై వేముడు ప్రస్థానభేరి మోగించెను. వేముడు ఆహవకోలాహల మనెడి ఏనుగునెక్కి, విశేషమగు సైన్యముతో వెడలి తూర్పుసముద్రతీరమున విడిసెను. అచ్చటకు ద్వీపాంతర వర్తులగు రాజులు "యానపాత్రోపనీతములగు కనకమణి ఘుసృణ కర్పూరకస్తూరికా చమరివాల చందనాదులగు ధనముల కానుకల గైకొని కళింగదేశముపై వెడలెను. కళింగ రాజు మహేంద్రగిరిపైకి పారిపోయెను. తరువాత అంగదేశమును జయించి వంగ బంగాళముల జలదుర్గములపైకి సాగెను. ఈ వంగబంగాళములు ఆనాడు నావికాసైన్యమునకు పేరుపొందినట్లు తోచుచున్నది. వీరినికూర్చి గంగాసంగత సాగర జలదుర్గ దృప్తహృదయులనియును, నౌసాధనులనియును భట్టబాణుడు వర్ణించినాడు. వీరిని వేముడు నౌకా యుద్ధములో జయించెను. గంగాసాగరమందు మహాదానముల ననేకముల జేసెను. అచ్చటనుండి దక్షిణదిశకు మరలి కాంచినాక్రమించెను. పాండ్యుల నోడించెను. సేతువు దర్శించెను. తామ్రపర్ణీనదిని దాటి కేరళదేశముల బట్టుకొనెను. మలయమునతిక్రమించి హూపసలమల్లగణములను, గూర్జరసౌరాష్ట్రులను జయించెను. సోమనాథుని దర్శించెను. పశ్చిమ తీరమునుండి పారశీకదేశమును జయించి, యవనులను, తురుష్కుల నోడించెను. సింధునది దాటి హూణ, కాంభోజ, కాశ్మీర, కేకయ, శక, మద్ర, బాహ్లిక దేశముల జయించెను. అంతలో వేసవి సమీపించెను. అంత హిమాలయ ప్రాంతముల పార్వతీయ బలముల నోడించి వేముడు స్వదేశ గమనోన్ముఖుడాయెను. వింధ్యాటవి ద్వారా వచ్చుచు నిషాదుల నోడించి, వింధ్యవాసినీ దేవాలయమువద్ద విడిదిసేసి, ఆమహాదేవికి భైరవతంత్ర సమగ్రముగువరివస్య గావించెను. ద్రాక్షారామభీమేశ్వరునిదర్శించి, పెద కోమటివేముడు తిరుగ తన స్వవిషయమును నగరమును చేరుకొనెను.

వేమభూపాలచరితమందు, వామనభట్టబాణుడు అతిశయోక్తులతో వేమునివిజయముల వర్ణించినాడు. ఇందు చారిత్రకముగా నిజమయిన అంశములేవియును లేవు. రఘువంశములో కాళిదాసు రఘుమహారాజు దిగ్విజయవర్ణనల మనసున నిడుకొని, వేముని విజయప్రశస్తిని కూర్చెను. పెదకోమటివేముఁడు చేసిన కాశీ, రామేశ్వరాదియాత్రల నాధారముగా గైకొని, ఈకల్పనల నాతడు చేసియుండవచ్చును. వామనభట్టబాణుడును, శ్రీనాథుడును కూడ ఈ కాశీయాత్రలో నాతనితో వెళ్లియుందురు. కొండవీటిరెడ్లు కాశీవిశ్వేశభక్తులు.

పెదకోమటివేమారెడ్డి ధర్మకీర్తిలత శ్రీశైలములో వేరుకొని, కుమారారామములో వృద్ధినంది, పంచారామములలో ఎగబ్రాకి ప్రసరించి, సింహాచల, శ్రీకూర్మ, పురుషోత్తమముల స్పృశించి, శ్రీకాశికా విశ్వేశు సన్నిధిని సత్యోపహారోచితమై ఫలించెను.

## వేమునిమంత్రులు.

పెదకోమటి వేమునిమంత్రులలో మహాప్రజ్ఞావంతుడు మామిడిసింగామాత్యుడు. ఈతడు భారద్వాజసగోత్రుండు, పిఠాపురి శాసనములో కోటిపెద్దన్న నల్లూరినాయకుడుగా వర్ణింపబడినాడు మామిడన్న అతనికుమారుడు. శివాచారతత్పరుడు, ఈతనికి నల్గురు కుమారులు—పెద్దన్న వీరభద్ర మారన్న నామనార్యులు.

అందుపెద్దన, "అనతారాతివసుంధారాభరణ సప్తాంగోపహారక్రియా
ఘనసంరంభ విజృంభమాణపటుదోః ఖర్జూద్వితీయార్జునుండన
వేమాధిపురాజ్యభార భరణవ్యాపారితుండు——."

ఈపెద్దనసుప్రసిద్ధుడగు అల్లాడమంత్రికుమార్తె తల్లమాంబికను వివాహమాడెను. వీరికి వేమన్న, శ్రీపెగ్గడ, సింగనార్యుడు అను ముగ్గురుకుమారులు. అందు సింగనమంత్రి, పెదకోమటి వేమునిదండనాయకుడు. మహాప్రధాని. ఈతనికి "త్రిభువనరాయవేశ్యాభుజంగుడనియును" కదనగాండీవియనియును, జగనొబ్బగండడనియును బిరుదులుండెను. ఈతడు సుప్రసిద్ధజ్యోతిషికుడు, ఇతడు సోమసిద్ధాంతమను జ్యోతిషసిద్ధాంతగ్రంథమునకు గూఢార్థదీపికయను వ్యాఖ్యానము క్రీ॥శ॥ 1418లో రచించెను. అందుచేతనె శ్రీనాథుడీతని"పంచాంగస్థిర మంత్రిరత్న కళాప్రౌఢుండని" ఉభయార్థకబోధకముగ వర్ణించెను. ఈతడు వేమభూపతి మహాసామ్రాజ్యరమణి. "యవనాధీశ సభానిరంకుశ వచోవ్యాపార పారంగతుడనుటచే" అరబితురుష్క పారసి మొదలగుభాషలలో పండితుడై యుండెననుటస్పష్టము. ఈతడును శ్రీనాథునివలెనే శైవాచారసంపన్నుడు. శ్రీగురుశంకరమానిదయా గౌరవనిత్యవర్ధితాన్వయుడు. ఈ గురుశంకరుడును పినపాటిశాసనములోని శంకరగురుడును ఒక్కరే. సందేహములేదు. అశ్లోకమిది.

37. చూడు శృంగారశ్రీనాథము:—

ఆత్రేయమున్వరత్రేయాగోత్రే క్ష్మాత్రిలోకధూవరణం। సప్తాటస్థనార్యస్య పౌత్రో మామిడిమంత్రిణః
తనుజో పెద్దనార్యస్య శ్రీనృసింహోపహాయకః: పెదకోమటి వేమేంద్రమంత్రిణాం శేఖరాధిపో
జ్యోతిర్వ్యాఖ్యాన కాఘాటపాట సర్వస్వాపరస్వస్వా। సింగయామాత్యకర్త్తన ధువిజార్కహితైషిణా
క్రియతే సోమసిద్ధాంతవ్యాఖ్యా గూఢార్థదీపికా॥

దాతా కోమటి వేమనామ నృపతేః పాత్రం గురుః శ్శంకర
స్థానంచే త్రివపాదు రత్రితు కవిశ్శ్రీనాథ భట్టారకః
కాలశ్శ్చ చ్ఛివరాత్రి పుణ్య సమయ స్సాక్షీ మహాన్ శ్రీగిరి
శ్శ్రీయుః కిం సతువర్ణ్యతేను ఇవి భిక్ష్వణ్యాంతు తచ్ఛాసనమ్॥

బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రులవారు, ఈ శంకరగురుని వంశమువారు, ఉద్భటారాధ్య సంతతివారనియును. పినపాటియం దిప్పటికిని గలరనియును, శృంగార శ్రీనాధములో వ్రాసినారు - వారీ క్రింది శ్లోకము కూడ పినపాటి శాసనములోనిదే యని యిచ్చినారు.

శాకాబ్దే గిరినేత్ర విధు కేపం వత్సరే పార్థివే
మాఘేస్మిన్ శివరాత్రి పుణ్య దివసే శ్రీ వీరనారాయణః
తస్మై శంకర దేశికాయ విదుషే భక్త్యాసదీ ప్రోక్తటే
గ్రామం శ్రీ పినపాటు ముత్తమ మదా దాచంద్ర మాతారకమ్॥

సింగామాత్యుని శ్రీనాథు డీవిధముగా వర్ణించినాడు-

అరుదార న్వివిధాగ్రహారములతో నాందోళికా చ్ఛత్ర చా
మర కల్యాణ కళాచికాది బహు సమ్మానార్హ చిహ్నంబు లా
దర మొప్పారగ వేమ భూవరుని చేతం గాంచె సామ్రాజ్య సం
భరణ ప్రౌఢు డమాత్య సింగడు నయ ప్రాగల్భ్యగర్వోన్నతిన్॥

—♦ సంతాన సాగర నిర్మాణము. ♦—

పెదకోమటి వేముని భార్య సూరమాంబ. ఈమె కృష్ణానదీ తీరమందలి ధాన్య వాటీపురపాలకుడగు గన్నమనాయుని కుమార్తె. ఈమె సంతానసాగర మను పెద్ద తటాకము నొకదానిని త్రవ్వించి క్రీ॥ శ॥ 1410 వ సంవత్సరమున ప్రతిష్ఠచేసెను. శ్రీనాధుడొక శాసనమును రచించినాడు. ఈ శాసనము ఫిరంగిపురగ్రామములోని వీరభద్రస్వామి దేవాలయమున కెదురుగానున్న శిలా స్తంభముపై చెక్కబడి యీ ధర్మమును ప్రకటించుచున్నది

—పెదకోమటి వేమారెడ్డి - లింగానాయుడు—

ఇదివరలోనే, పెదకోమటి తమ్ముడు మాచారెడ్డికి చేసిన యవమానమును సహింప లేక ప్రతీకారముగా వేముడు కుమార వేదగిరినేని చంపి ఆతని తల తమ్ముపడిగమున బెట్టినట్లు వ్రాసియున్నాము. వెలమలు ఆనాటికి తిరిగి ప్రత్యపకారముచేయు స్థితిలో లేరు. రెడ్లకును, బహ్మనీమహమ్మదీయ రాజ్యమునకును మైత్రియుండి పరస్పర సహా యము చేసుకొనుచుండిరి. ఫిరోజిషాబహ్మనికి, వెలమల తెలంగాణమునుండి తరిమి వేసి ఆ రాజ్యము తా నాక్రమించుకొనవలెనని తలంపు ఉండెను. అందుచే వెలమలు ఫిరోజిషాకు మిత్రులగుచు పెదకోమటి వేమునిపై దండెత్తి, ఓడించి రెడ్డిరాజ్యమును బల హీనముగా నొనర్చుటకు ప్రయత్నించి భగ్నమనోరథులైరి. విజయనగరరాజులు రెడ్డి రాజ్యమును కబళించి తమ రాజ్యమును వృద్ధిచేసుకొను ఉద్దేశ్యముతో నుండిరి. ఈ

శతాబ్దపు రాజకీయతంత్రములకు, ఈ మూడు రాజ్యముల స్పర్థలే కీలకము. చివరకు విజయనగర హిందూరాజ్యమా? లేక బహ్మనీయ రాజ్యమా? దక్షిణ హిందూస్థానము నాక్రమించి పరిపాలించవలసినదను, సమస్య ఏర్పడెను. క్రమక్రమముగా విజయనగర రాజ్యము బలిష్ఠమాయెను. వెలమ, రెడ్డి రాజ్యములుండుటకు తావులేక, నశించిపోయెను.

వెలమలు వేచివేచి, లింగమనాయని నాయకత్వమున రెడ్డిరాజ్యముల నోడించుటకు సంరంభించిరి. ఈ లింగమనాయకు వెలమరాజు లందరిలో మహా పరాక్రమవంతుడుగా కాన్పించును. ఈతని గూర్చి వెలుగోటివారి వంశావళిలో అనేక స్తుతి పద్యము లున్నవి. ఈతడు, చలమచర్ల యుద్ధములో కన్నడుల గెలచినట్లును, "గంగ వాడసు" గోదావరీ ప్రాంతమందలి "బోయగము"ల గెల్చినట్లును, తురుష్కుల బారదోలినట్లును, కూడ అందు వర్ణింప బడినది. ఈతని ఇతర జయముల నీ పద్యము వర్ణించుచున్నది-

హెమ్మాక దేవుని నేపార జాటూరి సూరునిపాకము ధారుణీశు
గోవర్ధనుని సోమదేవభూవల్లభు దెవుపచెందువరాయ దేవనృపతి
అప్పచి చనాగ్రజ యా రాఘువుండును, యేచి విఠలదేవు రాచవార్ని
తిమ్మశౌండ్రుని అన్న దేవశ్రీనాధుని వీరాదిగాగల విభులతొల్లి
చంపి జయము చేకొనియె చాళుక్య భూపాల విదలితుండు సింగవిభుని మాకు
సమరమందు గెలువు సంచెట పిన్నని విభవ సంగమాకవిభుని లింగా!
సురథాను గెల్చినాడవు నరవరు ధట్టించి పంచినాడవు మున్నె
వరిరాజుల దోలినాడవు పరియెవ్వరు నీకు మాక జనపతి లింగా!

పై పద్యములయందలి అంశము లెల్లను సమన్వయమునకు కుదురవు. కాని, లింగమనేడు మహావీరుడని మాత్రము గుర్తింపవచ్చును. ఈ లింగమనేడు పిన్న వయసుననే, పండ్రెండవ యేటనే, పెదకోమటి వేమారెడ్డిపై నెత్తి వచ్చెననునది నమ్ముటకు వీలులేదు. ఈతడు యుక్తవయసులోనే పెద్దకోమటి వేముని నోడించి, అతని తలగొట్టి, తమ్మ పడిగమున బెట్టెను. రెడ్డిరాజ్యము నంతను సంక్షోభింపజేసెను. ఈ ధాటి కొండవీటితో నాగలేదు. రాజమహేంద్రవరము వరకును పోయినది. వేమవీర భద్రారెడ్లనుగూడ నీతడు జయించెను. పై వెలుగోటివారి వంశావళిలోని-

"వేదగిరినేని తమ్ముడు లింగమనేడు ద్వాదశ వర్షంబులవాడై యుండి, తన బంధువర్గంబులహిత పరిజనంబుల గూర్చుకొని యమరులకు వెక్కసంబగు యుద్ధంబుచేసియున వేమారెడ్డిని గొట్టి తమ్మ పడిగానబాదిగించి, సింహతలాట బిరుదును, తనచేతశ్రీనాధు డడిగికొంచు బోయిన సందికంత పోతురాజను కటారిని బుచ్చుకొనెను."

అను వాక్యమువలన లింగమనేడు పెదకోమటివేముని రెండు సార్లోడించినటుల స్పష్టపడుచున్నది. మొదటిసారి వేము డోడిపోయినపుడు 'సందికంత పోతురాజు' ను చూర

కొనినట్లును, అందుపై శ్రీనాథుడు వచ్చి తనను వేడుకొనగా తిరిగి యిచ్చివేసినట్లును, రెండవసారి పెదకోమటివేముని చంపి, తిరుగ ఆ జయఖడ్గమును లింగమనేడు హరించినట్లుల పై వాక్యములలో స్పష్టముగానున్నది. ఏపరిస్థితులలో రెండుసారులీ రెడ్డి, వెలమరాజ్యములకు యుద్ధము జరిగెనో వివరించుటకు తగిన సాధనసంపత్తి యిప్పుడు లేదు.

శ్రీచిలుకూరివీరభద్రరావుగారు పెదకోమటివేముని లింగమనాయుడు చంపినట్లు నమ్మలేదు. కాని వెలుగోటివారివంశావళిలోని అంశము నిజమని నమ్ముటకు నావకాశము కలదు. పెదకోమటివేమునిగూర్చి చరిత్రకారులందరును భూషించియున్నారు. ఈతని పరిపాలనము ప్రశంసనీయముగనుండెను. ఈతని పరిపాలనమును గురించి శ్రీచిలుకూరివీరభద్రరావుగారువ్రాసిన దానినుదహరించుచు, ముగించుచున్నాము. "పెదకోమటివేమభూపాలుని పరిపాలనము సర్వవిధములచేత శ్లాఘాపాత్రముగానున్నది. ఆతడు మిక్కిలిసమర్థుడు ప్రజ్ఞావంతుడు. ఆతనిమంత్రులెల్లరు ప్రజ్ఞావంతులు బాహుబలపరాక్రమసంపత్తి కలవాడగుటచేత శత్రురాజులెవ్వరెన్నివిధముల దనరాజ్యమాక్రమించుకొనవలయునని ప్రయత్నించినను వైరులవరాజితులగావించెను. క్రొత్తసుంకములవేయక ప్రాతపద్ధతులనే జలపరచి సుంకములను రాబట్టుచుండెను. ఆర్యమతమును వర్ణాశ్రమధర్మములను పోషించెను."

## VII రాచవేమారెడ్డి. 1420—1423

పెదకోమటి వేమారెడ్డి అనంతరము, ఆతనికుమారుడు రాచవేమారెడ్డి కొండవీటి సింహాసనమునధిష్ఠించెను. ఈనాటికి కొండవీటిరాజ్యము, చాలనశించెను. వెలమరాజులను, విద్యానగరరాజులను, రాజమహేంద్రవరరెడ్డిరాజులును, కబళించగామిగిలిన దేశమునకు నీతడు ఏలికయయ్యెను. ఈతడు హేమాద్రిదానచింతామణియనియును, అరిరాయబసువశంకరుడనియును అజిఘల్లునుండనియును, వర్ణింపబడినాడు. ఈతడు వీరుడుగాని, విద్యారసికుడుగాని కాడు. ఈతడుచేసిన మహాకార్యము సంతానసాగరమను కాలువత్రవ్వుట. ఈపని క్రీ|శ 1416 లో అనగా తనతండ్రిజీవితకాలములోనే జరిగెను. ఈకాలువపేరు జగనొబ్బగండకాలువ. శ్రీనాథుడీసందర్భమున ఈక్రిందిశాసనకృతిరచించెను.

"శాకాబ్దములు సహస్రంబునమున్నూంట ముప్పదియేడునరయొప్పుమిగుల|
మహనీయమైన మన్మథవత్సరంబున మఖమాసమునఁ బూర్ణిమాదినమున|
హేమాద్రిదానచింతామణి యరిరాయబసువశంకరుండా జిఘల్లునుండు|
నమదారిరాయవేశ్యా భుజంగుండు వేమయరాచవేమన ధర్మపరుండు|
దల్లినూరాంబచే సముల్పన్నమగుచుంబరగు సంతానవారిధికివరుసగాంగ|
నొలయుగిరివాహినుల జగనొబ్బగండకాలువ ఘటించెనాతారకముగాంగ॥

కొండవీటి దండకవిలి ననుసరించిచూడగా ఈరాచవేమన ప్రజారంజకుడైనట్లుతోచదు. ఈతడు ప్రజలబాధించెను. పురిటిపన్ను విధించెను, బలిజనాయకుడొకడు ఈపురిటిపన్ను కొరకు రాచవేమననుపొడిచి చంపెనట. ఈతనితో కొండవీటి రాజ్యమంతమయ్యెను.

# రెడ్డిపదోత్పత్తి వికాసము.

కుందూరి ఈశ్వరదత్తు, బి. ఏ. (కాకినాడ)

విక్రమధనంజయులై, వితరణరాధేయులై, విజ్ఞానధారేయులై, విరాజిల్లిన రెడ్డిభూవల్లభుల చరిత్రలోని వివిధవిషయములు, వెల్లడించుటకు ముందుగా, రెడ్డిపదోత్పత్తివికాసమునుగూర్చి చర్చించి, సత్యమైన చరిత్రను తెలుసుకొనుట మనప్రథమకర్తవ్యమై యున్నది. ఈ పరిశోధన, చరిత్రకారులకే కాక సారస్వతమునకు సత్యంతోపయుక్తమైన సంగతి యని నామనవి.

## ౧. ఆంధ్రసారస్వతము - రెడ్డిపదము.

ప్రాచీనాంధ్రకావ్యములలో నీరెడ్డిపదము 'రట్టడి', 'రడ్డి', 'రెడ్డి', 'రడ్డు' అనురూపములను దాల్చి యున్నది. అందుకు ఈదిగువ ప్రమాణముల నిత్తును.

౧ మల్లికార్జున పండితారాధ్యకృత శివతత్త్వసారములో

క॥ పూజింపుడు పూజింపుడు
పూజింపుడు శివుని భక్తి పూజింపుడు మీ
రోజ చెడి నడవకుండుడు
రాజులు రట్టళ్ళు నగుట గాపాల్లిటికిన్. — పద్యము ౨౦౦.

౨. కృష్ణదేవరాయకృతాముక్తమాల్యదలో. — ఆ ౭; ప. ౧౯.

తే॥ అనిన లాతుగఁ గోల్పోక యతఁడు రడ్డు
రాజుఁ గనునని కొదయుఁ దీర్పంగ మగిడి
యంతపురియును బైపజ కలికి పాతి
పోక వాఁడును బాపపోట్ల వొడిచి చనియె.

౩. రామకృష్ణకవి పాండురంగమాహాత్మ్యములో — ఆ ౩; ప. ౭౫.

క॥ ఎడ్డెతనపుఁ గైసేతల
రడ్డులు నడచిరి పురస్సరద్వాఃస్థమగా.
గడ్డంబు చిక్కుఁ గట్టా
బడ్డమహాశక్తి దివ్యశివనంబునకున్.

౪. మల్లారెడ్డిప్రణీత శివధర్మోత్తరములో — ఆ ౧; ప ౬౦.

తే॥ రడ్డికోటలు తిప్పాపురంబు సిరులఁ
బొదలు లింగాపురంబును బోతపాని
పల్లెయును, మిఁచుఁ గట్టిచె దివ్యకీర్తి
ప్రబల మాయన్న కామిరడ్డిమనడు,

౫. తంజావూరి రఘునాథరాయల రామాయణమునందు, ఆ. ౨; ప. ౧౩౦.

ఉ॥ కప్పురభోగివంటకముఁ గమ్మనినేయి వడియు స్సూజించి చే
ల్దుప్పటులట్లు మూరగల తోరపుఁబచ్చడము ల్చెలంగఁగా
గొప్పకడానిపైఁడి జిగిగుత్తపుటుంగరము ల్కరంబులన్
ద్రిప్పుచు రచ్చసేయుదురు రెడ్డిదొర ల్తమి హెచ్చ నచ్చటన్.

౬. చేమకూర వేంకటకవి సారంగధరచరిత్రములో, ఆ ౨; ప. ౧౧౪.

తే॥ నినుఁగలయు భర్త కోపగాఁ డనఁగ నేల?
కేల భుజమున నిడి దున్నఁ దోలువాఁడు
అవ్వ యనసేల రాజాన రడ్డియాని
నాటి కిపుడేమి? రారాదె? యేటి కలఁప?

పై నుదాహరించిన రెడ్డి, రడ్డు, రడ్డి ప్రయోగాలు యతిస్థానములో నున్నవానిని చూపినాను. ఈ దినములలో ప్రయోగాలు చూపుమంటే, యతిస్థానంలోగాని, ప్రాసస్థానంలోగాని చూపకపోతే, త్రోసివేస్తారను తలంపుతో నాకు తెలిసినంతవఱకు, యతిస్థానంలో నున్న పదములనే నుదాహరించినాను. అట్టి స్థానంలో లేని ప్రయోగాలు సారస్వతములో పరశ్శతము లున్నవి. వాని నన్నిటిని సేకరవుపెట్టుట చర్విత చర్వణ మవుతుంది.

"రాజు-రట్టళ్లు", "రాజు-రడ్డు", "రాజు-రడ్డి," "రెడ్డిదొరలు," అను ప్రయోగాలు అధికారవాచకములని స్పష్టముకదా! 'రట్టడి' పదమె రానురాను 'రడ్డు', 'రడ్డి', 'రెడ్డి' యై సారస్వతమున కెక్కినది. రట్టడి పద మాయర్థమున పదమూడవ శతాబ్దమునుండి వాఙ్మయమున కనబడదు. "రట్టడి-రెడ్డి" పదములు శివతత్త్వరచనాకాలమైన పండ్రెండవ శతాబ్ది నాటికి పర్యాయపదములుగ వాడుకలో నున్నట్లు ప్రబలమైన శాసనాధారమును చూపుచున్నాను.

ఈశాసనము చరిత్రకును సారస్వతమునకును అత్యంత ప్రయోజనమైనది; మరియు రెడ్డిపదోత్పత్తి వికాసములో నొక ఘట్టమును నిరూపించుచున్నది. అది యేదనగా రట్టడియు; రెడ్డియు నొక్కవాచకమును స్ఫురింపచేయుటయు, నవి పర్యాయపదములుగ ద్యోతకమవుటయు నై యున్నది. ఈశాసనము గుంటూరు జిల్లాలోని ఎఱ్ఱబాలెము గ్రామములోనిది, పండ్రెండవశతాబ్దికి చెందినది. శాసనకర్తయైన ఎఱ్ఱమరట్టడి, తన తలిదండ్రుల ధర్మువునకుగాను దానశాసనము వ్రాయించియిచ్చెను. ఇతడె శాసనపద్యభాగములో ఎఱ్ఱమరట్టడిగాను గద్యభాగములో ఎఱ్ఱమరెడ్డిగాను వ్రాయబడినాడు; చూడుడు.

## ఎఱ్ఱబాలెము శాసనము*

౧ శ్రీధరునకు గోవ
౨ ర్ధనభూధరసా (ధా)
౩ (ర) ణోగ్రభుజున
౪ కునా (చా) ర (గే) యు (న)
౫ కు నచ్యుతకును
౬ భూధరునకు వారికి
౭ సకలభూతాత్మున
౮ కును॥ తమతల్లి
౯ దండ్రులకు మాడ్ర
౧౦ డ్డికి బొల్లసానికి
౧౧ తిథమ్మర్ణవుగా వి
౧౨ ములమతి సెట్టి
౧౩ మరట్టడి గొమ
౧౪ టొప్పంగ దివ్య
౧౫ కట్టె గోత్రము
౧౬ కలుగను॥ స్వ
౧౭ స్తి స(క)క వర్షంబు
౧౮ లు ౧౧౫ (౭*) గుకే
౧౯ (ం) టి కార్తిక బహు
౨౦ ళ పంచమి గు
౨౧ రువారం నాండు
౨౨ కలిగంట్ల ఎఱ్ఱ(మ)
౨౩ రెడ్డి ఉండకల్లి
౨౪ యనంతశయ
౨౫ నదేవరకు అఖ
౨౬ ండ దీపమునకు
౨౭ నిచ్చిన మొదలు
౨౮ ౨౫ పీనిం కేళాని
౨౯ కుప్పన బోయుం
౩౦ డు తన పుత్ర
౩౧ పవిత్రకం నిత్య
౩౨ న ౧ కొయి పోయం
౩౩ గలవాండు *

## ౨. రట్టడికము - రడ్రికము - రట్టడము.

'రట్టడి,' 'రెడ్డి,' 'రడ్డి' పదములు తద్భావార్థవిహితముగా 'ఇక,' 'ఎక' ప్రత్యయాలతో చేరి, 'రట్టడికము,' 'రడ్రికము,' 'రడ్డికము' ఒకప్పుడు 'రట్టడము' అను వివిధరూపములతో, ఆంధ్రవాఙ్మయములోను, ప్రాచీనాంధ్ర శాసనములలోను ప్రయోగములు కనబడుచున్న శాసనములలోని ప్రయోగములు ప్రత్యేకముగ ననుబంధమునందు పరిశీలింప నగును. మనము 'రట్టడికము,' 'రడ్డికము,' 'రట్టడము' అనుపదములనర్థము గ్రహించుకొన్నప్పుడు "రడ్డి", "రెడ్డి" పదముల కర్థము సులభముగ తెలుసుకొనవచ్చును. సారస్వతములో 'రెడ్డికము' ప్రయోగమును ఈ దిగువ చూపుచున్నాను.

* ఈశాసనప్రతులు దయతోనిచ్చిన మదరాసు ఎపిగ్రాఫికల్ డిపార్టుమెంటువారికి నేను కృతజ్ఞుడను.
No. 77 of 1917 *Madras Epigraphical Collections* dated Ś. S. 1157

“విప్పర్ల గోత్రోద్భవుండును, వీరనారాయణ కేదారదేవ సాళ్వ మల్లికార్జునదేవ ప్రముఖకొంకణ ఘూర్జర ........ఖండన, ప్రచండాట్టలూరిఖండనక్రీడాపరితోషిత కరికాలచోళదత్త చామరద్వయ వైరిగజాంకుశ మహాబిరుదుండును, శరణాగతవరదుండును, కుబ్బణి...రాయపాణిపుహీపాల భంజన...... దీచూరకాది వివిధకులబిరుదధుర్యుండును, చోళకటక రాజ్య ప్రతిష్ఠాపనాచార్యుండును, నగు జాపతి కొండలరాయ విభుండు పులికాలి యెట్టిద పులితోలుపక్కెరబిరుదు రెడ్డికంబును గలిగి రాజ్యంబు సేయు...”*

చంద్రికాపరిణయములోని యుదాహరణము ననుసరించి 'రెడ్డిక' మనగా నొక యధికారపదవియని యూహింపనగుచున్నది. ఇక శాసనములలోనున్న ప్రయోగసందర్భములను పరిశీలింతము. తెలుగుభాగములోని 'రట్టడము'నకు సంస్కృతభాగములో 'రాష్ట్రకూట' మని శాసనలేఖకుడు, దేశ్యపదమైన 'రట్టడను'నకు 'రాష్ట్రకూట' మనే గీర్వాణరూపమును వ్రాసెను. ప్రయోగ సందర్భమునుబట్టి ఈ 'రట్టడికము'న కర్థము, ఆంగ్లపరిభాషలో ఫీఫ్ (Fief) అను పదమునకు సరివచ్చునని నాయూహ. కొంత భూభాగమును గుత్తగా ననుభవిస్తూ, దానిపై సర్వాధికారములను జెల్లించుకొను నొక యార్థికపదవియే 'రట్టడ' మని తెలుసుకొనవచ్చును. 'రట్టడికము'న కధికారి 'రట్టడి' రట్టడియె భావార్థమున 'రట్టడిక'మయినది. అప్పుడు రట్టడి పదమునకు, నొక గ్రామముపైగాని, గ్రామకూటములపైగాని, తద్గ్రామాధికారమును, ఆపదవిని, ఆకాణాచిని, అష్టభోగ సర్వస్వంపదలతో† ననుభవించుట లేక వహించుట యని ప్రస్ఫుటమగు చున్నది.

---

* ఎలకూచి బాలసరస్వతీకృత చంద్రికాపరిణయములో (అముద్రితము) p. 629, Vol. II of '*A Descriptive Catalogue of the Telugu Manuscripts*'. Madras.

† ప్రాచీనాంధ్ర శాసనములలో భూదాన ధర్మశాసనములందు, అష్టభోగసర్వస్వంపదలనియు, అష్టభోగస్వామ్యములనియు, అష్టభోగతేజస్వామ్యములనియు, ఎనిమిది స్వత్వములు పేర్కొనబడినవి. అవి ౧ నిధి, ౨. నిక్షేప, 3 జల, ౪. పాషాణ, ౫. అక్షిణి. ౬. ఆగామి. ౭. సిద్ధ, ౮. సాధ్యములు. శాసనపరిశోధకులు పైపదముల కాంగ్లభాషలో నీయర్థముల నూచించినారు.

అష్టభోగస్వామ్యము=Enjoyment of the whole or the eight products of an estate
నిధి=Treasure Trove
నిక్షేపము=Property deposited in land
జలము=Waters and their source
పాషాణాలు=Minerals
అక్షిణి=Actual privileges
ఆగామి=Prospective rights
సిద్ధము=The land cultivated
సాధ్యము=The produce of such kind

## 3. రట్టడికము - రాష్ట్రకూటము.

ప్రాచీనాంధ్ర శాసనములలోని సంస్కృతభాగమునందలి 'రాష్ట్రకూట' పదప్రయోగము తెలుగు భాగములలోని 'రట్టడిక' మనే దేశ్యపదమునకు సంస్కృతి యని తెలుసుకొనవగును. ప్రాచీనాంధ్రశాసనములుగాని, ఆంధ్ర సారస్వతమునుగాని మనము పరిశీలించినప్పుడు, మన దేశములో దేశ్యశబ్దములకు గీర్వాణసంస్కారము చేసి, సారస్వతమునకును, శాసనముల లోనికిని, తత్పదముల నెక్కించుచువచ్చి, హెచ్చుగా నుండెనని తేటపడగలదు. ఉదాహరణము లందులకు వందలకొలది నియ్యవచ్చును, కాని, వినోదార్థము కొన్నిటిని వివరించుచున్నాను.

పిష్టపురము=పీఠపురము
డాకిరేమి=ద్రాక్షారామము
బెజవాడ=విజయవాడ
ఓరుగల్లు=ఏకశిలానగరము
చిలుకసముద్రము=కీరాంభోనిధి
కందుకూరు=స్కందపురము
నిరుమానూరు=నైరామనము
కర్నూలు=కందనవోలు
పెనుగొండ=ఘనశైలము
ఆర్వేలనాడు=షట్సహస్రదేశము
సల్కి=చాళుక్య
రొంపిచెఱువుపల్లి=పంకతటాకగ్రామము
మాల్ ఖేడ్=మాన్యఖేటము

దేశ్యపద మేమో తెలియనిసందర్భములో సంస్కృతరూపమును జూచి, దేశ్యపదమును గ్రహించుట దుర్ఘటకార్యమని మనవి చేయుచున్నాను. సంస్కృతపదమునకు మక్కికి మక్కిగా అర్థము చూచుకొంటే, కొన్నిటికి మాత్రము సులభసాధ్యముకాని, తెనుగులో పర్యాయ పదములు రెండు మూడున్నప్పుడు, ఇక మనకు దారియు తెన్ను గనబడదు. ఓరుగల్లునకు ఏకశిలానగరము, రొంపిచెఱువుపల్లికి పంకతటాకగ్రామము, గుడికి బారెడెచ్చుతగ్గుగ సరి పోవును. కాని డాకిరేమికి ద్రాక్షారామము, పిష్ఠపురమునకు పీఠపురము మొదలగువాటికి అటు కుదరదు. పైని సూచించిన పట్టికలో చిలుకసముద్రపదమునకు కీరాంభోనిధి యని సంస్కృతరూపమును చూడుడు. ఇక్కడ చిలుకకు కీరమును, సముద్రమునకు అంభోనిధి

యనియు, పదసమ్మేళన కుదిరినది. అది తెలిసినవారికే కరతలామలక మవుతుంది. ఇక తెలియనివారికో? ఈపదము మన రెడ్డిచరిత్రమునకు సంబంధించినది. సప్తసముద్రములలో చిలుక సముద్రము కన్నదీ విన్నదీ కాకపోవడంచేత, గ్రంథకర్తకుగాని లేఖకునకుగాని చిత్తభ్రంశము చేకూరియుండవచ్చునని యెంచి, ముద్రాపకులు శ్రీనాథమహాకవి కాశీఖండకృతిలో, యతికి భంగము కలుగనీయకుండా, కీరాంభోనిధి యను చంద్రాత్మకమైన ఒక పెద్దతటాకమును (ఇది గంజాము జిల్లాలోని రంభ యనేగ్రామమున కెదురుగానున్న పెద్ద ఉప్పునీటిసరస్సు) క్షీరాంభోనిధియని దిద్దివేసినారు. ఇంతకూ కారణము దేశ్యరూపమైన చిలుకసముద్రమునకు శ్రీనాథుడు కీరాంభోనిధి యని గీర్వాణావతార మిచ్చి, పద్యపాదములోని కెక్కించుటయు, పైని మనవిచేసుకొన్నట్లు పాలసముద్రము విన్నమాట కాబట్టి, కీరాంభోనిధి క్షీరాంభోనిధి యనియే యుండనోపునని పండితమ్మన్యులు తలపోయుటయునై, పర్యవసానము చరిత్రను గంగపాలు చేయుటయునై ఉన్నది. శ్రీనాథుని కాశీఖండములోని ప్రథమాశ్వాసములో ౫౨ యీ పద్యమును జమవుకొన్నచో ముద్రాపకులు చేసినమార్పు తప్పని యొప్పుకొనక తప్పదు.

శా॥ ఔరా! యల్లయరెడ్డి దొడ్డవసుధాధ్యక్షుండు ధాటీచమూ
భేరీభాంకృతి ఘోరఘోషమున నిర్భేదించె నొడ్డాది, శృం
గారంకోటయు లోతుగడ్డయును నుద్ఘాటించె నత్యుద్ధతిన్
కీరాంభోధితటంబునన్ నిలిపె దిక్పూజయస్తంభముల్.

ముద్రితప్రతిలో నేటివఱకును క్షీరాంభోనిధియనియే యున్నది. సంస్కృతరూపమైన రాష్ట్రకూట పదము ననుసరించి రాష్ట్రకూటపదముల యర్థముల చూచుకొని, తెనుగున నున్న రట్టడికము, రట్టడము అనే పదముల అర్థమును గ్రహింపవచ్చునేమోయని యూహించెదము. సంస్కృత నిఘంటువులలో 'రాష్ట్ర,' 'కూట,' పదములకు నీయర్థము లున్నవి.

రాష్ట్ర=రాజ్యము, కొంతభూభాగము. (Realm; Region)

కూట=సమూహము, ఇల్లు, అపవాదము, మంత్రాంగము రాశి, అగ్రము. పైపదముల యర్థమునకును, రట్టడ, రట్టడిక పదములకు మనము మొదట చేసుకొన్న యర్థమునకును సమన్వయము కుదురదు.

రట్టగుట్టు - రట్టగుడి - రాష్ట్రకూటుడు.

'రట్టడము'నకు సంస్కృతరూపము 'రాష్ట్రకూటము'. అలాగే 'రట్టడి'కి సంస్కృతరూపమున

'రాష్ట్రకూట'. ఈరట్టడి పదమే, ఏడెనిమిది శతాబ్దములందలి తెలుగుచోడుల శాసనములలో రట్టగుట్టు, రట్టగుడి, యను రూపములను దాల్చియుండెను.*

అనుబంధమును చూస్తే, ఈ 'రట్టగుట్టు,' 'రట్టగుడి', పదములే 'రట్టడి' పదమునకు పూర్వ రూపములనిన్నీ, ఈ'రట్టగుడి' పదమే వ్యవహారమున రట్ట+ఉడయై, రానురాను రట్టోడ, రట్టోడ, రట్టడ, రట్టడి, రడ్డి, రెడ్డియైచివరకు కడపటిపదమై వాడుకలోకెక్కినది. 'రట్టగుట్టు', 'రట్టగుడి' పద మొక సమాసము. రట్ట+గుట్టు లేక రట్ట+గుడి యని పదములకూడిక. ఈరెండుపదముల కర్థము మనము గమనించితిమేని, 'రాష్ట్రకూట' పదమునకును, రట్టడము, రట్టడికము, రట్టడి, రెడ్డి పదములకు అర్థమును మనము సులభముగా గ్రహింపగలుగుదుము. అప్పుడు మొదట మనము రట్టడి పదమున కిచ్చిన యర్థముతో సరిపోవుటయు సంభవించును. రట్ట, గుట్టు, గుడి యనునవి దేశ్యపదములు, పైపదముల కర్థము నిఘంటువుల ననుసరించియు, శాసనసివేదికలబట్టియు, సీదిగువ నిచ్చుచున్నాను.

రట్ఠ = reign, kingdom, empire, country, realm.
(*Pali-English Dictionary* by Rhys Davids and William Stede.)

రట్ట = kingdom, realm, country, district, land.
*Pali-English Dictionary* by Childers.

గుత్తు / గుత్తిక } = A guardian; a town watchman, the chief constable.
*Pali-English Dictionary* by Rhys Davids and William Stede.

గుట్టు = Lease or lessee
*Epigraphia Indica*, Vol. VIII, p. 138 N.

తెనుగులో 'గుట్ట' పద మీయర్థమున నిప్పుడులేదు కాని, గుత్త యనే రూపమును దాల్చి, పైయర్థముననే ఉన్నది.

గుట్టి / గుట్టిగె / గుత్తిగె / గుత్త } = A contract; a monopoly of Tenure; an exclusive right to sale or supply of anyconomodity; Farm; Rent; an income of variable amount sold or let out for a fixed seen.
(*A Kissamwar Glossary* by K. Narasinga Rao; Glossary of *Revenue Terms and phrases* by Wilson)

* "*Raṭṭaguḍi* is an historic title largely used in the epigraphs under reference. Its significance as indicated by the context appears to justify our correcting it with the latter Sanskrit word *Rāshṭrakūṭa* which has been explained in the sense 'the head



పైన వివరించిన 'రట్ట', 'గుట్ట' అను రెండుపదముల కర్థమును సమన్వయించుకొని, 'రట్టగుట్ట' 'రట్టగుడి' పదమునకర్థము పరిశీలింతము. 'రట్టగుట్ట' అనగా, కొంతభూమిని గుత్తగా గొని, దానిపై సర్వస్వత్వముల ననుభవించు నధికారియని నిర్ణయించుకొనవచ్చును. 'రట్టడ' మనగా కట్టుబడిమాన్యము స్థితి, (Feif) 'రట్టగుడి' యనగా రట్టడమున కధికారి, లేక రట్టడ మనుభవించువాడు. ఒక విధమైన పాలెగాడు మొఖాసాదారు (Feudatory) [ఈరట్టగాడ్లు కుటుంబినులు అనగా కాపులు లేక వ్యవసాయదార్లు (Peasants or cultivators) వీరి ముఖ్య వృత్తి వ్యవసాయము]

### కుటుంబిను లెవరు ?

కుటుంబిక పదమున కర్థము మనము ఈసందర్భములో పరిశోధించ వలసియున్నది. పూర్వచాళుక్య, గాంగశాసనములలోను, మఱికొన్నిటిలోను, దేశీయుల సంబోధించుచు వ్రాయించిన ఘట్టములలో "విషయనివాసినః కుటుంబినః", లేక, "విషయనివాసినో రాష్ట్రకూటప్రముఖాన్ కుటుంబిన స్సర్వా న్సమాహూయ" యని రాష్ట్రకూటప్రముఖులగు కుటుంబినుల ప్రశంస కలదు. ప్రాకృతభాషలోని, 'కుటుంబికపదమే సంస్కృతభాషలో 'కుటుంబిన్' పదమయ్యెను. కుటుంబిన్ పదమునకు భూస్వామి, సేద్యగాడు అనియే యర్థము. *

నిఘంటువులో స్థితివంతుడు, భూస్వామి, కుటుంబములో పెద్ద, కాపు, వ్యవసాయదారుడు అని యర్థము లున్నవి పై శాసనములలోని సంబోధనకర్థము విషయ నివాసులైన రాష్ట్రకూట ప్రముఖులగు భూస్వాములు లేక వ్యవసాయదార్లు అని యర్థము. కొన్నిశాసనములందు కుటుంబినః పదమునకు బదులుగా 'కర్షకాః' అని పర్యాయపదప్రయోగ ముండుటచేత, కుటుంబినపదము వ్యవసాయదారునే నిర్దేశించుచున్నదని నే నూహించు చున్నాను. రాష్ట్రకూటులనగా రట్టడముల కధికారులగు రట్టడ్లు అనియు, రాష్ట్రకూట ప్రముఖు లనగా రట్టడిశ్రేష్ఠులనియు స్పష్టము కాగలదు. వీరు కుటుంబినులు. కావున రాష్ట్రకూట రట్టడి పదములు వృత్తివాచకములు. వృత్తితోకూడ నధికారమును సంక్రమించుటచేత తరువాత శాసనములలోనేమి, సారస్వతములో నేమి ఈరట్టడిపదము నధికారద్యోతకమై చూపట్టుచున్నది.

man of a village'. The following other variants of *Rattagudlu* are also found in the Chola records of the Cuddapah district (1) *Ratted!u*, (2) *Rattagutta*, (3) *Rattadlu*"
*Epigraphia Indica*, Vol. XI, p 343.

* A man of property, a land-lord, the head of a family, a peasant, a cultivator.
*Vide Pali-English Dictionary* by Rhys Davids and William Stede.

రెడ్డిపదోత్పత్తి వికాసము నీక్రిందివిధముగ నిర్ణయించుట కిప్పుడు వలనుపడుచున్నది.




రట్టగుట్టు, రట్టగుడి, రట్టడి పదములె రాష్ట్రకూట పదమయ్యెను. రాష్ట్రకూట పదము రట్టగుట్టు కాలేదు. రాష్ట్రకూట పదములోని రాష్ట్ర+కూట పదములకును, రట్టగుట్టు పదములోని రట్ట+కుట్టు పదములకును పరస్పరసంబంధము సంపూర్ణముగాలేదు. 'రట్ట' పదమునకు రాష్ట్ర" పదము సంస్కృతరూపము. రెంటికిని అర్థములో సమన్వయము కలుగుచున్నది. కాని గుట్టు పదమునకును, కూట పదమునకును, అర్థములందు వ్యత్యాసమున్నది. కావున రాష్ట్ర+కూట పదముల కర్థము సంపూర్ణముగా తెనుగు రట్ట+గుట్టు పదములయర్థములతో సమన్వయింపజేయుట సమంజసము కాదు.

రాష్ట్రకూట పదమునకు శాసనపరిశోధకు లిచ్చిన యర్థము.

"రాష్ట్రకూట ప్రముఖాన్ కుటుంబినః" అను సంస్కృతవాక్యభాగమునకు, శాసన పరిశోధకులుఆంగ్లభాషలో "House-holders Viz., the heads of provinces" అని తర్జుమాచేసిరి. అనగా గృహస్థులగు రాష్ట్రములయొక్క పెద్దలు లేక నాయకులు అని వారి సూచన. వారు వ్రాసిన యర్థము అసందర్భము, అసంపూర్ణము, అని స్పష్టముగా చెప్పగలను. "కుటుంబినః" పదమునకు గృహస్థులని యర్థము సందర్భముగా లేదు ఇచ్చట సేద్యకాండ్రు, వ్యవసాయదార్లు అనియే యర్థము చెప్పవలసి యున్నది.

శాసనపరిశోధకులు రాష్ట్రకూట పదములోని రాష్ట్రకూటులు అను రెండుపదముల కర్థము గలిపి, రాష్ట్రము లందలి పెద్దలు అని భావించుకొని, వీరిని వ్యవసాయదారులని యూహించుకొనుట సమంజసముగా నుండదని యెంచి, 'కుటుంబినః' పదమునకు గృహస్థని భావము కూడ కలదు కావున, వారిచ్చిన రాష్ట్రకూట పదార్థమునకు సందర్భానుసారముగా గృహస్థులనునర్థమే కుటుంబినులను పదమున కిచ్చిరి. కొన్ని ఉదాహరణముల నిచ్చుచున్నాను.

౧. సర్వలోకాశ్రయ శ్రీ విష్ణువర్ధన మహారాజాధిరాజ, రాజపరమేశ్వర, పరమభట్టారక, పరమబ్రహ్మణ్య, కన్దేరువాటి విషయనివాసినో రాష్ట్రకూట ప్రముఖాన్ కుటుంబినః ఇత్థ మాజ్ఞాపయతి॥

"The illustrious Vishṇuvardhana, the king of great kings, the supreme master, the supreme lord, the most pious one, thus issues his command to the house-holders *viz.*, the heads of provinces, who inhabited the district of Kanderuvati''.

౨. సర్వలోకాశ్రయ శ్రీ విష్ణువర్ధన మహారాజాధిరాజ, రాజపరమేశ్వరః పరమ భట్టారకః, పరమబ్రహ్మణ్య శ్రీ వీరచోడ దేవః గుద్దవాటివిషయ నివాసినో రాష్ట్రకూట ప్రముఖాన్ కుటుంబిన స్సర్వాన్ సమాహూయ మంత్రి పురోహిత సేనాపతి యువరాజ దౌవారికసమక్ష మిత్థ మాజ్ఞాపయతి।

The illustrious Vishṇuvardhana having called together all the householders, *viz.*, heads of provinces etc., who inhabit the district of Guddavati, thus issues his commands in the presence of ministers, the family priest, the commander of the army the heir-apparent and door-keeper*

వారు రాష్ట్రకూట ప్రముఖాన్ అను పదములోని రాష్ట్రకూటపదమునకు రాష్ట్రముల నాయకులు, రాష్ట్రములోని పెద్దలు అని యర్థమును జెప్పి, ప్రముఖాన్ అను పదమును భాషాంతరీకరణములో వదలివేసిరి. ఈతబ్బిబ్బుల కంతకును కారణము రాష్ట్రకూట పదమునకుత్పత్తి యన్వేషింపక పోవుటయే. రట్టగుడ్లు, రట్టడముల కర్థము తెలిసినప్పుడు, వీటి సంస్కృతావతారమైన రాష్ట్రకూటపదభావముదురవగాహముకాదు. "రాష్ట్రకూటప్రముఖాన్ కుటుంబినః" అను వాక్యమునకు సరియైనభావము, కర్షకులైన రట్టడిశ్రేష్ఠులు, లేక రెడ్డి ప్రముఖులుఅనియే.

ఈ సందర్భమున వైద్యాపండితుడు (C. V. Vaidya) వ్రాసిన హిందూదేశచరిత్రలో, పూర్వ చాళుక్యులను గూర్చి వ్రాయు సవసరమున, రాష్ట్రకూట పదమును గూర్చి ఆయన వ్రాసిన విషయము చదువరులు తెలుసుకొనవలసియున్నది. ఆ పండితుడు చేసిన చర్చవల్ల శాసనపరిశోధకులు, రాష్ట్రకూటపదమున కిచ్చిన యర్థము దుష్టమని స్పష్ట మవుచున్నది. శ్రీ వైద్యాపండితుడు, రాష్ట్రకూటుడనగా గ్రామాధిపతి యనియు, మహారాష్ట్ర దేశమందున్న దేశపాండ్యా, దేశముఖ్ అను పదవికి తుల్యమైనదనియు, వక్కాణించి, తుదకు రాష్ట్రకూటుడనగా శుల్కమును వసూలుచేయు నుద్యోగి యని నిరూపించిరి.*

---

* *South Indian Inscriptions*, Vol. I, pp. 35, 46, & 60.

* C. V. Vaidya's *History of Medieval India*, Vol. I, pp. 306-307.

"Now the word '**Rāshṭrakūṭapramukhān**' is singular in these Eastern Chḷukyan grants and is not found in any of the grants of ancient kingdoms of India. What does it mean? It is translated as 'Heads of Provinces' in the *Indian Antiquary*. But this is not quite acceptable. A *vishaya* is the lowest division and above it comes *rāshṭra* or *bhukti* and so on. The word '*rāshṭra* too occurs in these grants, *e. g.*, Krama *rāshṭra* and apparently shows a division larger than *vishaya* Rashṭrakūṭa originally means heads of provinces but *rāshṭra* cannot come under *vishaya*. Of course we have a district due to the fact that 'Rāshṭrakūṭa' is not the name of a family as many think or thought, but it is the name of an office and is an exact equivalent of the modern 'Dēshmukh' or 'Dēshpāṇḍē' (Head patil or Head-writer) They are the higher officers of the District not the Taluk............However, whether Rāshṭrakūṭa indicates Maharatta people or not, this word Rāshṭrakūṭa occurring in the Eastern Chāḷukyan grants throws full light on the origin of the name of Rāshṭrakūṭa and shows that it means nothing more than a revenue official like the Dēshmukh of the modern days".

శ్రీ వైద్యాపండితుడిచ్చిన యర్థము కొంతవఱకు సరిగా నున్నది. రాష్ట్రకూటపదము, వృత్తివాచకమును, నధికారసూచకమునై, రెండును మేళవించిన యొక స్వల్పగ్రామాధిపత్యమును నిర్దేశించుచుండెను.

పూర్వచాళుక్య శాసనములలోని రాష్ట్రకూటపదము-రాష్ట్రకూటరాజవంశము.

పూర్వచాళుక్య శాసనములలోని రాష్ట్రకూటపదమును, రాష్ట్రకూట రాజవంశములోని వంశవాచకమైన రాష్ట్రకూటపదమునొక్కటి కావు. పూర్వచాళుక్యులకును, రాష్ట్రకూటులకును పరస్పరయుద్ధములు తొమ్మిదవశతాబ్దమునుండి ప్రారంభమయ్యెను. చాళుక్య నృపాలురైన నరేంద్రమృగరాజు, విజయాదిత్యుడు, చాళుక్యభీముడు, రాష్ట్రకూట భూపాలురగు గోవింద రాజు, అమోఘవర్షుడు, కృష్ణరాజు ఒకరితో నొకరు పోరాడుచుండిరి. చాళుక్యుల రాజ్యముపై, రాష్ట్రకూటులు దండెత్తి రాకపూర్వమే, చాళుక్యరాజులు రాష్ట్రకూటుల నంబోధించుచు వ్రాయించిన శాసనము లున్నవి. చాళుక్యశాసనములలోని రాష్ట్రకూటులు విషయనివాసులై, సామంతులైన యధికార వర్గమునకు చెందినవారు. చాళుక్యులతో కలహించుచుండిన రాష్ట్రకూటులు, రాజవంశజులై, మాన్యఖేటమును రాజధానిగా మహారాష్ట్ర దేశమును పాలించిన విషయానంతర దేశాధిపతులైన వైరిపక్షులు. వీరికి చాళుక్యులశాసనములలో రట్టులుగ పేరిడిరి. చాళుక్యనృపాలుడైన నరేంద్రమృగరాజు గాంగులతోడను, రాష్ట్రకూటులతోడను పండ్రెండు సంవత్సరములు సంగ్రామము నల్పి, నూటయెనిమిది ఈశ్వరాలయములను నిర్మించినట్లు, మొదటి అమ్మరాజు గుంటూరు శాసనములో నున్నది. ఆ శాసనములోని ఈ క్రింది శ్లోకమును జూడుడు.

శ్లో॥ గంగరట్ట బలైస్సార్థమ్ ద్వాదశాబ్దా నహర్నిశమ్
భుజార్జితబలం ఖడ్గసహాయో నయవిక్రమైః॥
అష్టోత్తరం యుద్ధశతం యుధ్వా శంభోర్మహాలయాన్
తత్సంఖ్యయా ఒకరో ద్వీరో విజయాదిత్యభూపతిః[1] ॥

శ్లోకములోని రట్టపదము రాష్ట్రకూటులను సూచించుచున్నది. మొదటి అమ్మరాజు యొక్క ఏడూరు శాసనములో గుణగ విజయాదిత్యుని తర్వాత రట్టులు లేక రాష్ట్రకూట రాజులు ఆంధ్ర దేశ మాక్రమింప యత్నించినట్లును, వారిని చాళుక్యభీము డోడించి రాజ్యా రూఢుడయినట్లును వర్ణింపబడినది.[2] పూర్వ చాళుక్యరాజుల శాసనములలో పేర్కొనబడ్డ రట్టులు, రాష్ట్రకూటరాజులని డాక్టరు ఫ్లీటు (Dr. fleet) దొర వక్కాణించి యున్నాడు.[3] అదియునుగాక, పూర్వచాళుక్యరాజైన రెండవ అమ్మరాజ విజయాదిత్యుని సామంతుడును, నతవాటిసీమాపరిపాలకుడును అయిన కాకర్త్యగుండన వ్రాయించిన ఒక శాసనములో తనవంశమునుగూర్చి "సామన్త వొడ్డి సంజ్ఞకుల మాసీత్" అని చెప్పుకొని, తనతండ్రి ఎఱ్ఱియ రాష్ట్రకూటు డైనట్లును, తాతగుండియ రాష్ట్రకూటుడైనట్లును వ్రాయించెను. తానుగూర్చి "గుండ్యనార్యః, కాకర్త్య గుండ్యననామధేయః" అని వ్రాయించుకొనెను. ఈ శాసనముల లోని రాష్ట్రకూటపదము జాతి లేక వంశవాచకముగా ప్రయోగింప బడలేదని స్పష్టము ఈ శాసనమునుగూర్చి, ఆంధ్రచరిత్ర చతురాననుడు నూతనముగా వ్రాసి ప్రకటించిన కాకతీయాంధ్రయుగ చరిత్రములో పేఱొక సందర్భములో చర్చించియుండెను.[4] రాష్ట్ర

---

1 ప్రథమచాళుక్యభీముని అత్తిలి తామ్రశాసనము ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక సం ౧౧. పుట ౨౮౬ ఈ శాసనసంపాదకులైన శ్రీరామయ్య పంతులుగారు, పైని వివరింపబడిన శ్లోకమును, ఉపోద్ఘాతములో వ్రాసిరి.

2 "The *rattas* mentioned in the grant were Rāshṭrakūṭas themselves". *South Indian Inscriptions*, Vol. I, p. 37.

3 "The *rattas* here spoken of, are the wellknown Rāshṭrakūṭas of Malkhed of whom the reigning kings were Gunḍa III at the beginning of the reign of Vijayāditya II and Amōghavarsha I later on". The Eastern Chronology by Dr. Fleet, *vide* p. 101 of *Indian Antiquary*, Vol. XX.

4 కాకతీయాంధ్రయుగచరిత్రము. పు. ౨౩—౨౮.

"The chiefs of a subordinate family called 'Sāmantavoḍḍi' are here mentioned The first of these was Gunḍiya-Rāshṭrakuṭa; his son was Eriya-Rāshṭrakūṭa and his son by Vandyamāmba was Gunḍanārya, also called Kākatya Gunḍyana. At the instance of the chief was granted to the Brahman Dōmana the village Mangallu on the occasion of the summer solstice". Para 24 of *Madras Epigraphical Report* for 1916-17, Amma II.

కూటపదము ఉద్యోగవాచకమని గ్రహింప వలెను. ఇంతవఱకు గ్రహించిన విషయమేమనగా చాళుక్యులశాసనములలోని రాష్ట్రకూటపదము జాతివాచకము కాదనుటయే. అది వృత్తి వాచకము. ఉద్యోగసూచకము. తూర్పుచాళుక్యులు రాష్ట్రకూట రాజవంశజులను రట్టులను గాను, విషయనివాసులగు రట్టడిశ్రేష్ఠులను రాష్ట్రకూటప్రముఖులనుగాను శాసనములలో వ్యవహరించిరి. ఈ రాష్ట్రకూటపదముల రెంటికిని అక్షరసామ్యమె కాని అర్థసామ్యమేమి యును లేదు.

## రెడ్డి—నాయకపదములు.

రెడ్డిపద మధికారార్థమున నహితము వాడుకలోనున్నట్లు పండ్రెండవశతాబ్దమునందలి కొన్ని తెలుగు శాసనములబట్టి తెలియుచున్నది. ఉదాహరణముగ నీక్రింది రెండు శాసనములు చూపుచున్నాను.

౧

శ్రీమచ్చతుర్థవంశేస్మి న్మాకినార్యస్య నందనః।
ఆసీ ద్వీరపరెడ్డి రితి విఖ్యాతో వినయాకరః।
తస్య లక్ష్మీసమానాయాం లక్ష్మాంబాయాం మభూ త్సుతా।
సతీ సూరమదే వీందువదనా వనితోత్తమా।

శ్రీ మన్మహామండలేశ్వర ఒడ్డాది జయంతిరాజుకొడుకు అర్జునదేవనిదేవి యైన శ్రీ మద్దాక్షారామమున పెదమున్నూంటి ప్రేకేటి వీరపనాయకుని కూతురు సూరమదేవి.

౨

శ్రీ మచ్చాతుర్థవంశేస్మి న్మల్లినాయకనందనః।
ఆసీ చ్ఛ్రీ భీమరెడ్డీతి విఖ్యాతో వినయాకరః॥

పై రెండు శాసనములలో మొదటిదానిలో సంస్కృతభాగమున వీరపరెడ్డిని తెలుగు భాగమున వీరపనాయకుడుగాను, రెండవదానిలో మల్లినాయకుని కుమారుని భీమరెడ్డిగాను పేర్కొనడం పరిశీలించినపుడు రెడ్డి—నాయక పదములు సమానార్థముగ వాడుకలో నున్నట్లూహింపవచ్చును. *

* *South Indian Inscriptions*, Vol. IV, Nos. 1043 and 1178.

## రెడ్లు—రాష్ట్రకూట వంశము.

రెడ్డికులనిర్ణయచంద్రిక యను గ్రంథములోనూ, పట్టమట్ట సోమయాజికృత సూత సంహిత కావ్య పీఠికలోనూ కాకతీయ మహాదేవరాజుసామంతుడును, కల్వకొలని పురాధీశ్వరుడును, ఇమ్మడి దేవరంగారిపుత్త్రుడునగు ప్రోలరెడ్డి దండనాయకునిశాసన మొకటి ప్రకటింపబడి యున్నది. ఆ శాసనము శా. శ. ౧౨౮౮ యగు అక్షయసంవత్సర చైత్రశుద్ధ పౌర్ణమాశుక్రవారమునాడు శ్రీ హంపీ నృసింహదేవరకు అలంకారముగ రజితకవచము సమర్పించి వ్రాయించిన శాసనము. శాసనములోని వంశానుక్రమము ఈ దిగువ నిచ్చుచున్నాను.

బ్రహ్మ — మరీచి — కశ్యపుడు — సూర్యుడు — వైవస్వతుడు —
ఇక్ష్వాకుడు — రఘుమహారాజు — అజమహారాజు — దశరథుడు —
రాముడు — కుశుడు — నభుడు — పుండరీకుడు — క్షేమధన్వుడు —
సుమిత్రుడు — విశ్వావసుడు — రాష్ట్రకూటుడు — ఇమ్మడి దేవరెడ్డి — ప్రోలరెడ్డి

పై వంశానుక్రమమును వ్రాయించుకొన్న రెడ్డిప్రముఖుని, శాసనకర్తయైన కవిశిరోమణిని వేనోళ్ళ పొగడినా తనివి తీరదు. ఇట్టి వంశానుక్రమములు, శాసనప్రశస్తులు, చరిత్రకారులకు క్రొత్తలుకావు. పురాణపురుషులనూ,నవగ్రహాల్ని జోడించి,తమ పుట్టు పూర్వోత్తరాలు తెలుసుకొనుట దుర్ఘటమవడంచేత, ఆశ్రితులైన కవిరాజులచే వంశానుక్రమణికలు వ్రాయించి, పురాణములు, ఖగోళశాస్త్రము, చరిత్రమును, కలగాపులగము చేసిన్యాయమైన చరిత్ర వృత్తాంతము గోదావరిలో కలిపెడి చాకచక్యము మన రెడ్డిమండలీకుని నొసటనే బ్రహ్మ వ్రాసియుండలేదు. అట్టి వంశానుక్రమములు ప్రతి రాజవంశమునకునూ గలవు. రాష్ట్రకూటాన్వయ రాజశిఖామణులు తాము యదువంశమున సాత్యకిసంతతిలో వాడైన రాష్ట్రకూట సంతతివారమని చెప్పుకొనిరి. మన రెడ్డినాయకుడు ఇక్ష్వాకువంశములోని రాష్ట్రకూటుని వంశములోనివాడనని చెప్పుకొనెను. రాష్ట్రకూటరాజుల వంశానుక్రమ మీ క్రింది విధముగ నున్నది. *

చంద్రుడు
|
యదువు
|
సాత్యకి
|
రట్టుడు
|
రాష్ట్రకూటుడు

* *The Early History of the Deccan*, p. 85.

రాష్ట్రకూటులు రథికులు అను తెగవారుగా నుండి, వారు క్రమక్రమముగా బలదర్ప శౌర్యములచే, వీరభోజ్యములగు రాజ్యములను సంపాదించి, పరిపాలకులై, రాష్ట్రకూటు లను ప్రౌఢనామమును దాల్చిరి. * కుటుంబినులైన రాష్ట్రకూటులు, మొదట రట్టగుడు తర్వాత రాష్ట్రకూటు లైనట్లే, రాజవంశమువారైన రాష్ట్రకూటులు మొదట రథికులై, రట్టులై, తర్వాత రాష్ట్రకూటు లైరి. రట్టుడు రాష్ట్రకూటుడు ఒక పురుషుని నామములు గావు. అవి ఒక జాతిపేర్లు.

ఈరెడ్డిపదము క్షత్రియవాచకమగు రాట్శబ్దభవము కాదు. రాట్శబ్దభవమైన తేడు ఆతేడుశబ్దపరిణామమైన పదమును గాదు. క్షత్రియోచితమైన దేశాధిపత్యము, రెడ్డివాచ్యులైన నరపాలురు వహించినంతమాత్రాన, వీరు క్షత్రియులని యూహించుటయు, ఆయూహా కనుగుణముగ, రెడ్డిశబ్దము రాట్శబ్దపరిణామమని ప్రతిపాదించుటయు సత్యమైన చరిత్రకు ప్రతిబంధకమైన దని మనవి చేయుచున్నాను.

ఇంతవరకు వ్రాసిన సిద్ధాంతమును సంక్షిప్తముగ జెప్పి, వ్యాసమును ముగిస్తాను. పదెనిమిది శతాబ్దములలో ఆంధ్రదేశములో రట్టగుడ్లు లేక రట్టగుట్లు అను తెగవారుండిరి. వీరె రట్టడులైరి. వీరు రట్టడము లనుచిన్న భూభాగముల కధికారులై, వానిని గుత్తగా ననుభవించుచుండిరి. ఆకాలమునందురట్టడములనునవి ఒకవిధమైన ఆర్థికసంస్థలు. ఆరట్టడములు వీరు అష్టభోగస్వామ్యములు గలిగి అనుభవించు చుండిరి. వీరి ముఖ్యవృత్తి మొదట వ్యవసాయము. రట్టడముల కధికారులురట్టడులు, రడ్డులు, రెడ్లుఅయిరి. మహారాజులు భూదాన శాసనములవ్రాయించినప్పుడు, ఈరట్టడిప్రముఖులను, లేక రాష్ట్రకూటప్రముఖులను రావించి వారిసముక్షముననే, దానముల ధారపోసే ఆచార ముండెడిది. వీరు విషయ నివాసులలో పలుకుబడి కలవారు. వీరికి అధికారములు సంక్రమించి గ్రామ, లేక విషయాధిపతులై, తర్వాత రట్టడ్ల సంతతివారై బాహుబలశౌర్యములచే మాండలికులై, స్వాతంత్ర్యమును వహించి, క్షత్రియోచితమైన ప్రజాపాలనము జనరంజకముగ సాగించి, ఆంధ్ర భూమండలము నందఖండ యశమునుజెంది, కీర్తికాయులైరి. ఇప్పుడీరెడ్డి పదము వృత్తివాచకముగా కాక, జాతిద్యోతకమై ఆంధ్రదేశములో వ్యవహరింప బడుచున్నది.

---

* The House and Nationality of the Rāshṭrakūṭas of Malkhed: Proceedings of the All-India Oriental Conference, Patna, pp. 65–73.

# అనుబంధము.

| పదము | ప్రయోగము | శాసన కాలము | ప్రమాణము |
|---|---|---|---|
| రట్టగుడి | మాత్రిదుగు రట్టగుడ్లు | ఏడవ శతాబ్దము లేక ఎనిమిదవ శతాబ్దము. | Epigraphical Collections No 384 of 1904 |
| | కురుమారి రట్టగుళ్లు | | Epigraphical Collections No. 337 of 1905 |
| | అరవశమహేంద్ర రట్టగుడి | | Epigraphical Collections No 798 of 1917 |
| | వల్లవ రట్టగుడి | | Epigraphical Collections No. 400 of 1904 |
| | చళిక్యరట్టగుడి | | do. do. |
| | రాజేంద్ర చోళదేశ రట్టగుడి | | Epigraphical Collections No. 295 1922 |
| | కొమ్మయరట్టగుడి | | (ఇది కన్నడశాసనము) |
| రట్టోటి | ప్రోలమ రట్టోటి | 886 (శా.శ) | No. 675 of stone inscriptions copied in 1917 (కోటపాడు-కర్నూలుజిల్లా) |
| రడ్డోడి | వంకియరడ్డోడి | పదియవ | పొదిలి శాసనము-38 |
| రాదోడు | చామణ్డరాదోడు | శతాబ్దము | నెల్లూరి జిల్లాశాసన సంపుట |
| రాదోడ్డి | గొల్లియురాదోడ్డి | | ములు |
| రటోడి | రటోడికాపులు | డిటో | కందుకూరు శాసనము. 67 నెల్లూరు జిల్లాశాసన సంపుటములు |
| | మన్నియసామిత్యమొల్ల రట్టోళ్లకు | | శక్తివర్మప్రభుబట్టుశాసనము ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక సంపుటము, 2. సంచిక 4. |

| పదము | ప్రయోగము | శాసన కాలము | ప్రమాణము |
|---|---|---|---|
| | భీమరట్టోడి రట్టోడకి పనుకూకలు | పదియవ శతాబ్దము | S.I.I., Vol. VI, No. 115. గురిందగుంట శాసనము J.A.H.R. Society, Vol. I, Part II, p. 82. |
| రట్టడి | శ్రీభీమేశ్వర మహాదేవరయా నదీనికి సాక్షి. కత్తెప్పన విట్టప రట్టడియుంబోనిరట్టడియుం నడ కుదురినురపరట్టడియుం అన్నపురి అయితమ రట్టడియుం ...... | | గొంకరాజు శాసనము S.I.I., Vol. IV, No. 1174. |
| | గుడ్డవాదినాంటి కడులనాంటి దుగ్గాదికి రట్టడికము. ముందటి రట్టడ్లు శ్రీభీమేశ్వర మహా దేవర పరియలమున | | S.I.I., Vol. IV, No. 1288. |
| | యంగిరట్టడి ఎఱుయమ రట్టడి | 1080 (శా. శ.) | No. 114 of Stone Inscriptions copied in 1917. |
| | కమ్మనాట్టిలోని చిలగ్గరమున రట్టడి | 1084 (శా. శ) | S.I.I., Vol. VI, No. 168. |
| రట్టడికము | గుద్దవాది నాణ్టికడలు నా... నపల్లి రట్టడికము నాలవుపాలు | 1022 (శా. శ.) | do. do. No. 1029. |
| | గుద్దవాది నాంటి కడల నాంటి దుగ్గాదికి రట్టడికము | | do. do. No. 1288. |

| పదము | ప్రయోగము | శాసన కాలము | ప్రమాణము |
|---|---|---|---|
| | శ్రీభీమేశ్వరమహాదేవరకు పిట్ట మకొడుకు మడపలి నూంకాండి యైయిన మగధరాయు జేపోలు నాణ్డం దమరట్టడికమున కవడ్డ రట్టడికమున అలమునకు | 1044 (శా. శ.) | S. I. I. Vol. IV No. 1250. |
| | మహేశ్వర దేవర దేవదానమైన వేల్పూరిం రట్టడికము | 1084 (శా. శ.) | do. do. No. 1248. |
| | రట్టడికాము ప్రతి గ్రహించ్చి అష్టభోగ సర్వ్వసంపదలతో | 1075 (శా. శ.) | do. do. No. 1186. |
| | అణ్ణమూరి రట్టడికములతోం అష్టభోగ సర్వ్వసంపదలతో | | |
| | మాణిణ్డివాడ మా రట్టడికము వలయుచుట్ట అలము ఏనువ్రుట్లు నేల | 1037 (శా. శ.) | do, do No. 1323. |
| రడ్రికము | శ్రీ భీమేశ్వరమహాదేవరదానమైన పంద్రువాడ అలము రడ్రికము అష్టభోగ సర్వ్వసంపదలతోంగూడ తేపటి నివేద్యమునకు నిచ్చితిమి | 1175 (శా. శ ) | do. do. No. 1371. |
| రడ్డికము | బెజవాడ రడ్డికమును | 1087 (శా. శ.) | do. do. No. 737. |

| పదము | ప్రయోగము | శాసన కాలము | ప్రమాణము |
|---|---|---|---|
| " | సురపరడ్డినిచితిమి రడ్డికంనేను | 1053 (శా. శ.) | S. I. I. Vol. IV No. 762. |
| రట్టడము | శ్రీభీమనాథప్రభుం దాక్షా రామ పురే సతా మనుదినం విద్యాదికార్యేణపి ణ్యభోక్తుం తత్రమఠం విధాయ విధివత్ భ క్త్యా తా నా మి హ క్రుం దాక్షామే రాష్ట్రకూటంనభో గంవెల్లగ్రామేవన్నసక్షేత్ర... గుద్దవాదినాంటి కుంయదుటం రట్టడము యష్టభోగ నల్వినంప దలతోంగూడ విలిచివెల్లయం దులపన్నసయన్నివట్ల విలిచి | | do. do. No. 1281. |
| | సతుగుద్దవాదివిషయే కొప్పల్లి గ్రామ రాష్ట్రకూటం క్రీత్వా ప్రాదాదాచంద్రార్కతారం విం శతిశివయోగినాం చ నిత్యం భోక్తుం. | | do. do. No. 1237. |
| రడి | నడ్విరడి పోలిరడి | 1160 (శా. శ.) | do. do. No. 721 |
| | గడలునాణ్టిలోని మంశేటి గంగ్గిరడి | 1065 (శా. శ.) | do. do. No. 1361 |
| | దాడికొమ్మిరడి తమ తండ్రి నారపరడికి | 1182 (శా. శ.) | do. do. No. 767 |

| పదము | ప్రయోగము | శాసన కాలము | ప్రమాణము |
|---|---|---|---|
| | శ్రీమహాదేవరకు ఈడపరడి మలిరడ్డి | 1198 (శా. శ.) | S. I. I. Vol. IV No. 768. |
| | పోలిరడి | 1317-18 A. D. | కావలి No. 31 నెల్లూరి జిల్లా శాసనసంపుటములు. |
| రడ్డి | సూరపరడ్డి, పోతిరడ్డి | 1053 (శా. శ.) | *S.I.I.*, Vol. IV, No. 762 |
| | వీనిజియమావిండి సబ్బరడ్డి | 1054 (శా. శ.) | do do. No. 667 |
| | బొల్లిరడ్డి కొడుకు సుతపరడ్డి | 1112 (శా. శ.) | do. do. No 790 |
| | బ్రిమ్మరడ్డి కొడ్కు అమరిరడ్డి | 1125 (శా. శ.) | do. do. No 791 |
| | కాకతిరాజ్య సమర్థుండైన రేచరుద్రిరడ్డి | 1184 (శా. శ.) | do. do. No. 1117 |
| | పోలిరడ్డి | 1273-74 (A. D.) | ఒంగోలు No. 101 నెల్లూరిజిల్లా శాసనసంపుటములు. |
| | పోలిరడ్డి-నారపరడ్డి-దివిరడ్డి | 1094 (శా. శ.) | *S.I.I.*, Vol. VI, No. 125 |
| | కేతమరడ్డి-బాదిరడ్డి | 1041 (శా. శ.) | do. do. No. 173 |
| రెడ్డి | కేతిరెడ్డి-ముత్తిరెడ్డి | 1058 (శా.శ.) | *S.I.I.*, Vol. IV, No 762 |
| | ఆసీత్రిభీవరెడ్డీతి విఖ్యాతో వినయాకరః | 1174 (శా. శ.) | do. do. No. 1178 |

| పదము | ప్రయోగము | శాసన కాలము | ప్రమాణము |
|---|---|---|---|
| | ఆసీద్వీరప రెడ్డిరితి విఖ్యాతో వినయాకరః | 1174 (శా. శ.) | S. I. I. Vol. IV No. 1043 |
| | కొమ్మిరెడ్డికి తమతల్లిసురసానికి తమ అన్న పోలిరెడ్డికి | 1162 (శా. శ.) | do. do. No. 733 |
| | మాంకిరెడ్డి తమతండ్రిమన్నేనికి | 1204 (శా. శ.) | do. do. No. 756 |
| | కామిరెడ్డి-సన్నపరెడ్డి | 1244 (క్రీ. శ.) | O. 67 Nellore Inscriptions (ఒంగోలు) |
| | దేశిరెడ్డి-బ్రమ్మిరెడ్డి-పెరుమాండిరెడ్డి-పిన్నమరెడ్డి | 1290 (క్రీ. శ.) | O. 99 Nellore Inscriptions (ఒంగోలు) |
| | ముమ్ములారరెడ్డి | 1424 (క్రీ. శ.) | O. 104 Nellore Inscriptions (ఒంగోలు) |
| రాష్ట్రకూట ప్రముఖాన్ కుటుంబినః | దిమిల విషయె కల్వగొండ గ్రామాధివాసివః కుటుంబినః | 682 (క్రీ. శ.) | ప్రథమవిష్ణువర్ధనుని చీపురుపల్లి శాసనము. *Indian Antiquary*, Vol. XX, p. 15. |
| | గొమ్ములూరునామగ్రామ మధివాసతో రాష్ట్రకూట ప్రముఖాన్ కుటుంబిన స్సర్వాన్ | | మొదటి విజయాదిత్యుని శాసనములు. *JAHRS.*, Vol. V, pp. 51-56. |
| | దినకాడునామగ్రామమధివాసతో రాష్ట్రకూట ప్రముఖాన్ కుటుంబిన స్సర్వాన్ | | |
| | (వాది విషయ)నివాసినో రాష్ట్రకూటప్రముఖ (ః) కుటుంబినః | | నరేంద్రమృగరాజను రెండవ విజయాదిత్యుడు (శా. శ. 716- |

| పదము | ప్రయోగము | శాసన కాలము | ప్రమాణము |
|---|---|---|---|
| | | | 764) S.I.I., Vol. I, p. 33. |
| | కండేరువాటి విషయ నివాసినః సర్వాన్ కుటుంబినః సమా హూయేతాం | | మొకటి అమ్మరాజు *Indian Antiquary*, Vol. XIII. p 52. |
| | అత్తిలి విషయనివాసినో రాష్ట్ర కూట ప్రముఖాన్ కుటుంబినః | 814 (శా. శ.) | ప్రథమ చాళుక్య భీముని అత్తిలి తామ్రశాసనము ఆంధ్రసాహిత్య పరిషత్పత్రిక సంపుటము ౧౧ సంచిక ౬. |
| రాష్ట్ర కూట ప్రముఖాన్ కుటుంబినః | వెలనాండు విషయ నివాసినో రాష్ట్రకూట ప్రముఖాన్ కుటుంబినః | | రెండవ అమ్మరాజు. Amma II *Indian Antiquary* Vol. XII, pages, 91-92. |
| | పానునవర విషయ నివాసినో రాష్ట్రకూట ప్రముఖాన్ సర్వాన్ సమాహూయ | | రెండవ భీముడు. Bhima II *Indian Antiquary* Vol. XIII page 213. |
| | అత్తిలి నాణ్డు విషయ నివాసినో రాష్ట్రకూట ప్రముఖాన్కుటుంబినః సమహూయ | | శక్తివర్మప్రభుపట్టు శాసనము ఆంధ్ర సాహిత్య పరిషత్పత్రిక. రెండవ వాల్యూము పుట 410 |
| రాష్ట్ర కూట ముఖా న్సర్వాన్ కర్షకాన్ | అపిచ॥ నదీ మధ్యే జనపదే గ్రామశ్చ ప్రతి సమ్మితే। రాష్ట్ర కూట ముఖా న్సర్వాన్ కర్షకాన్... | | *S. I.* Inscription. Vol. IV No. 1150. |

# శ్రీ రెడ్డి రాజ ప్రశస్తి.

మహాకవి, కాళ్ళకూరి హనుమంతరావు పంతులు.

శా॥ విద్వచ్చిత్తసరస్తరంగవలభీ ప్రేంఖన్మరాళంబు, ప్రి
జ్ఞాదీవ్యుండగు కట్టమంచి కవి లింగారెడ్డి విద్యానిధిన్
గద్వాల్రాజ్యరమానుషక్తయగు లక్ష్మాంబ న్మహారాణి, సు
ద్యద్విశ్రాంత యశోధనంబు లిడి పద్మాక్షుండు గాపాడుతన్॥

సీ॥ ఆంధ్రసామ్రాజ్యభవ్యప్రతాపోగ్రవ । హ్నిచ్ఛటాభినవపాణింధమములు
సమదసరోషముష్కరతురుష్కావనీ । శాంబుదప్రళయఝంఝానిలములు
శత్రుధరాధవసౌధబద్ధధ్వజ । భగ్నకార్యక్రియాపాటవములు
యవనవరాంతఃపురాంగనాజనబాష్ప । నిర్ఝరవ్రజధారుణీధరములు॥

గీ॥ ధణధణంధణ ధణధణధణ మహోగ్ర । పటహనిస్వననర్తిత ప్రధనవిజయ
రెడ్డి ధాత్రీతలేంద్ర ఘోరప్రతాప । బాహుఖడ్గంబులకుఁ జేతుఁ బ్రినవపూజ॥

సీ॥ కుంకుమజలధులఁగ్రుంకులు నవరించి । నెత్తురు ప్రొద్దుల నెరులు పిడిచి
నొసట సిందూరంపుటసలు బొట్టుగఁ దీర్చి । చిందుచుంగులకావిచీర గట్టి
కన్నెమోదుగపూలకచ్చు కొప్పునఁ గూర్చి । రాగధాతువుల పారాణి పూసి
యొడలెల్ల రణనంపుఁ దొడవులఁ గీలించి । యుసిరింత చూపులఁ గసుమ వెట్టి॥

చ॥ చండకరవాలకీల లీరెండఁ గాయఁ । గలువ రిపుకంఠరక్తదుగ్ధములు గ్రోలి
దశదిశారంగతలములఁ దాండవించె । దళుకుఁ గొని రెడ్డిభూపప్రతాపలక్ష్మి॥

సీ॥ ఊహూర వెలయించి రుడురాజమౌళికి । స్ఫటికోపలస్నిగ్ధభవనచయము
నర్చన కర్పించి రంబికాధవునకు । ఖండ్రికల్ మాన్యముల్ గ్రామసమితి
నభిషేక మొనరించి రలికలోచనునకు । నిర్మితపుష్కరణీజలముల
నిరుప్రొద్దుఁ బూజించి రిందురేఖాజూటు । బంతిపువ్వుల బిల్వపల్లవముల

గీ॥ నందులోఁ బుట్టి యందుల కానవడకఁ । బుట్టుసావుల కెద రోసి మోక్షసరణి
జనిరి శివభక్తిచరితార్థజన్ములగుచుఁ । బరమభాగవతులు రెడ్డిధరణిపతులు॥

---

* 8—4—39 తేదీని జరిగిన రెడ్డిరాజ్య వర్ధంతి ఉత్సవములో చదివిన పద్యములు (సంపాదకుడు.)

ఉ॥ పండితులై, కవీంద్రులయి, బంధురసత్కృతు లంది, వంశరా
ణ్మండలితో నమర్త్యమహిమ న్విలసిల్లిరి, భూనభోంతరా
జాండము కీర్తినర్తకి కొసంగిరి, యర్థులు వేడకుండ గా
గొండని పిల్చుచుం బసిడికొండల నిచ్చిరి రెడ్డిభూపతుల్॥

సీ॥ వేదాంగవేత్తలపేదరిమి నశించె । వైశేషికుల నెవ్వ వదలిపోయె
శబ్దశాస్త్రజ్ఞులసంతాపమడుగంటె । భాష్యకర్తలలేమి పలుచ నయ్యె
సంగీతశాస్త్రులబెంగ రూపారెను । పౌరాణికులదుఃఖభరము దొలఁగె
తత్త్వవాదులబీదతన మారుమూడయ్యె । లింగధారులపాలు పొంగి పొరలె॥

గీ॥ బహుకళాపోషకులు రెడ్డివంశనృపులు । పన్నుబందెలు లేకుండఁ బండునట్టి
యగ్రహారము ల్మాన్యంబు లడిగినన్ని । కోరుకొనునట్టి సీమలఁ గూర్చుకతన॥

సీ॥ అగ్రహారములలో నాందోళికల నెక్కి । యెఱ్ఱన యెచ్చోట నీరువాఱె
గస్తూరిలో మన్గి కనకంబులో నాడి । శ్రీనాథుఁ డెచ్చోట సిరులఁ దూగె
పాళెంబులం గాంచి పైడియందలమెక్కి । సూరన యెచ్చోట సుఖముఁ జెందె
పల్లెలు మాన్యము ల్బడసి భోగములతో । గౌరన యెచ్చోటఁ గలిమిఁ బొదలె॥

గీ॥ నెచటఁ గవితావధూటి యీడేరి నగల । కులుకుతోఁ బ్రౌఢశృంగారముల నటించె
నట్టి రెడ్డి నృపాలరాజ్యప్రశస్తిఁ । దలఁప జలుజల్లుమని మేను పులకరించు॥

సీ॥ భారతఘంటంబుఁ బట్టి యశోడోల । నన్నయ్య యూగిననాటిచోటు
కవితాశ్వరాజంబు కాలిసంకెల లూడ్చి । శ్రీనాథకవి చరించిన ధరిత్రి
గౌతమీతీర మార్కండేయ శశివాళి । రక్షకంబైన యాత్రాస్థలంబు
నుడికారమునఁ బేరువడిన యాంధ్రికవిత్వ । తరుణీమతల్లికిఁ బుట్టియిల్లు॥

గీ॥ వేమభూపాలదోశ్శౌర్యవీరవిజయ । ఖడ్గధారాతటి త్కాంతిఁ గనిన నెలవు
సకల సంస్కారకృతులకు జన్మభూమి । హృదయములనుంపుఁ డీరాణ్మహేంద్రపురము॥

గీ॥ ఆంధ్రమునఁ బుట్టి యాంధ్రంబునందుఁ బెరిఁగి । ఆంధ్రరాజ్యంబుఁ బాలించి యశము గనిన
రెడ్డివంశజులార ? యిసడ్డ గొనక । ఆంధ్రరాష్ట్రంబు పట్లఁ దోడగుడు మాకు॥



# "పంట - దేసటి మహాన్వయము."

వడ్డాది అప్పారావు.

ఆంధ్రదేశము నేలిన ప్రసిద్ధ రాజవంశములలో పంటరెడ్లు మిక్కిలి ప్రశస్తి చెందిన వారు. మొదట అద్దంకి రాజధానిగాను, తరువాత కొండవీడు రాజధానిగాను పరిపాలించిన ప్రోలయవేమాదులున్నూ, కాటయవేమారెడ్డి అనంతరము రాజమహేంద్రము రాజధానిగా సింహాద్రిపర్యంతభూభాగమును ఏలిన అల్లయవీరభద్ర, వేమారెడ్లున్నూ, పంటవంశ్యులని గ్రంథములందు చెప్పబడినారు. ప్రోలయవేముని మంచాళ్ళ తామ్రశాసనము(1) లో విష్ణు పాదపద్మములనుండి చతుర్థవర్ణము పుట్టినదని చెప్పి,

"తద్వంశజాతామల పంటరెడ్డి కులామృతాంభోనిధి పూర్ణచంద్రః ।
ప్రోలాభిధః........ ..............................."

పంటరెడ్డికులమందు ప్రోలుడు పుట్టినట్లు వర్ణించినాడు. ఆశాసనమందే మరియొక చోట "శ్రీమన్మహా పంటరెడ్డి వంశార్ణవ పూర్ణచంద్రః"(2)అని ప్రోలుడు పేర్కొనబడినాడు. ఎఱ్ఱాప్రగడ హరివంశములో, కృతిపతివంశవర్ణనాసందర్భములో,

"పంటకులస్వామి ప్రఖ్యాతుడౌర వేమయపితామహు డనుమాన్యతయును"(3)

అనియును మరియొకచోట,

"శ్రీమత్పంటకులాంబుధిసోమ"(4)

అనియును చెప్పినాడు.

శ్రీనాథుడు కాశీఖండములో వీరభద్రారెడ్డిని అతని వంశమును వర్ణించుచు (5)"పంటాన్వయ" "పంటకుల" "పంటవంశపావనా" అని వ్రాసినాడు. వీటినిబట్టి "పంట"

(1) రెడ్డిరాణి సంపుటము 1, సంచిక 6, పుట 179.

(2) రెడ్డిరాణి సంపుటము 1 సంచిక 6 పుట

(3) హరివంశము-వావిళ్ళ ప్రతి-(1926)-పుట 4. 22 పద్యము.

(4) హరివంశము, పూర్వభాగము-ఆశ్వాసము 3, పద్యము 1.

(5) కాశీఖండము - వావిళ్ళ ప్రతి (1916) ఆశ్వా 1-25; 1-38; 1-66 2-167; 4-305; 6-310 7-203.

శబ్దము జాతిపరముగానున్నూ, అన్వయ, కుల, వంశ, శబ్దములు పర్యాయపదములుగా నున్నూ వాడబడినట్లు స్పష్టము. ఇట్లే ఈపంట శబ్దము వ్యక్తిగతముగా ఉపయోగించబడి నది. విజయనగరచక్రవర్తి, రెండవదేవరాయలమహాసామంతుడగు మైలారరెడ్డి దానశాసనములలో(6)"పంట మైలారరెడ్డి" యనిన్నీ కాకతీయ గణపతిదేవమహారాజు కాలమునాటి మరియొక శాసనములో "పంత బొల్లిరెడ్డికి కొమ్మాసానికిం బుట్టిన మల్లిరెడ్డి"(7) అనిన్నీ ప్రయోగాలు కలవు. వీటికి పంటకులములో పుట్టిన మైలారరెడ్డి, బొల్లిరెడ్డి అనియే అర్థము చెప్పవలెను. పై ఉదాహరణములనుబట్టి 13, 14 క్రిస్తవశతాబ్దములనాటికి ఈ పంటశబ్దము రెడ్లలోని అవాంతరశాఖ లేక కులమును నిరూపించుటకు వాడబడుచున్నట్లు తెల్లమగుచున్నది. కాని, విమర్శనాదృష్టితో కొంచెము పరిశీలించినట్టయితే, ఈశబ్దము మొదట నుంచీ, కులవాచకము కానట్లు అనుమానించుటకు తగిన ప్రమాణములు కనబడుచున్నవి. దక్షిణహిందూదేశ శాసనసంపుటాలలో ఆరవదానియం దీశాసన మున్నది.(8)

> "కొట్టియదొాన త్రిభువనమల్ల శ్రీకేశవదేవరకు అఖణ్డదీపమునకుపెట్టిన మేంకలు 55. వీనిం జేకొని పంట్ట మాదెన బోయుండు తనపుత్రానుపవిత్రికము అఖణ్డదీపమునకు నిత్యమానెండునెయి పోయంగలవాండు".

పై శాసనములోని "పంట్ట మాదెన బోయుడు" గొల్లబోయ డని స్పష్టము కదా! ప్రతి దేవస్థానమునకు సంబంధించి ఇట్టి గొల్లవారు దీపదాతలవల్ల గొర్రెలను, మేకలను, మోదాలను గ్రహించి, నిత్యదీపమునకో, అర్ధదీపమునకో నెయ్యి పోయు ఆచార మున్నట్లు, శాసనపాఠకు లెరిగిన విషయమే ! పై శాసనములో 'పంట' శబ్దము వంశమునుగాని కులమునుగాని తెలుపదు. అయినను, ఇంటిపేరై యుండవచ్చుననిసంశయింపవచ్చును. మరియొక శాసనమున(9) ఇట్లున్నది.

> "స్వస్తి శ్రీ శకవర్షంబులు
> 1089 గునేంటి మాఘ బ
> హుళ ౧ ఆదివారమున, శ్రీ
> మన్మహామండలేశ్వర పంట దేవ
> చోళ మహారాజులకు పుణ్యముగ......"

(6) *Epi. Ind*, Vol. XIV; *N. D. I.* Vol. I—149.
(7) తెలంగాణా శాసనములు పుట 68 నంబరు 28.
(8) *S. I. I.*, Vol. VI, p. 641. ss. 1075.
(9) *N. D. I.*, Vol. I. p. 344.

పై శాసనములోని "దేవచోళమహారాజు", సుప్రసిద్ధ చోడవంశ్యుడు. ఈ చోళులశాసనము లనేకములు నెల్లూరు మండలమున కలవు (10) వీరల వంశప్రశస్తి ఈ క్రిందివిధముగా ఉన్నది:—

స్వస్తి చరణ సర
సిరుహ విహిత విలో
చన, త్రిలోచన ప్ర
ముఖాఖిల ప్రిథివీ
శ్వరకారిత కావేరీతీర
కరికాలకులరత్న ప్రదీ
పాహిత కుమారాంకుశ
శ్రీ మన్మహామండలేశ్వర......చోడ మహారాజులు"

వీరు కరికాలవంశజులైన చోడులు(11)"పంట్ల దేవచోళ మహారాజు" లోని పంట శబ్దము ఇంటి పేరున్నూ కాదు. జాతి పేరున్నూ కాదు. ఈ చోడ మహారాజులకు ఇంటిపేర్లున్నట్లు శాసనములలో ఎక్కడనూ కనపడదు. దేవచోళమహారాజు 'పంట' దేశమునకు మహామండలేశ్వరుడు అని సమన్వయము చేసుకోవలెనని నాయూహ. "పంట్ల మాదెన బోయుండు" అన్న చోట కూడా 'పంట' నాటికి చెందిన మాదెన బోయుండు అనియే అర్థము. నాడీభేదమును సూచించు పదమే కాలక్రమమున ఇంటిపేరుగ గాని, జాతిలో అవాంతరభాగమును సూచించు పదముగా గాని మారవచ్చును. శాసనములో, కమ్మనాటి ద్విజులు "కమ్మద్విజులుగానూ"(12)కమ్మనాటి కోమట్లు, "కమ్మకోమట్లు"గానూ(13)చెప్ప బడినారు. అట్లే "పంట్ల" దేవచోడమహారాజును పేర్కొనబడెను.

పైవానిని బట్టి "పంట" మొదటినుండియు జాతిపరముగా ప్రయోగించబడి ఉండ లేదనిన్నీ, 10, 11 శతాబ్దులలో, దేశమును స్ఫురింపచేయు శబ్దమనిన్నీ, 14, 15 శతాబ్దులనాటికి రెడ్లలో, అంతశ్శాఖను తెలియచేయు సంజ్ఞగా, రూఢమై, శ్రీనాథాదులచే ఉప యోగించబడినట్లున్నూ మనము ఊహింపవచ్చును.

(10) *N. D. I.*, Vol. I, p. 387; *N. D. I.*, Vol. II, p. 517; *S.I.I.*, Vol. VI, No. 624; *S.I.I.*, Vol. VI, Nos. 608; 610; 606.

(11) రెడ్లు చోడులే యన్న సిద్ధాంతమునకు పైనశ్లేనిచ్చిన శాసన మాధారమా ? అన్న అం శము ఈ సంచికలో వేరొకచోట చర్చించి యున్నాను.

(12) *S.I.I.*, Vol. No.

(13) *S.I.I.*, Vol. IV, No. 1012.

## " పంటదేసటి "

శ్రీనాథుడు తన భీమేశ్వర పురాణములో తత్కృతిభర్త బెండపూడి అన్నామాత్యుని ప్రభువైన, అల్లయవేమ, వీరభద్రుల వంశావతారవర్ణనము చేయుచు,

> "కైటభదైత్యవైరిపదపంకజమం దుదయంబు నొందె ని
> న్నేటికి భూతధాత్రికిని నెంతయు నచ్చిన తోడబుట్టువై
> హాటకగర్భముఖ్య నిఖిలామరమౌళి మహామణిప్రభా
> పాటలవర్ణమైన యొక పావనవర్ణ ముదీర్ణసంపదన్ "

ఆపుణ్యవంశంబు ............నిఖిల ప్రపంచంబునకు నాధారంబై ప్రవర్తిల్లె. అందు బద్మనాయకులన వెలమలన,గమ్మలన సరిసర్లన, వంటర్లన, బహుప్రకార శాఖోప శాఖా భిన్నంబులైన మార్గంబులం ద్రిమార్గగంగాప్రవాహంబుంబోలె గోత్రంబులెన్ని యేనియును జగత్పవిత్రంబులై ప్రవహించుచుండ, గల్పంబు లతిక్రమించి మన్వంతరంబులు జరిగి యుగంబులు సరికడచి వత్సరంబులు చని కాలచక్రంబు లతిక్రమించుచుండ, జతుర్థకుల మౌళిమండనంబై కీర్తివిహార ఘంటాపథంబైన పంట దేసటి మహాన్వయంబు కాకనాటి దేశంబున భద్రపీఠంబు నధివసించి, సింహవిక్రమనగర, దువ్వూరు, గండవరాది పట్టనంబులు నిజనివాసంబులుగా భ్యాలతాదిష్టాష్టాదశ ద్వీపాంతరాళులగు భూపాలగ్రామణులన్ త్రిలింగభూమండలాఖండులులను బోలయ వేమాన్నపోతాన్న వేమ కుమారగిరీశ్వరాదులం బూజ్యసామ్రాజ్య పీఠస్థులం గాంచె ............ తత్సంబంధ బాంధవంబునం, వసుంధరాభార ధౌరంధర్యంబునం గంధసింధుర ఘటాకూట కపట కిటి కచ్ఛపావతార నారాయణ భుజంగభూధరంబులకు జోడై.........అల్లాడ భూవల్లభుండు రాజమహేంద్రంబు రాజధానిగా సింహాద్రి పర్యంత.........భువన మండలంబుఁబరిపాలించె(14)" నని చెప్పియున్నాడు.

---

14 పై పంక్తులు భీమేశ్వర పురాణము, కొత్తపల్లి అన్నపూర్ణమ్మగారి రెండవకూర్పు పుస్తకము (ఆశ్వా 1-31, 32) నుండి వ్రాయబడినవి. కాని అందు "పంట దేసటి" కి బదులుగా "పంట" అనియే ఉన్నది. ఈవ్యాసములో నే నిచ్చిన పాఠము శ్రీ వే. ప్రభాకరశాస్త్రిగారి 'శృంగారశ్రీనాథము' నుండి. పుట 148. శ్రీశాస్త్రులవారే పైప్రతిలోని "భ్యాలతాదష్ట" అన్న దుష్టపాఠము సవరించి ఇప్పుడు నేనిచ్చిన భ్యాలతాదిష్ట... అన్న పాఠము ఇచ్చినారు. భీమఖండపు అచ్చుప్రతి అయోమయముగా నున్నది. సరియైన పాఠములతో భాషోద్ధారకు లెవ్వరైనా అచ్చువేయించిన, పాఠకులు కృతజ్ఞులగుదురు.

పై వాక్యములలో ఒక విశేషము చూపట్టుచున్నది "అప్పుణ్యావంశ" మందు పద్మ నాయకులు, వెలమలు, కమ్మలు, సరిసర్లు వంటర్లు జన్మించిరని కొన్ని ఉత్తమ శూద్రకుల ములను చెప్పాచు, రెడ్లను చెప్పలేదు. తన పోషకు లైన రెడ్లను ప్రప్రథమమునసే పేర్కొనవలసియుండెనే? తరువాతనైనను, చతుర్థకులమాళిమండనంబైన పంట దేసటి మహాన్వయము పాకనాటిదేశంబున భద్రపీఠం బధిష్ఠించి యుండెనని చెప్పెనే కాని రెడ్లను శూద్రులలో ఒక అవాంతరశాఖగా తెలిపి ఉండలేదు. 'పంట దేసటి' శూద్రగోత్రములలో నొకటిగా వర్ణించియున్నాడు. శ్రీనాథు డిచ్చట మాత్రమే "పంట దేసటి" మహాన్వయ రెండు శబ్దములను కలిపి వ్రాసెను. "దేసటి" యన్నది విడిగా కూడ వంశ, జాతి, గోత్ర పరముగా కాశీఖండములో మూడవ ఆశ్వాసము ప్రథమ పద్య ములో వాడబడినది.

"శ్రీమద్దేసటివంశ
గ్రామణి, మూర్ధాభిషిక్త కంఠీరవ-
.........వీరభద్ర నృపాలా"

ఎఱ్ఱాప్రగ్గడ హరివంశములో,

శ్రీసాధక సుచరిత్రా......దేసటి వేమా, సమస్త ధీరలలామా(15)"

ఆంధ్రచరిత్ర చతురానన శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు ఈ దేసటి శబ్దవిచా రణచేయుచు, ఈ క్రిందివిధముగా వ్రాసినారు.

"వేమారెడ్డి యింటిపేరు దొంతివారని స్థానిక చరిత్రములందును, న్యూయల్ మొదలగువారి గ్రంథములయందును పేర్కొనబడియుండెను, గాని వేమారెడ్డి యింటిపేరు దొంతివారు కారు. ఇతడు దేసటి వంశమున జనించినవాడు...... వీరి యింటిపేరు దేసటి వారని, వీరు పరిపాలించిన యాంధ్రవాఙ్మయమునవె స్పష్టపరుపబడి యున్నది. కొండవీటి రాజ్యమును పరిపాలించిన వేమారెడ్డి వంశమువారును, రాజమహేంద్రరాజ్యమును పాలించిన అల్లాడరెడ్డి వంశమువారును జ్ఞాతులనియు నొక్క వంశమువారే యనియు శంభుదాస ప్రణీతమైన హరివంశమువలనను, శ్రీనాథకవి ప్రణీతములైన భీమఖండ కాశీఖండములవలనను స్పష్టముగా తెలియుచున్నది"(16)

(15) హరివంశము—పూ.భా, ఆశ్వా 9-1. (వావిళ్ళ ముద్రణము 1926).
(16) ఆంధ్రులచరిత్రము—8 వ భాగము, పుట 188.

శ్రీ వీరభద్రరావుగారు "దేసటి వంశగ్రామణి" అన్నచో, వంశశబ్దమునకు ఇంటి పేరు అర్థమని ఊహించినట్లు అగపడుచున్నది. మరియును "దేసటి వేమా" అన్న దానిలో దేసటిశబ్దము వేమశబ్దమునకుముందు ఉండుటచేకూడ వారిఊహకు బలకరమగు హేతువుగా గ్రహించినట్లు కూడ కనబడుచున్నది. "వంశ" శబ్దమునకు తెలుగు దేశములో "ఇంటిపేరు" అని వ్యవహరించు శబ్దార్థము ప్రసిద్ధము కాదని నాయభిప్రాయము. శ్రీనాథుని వాక్యములు సందేహమున కవకాశమిచ్చుచున్నవి. "దేసటి వేమా" అన్న సంబోధనము "రెడ్డివేమ"(17) "రెడ్డిమల్ల"(18) "రెడ్డి వేమవిభుడు"(19) "రెడ్డి భూపాల"(20) "రెడ్డియల్లయవీరా"(21) అన్న వానివంటివే. ఇందులోని మొదటిమాట తప్పక ఇంటిపేరు చెప్పవలెనను విధిలేదు. "కోమటి వేమా" "అన్నమవేమా" "ప్రోలయవేమా" మొదటి మాటలు ఇంటిపేరును చెప్పునా? ఈ దేసటి శబ్దవిచారణచేయుచు, శ్రీ ప్రభాకరశాస్త్రిగారిట్లు వ్రాసినారు.(22) "అల్లాడ రెడ్డి భార్య యన వేమన్నపాలుని కొడుకుకూతురని పూర్వము కొందఱు వ్రాసిరి. శ్రీ మానవల్లి రామకృష్ణకవిగారు శివలీలావిలాసమును జూచి కూతుకూతురు గాని, కొడుకుకూతురు గాదని తొలుత గుర్తించిరి. అల్లాడరెడ్డి వంశ్యులు నన వేమారెడ్డి వంశ్యులు వియ్యాలవారను తలపు దీనిచే తొలగిపోయెను. శ్రీ వీరభద్రరావుగారావల నారెండు కుటుంబముల వారును దేసటివారనియు నొక్క యింటివారనియు గుర్తించిరి. దేసటి యనునది యొక యింటిపేరో లేక యొక తెగకుఁ బేరో యని నాకిక్కడ సంశయ మున్నది." అని తుదిని సంశయమును వెల్లడించినారు. శ్రీ శాస్త్రులవారి సంశయమునకు తావు కలదు. మనకు తెలిసిన వాఙ్మయమునుండి, దేసటి యింటిపేరుగ వాడబడినట్లు నిర్దిష్టముగా చెప్పజాలము.

అల్లాడరెడ్డికి పుత్రుడును, వేమవీరభద్రారెడ్లకు సోదరుడును అయిన నిశ్శంక కొమ్మనామాత్యుని శివలీలావిలాసములో

" ఉ॥ అందు జనించి మించిరి సమగ్రనిరూఢిఁ గ్రమక్రమంబునన్
మందరధీరు లాగత సమస్తవిచారులు సంతతప్రజా
నందన కార్యకారులు గుణస్ఫుటహారులు ధర్మరక్షణా
మందవిచారు లంగజితమారులు దేసటు లత్యుదారులై".

---

(17) హరివంశ—పూర్వ-ఆశ్వా 1-22
(18) హరివంశ—ఉత్త—6—249.
(19) కాశీ—1-89.
(20) కాశీ—3-218.
(21) కాశీ—6—1.
(22) శృంగారశ్రీనాథము—పుట 290.

పై పద్యములో 'అందు' అనగా విష్ణుపాదమునందు, విష్ణుపాదమునుండి నాలుగవ జాతి పుట్టినదనియు, అందు దేసటులు జనించిరనియు చెప్పబడినది. చతుర్థవర్ణమందు, రెడ్డి వంశము గాని, పంట వంశము గాని పుట్టినదనిన్నీ, అందు "దేసటి" యింటిపేరు గలవారు జనించిరనిన్నీ కవి చెప్పలేదు. నాల్గవజాతి శాఖయగు దేసటివంశ ముద్భవించినదనే స్ఫురణ ఎక్కువగా పైపద్యమునందు కలుగుచున్నది. "దేసటులు" అన్న బహువచనము కూడా, జాతివాచకస్ఫురణకు సహకారి యగుచున్నది. శ్రీ వీరేశలింగము పంతులుగారు తమ కవుల చరిత్రములో(23) శివలీలావిలాసమును గూర్చి వ్రాయుసందర్భములో "కృతిపతి వంశజులు కొండవీటి రెడ్డివంశజులవలెనే దేసటివారు" అని వ్రాసి పైపద్యమును ఉదాహరించిరి. శ్రీనాథునిజీవితము వ్రాయుపట్ల "అల్లాడరెడ్డి యింటిపేరు దొంతివారనియు, దేసటివారనియు గూడ నుండియుండును" అని వ్రాసిరి. ఒక్క కుటుంబమునకే రెండు యింటి పేర్లు ఉండునను సమన్వయము యుక్తిదూరము. ఇంటిపేర్లు గ్రామనామములుగా తరచుగా గలవనియు, దేసటి గ్రామనామ మనియు చెప్పవచ్చును. పత్రములో కూడా ఒక్క కుటుంబము రెండు యింటిపేర్లతో వ్యవహరింపబడుననుట, అనుభవవేద్యమున్నూ కాదు. సమంజసమున్నూ కాదు. కొండవీటి దండకవిలెయందు అల్లాడరెడ్డి యింటిపేరు దొంతివారని వ్రాయబడినది. పరంపరాగతమగు ఆసాంప్రదాయము తప్పని చెప్పుటకు తగిన ఉపపత్తులు లేవు. దొంతి యను గ్రామము కలదు. పంటరెడ్లు 'దొంతి' అను ఇంటిపేరు గలవా రిప్పటికిని కలరు. దేసటి యింటిపేరని చెప్పుటకు ప్రమాణబలము చాలదు.

## దేసటు లెవరు ?

రెడ్లవంశవర్ణాదికమును గూర్చి విచారణచేయుఅవసరమున ఈశబ్దము ప్రాచీనశాసనములలో ఎక్కడనైనను కలదేమో యని వెదకగా, కొన్నిట దొరకినది. తఱచి చూచిన కొద్దియు ఈశబ్దము నిగూఢార్థము కలదని సంశయించితిని. పరిశోధనకు సత్యమే పరమావధి కావున సత్యాన్వేషులవిమర్శనకై నాకు తోచిన యభిప్రాయముల వెల్లడించుచున్నాను.

గుంటూరుజిల్లా, నరసారావుపేట తాలూకా, కోణిదెన గ్రామములోని శ్రీ శంకర స్వామివారి దేవాలయములోని యీదిగువ శాసనము కలదు.(24)

(1) "స్వస్తిశ్రీమన్మహామండలేశ్వర త్రిభువనమల్లదేవ పొత్తపిచోడ మహారాజుల యేలెడి భూమియైన కమ్మనాట్టి రాచకొడుకులు, మందడ్లు నూకనాయకులు, మొట్టవాడ గుణ్టికట్టు రాచకొడుకులు, దేసట్లు నూకనాయకులునై కూడి, శక వర్షములు

(23) కవులచరిత్రము సంపుట 1. (1917 ముద్రణము.) పుట 589.

1069 అగు నేంటిపౌషవిషుల పాడ్యమియు గురువారము నుత్తరాయణ సంక్రాంతినాడు శ్రీ కొట్యదొన కేశవదేవరకు నిచ్చిన కాన్కి యూరరూకయు నుల్వారిపాదికయు నిచ్చితిమి"...

త్రిభువనమల్ల దేవ పొత్తపిచోడదుకమ్మనాటికిని, గుండికర్త్రికిని, మొట్టవాడకును ప్రభువు. (25)కొట్యదొన అతని రాజధాని. కేశవదేవర ఆపట్టణములోని ప్రధానదైవతము. కమ్మనాటి రాచకొడుకులును, మందడ్లును, నూకనాయకులును, గుండికర్త్రి మొట్టవాడలోని రాచకొడుకులు, దేనట్లును, నూకనాయకులును కలసి, శ్రీకేశవదేవరకు, "ఊరరూకయు, ఉల్వారి" పాదికయు కానికి నిబంధముచేసి ఆచంద్రతారార్కముగా నిచ్చిరి. ఇచ్చట ఉల్వారి కాన్కలు పన్నులు. ఇట్టి పన్నులను ప్రతివారును విధించ చాలరు. చక్రవర్తులు, రాజులు, రాజపురుషులు, మాండలికులు ఇట్టి పన్నులను విధించి, దేవస్థానములకు నిచ్చు ఆచారము కలదు.(26)అట్లే సుప్రసిద్ధములైన "గణములు", ఆయముల విధించి దేవుళ్ళ అంగరంగభోగములకును, హావిర్బల్యర్చనలకును, ధూపదీపనైవేద్యములకును, కట్టడచేయుట పూర్వమర్యాదయై యున్నది. ఆయాగణములపరిపాలనకు లోనైనవారా "సమయముల" విధిగా పాటించెడివారు.(27)ఇట్టి శాసనములు దక్షిణ హిందూస్థానమందంతటను కలవు. (28)గ్రామమందలి జనులందరును కూడి ఇట్టి ఆయముల దేవాలయములకు ఇచ్చుట గూడ గలదు.

పైశాసనములో రాచకొడుకులు, నాయకులు, దేనట్లు, మందడ్లు, వంశనామముల గానో, ఇంటిపేర్లుగానో, జాతివాచకములుగానో, ఉద్యోగసూచకములుగనో ఒకేవిధముగ అన్వయించవలెను. ఒక పదము వంశపరముగను, మరియొక పదము గృహపరముగను గ్రహించుటకు న్యాయములేదు. నాయకులు అనగా నాయక అను ఇంటిపేరు గలవారని సమన్వయింపవచ్చునా ? లేక రాచకొడుకులు అనగా ఒక వంశమని చెప్పవచ్చునా ? అట్టి యర్థము లిప్రకరణసందర్భమున కుదురవు. ఇవి కుటుంబనామములుగా ఊహించినచో, నాలుగు కుటుంబములవారు రాజ్యములోని ప్రజలపై పన్నులు వేయుట ఎట్లు సాధ్యపడును ? పైనాలుగు పదములును అధికారములను తెలుపుపదములు. నాయకుడు అనునది పూర్వకాలమున, సైనికోద్యోగి యనునర్థమున విశేషించి వాడబడుచుండెను. నాయకులు రివెన్యూ ఉద్యోగస్థులుగ కూడ నుండిరి. అట్లే 'మందడి, దేనటి' కూడ.

(24) *S. I. I.* Vol. VI. No. 639.
(25) *S. I. I.* Vol. VI. No. 644.
(26) do. do. No. 635; 637.
(27) do. IV. No. 935.
(28) *Ep. Car.* VII. St. 118.
" V. pt. I B. 177.

పై శాసనములో కమ్మనాటిలోని మందడ్లును, గుండికట్టు, మొట్టవాడలలో "దేసట్లును" పేర్కొనబడిరి. మందడి పేరుతో వ్యవహరింపబడెడి కొందరిశాసనములు దొరకి యున్నవి. ఆశాసనములను పరీక్షించినపుడు కూడ ఈశబ్దమునకు మొదటి యర్థము ఒక ఉద్యోగి యని స్పష్టపడును. "మందడ్లు" అనగా అశ్వసాహిణులు అని నాయురావు. మందడి యనగా శబ్దరత్నాకరములో గుఱ్ఱపుశాల యనియు, మందడీడు అనగా గుఱ్ఱపు వాడు అనియు అర్థములు ఇవ్వబడినవి. మందడీడు శబ్దమునకు బహువచనరూపము మంద డీడ్లు. ఇదియే కాలక్రమమున మందడ్లు అయి ఉండపచ్చును. ఈ మందడీడు శబ్దమునకు 'సాహిణి' అని అర్థము చెప్పవచ్చును. ప్రాచీన సైనికవ్యవస్థలనుగూర్చి ఇంకను చాలా పరి శోధన జరుగవలసి ఉన్నది. ఈపైశబ్దము సైనిక వ్యవస్థకు చెందినది. సేనలో అశ్వబలము, గజబలము, కాల్బలము అను మూడు భాగములు ఉండెడివి. అశ్వగజబలములు, అశ్వసాహి ణులక్రింద గజసాహిణులక్రిందను ఉండెడివి. "నాయకుడు" అన్నది సామాన్యపదము. సైనిక ఉద్యోగి నాయకుడని వ్యవహరింపబడెడివాడు. ఈసాహిణులకు, నాయకులకు జీత బత్తెములకై రాజు గ్రామము లిచ్చెడివాడు. శాసనములలో ఈసాహిణులు తరచు కన వత్తురు. ఒక శాసనములో(29)"కాకతి గణపద్దేవమహారాజు ప్రధాని గజసాహిణి" అని కలదు, ఇట్టివి ఇంకను అనేకములు గలవు. భాస్కరరామాయణములో అరణ్యకాండకృతి పతి "సాహిణిమారుడు". శ్రీ వీరేశలింగము పంతులుగారు, కవిజీవితములలో "ఈతనిది సాహిణి వంశము" అని వ్రాసినారు. వారియభిప్రాయ మేమో బోధపడుటలేదు. సాహిణి మారుడు గుఱ్ఱపువాడని కథకూడ కలదు. ఇట్టి సాహిణులే మందడ్లు.

తరతరములనుండి, కులక్రమాగతమైన ఉద్యోగములనుబట్టి లోకవ్యవహారములో నిర్దిష్టతకు, వ్యక్తినామమునకు, పౌరుషనామమును కూడ చేర్చుట, తెలిసినదే. వంశపరం పరా, కరణీకము చేసినవారు 'కరణం'వా రగుదురు; భాట్టము (పూర్వమీమాంసాశాస్త్ర మున కుమారిలభట్టుమతము) బోధించు ఉపాధ్యాయులు 'భాట్టం'వా రగుదురు. ఉపా ధ్యాయపదవియం దున్నవారు 'ఒఝుల' 'వఝుల'వా రగుదురు. అట్లే మందడి యన్న

---

(29) *S. I. I.* IV. 978; 979.
*N. D. I.*, Vol. III. page 1083. గజసాహిణి రుద్రనాయకులు.
Do. Do. page 1128—
*S.I.I.*, Vol. IV, No. 1217. అమ్మరసదండనాయకుని సాహిణి గొన్ని పెట్టిగొమ్మ ఛల్లయసాహిణి.

ఉద్యోగము గాని దేనటి యన్న ఉద్యోగము గాని పరంపరాగతమైనపుడు పూర్వపుసంగతి మరచి లోకులనోళ్లలో ఇంటిపేరుగ మారవచ్చును.

గవర్నమెంటు శాసనశాఖవారు 'మందడ్ల'ను పేర్కొనుశాసనములను కొన్నింటిని సేకరించియున్నారు. శాసనశాఖ రిపోర్టులలో, మందడి ఒక కుటుంబము పేరని సూచించినారు(30)

పైన ఉదహరించిన శాసనములలోని కుటుంబము నాలుగవ జాతిది. ఇందు మూలపురుషుడు మట్టడు. అతడు మందడిగా వర్ణింపబడలేదు. కొండపడుమటివిషయమునకు దుర్జయవంశజుడైన మండనిదయవలన ప్రభుత్వము సంపాదించిన ప్రోలడు మాత్రమే మందడి. తంగెడగ్రామములో మరియొక శాసనములో ఈకుటుంబములోని కొండపనాయకుడు వర్ణింపబడినాడు.(31) ఈతనిది ఫణీంద్రకులము. విష్ణువంశము. పెనుగొండాన్వయము. మణినాగపురమునకు ప్రభువు. ఇందులో నీ"పెనుగొండాన్వయము"నకు పెనుగొండగ్రామవాస్తవ్యుడనికాని, యింటిపేరు కలవాడనికాని చెప్పవలసి యున్నది ఈతడు 'నాయకుడు' మందడి, ఈ రెండు పదములును ఉద్యోగసూచకములు.

గుంటూరిజిల్లా పలనాటి తాలూకాలో మరియొక శాసనములో మందడి యొకడు పేర్కొనబడినాడు. ఈతడు మందడి రేవినాయకుడు. తనస్వామి, దొరయచేత

---

(30) Ann Rep. for Epigraphy for Southern Circle 1932—1933 page 74 In an epigraph which comes this year from Vaddavalli, in Sattenapalli Taluk (No. 342( dated Ś. S. 1078 figures a Mādaya Sani, the wife of Mandadi Kondapa Nayaka of Tanarumbariti. See also Ann. Report for Epigraphy 1908. p. 77 general remarks. "A pillar at Sattenapalli Tq. (No. 7 of 1908) contains a Sanskrit inscription in Telugu alphabet of local chiefs belonging to the Chaturthakula. The earliest of them was Matta. His son was Konda, Gadi-kotamalla; his sons were Nāva, Prola, and Matta Of these Prola or Mandadi Prola obtained the cheiftainship of the Giripaschima District, through the favour of Manda of Durjaya family. His brother was maṭṭa or Mandadi Maṭṭa nayaka. He became a subordinate of the Velanati chief Gonka II son of Choda. Maṭṭa bore the titles of Gadikota malla and called himself lord of Tanarumbariti. He built the temple of Trikōtīśwara at Velantur in the Kondapadumati District. The pillar bears on the other faces five other inscriptions registering grants to the same temple by members of the same family or their subordinates ranging from Ś. S. 1055 to 1091.

(31) *Ann. Rep.* Epigraphy (Southern Circle) 1925—26. (c) No. 397.

భూపాలుని అనుమతితో ఈతడు బిజ్జేశ్వర, ముగ్ధేశ్వర, రేవేశ్వర దేవరలను ప్రతిష్ఠించివేసిన దీశాసనము (31 a) ఇతడు మారట్ల గోత్రీకుడు; హైహయరాజ్యప్రతిష్ఠాచార్యుడు; మల్ల ప్రోలుపురవరాధీశ్వరుడు; శ్రీకాకొలని కేశవదేవర దివ్యశ్రీపాదపద్మారాధకుడు, ఇత్యాదిగా వర్ణింపబడినాడు. శాసనశాఖవారు ఇతడు పై కొండపనాయకుని కుటుంబమువాడని అభి ప్రాయపడుచున్నారు. అది యుక్తము కాదు. కొండపనాయకుని గోత్రము మారట్ల గోత్రము కాదు. ఇద్దరును వంశభేదముచేతను, గోత్రభేదముచేతను భిన్నకుటుంబములవారను టకు సంశయము లేదు. భిన్నజాతులవారు కూడ అయిఉండవచ్చును. ఇరువురును మందడ్లు, ఇదియే వారిరువురకును సామ్యము. సామాన్యముగా గ్రామరట్టడ్లు మాత్రమే శాసనములలో కనవత్తురు. కాని ఇతడు మాహిష్మతీదేశరట్టడి. పైవర్ణనను బట్టి, మందడి కుటుంబనామము కాదనియు, ఉద్యోగసూచకమనియు గ్రహింపవచ్చును. ఇంకను ఏమైన సందేహ మున్న యెడల, ఈక్రింది శాసనమును విమర్శించినచో మందడి, గ్రామనామముగాని, కుటుంబనామ ముగాని, వంశనామము గాని, జాతినామము గాని కాదని స్పష్టపడగలదు. (31 b) వెలనాటి గొంకరాజుల అమాత్యుడొకడు, "కొమ్మ" లేక "కుమార" నామధేయుడు కలడు. ఈ కొమ్మన శ్రీవత్స గోత్రికుడు; బ్రాహ్మణుడు. ఒరిగాండి రేమన మనుమడు. రేమన రాజేంద్ర చిహ్నములను పొంది కమ్మదేశాధిపతిగా నియోగింపబడెను. సకలాగమపారగుడు ద్రోణు డాతని కుమారుడు. ఈ ద్రోణుని కుమారుడైన, కొమ్మన వెలనాటిగొంకరాజు అమాత్యుడై, తండ్రిపేరట కొండ పడుమటి విషయములోని నారాయణవేరి గ్రామమున ద్రోణసముద్రమను చెరువును తవ్వించి, కుమారేశ్వరస్వామిని ప్రతిష్ఠించెను. ఈశాసనమునందలి సంస్కృతభాగమున కొమ్మడు, కొమ్మనామాత్యు డనియు, కొమ్మనపెగ్గడ అనియును 'ఒరిగాండి వల్లభు డనియు' వర్ణింప బడినాడు. శాసనమందలి తెలుగుభాగములో, ఈతడు "మందడి కొమ్మనపెగ్గడ" యనిన్నీ "మందడి కొమ్మనామాత్యు" డనిన్నీ చెప్పబడినాడు. ఈకుటుంబపు పూర్వనివాసము ఒరిగాండి గ్రామము. అదియే వీరి యింటిపేరగుట, ఆదిపురుషుడు "ఒరిగాండి రేమన" యని పేర్కొనబడిన విధమును బట్టియే నిర్ణయించవచ్చును. ఇందుకు ఇంకొక ఉపపత్తికూడా

(31 a) *Ann. Rep.* for S. I. Epigraphy—1930—31
(B) No. 316 page 47; part II. para. 20.
(31 b) *Ann. Rep.* for S. I. Epigraphy—1932—33; (b) No. 314. and 317. part II. para 13.

కలదు. "ఒరిగాండి పురవరేశ్వరు" డని వర్ణింపబడిన, సోమనామాత్యుడు, భారద్వాజ గోత్రికుడు మరియొకడు కలడు.(31 c.) ఈతడు దత్తైనపెగ్గడ కొడుకు(31 d.) దీనినిబట్టి ఒరిగాండి పురవరేశ్వర, ఒరిగాండి వల్లభ శబ్దములకు, ఒరిగాండి ప్రభువులర్థమనుటకు వీలు లేదు. ఒరిగాండి యింటిపేరుగలవారని మాత్రమే చెప్పవచ్చును. తాతయింటిపేరు ఒరిగాండి వారనియును, మనుమని యింటిపేరు మందడివారనియు, చెప్పి సమర్థించుటకు న్యాయము లేదు. అట్లు యింటిపేర్లు మారుటకు చాలా పురుషాంతరములు గడవవలె ననుట లోక సిద్ధము.

పై కొమ్మనపెగ్గడ శాసనములో అమాత్య, పెగ్గడ, మందడి, సమానార్థద్యోతకము లనుట సిద్ధాంతము. ఈశాసనములో నిస్సందేహముగా 'మందడి' గృహ గోత్ర జాత్యర్థ సూచకముగా ఉపయోగింపబడలేదు. మందడి అనగా ఒక ఉద్యోగి అన్న నిగమనము ప్రాప్తించుచున్నది.

అట్లే "దేసటి" అనునది కూడ అధికారద్యోతక మగుశబ్దము. శ్రీకూర్మ దేవాలయములో ఈక్రింది శాసనము పరీక్షించినయెడల దేసటిశబ్దార్థము(32) స్పష్టపడును.

"శాకాబ్దానాంతు గణితే వ్యోమభూశశిసోమకే
సౌమ్యవారేతు పంచమ్యాం శుక్లే చైత్రస్య పక్షకే
కొల్లూరాఖ్యే పురాగ్రామే ప్రాభూ దెఱప దేసటిః
తత్పుత్రో ఘుడ్యనో నామ గోంక్క భూప చమూపతిః
తత్పుత్రః కులదుగ్ధాబ్ధి వర్ధనే పూర్ణచంద్రమాః
కులోత్తుంగాంక వీరస్య పృథ్వీశస్య చమూపతిః
ఆదా భటగణేగణ్యః పుణ్యః శ్రీమా నెఱపనాయకః
వర్తేతే యావ దింద్వర్కే తావ త్కాలింగదేశకే,
పితురుద్దిశ్య ధర్మార్థం ప్రాదా ద్దీప మఖండకం
అస్మై శ్రీకూర్మనాథాయ పూర్ణకోటి నివాసినే

ఈశాసనము శకాబ్దములు 1110 నాటిది. దీని యర్థ మిది: పూర్వము కొల్లూరనెడిగ్రామ

(31 c) *S. I. I.* Vol. IV, No. 1180.
(31 d) *S. I. I.* Vol. IV, No. 1179.
(32) *S. I. I.* Vol. V. No. 1338.

మందు, ఎఱపదేసటి పుట్టెను. ఆతని కుమారుడు ఘుద్యన; గోంక్కరాజు చమూపతి; ఆఘుద్యనకుమారుడు ఎఱపనాయకుడు. కులోత్తుంగమహారాజు చమూపతి; భటగణములో మొదట ఎన్నదగినవాడు; పుణ్యుడు. ఆతడు కూర్మనాథునకు తండ్రి నుద్దేశించి అఖండ దీపదానము చేసెను.

ఈ శాసనమును జాగ్రత్తగా పరిశీలింతము. ఇందు మూలపురుషుడు ఎఱప 'దేసటి' కుమారుడు ఘుద్యన చమూపతి; మనుమడు ఎఱపనాయకుడు; తాత పేరును, మనుమని పేరును ఒకటియే. దేసటి, నాయక, చమూపతి శబ్దములు సమానార్థకములుగా నుపయోగింపబడినట్లును, ఉద్యోగమును తెల్పునవి యనియు విస్పష్టమే కదా! "దేసటి"వంశమును తెలిపితే మనుమని పేరునకును, కుమారుని పేరునకును చేర్పబడి యుండవలసినదే. ఛందోభంగమని శంకించుటకు కూడ వీలు లేదు—"ఎఱపదేసటిః" "ఎఱపనాయకః" ఏదియైనను ఒకటే. "దేసటి" పేరులోనిభాగమే ఐతే మనుమడు తప్పక ఎఱపదేసటి అనియే పిలువబడియుండును ఇంటిపేరైనను, మిగతా వంశస్థులందరకును శాసనమందు చేర్పబడియే యుండును పైకుటుంబములోని పురుషులందరును చాళుక్యులకడ సైనికోద్యోగములయం దున్నారు. ఒకరికన్న ఒకరు ఎక్కువ అధికారపదవిని పొందినారు. 'దేసటి' సైనికవ్యవస్థకు చెందిన ఉద్యోగము. సేనాధిపతికన్న చిన్నది. దాక్షారామగ్రామములోని భీమేశ్వరాలయములో "దేసట్ల" మరియొక శాసనము కలదు. (33)

"జయతి వినయవర్తీ......శ్రీ బుద్ధవర్మా నృపః।

తద్వంశజే ష్వథ గుణ వ్రజనంయు తేషు
గచ్ఛత్స్వనేక ధరణీ జనవల్లభేషు
శ్రీకొణ్డ్య దేసటి రభూ ద్విపులేషు తేషు
శ్రీదుజ్జయాన్వయలసద్గృహరత్నదీపః
కండ్రవాడి విషయం చ సకొండః
కోనరాష్ట్రమలభద్ధలితారిః
రాజలాంఛనసమున్నత ముద్యా
దాక్షిభీమధరణీశ్వర రత్నాత్॥

(33) *S. I. I.* Vol. IV No. 1153.

.......... ..............

తస్మాత్ ఖ్యాత విచారశ్చ జాతః పోతః సుతో త్తమః ।
బాదః పశుపతిర్మండః ఇత్యాను_స్తనయా_స్తతః ॥
తత్రాసీన్మహనీయ కీ_ర్తిలతికా కందాల వాలోల్లసత్
జన్యాది మహాగుణైకవసతిః శ్రీకోనపోతః కృతీ
జిత్వా య స్త్రికలింగ వల్లభ మహారాజేంద్ర చోడాయ
వై ప్రాదా ద్దుర్జయవంశ రాజతిలకః కాలింగ గణ్డద్వీపాన్॥
యః కులోత్తుంగచోడస్య కారుణ్యేనాలభద్విభుః
వేంగీంద్రనామధేయం చ, వేంగీగ్రామసహస్రకం
తస్య జ్యేష్ఠో మహాతేజా రాజరాజనృపో_త్తమః......"

పైశాసనము శా.శ. 1070 ప్రాంతములది. దుర్జయవంశమందు బుద్ధవర్మ పుట్టెను. అతనివంశములో "కొండ దేసటి" పుట్టెను. ఆ కొండడు, రాజభీమునివలన రాజలాంఛనములతో కూడిన కోనరాష్ట్రమును పొందెను. అతని కొడుకు పోతడు. అతని తమ్ముడు భీమపరాక్రముడైన భీమడు. భీమనికి రాయడు, కొండడు, గండడు, కేతడు, పోతడు, బాదడు, పశుపతి, మండడు అనెడి కుమారులు కలిగిరి. అందు కోనపోతడు, అనేక మహాకార్యములు చేసినవాడు; త్రికలింగవల్లభుని జయించి కాలింగ గండద్వీపముల రాజేంద్రచోడునికి కొనివచ్చెను. కులోత్తుంగుని కారుణ్యమువలన వేంగీదేశాధిపతియై వేంగీగ్రామసహస్రమును పొందెను. ఇందు వంశకర్త కొండడు మాత్రమే దేసటి. మిగతా వంశ్యులందరును చాల పెద్దపదవులందిరి. వారు చాళుక్యులవద్ద సైన్యాధిపతులై, రాజలాంఛన సమేతులై, సామంతరాజులై యుండిరి. పైన చెప్పిన భీమడు మహామండలేశ్వరుడు; కోనకండ్రవాడి దేశాధిపతి; అతని శాసనములు మరికొన్ని కలవు.(34) అం దీతడు మహామండలేశ్వరు డని వర్ణింపబడినాడు. "దేసటి" పేరునకు చేర్చబడియుండలేదు. ఇది వంశనామము గాని గృహనామము గాని అయినయెడల, తప్పక పేరునకు చేర్చబడియుండును. కొండడు మాత్రమే దేసటి పదవియం దుండెను. తరువాత వారు చమూపతులైరి. అందుచే వారు దేసట్లుగ చెప్పబడక, చమూపతులుగనే చెప్పబడిరి.

---

(34) *S. I. I.* Vol. IV No. 1151. See also No. 103 of *S. I. I.* Vol. VI. where a desati Panda is mentioned.

నెల్లూరిజిల్లాలోని మరియొక శాసనములో నిట్లున్నది:—

స్వస్తి శ్రీ శకవర్షంబులు 1110 అగునేంటి కీలక సంవత్స
రంబున ఉత్తరాయణసంక్రాంతిని పాకనాటిలోని విగుణిథ
8 దేసంగులు నల్గఖుల కాపదేసహి,
కొడుకు ప్రోల్ దేసహి తలాఱి ప్రోలినాయకునికి"

ఇందులో 'దేసహి' అన్నపదము "దేసటి"కి రూపాంతరము. ఇందలి కాపదేసహి, ప్రోల్ దేసహులు, జాతిచే దేసంగులు, ఇంటిపేరు నల్గఖులవారు. ఉద్యోగముచే దేసట్లు. తలాఱిప్రోలినాయకునికన్న తక్కువ ఉద్యోగస్థులు కనుకనే ప్రోలినాయకుని ధర్మార్థము దానముచేసినారు. "నెల్లూరిశాసనములలో "ఆతుకూరి దేశాటి"(34 a) యని వ్యక్తినామము దేసటి (దేశాటి) కనబడుచున్నది.

పై ప్రయోగములను పరిశోధించగా 'దేసటి' వంశమును గాని, కుటుంబమునుగాని తెలుపదనిన్నీ, ఉద్యోగ మయియుండు ననిన్ని బలవత్తరమగు అనుమితి కలుగుచున్నది. ఇకను, ఈయనుమితి బలవడుటకు సహకారులగు కొన్నియంశములను పరీక్షింతము:

"దేసటి" శబ్దముతో సజాతీయములైన కొన్ని శబ్దములు.

దేశ్య, దేసి, దేశి, సెట్టి, దేశాయిచెట్టి, దేసటి, దేసహి, దేశాయి ఇత్యాది పదములు పూర్వశాసనములలో కనపడును. ఆపురాతనపు సంస్థలు నశించినపుడు, ఈశబ్దములకు అర్థము సులభముగా గోచరించునా? దేశిశబ్ద మొక అధికారమును తెలుపును. "దేశిమారి నాయుడు" (35) "దేశిప్రధాని దుగ్గిసెట్టిః చక్రిగొట్టపు మహాప్రధాని దుగ్గిసెట్టి"(36) "కషాయపంచకే దేశిద్రాణమధ్యే న్యవేదయేత్"(37)"తథా సమస్త శ్రీథ మ్మహాదేశ్యా శాకంభర్యాం లవణకోటకం ప్రతివింశోపక మేకం దత్తం"(38) అని తొమ్మిదో, పదో శతాబ్దాలనాటి శాసనాలలో "దేశి" ఉద్యోగమని తెలుపునట్టి, ప్రయోగములు కలవు. "దేశాయి" (దేశాధికృత) లనిన్నీ ఉద్యోగ మున్నది తెలిసినదే. ఇప్పటికి "దేశాయి"

(34 a) *N. D. I.* Vol. III page 1350.
(35) *S. I. I.* Vol. IV No. 679.
(36) *S. I. I.* Vol. IV No. 1223.
(37) *Ep. Ind.* Vol. II page 179.
(38) *Ep. Ind.* Vol. II page 124.

అను ఉద్యోగము వ్యవహారములో ఉన్నది. కొందరు 'చేనటి' 'దేశసెట్టి' పదముల వికృతి యందురు. సెట్టి శ్రేష్ఠశబ్దభవము. అమరనిఘంటువులో "శ్రేష్ఠః పుష్కలఃసత్తమః" అని కలదు. ఆప్టే నిఘంటువులో శ్రేష్ఠః= The president of a mercantile or other guild అని యున్నది. గణముఖ్యుడుఅని దీనియభిప్రాయము. చాలకాలమునుండి సెట్టి, కోమట్లను తెలుపుపదముగా వాడబడుచున్నది. కాని విమర్శించి చూచినచో ఈశబ్దమునకు గణముఖ్యుడు భండారి, (treasurer) నాయకుడు అను అర్థములు కనబడుచున్నవి. "చోడ గోంక్కరాజు సెట్టి, ముమ్మడి భీమావారమున అయ్యపరడ్డి కొడుకు రడ్డియాంక్కన(39)ఇచ్చట సెట్టి యనగా భండారి. మరియొక శాసనములో, "భండారి కొండపరడికొడుకు పోతిరడి" అని కలదు. ఉత్తరార్కాడు జిల్లాలో ప్రతి తాలూకాకును దేశాయిచెట్టి అని ఒక అధికారి ఇప్పటికిని కలదు.(40) ఈ ఉద్యోగము 'justice of the peace' వంటిది అని Thurston వ్రాసియున్నాడు. ఈదేశాయిచెట్టి 'బలిజ' కులస్థుడు. పద్దెనిమిది వర్ణములవారిపైన అధికారము చెలాయించును. నేరస్థులను విచారణచేసి దండనవిధించును. ఈతనితీర్పులు కంపెనీసర్కారు వారు కూడా ఆమోదించేవారట.

10 మొదలు 14-వ శతాబ్దమువరకును "వీరబలంజ" గణమొకటి దక్షిణ హిందూస్థానమున నుండెడిది. వీరలశాసనములు తెలుగు, కన్నడ, తమిళ దేశములయందు పెక్కులున్నవి. వీరు వీరబలంజ ధర్మపరిపాలకులు. బలంజ శబ్దము వణిజ శబ్దభవము. వీరబణజిగలని బణంజిగలని వీరవణిగలని వీరు వ్యవహరింపబడెడివారు. వీరు అహిచ్ఛత్రిపురము నుండి, దక్షిణమునకు వచ్చిరి. వీరి ప్రధానస్థానము అయ్యావలె దీనినే ఇప్పుడు 'ఐహోల్' Aihole అందురు. వీరినిగురించి డాక్టరు బార్నెటుగారు ఇట్లు వ్రాసినారు:—(41)

"There was a vast organisation of associated traders which about the 12th and 13th centuries had spread a net work over the greater part of Southern India and Ceylon and perhaps even further and which beginning with simple commerce and thence developing an elaborate social and semi-military system, strikingly recalls Vīra Vālanjigar our East India Company. These were the Vīra Banajus, as they were called in Canarese or as they were styled in Tamil. The name signifies 'valiant merchants' and is therefore similar to our gentlemen adventurers.... They claimed to have come originally from Ahicchatra, but their central body was at

(39) *S. I. I.*, Vol. IV, No. 1139, Ś. S. 1061.

(40) Thurston Castes & Tribes, Vol. II. p. 121; see under Dēśayi.

(41) Page 98 of Vol. II of Dr. B. A. Saletore's "Social and Political Life in the Vijayanagar Empire".

Ayyavole, the modern Aihole which was the seat of their Board of Directors, consisting of a council of 500 members".—The ancient Tamil Township and Village. Quoted from foot note 1 on p. 98 of Vol. II of Dr. B. A. Saletore's *Social and Political Life in Vijayanagara Empire*.

వీరి వర్ణనలనుబట్టి వైశ్యులుగానున్నారు. వీరి దైవతము కమలావాసవీకన్యకాపరమేశ్వరి. కాని వీరు చిల్లరబేర మమ్ముకొను వర్తకులు గారు. రాజ్యాంగమునందు ముఖ్యస్థానములలో వీరుండిరి. క్షమాఖడ్గముచేతనే క్రోధశత్రువును జయించెడివారలైనను(41) రణరంగరాములు, నీతిరాజ్యవిభవులు, అనీతిరాజ్యదూరులు. ఛప్పన్నదేశములయందును 'ప్రభుముఖ్యులు'గా ఈదేశ "సెట్లు" ఉండెడివారు. గవర, గత్రిసెట్టి, సెట్టిగుత్త, అంకకార, వీర, వీరవణిజ, గండిగ, గావుండ, గావుండస్వామి ఇత్యాది ప్రభేదము లీగణమందు కలవు.(42) పట్టణములలో (సముద్రవ్యాపారము చేయునవి పట్టణములు) 'సెట్టిపట్టణస్వామి' యను ఉద్యోగ ముండెడిది.(43) మండలమునకుగాని, రాజ్యమంతటికిగాని "పృథ్వీసెట్టి" ఒక డుండెడివాడు. ఈ "పృథ్వీసెట్టి" రాజ్యమందలి వర్తకసంబంధమైన యావద్విషయమున కధికారియని చెప్పవచ్చును. ఈ "సెట్టి", "సెట్టిపట్టణస్వామి", "పృథ్వీసెట్టి" పదవులు ఉద్యోగములు. మొదట వైశ్యులు ఈయుద్యోగములయం దున్నను కాలక్రమమున ఇతర జాతు లీపదవుల నాక్రమించెను. తెలుగుదేశమువందీ వీరబలంజగణము విశేష పలుకుబడి గలిగి, రాజ్యాంగమందు చాల ఉన్నతస్థితియం దుండెను. ఇప్పుడు వైశ్యు లెవరును బలిజల మని చెప్పుకొనరు. బలిజశాఖవారు తెలుగుదేశమందు అనేక ప్రభేదములతో, ఉత్తమ శూద్రవంశములకు చెందినవారుగా నున్నారు. ఈ 'పృథ్వీసెట్టి' పదవి యెట్టిదో ఈ క్రింది శాసనములవలన స్పష్టము కాగలదు.

వేమ, వీరభద్రారెడ్ల అనంతరము రాజమహేంద్రరాజ్యము, విజయనగర చక్రవర్తి ప్రౌఢదేవరాయల పాలనలో కొద్దికాల మున్నది. ఆచక్రవర్తి ప్రధానినొకనిని, రాజమహేంద్రరాజ్య పాలకునిగా ఏర్పర్చెను. ద్రాక్షారామ భీమేశ్వరాలయమున అతడు వేసిన శాసనములో ఇట్లు కలదు (44).

(41) *Epi. Car.* VII S. K. 118.
(42) *S. I. I.* IV No. 794.
(43) *Epi. Car.* II No. 335 p 143.
(44) *S. I. I.* Vol. IV No. 1375 (Ss. 1366.)

"శ్రీ వీరప్రతాప ప్రౌఢదేవరాయ మహాప్రధాన రాజమహేంద్రి పురవరాధీశ నాగభూపాలపుత్రి కోటిశంకర బిరుదాంకిత మూరురాయరగండ మల్లైభూపాలసేఖర నిజహిత శ్రీమత్పులియ మార్కోక్కలు గండ పంచముల గోత్రి పెద్దినాయక మ్మారమాంబికాపుత్రి దేవాంబికామనః కమలమిత్రి బలంజెధర్మ ప్రతిపాలకుండైన పృధివీసెట్టిం ...గారైన అంక్క తెలుంగరిసెట్టింగారు..."

ఈతడు 'అంక' తెలుంగరిసెట్టి. రాజమహేంద్రి పురవరాధీశుడు. "పృధివీసెట్టి". అట్టి యీతడు రాయవరము మొదలగు స్థలపెక్కండ్రసమావేశమున కధ్యక్షుడై భీమేశ్వర తిరువాకిటనున్న దాక్షారామ బలంజెవారికి "విరాళంపన్ను" సర్వమాన్యము చేసెను. ఈ "పృధివీసెట్టి" దేశమున కంతకును పెద్ద ఉద్యోగస్థు డనుటకు సందేహమా ?

చాగివారు కాకతీయసామంతులై నాతవాడి, విజయవాటివిషయములక్రీస్తు 12, 13 శతాబ్దులలో పరిపాలించిరి. గుడిమెట్టలోని మూలస్థాన మల్లిఖార్జునస్వామికి కొన్ని ఆయములను వీరబలంజ పరిపాలకులగు ఈ సంఘము మహామండలేశ్వర చాగి దోరయ రాజులకు ధర్మార్థముగా ఇచ్చెను. ఇందీ దోరయరాజులు "పృధ్వీసెట్టి" మహామండలేశ్వర చాగిదోరయ రాజు"లని ప్రశంసింపబడెను.(45) ఈశాసనము ప్రకటింపబడలేదు. ఆంధ్రులవాణిజ్యచరిత్రమున కీశాసనము మిక్కిలి ఉపయోగకరమైనది. దీనినిబట్టి 'సెట్టి' 'పృధ్వీసెట్టి' యుద్యోగములని సిద్ధాంతీకరించవచ్చును. మహామండలేశ్వరుడే "పృధ్వీసెట్టి" దేశ, దేశములకును 'దేశసెట్లు'ఉండెడివారు. ఈపదము ఏలా వాడబడినదిన్నీ పైన ఉదహరించియే ఉన్నాను. దేసి, సెట్టి, దేశసెట్టి, దేశాటి, దేసటి, దేసహి, దేశాయి పదముల పరీక్షవలన దేసటి మొదట అధికారమును తెలుపు పదమే యని సువ్యక్తమగుచున్నది.

(45) *Ann. Rep. S. I. Epi.* 1934—35.
(B) Nos 277—278. Part II. Para 33 S.s. 1162.
"...registers a gift of certain toll incomes made to the temple of Mulasthana-Mallikharjuna at Gudimetta by several trade-guilds and commercial bodies for the merit of Mahamandaleswara chagi Doraya Raja entitled Prithvi Setti and of chagi ganapanya. It is stated that these commercial bodies among are mentioned Ubhaya nānā dēsis, Gavares, mummari dandas, had assembled together in a mahanadu for making the gift specified above."

## దేసటి గ్రామనామమా ?

'విలుగోటివారి వంశావళి' లో 'దేసట్లవారి' బిరుదుగద్య మున్నదనియును, అందు 'దేసట్లపురవరాధీశ్వర' అని కలదనియు, వారు రెడ్లనియు బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకర శాస్త్రిగారు నాతో చెప్పియున్నారు(46) ఇట్టి పేర్లుగల ఊళ్ళనేకములు గలవు. బాపట్ల, తాడుట్ల, పిల్లుట్ల, పిరాట్ల అను గ్రామములు కలవు. ఆయా యింటిపేర్లవా రిప్పటికిని ఉన్నారు. పిల్లుట్లవారు పిల్లుటివారు కాలేదు. పిరాట్లవారు పిరాటివారు కాలేదు. సాదృశ్యమునుబట్టి 'దేసట్లవారు' దేసటివారు కాగూడదేమో! శూద్ర గోత్రములలో ఇట్టి ఊరిపేళ్ళు కలవు. మారట్లగోత్రము, వేసట్లగోత్రము, అరట్లగోత్రము, వల్లుట్ల గోత్రము ఇత్యాదులు. ఇవి యేవియు మారలేదు. దేసట్లనుండి దేసటిరూపము పుట్టుటకు 'దేసట్ల' 'దేసట్లు' అని భ్రమించి, అది బహువచనరూప మని భ్రమించి, దానికి ఏకవచనరూపము దేసటి అని కల్పించి ఉండవలెను. విలుగోటివారి వంశావళిలోని 'దేసట్ల' వారు ఏకాలమువారో నిర్దిష్టముగా నాకు తెలియదు. బహుశా 12, 14 శతాబ్దాలనాటివారు కావచ్చును. దేసటిఅన్న రూపమును, దానికి సంస్కృతమున ఏకవచనరూపము దేసటిః అని క్రీస్తు 11 శతాబ్దమునాటికే యున్నది. అంతకు పూర్వమే దేసట్ల, దేసట్లు, అయి, తరువాత, దేసటి కావలెను. అట్లయినదనుటకు శాసనప్రమాణము ఉన్నట్లు నాకు తెలియదు. దేసటిగ్రామ నామము కాదు. పండితులు దీనిని పరిశోధింతురు గాక.

## దేసూరిరెడ్లు, దేసట్లా ?

రెడ్లలో అనేక అవాంతరభేదములు కలవు. పాకనాటి, పంట, వెలనాటి, రేనాటి, మొరస, పల్లె రెడు, నాడీభేదమునుబట్టి ఏర్పడినభేదములు. గోటేటి, ఓరుగంటి, పెదకంటి, కుంచేటి, మోటాడి, దేసూరిరెడ్లు, నివాసగ్రామములబట్టి ఏర్పడిన భేదములు. దేసూరు పురమని స్పష్టము. దేసూరిరెడ్డు, దేసటిరెడ్డు కానేరరు. ఊరు ఔపవిభక్తికశబ్దము గాన దేసూరి యగును; దేసటి ఎన్నడును కాదు. దేసూరు కాపులును, రెడ్లును కలరు. ఈ దేసూరు శబ్దము, దేశాశుభరశబ్దజన్యమని కొందరు చెప్పుచున్నారు. అట్టి వ్యుత్పత్తి సరియనితోచదు.

(46) ఈ అంశము సుప్రసిద్ధచరిత్ర పరిశోధకులైన మ. రా. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారు వారికి చూపినట్లును కూడ శ్రీ శాస్త్రిగారు నాపేర వ్రాసినారు. వా రిరువురకును కృతజ్ఞుడను.

## పంటరాష్ట్ర మెచట నున్నది?

పైన 'పంట' దేశమును రూపించుశబ్ద మని సిద్ధాంతీకరించితిమి. ఈపంట నాడు లేక రాష్ట్ర మెచట నున్నదిన్నీ పరిశీలింతము. నెల్లూరి తెలుగు చోడరాజగు తమ్ముసిద్ధి కంచిలోని అరుళాళపెరుమాళ్ళ దేవాలయములో క్రీస్తు 1205, 1206 సంవత్సరమున వేసిన శాసనములో ఇట్లున్నది.(47)

......సఖలు సమస్త సామ్రాజ్యాయ నెల్లూరనగరే
కృతాభిషేకః శ్రీగణ్డగోపాల శ్రీదేవీవీరసూతి
మ్మనుమసిద్ధి మహారాజానుజన్మా తమ్ముసిద్ధి
మహీపాలః పాలయ న్నఖిలానుర్ణవాంబరామ్ ॥
దేవాయాస్మై మహాస్తిశైలేశ్వరాయ
స్యాయదూర్ఘామ్న సారయోగ్యే శకాబ్దే
......ద్ధిమ్ పంటరాష్ట్ర ప్రధానమ్
ప్రాదాత్ గ్రామం ముట్టియంపాక్క సంజ్ఞామ్ ॥

శ్రీ గండగోపాల శ్రీదేవీపుత్రుడును, మనుమసిద్ధిమహారాజు తమ్ముడును అయిన తమ్ముసిద్ధిమహారాజు నెల్లూరునగరమున, సమస్త సామ్రాజ్యాభిషిక్తుడై, రాజ్యమును పాలించుచు హస్తిశైలేశ్వర దేవరకు 1127 శకాబ్దములునాడు (క్రీస్తు 1205—06) పంటరాష్ట్రమునకు ప్రధానగ్రామమగు ముట్టియంపాక్కను దానముచేసెను. ఈతమ్ముసిద్ధి మరికొన్ని శాసనములనుబట్టి ఎఱ్ఱసిద్ధికొడుకని తెలియుచున్నది. ఎఱ్ఱసిద్ధియే పైశాసనమందలి గండగోపాలుడు. ఈతడు మనుమసిద్ధి జీవితకాలములోనే అతని సమ్మతితో రాజ్యాభిషిక్తుడై పరిపాలించినటుల కనపడుచున్నది. పంటరాష్ట్రము క్రీస్తు 13-వ శతాబ్దములో ఈతని పరిపాలనలో నున్నది. అంతకు పూర్వము ఈపంటదేశము 'దేవచోడమహారాజు' పాలనలో క్రీస్తు 1167-68 ప్రాంతముల నున్నటుల పైన స్థిరపరచి యున్నాము.(48) ఈ శాసనములబట్టి

(47) *Epi*. Ind. Vol VII. page 154. ఈ శాసనములో పంటరాష్ట్రప్రసక్తి యున్నదని, సుప్రసిద్ధ చరిత్రపరిశోధకులగు శ్రీ డాక్టరు నేలటూరి వేంకటరమణయ్యగారు దయతో నాకు తెలిపిరి, వారి కిందుకు నేను మిక్కిలి కృతజ్ఞుడను.

(48) *N. D. I.* Vol I. Darsi 38.

పంటరాష్ట్రము పన్నెండు, పదమూడు శతాబ్దాలలో వాడుకలో నున్నది. నెల్లూరి చోడుల రాజ్యాంతర్భాగము. తర్వాత ఏకారణముననో 'పంట' వ్యవహారభ్రష్టమైనది. 'ముట్టియంశాక్క' ఎక్కడ నున్నదో తెలుసుకొన్నయెడల పంటరాష్ట్రము ఎచ్చటిదో తెలియగలదు. 'ముట్టియంశాక్క' ముట్టెంబాక అనుపేరుతో నెల్లూరిజిల్లా గూడూరితాలూకాలోఉన్నది. (49) ఇది పంటరాష్ట్రప్రధాన మని చెప్పబడినది. కాబట్టి ఈ ముట్టెంబాకచుట్టును ఉన్న దేశము పంటరాష్ట్ర మనుటకు సంశయింప పనిలేదు. ఈ పంటరాష్ట్రము చాలకాలము తమిళచోళులపరిపాలనలో ఉన్నది. తమిళరాజ్యములో ఇది జయగొండచోళమండలములో అంతర్భాగము. దీనిని పట్టైనాడని వారు వ్యవహరించినటుల అగపడుచున్నది. 'పాంకనాండు' అరవములో ఎట్లు 'పాకైనాడ'యినదో అట్లే 'పంట్ట' నాడు 'పట్టై' నాడును తరువాత 'పడై'నాడును అయి 'పంట' తెలుగులో కాలక్రమమున రూపుమాసిపోయి ఉండవచ్చును. విజ్ఞులు ఈవిషయమున పరిశ్రమింతురని కోరుచున్నాను.

పై చర్చవలన ఫలితమేమన?

(1) "పంట"-రాష్ట్రము. పంటరెడ్లు స్వదేశమును, విజిగీషువులై వీడి, పోయినతరువాత రాష్ట్రార్థమున వ్యవహారభ్రష్టమై కాలక్రమమున శ్రీనాథునినాటికి వంశార్థమున రూఢమయ్యెను. పంటరెడ్లు రెడ్లలో ఒక అవాంతరభేదము.

(2) "దేనటి" ఒక ఉద్యోగము. ఈయర్థము క్రమముగా నశించి, శ్రీనాథుని కాలమునాటికి, ఇదియును వంశార్థముననే వాడబడు చున్నటుల కన్పట్టుచున్నది. పంటరెడ్లలో కొన్ని కుటుంబములవారు దేనట్లని చెప్పుకొనుచున్నట్లు కనపడుచున్నది. ఇంటిపేరుగా వాడబడుచున్నట్లు నిర్దిష్టముగాలేదు. శ్రీనాథుడు 'పంటదేనటి మహాన్వయ' మని గుదిగుచ్చి సామాన్యముగా అన్వయపరముగ వాడియున్నాడు. శ్రీనాథునాటికి వాటి ప్రాచీన అర్థస్ఫురణ వాడుకలో కలుగుచున్నట్లు తోచదు.

---

(49) List of villages (1906 Edn) Gudur Taluq.

# * రెడ్డిజయంతి.

మహామహోపాధ్యాయ, కళాప్రపూర్ణ, కవిసార్వభౌమ శ్రీపాద కృష్ణమూర్తిశాస్త్రి

క॥ శ్రీకరుఁ డత్యుత్తమవిభ, వాకరుఁ డగునాదిదేవుఁ డచ్యుతుఁడు శుభ
శ్లోకుఁడు కరుణాన్వితుఁడై, రేకత్తంజేయుఁ గాక రెడ్డిజయంతిన్.

ఉ॥ రెడ్డి యనంగ నర్థ మది తేఁ డని చెప్పఁగ వచ్చు నట్టి శ్రీ
రెడ్డివిభుప్రతాపమును రెడ్డిప్రభుత్వము రెడ్డిదానమున్
రెడ్డియశంబు చాటుచును రెడ్డిజయంతి వచించు, వేలుపుం
గిడ్డులు రెడ్డివా రనుచుఁ గేరుచుఁ బద్యము లే వచించెదన్.

సీ॥ సకలవిద్యారససంగ్రహణంబునఁ బలికెడు కట్టశబ్దంబె సాక్షి
తను దూఱువారిసేఁ దా దూఱఁ డనుటకుఁ బరఁగెడు మంచిశబ్దంబె సాక్షి
సత్యవాఙ్నిరతుండు సజ్జనుం డనుటకు నింపైన రామశబ్దంబె సాక్షి
శివభక్తిభరితుఁడై చెన్నుమీఱెడు ననువాసికి లింగశబ్దంబె సాక్షి
తే॥ సుకవిజనులను బాలింప క్షోణి నైన, వలఁతి యనుటకు రెడ్డిశబ్దంబె సాక్షి
అట్టి సుజనైకవేద్యుఁడు ననఘుఁడైన, పురుషవర్యునిఁ గొనియాడఁ బోలదొక్కొ!

క॥ ఆతండు రెడ్డివంశ, ఖ్యాతుఁడు పండితుఁడు వానికడ రెడ్డివిభు
త్వాతతచారిత్రకథన్, జేతోమోదంబ కాని చెప్పం గలమే.

తే॥ నాకును బ్రభాకరునకు నానాటినుండి - తాతమనుమలవరున యా; దానివలన
జంకుచుంటిని బద్యముల్ చదువుటకును - గాని కౌశికుఁ దలఁచి నేఁ గడఁగితి నిటు.

ఉ॥ ప్రోలయవేమరెడ్డి మును భూపరిపాలన మాచరించునాఁ
డాలరిమూఁకలై తురక లాహవభూమి నెదుర్ప వారలన్
గాలుసిపీటె కంచియు నిఁకం గలవారలఁ బాఱఁదోలి తా
నేలెఁ బ్రజన్ బ్రబంధపరమేశ్వరముఖ్యుల సత్కవీంద్రులన్.

తే॥ వసుధ నద్దంకియు నమరావతియుఁ గోయ - కొండ గద్వాలయును దోమకొండదొట్టి
పట్టులన్ రెడ్డిప్రభువులు ప్రతిభఁ గనిరి - రాణ లెసఁగఁగ నుర్వరారాజ్య మేలి.

తే॥ నూటయేఁబది వర్షముల్ మేటు లగుచు - రాజ్యమేలిరి యారెడ్డిరాజవరులు
వారిసిరు లెల్ల దేవళ్ళపాలు విప్ర - బృందములపాలయయ్యె నావేళయందు.

---

* ౮-౬-౩౯ తేదీనజరిగిన రెడ్డిరాజ్య వర్ధంతిఉత్సవములో చదివిన పద్యములు (సంపాదకుడు).

క॥ అనితల్లి రుద్రదేవియు - వనితామణు లయ్యు రాజ్యపాలనవిధులన్
ఘనకీర్తిఁ గాంచి మించిరి - ఘనులగు పూరుషులకంటెఁ గడు నబ్రముగన్.

తే॥ వేమనయుఁ గోనబుద్ధుఁడు వీరభద్ర - కవి కుమారగిరియులోని ఘనచరితులు
రెడ్డివంశమునం బుట్టి ఱేడు లగుచుఁ - గవులు నై చాల విఖ్యాతిఁ గాంచి రపుడు.

మహాస్రగ్ధర॥ అనవేమారెడ్డిముఖ్యుల్ హరునమునఁ ద్రిలింగావనీభాగ మెల్లన్
ఘనదోర్దర్పం బెలర్పన్ గయికొని విమతుల్ కాందిశీకత్వ మొందన్
బని తానంతాచ్చకీర్తిన్ బడసి నిజమహీపాలనం బొప్ప విద్వ
జ్జనులం బోషించి విద్యల్ జగతి నిలిపి రెంచంగ సర్వప్రజాళుల్.

ఆ॥ కొండవీటిరెడ్డికుంజరంబులు బహు - దేశసమరవిజయదీపితు లయి
కవుల నాదరించి కావ్యంబులం గాంచి - రాజ్యమేలి రాదిరాజులట్లు.

సీ॥ అన్న, వేమారెడ్డి యధ్యక్షుఁడై ప్రజాపాలనాదికమును బరవుచుండ
బెండపూ డన్నయ ప్రెగడ యై రాజ్యతంత్రం బెల్ల నేర్పున నడవుచుండఁ
గవిసార్వభౌముఁడు ఘనుఁడు శ్రీనాథుఁడు వరకృతు లిడి కీర్తి నెరపుచుండ
శివుఁడు మార్కండేయుఁ డవిరళానుగ్రహమున సిరుల్ దయచేసి ప్రోచుచుండ.

తే॥ శ్యామలాంబయుఁ దోడునీడై మెలంగ - ముళ్ళగూరి మహాశక్తి ముదముఁ బెంప
రాజమహేంద్రమునం దుండి రాజ్య మేలెఁ - బ్రతిభ నల్లాడ శ్రీవీరభద్రరెడ్డి.

శా॥ దేవబ్రాహ్మణభక్తితత్పరుఁ డుమాదేవీప్రియాంఘ్రిద్వయీ
సేవాసాదితవైభవుండు సుకవిక్షేమంకరుం డుల్లస
ద్భావుం డై తగు వీరభద్రుఁ డిచటన్ భద్రాసనాసీనుఁ డై
జీవన్ రాజ్యము సేయుచున్ దెలుఁగు వాసింగాంచఁ జేసెన్ ధరన్.

తే॥ అతఁడు మ్లేచ్ఛాపహృతములౌ నగ్రహార-ములను వెండియుఁ బడసి విప్రుల కొసంగు
టది యొకఁడ కాక మఱియును నగ్రహార-ములను బెక్కు లొసంగె విద్యలను బ్రోవ.

శా॥ దాక్షారామమునందు భీమవరమం దాయాప్రదేశంబులన్
లక్షింపందగు దేవతాలయము లెల్లన్ రాజమహేంద్రంబునన్
సాక్షాదింద్రులు నాఁగ నొప్పినఘనుల్ క్ష్మామండలాఖండలుల్
లక్షల్ వెచ్చముఁ జేసి కట్టి రవి పోలం జెప్పవా వారలన్.

వ॥ ఎప్పుడో రెడ్డిరాజులు రాజిల్లిరని చెప్పు టేమిటి కిప్పుడును.

సీ॥ హైదరాబాదున సధికారి కొత్వాలు ప్రథితుండు వేంకటరామరెడ్డి
యొడ్డేపలిన్ లక్ష లొప్పఁ బింగళికులప్రభువుఁ డావెంకటరామరెడ్డి
మునగాలపురి రాజపూజితుండును గుణ రత్న నాయని రంగరావురెడ్డి
కడపపురంబున ఘనుఁడు మేధాశాలి మేటియౌ కోట్రెడ్డి కోటిరెడ్డి
మణికొండలో రాజమాన్యుఁడు ధన్యుఁడు వరతౌటిరెడ్డి గోపాలరెడ్డి
నెల్లూరుపురమున నెరదాత రేబాలరాయండు పట్టాభిరామరెడ్డి
అనవర్తి నౌదార్యఘనియు భూస్వామి ద్వారంపూడి వరవంశ రామిరెడ్డి
బుచిరెడ్డిపాలెమన్పురిఁ గృష్ణరాయలన్ సాజ్ఞనందిన రామచంద్రరెడ్డి
తిన్నవెల్లిఁ సుగుణోన్నతుండును బ్రభుసన్నుతుండు కొమారసామిరెడ్డి
రాయవరంబునఁ బ్రథితయశుం డయి జానొందు మల్లిడి సత్తిరెడ్డి
చిత్తూర సత్ప్రభుశ్రేష్ఠుఁడు వలివేడు ప్రభువై తలిర్చెదురాజురెడ్డి
ఆదోనిపురమున ననఘుండు ఘనుఁడునై తళుకొత్తుచుండెడు తమ్మిరెడ్డి
తే॥ మఱియు దీపాలదిన్నెగ్రామమున రామి - రెడ్డి కవికోకిలము, రామిరెడ్డి సుకవి
వరుఁడు యానాదిరెడ్డి గోపాలరెడ్డి - మొదలయిన రెడ్డిదొర లిష్ట పొదలుచుండ్రు.
సీ॥ శ్రీగౌతమీపవిత్రకృతక్షేత్రము రాజమహేంద్రనిరాజధాని
శ్యామలాంబామహాశక్తి రక్షితము శ్రీరాజమహేంద్రనిరాజధాని
దక్షిణకాశికాస్థలసమాభిఖ్యము రాజమహేంద్రనిరాజధాని
నన్నపార్యాదికవ్యున్నతిస్థానము రాజమహేంద్రనిరాజధాని
తే॥ సార్వభౌమునివెనుక తత్పములు వాసు - దేవుఁడును వ్యాసుఁడును లింగ మావల వసు
రాయఁడును లోనికవులకుఁ బ్రతిభఁ గూర్చి - రాజిలెడు రాజమహేంద్రనిరాజధాని.
ఉ॥ కాటయవేమరెడ్డినుడిగట్టిన కాటవరంబునందు నే
నాఁట నెసంగియుండుటను, నాగరుకావ్యము నాతఁ డొందుటన్
బాటిగ రాజమహేంద్రమును బాలనజేసిన వీరభద్రుఁడే
మేటి మదీయభావుకుఁడు మేలు దలంచి వచింతు నిత్తరిన్.
చ॥ సురుచిరరాజమహేంద్ర పరిశోధకమండలివార లెంతయే
నిరతపరిశ్రమంబున ననింద్యములైన చరిత్రభాగముల్
పరిపరిరీతులన్ దెలిపి పండితపామరవందనీయులై
పరఁగుదు రంచు నేనిపుడు పల్కెద వారల మేలుఁ గోరుచున్.

# కొప్పుల వంశము.

వడ్డాది శ్రీరామచంద్రమూర్తి, ఎం.ఏ., బి.ఇడి.

పదునాల్గవ శతాబ్దారంభమునకు దక్షిణ హిందూదేశమున గల ఆంధ్రులదగు కాకతీయ సామ్రాజ్యము మహమ్మదీయ దండయాత్రాఫలితముగా క్షీణించుట కారంభించెను. ధనకాంక్షయు, దక్షిణాపథపు రాజులలో ఐకమత్యము లేకపోవుటయు జేసి అల్లాయుద్దీను ఖిల్జీ అతని దండనాయకుడు మాలిక్ కాఫర్, తుగ్లకు వంశీయుడగు జునాఖానులు, దక్షిణ హిందూదేశముపై దండెత్తి దానిని పూర్తిగా కొల్లగొట్టిపోయిరి. కాకతీయ సామ్రాజ్య విచ్ఛిన్నమునకును, రెడ్డిరాజులు తిరిగి ఆంధ్రసామ్రాజ్యము నుద్ధరించుటకును మధ్య ఆంధ్రుల చరిత్ర, చరిత్ర నిర్మాణమునకు, పరిపడు గ్రంధాధారములు, శాసనాధారము లున్నను, యింతవరకు సరిగా నిర్మింపబడలేదు.

కాకతీయసామ్రాజ్య వినాశనమైన తర్వాత ఆంధ్రదేశమును కాకతీయ సామంతులు పంచుకొని చిన్నచిన్న నాయకవంశములు స్థాపించి ఆంధ్రదేశమును పాలించుట అనితల్లి కలవచేరుశాసనము[1] ననుసరించియు మహమ్మదీయ చరిత్రకారుల[2] వ్రాతల ననుసరించియు మనకు తెలియుచున్నది.

అనితల్లి కలవచేరుశాసనము ననుసరించి కాకతి ప్రతాపరుద్రుడు స్వర్గమునకేగిన పిమ్మట 'త్రిలింగదేశము యవనులచే నాక్రమింపబడియుండ, సముద్రములో మునిగి యున్న భూమండలము నాదివరాహావతారుడగు నారాయణు డుద్ధరించినట్లు యవనోదరస్థమగు నాంధ్రదేశమును ప్రోలయనాయకు డుద్ధరించెను. ప్రోలయనాయకుని యనంతరము కాపయనాయకుడు రాజ్యమొనర్చి తురుష్కులచే నపహరింపబడిన యగ్రహారముల మరల బ్రాహ్మణుల కిచ్చుటయేకాక క్రొత్తగాకూడ ననేకాగ్రహారములు దానముచేసెను. అంత కొంతకాలమునకు కాపయనాయకుడు కాలధర్మమునొంద నాతని గొలుచుచున్న డెబ్బది యైదుగురు నాయకులును త్రిలింగదేశమును విభజించుకొని యొక్కొక్కడొక్కొక్క భాగము

1. Jour. Tel. Acad Vol. II pages 93—112.
2. Briggs: Ferista Vol. I P. 427; Elliot and Dowson Vol. III. P. 245.

నేలసాగిరి[3]. ఈ కాపయనాయకునే మహమ్మదీయ చరిత్రకారులు కృష్ణనాయకుడని [4] యు, కన్యానాయకుడ [5]నియు వ్యవహరించిరి. ఈతడే ఆంధ్రసురత్రాణ [6], ఆంధ్రదేశాధీశ్వర, [7] అఱు మనంగంటి పురవరాధీశ్వరు [8] డగు కాపయనాయకుడు.

పైన వర్ణింపబడిన పరిస్థితులకు పూర్వమే కాకతీయ సామంతులుగానుండి గోదావరీ కళింగ మధ్యభాగముల పరిపాలన సంపాదించి స్థిరత్వమేర్పరుచుకొన్న రెడ్లవంశమగు కొప్పులవంశము శక 1259 నాటికి కాకతీయసామ్రాజ్యవినాశనము నవకాశము చేసికొని స్వతంత్రరాజ్యము స్థాపించుకొని నేటి తూర్పుగోదావరి, విశాఖపట్నపు జిల్లాలపై పిఠాపురము రాజధానిగా నేలసాగెను. ఈకొప్పులవంశపు చరిత్ర క్లుప్తముగా వర్ణించుటయే యీవ్యాసముయొక్క ముఖ్యోద్దేశము. ఒక శతాబ్దపుకాలము గోదావరీ కళింగమధ్య భాగముల నవిచ్ఛిన్నముగా పాలించిన యీ రెడ్డివంశపు చరిత్ర మనకింకను సరిగా తెలియదు. [9]

## కొప్పుల వంశము

ఈ వంశపుచరిత్ర తెలిసికొనుటకు మనకుగల శాసనాధారముల నీక్రింద పొందుపరచుచున్నాను. మొదటిది 'శ్రీమతు సోమయదేవ దివ్య శ్రీపాదపద్మారాధక సకలాది భక్తుల పాదోదక ప్రసాదోపజీవి' పగమెచ్చుగండ కొప్పుల పోలయ, అతని చెల్లెలు ముప్పసాని, తమ్ములు దొడ్డదేవర, నగనబోయందును కలసి తమతాత కొప్పుమారెడ్డికిని, తండ్రి నారెబోయనికిని, తల్లి కొమ్మసానికిని, దమ అన్నలు కొఱ్ఱుపుపాటి ఎఱపోతి నాయునికి, డొంక్కన మార్నినికి ధర్మార్థముగా బెజవాడ మల్లేశ్వర దేవరకు యిచ్చిన అఖండదీపముల దెల్పు శాసనము[10]. శక 1186 విభవ సంవత్సర మాఘ బహుళ చతుర్దశీ గురువారమునా డివ్వబడినది. మనకు లభించినశాసనము లన్నిటియందును యిదే ప్రాచీన మయినది. దీని ననుసరించి మనకీక్రింది వంశవృక్షము లభించుచున్నది.

---

3. Jour. Tel. Acad. Vol. II p. 95.
4. Briggis. Ferista Vol. I p. 427.
5. Elliot & Dowson Vol. III p. 245.
6. Ep Ind. XIII p. 259 ff.
7. Telingana Inscriptions p. 163.
8. S. I. I. Vol. IV No. 950.
9. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారిదివరకు యీ విషయముపై ఆంధ్రేతిహాస పరిశోధక మండలి వారి త్రైమాసిక పత్రికలోను, రెడ్డిరాణిపత్రికలోను కొంతవరకు చర్చించియున్నారు.
10. S. I. I. IV No. 765.

కొప్పమారెడ్డి
|
నారెబోయుడు = భార్య కొమ్మసాని
|

కొఱ్ఱుపుపాటి ఎరపోతినాయుడు | డొంక్కెన మార్నేడు | పగమెచ్చుగండ కొంప్పుల ప్రోలినయుండు. (శాసన దాత) | ముప్పసాని | దొడ్డదేవర | నగనబోయుండు

వీరింటి పేరగు కొప్పుల గ్రామనామముగా కనబడుచున్నది. కొప్పోలు గ్రామ మొకటి గుంటూరుజిల్లాలో నున్నది.[11] ఈశాసనమునుగూర్చి చర్చించుటకు పూర్వము శాసనదాత పొగడిన సోమయ దేవుడెవరో నిర్ణయించ వలసియున్నది. ఈసోమయదేవుడు కొలని సోముడని పేరుగాంచిన, ఇందులూరి పెదమల్ల విభుని కుమారుడైన సోమమంత్రి కాని వేరొకరుకారని మన కాకాలపు రాజకీయపరిస్థితులు వలన తెలియును.

ఈ శాసనకాలమునాటికి కాకతీయ సేనానులు వేంగీదేశపాలకులగు వెలనాటి చోళులను కళింగరాజులను జయించి సింహాద్రిపర్యంతభూములను కాకతీయసామ్రాజ్యమున కలుపుటకు చాల ప్రయత్నములు చేయుచుండిరి. కాకతిగణపతి సేనానులగు రాజ నాయకుడు, మల్లల హేమాద్రిరెడ్డి, జాయపనాయక, ఇందులూరి సోమమంత్రులు వేరు వేరుగా కళింగముపై దండెత్తి దానిని వశపరచుకొనుటకు చేసిన ప్రయత్నములు వారి శాసనముల[12] వలనను, ఇతరగ్రంథములవలనను తెలియుచున్నవి. కాకతీయ సేనానులలో కళింగవిజయమునకు ముఖ్యులు ఇందులూరివంశీయులు. వీరిలో సోమమంత్రి, అన్నదేవుడు, రుద్రదేవుడు ముఖ్యులు. సోమమంత్రి కాకతి గణపతిదేవుని ప్రధానమంత్రి యనియు, దండనాథుడనియు, ఓరుగంటికి తూర్పుభాగమున నుండెడి దేశములనే గాక కళింగములోని భూములను గూడ జయించెననియు శివయోగసారమున[13] వర్ణింపబడినాడు.

11. List of villages of the Madras Presidency p. 107.
12 Hyderabad Arch. Series, No. 3. p. 16; *Ep. Ind.* III, p.84. శివయోగసారము.
13 సుభాషి, Vol. I, p. 25.

చ॥ ఇల జవహుసైన్యముల్ గొలువ నేకశిలాపురి తూర్పుదిక్కునం
గల రిపుభూములెల్ల గొని గర్వముమై (నెరి) కాడిమండలీ
కుల నవలీల దోలి (నురి) గోగులనాడును గొల్చివీడునా
వెలసిన దుర్గముల్ గొనుచు వేగమె గౌతమి దాటి యుమ్మలన్.

క॥ మూడియు రెండుంగొనియూ,
డాడెడి పన్నెండు మన్నియములు నోడిచి తా
నాడె కళింగసీమకు
గూడిన భువిగొనియె సోమకులముఖ్యు డోగిస్.

పై శాసనములోని సోమయదేవుడీ ఇందులూరి సోమమంత్రి కాని వేరొకరు కారని నిర్ణయించుటచే మనకు శాసనములోని చాల విషయములు సుబోధకము లగుచున్నవి. ఇందులూరి సోమమంత్రి నాశ్రయించి అతని మెప్పువడసిన యీకొప్పులవంశములోని 'పగమెచ్చు గండ' పోలియను, సోమమంత్రి తాను జయించిన కళింగభూభాగమును రక్షించుటకు పిఠాపురములోనుంచి యుండును పోలియశాసనము ననుసరించి మనకాతనియన్నలు ఎఱపోతినాయుడు, మార్నేడులు 'కొఱ్ఱుపాడు' 'డొంక్కిన'లకు పాలకులుగా నగపడుచున్నారు. కొర్నిపాడను[14] గ్రామము గుంటూరిజిల్లాలోను, డొంకుని[15] అను గ్రామము గంజాం జిల్లాలోని ఉదయగిరి ఏజన్సీలోను కనపడుచున్నవి. అందుచే ప్రథమమున గుంటూరిజిల్లాలోనుండి దానిని జయించుటకు ఇందులూరి సోమమంత్రి వచ్చినప్పు డాతని నాశ్రయించి యాతని మెప్పువడసి, గుంటూరిజిల్లాలోని కొర్నిపాడునకు ఎఱపోతియు, నేటి గోదావరి విశాఖపట్టణపుజిల్లాలపరిపాలన పోలియయు, గంజాంజిల్లాలోని డొంక్కినవద్ద మార్నేడును పరిపాలకులుగా నియమింపబడియుందురు. కాకతీయసేనానులు గంజాంజిల్లావరకుజయించి యుండిరనుటకు రాజనాయకుని విజయములు[16] మన శాసనమును బలపరచుచున్నది.

కొప్పులవంశచరిత్ర తెలుపు రెండవశాసనము ఆంధ్రమండల మందలి గోదావరీ కళింగ మధ్య భాగమును పిఠాపురము రాజధానిగా పరిపాలించుచు శక 1259వ సంవత్సర

14. List of Villages in the Madras Presidency P. 105.
15. ibid Page 27.
16. ibid Hyderabad Arch. Series No. 3 P. 16.

మున నామయ నాయకునిచే యివ్వబడిన దోసేపూడి శాసనము.[17] దీని ననుసరించి నామయ నాయకుని తండ్రిపేరు పోలయ యనియు తల్లిపేరు చోడసూంబ యనియు, తాత "పగమెచ్చుగండ" "ప్రత్యర్థి గర్వనిర్వాపణ" బిరుదాంకితుడగు కొప్పులకాపయ నాయకు డనియు తెలియుచున్నది.

బెజవాడ శాసన దాత కొప్పులపోలయకును, దోసేపూడి శాసన దాత నామయ నాయకుని తాత కాపయ నాయకునికిని, పగమెచ్చుగండయను బిరుదముండుట చేతను, యిరువురి కాలమును దగ్గరగా నుండుటచేతను "పగమెచ్చుగండ" "ప్రత్యర్థి గర్వనిర్వాపణ కొప్పులకాపయ నాయకుడు" పగమెచ్చుగండపోలయ కుమారుడని యూహించుట కేయాటంకమున్నట్లు కనబడదు. ఈశాసనమువలన కాకతి గణపతి దండనాధుడిందులూరి సోమమంత్రిచే పిఠాపురమున తమ ప్రతినిధిగా స్థాపింపబడిన పోలయ, అతని కుమారుడు కాపయయు, కూడ కళింగ దేశమును పూర్తిగా వశపరచుకొనుటకు కాకతిరుద్రాంబ ప్రతాపరుద్రాల కాలమున పంపబడిన సేనానులకు సహాయము చేసి వారి మెప్పుపొంది, "పగమెచ్చుగండ" లనియు, "ప్రత్యర్థి గర్వనిర్వాపణు" లనియు బిరుదావళులు సంపాదించి కాకతీయ రాజప్రతినిధులుగా గోదావరీ కళింగ మధ్యభాగమును పాలించిరని యూహించ వలసియున్నది.

ప్రతాపరుద్రుని యనంతరమువరకు యీ కొప్పులవంశములకు స్వతంత్రరాజ్య మేర్పరచుకొనుట కవకాశము చిక్కలేదు. దోసేపూడి శాసనదాత నామయనాయకుని కాలమునకు మహమ్మదీయ దండయాత్రఫలితముగా కాకతీయసామ్రాజ్యము విచ్ఛిన్న మాయెను. అల్లాయుద్దీన్ ఖిల్జీసేనానాయకుడగు మాలిక్‌ఖాఫర్, తుగ్లక్ వంశీయుడగు జునాఖానులు, దక్షిణహిందూ దేశమునకు వచ్చి కొల్లగొట్టి కాకతీయసామ్రాజ్యమును పూర్తిగా నాశనముచేసి మహమ్మదీయదండనాయకుల నచ్చటచ్చట దేశ సంరక్షనార్థ ముంచి వెడలిపోయిరి. ఈపరిస్థితులవలన కాకతీయసామంతు లందరు తమచే పాలింపబడు దేశములో స్వతంత్ర రాజ్యముల స్థాపించి, మహమ్మదీయ దండనాయకుల దరిమి హిందూ నాగరికతను రక్షించిరి. అట్టివారిలో తెలింగానమును రక్షించిన ముసునూరి పోలయ అతని అన్న కుమారుడు కాపయనాయకుడును, కోరుకొండ రాజధానిగా నేలిన ముమ్మడి

---

17. E. P. Ind. IV p. 356.

నాయకుడును, కొండవీటి రాజ్యము పాలించిన దేసటి ప్రోలయవేమారెడ్డియు, రాచకొండ రాజ్యము నేలిన వెలమరాజులును, విజయనగరసామ్రాజ్య స్థాపకులగు హరిహర బుక్క-రాయసోదరులును గోదావరీ కళింగ మధ్యభాగముల వశపరచుకొన్న కొప్పులనాయకుడును ముఖ్యులు నామయనాయకుడు అతని దోనేపూడిశాసనమువలన క్రీ॥ శ॥ 1337 నాటికి స్వతంత్రుడై గోదావరి కళింగ మధ్యభాగము పరిపాలించుచున్నట్లు మనకు తెలియుచున్నది. ఈసందర్భములో అనితల్లికలవచేరు శాసనములోని కొన్ని విషయములను చర్చించవలసియున్నది. అనితల్లిశాసనము ననుసరించి త్రిలింగదేశమంతయు ప్రోలయనాయకుని అనంతరము కాపయనాయకుని పరిపాలనలోనుండి అతని మరణానంతరము, అతని చేతిక్రిందనుండెడి డెబ్బదియైదుగురు నాయకులకు వశమైనదని తెలియుచున్నది. కాని ప్రోలయనాయకుడుగాని, కాపయనాయకుడు గాని త్రిలింగమంతయు కాకతీయ సామ్రాజ్య వినాశనమయినతర్వాత ఏకఛత్రాధిపత్యముగా పాలించలేదు. వారు మహమ్మదీయుల బారినుండి రక్షించిన దొక్క- తెలింగానముమాత్రమె.

దీనికి కారణము కొప్పుల నామయనాయకుడు గాని అతని తరువాతవారు గాని తాము త్రిలింగదేశము రక్షించినట్టియు, ఆఱుమనంగంటి పురవరాధీశ్వర, ఆంధ్రసురత్రాణబిరుదాంకితుడైనట్టి కాపయనాయకునికి భృత్యులమని ఎచ్చోటను చెప్పుకొనలేదు. కాపయనాయకుని గణపవరము శాసనమువలన[17]గాని, ప్రోలవరపు శాసనమువలన[18] గాని, పిల్లలమఱ్ఱిశాసనమువలన[19] గాని, అతనికి గోదావరీ కళింగమధ్యభాగముపై అధికారమున్నట్లు కనపడదు. కాపయనాయకునికి గల ఆంధ్రదేశాధీశ్వర, ఆంధ్రసురత్రాణ, బిరుదములు అతని నాయకత్వమున కాకతీయుల ముఖ్యసేనానులందరు కలసి మహమ్మదీయుల సరికట్ట ప్రయత్నించిరనుటకన్న ఎక్కువ అర్థమునుస్ఫురింపజేయజాలవు. ఏలయన మహమ్మదు బీన్ తుగ్లక్ కాలమున తిరుగుబాటు చేసెనని మహమ్మదీయచరిత్రకారులు వ్రాసిన 'కృష్ణనాయక' కన్యానాయకుడే ఈఆంధ్రసురత్రాణ కాపయనాయకుడైన అతని తిరుగుబాటుక్రీ॥శ॥ 1336 కి పూర్వము కాజాలదు.[20] క్రీ॥శ॥1337లోని కొప్పుల నామయనాయకుని దోనేపూడి శాసనము గాని క్రీ॥శ॥ 1360 నాటి కొప్పులకాపయనాయకుని శాసనముగాని వీరు తెలిం

17. *S. I. I.* IV No. 950.
18. *J. B. O. R. S.* XX. P. 260.
19. Telingana Inscriptions P. 163.
20. Indian Culture Vol. V. P. 135. ff.

గానాపాలకుడగు కాపయనాయకునికి సామంతులని తెల్పుటలేదు. అందుచే మనకు దోనే పూడి శాసనదాత కొప్పులనామయనాయకుడు ప్రథమమున కొప్పులవంశములో స్వతంత్రరాజ్యమును గోదావరీ కళింగ మధ్యభాగమున స్థాపించి పిఠాపురము రాజధానిగా పాలించెనని తెలియుచున్నది.

కొప్పులవంశపు చరిత్ర తెలుపు మూడవ శాసనము ప్రోలక్ష్మోణిపతి సింహాచల శాసనము.[21] దీని ననుసరించి ప్రోలయతండ్రి కొప్పులనామయ యనియు, తాత ప్రోలయ నాయకుడనియు, ముత్తాత కృష్ణాగౌతమ వాహినీ పరివృతంబైన కుద్రావాటీశ్వరుడగు కాపయ యనియు తెలియుచున్నది. ఈశాసనము లోని చివరభాగము కొంత పోయినది. ఉన్నదాని ననుసరించి మనము చివరశాసనదాత భార్యపేరు చెప్పబడినట్లు తెలుసుకొను చున్నాము.

"మధు ద్విషః శ్రీరివ మానినీ యా మహేశ్వర
స్యాజని.....................గుణైస్తైః।

ఇది కాకశాసనము యొక్క కాలము దెలుపు భాగములో "విభవ శరదిశాకే ఖేందు..........." అని యుండి మిగిలిన భాగము పోయినది. దీని ననుసరించి శాసనకాలము యొక్క శక సంవత్సరము మొదటి రెండంకెలు పోయినవి. ఆఖరి రెండంకెలు 10 అని తెలియుచున్నది. ఇది దక్షిణ హిందూదేశశాసనసంపుటి ఆరవ వాల్యూములో 822వ నెంబరు శాసనముగా ప్రచురింపబడినది. 823 వనెంబరు గలిగి పైశాసనము వ్రాయబడిన చోటనే వ్రాయబడిన యింకొక శాసనము ననుసరించి, శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మ గారు వ్రాసినట్లు, పైశాసనములో పోయిన భాగములు పూర్తి చేయవచ్చును. ఈ శాసనము శక 1310 కార్తీక కృష్ణ సప్తమీ గురువారమునాడు కొప్పులయ్యంగారి దేవులు ముప్పమాదేవిచే యివ్వబడినది.

పైరెండు శాసనములు ఒకేస్థలమున చెక్కబడియుండుటచేతను, రెండిటియందును దానమివ్వబడిన గ్రామమందలాపల్లి యగుటచేతను ప్రోలక్ష్మోణిపతి శాసనమున శరదృతువనియు, ముప్పమాదేవిశాసనమున కార్తికమాసమని యుండుటచేతను రెండుశాసనములు ఒకేకాలమున ప్రోలక్ష్మోణిపతి యతని భార్య ముప్పమ కలసి వేసిన శాసనములని యూహింపవలసియున్నది. ఇంతియేకాక శాసనకాలము మొదటిదానియందు శక సంవత్సరపు ఆఖరి

21. S. I. I. Vol. V No. 822.

రెండంకెలు 10 అగుటచేతను, ముప్పమాదేవిశాసనము శక 1310 అగుటచేతను పోలిక్షోణిపతి శాసనములోపోయిన అంకెలు 13 అనియు, శాసనకాలము శక 1310 అనియు గ్రహించుచున్నాము. శాసనమునం దివ్వబడిన విభవ సంవత్సరముకూడ సరిపడుచున్నది.

మనకు దోనేపూడి, సింహాచలశాసనముల ననుసరించి యీక్రింది వంశవృక్షములు లభించుచున్నవి.

| దోనేపూడిశాసనము. | సింహాచలశాసనము. |
| --- | --- |
| (Ep. Ind. IV p. 356) | (S. I. I. VI No. 822) |
| కొప్పుల కాపయ | కొప్పుల కాపయ |
| \| | \| |
| పోలయభార్య చోడమాంబ | పోలయ |
| \| | \| |
| నామయనాయకుడు శక 1259 | నామయనాయక |
| | పోలయ శక 1310 |

సింహాచలశాసనదాత తండ్రిపేరు, దోనేపూడి శాసనదాతపేరు ఒకటే యగుటచేతను రెండిటియందును నామయనాయకులతండ్రితాతలపేర్లు రెండిటియందును ఒకటేయగుటచేతను రెండుశాసనములందలి పేర్లును ఒకరివేయని భావము ప్రథమమున పొడమకపోదు. కాని యీక్రింది కారణములవల్ల రెండు శాసనములలో నివ్వబడిన పేర్లు ఒకరివి కావని స్పష్టముగా తెలిసికొనవచ్చును.

పైరెండు శాసనములు తండ్రికొడుకులవని యూహించినచో శక 1282 లో సింహాచలములో దానముచేసిన కాపయనాయకునికి[22] కొప్పులవంశములో సరియైన స్థానముగు పడదు. వారి రాజ్యవత్సరములు సరిపడవు దోనేపూడి శాసనములోని కొప్పులకాపయ, పగమెచ్చుగండ, ప్రత్యర్థిగర్వనిర్వాపణ బిరుదాంకితుడు మాత్రమే సింహాచలశాసనమందలి కాపయనాయకుడు కృష్ణాగౌతమవాహినీపరివృతంబైన రాజ్యాధిపతి.

అందుచే సింహాచలశాసనములోని కాపయదోనేపూడి శాసనదాతయగు నామయనాయకునికుమారు డనక తప్పదు. అప్పుడు శక 1282, శక 1291 లో[23] శాసనము లిచ్చిన కాపయ నామయనాయకులకు కొప్పులవంశములో సరియైనస్థానము కలుగుచున్నది. అప్పుడు కొప్పులవంశ మీక్రింది విధముగా నిర్ణయింపబడుచున్నది.

---

22 *S. I. I.* VI. No. 821

23. *S. I. I.* VI. 924.

# కొప్పుల వంశవృక్షము

కొప్పమారెడ్డి

|

నారెబోయడు=భార్య కొమ్మసాని

S. I. I. IV. No. 765

| | | | | | |
|---|---|---|---|---|---|
| కొల్నువు పాటి ఎఱ పోతినాయడు | డొంక్కెన మార్కేడు | పగమెచ్చుగండ కొంప్పుల ప్రోలినయుండు | ముప్పసాని | దొడ్డదేవర | నగన బోయుండు |

Circa 1230-1265 A. D. (శాసనదాత: శ. 1186)

|

,, 1265-1285 A. D. కొప్పుల కాపయ

|

Ep. Ind. IV, p356

,, 1285-1305 A. D. ప్రోలయనాయకుడు భార్య చోడమాంబ

|

,, 1305-1338 A. D. నామయనాయకుడు (గోదావరీకళింగమధ్యభాగము పాలించెను.) (శాసనదాత శ. 1259)

|

1338-1360 A. D. కొప్పుల కాపయనాయకుడు (కృష్ణా గోదావరీ మధ్యభాగము పాలించెను.)
(*S.I.I.*, VI, 821, Ś. S. 1282)

|

1361-1368 A. D. ప్రోలయనాయక

S. I. I. VI, No. 822

|

1368-1378 A. D. కొప్పులనామయనాయకుడు
(*S.I.I.*, VI, 924. Ś. S. 1291)

|

1378-1388 A. D. ప్రోలయ నాయకుడు భార్య = ముప్పమదేవి
(*S.I.I.*, VI 823) (శాసనదాత శక. 1310)

# II

## రాజకీయపరిస్థితులు.

కొప్పులవంశవృక్షము నిర్ణయించుసందర్భమున వీరెట్లు ప్రథమమున కాకతి గణపతి ప్రధానులలో ముఖ్యుడగు సోమమంత్రి నాశ్రయించి, ఆతని మెప్పువడసి రాజ్యము సంపాదించిరో చర్చించియున్నాము. పగమెచ్చుగండ కొప్పుల ప్రోలయయు, ఆతని కుమారుడు పగమెచ్చుగండ ప్రత్యర్థిగర్వనిర్వాపణ[23-a] కొప్పులకాపయయు, అతని కుమారుడు ప్రోలయయు, కళింగము జయించుటకు కాకతీయగణపతి, రుద్రాంబ, ప్రతాపరుద్రుల కాలమున పంపబడిన సేనానులకు సహాయముచేసి గోదావరీ కళింగ మధ్యభాగమును కాకతీయసామంతులుగా పాలించియుందురు.

ప్రోలయనాయకుని కుమారుడు నామయనాయకుని కాలమునాటికి వీరు స్వ ముగా రాజ్యపాలన చేయుచున్నట్లు నామయనాయకుని దోనేపూడి శాసనమువలన మనకు తెలియుచున్నది. ప్రతాపరుద్రుని మరణానంతర మిది జరిగినదని మన మిదివరకు చర్చించియున్నాము. నామయనాయకుని దోనేపూడి[24] శాసనము శక 1259 నాటిదగుటచేతను, పగమెచ్చుగండ ప్రోలయనాయకుని బెజవాడ శాసనము[25] శక 1186 నాటిదగుటచేతను, పగమెచ్చుగండ కొంప్పుల ప్రోలయయు, ఆతని కుమారుడు కాపయయు, ఆతని కుమారుడు ప్రోలయయు, వానికుమారుడు నామయయు కలసి పదమూడవ శతాబ్ద మధ్యమునుండి క్రీ॥ శ॥ 1338 వరకు పాలించియుందురు.

### కొప్పుల కాపయ

### (Circa 1338—1360 A. D.)

క్రీ॥ శ॥ 1326 ప్రాంతముల కాకతీయ సామ్రాజ్యము విచ్ఛిన్నమగుటచే తెలింగాన ప్రాంత మంతయు మునునూరి ప్రోలయనాయకుడును,[26] కృష్ణానదికి దక్షిణపార్శ్వమందున్న

23-a బెజవాడ శాసనదాత ప్రోలయకు పగమెచ్చుగండ బిరుద ముండుటచేతను, దోనేపూడి శాసనదాత నామయనాయకునకు పగమెచ్చుగండ ప్రత్యర్థి గర్వనిర్వాపణబిరుదములుండుటచేతను, ప్రోలయనుండి నామయవరకు యీబిరుదావళులు వంశపారంపర్యముగ వచ్చినవై యుండునని నాయూహ.

24. Ep. Ind. IV p. 356.
25. S. I. I. IV No. 765.
26. J. B. O. R. S. XX p. 260.

కొండవీడు, వినుకొండ రాజ్యముల నాక్రమించుకొని అద్దంకి రాజధానిగా ప్రోలయవేమా రెడ్డియు,[27] ఏకశిలానగరమునకు దక్షిణభాగముపై శ్రీశైలనగరమువరకును రాచకొండ, దేవరకొండ రాజధానులుగా రేచెర్ల సింగమనాయుడును,[28] గండికోట, పెనుగొండ, మొదలగు రాజ్యముల హరిహర, బుక్కరాయ సోదరులును[29] స్వతంత్ర రాజ్యముల స్థాపించుకొన్న సమయమున కొప్పులనామయనాయకుడు కూడ స్వతంత్రరాజ్యమును స్థాపించెను. క్రీ॥ శ॥ 1323 ప్రాంతముల కాకతీయరాజ్యముపై దండెత్తి వశపరచుకొని, రాజమహేంద్రవర ప్రాంతమంతయు వశపరచుకొనిన తుగ్లకువంశీయుడగు జునాఖాను రాజమహేంద్రవరప్రాంతము పాలించుట కొకపాలకుని నియమించి యచటి దేవాలయమును మరియు సాలార్ ఉల్వీ అనువానిచే మసీదుగా మార్పించెను.[30] ఈపాలకుని కొప్పుల కాపయనాయకు డోడించి గోదావరీ కళింగ మధ్యభాగమును వశపరచుకొని పిఠాపురము రాజధానిగా పాలించదొడగెను.

దోనేపూడిశాసన మిచ్చిన సంవత్సరమే అతని రాజ్యసంవత్సరములలో నాఖరుదిగను ఆసంవత్సరప్రాంతముననే అతనికుమారుడు కాపయనాయకుడు రాజ్యమునకు వచ్చి రేచెర్ల సింగమనాయనితో పోరి ఓడినట్లును ఈక్రిందివిషయమునుబట్టి తెలుసుకొనవచ్చును.

వెలమనాయకుడగు లింగమనాయుడు అనపోతారెడ్డిని చంపి యతని కటారిని గొని వచ్చినప్పుడు, అనపోతారెడ్డి కుమారులు తమ తండ్రి కటారిని తిరిగి తీసుకొనివచ్చుటకు శ్రీనాథుని బంపిరనియు, అతనిచే లింగమనాయనిపై చెప్పబడిన పద్యములలోని దను[31] ఈ క్రిందిపద్యము ననుసరించి మనకు కొన్ని నూతనవిషయములు తెలియుచున్నవి.

ధాత్రి నీ ముత్తాత తాతెట్టిదాచాఖ్యుఁ
డెలమితోఁ బాంద్యుల దళము గెల్చెఁ
జెలగి తాతకుఁ దాత సింగక్షితీశుండు
కాపభూపతి గెల్చెఁ గదనమునను

27. ఆంధ్రులచరిత్రము మూడవభాగము పేజి 5.
28. Ibid P. 6.
29. Ibid P. 6.
30. Sewell: Lists of Antiquities Vol. I. P 22.
31. సురభివారి వంశచరిత్ర పుట 58.

దట్టించి మీతాత తండ్రి మాధవన్నపుం
డన్నపోతారెడ్డి నాజిఁ దునిమె
విజయియై మీతాత వేదగిరీంద్రుండు
దిక్కులఁ దనయాజ్ఞ దీటుకొలిపె
మెఱసి లోకమెఱుఁగ మీతండ్రి మాధవ
క్ష్మావరుండు గెల్చె గన్నడీలఁ
దొడరి చెలమచెర్లదుర్గంబు గొంటివి
ధరణిలోన లింగనరవరేణ్య.

ఈపద్యమున లింగమనాయని తాతకు తాత సింగక్షితీశుకు జయించిన కాప భూపతి యెవరో మనము నిశ్చయించవలసియున్నది. ఈ సింగభూపతి ఏకశిలానగరము నకును శ్రీశైలమునకు మధ్య గల భూభాగమును పాలించిన రేచెర్ల సింగమనాయడు. ఈతడు కాకతి ప్రతాపరుద్రుని చివరరోజులలోనుండి క్రీ॥శ॥ 1344 వరకు రాజ్య మేలె ననియు, యితని కుమారుడు అనపోతానాయడు క్రీ॥శ॥ 1344 నుండి 1380 వరకు రాజ్య మేలెననియు చరిత్రచతురానన చిలుకూరి వీరభద్రరావుగారు నిశ్చయించియున్నారు.[32] ఇక యీ సింగభూపతి కదనమునగెల్చిన కాపభూపతి యెవరో నిశ్చయించవలసియున్నది.

కొప్పుల నామయనాయకుని కుమారుడును క్రీ॥శ॥ 1338 మొదలు 1360 వరకు కృష్ణా గోదావరీ మధ్యభాగము నేలెననియు సింహాచల శాసనము[33]న చెప్పబడిన కొప్పుల కాపయనాయకు డొకడు. ఆంధ్రసురత్రాణ ఆంధ్రదేశాధీశ్వర అఱుమనంగంటి పుర వరాధీశ్వర బిరుదాంకితుడును తెలింగానాప్రాంతము నంతయు పాలించిన కాపయనాయకు డొకడు. ఈతని శాసనముల ననుసరించి క్రీ॥శ॥ 1345 నుండి 1357 వరకును పాలించినట్లు తెలియుచున్నను, యితడు క్రీ॥శ॥ 1336 ప్రాంతములకు తెలింగాన మంతయు మహమ్మ దీయుల పాలననుండి లాగికొనినట్లు నిశ్చయింపబడుటచే[34] యీనిర్ణయము సరియైనయెడల యితడును రేచెర్ల సింగమనాయకునికి సమకాలికుడగుచున్నాడు. అందుచే రేచెర్ల సింగమ

---

32 ఆంధ్రుల చరిత్ర: మూడవభాగము పుట 20.

33. *S. I. I.* VI No. 822.

34. Indian Culture Vol. V p. 135 ff.

నాయ డోడించినవాడు తెలింగానమును పాలించిన కాపయనాయకుడో, కృష్ణా, గోదావరీ మధ్యభాగము నేలిన కాపయనాయకుడో తెలుసుకొనవలసియున్నది.

తెలింగానా పాలించిన కాపయనాయకుని మొదటి శాసనము[35] క్రీ॥శ॥ 1345 నాటి దగుటచేతను, ఆనాటి కప్పుడే శ్రీ వీరభద్రరావుగారి పరిగణనము ప్రకారము[36] రేచెర్ల సింగమనాయడు మరణించి అతని కుమారు డనపోతానాయడు రాజ్యాభిషిక్తుడగుటచేతను, రేచెర్ల సింగమనాయడోడించినవాడు కాపభూపతి యని యుండుటచేతను, సింగమనాయునిచే ఓడింపబడినవాడు కొప్పుల కాపయ కాని తెలింగానము పాలించినవాడు కాడేమో యని సందియము పొడముచున్నది. తెలింగానము రక్షించుటకును, మహమ్మదీయ సేనానుల దరుముటకును సకల ప్రయత్నములుచేయుచున్న అఱుమనంగంటి పురవరాధీశ్వర కాపయ నాయకుడు యితర నాయకులతో స్నేహముచేయ నుత్సహించునే కాని రేచెర్లసింగమ నాయనితో విరోధము తెచ్చుకొనుటకు ప్రయత్నించడు. ఇంతియే గాక సింహాచల శాసనమున[37] కొప్పుల కాపయ 'కృష్ణాగౌతమ వాహినీ పరివృతంబైన' భూభాగమున కధి పతియని వర్ణింపబడినాడు. ఇతని తండ్రి నామయనాయకుని ఆఖరి శాసనము[38] శక. 1259 నాటిదగుటచేతను ఇతని సింహాచలశాసనము[39] శక. 1282 నాటిది మనకు లభించుటచేతను, ఇతని రాజ్యకాలము క్రీ. శ. 1338 నుంచి 1360 వరకు వ్యాపించెనని చెప్పవచ్చును. ఇతడు రాజ్యమునకు వచ్చిన మొదటి నాల్గయిదు సంవత్సరములలో తన తండ్రి నామయ నాయకుడు సంపాదించిన గోదావరీకళింగమధ్యభాగమగు రాజ్యమును వ్యాపింపజేయు నుద్దేశముతోడను, ఆనాటి దేశములోగల అరాజకము తన కనువుగా నుండుటచేతను, దక్షిణదిగ్విజయయాత్రకు బయలుదేరి కృష్ణానదివరకు గల భూభాగమును జయించి యుండును. ఈదండయాత్రాసందర్భముననే రేచెర్ల సింగమనాయనితో కృష్ణానదీప్రాంత ముల నెచ్చోటనో యుద్ధము తటస్థించుటయు, కొప్పుల కాపయ ఓడుటయు సంభవించి యుండును.

35. *J.* B. O R. S. XX p. 260.
36. ఆంధ్రులచరిత్ర మూడవ భాగము పే. 20,
37. S. *I. I.* VI. No. 822.
38. Ep. Ind. IV p. 356.
39. S, *I. I.* VI No. 821.

కాపయనాయకుడు సంపాదించిన రాజ్యము చాలకాలము కొప్పులవారి పాలన క్రింద నున్నట్లు కనపడదు. ఏలయన క్రీ. శ. 1340–1360 మధ్య ఆంధ్రదేశస్థితి పూర్తిగా మారిపోయెను. ఒకవైపున తెలింగాన మంతయు క్రీ. శ 1345-1357 మధ్య వశపరచుకొని,[40] చెంగర, కురవాట, కోన, వానార రాష్ట్రముల కధిపతియైన మంచికొండ ముమ్మడి నాయకునకు తన సోదరి కూతురు నిచ్చి వివాహముచేసి,[41] అతనికి కోరుకొండ రాజ్యము సంపాదించుకొనుటకు సహాయము చేసిన, అనుమనంగంటి పురవరాధీశ్వరుడు తనరాజ్యమును విస్తరించుటకు ప్రయత్నించుచుండెను. మరొకవైపునుండి కొండవీటి రాజగు వేమారెడ్డి సుప్రసిద్ధ సేనానులును, తన కాత్మబంధువులును యగు అన్నారెడ్డి, మల్లారెడ్డి, అన పోతారెడ్ల సహాయముతో "బహ్మకుండి, కృష్ణవేణ్ణా, గోదావరీ మహానది తటద్వయ" మధ్య దేశమంతయు జయించుటకు విపులప్రయత్న మొనరించు చుండెను.[42] వేమారెడ్డి అమరావతీశాసనములో[43] "మాద్యన్మన్నెనృపాలతూలపవన" అని వర్ణింపబడుటచే యీతడు కళింగప్రాంతములకు దండయాత్రకు వచ్చె నని కూడ యూహించ వచ్చును. వేరొకవైపున నేటి పశ్చిమ గోదావరిజిల్లాలోని తణుకు, భీమవరము తాలూకా లనగా లంకసీమలో కొంత భాగమును, ఝల్లిసీమను పాలించు ఉండ్రాజుల[44] తో సంబంధబాంధవ్యములు నెరపి మన్నెము, కాసరనాడు, వేంగినాడు, మలయము, భీమవ్రోలిసీమల రాజ్యపాలనచేసిన చోడవంశీయులగు భక్తిరాజు[45] అతని కుమారుడు అన్నదేవుడు రాజ్య విస్తీర్ణముకై ప్రయత్నించుచుండిరి. వీరందరు ఒకరితోనొకరు పోరాడుచు, మహమ్మదీయుల పారదోలి ఆంధ్ర దేశమున సామ్రాజ్య ప్రయత్నమునకై పోరాడుచుండిరి.

అందుచే కొప్పుల కాపయనాయకుడు 'కృష్ణాగౌతమవాహినీ పరివృతంబైన' రాజ్య మేలెనని ప్రోలయనాయకుని సింహాచల శాసనమున చెప్పబడినది నిజమైనను అది కొలది కాలముమాత్రమే యుండెననియు, అతని చివరరోజులనాటికి గోదావరివరకుగల రాజ్యము

---

40 *S.I.I.*, IV, No. 950; *J.B.O.R.S.* XX, 260; Telingana Inscriptions, p. 163.
41 *Ep. Ind.*, XIII, p. 259 ff.
42. ఆంధ్రుల చరిత్ర. మూడవభాగము పే. 146.
43. Ibid p. 147.
44. Ibid p. 190.
45. Bharati పత్రికోత్పత్తి. ఆషాడమాసము. Also Local Records. Vol. II p. 210.

నితరు లాక్రమించియుండురనియు పైనవర్ణింపబడిన పరిస్థితులమూలమున తెలిసికొన వచ్చును.

కొప్పులకాపయనాయకుని ఆఖరిశాసనము క్రీ॥ శ॥ 1360 నాటి దగుటచేతను[45-a], అతని మనుమడు నామయనాయకుని శాసన మొకటి క్రీ॥ శ॥ 1369[46] నాటి దగుటచేతను, కొప్పులకాపయనాయకుని కుమారుడు ప్రోలయనాయకుడు క్రీ॥ శ॥ 1361 మొదలు 1368 వరకు పాలించెననియు, అతని కుమారుడు నామయనాయకుడు క్రీ॥శ॥ 1369 నుండి ఇంచు మించు 1378 వరకు పాలించెనని యూహించవలసి యున్నది.

కాపయనాయకుని చివర రోజులలోనో, ప్రోలయనాయకుని కాలముననో, కొప్పుల వంశీయులసహాయముతో చోడభక్తిరాజు గజపతిని ఓడించినట్లు భక్తిరాజు కుమారు డగు అన్నదేవచోడునిశాసనము[47] వలన మనకు తెలియుచున్నది.

"ప్రాచ్యాంచ కొప్పులపతి ర్దిశియేన పంచధారాంగణే గజపతిం జయతాభ్యషేచి" యని పైశాసనమున చెప్పబడినది. ఇంతియేకాక భక్తిరాజు గులపూండివద్ద బొగ్గరాది యవననాయకులను, ధరణిపాడువద్ద సింగభూపతిని, పేడకొండవద్ద దిబారుఖానుని, సూర వరమువద్ద వీరాన్నపోతనృపతిని జయించినట్లు చెప్పబడియున్నది.[47].

ఈ కొప్పులపతి యెవరో గజపతి ఎవరో మన మిప్పుడు నిశ్చయించ వలసియున్నది. చోడభక్తిరాజు శాసనమొకటి శక 1277 నాటిది[48] మనకు లభించుటచేతను, అతని కుమారుడగు అన్నదేవుని మొదటి శాసనము శక 1289[49] నాటిదొకటి మనకగపడు

---

45-a *S. I. I.* VI 821.

46 *S. I. I.* VI 924.

47 *J. A. H. R. S.* Vol. I. P. 183.

48 భారతి, ప్రజోత్పత్తి, ఆషాఢ.

49 అన్నదేవుని యీశాసనము లోకల్ రికార్డ్సు రెండవ వాల్యూములో 210 వ పుటలో కాపీచేయ బడినది. అందు ఈశాసన సంవత్సరము శక 1259 పరాభవ సంవత్సరమని వ్రాయబడినది. శక 1259 ధాత ఈశ్వర సంవత్సరములగును కాని పరాభవ సంవత్సరము కాజాలదు. పరాభవ సంవత్సరము శక 1289 లో వచ్చినది. అందుచే శాసనమున నీయ్యబడిన శక 1259 శక 1289 గా దిద్దుకొనవలసియున్నది. శక 1259 అయినచో అన్నదేవునికాలము తండ్రి భక్తిరాజు కాలముకన్న ముందగుచున్నది. అందుచే యీ శాసనకాలము శక 1289 కాని 1259 కాజాలదు.

చుండుటచేతను భక్తిరాజు క్రీ॥శ॥ 1355 నుంచి 1367 మధ్యనున్నవాడని తెలియుచున్నది. ఈకాలమున కళింగమును పాలించిన రాజు మూడవ భానుదేవుడు. ఇతడు క్రీ॥ శ॥ 1352-78 వరకు కళింగమును పాలించెను. ఇతని కాలమున 'ఒరిస్సాదేశము బెంగాలు నవాబగు షామ్సుద్దీన్ ఇలియాస్‌చేతను, విజయనగరాధీశుడగు బుక్కరాయలచేతను, ఢిల్లీ చక్రవర్తి సుల్తాను ఫిరోజ్‌షాచేతను,' ముట్టడింపబడి చాల క్లిష్టపరిస్థితులకు లోనయ్యెను.[50] ఈ క్లిష్టపరిస్థితుల నవకాశము చేసికొని కాపయ నాయకుడు గజపతి రాజ్యములపై దండెత్తుటచేతనో, విజయనగరాధీశుడగు బుక్కరాయల దండయాత్రాసందర్భమున కొప్పులవంశీయు లతనికి సహాయముచేసిరను కోపముచేతనో క్రీ. శ. 1355-1367 మధ్య భానుదేవుడు, నేటి సర్వసిద్ధితాలూకాలోని దగు పంచధార్లవరకు దండెత్తివచ్చెను. ఈ దండయాత్ర కొప్పుల కాపయ మరణానంతర మయియుండును. గజపతి నెదుర్కొన తనకు సహాయముచేయుటకు కొప్పుల ప్రోలయ చోడభక్తిరాజుసహాయ మపేక్షించుటచే ఇరువురును కలసి భానుదేవు నోడించి సింహాచలపర్యంతభూములను తిరిగి గజపతివద్దనుండి తీసికొనినట్లు ప్రోలయనాయకుని మనుమడగు ప్రోలయనాయకుని శాసనమువలనను,[52] అన్నదేవుని శాసనమువలనను తెలియుచున్నది. ఈవిజయమునే వర్ణించుచు అన్నదేవుడు తన తండ్రి ప్రాగ్దిశను పంచధారయుద్ధమున గజపతి నోడించి కొప్పులపతిని సింహాసన మెక్కించెనని చెప్పుకొనెను.

క్రీ. శ. 1368 - 1378 వరకు పాలించిన నామయనాయకునిగూర్చి మన కేమియు తెలియుట లేదు. ఇతని శాసన మొకటి[51] శక 1291 నాటిది మనకు లభించుటచేతను, ఇతని కుమారుని శాసనము శక 1310 నాటిది యీవంశపు ఆఖరిశాసనముగా ఈక్రింద వర్ణింపబడిన పరిస్థితులవలన కనబడుటచేతను, నామయనాయకుడు క్రీ. శ. 1368 మొదలు 1378 వరకును, ప్రోలయ క్రీ॥ శ॥ 1378 నుంచి 1388 వరకును పాలించిరని తెలియుచున్నది.

కొప్పులప్రోలయయు అతనిభార్య ముప్పమయొక్కయు శక 1310 నాటి శాసనములు రెండు మనకు లభించుచున్నవి.[52] వీటిననుసరించి మనకు ప్రోలయయు, అతనిభార్య

50. కళింగదేశచరిత్ర పే. 684. (ఆంధ్రేతిహాస పరిశోధక మండలివారి ప్రచురణము.)

51 *S.I.I.*, VI, No. 924.

52 *S. I. I.* VI Nos. 822 and 823.

ముప్పమయు సర్వసిద్ధి తాలూకాలోని అందలాపల్లి గ్రామము సింహాద్రినాథునికి సమర్పించినట్లు తెలియుచున్నది. దీనినిబట్టి చూడ శాసనదాతతాత ప్రోలయనాయకుడు గజపతిని జయించి వశపరచుకొన్న రాజ్యమంతయు శక 1310 వరకు కొప్పులవంశీయులపాలనలోనే యుండినట్లు తెలియుచున్నది. లేనియెడల పంచధార్లసమీపమున నున్న అందలాపల్లిని ప్రోలయ సింహాచలనాథుని కిచ్చుట సంభవింపదు.

కొప్పులవంశీయులలో ఆఖరివారగు ప్రోలయనాయక నామయనాయక ప్రోలయ నాయకులకాల మంతయు యుద్ధములతో సరిపోయినది. ఏలయన ఉత్తరమున భక్తిరాజు సహాయముతో ప్రోలయనాయకుడు గజపతిని జయించి కళింగమువరకుగల తన రాజ్యమును నిలుపుకొనుసరికి దక్షిణమునుండి కొండవీటిరాజుల దండయాత్రలారంభ మాయెను. వారిలో బ్రథముఁడును కొండవీటి సామ్రాజ్యస్థాపకుఁడునగు ప్రోలయవేముని కాలమునుండియు వీరు గోదావరీపర్యంతభూముల నాక్రమించుకొనుటకు విపుల ప్రయత్నములు సలుపుచుండిరి. ప్రోలయవేమునికి గల 'బ్రహ్మకుండీకృష్ణవేణ్ణా గోదావరీ మహానదీ తటద్వయ తన్మధ్యదేశదత్తానేకాగ్రహార'52a 'కళింగరాయమానమదమర్దన, మన్నియ రాయమృగవెంటకార, వొడ్డియరాయ నిర్ధూమధామ'52b మొదలగు బిరుదములు గోదావరీపర్యంతభూముల నాక్రమించియుండునని సూచించుచున్నవి. ప్రోలయవేముని కుమారుడగు అనపోతారెడ్డి క్రీ॥ శ॥ 1356 లో ద్రాక్షారామభీమేశ్వరున కిచ్చిన దానము ఆసంవత్సరమువరకు గోదావరీపర్యంతభూములన్నియు కొండవీటిరాజులపాలనలోనే యున్నట్లూహించవచ్చును. కాని ఆసంవత్సరప్రాంతములనే చోడభక్తిరాజు అనపోతారెడ్డి నోడించి యుండును.52c అనపోతారెడ్డితమ్ముఁడు అనవేమునికాలమున తిరిగి రాజమహేంద్రవరమువరకును జయించిన ట్లాతనిశాసనమువలన తెలియుచున్నది.52d అనవేముని తరువాత రాజ్యమునకు వచ్చినవాడు కుమారగిరి. ఇతనికాలమున ఇతని సుప్రసిద్ధసేనానాయకుడును, భావమరదియు యగు కాటయవేమారెడ్డి సింహాద్రిపర్యంతభూముల జయించుటకు శక 1307 మొదలు దండయాత్రలు చేయుచున్న ట్లాతనిశాసనములవలన తెలియుచున్నది. ఇతనిది శక 1307 నాటిదొక శాసనము పాలకొల్లులోను,53 శక 1308 నాటిదొకటి

52a. *S. I. I.* VI. No. 243.
52b. *Ep. Ind.* XXI. 272.
52c. *J. A. H. R. S.* I. P. 183. line 26.
52d. *M. E. R.* 20 of 1915.
53. *S. I. I.* V No. 155.

సింహాచలములోను,[54] శక 1310 నాటిదొకటి సర్పవరము[55]లోను లభించుచున్నవి. వీటి ననుసరించి ప్రోలయనాయకుని శక 1307-1308 మధ్య కాటయవేము జోడించియుండును. కాని శక 1310నాటి ప్రోలయనాయకునియొక్కయు అతనిభార్య ముప్పమాదేవులయొక్కయు సింహాచల శాసనములలో తాము కొండవీటివారి సామంతులమని చెప్పుకొనకుండుటచే, శక 1308 - 1310 మధ్య తిరిగి స్వతంత్రుడయ్యెనని యూహింపవలసియున్నది. శక 1310 నాటికి ప్రోలయ పూర్తిగా స్వతంత్రించుటచేతనే కాటయవేముడు తిరిగి శక 1310 లో బయలుదేరి గోదావరి కళింగ మధ్యభాగముల జయించుటకు బయలుదేరవలసివచ్చి యుండును. కుమారగిరి అనవర్తిశాసనము[56] ననుసరించి శక 1312 నాటికి సింహాచల పర్యంతభూములను కుమారగిరి కుమారుడగు అనపోతనాయనిపేర రాజమహేంద్రవరము నుండి కాటయవేముడు పరిపాలించుచున్నట్లు తెలియుచున్నది. శక 1318 లో పిఠాపురములో కాటయవేముడు కుంతీమాధవస్వామి ఆలయమునకు ప్రాకారము నిర్మించెను.[57]

అందుచే ప్రోలయనాయకుని శక 1310 లో కాటయవేముడు పూర్తిగా నోడించుటయు, కొప్పులవంశము నశించుటయు, గోదావరీకళింగమధ్యభాగమును కుమారగిరి ప్రతినిధిగా రాజమహేంద్రవరమునుండి పాలించుటయు తటస్థించినవి.

ఈవిధముగా నించుమించొక శతాబ్దపుకాలము గోదావరీ కళింగ మధ్యభాగము పాలించి మహమ్మదీయుల దండయాత్రలనుండియు, గజపతుల దండయాత్రలనుండియు ఆంధ్రదేశమును రక్షించి కాపాడినదీ కొప్పులవంశము.

కాటయవేముని దండయాత్ర తరువాత వీరు నేటి కొట్టాము ప్రాంతముల రెడ్లసామంతులై కాలము గడిపియుందురు. శక 1526 నాటి శాసనమొకటి "ఖులీపాదుషాగారి పంపున ఆశ్వారాయనింగారు కొప్పులవారి కొఠామును" సాధించెనని తెలుపుచున్నది.[58] దీని ననుసరించి చాలకాలమువరకు కొప్పులవంశీయులపేరు కొట్టాము ప్రాంతములనుండి, ఆభాగము కొప్పులవారి కొఠామని వ్యవహరింపబడియుండును.

---

54. *S. I. I.* VI No. 781.
55. *S. I. I.* V No. 7.
56. *J. A. H. R. S.* Vol. XI p. 191.
57. Ep. Ind. IVp. 328.
58. Local Records Vol 49 p 175· *S. I. I.* V. No. 1260.

# అవచి తిప్పయసెట్టి.

ఆంధ్రుల నౌకావ్యాపారము.

కొమరరాజు వెంకటసుబ్బారావు, బి. ఏ.

ప్రాచీనాంధ్రౌన్నత్యమును జాటు నాగరకచిహ్నములలో దివ్యావసథములు వాణిజ్య వ్యవహారములు మనము విస్మరింపరాని ముఖ్యాంశములై యున్నవి. ఏతద్విషయమై చర్చించునెడ దక్షిణభారతమునకుఁ గాంచీదామమువలె నొప్పారు పంపాతీరమునఁ గాంచీ నగర మొకటిమనకుగోచరించును. అందుగల యేడువాడలలో (1) శివకంచి,(2) విష్ణుకంచి, (3) జైనకంచి ముఖ్యములైనవి. శివకంచిలో నేకామ్రేశ్వరుఁడు, కరిగిరీశ్వరుఁడు, కామాక్షి మున్నగు దైవతములయొక్కయు, విష్ణుకంచిలో శ్రీవరదరాజస్వామియొక్కయు, జైన కంచిలో మహావీరునియొక్కయు దేవాయతనములు గలవు. ఇవి కాక యింకను కొన్ని బుద్ధవిగ్రహములును, జైనవిగ్రహములును జైనకంచిలో శిథిలావస్థయం దున్నవి. ఆయాయి చారిత్రికచిహ్నములను, ప్రాచీనగాథలను విచారించినచోఁ బూర్వము శైవము, వైష్ణవము, జైనము, బౌద్ధము మున్నగు మతశాఖలు స్వీయప్రాభవములను సుప్రతిష్ఠిత ములఁ గావించుకొనుటకుఁ గాంచీక్షేత్రమును యుద్ధభూమిఁ గావించికొని పరస్పరమేయే విధముగాఁ గలహించినవో విశదము గాఁగలదు. ఈనగర మాముష్మికసంపదల నొడఁ గూర్చు పుణ్యక్షేత్రమే కాక, యన్యదేశములతో నాంధ్రులు సలిపిన వాణిజ్యవ్యాపారము లకును ముఖ్యస్థానమై యుండినట్లు మన కనేక చారిత్రికతార్కాణములు లభించుచున్నవి. ఆంధ్రరాజ్యస్థాపకుల కవలంబనములై, యానగరశ్రీమంతులైన వణిక్పుంగవు లెందఱో పూర్వ మానగరమందు నివాసముండిరి. కావేరీవల్లభులును, నుభయరావలులును, గిష్కింధాచలక్రీడావినోదులును, నయోధ్యాపురాధీశ్వరులును నగు నావైశ్యకులమువార లందఱికును దిరుకచ్చినంబి కూటస్థుఁడు.

అంగుళిస్ఫోటనమున నాశ్రమహరిణముల బెదరించినకతమున, దుర్వాసమహా మునిచే శపింపఁబడిన తుంబురుఁడను గంధర్వునియంశమున నుద్భవించి, వీరశైవవ్రతస్థుఁడై పట్టినవ్రతము సెల్లకుండినఁ దిరుబానగా వర్తిల్లి, మాయామహాయోగియై తన్నుఁ బరీ క్షింప నేతెంచిన మహేశ్వరునకుఁ బుత్రమోహము వాటింపక కన్నకొడుకును గూరగ వండిపెట్టి యాతని మెప్పించి, యాతనియనుగ్రహమునఁ దన బంధువులైన కంచి యేడు

వాడలవైశ్యకులమువారలకును, సకల జీవరాసులకును, జీవన్ముక్తి సమార్జించిన మహాత్ముఁడు చిఱుతొండనంబి. ఆతని చరిత్రమే శ్రీనాథవిరచిత హరవిలాసమున మొదటి రెండాశ్వాసములందును వర్ణితమయ్యెను.

## తిప్పయసెట్టి వంశక్రమము.

ఈకాంచీపురవైశ్యవంశములలోఁ బేరెన్నికఁ గాంచి, కొండవీడు రాజధానిగాఁ బాలించిన రెడ్డిరాజులకుఁ బ్రాపై విలసిల్లిన వణిగ్వంశ మవచివారిది. అవచి వంశస్థులు కౌండిన్యసగోత్రులు. వారిలోఁ జరిత్రకుఁ దెలిసిన మూలపురుషుఁ డవచి పావాణిసెట్టి. ఇతఁడు సింహవిక్రమపట్టణశ్రేష్ఠుఁడనియుఁ దన్నగరీశచంద్రశేఖరపదాబ్జవందనానందితాత్ముఁడనియు వర్ణింపఁబడినాఁడు. నేఁడు నెల్లూర వేంచేసియున్న శ్రీమూలస్థానేశ్వరుఁడే నాఁటి చంద్రశేఖరస్వామి కానగును. పావాణిసెట్టి సుతుఁడు దేవయసెట్టి. వివేకనిరంజనుఁడైన రామనాథయోగీశ్వరునిపాదసేవ సేసియు, రెడ్డిసామ్రాజ్యసంస్థాపకుఁడగు ప్రోలయ వేమారెడ్డికిఁ బ్రాలంబనమై యుండియు, వీరమాహేశ్వరవ్రతనిష్ఠాపరుఁడై జీవనము గడపియు, దేవయసెట్టి విశ్వజగత్ప్రసిద్ధి వడసెను. ఆతఁడు శంకరభక్తకోటి కొనర్చెడు మృష్టాన్నదానములఁ జేసి యవచివంశ మప్పటికే సుప్రసిద్ధమగు వైశ్యవంశముగాఁ బేరెన్నికఁ గాంచెను. దేవయసెట్టికి మాచాంబయందుఁ ద్రిపురారి (త్రిపురాంతకుఁడు లేక తిప్పయ్య), తిరుమలనాథుఁడు చామిసెట్టియు నను మువ్వురు తనయు లుద్భవించిరి. అందు జ్యేష్ఠుఁడగు త్రిపురారి లేక తిప్పయసెట్టియే శ్రీనాథవిరచితమగు[1] హరవిలాసప్రబంధమునకుఁ గృతినాయకుఁడు. తిప్పయ పిన్ననాఁట మహాప్రధానియగు పిల్లలమఱ్ఱి పెద్దన్నకు శిష్యుఁడై

---

1 "హరవిలాసము" నాకుఁ దెలిసినంతవరకు నిప్పటికి మువ్వురచేఁ బ్రచురింపఁబడియున్నది. (1) శ్రీ కొచ్చెర్లకోట రామచంద్రకృష్ణరావుగారు (2) శ్రీ వావిళ్ళ వెంకటేశ్వర్లుగారు (3) శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు. దారుకావనవిహారములోని కొంత యశ్లీలభాగము మాత్రము మచిలీపట్టణము శృంగారగ్రంథమాలవారు ప్రచురించినట్లు తెలియుచున్నది. ఆభాగము బ్ర. శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు ప్రకటించిన క్రీడాభిరామ పీఠికయందుఁ బ్రచురింపబడియున్నది, హరవిలాసమునకు మూలతాళపత్రప్రతి యొక్కటే తంజావూరుపుస్తకభాండాగారమునలభించినదని బ్ర.శ్రీ.ప్రభాకరశాస్త్రిగారు నాకు వ్రాసియున్నారు. శ్రీ వడ్డాది అప్పారావుగారు S, No 5—1—35, R. 104 నంబర్లు గల రెండు ప్రతులను ఓరియంటల్ లైబ్రరీలో చూచి పాఠాంతరములను సేకరించి నాకు దయచేసినారు. ఇంకను మూలప్రతులను సంపాదించుటకై ప్రయత్నములు జరుగుచున్నవి. దొరకినచోఁ బాఠాంతరములఁ బ్రకటింపఁగలను.

యాతని గురుత్వమున నక్షరశిక్షయు, దైవమార్గసంపన్నతయు, వివేకపరిపాటియు నభ్యసించెను. తండ్రి నానాద్వీపములతో వర్తకముఁ జేయుచుండఁ దానా యోడలకాధిపత్యము వహించి, స్వయముగ నాయాద్వీపాంతరదేశములకేగి యందందు దొరకు వాణిజ్యోచితవస్తుసామగ్రియు, నౌకాశ్రియములును మున్నగు[2] విషయముల గుఱ్తెఱిఁగి తదనంతరము వర్తక వ్యాపారము తన హస్తగతమైనప్పుడు దానిని మెలకువతో నడపుటకుఁ దగిన విజ్ఞానమార్జించికొనియుండెను. తిప్పయసెట్టి, భార్య యన్నమదేవియందు మాచన, విశ్వనాథుఁడు, చినమల్లుఁడు నను కుమారులఁ గాంచెను. హారవిలాసమునుండి యవచివంశమునుగూర్చి తెలియఁదగిన ముఖ్యాంశము లివ్వియే. దేవయసెట్టియుఁ దిప్పయసెట్టియు నీవిధముగ రెడ్డిరాజులప్రాభవమునకుఁ గారకులై వారియశముఁ గొంతలోఁ గొంతఁ బంచికొనుటకుఁ బాత్రత వహించియున్నను, దత్పూర్వులు గూడ ప్రసిద్ధులై యుండిరని హారవిలాసపీఠికవలన మనకుఁ దెలియుచున్నది. [3]అవచి తిప్పయసెట్టి తనతండ్రి వైపువారును దల్లివైపువారును నగు తాత లెన్నెన్నో ఘనకార్యములఁ గావించినట్లు

---

2 మా॥ తిరుమలవిభు చామాదీశ్వరైకాగ్రజన్మా
పరమగురు సపర్యాప్రౌఢ రామానుజన్మా
చిరపరిచిత లంకా సింహళద్వీపభూమీ
పరసిరుహభవోరుస్తంభ గోత్రాగ్రగామీ "హారవిలాసము"

3 కట్టించె నొక తాత కంచిహర్మ్యంబులు
హరిణాంకమౌళికేకామ్రపతికి,
బాలార్కమనియెడు పద్మరాగముఁ దాచె
నొక తాత కంచినాయకుని నాభి,
నొక తాత కట్టించె యోజనత్రయదీర్ఘ
తరతటాకాంభోధిఁ దిరువళూరఁ,
గావేరిఁ గట్టించెఁ గార్పాసరానుల
నుబ్బి చోడఁడు మెచ్చ నొక్క తాత,
గీ॥ ప్రతిదినమ్మునఁ గపురపుదీపములు సేయు
వ్రతముగా నొక్క తాత యీశ్వరున కొసఁగ
నిఖిలలోకప్రసిద్ధ వాణిజ్యవంశ
ధరులు మాతాత లుభయగోత్రములవారు.

హారవిలాసము పీఠిక. ప. 10. (వావిళ్ళవారి ప్రతి)

చెప్పుకొని యున్నాడు. ఏయేకార్యము లెవ్వరెవ్వరికిఁ జెందునో చెప్పఁజాలము కాని యొక తాత కంచి[4] యేకామ్రనాథునకు గుళ్లు, గోపురములు గట్టించెను. [5]ఒక తాత బాలార్కమనియెడు పద్మరాగమణిని శ్రీ వరదరాజస్వామి బొడ్డునఁ బొదిగించెను. [6]ఇంకొక తాత తిరువళ్ళూర యోజనత్రయదీర్ఘమైన సముద్రమంత చెఱువుఁ ద్రవ్వించెను. ప్రతి దినము మహేశ్వరునకుఁ గర్పూరప్రదీపములు వేయు వ్రతముగా నొక తాత కైంకర్యముఁ జేసెను. [7]వేరొక తాత చోడరాజులకాలములోఁ గార్పాసకాసులతోఁ గావేరినది కడ్డు

---

4 కంచి యేకామ్రేశ్వరాలయము మిక్కిలి సుందరమైనది. దానిలో నేటికి నలనాఁటి శిల్ప చాతుర్యము వెల్లడించు చిహ్నము లనేకములు గన్పట్టుచున్నవి. అందుముఖ్యమైనది వేయికాళ్ళమండపము. ఈమండపము నాలుగువైపుల రాతితోనే యందములైన గొలుసుల తోరణములు చెక్కబడినవి. కొన్నిచోట్ల నవి శిథిలమైపోయినను పురాతనవైభవమును దలపించుచు తక్కినచోట్లఁ దోరణములింకను వ్రేలాడు చున్నవి.

5 ఈపద్మరాగమణి సుమారు కుంకుడుకాయయంత పరిమాణము గలిగి నేఁడును కంచి శ్రీ వరదరాజస్వామి నాభిదేశమున నలంకారమై యున్నది. ఏటేట జరుగు బ్రహ్మోత్సవసమయములందు మాత్రమే యీమణిని హారమున గ్రుచ్చి, స్వామివారిబొడ్డునకుఁ దాఁకునట్లుగా నలంకరింతురు. తెనుఁగునాఁట "బొడ్డున మాణిక్యము బెట్టుకొనిపుట్టుట"ను నానుడి కలదు. దాని కాజన్మశ్రీమంతుఁడని యర్థము. తిప్పయతాతలనాటికే నానుడి యాచరణలోనే యున్నదన్నచో నది భాషలో నవతరించి యెన్నాఁడైనదో, దానినిబట్టి యాంధ్రులయైశ్వర్యప్రాభవము లెంత ప్రాచీనములైనవో యూహింపఁదగును.

6 ఈ చెఱువు నేఁటికినిఁ దిరువళ్ళూరఁ గాన్పించుచున్నది.

7 ఈ చోడరా జెవరో యేకాలమువాఁడో తెలిసికొనవలసియున్నది. ఆత్మకూరి విష్ణుదేవాలయమున దొరకిన బమ్మిసాయకుని దానశాసనములో వంశావళి విరుదములలో "కారితకావేరీతీర కరికాలకులరత్నప్రదీప" అని యున్నది.

Nellore inscriptions Part I. p. 253.

(ii) తిక్కన నిర్వచనోత్తరరామాయణములో కృతిపతి వంశావతారవర్ణనమున,

శా॥ చేసేతంబృథివీశు లందఱుఁ గానంగాఁ సింధుతోయంబులం
జేసెం మజ్జన ముంగుటంబున వారించెం బల్లవోర్వీశు ను
ల్లాసం బొందఁగ ఘాలోచనము లీలంగట్టెఁ గావేరి హే
లాసాధ్యాభుజదిబ్బుఖుండు కరికాలక్ష్మావిభుం డల్పుఁడే.

నిర్వచనోత్తరరామాయణము. ప్రథమా. ౩౦.

(Footnote continued on next page)

కట్టించెను. ఇట్లవచివంశమువారు సుప్రసిద్ధవాణిజ్యవంశధరులై రెడ్డిరాజులకాలమునందు కాక తత్పూర్వాంధ్రరాజవంశముల కాలములయందును వెలసియుండి రని తెలియుచున్నది.

## తిప్పయసెట్టి గుణగణములు — ప్రాభవము.

శ్రీనాథుఁ డీతనిఁ "త్రిపురాంతక దేవదివ్యశ్రీపాదపద్మారాధకుండును, బరమసాధకుండును,—గఘులభవోరువంశావతారుండును, ధర్మ్మదావిడబిరుదాధారుండును,—సుజన విధేయుండును, గర్పూరవసంత రాయుండును,—ప్రతిదినసమారాధిత పరమేశ్వరుండును,

(*Footnote continued from previous page.*)

(iii) ఇంతియే కాక నవచోళచరిత్రమున నిట్లున్నది.

"తెలుఁగొప్ప ధరప్రసన్న దేశాధిపతులు
గరికాలచోడభూపతు నాజ్ఞ మెఱసి
కరితురగాందోళికల కథంబులను
బలితెంచి యాసార్వభౌముని గాంచి.

◆ ◆ ◆ ◆

తన యేలు పట్టణాంతరముఁ గలుగు
వారును తమతమ వంతు నిత్యంబుఁ
గూరిమి దప్పక కొదువ గానీక
కావేరినది కట్టఁగా వచ్చువారు
భావింపఁ జోడభూపాలునియాజ్ఞ."

నవచోళచరిత్రము. ఆ. 1.

ఈ యుదాహరణములఁబట్టి కావేరీనది కరకట్ట కట్టించినవాఁడు కరికాలచోడుఁడని తెలియుచున్నది. కాని యాతఁడు రాళ్ళు, సున్నము, లోహములున్నగువానితోడను దానిని నిర్మించెనని నవచోళ చరిత్రమునం దున్నది. కార్పాసరాసులతోఁ గావేరిని గట్టించుటేమియో శోధింపవలసియున్నది. గోదావరి యానకట్ట కట్టునప్పుడు కాటన్ దొరగారు రాళ్ళు, సున్నము, సిమెంటు మొదలగువానిని వేయుటకు ముందుగా మొట్టమొదట నాలుగుకాళ్ళుగల కొయ్యగుజ్జములను దయారుచేయించి వానికిఁ జీకిపోని అడవి తీగలను జుట్టించి నీళ్లలోనికి దింపించెననియును, నిప్పుడున్న యానకట్టకుఁ బునాది యా కొయ్యగుజ్జములవరుసలే యనియు గోదావరియానకట్ట చరిత్రమునం దున్నది. అట్లే కావేరిని గట్టునప్పుడు కూడ దూదిబస్తా లింపునకైన నుపయోగింపఁబడినవేమో! వానిని తిప్పయ్యగారి సరఫరా చేసెనేమో! అతఁడు చేసిన సాహాయ్యమునుబట్టి వారివంశస్థులకుఁ గావేరీకులని బిరుదులు లభించియుండవచ్చును. శ్రీనాథుఁ డీతనిని హరవిలాసమునఁ దిప్పయసెట్టికి బహువారములు వాడియున్నాఁడు.

మాణిక్యసింహాసనాధీశ్వరుండును,— దానధర్మపరాయణుండును, ఇమ్మడిగరుడనారాయణుండును,— నిజకీర్తి శాసన స్తంభాయమాన దిగంతదంతావళుండును, నభయదాద్రిళుండును,—వశీకృతనిఖిలభూభుజుండును, సతతత్యాగధ్వజుండును,— వినిర్మలకులశీలుండును, పాండ్యరాజకందుకక్రీడావిలోలుండును,—గవిజనస్తోత్రపాత్రుండును, గౌండిన్య గోత్రపవిత్రుండును,—జతుష్షష్టివిద్యాభూమియు, నయోధ్యానగరస్వామియు" నని యంత్యనియమబద్ధముగా మిక్కిలి సొంపుగా వర్ణించినాఁడు. ఇందలి విశేషణములం దధికార్థగోచరమైన దొక్కటియుఁ గానరాదు. "ధర్మదాద్రివిడ", "ఇమ్మడిగరుడనారాయణ" "కర్పూరవసంతరాయే"త్యాదిపదము లతిశయోక్తులుగాఁ బైకిఁ దోఁచినను నిజముగా నవి యట్లు కావు. ఏలన తిప్పయసెట్టి కొమరగిరి వసంతనృపాలువలన నాందోళికాచ్ఛత్రచామరతురంగాది రాజ్యచిహ్నములు వడసినవాఁడు. మహారాజుల కుండెడు బిరుదచిహ్నము లన్నియు వారి యనుయాయులు, సామంతులుఁ గూడ ధరించుట నాఁటి యాచారమగుట శ్రీనాథుఁడు కొమరగిరికున్న బిరుదము లన్నియును తిప్పయసెట్టికిఁ గూడ వాడుటలోఁ దప్పులేదు. ఇంతకును దిప్పయసెట్టిని సామాన్యుఁ డగు వైశ్యమాత్రునిగా మనము దలపోయరాదు.

శ్రీనాథుఁ డీతని యైశ్వర్యమహిమానుభావములఁగూర్చి చేసిన ప్రశంస జాగ్రత్తగాఁ బరిశీలించినచో నానాఁటి ప్రసిద్ధ నరపాలుర కనల్పమగు ధనమును వారివారి యవసరములకై బరాతముచేసి యిప్పించుచుఁ దిప్పయసెట్టి యందఱకును దలలోని నాలుకవలె మెలఁగుచుండెనని విశదము కాఁగలదు. ఈతఁడందువలననే కొమరగిరి కుమారరమణకుంజరునుగంధశాలాధ్యక్షుఁడే కాక హరిహరరాయఫేరోజిశహాగజాధిపాదుల మన్నన లందినవాఁడును, పాండ్యరాయ కందుకక్రీడావిలోలుండును, నయోధ్యానగరస్వామియోయనఁ బరఁగినవాఁడును,[8]గిష్కింధాచలక్రీడావిలోలుండును గూడ నయ్యెను. పంఢువాఢిల్లిరాఢాదిపట్టణ

---

8 "స్వాతంత్ర్యముకొఱకు బెనఁగులాడి విజయమొందిన యానెగొంది సామాన్యస్థలము గాదు. ఇదియే పూర్వము రామాయణకాలమందు మహావీరులగు వాలిసుగ్రీవులు రాజ్యముచేసిన కిష్కింధ యని తెలియవచ్చెను. ఈప్రాంతములందున హంపీసరస్సు మున్ను రామలక్ష్మణులకాతిథ్య మొసఁగిన శబరీనివాసమగు పంపాసరోవరమని గొప్ప యైతిహ్యము కలదు."

విజయనగర సామ్రాజ్యమందలి ఆంధ్రవాఙ్మయచరిత్రము పే. 4.

ఇచ్చటనే ఋశ్యమూకాద్రి, మాతంగపర్వతము లను పేర్లుగల గిరులు గూడఁ గలవు. తిప్పయ నాఁటి కీదేశమును రెండవ హరిహరరాయలు పాలించుచుండెను. అతనికి ధనసాహాయ్య మొనర్చుచు నాప్రాంతములవ ర్తకముఁ జేసియుండుటచే శ్రీనాథుఁడు తిప్పని గిష్కింధాచలక్రీడావినోది యని ప్రశంసించి యున్నాఁడు.

ముల యధిపతు లవచి త్రిపురాంతకుని యానపాత్రములు సింహళ ద్వీపక్షేత్రముల నుండి కొనివచ్చిన రత్నాంకురములను మాళిం దాల్చుచుండిరి. “కరదీపదాన బిరుదాభరణుం డనియుఁ” “కావేరీశుం డనియు, నీతఁ డనేక భంగులఁ బేర్కొనఁబడినాఁడు. రాజ్యచిహ్నములు వడసి చేదివిటీలు కాలి దివిటీలు వేయించుకొనుచుండుటఁ జేసి మొదటి బిరుదమును, “కార్పాసరాసుల” తోఁ గావేరి శాసించిన వాని వంశమునఁ బుట్టినందున రెండవ బిరుదమును నీతని కాభరణములయ్యెనని గ్రహింపవలెను. ఇట్లు హారవిలాసమున వర్ణింపఁబడిన యంశములందుఁ గించిత్తైన నతిశయోక్తిలేని జీవితము నడపిన తిప్పయసెట్టి యానాఁటి సుప్రసిద్ధచారిత్రక వ్యక్తులలో నొకఁడై నేఁటికిని మన మనస్సుల నాకర్షించుచున్నాఁడు. అంతియే కాని కొందఱు వ్రాసినట్లుగా ధనలోభమున శ్రీనాథుఁడు పాత్రౌచిత్యము పాటింపక సామాన్యుఁడగు కోమటిసెట్టిని సార్వభౌమునిగా వర్ణించె ననుట మిక్కిలి దూష్యము. శ్రీనాథుఁడు చారిత్రకవిషయముల వర్ణించు సందర్భమున నత్యంతజాగరూకుఁడు. తదితర కవుల గ్రంథములకంటె శ్రీనాథుని గ్రంథములు చారిత్రకాంశముల నేరుకొను పట్టున నత్యంత విశ్వసనీయములు. ఆతఁడు మిథ్యాలంకారావగుంఠనములతోఁ గప్పిపైచి చారిత్ర కాంశముల నగోచరములుగాఁ జేయఁడు. శ్రీనాథవిరచితములగు గ్రంథముల కిదియే విశిష్టత గల్పించుచున్నది.

## కర్పూరవసంతరాయ బిరుదము—వసంతోత్సవములు.

తిప్పనికిఁ గర్పూరవసంతరాయ బిరుదము గూడఁగలదు. పై నుదహరించిన వచనమందే కాక యీక్రింది పద్యమునఁ గూడ శ్రీనాథుఁడీ బిరుదమును వాడియున్నాఁడు.

కం. సర్వకటకాంఘ్రి సేవక !
కర్పూరవసంతరాయ ! కావేరీశా !
దర్పితరిపుగర్వతమో
హార్పతి ! సౌకర్యదక్ష ! యంబురుహాక్షా !

హార॥ ఆ 2. ప 144

అనవేమారెడ్డికిఁ గూడ “వసంతరాయ” బిరుదమున్నను ముఖ్యముగాఁ గొమరగిరి రెడ్డికి నాతని సుగంధశాలాధ్యక్షుఁ డగు తిప్పనికి మాత్రమే వసంతోత్సవముల కీర్తి మిక్కుటముగా లభించినది. దీనికి ముఖ్యకారణము హారవిలాసమే. ఆ కృతియే లేకున్నచోఁ గొమర

గిరిరెడ్డి చేయు వసంతోత్సవములఁ దిప్పుఁడే నిర్వహించు చుండెనను విషయము లోకము నకుఁ దెలియకేపోయి యుండును. 9 ఈ బిరుదము ధరించినవాఁడగుటేకాక సందర్భాం తరమునఁ గూడఁ గొమరగిరిరెడ్డి వసంతరాజనియే వ్యవహరింపఁ బడెను. అతనిచే రచింపఁ బడిన నాట్యశాస్త్రమునకుఁ గూడ "వసంతరాజీయ" మనియే నామకరణము గావింపఁ బడెను. దీనిఁబట్టి కొమరగిరిరెడ్డికి 10 వసంతోత్సవములన్న నెంతప్రీతియో సులభముఁగా వ్యక్తమగుచున్నది. ఆయాయుత్సవముల నిర్వహణమునందుఁ దిప్పయ యెంతగా సాయ మొనర్చుచుండెనో యీ క్రింది పద్యము చెప్పక చెప్పుచున్నది.

" చ. హరిహరరాయ ఫేరొజశహాసురధాణగజాధిపాదిభూ
వరులు నిజప్రభావ మభివర్ణన సేయఁ గుమారగిర్యధీ
శ్వరుని వసంతవైభవము సర్వము నొక్కఁడ నిర్వహించు మా
తిరుమలనాథసెట్టికిని ధీగుణభట్టికి నెవ్వరీడగున్.

హర॥ పీ॥ ప 23.

(9) "ప్రోక్తం వసంతరాజేన కుమారగిరిభూభుజా
నామ్నా వసంతరాజీయం నాట్యశాస్త్రం యదుత్తమం"

కాటయవేముని శాకుంతలవ్యాఖ్య.

(10) <u>వసంతోత్సవము.</u> ఋతుచక్రసమాలింగితములై, మానవజీవితాభ్యుదయకారకములగు సమ యాధిష్ఠానశక్తులను బ్రసన్నములు గావించుకొనుటకై ప్రాచీనులేర్పఱచిన ప్రకృతిపూజాభేదములలో వసంతోత్సవ మొకటి. దేశాంతరాచార భేదములచే నియ్యది పెక్కు తెఱఁగులుగాఁ దోఁచుచున్నను వాని కన్నిఁటికిని బ్రకృతి దేవతారాధనమే ముఖ్యలక్ష్యముగఁ గన్పట్టు చున్నది. ఈ యుత్సవమే చైత్రోత్సవ మనియు, సువసంతక మనియు, హోలికోత్సవ మనియు, మదనోత్సవమనియు నిట్లనేక విధములుగా నిర్వచింపఁబడు చున్నది. స్థలాంతరాచార వ్యవహారములంబట్టి యా యుత్సవముల నిర్వర్తించుటలో లౌకిక తంత్రములందు నేఁడీషద్భేదము లేర్పడియున్నవి. కాని యీ యుత్సవములతి ప్రాచీనములైనవి. అన్యదేశములందుసైతము వేరురూపముల నివి యాచరణయందుండుట వలన సనాతనార్యజాతులందే యిది నెలకొని యుండి నట్లూహింప నగును.

శ్లో॥ చైత్రోత్సవే సకలలోకమనోనివాసమ్
కామం వసంతమలయాద్రిమరుత్సహాయమ్
రత్యాసహార్చ్య పురుషః ప్రవరాచ యోషిత్
సౌభాగ్యరూపసుత సౌఖ్యయుతా సదా స్యాత్॥

ద్వీపాంతర వ్యవహారములందు గడిదేరిన కోమటి బిడ్డకు వసంతోత్సవ మత్యంతా కర్షకముగాఁ జేయవలయునన్నచో నెచ్చటెచ్చటినుండి యేయే యపురూపములగు వస్తు సామగ్రి తెచ్చి సమకూర్చుకొనవలయునో బాగుగాఁ దెలియును. కావున "సమ్మహారాజునకుఁ బ్రతిసంవత్సర వసంతోత్సవంబునకుం దగిన కస్తూరీ కుంకుమ ఘనసారసంకుమదహిమాంబు కాలాగురు గంధసారప్రభృతి సుగంధద్రవ్యంబు లోడఁగూర్చియుఁ జీనిసింహళతవాయి హురుమంజి జలనోగిప్రభృతి నానాద్వీపనగరాకరంబులగు ధనకనక వస్తువాహన మాణిక్యం

---

అని భవిష్యత్పురాణమందు చెప్పఁబడియున్నది. వసంతునితోడను, మలయానిలునితోడను గూడి సకలలోక మనోవర్తియైన మన్మథుని రతీదేవితోఁ గూడ నర్చించిన పురుషులు స్త్రీలు రూపసుతసౌఖ్యసౌభాగ్య యుతులై యుందురని వచింపఁబడినది.

"సువసంతో మదనోత్సవః తత్ర నృత్తగీత
వాద్యప్రాయాః క్రీడాః పితామహిమాన్యాః
క్రీడాః దేశ్యా ఆహ"

అని సువసంతకమును గూర్చియు

"మదనోత్సవో మదనప్రతిపూజనమ్"

అని మదనోత్సవమును గూర్చియు,

"హోలాకాఫాల్గున పూర్ణిమాయాంశృంగకాది ముక్తేన
కింశుకాది కుసుమరాగాంభసాశ్చ, పరస్పరోక్షణమ్
మిథఃపటవాస ప్రక్షేపశ్చ"

అని హోలాకోత్సవమును గూర్చియు వాత్స్యాయనుని కామసూత్రములకు, యశోధరుఁడు వ్రాసిన జయమంగళవ్యాఖ్యలో నిర్వచింపఁబడినది.

చైత్రశుద్ధ ప్రతిపత్తునుండి నవమివఱకు వసంతోత్సవములను జరుపవలసినదిగా ధర్మసింధు నిర్ణయసింధువులు గూడవిధించుచున్నవి ఈతొమ్మిది పండుగరేలనే వాసంత నవరాత్రములని యందురు. ఈయుత్సవమునఁ బ్రతిదినమును నృత్యములు, నాట్యములు, పాటకచేరీలు మున్నగు వేడుకలు బహుళముగా జరపుచుందురు. ఇట్లు చైత్రప్రతిపదముతోడనే వాసంతనవరాత్రము లారంభమగుచుండ ధర్మసింధుకర్త డోలాపౌర్ణమాసినిఁగూర్చి వ్రాయుచు ఫాల్గుణకృష్ణప్రతిపదమే వసంతారంభోత్సవ దివసమని నిర్ణయించినాఁడు. ఆనాఁడు మానవుఁడుదయముననే లేచి తైలాభ్యంగనాదులు గావించికొని, గోమయముచే నలికిన గృహాంగణమున శుక్లవస్త్రము నాసనముగాఁ జేసికొని ప్రాఙ్ముఖుఁడై కూర్చుండి, సువాసినిచే వందనము, తిలకము నీరాజనమునొంది, చందనలిప్తమగు చూతకుసుమమును భక్షింపవలయును. పిమ్మట రక్తాశోక పాదపముక్రింద మదనప్రతికృతి పూజచేయవలయును. తరువాత భర్గుండమోదుగు పూలతో సిద్ధముచేసిన వసంతరసము పిచికారులతోఁ జల్లుకొనుట, బుక్క జల్లుకొనుట మొదలగు మన్మథోద్దీపనములగు వేడుకలను గావింపవలెను. ఊయెల పున్నమనాఁడు డోలాగతుఁడగు గోవిందుని దర్శించు నరుఁడు వైకుంఠమును బొందునని చెప్పఁబడినది.

బులు తెప్పించి " యిచ్చుచు నాయుత్సవములకగు వ్యయమంతయుఁ దానే భరించుచుండు వాఁడు. ఆ యుత్సవసమయములందు కవి నైగమిక వాదివాంశికవైతాళికాదు లనేకు లరుదెంచుచుండువారు. ఆయర్థిజనుల కపరిమితములగ నర్థరాసుల గుప్పించి ధీరుఁడు నుదారుఁడు, గంభీరుఁడు, సదాచారుఁడని ప్రఖ్యాతి కెక్కినవాఁ డవచి త్రిపురాంతకుఁడు. ఇట్లు చక్రవర్తులు గూడ మెచ్చునట్లుగ నుత్సవముల నిర్వహించుట సామాన్యుఁడగు బచ్చు బేరగానికి సాధ్యము గాదు. దీనివలన తిప్పని యసమానమగు రసికతయుఁ గళావైదగ్ధ్యమును వ్యక్తమగును. వసంతోత్సవములకై మాణిక్యము ... జాలు గాణిక్యమును గూడఁ దెప్పించిన తిప్పని

"నరాం డోలాగతం దృష్ట్వా గోవిందం పురుషోత్తమం
ఫాల్గున్యాం ప్రయతో భూత్వా గోవిందస్య పురం వ్రజేత్ "

వంగదేశమున నీ పున్నమనాఁడు కృష్ణవిగ్రహము నూయెలలో నుంచి జనులు పూజింతురు. ఇట్టి యుత్సవము కేవలము జీవనోల్లాసకరములగు వేడుకలఁ జేసికొనుటకే యుద్దేశింపఁబడియుండఁ గొన్ని తావులందీ పండుగపేరట నతి హేయములును జుగుప్సావహములునగు కార్యములను గావించుటాచారమై యున్నది. కొన్ని ప్రాంతములందు వీధులలో జను లొండొరులపై దుమ్ము వైచికొందురు. పచ్చిబూతులతో నొకరొకరిఁ దిట్టుకొందురు. ఇట్టి పచ్చిబూతులు తిట్టుకొన్ననే కాని హోలికయను పండుగ రక్కసి తృప్తి పడదని శాస్త్రములు చెప్పుచున్నవి. కొన్ని ప్రాంతములందు వారవనితలను రప్పించి వారిపై వసంతము గుమ్మరించి యసహ్యాకరములగు పనులఁ గావింతురు. ఈ పండుపునాఁడు స్త్రీల కడ్డులేని స్వేచ్ఛ యాచారమిచ్చుచున్నది. ఆనాఁడు స్త్రీలు గుంపులుగాఁ గూడి యెదుటికిఁబోవు మగవారినిఁ బడఁ ద్రోసి మొగముపైని గులాము పులిమి యూపిరి తిరుగకుండ వసంతము గ్రుమ్మరించి పాఱిపోవుదురు. వారి నేమనుట కానాఁడు వీలులేదు. కొన్ని ప్రాంతములలో నీయుత్సవరాత్రులందు ముష్కరులగు జనులు గృహస్థుల యిండ్లలో దూఱి భక్ష్యభోజ్యముల దొంగిలించుకొని పోవుదురు. వీధులందు మన్మథుని పటము దహింతురు. ఇంక నెన్నో హేయములగు పనులఁ గావింతురు. హారవిలాసమునను, నితర గ్రంథములందును జేయఁబడిన వర్ణనముల నవలోకించినచో నాకాలమున వారు చేయు నుత్సవములందుఁగూడ నీదురాచారము లున్నట్లే వ్యక్తమగును. కొమరగిరిరెడ్డి యొనర్చిన వసంతోత్సవములు, నిజప్రాభవ ప్రకటనార్థమును, కవి నైగమికవాది వాంశికపరితోషణార్థమును, నిజవిలాసజీవన ప్రయోజనార్థమును నిర్వహింపఁబడెననుట నిస్సంశయము. ఇట్టియుత్సవములను పూర్వరాజన్యు లనేకులు చేయుచుండిరి. వానిఁగూర్చి వాత్స్యాయన కామసూత్ర వ్యాఖ్యానకర్త యిట్లు వ్రాయుచున్నాఁడు. "ప్రాచీనులగు భారతీయ రాజవరులీ యుత్సవసందర్భములందే పండితగోష్ఠులను, శాస్త్రవిచారణలను, నాటక ప్రదర్శనములను జరుపుచుండెడివారు. మొత్తము మీద నీయుత్సవమున సంగీతకము ప్రధానము ఏతత్సూచకముగ వసంతరాగమను యొక రాగముఁగూడ మేళకర్తలు గావించినారు."

మహాకవి కాళిదాస కృతమగు శాకుంతలము నాటకము ... వియంకమున మధుమాసాగమనోత్సాహవివశలైన పరిచారికలు కామదేవార్చనమునకై చూతాఙ్కురావచయముఁ జేయఁబోఁగాఁ గంచుకి యన్న మాటలు.

రసికతను గణింపక, కీ॥ శే॥ శ్రీ వీరేశలింగముపంతులుగారు శ్రీనాథుఁడు కోమటిసెట్టిని "లలనాజనతార్ఘుపలక్ష్మనిభా" యనియు "నంబురుహాక్షా" యనియు ధనలోభమున వర్ణించెనని యాక్షేపించిరి. కోమటిజాతియం దందమైన వ్యక్తి జన్మించుట కలదా యని వారి దృఢానుమానమై యుండవచ్చును. లేకున్న "బహువత్సరములు" బ్రదికిన తిప్పఁడెట్లు తిరిగి లలనాజనమన్మథుఁడయ్యెనని యైన వారనుమానించి యుందురు. ఏదెట్లైనను తిప్పని రసికతను వారు గుర్తింపలేదనియే నాయూహ. ఇంతియేకాదు. "దర్పితరిపుగర్వతమోహార్పతి" యను విశేషణముఁ గూర్చికూడ వారాక్షేపించిరి. కోమటికి పౌరుష మెక్కడిదని కాబోలు వారి యనుమానము. ఇదియు నవిచారితమనియే నా విశ్వాసము. ఏలన నానాఁడు దక్షిణభారతమున బడమటి తీర మోడదొంగలకుఁ బ్రసిద్ధి వహించి యుండెను. సముద్ర మధ్యమున నోడదొంగల వలన నపాయములా నాఁటివర్తకు లెఱుంగనివికావు. కనుక స్వప్రాణధనరక్షణమునకై ప్రతినౌకాయజమానియుఁ గొంత సిబ్బందినిఁ దన యోడపై నుంచుకొను చుండెను. అవసరసమయములం దుపయోగించుటకై వారును శస్త్రవిద్య నేర్చుకొని యుండెడివారు. తిప్పయసెట్టి చిన్నతనమునుండియు నౌకలకు స్వయముగా యాజమాన్యము వహించి బర్మానుండి పారశీకము వరకును గల సముద్రముపైఁ దిరిగి

"మాతావదాత్మక్షే! దేవేనప్రతిషిద్ధే వసన్తోత్సవే త్వమామ్రకలికాభంగమారభసే."

శకుంతలా విరహా దోదూయమానమానసుఁడై దుష్యంతుఁడు వసంతోత్సవము నిషేధించినాఁడనికూడ నాతఁడు పిమ్మటఁ దెలిపియున్నాఁడు.

భోజుని రత్నావళి ప్రథమాఙ్కమున వసంతోత్సవ క్రీడలు విపులముగా వర్ణింపఁబడి యున్నవి. ఇంతియకాక సంస్కృతకావ్యనాటకాదులందు కవీంద్రులచే మిక్కిలి మన్ననఁబొందిన దీ వసంతోత్సవము దీనిశృంగార రసాశ్రయత్వమే యింతగా దీనికిఁ గావ్యములయందు ప్రవేశము గల్పించినది. ఆంధ్రచక్రవర్తులీ యుత్సవము నతివేలముగా నాదరించిరి. కొమరగిరి రెడ్డియే కాక యాతని సమకాలికులగు విజయనగర రాజులును వారితరువాతఁ దద్వంశ్యుఁడగు శ్రీకృష్ణదేవరాయలును నీ యుత్సవము నాదరించిరనుటకు "హరిహరరాయ" యను హరవిలాసపద్యమును నీ క్రింది పద్యమును నిదర్శనములు గాఁగలవు.

కం. ప్రతివర్ష వసంతోత్సవ
కుతుకాగత సుకవినికరగుంఫిత కావ్య
స్ఫురితరోమాంచవిశంకిత
చతురాంతఃపురవధూప్రసాదనరసికా.

పారిజాతాపహరణము.
ఆ. 1 ప 189.

వర్తకవ్యాపారము జేసెను. అట్టివారికి సాముగరిడీలు నేర్చుకొను టవసరమై యుంటచే నాతడును, సోదరుడగు చామిసెట్టియుఁ దప్పక సంగరవిద్య నేర్చియే యుందురు. కనుకనే శ్రీనాథుడు వారిని "సంధాభార్గవు!" లనియు "దర్పితరిపుగర్వతమోహార్వతు" లనియు వర్ణించెనని నా యభిప్రాయము కవుల వాక్యములం దతిశయోక్తులుండుట సహజము. అన్నియు నతిశయోక్తులే యని వారివాక్యములఁ ద్రోసివేయు టవిచారితము.

## తిప్పయ—వీరశైవము.

తిప్పయసెట్టి యెంతటియైశ్వర్యవంతుఁడో యంతటి దైవభక్తి సంపన్నుఁడును, నంతటి వితరణశాలియు, నంతటి విద్యావంతుఁడును. "చాముండాపరమేశ్వరీవరకృపాసంవర్ధితైశ్వర్య" యని వర్ణింపఁబడుటచే నీతని యెడల దైవభక్తియు నైశ్వర్యమును బరస్పర దోహదములయ్యెనని తెల్లమగును. "వీరశైవసమయవ్యాపారపారీణతాసామాన్యప్రతిభావనిర్వహణదీక్షుఁ" డనియు "హరచరణస్మరణపరిణతాంతఃకరణుఁ" డనియును "సర్వకటకాంఘ్రిసేవకుఁ" డనియు "నుమాపతిపాదారవిందమధుకరమని" కూడ నీతఁడు వర్ణింపఁబడియున్నాఁడు. కాని తాను శైవుఁడైనంత మాత్రమున నాతఁడు వైష్ణవులయెడల నిరసనభావముతోఁ బ్రవర్తింపలేదు. "శైవవైష్ణవ సమయదీక్షావివేక ధన్యమానసు లుభయ గోత్రములవారు, నా యభీష్టం బౌకఁడు పిన్ననాటనుండి పరమమాహేశ్వరాచారభక్తిపథ" మని యాతఁడే చెప్పినవాక్యము బరిశీలింపఁగా నీతనిపూర్వులు కొందఱు వైష్ణవభక్తిపరులును గొందఱు శైవదీక్షులు నని బోధపడుచున్నది. ఏకామ్రనాథునకు హార్మ్యములు గట్టించిన తాతలే కంచి శ్రీ వరదరాజస్వామికి బొడ్డున మాణిక్యముఁ బొదిగించినారు. ఇష్టదైవమేదైనను సర్వమతములందు సామరస్యముతోడనే యవచి వారు వర్తించిరి. ఆ యిలువడి దప్పక తిప్పయ తాను మహేశ్వరభక్తుఁడై యుండియు, శైవప్రబంధములఁ గృతి నందియు "శీలితభారత రామాయణాది భవ్యపురాణుఁడు" ను "లక్ష్మణాగ్రజసుధాసిక్తాక్షరాలాపుఁడు" నయ్యెను. ఇంతకును మతవైషమ్యములును, రాజవైషమ్యములును వైశ్యులు గూడ మనములం దుంచుకొని తాము శైవులైనంతమున శైవులకు మాత్రమే సరకు విక్రయించి వైష్ణవులను వెలిబెట్టినచో బేరము సరిగా సాగదుగదా! అందువలననే శ్రీనాథుఁ డీతని "యుగంధరచాణక్యనీతిగతినిపుణుఁ" డని యుగ్గడించినాఁడు. కొమరగిరి క్షమారమణుని సుగంధశాలాధ్యక్షుఁడగుటయే కాక హరిహరరాయ ఫేరోజిశహాసురధాణ గజాధిపపాండ్యాధిపులకుఁ బందువాఢిల్లి రాఢాదిపట్టణముల యధిపతులకుఁ గూడ నీతఁడు కూర్మిచెలి

కాఁడై యుండెనని మున్నే చెప్పియుంటిమి. వీరిలో కొమరగిరికి స్నేహితులును, శత్రువులును ననేకులు గలరు. కాని తిప్పయ్య కందఱు స్నేహితులే. రాజవైషమ్యములకుఁ జోటిచ్చినచో వ్యాపార వ్యవహారము లెట్లభివృద్ధి నొందును? దీనిఁబట్టి తిప్పయ వాణిజ్యనీతి మనకుఁ జక్కఁగఁ దెలియును.

ఈతఁడు స్వయముగ రచించిన గ్రంథము లేవియో మనకుఁ దెలియవుగాని "వాణీనఖముఖముఖరితవీణానిక్వాణనిభకవిత్వఫణితి" గలవాఁడని శ్రీనాథుఁడీతని వర్ణించియున్నాఁడు. కవియైనను గాకపోయినను భారతరామాయణాది భవ్యపురాణముల నాసక్తితోఁ బఠించినవాఁడని చెప్పఁబడుటచే వాణియు వాణిజ్యము నీతనియెడల సమానకటాక్షము నెరపుచుండెనని యూహింపనగును. తన తాతలవలెనే యీతఁడుగూడ శిల్పను నభిమానించె ననుటకు సాకిరిగా నేఁటికి నీతఁడు గట్టించిన దేవాయతన నిర్మాణములు గోచరించుచున్నవి. ప్రసిద్ధమగు కాళహస్తి గోపురమున కడుగున నీతఁ డొక పాతాళగుహను కట్టించెను. నేఁడందులోఁ బాతాళగణపతి యను దైవతము ప్రతిష్ఠింపఁబడి యర్చింపఁబడు చున్నాఁడు. ఇట్లు నిరతిశ యైశ్వర్యసంపదలతోఁ బాటు నిరుపమానమగు దైవభక్తియు బ్రాహ్మణభక్తియు, వితరణగరిమయు, రాజపూజ్యతయు వివేక పరిపాటియుఁ దన్నయాచితముగ వరింప, రెడ్డిరాజులకుఁ బ్రాలంబన యష్టియై, యాంధ్రనౌకా జీవనమునకుఁ బట్టుగొమ్మయై చారిత్రక పురుషుఁడై పేరొందిన యీవణిక్కులతిలకము మనకెల్లరకు వందనీయుఁడగు చున్నాఁడు.

## తిప్పయ్యసెట్టి—నౌకావ్యాపారము.

11 ఆంధ్రుల నౌకాజీవనచరిత్రముఁ బరిశోధించుపట్టున 14, 15 వ శతాబ్దములలో మనకు ముఖ్యముగ గోచరించువ్యక్తి తిప్పయసెట్టి. "శ్రీ పర్వతసోపానస్థాపక వేమక్షితీశ సామ్రాజ్యశ్రీవ్యాపారముఖ్య" యనుటచే వణిగ్వ్యాపారమునం దవచివంశమువారు కొమరగిరిరెడ్డి కాలముసందేకాక రెడ్డిరాజ్య స్థాపకుఁడగు దేసటి ప్రోలయవేముని కాలము

ఆంధ్రుల నౌకాజీవనచరిత్ర మతి ప్రాచీనమైనది. తొల్దొల్త నైతిరేయబ్రాహ్మణమునందుఁ బేర్కొనఁబడిన యీవిషయము తరువాత బయలు వెడలిన పురాణాదులందుఁ గూడఁ బ్రశంసింపఁబడినది. మనుస్మృతియం దోడలకేవుల గుఱించియు నావికుల యజాగ్రత్తకు నపరాధములఁ గూర్చియు నపరాధ శుల్కములు విధింపఁబడినవి. స్కాందపురాణాంతర్గతమగు సత్యనారాయణవ్రతమున సాధువను వర్తకుఁడు నౌకావ్యాపార మాచరించుచుండినట్లు వ్యవరింపఁబడి యున్నాఁడు. రఘుమహారాజు దైత్రయాత్రకు వెడలినప్పుడు వంగదేశాధీశులు నౌకలతో నాతని నెదుర్కొనగా వారి నోడించి యచ్చోట నారాజు జయస్తంభముల నెలకొల్పినట్లు

నందును సంతకు ముందును బ్రసిద్ధి వహించినవారని తెలియుచున్నది. వీరు బేహారమాడు సరకులు ప్రధానముగా రత్నములు, సుగంధద్రవ్యములును. ద్వీపాంతరములనుండి పద్మరాగాది మణులను, ఘనసారాది సుగంధ ద్రవ్యములను, శాలి ధాన్యములను, గంధ సింధురములను, తురంగములను చౌకధరలకుఁ గొనివచ్చి మారు బేరములకు హిందూదేశమున వారు విక్రయించుచుండెడివారు. తన్మూలమున వారికి లభించు లాభముగూడఁ గొలఁదికి మించినదిగా నుండెను. అర్థులకుఁ బ్రచుర వితరణము లొసఁగి "కీర్తి బేహారమాడు" నంతటి లాభమే వారికి వర్తకమూలమున లభించుచుండెననిన వారొనర్చు వర్తకమే కొలఁదినుండెనో [illegible]ణింపఁ దగును.

కాళిదాసు రఘువంశమున వర్ణించి యున్నాఁడు. (IV - 36) అలెగ్జాండరు సింధునది దాటుటకు హైందవులచే నిర్మింపబడిన నౌకలనే వినియోగించెను. కౌటిల్యుఁడర్థశాస్త్రమునందు నౌకాశాఖనుగూర్చి విపులముగా వ్రాసియున్నాఁడు. మగధదేశము తరువాత బౌద్ధమతమును విశేషముగా నాదరించిన దాంధ్రదేశము. బౌద్ధ సారస్వతమునందు నౌకాయాన ప్రశంస యతిమాత్రముగాఁ గలదు. "దాతధాతువంశ" మను బౌద్ధమత గ్రంథమున రాజకుమారుఁడగు దంతకుమారుఁడు రాజపుత్రికయు నాతని దేవేరియగు హేమాచలదేవియు బుద్ధునిదంతములఁ దీసికొని యోడనెక్కి సింహళద్వీపమునకుఁ బాఱిపోవుచుండగా నారెక్కినయోడ వజ్రాల దిన్నెకడ మెట్టనెక్కెనని వర్ణింపఁబడినది. ఈ వజ్రాలదిన్నె కృష్ణానది ముఖద్వారమున నున్న ధరణికోటయే యని ఫెర్గుసన్ పండితుఁ డూహించుచున్నాఁడు. భోజనరపతిప్రణీతమైన యుక్తికల్పతరుగ్రంథమునందు రత్నాశ్వగజపరీక్షాది విషయములు రాజ్యాంగనీతి మున్నగు విషయములతోఁబాటు నౌకా నిర్మాణ శాస్త్రముగూడఁ జేర్పఁబడియుండెను. నౌకానిర్మాణమున కుపయోగపడు కలప, వాని పరిమాణములు మున్నగు విషయములు వానియందుఁ జర్చింపఁబడినవి.

"సముద్రము మీఁదనే ప్రత్యేకము ప్రయాణము చేయుటకు నిర్మింపఁబడిన యోడల యడుగుభాగమునందలి చెక్కల నొకదాని కొకటి యతికించునప్పు డినుపమేకుల నుపయోగింపరాదనియు నట్లుపయోగించినచో నాయోడలు సముద్రమధ్యముననుండు నయస్కాంతపు శిలలచే నాకర్షింపఁబడి బ్రద్దలైపోవుననియు భోజుఁడు హెచ్చరించెను" (ప్రాచీనాంధ్రనౌకాజీవనము పుట 8.)

సుప్రసిద్ధములైన యమరావతి ధరణికోట సాంచీ స్తూపములందలి చిత్రరువులలోను శిల్పప్రదర్శనములలోను నజంతా చిత్రములందును తెఱచాపలతోఁ గట్టఁబడి నవియుఁ దెడ్లతోఁ ద్రోయఁబడుచున్నవియుఁ జుక్కాని త్రిప్పుచున్నట్లున్న మనుష్యులతోఁ గూడియున్నవియును నగు చిత్రవిచిత్రములైన చిత్రములు గలవు. క్రీ. పూ. 200 సం|| మొదలు క్రీ. శ. 250 వరకు నాంధ్రకుషాను యుగమున గ్రీసు రోము చీనా యీజిప్టు మున్నగు దేశములతో నాంధ్రదేశము వ్యాపారము చేసెననియు రోమకదేశమునుండి యమితముగ నాంధ్రదేశమునకు బంగారునాణెము లంపఁబడెననియును ఆర్. సి. వెల్ వ్రాసియున్నాఁడు. ఆంధ్రదేశమున గుడివాడ, ధరణికోట ప్రాంతములలోఁ బ్రాచీనాంధ్ర నాణెము లనేకములు దొరకినవి. ఈ నాణెములపై రెండు కొయ్యలుగల పెద్ద యోడల చిత్రము ముద్రింపఁ

ఇఁక వారి వర్తకస్థానములన్ననో బహుదేశవ్యాప్తమై యుండెడివి. హారవిలాస పీఠికాభాగములోని పద్యములలో నవచివారు వర్తకముచేయు రేవుపట్టణము లనేకములు పేర్కొనఁబడియున్నవి. ఈ పద్యముల నచ్చువేయుటలో పూర్వము హారవిలాస గ్రంథమును ముద్రింపించిన ప్రకటనకర్త లాయాయి పట్టణ నామములను నహుకుఁ దోఁచినట్లు మార్చియున్నారు. ఇటీవల బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారిచేఁ బరిష్కృతమై "యానంద ముద్రణాలయము" వారిచేఁ బ్రకటింపఁబడిన హారవిలాసప్రతి యందాయా పట్టణ నామములకుఁ గొన్ని పాఠాంతరములు ప్రకటింపఁబడినవి. ఈ విధముగా శ్రీనాథకవి పేర్కొనిన పట్టణములేవో నిర్ణయించుటకు వలనుపడకున్నది. కావున నిప్పటికి దొరకిన హారవిలాస గ్రంథపుఁ దాటాకు ప్రతులలోని పద్యములను యథామూలముగా నిం దుదాహరించుచున్నాను. దానినిబట్టి పరిష్కర్తలువానియందుఁ జేసిన మార్పులఁబాఠకులు గుర్తింపనగును.

---

బడి యుండెను. అన్యదేశములందలి భాషాలిపులకును ప్రాచీనాంధ్ర భాషాలిపులకును సాదృశ్యముండుట వలన నాయాదేశములతో వాణిజ్యము సాగించుచుఁ బూర్వాంధ్రవర్తకు లాంధ్రలిపినందుఁ బ్రవేశపెట్టిరని యక్షరతత్వజ్ఞు లూహించుచున్నారు. బర్మాదేశమునందు సువర్ణభూమియని ప్రఖ్యాతిగాంచిన పెగూదేశమున 'మఁగ' భాషలోని యక్షరములు ప్రాచీనాంధ్రలిపివలెనే యున్నవని పరిశోధకులు కనుఁగొనినారు. "మఁగ" జాతిస్త్రీలకును నాంధ్రులకును జనించిన వారలు "తలైంగ్" లేక "తైలింగు" లని పిలువఁబడు చున్నారు. నౌకాయానము సముద్రవాణిజ్యము కళింగరాజకుమారులు తప్పక యభ్యసింపవలసిన విద్యలుగా నుండెనని శాసనములవలనఁ దెలియుచున్నది. (Vide Hunter's Orissa Vol. 1 page 188) కళింగదేశము నుండి వలసపోయిన కాళింగులే సుమత్రా జావా ద్వీపములలోని "క్లింగు" లని చరిత్రకారులు విశ్వసించుచున్నారు. సుమత్రా జావా ద్వీపములలో దొరకిన రెండు శాసనములఁ బట్టియు నచ్చటి కొండలపైఁ జెక్కఁబడియున్న హిందూరాజుల పాదములును, గొన్ని సంస్కృత శ్లోకములనుబట్టియుఁ బూర్వము పూర్ణవర్మయను పల్లవరాజీద్వీపములను జయించెనని పరిశోధకు లభిప్రాయపడుచున్నారు. (Vide Rawlinson Intercourse with India of the Western World page 139) ఇటీవల సుప్రసిద్ధచారిత్రక పరిశోధకుఁడగు Dr. H. G. Quaritch Wales పండితుఁడు సయాము, కాంబోడియా, మలయా ప్రాగ్భారత ద్వీపములు మున్నగు వానిలో పర్యటనము గావించి బహుపరిశోధనలు నడపి "The birth of Greater India" యను శీర్షికక్రింద ననేక వ్యాసములు వ్రాసి యాంధ్రులయు భారతీయులయు నౌకాజీవన చారిత్రమునం దనేకామూల్యనూత్న విషయముల వెల్వఱచినారు. ఆ యాదివులం దాంధ్రుల నౌకాజీవన ప్రాచీనతను దెలుపుచు వారిట్లు వ్రాసినారు.

"The type of the script used in the earliest Inscriptions found in Malaya and the other Indian colonies tells us that in the fourth and fifth centuries A. D. the Indian colonists seem to have set sail from the land between the Krishna and Godavari Rivers; but later when Pallava rule reached its heights, the ports of embarkation seem to have been further south. The Mahabalipuram (Seven Pagodas) near Madras was perhaps the chief one"

The Illustrated weekly of India— June 11,1939 P (13)

ఇట్లు తెలుగువారల నౌకాజీవన మతి ప్రాచీనమైనదని తెలిసికొననగును.

**S. 5—1—35 వ్రాఁతప్రతి ఓరియంటల్ లైబ్రరీ 12 వ పుట.**

సీ. పంజారఁగర్పూరపాదపంబులుదెచ్చె।
జలనొంగి బంగారుమొలకఁదెచ్చె।
సింహళంబునగంధసింధురంబులఁదెచ్చె।
హురుమంజి బలుతేజిహరులఁదెచ్చె।
గోవసంశుద్ధసంకుమదద్రవము దెచ్చె।
నాపగట్టాణి ముత్యాలుదెచ్చె।
భోటగస్తూరికా................దెచ్చె।
జీనిఁజీనాంబరశ్రేణిదెచ్చె।

గీ. జగదగోపాలరాయ వేశ్యాభుజంగ
పల్లవాదిత్య భూదాన పరశురామ
కొమరగిరిరాజ దేవేంద్రకూర్మిహితుఁడు
జాణజగజెట్టి దేవయచామిసెట్టి.

మ. తరుణాశీరితవాయి గోవరమణాస్థానంబులం జందనా
గరుకర్పూరహిమాంబు కుంకుమరజః కస్తూరికాద్రవ్యముల్
శరధిం గప్పలిజోఁగుప (వ) ల్లివలికాసమ్మాన్లఁదప్పించునే
వ్వరియైవెశ్యకులోత్తముం డవచిలిప్ప ండల్పుఁడే యిమ్మహిన్.

ఈ ప్రతిలోనే పీఠికలో నెం 7 రు వచనములో 'జలనోగి' కి బదులుగా 'జోణంగి' యని కూడఁ గలదు.

R. 104 — ప్రాతవ్రాతపతి.

పంజారం గప్పూర్వర పాదపంబుల్ దెచ్చె
జలనోంగ్గి బంగ్గారుమొలక దెచ్చె
సింహళంబ్బు............ంధురంబ్బులం దెచ్చె
హరుముంజి బలుత్తేజి హరులం దెచ్చె
గోవ సంశుద్ధసంకుమదద్రము దెచ్చె
యాంప గట్టాణి ముత్యంబుదెచ్చె
బోటు గస్తూరికా...........లు దెచ్చె
చీనించీ నాంబరశ్రేణి దెచ్చె

గీ. ........................

మ. తరుణా శ్రీరి తవాయి గోవరమణా స్థానంబులం జందనా
గరుకర్పూరహిమాంబు కుంకుమరజఃకస్తూరికా ద్రవ్యముల్
శరధిం గప్పలి జోంగువల్లివలి (లె) కాసమ్మాన్లదప్పించునే
స్ఫూర్తిమై వైశ్యకులోత్తముం డవచితిప్పం డల్పుడే యిమ్మహిన్.

మొదటి పద్యము మొదటి చరణములో 'బంగారు' నకు బదులుగాఁ 'బన్నీ' రని కూడ నుండనగునని 12 బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు తలఁచుచున్నారు. తిప్పయనౌకా స్థానములఁగూర్చి ప్రశంసింపఁబడిన పద్యములు మఱికొన్నిటి నీదిగువ నుదహరించుచున్నాను.

గీ. పండువాఢిల్లిరాఢాదిపట్టణముల
యధిపతులు మాళిఁదాల్చురత్నాంకురమ్ము
లవచితిప్పురాంతకా నీతయానపాత్రి
సింహళద్వీపమండిత క్షేత్రజములు.

శా. వ్యాపారిప్రవరాన్వవాయ గణనీయప్రౌఢిగంభీరస
ల్లాపానందిత విశ్వ! విశ్వభువనాలంకార! లంకాదిక
ద్వీపానీతసువస్తు తర్పితసమాధేయాఖిలక్ష్మాప! వి
ద్యాపాండిత్యవివేక! నిత్యకృతకృత్యా! బంధుచింతామణీ!

శా. శంకాతంకవిహీన విక్రమకలాసాకల్యవిజ్ఞాన! సా
హంకారోరు వివేకవిక్రమ! సురాహారాహితస్ఫూర్తిని
స్సంకాశోజ్జ్వలకీర్తివిభ్రమ! మహాసంకల్పకల్పద్రుమా!
లంకాశంకరశైల మధ్యవసుధాలంకార భవ్యక్రమా.

---

12 పూర్వప్రకటితములగు హరవిలాసములలో లేని యీ క్రొత్తవిషయములను మొదటఁ గనుఁగొన్నవారు శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు. ఇంకను వారిచేఁ బరిష్కరింపఁబడిన హరవిలాస మచ్చుపడక పూర్వమే వారు నాకీవిషయములను దెలిపినారు. అటుపైని శ్రీ వడ్డాది అప్పారావుగారు ఓరియంటల్ లైబ్రరీలోని మూలపాఠములను వ్రాసికొనివచ్చి నాకు దయచేసినారు. పైపట్టణములలో 'పంజార' యనునది 'కాంబోడియా' దేశములోనిదని శ్రీమల్లంపల్లి సోమశేఖరశర్మగారు గుర్తించినట్లుగా శాస్త్రిగారునాకు వ్రాసియున్నారు. ఇందులకీ ముప్వురకు నేను కృతజ్ఞుఁడను.

మాలిని. మృగమదఘనసారోన్మేలనా సంప్రయోగ
ప్రగుణితహిమపాతప్రౌఢ కేళీవిహారా !
యగురుఘుసృణ పంకవ్యాప్తిగంధాంబుగంధ
స్థగితదిగవకాశా ! దానవిద్యానిధీశా !

మాలిని. తిరుమలవిభు చామాధీశ్వరైకాగ్ర జన్మా !
పరమగురు సపర్యాప్రౌఢరామానుజన్మా !
చిరపరిచిత లంకాసింహళద్వీపభూమీ !
సరసిరుహ భవ్యోరుస్తంభగోత్రాగ్రగామీ !

కం॥ ఆపుణ్యశ్లోకునకును మాపతి పాదారవిందమధుకరమునకున్
ద్వీపాంతరమండలి కాభూపాలక మాననీయపురుషార్థునకున్.

ఈ పై పద్యములం దుదాహృతము లయిన యాయా స్థానములను గుర్తించినచో నవచి తిప్పయ వ్యాపారయానపాత్రము లెంతమేర సముద్రమునఁ గ్రుమ్మఱుచుండెనో తేట తెల్లముగాఁ గలదు.

<u>పంజాబు</u>:—ఉత్తరహిందూస్థానమునందలి యొకపెద్ద రాష్ట్రము. హిమశైలానీతధాతు ద్రవ్యములు, సుగంధపు దినుసులు, మున్నగునవి యిచ్చట లభించును. సింధునదీ ముఖ ద్వారమున నోడలులోనికిఁ బ్రవేశింపవచ్చును.

బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు హరవిలాస పీఠికా పద్యమునఁ 'పంజాబు' నకు బదులుగా 'పంజార' యను పాఠమే గ్రహించిరి. శ్రీసోమశేఖరశర్మగారు 'పంజార' యను పట్టణము కాంబోడియా దేశమున గుర్తించినారని శాస్త్రిగారు నాకు వ్రాసియున్నారు. కాంబోడియా దేశమున నేటివరకును శాలివాహనశకమునే వాడుచున్నారు. దీనిఁబట్టి యాంధ్రులీదేశముతోఁ బ్రాచీనకాలమునుండియు సంబంధముగలవా రని తెలియుచున్నది. కాని కాంబోడియాదేశమునఁ 'బంజార' యను పట్టణమున్నట్లు నాకు గోచరింపలేదు. 'పంజార' కర్పూర పాదరసములకుఁ బ్రసిద్ధివహించి యుండినట్లుగా పద్యపాదము వలన మనకుఁ దెలియుచున్నది. కాంబోడియాదేశమునఁ గర్పూర పాదరసము లున్నట్లు గ్రంథ గ్రంథేతర సాక్ష్యములేవియుఁ గాన్పించుటలేదు. ఇంతియుకాక హరవిలాస పద్యోదాహృతమైన యీ కర్పూర పాదరసములు శర్మగారు తలంచినట్లుగాఁ గాంబోడియా దేశములోనివి కావేమో యని కూడ సందేహము గలుగుచున్నది. ఈ క్రింది పద్యముల జూడుడు.

శా॥ ఆయావేళల మానిభార్యలు గృహవ్యాపార లీలాభవ
త్కాయక్లేశములు జగింతురు లసత్కర్పూర రంభాతరు
ఛ్ఛాయా శీతలచంద్రకాంత మణిపాషాణప్రదేశంబులన్
వాయుప్రేరణఁ బచ్చకప్పురముపై వర్షింపఁ గ్కానలోన్.

హరవిలాసము. ఆ 5 ప 36.

సీ. పొరలెత్తి ఘనసార తరువులఁ దనుఁదాన
తొరగిన పచ్చకప్పురపు సిరము

మనుచరిత్రము. ఆ 2. ప. 55.

పై రెండు పద్యము లాయాకావ్యములలో హిమవన్నగము వర్ణించుఘట్టములలోనివి. దీనివలన నాయా కావ్యరచనా కాలములందు హిమవన్నగ ప్రాంతములలో ఘనసార తరువులు, విశేషముగా నుత్పత్తి యగుచుండెనని యూహించుటకుఁ బ్రబలమగు నవకాశములు లభించుచున్నవి. కావున ఘనసారోత్పత్తి కెన్నఁడును ప్రసక్తిలేని కాంబోడియాదేశముకంటె నాపదము హిమవత్పర్వతపాదశాయి యగు పంజాబునకే వర్తించునట్లుగఁ దలచుట సమంజసముగా నుండునని నాయభిప్రాయము. సుమత్రాద్వీపమునఁ గూడ కర్పూరపు చెట్లు విరివిగాఁ బెరుగును. ఈ పట్టణమక్కడిదైనను గావచ్చును.

జలనోగి లేక జోణంగి :—ఇది సుమాత్రాద్వీపమునందలి "పలెంబంగ్" అని నేనూహించుచున్నాను. "జలనోగి బంగారు మొలకఁదెచ్చి" యని పద్యపాదమున నున్నది. అన్యదేశములనుండి దిగుమతియగు నినుపగిల్లు సామానులను దేశాంతర్భాగములనుండి బంగారు సిరమును తెచ్చి యిచ్చి తద్ద్వీపవాసులు విలిచికొనిపోవుచుందురని చరిత్రజ్ఞులు వ్రాయుచున్నారు. 13 అవచి తిప్పయసెట్టి యాంధ్రదేశమునఁ దయారయ్యెడి లోహశిల్పసామగ్రి నీతీరుగ విక్రయించి బంగారు మొలకలను దెచ్చుచుండెడివాఁ డని యూహింపవచ్చును.

---

13. "Indigo, saltpetre, sulphur, arsenic, brazil-wood the bread-friut tree, pepper, cassia, camphor, benzoin, coffee, cotton, cabbage-tree and the silk cotton tree are the produce of Sumatra and the forests contain, many valuable species of wood. Tin, iron, copper and lead are found but the mines are not worked so as to render them productive. Gold dust is brought from the interior to the sea-coast where it is bartered for iron tools and other articles of European manufacture" Universal Gazetteer Page 977.

3. సింహళము:—మన్నారుజలసంధిచే హిందూదేశమునుండి వేఱుచేయఁబడి దక్షిణ భాగముననున్న పెద్దద్వీపము. ఇది నానావిధజంతు సంతానమునకును నందును మదపుటేన్గులకు మిక్కిలిగను బ్రసిద్ధివహించిన ద్వీపము. 14 "సింహళంబున గంధసింధురంబులఁదెచ్చె" నని పద్యపాదమున నున్నది. మహావిల్ల గంగయను గొప్ప నదీ ముఖద్వారమున నౌకలులోనికిఁ బ్రవేశింపనగును.

4. ఆంప లేక జాఫ్నా:—సింహళద్వీపమునఁ గల రేవుపట్టణములు. అవచివారి యోడ లిచ్చటినుండి యాణిముత్యాలు గొంపోయెడివి. సింహళద్వీపమున ముత్యము లుత్పన్నమగు చుండెననుట కనేక తార్కాణములు గలవు. 15 ప్రాచీనకాలమునుండియు సింహళము సుమ త్రా జావా బోర్నియో మున్నగు ద్వీపములతో నాంధ్రవర్తకులు వాణిజ్యము గావించిరనుట కనేక తార్కాణము లున్నవి. సుప్రసిద్ధ విదేశయాత్రికుఁడైన ఫాహియాను హిందూదేశము నుండి సింహళము మీఁదుగా సముద్రమార్గమునఁ జీనాదేశమునకుఁ బ్రయాణము చేయుచు మార్గమధ్యముననున్న జావాద్వీపమున హిందువులను విశేషముగఁ జూచితిననియుఁ, దానెక్కిన యోడనడపినది కూడ బ్రాహ్మణులే యనియు, నొకప్పుడు తుపాను రాగా వారందఱు నాశ్రమణికుఁడా యోడపైనుండుటచే వారావిపత్తునకుఁ బాల్పడవలసివచ్చినదని చింతించి యాతని మార్గమధ్యమున దింపివైచి వెడలిపోవుట కుద్యమించి రనియు వ్రాసియున్నాఁడు.

5. "హురుమంజి బలు తేజి హయులఁదెచ్చె"—పారశీకదేశములోని 'ఆర్మజ్' పట్టణ మనియు, బర్మాదేశము నందలి "హార్మంజి" పట్టణమనియు, నీహురుమంజిని రెండు విధము లుగా గుర్తింపవచ్చును. రెండువిధములుగా నిరూపించుటకును, సమాన బలముగల కారణము లున్నవి. మొదట "నార్మజ్" అని గుర్తించుటకుఁగల కారణముల వివరింతును.

---

14. "Of the animal tribes, this island is famous for its elephants, which are more esteemed than any others in India" Universal Gazetteer Page 488.

15. "The kingdom is on a large island extending from East to West fifty zozanas and from North to South thirty. Left and right from it there are as many as 100 small islands distant from one another ten or twenty le, but all subject to the large island. Most of them produce pearls and precious stones of various kinds. There is one which produces the pure and brilliant pearl—an island which would form a square of about ten le. The king employs men to watch and protect it, and requires three out of every ten such pearls which the collectors find—called the Mani pearl or bead. Mani is explained as meaning "free from stain". It is a symbol of Buddha and of his Law. The most valuable rosaries are made of Manies—

Fahien's travels-translated by James Legge-Page 101.

పారశీక దేశ ముత్తమాశ్వములకుఁ బ్రసిద్ధి వహించినది. ఆ దేశమునుండి హిందూ దేశమునకు గుఱ్ఱములు పంపబడుచుండెనని పూర్వము హిందూ దేశమును సందర్శించి పోయిన రాయబారులు, యాత్రికులు వ్రాసియున్నారు. 15 వ శతాబ్దమున విజయనగర చక్రవర్తుల కడకుఁ బారశీక చక్రవర్తిచే రాయబారిగాఁ బంపఁబడిన యబ్దుల్‌రజాక్ తన "మత్లాస్—ఉస్—సఅయిదన్' అను చరిత్రగ్రంథమున నిట్లు వ్రాసియున్నాఁడు.

"హార్మజు ఆ రాజ్యమునకు ముఖ్యనగరము. అది గొప్ప రేవు పట్టణము. దానికి జెరూన్ అని మఱియొక పేరుగలదు. నేనీనగరమున హిందూ దేశ ప్రయాణమునకుఁ బూర్వము రెండు మాసములుండవలసి వచ్చెను. నేను వ్యాపారినేమో యనియు, సుంకమీయక పారిపోవఁ దలఁచిన వాడనేమోయనియు రేవు సుంకాధికారులు నన్ను త్వరలో వెడలనీయక పరీక్షచేయ సాగిరి. నా పరివార మందుండిన గుఱ్ఱములను, మనుష్యలెక్క జోఁగులో నుంచవీలులేదని యాగుఱ్ఱముల నొకకప్పలియందును. నా పరివారమును మఱియొక యోడలోను నెక్కించిరి. ఆ రీతిగా రెండు నౌకలలో నేనును నా పరివారమును పయనమైతిమి.

మా యేలిక సుల్తానుషా—రుఖ్—ఖాకానీ—సయిద్ నృపాలుడు కళ్ళికోట నగరాధీశున కుత్తమాశ్వములను మేలైన జరీయంగీలును, కుళ్ళాయిలును మొదలైన యమూల్యములగు నుడుపులను సంవత్సరాది పండుగునాఁడు కానుకగాఁ బంపెను."

విదేశయాత్రికులు—ప్రాచీనాంధ్రదేశము. పుటలు 136—141.

"వనాయుజాః పారసీకాః కాంబోజాః బాహ్లికాహ్వయాః" అని యమరమున పారసీక దేశమునుండి దిగుమతియగు హయములకుఁ బ్రత్యేక నామ మీయఁబడినది. ఇత్యాది కారణములచే పారసీక దేశమునుండి గుఱ్ఱములు భారతదేశమునకు దిగుమతియగుచుండె ననియును,

---

పద్యపాదములోని 'యావగ' యను పూర్వపాఠమును గ్రహించి నది యని యర్థము జేసికొని దానిని శుక్తిమతీనదియని భావరాజు కృష్ణరావుగారు తమ ప్రాచీనాంధ్ర నౌకాజీవనములో నిరూపించియున్నారు. కాని మూలపాఠము భిన్నముగా నుండుటచేతను, శుక్తిమతిలోని శుక్తిత్వము కవిసంప్రదాయ బద్ధమును, కేవలపురాణాత్మకము నగుటఁజేసియు నావాదము సరిగాదని తోఁచుచున్నది. 'కట్టాణి' శబ్దములోని వర్తులత్వము, స్వచ్ఛత్వము, పాహియాను చేసిన 'మణి' శబ్దవ్యాఖ్యానమునకు సరిపోవుచున్నది. వీనిఁబట్టి చూచినను 'యాంపవ జాఫ్నా'రేవే నని తలఁచుటకు మఱింత బలీయమగు కారణమేర్పడుచున్నది.

తద్దేశమున ముఖ్యమగు రేవుపట్టణమైన "యార్మ్మజ్" హారవిలాసమునందలి "హురుమంజి" యనియు నూహింపవచ్చును. ఇంతియేకాక హురుముంజి శ్రీనాథుడు నాతని తరువాతి కవులును ముత్యములకుఁ గుఱ్ఱపుజీనులకుఁ గూడ బ్రసిద్ధివహించిన స్థానముగాఁ దమతమ గ్రంథములందుఁ బేర్కొనియున్నారు. 16 కావున మనము నిరూపింపఁబోవు పట్టణముగూడ ముత్యములు, కళ్ళెములు జీనులు, మున్నగు గుఱ్ఱపు సామానులకుఁ బ్రసిద్ధి వహించియే యుండవలయును. "ఆర్మజ్" పారశీకసింధుశాఖయొడ్డున నున్న రేవుపట్టణము. ఆసింధుశాఖలో ముత్యము లతివేలముగా నుత్పత్తి యగుచున్నవని చరిత్రజ్ఞులు వ్రాయుచున్నారు. పారశీక దేశము తోలుపనులకుఁ గూడ మిక్కిలి ప్రసిద్ధి వహించియున్నది. ఈ కారణములఁబట్టి హారవిలాసమునందలి "హురుమంజి" "ఆర్మ్మజ్" గావచ్చును.

కాని బర్మాదేశములోని "హార్మంజ్" యను రేవుపట్టణముగూడ నిన్నిలక్షణములను గలిగియుండుటేకాక "యూర్మ్మజ్" లో లేనియనునాసికసంజ్ఞ నెక్కువగాఁ గలిగియున్నది. హారమంజి టేవాయినదీతీరమున బంగాళాఖాతమునకుఁ దూర్పుభాగమున టెనెస్సెరిమ్ రాష్ట్రమునమున్న యొక రేవు పట్టణము.

---

16 సీ॥ పొలుపొందగ విభూతి బొట్టు నెన్నొసలిపైఁ దళుకొత్తుచెమట తుత్తలవడంగ
సొగసుగాఁ బూదండ జొంపిన కీల్గొప్పు జారుఁగా నొకచేత సరుదుకొనగ
బిగిచన్నుఁగవమీద బిరుసువయ్యెదచెంగు దిగజారి శివసూత్రి మగువడంగ
ముక్కున హురుముంజిముత్యాల ముంగర కమ్మవాతెఱమీద గంతులిడఁగ
కొనుజవ్వాడ మెట్టియల్ గదిసి మ్రోయఁగమ్మవిలుకాని జాళువా బొమ్మయనఁగ
మెల్లమెల్లన సింహాద్రిమీఁదికేగె కన్నెపూఁబోడి యగసాలెవన్నెలాడి.

శ్రీనాథుని చాటువు.

సీ॥ పచ్చని హురుముంజి పనివాగె పక్కెర, పారసీపల్లంబు పట్టమయము
రాణమొప్పారు పైఠాణంబు సింగిణి, తళుకుల కోరల తరకసంబు
మిహపసిండి పరుంజు మొహదా కెలంకుల తావుగుజ్జరి సేత కేవడంబు
డాకెలంకులసిరాజీకరా చురకత్తి కుఱుగట గ్రొవ్వాడి గొరకలపొది
పీలికుంచెతలాటంబు బేరజంబు, పణుల మొగముట్టి వన్నెసాహిణి యొకండు
కర్త యెదుటికిఁ గొనివచ్చె గంధవాహబాంధవంబగు నొకమహాసైంధవంబు

మను. ఆ 4 ప 28.

ఇందు బేర్కొనఁబడిన దేశములనుండి యాయావస్తువులు దక్షిణభారతమున దిగుమతియయ్యెడివి. హురుమంజి:—కళ్ళెములు — సిరాజీ— కత్తులు—పారసి (పారశీకము)—పట్టగంతలు; పైఠాణము—ధనుస్సులు, బాణములు గుజ్జరి (గుజరాతి) కత్తులకు, బాయురంగులు— సింధుదేశము —గుఱ్ఱములు.

ఈ పట్టణప్రాంతములందు పూర్వము కొన్ని యడవిజాతి గుఱ్ఱముల యస్థిపంజర భాగములు దొరకెననియు, నవి మంగోలియా దేశములో దొరకిన వనియుఁ బ్రపంచచరిత్రజ్ఞులు వ్రాసియున్నారు. పూర్వాంధ్రరాజులకుఁ బెంకెగుఱ్ఱములను లోఁగఁదీయుట వేడుకగ నుండెడిది. అంతియేకాక యావేడ్కను వారి బిరుదచిహ్నములలో నొకఁటిగాఁ బ్రకటించుకొనియున్నారు గూడను. 17 ఈ యుత్సాహము దీర్చుకొనుటకై యన్యదేశములనుండి యాంధ్రరాజులు పెంకెగుఱ్ఱములను దెప్పించుకొనుచుండిరని తెలియుచున్నది. ఇట్టి విషమహయములకేకాక బర్మాదేశము ప్రసిద్ధములగు నితరజాతి గుఱ్ఱములకుఁగూడఁ బేర్వడసియున్నది. అచ్చటి "షాను" జాతివారలు మేలురకపు పోనీలను బెంచుచుందురు.18 బర్మాతీరములందు నాణెముత్తెముల నుత్పత్తిచేయు రేవులుకూడఁ జాలనున్నవి. 19 ఈ కారణములబట్టి, "హురుముంజి" బర్మాదేశములోని "హర్మంజి" కూడఁ గావచ్చునని సందియము గల్గుచున్నది. కృష్ణస్వామిఅయ్యంగారు, సుబ్రహ్మణ్యఅయ్యరుగారు, భావరాజు కృష్ణరావుగారు మొదలగు పరిశోధకులు దీనిని పారశీకదేశమునందలి "యార్మజ్" నగరముగనే గ్రహించినారు. బర్మాదేశముతో నాంధ్రులు చిరకాలమునుండి వర్తకము సాగించుచుండి యున్నట్లనేక ప్రమాణము లున్నవి. పూర్వమునఁగల రామిత్రయను ద్వీపమున సముద్రపుటొడ్డున నిసుకలోఁ గూరుకొనిపోయిన యొకయోడలోఁ గొన్ని యాంధ్రనాణెములు లభించెను. వానిలోఁగొన్ని చాళుక్యరాజులలోఁ బ్రసిద్ధుఁడగు శక్తివర్మవిగను, మఱికొన్ని యాతని కుమారుఁడగు రాజరాజనరేంద్రునివిగను గన్పట్టెను. 12, 13, 14 శతాబ్దములలో దక్షిణభారతదేశమునఁ దూర్పుతీరము ముత్యముల నేరుటకును బడమటి తీరమోడ దొంగలకును ప్రసిద్ధి వహించి

17 "స్వస్తిశ్రీ మన్మహామండలేశ్వర బాహాత్తరిని రోగాధిపతి ...............వీరావతార, అతివిషమహయారూఢ ప్రౌఢరేఖావంత" అలువలపాటి ఆంజనేయస్వామి యాలయశాసనము—త్రిపురారి దేవ మహారాజునుగూర్చి వాడఁబడినది.

Nellore Inscriptions Part I P. P. 283.

18. "The shans produce the finest breed of ponies known in any part of the Indian Empire".

Geography of India, Burmah & Ceylon by Henry F. Blandford P. P. 197.

19. The pearl oyster fishery is carried on in the Aru islands, Burma, the Persian Gulf, the Red Sea, Ceylon, along the coasts of North Queensland, North Eastern Australia and of West Australia, at New Guinea, and Pearl islands, on the Bay of Panama.

Page 844 of The New International Encyclopædia Vol. XIII.

యుండెను. తూర్పుతీరమునఁగల యాంధ్రమండలము బర్మాపడమటి తీరముతో ముత్యముల వర్తకము విశేషముగా సాగించుచుండెను. ఈకారణములఁబట్టి "హురుముంజి" బర్మాదేశము నందలి "హర్మంజి" కూడఁ గావచ్చునని నేనూహించుచున్నాను.

6. గోవ:—కొంకణతీరమునఁగల పోర్చుగీసువారికిఁ జెందిన యొక పెద్దరేవుపట్టణము. ఇచ్చట సంకుమదము మున్నగు సుగంధద్రవ్యములు దొరకుచున్నట్లు శ్రీనాథుడేకాక తదితర కవయిత్రులుగూడ వర్ణించియున్నారు.[20]

7. బోటె లేక బోట:—భూటాన్ భారతదేశమున నుత్తరభాగమున నేపాల దేశము సమీపమున నున్నది. ఇచ్చట దొరకెడి రీతిగాఁ గస్తూరిమృగము లింకెచ్చటను దొరకవు. కస్తూరికాపుటకోశముల నవచి తిప్పయ యిచ్చటనుండి దిగుమతి చేసికొనెడువాఁడు.

8. చీని లేక చైనా:—చైనా సుగంధద్రవ్యములకును సన్ననేతపరిశ్రమకును నాఁడే గాక నేఁడును బ్రసిద్ధివహించియున్నది. ఇచ్చటనుండి యవచివారి యోడలు చీనాంబరములఁ గొంపోయెడివి.

9. తరుణా:—పారశీకదేశపు రాజధానియగు టెహెరాన్. సుగంధపు దినుసులలో వర్తకముచేయు నత్తరు సాహేబు లింకుచాలమంది నివాసముచేయుచుందురు. ఇచ్చటనుండియే యందగత్తెలగు బానిసలను, పారశీక యువతులను గూడఁ గొనితెచ్చి యవచి తిప్పయ్యసెట్టి కొమరగిరిరెడ్డికి గాణిక్యముగా సమర్పించుచుండువాడు.

10. శీరి:—సిరియా—ఇది ఆసియాలోని టర్కీదేశమునఁగల యొక పెద్ద రాష్ట్రము. పట్టు, ఘాది, ఉన్నినేత పరిశ్రమలకుఁ, బరిమళ ద్రవ్యములకుఁ బ్రసిద్ధి వహించినది.

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు "తరుణాశీరి" యను దాని నేకపదముగా గ్రహించి దానిని బర్మాదేశములోని టెనెస్సిరిమ్ రాష్ట్రముగా నిరూపించినారు. కాని బర్మాదేశములోని యారాష్ట్రము లోనివే యగు వర్తకస్థానము లనేకములఁ జెప్పి తిరిగి చర్వితచర్వణముగా శ్రీనాథుఁడు దానినే స్థూలముగాఁ బ్రవచించెననుట నాకంత సమంజసముగాఁ దోఁచుటలేదు.

20 విరులుంచెనొకరామ వివరించిపన్నీటఁ, బదరిచ్చి గోవ జవ్వాజిఁ జమిరి.

ముద్దుపళని

రాధికాసాంత్వనము ఆ 1 ప 88

11. తవాయి:—బంగాళాఖాతమునకుఁ దూర్పుభాగమున నున్న యొక రేవుపట్టణము. టేవాయినదీ ముఖమున దీనిఁజేరనగును. ఇచ్చటకిఁ జేరుటకు మార్గమైన బంగాళాఖాతము తుపానులతోను సముద్రోపద్రవములతోను నిండియుండును.

12. రమణ:—బంగాళాదేశము నందలి డక్కా యను పట్టణసమీపమున 'రమ్నా' నుండి యుండవచ్చునని యూహించుచున్నాను. 'రమణ' యను ప్రాంతగ్రామమొకటి డక్కాలోఁ గలదు. డక్కా సన్ననేత పరిశ్రమకుఁ బ్రసిద్ధివహించినది. ఇతరులు దీనిని బర్మాతీరమునఁగల రామ్రీయను ద్వీపమై యుండవచ్చునని తలఁచుచున్నారు.

13. పండువా:—పాడ్యువా. హుగ్లీతీరమునఁగల పెద్దపట్టణము. బౌద్ధయుగమున నిదియొక పెద్దవర్తక స్థానమని పేర్వడసెను.

14. రాఘు:—బొంబాయి రాజధానిలోఁ గాంబేయఖాతమున కనతి దూరమున "రాఘు" అను పేరుగల పట్టణమొకటి కలదు. రసపుత్రస్థానమున నీపేరుగల పట్టణములు కొన్నికలవు. హరవిలాసమందలి రాఘు వీనిలో నేదియో యొక్కటై యుండనగును.

15. ఢిల్లీ:—సుప్రసిద్ధము.

అవచి తిప్పయ్యసెట్టి యానపాత్రము లేయే రేవుపట్టణములకును దేశములకును బ్రయాణించెడివో వాని చరిత్రము క్లుప్తముగాఁ వివరింపఁబడినది. ఇంకొక్క యంతర్దృష్టాంతముతో నంధ్రజాతి యన్యజాతులపైని వ్యాపారరీత్యా విడచిపెట్టిన శాశ్వతమైన నాగరకముద్ర లెంత ప్రభావవంతములైనవో మనకుఁ దెలియఁగలదు.

రెండు దేశముల వ్యుత్పత్తి ప్రవాహము లొకదానితో నొకటి, వ్యాపారము వలనగాని, జయపరాజయముల వలనగాని, సంఘర్షణము నొందినప్పుడు, వారి యాచారవ్యవహారములలోను భాషాపరివర్తనములందును, తదితర మతసాంఘిక వ్యాపృతులందును పరస్పరముగా ననేక రీతులుగా వినిమయము జరుగుచుండును. ఈ కుండమార్పు లన్నింటిలోను భాషాప్రచార మతి ముఖ్యమైనది. ఆంధ్రదేశ మన్యదేశములతో నౌకావ్యాపారము జరపిన కారణమున ననేక భాషలలో నౌకాజీవన పరిభాషలు మన భాషలోఁ ప్రవేశించినవి. ఆంధ్రుల నౌకావ్యాపారము క్షీణించిన కొలఁది నాపరిభాష లొక్కొక్కటే భాషలోనుండి భ్రష్టములై పోయినవి. నేఁడొక్కటియు నట్టిది కానరాదు. ఇటీవల సుప్రసిద్ధాంధ్ర పరిశోధకులగు చిలుకూరి నారాయణరావుగారతి ప్రయాసమున నట్టి పదముల సేకరించి యొకచోఁ

బ్రకటించి యున్నారు. వాని చరిత్రము నరసినచో నాంధ్రదేశ మెన్నెన్ని సముద్రాంత దేశ ములతోఁ బూర్వము వర్తకము సాగించెనో మనకుఁ దెలియఁగలదు. వాని నన్నింటి నిక్కడఁ బరిశోధించుట నతివిస్తరమగును గావున హరవిలాసమున దొరకిన కొన్నిపదములకు మాత్రమే దిఙ్మాత్రముగా వ్యాఖ్యానము గావించెదను.

(1) కప్పలిజోఁగు:—జావాదేశపు భాషలో మనుష్యులెక్కు నోడకు "జోంగ్" అని పేరు. జావాదేశము లవంగములు, జాపత్రి మున్నగు పరిమళ ద్రవ్యములకుఁ బేర్వడసి చిర కాలమునుండి యాంధ్రవర్తకుల యాత్రాయాత వ్యాపారముల కాకరమై యుండుటఁజేసి కాల క్రమమున "జోంగ్" "జోఁగు" గా మారి తెలుఁగులో మనుష్యులఁ గొంపోవు నౌకయని యర్థమిచ్చు పదమయ్యెను. గుఱ్ఱములు ఏనుఁగులు మున్నగు జంతువులను, సరకులను గొంపోవు నోడకుఁ గప్పలియని పేరు.

(2) చీనాంబరము:—సన్నని రవసెల్లాల నేతకు హిందూదేశము వలెనే చీనాదేశమును నెన్నికఁ గాంచినది. అచ్చటినుండి మంచు తెరలవంటి పట్టునూలు పావడలను గొని తెచ్చి హెచ్చు ధరలకమ్మి వర్తకులు లాభముఁ జేసికొనుచుండువారు. చీనిచీనాంబరము లనగా మనభాషలో సన్నని బట్టలనుటకుఁ బర్యాయపదమైనది. దీనినిఁబట్టి యనాదినుండియు చైనాదేశముతో నాంధ్రులు పట్టువస్త్రముల వ్యాపారము విశేషముగ సలుపుచుండిరని తెలియనగును.

(3) ఖుషి, సామాన్, సురథాణ:—ఈ మూడును నుర్దూభాషలోని పదములు. నిరంతము నరబ్బీపారశీక దేశములతోను భారతవర్షమునఁగల తదితర తురుష్క రాజ్యముల తోను వ్యాపారసంబంధము గల్గియుండుటచే నాయా వస్తువులతోఁ జాటీపదములు గూడ మన భాషలోనికి దిగుమతియయ్యెను.

(4) తవాయి:—సముద్రోపద్రవము—తవాయితీరమును జేరు మార్గము సము ద్రోపద్రవ భూయిష్ఠమైనది. పూర్వము తుపానులు గాలివానలకు వాడఁబడుచుండిన యీమాట యిప్పుడు చిన్నచిన్న కలహములకు, హానికరములగు పనులకు వాడఁబడుచున్నది.

(5) దేహరము:—ఇది యొక హిందీపదము. జైనుల దేవాలయము లేక హిందువుల దేవాలయమని దీని యర్థము. పూర్వము హరవిలాసమును ముద్రింపించిన పరిష్కర్తలు దీని నర్థము లేని పదముగా భావించి, "దీనిధిసెట్టినంబి తన దేహరమం" దనుటకు బదులుగా "దేహమునందని" దిద్దివైచినారు. కొండొకచోఁ గాశీఖండమునఁగూడ నీపదమును శ్రీనాథుఁ

డుపయోగించినాఁడు, హిందీభాష మాట్లాడు ప్రాంతములతో సంబంధముఁ గలిగియుండుట చేతనే మనకీపదము లభించినది.

ఇట్లే యింకను బెక్కుమాటలు కాలక్రమమున వ్యాపారసంబంధమున నన్యభాషల నుండి యాంధ్రభాషలోఁ బ్రవేశించి యిల్లు గట్టుకొనెను. వానిని మహాకవులుగూడఁ బ్రయోగించి యున్నారు. అట్లే దక్షిణభారత భాషలలోని పదములును హీబ్రూ మొదలైన భాషలలోనికి వాణిజ్య సంబంధమునఁ బ్రవేశించెను. సువర్ణభూమిలోని యనేక భాషల లిపులకును బూర్వాంధ్ర భాషాలిపికిని నత్యంత సాదృశ్యమున్నది. పూర్వాంధ్ర వర్తకులే మన లిపి నాయాదేశముల బ్రవేశపెట్టిరని చరిత్రజ్ఞులు విశ్వసించుచున్నారు. ఇన్ని యన్య భాషాపదములు మనభాషలోను, మనభాషలోని పదము లన్యభాషలలోను, సామాన్య పదములుగా నాఁటికే నైపోయినవన్నచో, నావిధముగా నొక్కొక పదము భాషలో స్థిర స్థాన మాక్రమించుకొనుట కెన్నెన్ని యేండ్ల చరిత్ర మనుభవించెనో దానిఁబట్టి యెన్ని యేండ్లుగా నిట్లెడతెగని వర్తక మాంధ్రు లన్యదేశములతోఁ జేయుచుండిరో యూహింప నగును. శ్రీనాథుఁడు, ఎఱ్ఱాప్రెగ్గడ, మున్నగు నాకాలపుఁ గవుల కావ్యములందును నౌకా యానమునుండి గ్రహించిన పోలికల నతివేలముగా నుపయోగించి యున్నారు. ఆకాలమున రెడ్డిరాజులు ద్వీపాంతర వాణిజ్య వ్యవహారముల పైని విధింపఁదగిన శుల్క మర్యాదలఁ గూర్చి వేయించిన శాసనములుగూడ మనకు లభించినవి. సాగరుఁడు వారికి కరదుఁ డనగాఁ బన్నుల నొసఁగువాఁ డయ్యెనని ప్రశంసింపఁబడినది.[20]

20. ఉ॥ కవి కవితాబ్ధిలోన ముఖ గహ్వర మోడయు జిహ్వ త్రెడ్డు హృ
త్పవనుఁడు పీలికాఁడు మృదుభాషలు రత్నము ............
............మాత్మ వర్తకుని కైవడి నీకు విశేష సత్కృతుల్
గవయఁగ నిచ్చె నీవలనఁ గావ్య సుఖ స్థితు లిచ్చుఁ గావుతన్.

శివరా. ఆ 1 ప 6.

మార్తాండుండు కొండప్రక్కం జిక్కి కడలి మొగ యక్కలిం దగులువడిన జోగునుం బోలె నెదురు నడవ మరలం బఱవలేక చీకాకువడియున్నవాఁడు.

కాశీ. ఆ 2. 98.

ఇట్లు పూర్వాంధ్రుల నిత్యజీవితమందు నౌకాయానమొక మహాస్థాన మాక్రమించుకొని యుండెను. అంతియేకాదు, అది కవీంద్రుల కుపమానముల నొసంగునంతటి యుచ్చదశ యందుఁ గూడ నుండెను. ఇట్టి నౌకాజీవన చరిత్రమునకెల్ల నాకాశదీపమువలె శ్రీనాథుని పుణ్యమా యని, యాంధ్రుల హృదయములందు మినుకు మినుకు మనుచున్న యవచి తిప్పయసెట్టిని గుఱించి యాంధ్రలోకమెల్ల గర్వింపవలసియున్నది. తిప్పయ నాలుగురాజ్యముల రాజులను వశంవదులనుగాఁ జేసికొని చక్రముఁ ద్రిప్పిన మహాచారిత్రిక వ్యక్తి. ఆతని యోడలు వివిధ ద్వీపాంతరములనుండి కప్పురపుఁ దిప్పలతోఁ బాటు ధనరాసులఁగూడఁ ద్రవ్వుకొనివచ్చి యాంధ్రదేశమున విరియఁ జల్లుచుండెను. ఆతని నౌకల యాతాయాత వ్యాపారములచే పూర్వమెన్నడో కాకతీయులనాఁడును నంతకుఁ బూర్వమును తెలంగాణమున నౌకాస్థానమైయుండి కాలవశమున విస్మృతమైన మోసలపురము లేక మోటుపల్లి తిరిగి తల యెత్తి ప్రాముఖ్యము వహించెను. ఆతఁడు బర్మా పారశీకములనుండి కొని తెచ్చు గుఱ్ఱములు తిరునల్వేలి జిల్లాలోని కెయిల్ (కయాల్) రేవుపట్టణమున దిగుమతి యగుచుండెను, ఆతని కాలమున నాంధ్రనౌక లేడెన్ పట్టణమునకును నాఫ్రికా తీరముననున్న జాంజిబార్ ద్వీపమునకునుగూడఁ బోవుచుండెను.

---

చ॥ భవజలరాశి దాఁటునెడ భావజ వాయువు వీచినం దపః
ప్రవహణముల్ సమున్నతసుపర్వవధూకుచపర్వతాహతిం
బవిలిన దీనతావికలభావము నొందిన మౌనినావిక
ప్రవరుల భావచిత్రముల వ్రాసినవారు కపోత పాలికల్.

నైష. ఆ. 7 ప. 152.

ద్వీపాంతంబున నుండి వచ్చితివె భూదేవా?— క్రీడాభిరామము

కం॥ సకల ద్వీపాంతర ర
త్నకలాప నిరంతరార్చనాకలనారం
భక కురుమలూరి పుర నా
యక మల్లచమూ వరేణ్య హరి నివేద్యా. హరివంశము

'రత్నాకరనాయక' హరివంశము.

'కరదస్సాగర స్తస్య' (ప్రోలయ వేమారెడ్డిగార్చి)

South Indian Inscriptions Vol VI P. 112

సిడంబులునుడి వడ వెడలించి జడనిధిలో నడయాడుచుండిన యోడలతో వీడు
కోడాడు రథంబులును."

ఉ॥ హరివంశము. చ॥ ఆ॥ 213.

## తిప్పయసెట్టియానపాత్రములు.

సముద్రముపై నింతటి దూరప్రయాణములు గావింపఁ గలుగుటకుఁ దెలుఁగువారినౌకలతి బలిష్ఠములై యుండవలయును. అట్టి బలిష్ఠములగు నౌకలను నిర్మించుటకు గోదావరి జిల్లాలోని రాజమహేంద్రవరము ప్రాచీనకాలము నుండియు మిక్కిలి ప్రసిద్ధివహించి యుండెడిది. 13 వ శతాబ్దములో నాంధ్రు లుపయోగించు నౌకలనుగూర్చి మార్కోపోలో యిట్లు వ్రాసియున్నాడు. "ఆయోడలు మిక్కిలి పెద్దవిగ నుండెడివి. ఒక్కొక్క యోడను 150 మొదలు 300 వఱకును బనివాండ్రు నడపుచుండిరి. ఒక్కొక్కయోడయందు రమారమి 6 వేల మిరియపు బస్తాలను వేయుచుండిరి. పెద్దయోడలతో రెండు మూడు చిన్న నావలు గూడఁ బయనమై పోవుచుండెను. నేఁటి స్టీమర్ల వలెనే ప్రతినౌక ప్రక్కను నవసర సమయములం దుపయోగించుటకై 10 చిన్నపడవలను వ్రేలాడదీయుచుండిరి. పెద్ద నౌకలందు వర్తకుల యుపయోగార్థము 60 గదులవఱకును నిర్మింపఁ బడియుండెను. ఓడయొక్క లోపలి భాగము 13 భాగములుగా విభజింపఁబడి యొక కానునుండి మఱియొక కానులోనికి నీరు చొరకుండునట్లు దట్టమగు చెక్కలతో నమర్పఁబడి యుండెను. ఇట్టి కానులుండుటవలన నోడ యేభాగమునకైన దెబ్బ తగిలినప్పుడా భాగమొక్కటియే హానినొందును గాని యోడకంతటికి నపాయము వాటిల్లదు. ఇట్టి విశేషము లనేకములు మార్కోపోలో తన గ్రంథమున వ్రాసియున్నాఁడు." 21

14 వ శతాబ్దమున హిందూదేశమునుండి మహమ్మదు తుగ్లకుయొక్క రాయబారిగఁ జీనాదేశమున కరిగిన "ఇబన్ బటుటా" యనునాతఁడును, 15 వ శతాబ్దమునఁ జీనాదేశమునుండి వంగదేశాధీశ్వరునొద్దకు రాయబారిగ వచ్చిన "నికొలిడి కొంటి" యనునాతఁడును "మార్కోపోలో"వలెనే దక్షిణభారతీయుల నౌకావర్తకమునుగూర్చి యభివర్ణించియున్నారు. 14 వ శతాబ్దమున నరబ్బీ పారశీకదేశములనుండి యేటేటను రమారమి 10,000 గుఱ్ఱములు దిగుమతి యయ్యెడివనియు, దక్షిణ హిందూస్థానమునందలి వణిజులం దొక్కొక్క డొక్కొక్క యోడ 15000 బంగారు నాణెముల విలువచేసెడు 40 యోడలతో వర్తకము చేయుచుండెననియు వీరి వ్రాతలవలన మనకుఁ దెలియుచున్నది. తిప్పయసెట్టి నౌకలగూర్చి వర్ణించు సందర్భమున శ్రీనాథుఁడు "శరధిం గప్పలిజోగు" లని పేర్కొనుటచే నిట్టి మహాయానపాత్రములు, మనుష్యులను గొంపోయెడివి, సరకులను బశువులను గొంపోయెడివి, మున్నగు రక

21. మనకీ దారిద్ర్యమేల పుట 131

ముల నౌకలాతని కెన్నోకలవని యూహింపవచ్చును. తాళపత్ర గ్రంథమున "వల్లివలికా" యను శబ్దములుగూడ నీ సందర్భమున శ్రీనాథునిచే వాడఁబడియున్నవి. కాని నౌకాపరిభాషలో వానికేమర్థమున్నదో యింకను విచారింపవలసియే యున్నది. మొత్తముమీఁదఁ దిప్పయసెట్టికూడ "నిక్కోలిడికొంటి" పేర్కొన్న 40 యోడల యజమానులలో నొక దొడ్డ సాహుకారై యుండనోపుచు ఆతని నౌకలుపైఁ జేయబడిన వర్ణనమున కనురూపముగా నుండి యుండనోపును.

## వాణిజ్య శుల్కములు

పూర్వాంధ్ర నౌకాచరిత్రమున బహు ప్రాచీనకాలమునుండియు మోటుపల్లి యను రేవుపట్టణము మిక్కిలి ప్రాధాన్యము వహించియుండెను టోలమీ, పెరిప్లస్ గ్రంథకర్తలచేఁ బేర్కొనఁబడిన మసాలియాపురము గుంటూరుమండలములో బాపట్ల సమీపమున సముద్రతీరముననున్న మోటుపల్లి (మోసలపురము లేక ముకుళపురము) యేయని చరిత్రకారులు నిర్ణయించినారు. 24 రవసెల్లాలకు, నద్దకపు గుడ్డలకు సున్నితమైన మల్లునేతలకు నీ పట్టణము ప్రాచీనకాలమునుండియుఁ బ్రసిద్ధిఁ గాంచియుండెను. ఆంధ్రరాజులు పూర్వమునుండియు నీ రేవుపట్టణము నభిమానించి యత్యంతోచ్చస్థితికిఁ గొనివచ్చిరి. కాకతీయులు, రెడ్డిరాజులు విజయనగరాంధ్రరాజులు నీ పట్టణము వర్తకస్థానముగాఁ జేయుటకు మిక్కిలి ప్రయత్నించిరి. క్రీ. శ. 1244 లో కాకతి గణపతిదేవమహారాజును, క్రీ. శ. 1358 లో అనపోతారెడ్డియు, క్రీ. శ. 1390 లో దేవరాజవొడయలును నీ మోటుపల్లికడ దిగుమతి యెగుమతి సరకులపై విధింపనగు సుంకములఁ గూర్చి శిలాశాసనములఁ బ్రతిష్టించిరి. వారివారి శాసనార్థములఁ బరిశీలించినచో నొకరు విధించిన శాసనముల నొకరు తొలగించియుఁ గ్రొత్తవానినిఁ గూర్చియు, నట స్థిరనివాసము గల్పించుకొనువారికి భూదానాదికములగు సదుపాయములఁ గల్పించియు నిట్లనేక విధములుగా వర్తకుల నా రేవుపట్టణమునకు రావించుకొనుటకై యత్యంతాభిమానముతోఁ గృషి సలిపినట్లు మనకుఁ గోచరింపఁ గలదు పైని వివరించిన మూడుశాసనములలో గణపతిదేవమహారాజు శాసనమును ఎపిగ్రాఫియా ఇండికాలోఁ

---

24. అవచి తిప్పయ్యసెట్టినిగూర్చిన వ్యాసమున నంతగా నవసరముగాదని మోటుపల్లి చరిత్రమును వివరించుటలేదు. దానినిగూర్చి తెలిసికొనఁ గోరువారు ప్రాచీనాంధ్ర నౌకాజీవనము, నాంధ్రులచరిత్రము జూడవచ్చును.

ప్రభుత్వశాసనశాఖవారే ప్రచురించియున్నారు. మిగిలిన రెండుశాసనములింతవరకు వారిచేఁ బ్రకటితములు కాలేదు. అందనపోతారెడ్డి శాసనమును శ్రీ భావరాజు కృష్ణరావుగారు తమ ప్రాచీనాంధ్ర నౌకాజీవనమునందును, శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు తమ యాంధ్రుల చరిత్రమునందును బ్రకటించియున్నారు. కాని వారి పాఠములు సరిగాలేవు. కొన్నివాక్యముల కన్వయము సరిగాఁ గుదురదు. కొన్ని మాటల కర్థము తెలియుటలేదు. కొన్నింటికి వారొసర్చిన వ్యాఖ్యానములు తిన్నగాలేవు. ఈ శాసనము పూర్వాంధ్రుల నౌకాజీవనచరిత్రలో ముఖ్యమైనది. రెడ్డిరాజుల రాజ్యాంగనౌకకు ధ్రువ తారవంటిది. వారి యౌన్నత్యము స్మరించు పట్టున దీని ప్రశంస తప్పక చేయఁదగిన దగుటచే ప్రభుత్వ శాసన శాఖవారినుండి యాశాసన మూలప్రతిబింబమును దెప్పించి దానితో నింతవరకుఁ బ్రకటింపఁ బడిన పాఠములను దైఫారువేసి చూచితిని. అవి మూలపాఠమున కత్యంత భిన్నములుగా నున్నవి. అందువలనఁ దచ్ఛాసన ప్రతిబింబమునకు సరియైన పాఠమును నిచట బ్రకటించుచున్నాను. 25

1. స్వస్తిశ్రీ శకవర్షంబు
2. లు ౧౨౮౦ అగునేం
3. టి విళంబి సంవత్సర
4. శ్రావణశుద్ధాష్టమిశ్రీమ
5. తు అనపోతయ రడిం
6. గారు మోటు పలికింగా
7. ంపువచ్చ్ని వ్యవహారులకును
8. వ్యవహారం వచ్చి కరపట్టాల
9. దీపాంతరాల వ్యవహార్ల
10. కునూ యిచ్చిన ధరం ను—
11. సన స్తంభము మోటుపలిని
12. —వరుకాంపు వచ్చినాను
13. వారిమన్నించి పెద్దగాని ఉంను
14. వారము వారు ఎప్పుడు మరి
15. ఒక తావునకుం బోయేమన్నా
16. ను కాంపనిపటక అనిపిపు
17. చ్చువారము ఏవూరి సరకు
18. దెచ్చినాను తమ విచ్చలవిడి
19. నంమివలసిన [చో] టకుం
20. గొనువారు గాని వేరొక
21. —పల్ససిసరకు అడ్డపె
22. ట్టము చిరాను [పవ]
23. డము పరదేశి వ్యెవహారు
24. లకును అపుత్రికమును...
25. కదాయమును మానితిమి.
26. బంగారు సుంఖము

25. శాసనమూల ప్రతిబింబము నడుగగానే పంపినందులకును, దాని ప్రతిబింబమును నా వ్యాసముతో నీ సంచికలోఁ బ్రకటించుటకును ననుమతి నొసంగిన శాసనశాఖ వారి కెంతయుఁ గృతజ్ఞుఁడను.

27. మానితిమి గంధమునకు ...
28. బడి సుంఖము పూర్వ మరి
29. యాదలోను మూంటను
30. ఒకటి మానితిమి. తెలి సర
31. కులకును మడిసుంఖా
32. ......పూవః మయ్యాద
33. క్రిమానసే కొనువారము యీ
34. క్రిమానుకు సవర్ణమయిన
35. వారును......
36. ......వారికిలాను అభయ
37. హ స్తముగాని స్తిమి॥
38. జయతినయవి
39. శాలః ప్రిత్యహందా
40. నశీలః ధృత బుధ
41. రిపాలః సంగడీ ర
42. క్షుపాలః అహిత
43. వనకృశాను వేమ
44. భూపాల సూనుః। సు
45. × లిత మహీశః సో
46. స్నవో తక్షితీశః। శాకా
47. బ్దే గగనేభ సూర్యైః
48. గణితే తీరే మహాం
49. భోనిధేః ప్రిఖ్యాతే ము
50. కులాహ్వా ఏ పురవరే
51. (శ్రీ) సోమమంః
52. రః మర్యాదా మక
53. రోజ్జ గజ్జన నుతాం సా
54. ంయాతిరి కానామిమా
55. ంకీర్తి వేమయ అన్నపో
56. తనృపతేరా చంద్రిమా
57. తారకం॥ అంనపోత
58. మహీపాల శాసనోక్తి
59. ణా భూషణం స్థాపిత
60. శ్శాసన స్తంభస్సోమయామాత్యే—
61. ధీమతా ॥ (శ్రీ) ॥
62. అనుస్యూ......తజమా
63. ......అన్నపోత
64. మహీపతేః॥
65. అకరోద్వ్యావదా
66. దిత్యకారకం.
67. ..............(శ్రీ)...

## కాకతి గణపతి దేవుని శాసనము క్రీ. శ. (1244)

135. తేనానేన శ్రీ గణపతిదేవ మ
136. హారాజేన సకల ద్వీపాంతరీ
137. పదేశాంతర పట్టణేషుగతా
138. గతం కుర్వాణేభ్యః సాంయం
139. త్రికేభ్య ఏ వమభయశాస
140. నం దత్తం। పూర్వరాజానః
141. పోత పాతేష్వ్యవదేశాద్దేశాం
142. తరపరివృత్తేషు దుర్వాతేన సమా

143. పతి తేషు భగ్నేష్వ తీర్థసంగతే
14.. షుచ సంభృతాని కనకకరతుర
145. గ రత్నాదీనివస్త్రా సకలాని
146. బలాదప హారంతి। వయము
147. పి పా్రణే భ్యోపిగరీయోధ
148. సమితి సముద్రియాన కృత
149. మహాసాహ సే భ్యస్తేభ్యః క్లుప్తను
150. ల్కాద [ఏ]తేకృప యాకీర్త్యైధర్మా యచ
151. సర్వావితతీరామ ఇతి। తచ్ఛుల్క
152. పరిమాణం ఏక్కు మటిడిగుమ
153. టిని ముప్పయింటను ఓక్కటి
154. శ్రీగంధము తులాము ఓక
155. టికి 1 గ ౧౨ 1 కర్పూరమునకూ
156. చీని కర్పూరానకూ ముత్యాల
157. కూవేల 1 గ౧కి ౨॥। = పంనీరు
158. దంతము జవాదికర్పూరతై
159. లము రాగి తగరము ౭ [సే]
160. య సీసము పట్టు నూలుప
161. వడమూ గంధ్య ద్రివ్యాలకూ
162. నువేల 1 గ౧కి ౨౧।—మిరియా
163. లవేల 1 గ౧కి౨ ।॥—పటలు ఏల్ల
164. వానికిన్ని స్వరూపము ఓకటికి
165. ని ౨౫ ॥ పోంకలు ల...
166. ని 1గ ౧౨౩। షట్షష్ట్యాదికైకా
167. దశశత సంఖ్యే కోధినామ్నిశ
168. కవర్షే। మోట్టుపల్ల్యభిధానే
169. [దేశ్యాయ] కోండ పట్టణా మహా
170. [తి] (గ)ణపతి దేవః కీర్త్యైస్థాపిత
171. [వాంఛా] సన స్తభం। కలికా
172 .ల కర్దమస్థలదనాది ధర్మా
173. వలంబ యష్ఠి మివ...॥శ్రీ

## దేవరాజవొడయలు శాసనము క్రీ. శ. (1390)

స్వస్తిశ్రీ శకవరుషంబులు ౧౩౧౨ అగు నేటి దుర్ముఖిసంవత్సర మాఘశుద్ధ ౧ శుక్రవారము స్వస్తిశ్రీ మన్మహారాజాధిరాజరాజ పరమేశ్వర హరి హరరాయ కుమారదేవ రాయ వొడయలు మోటుపల్లికి యిచ్చిన ధర్మశాసనము. వోడదిగిన సరకులకు సుంకాలు మోటుపల్లి పట్టణ మర్యాదలు ఎప్పటికి ఎన్నిసరకులు దిగిన అయిదు లెఖ్క ఆయం పసిడికవ్వటి దిగుమతి సరకులకు గరిశవకటింటికి యెనిమిది సుంకములు రాజకరుకను ఆరు వల్లాలు. యేబడి పగడాలకట్టకు అయిదురూకలున్ను అడ్డిగ. పడమట ........ల్లుతాపులు సేయించేవారికి తోపుమీద వెలచేసి యెనిమిదిచేసి తరుగు నూటికి రూకనుపెట్టి అయాలకుజారి పదింటికి ఒక్కటి ముద్రిసరుకునకు రెండుకాసులు, పొన్నూరి వెల్లపచ్చడాలకున్ను ఈ మర్యాదను సన్నచీరెకు సారూ పానకు నాలుగుకాసులు కయికాలచీరెకు, సారూపానకు కాసు రొఖ్కము రాచవారు కొని అందు మూండవపాలు దేవరాజవొడయలు బడికుదురు.

పై శాసనముల వలన కాకతీయులు, రెడ్డిరాజులు, విజయనగర ప్రభువులు మోటుపల్లిని వర్తక స్థానము గావించుట కెంతపాటుపడిరో మనకు జక్కగాఁ దెలియుచున్నది. పూర్వరాజులు సముద్రోపద్రవముల మూలమున భగ్నమై యొడ్డుపట్టిన యోడలలోని కనకకరితురగరత్నప్రభృతి ద్రవ్యములను బలవంతముగా నపహరించెడువారు. కాని శ్రీ గణపతిదేవ మహారాజు కీర్తి కొఱకును ధర్మము కొఱకును, తమ ప్రాణములకంటె ధనమునే యమూల్యముగా నెంచి, సముద్రయానమను సాహసమున కొడంబడిన వారిపై దయగలవాఁడై క్లుప్తశుల్కము గాక తక్కిన సర్వము విడచిపెట్టి ఎవ్వారి సరకులను వారికే యధీనము గావించెను. ఆ శుల్కము దిగుమతి యెగుమతులన్నింటను ముప్పదింట నొకటి

1. శ్రీగంధము తుల మొక్కటికి నొక వరహా పావుపణము.

2. వరహా విలువగల (దేశవాళీ) కర్పూరము, చీనీకర్పూరము, ముత్యాలకు నొక్కొక్కటికి ముప్పాతిక ముప్వీసము పణము.

3. ఒక వరహా విలువగల పన్నీరు, జవ్వాది, దంతము, కర్పూరతైలము, రాగి, తగరము, సీసము, పట్టునూలు, పవడములు, సుగంధద్రవ్యములు, రసేయ—వీనిలో నొక్కొక్కటికి, పణముపైన పాతికముప్వీసము.

4. వరహా విలువగల మిరియాలకు ముప్పాతిక ముప్వీసము.

5. పట్టుబట్టల మూటలకు స్వరూపమున కొక్కటికి నయిను పణములపై సరపణము.

6. లక్కపోకలకు నొక వరహాపైన మూఁడు పణములును, క్లుప్తశుల్కము నిర్ణయింపబడెను.

గణపతిదేవుఁడిట్లు శుల్కముల విడనాడియు, వర్తకులఁ బ్రోత్సహించియు మోటుపల్లిని బ్రసిద్ధమగు రేవుపట్టణముగఁ జేయుట కెంతయో ప్రయత్నించెను. ఈతని కుమార్తె రుద్రాంబ కాలమున వచ్చిన మార్కోపోలో యీ రేవులోనే దిగి దానిప్రాముఖ్యతను శ్లాఘించి యుండెను. కాకతీయుల యనంతరము రెడ్డిరాజు లాంధ్రదేశమునకుఁ బ్రభువులైరి. రెడ్డిరాజ్య స్థాపకుఁడగు ప్రోలయ వేమారెడ్డి తన సోదరుఁడగు మల్లారెడ్డిని బంపి మోటుపల్లిని వశపఱచుకొనియెను. ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశమున నీసంగతి నిట్లు ప్రశంసించియున్నాఁడు.

శా॥ బాహాదర్పమునం బ్రతీపధరణీ పాలావళిం ద్రోలి, యు
త్సాహాదగ్రుఁడు మోటుపల్లిఁ గొని సప్తద్వీప సద్వస్తు సం
దోహంబుల్ దనకిచ్చు నెచ్చెలి సముద్రుం బ్రీతిఁ గావించుచుల్
మాహాత్మ్యంబు వహించె మల్లరధినీ నాథుండు గాఢోద్ధతిన్

ఈతని కాలమునందే యవచి దేవయసెట్టియు నాతని కుమారుఁడు తిప్పయసెట్టియు, వాణిజ్య వర్ధకులగు సుప్రసిద్ధ చారిత్రిక పురుషులుగా వెలసియున్నట్లు శ్రీనాధుని హరవిలాసము వలన మనకుఁ దెలియుచున్నది. ప్రోలయవేముని తరువాత ననపోతారెడ్డి రాజ్యమునకు వచ్చెను. ఈతఁడును మోటుపల్లిని వర్తకస్థానముగాఁ జేయుటకెంతయో ప్రయత్నించెను. కాకతీయ సామ్రాజ్యానంతరము తగిన సంరక్షణము లేమిచే వర్తకులు మోటుపల్లిని విడచి పోయినందున నా రేవుపట్టణము క్రమక్రమముగా, ప్రాముఖ్యమున క్షీణించిపోవుచుండెను. వేమారెడ్డి మోటుపల్లి నాక్రమించుకొనెనన్నమాటయేకాని దాని నభివృద్ధిలోనికిఁ దెచ్చు ప్రయత్నమేమియుఁ జేసినట్లు కాన్పింపదు. కనుక నీయంశము లన్నింటిని దలపోసి యన పోతారెడ్డి తిరిగి మోటుపల్లికిఁ బూర్వపు ఔన్నత్యము నేకూర్చుటకు నభిలషించి తత్కార్యమునకుఁ దగిన మార్గముల నన్వేషించి, తనకుఁ బ్రతినిధిగ మోటుపల్లిని బాలించుచుండిన సోమయామాత్యు నొక యభయశాసనము బ్రకటింప నాజ్ఞాపించెను. తదాజ్ఞానుసారముగా నాతఁడు ౧౨౮౦ యను విళంబి సంవత్సరములో నొక శాసనము ప్రకటించెను. నేఁటికిని మోటుపల్లి వీరభద్ర యాలయమున మంటప స్తంభముపై నది లిఖింపఁబడి నిలచిఉన్నది. ఈ శాసనము సంస్కృతాంధ్ర భాషలందేకాక, యరవమందుఁ గూడఁ బ్రకటింపఁబడి యున్నది దీనివలన మోటుపల్లిలో నాంధ్రవర్తకులేకాక తమిళవర్తకులు గూడ నుండినట్లు తెలియఁగలదు.

ఈ శాసనమూలమున మోటుపల్లికి కాపురమువచ్చు వ్యవహారులకు (అనగా వర్తకులకు), నన్యదేశ ద్వీపాంతరవర్తకులకు నిచ్చిన స్వామ్యములు, సదుపాయము లేమనగా— మోటుపల్లికివచ్చు వర్తకులను మన్నించి, పెద్దచేసి వారికి భూములనిచ్చి వసతులఁ గల్పించి, సర్వవిధములగు వర్తకమర్యాదలను నడపువారము. వారి యిచ్ఛానుసారముగా మఱియొక

తావున కెప్పుడు పోవుదుమన్నను మోటుపల్లియే వారికిఁ గాణాచియని యడ్డుపెట్టక గౌరవించి పంపువారము. ఏయూరి సరకు లెవరు తెచ్చుకొన్నను వారి యిష్టానుసారముగా వారమ్ముకొనుటకును, పరదేశములకుఁ గొనిపోవుటకును ననుజ్ఞ నిచ్చువారమే కాని, యాటంకములఁ గల్పింపము. గుజ్జుపుజీనులు, సొమ్ములు, ముత్యాలసరములు, పవడములు, ఈ మూఁడుసరకుల నన్యదేశములనుండి దిగుమతి యగునప్పు డపుత్రికసుంకము వసూలుచేయుట మానివేసితిమి. బంగారుపైని సుంకము తీసివేసితిమి. గంధమున కెగుమతి సుంకము, పూర్వమర్యాదలలో మూట నొకటి మానితిమి. స్వదేశమున తయారగుచున్న సరకులకు మెట్టసుంకములను మాత్రము పూర్వమర్యాదల క్రమాననే కొనువారము—అని యన పోతారెడ్డి ప్రకటించెను.

ఇట్లనేక సౌకర్యములఁ గల్పించి వర్తకులను మోటుపల్లికి రావించుట కనపోతారెడ్డి యెంతయో ప్రయత్నించెను. ఈతని పిమ్మట రాజ్యమునకు రావలసిన కుమారగిరి బాలుఁ డగుటచే నితని సోదరుఁడగు ననవేమారెడ్డి ప్రజాపాలనము గావించుట తటస్థించెను. క్రీ. శ. 1380 వ సంవత్సరములో నాతఁడు మరణించుటచే బాలుఁడగు కుమారగిరి రాజ్యభారము వహించెను.

అనపోతారెడ్డి గావించిన నిరంతర కృషివలన మోటుపల్లి మిక్కిలి యభివృద్ధిలోనికి వచ్చినట్లే మన మూహింపవచ్చును తిప్పయ్యసెట్టి చేసిన నౌకావర్తక బాహుళ్యమును గమనించినచో సుగంధ ద్రవ్యములు, గుజ్జములు, మున్నగు సరకులు దిగుమతియగుటకు నాంధ్ర మండలమున నేదోయొక పెద్దరేవు పట్టణమా కాలముననుండి తీరవలయును గదా! దానిని మోటుపల్లియె యని నిరూపించుటకు నసంఖ్యాకములగు నాధారములు గన్పించుచున్నవి. అన పోతారెడ్డి వర్తకులకు సనుపాయముల గల్పించి మోటుపల్లికి రావించి యొక విధముగా నాంధ్రుల నౌకావర్తకము నభివృద్ధిజేసి యుండగా కొమరగిరిరెడ్డి ద్వీపాంతర సద్వస్తు సందోహములు దిగుమతియగుటకు మిక్కిలి యవసరములగు పరిస్థితులఁ గల్పించి మఱియొక విధముగా నౌకాజీవమునకు దోహదము గావించెను. స్వయముగా విలాసజీవనుఁడు. ప్రతిసంవత్సరమాతఁడు నిర్వర్తించు వసంతోత్సవములకు ద్వీపాంతరములనుండి యపురూపములగు సుగంధద్రవ్యములు గావలసియుండెను. ఈ భారమంతయు నాతఁడు తిప్పయసెట్టిపైని వైచె

ను. ఎంతసరకు తెప్పించిన నంతసరకును విడుదలచేయుటకు వసంతోత్సవాద్యవసరములును,
నంతసరకును గొనుగోలుకాతా వ్రాయుటకొక మహారాజుగారి ఖజానాయును, దొరకి
నప్పుడు వ్యవహారమంతయు కోమటిబిడ్డయైన తిప్పయ్యసెట్టి చేతిలో నున్నప్పుడు నిఁక నడుగ
వలయునా? ఇష్టము వచ్చినట్టు లాతఁడు సరకుఁ దెప్పించెను. ఇష్టమువచ్చినట్లు ఖర్చుపెట్టెను.
ఇష్టము వచ్చినట్టు ద్రవ్యము వెదజల్లెను. దేశమానాఁడు వైభవముతో వెల్లివిరిసెను. ఆంధ్ర
దేశమానాఁడు స్వర్ణమణిమయ మండితమై, సుగంధద్రవ్యసురభిళమై, దేవతల రాజ్యమును
గూడ ధిక్కరించనేమోగదా! ఈవిధముగా గొమరగిరి రెడ్డియాంధ్రుల నావికవాణిజ్యమును
పెంపొందించెను. దీని కాతని తారుణ్యమే కారణము. ఆతని రాజ్యము సరిగా జరగిన
నాంధ్రుల వర్తక మింకను నెంతగా నభివృద్ధి నందెడిదోకాని, యాతనికి బాంధవుల
వలన యలజడులే విశేషమయ్యెను. ఆవల పెదకోమటి వేమారెడ్డి యప్పుడే పరాక్రమ
వంతుఁడై యాతఁడు రాజ్యము సేయుటకుఁ జూఁపోపకుండెను. దీనిఁబట్టియు స్వయముగ
విలాసజీవనుఁడగుటచేతను గుమారగిరి రాజ్యమునకు వచ్చిన క్రొత్తలో నితరరాజుల విజృం
భణమును తన పూర్వులవలె నరికట్టఁజాలకపోయెను. అందువలన నితరరాజులు తమ సామ్రా
జ్యములను విస్తరింపఁజేసికొనుటకు మంచి తరుణము లభించెను. విజయనగర పాలకుఁడగు
రెండవ హరిహరరాయలు తన రాజ్యము నుత్తరమున విస్తరింపఁజేసి మోటుపల్లిని స్వాధీనము
గావించుకొని కుమారుఁడగు దేవరాజవొడయలును దనకుఁ బ్రతినిధిగా నానగరమును బాలింప
నియమించెను. కావున కుమారగిరికాలమునాఁటికి మోటుపల్లి రెడ్డిరాజుల యధీనమునుండి
తొలగిపోయెను. ఒకసారి కాటయవేమునిబంపి మోటుపల్లినిఁ వశపఱచుకొనుటకుఁ గొమర
గిరి ప్రయత్నించెను గాని విఫలమనోరథుఁడయ్యెను. అనపోతారెడ్డివలెనే దేవరాయవొడయ
లును, మోటుపల్లిలో నొక ధర్మశాసనము వర్తకశుల్క పరిమాణముల నిర్ణయించుటకై
ప్రకటించెను. క్రొత్తగా మోటుపల్లి నాక్రమించుకొనినవాఁ డగుటచే నచటివర్తకులకుఁ దన
వలన నుపద్రవములు దోఁపకుండుటకై యాతఁడు మొట్టమొదట నీశాసనముఁ బ్రకటించి
వారి కభయహస్తము నిచ్చెను. అనపోతారెడ్డి దిగుమతి సరకులపైని విధించిన సుంకములను
దేవరాయలు మార్చెను. బంగారముపై ననపోతారెడ్డి మానియుండ నీతఁడు దానికై దవ
పాలాయము నిర్ణయించెను. పగడాల కనపోతారెడ్డి మానినసుంకము నీతఁడు తిరుగ విధిం

చెను. ఏబది పగడాలకట్టకయిదు రూకలును నరరూకము సుంకము చెల్లింపవలసి యుండెను. ఎగుమతి సరకులపై గొన్ని నూత్నశుల్కముల బేర్కొనెను. రత్నకంబళములను వెలచేసి మొత్తపువెల నెనిమిది భాగములు గావించి నూటికొకరూక తఱుగుపెట్టి మిగిలినవెలమీాద పదింటికొకరూక సుంకము విధించెను. పొన్నూరువెల్ల పచ్చడాలకు రెండేసికాసులు సుంకము విధించెను. సన్నచీరలకు స్వరూపమునకు నాలుగు కాసులును, పట్టునూలుచీరకొక్క కాసును విధించెను. వసూలైన మొత్తములో మూడవపాలు దేవరాయప్రసయలు బడయుచుండు వాఁడు. ఇట్లు మోటుపల్లి నభివృద్ధిలోనికిఁ దెచ్చుట కాంధ్రరాజు లందఱు బ్రయత్నించిరి. వారి ప్రయత్నముల నీశాసనములు వేయి ముఖముల నుద్ఘోషించుచున్నవి. వారికిమ్మట యాంధ్రుల నౌకావర్తక మాంగ్లేయుల హస్తగత మైనప్పటినుండి సంపూర్ణముగా నది నాశనమే యైనది. ఇంతటి పూర్వవైభవముగల యాంధ్రుల నౌకావ్యాపారము నేటి కీవిధముగాఁ బరిణమించుటఁ దలఁచికొని యే యాంధ్రుఁడు కన్నీరు నింపకుండును.

"పశ్చిమదేశ సముద్రాధిదేవత ప్రాలకసముద్రాధి దేవతను నిర్మూలించిన విధముకంటె హృదయ విదారణమగు విషయ మింకొకటి లేదు"

"'డిగ్బి' మనకీ దారిద్ర్య మేల"

రెడ్డిరాజుల కాలమున నాంధ్రుల నౌకావ్యాపారమునకు దిప్పయసెట్టి నాధారదండమై నిల్చినవాఁడు. ఆతని కాలమునుగూర్చి బహు తీవ్రమగు వివాదములున్నవి గాని యీవ్యాస మిప్పటికే దీర్ఘమగుటచే నా యంశముల నిచటఁ జర్చింపక విరమించుచున్నాను. రాజుకాకు న్నను రాజ చిహ్నములఁ బడసి రారాజులకంటె మిన్నగా జీవించి దేశమునంతటిని సుగంధ ద్రవ్య సురభిళముగను, సంపత్సమేతముగను గావించి, కవులబోషించి, యాశ్రితుల మన్నించి, వసంతోత్సములచే నెల్లజనుల మనస్సులం దనురాగరసమును వెల్లికొల్పి, యన్యదేశములతో గీర్తి బేహారమాడి, చరిత్ర నలంకరించిన యావచి తిప్పయసెట్టివంటి వైశ్యవరులచే తిరిగి యేనాఁ డాంధ్రుల నౌకాజీవనము పునరుద్ధరింపఁబడునో యని యాశించుచు నింతటితో సెలవు గైకొనుచున్నాను.

# రెడ్డిరాజులనాటి సాంఘిక చరిత్ర.

అష్టావధాని. విద్వాన్ అంబటి సూర్యనారాయణశాస్త్రి. ఎమ్. ఏ., బి. యిడి.

సుమారు క్రీ॥ శ॥ 1320 సం॥ నుండి 1450 సం॥ వఱకు అద్దంకి, కోరుకొండ, కొండవీడు, రాజమండ్రి, కందుకూరు మున్నగు నాంధ్రనగరములు రాజధానులుగా నాంధ్రదేశముం బాలించిన రెడ్డిరాజులనాటి సాంఘికార్థికసారస్వతాదిపరిస్థితులు విస్మృతములై చరిత్రకెంతగా వేద్యములు గాకున్నవి. కాన నాటియాంధ్రదేశమందలి సాంఘికాద్యనేకపరిస్థితులంగూర్చి నాచేనైనకొలదిఁ దెలుపఁ బూనితిని.

1. సంఘము:—ఆనాటిహైందవసంఘమునం దన్నికులములవారు వారివారి శక్తిసామర్థ్యములఁబట్టియు, తెలివితేటల ననుసరించియు, నధికారముల, గౌరవపదవులఁ బడయుచుండిరి. రెడ్డికులజుఁడైనను, ప్రోలయవేముఁడు తన బాహుపరాక్రమమున బహుభూములాక్రమించి కొండవీటిరెడ్డిరాజ్యమును స్థాపించెను. వయసున నతనికన్న పెద్దయైనను, అతనియన్న మాచవిభుఁడు తనతమ్మునివలననే రాజ్యము వడయ గలిగెను. ప్రోలయవేమునితమ్ముఁడగు మల్లారెడ్డియు తనశక్తిసామర్థ్యములచేఁ దనయన్నకుఁదోడ్పడినదేగాక, కందుకూరియందు రాజ్యము నెలకొల్పెను. కుమారగిరి యనంతరము కొండవీటఁ బెదకోమటివేముఁడును, రాజమహేంద్రసీమను కాటయవేముఁడును, అతని యనంతరం మల్లాడరెడ్డియు రాజులగుట, వారివారి శక్తిసామర్థ్య వివేకాదిగుణగణములఁబట్టి గాని, యన్యయోన్నతిఁబట్టి కాదు. రెడ్లయందే కాక, వైశ్యబ్రాహ్మణులందుగూడ పెక్కురు వారివారి శక్తిసామర్థ్యాదుల ననుసరించియే యున్నతాధికారముల నందగలిగిరి. వైశ్యులగు అవచిదేవయ, తిప్పయ, చామయ, తిరుమలయ్య మున్నగువారు కొండవీటిరాజులయొద్ద సచివులై, రాజకార్యధురంధరులై వన్నెకెక్కిరి.[1] 1333వ సంలో కోరుకొండ రెడ్డిరాజగు ముమ్మడినాయకుడు మృతినొంద, అతని కుమారుడు బాలుఁడగుటచే నారాజ్యకార్యములను సింహాద్రిసెట్టి, ఓబిలిసెట్టియు నను వైశ్యశిఖామణులు నిర్వహించిరి. బెండపూడి అన్నయామాత్యుడు, శ్రీనాథుడు బంధువులైనను మొదటివాడు రాజమంత్రియు, రెండవవాడు రాజకవియు నగుట వారివారి వివేకవిజ్ఞతలఁబట్టికాని వేఱుకాదు. ఆకాలమందు వర్తమానకాలమున సంఘసంస్కారు

1. Local Records of Mackenzie, Vol. 19, Pp. 107.

లచే హేతువుగా 'వరవిక్రియ' మని దూషింపబడు 'అరణము' (అనగా నల్లుని కిత్తివారిచ్చు భూమి, సొమ్ములు, మున్నగు బహుమతులు) వాడుకయందుండెను. కుమారగిరిరెడ్డి తన చెల్లెలగు మల్లాంబను కాటయవేమున కిచ్చి, యామె కరణముగా నామెభర్తకు రాజమహేంద్రవరరాజ్యము నిచ్చెను. అటులనే అల్లాడరెడ్డి ద్వితీయ పుత్రుఁడగు వీరభద్రారెడ్డికి, కాటయవేముని పుత్రియగు అనితల్లి నిచ్చి వివాహముఁ జేయుటచే రాజమహేంద్రవరమునకు వీరభద్రారెడ్డి రాజయ్యెను. ఆకాలమందలి అల్లుండ్ర బాధఁగూర్చి "వెలయాలు, శిశువు, నల్లుఁడు, నిలయేలిక, యాచకుండు నేగురు దరలోఁ గలిమియు లేమియుఁ దలపరు.........''అని కాటయవేముని సంబోధించి చెప్పఁబడిన యొకచాటువు జాటుచున్నది.

ఆకాలమున జారత్వము మిగుల ప్రబలియుండెను. యతియగు ముమ్మిడి శాంతయ్య దప్ప దక్కిన శ్రీనాథుని వివిధగ్రంథభర్తలందు [2]కామినీకాములు గానివారెవ్వరును లేరు. శ్రీనాథుఁడు కస్తూరికాదానాదు లడుగుటయందును, మహాపుణ్యక్షేత్రమగు ద్రాక్షారామ వర్ణనమందును, ద్రాక్షారామభీమేశ్వరస్తుతియందును, భీమేశ్వరపురాణ కృతిభర్తయగు బెండపూడి అన్నయామాత్యుని వర్ణించుటయందును, శృంగారరసమును విచ్చలవిడి గురిపించుటఁ జూడ నక్కాలమున జారత్వము మిగులఁ బ్రబలియుండుటయే కాక, అది యొక ప్రతిష్ఠావహమును, పురుషుల కొక వర్ణనీయమగు గుణవిశేషముగా నెన్నక కెక్కియుండెనేమో యని తోఁచుచున్నది.

[3]శా॥ కాంచీకంకణతారహారకటకగ్రైవేయభూషావళుల్
లంచంబిత్తురు దూతికాతతికి... బెండపూడన్ననిన్
కవయం బ్రార్థించి లోలోపలన్
......పల్లెలబురిం బ్రౌఢేందుబింబాననల్.

ఈపద్యముఁబట్టి, రాజమంత్రియు, బ్రాహ్మణోత్తముఁడును, శివభక్తుఁడును, శ్రీనాథుని బంధువును, భీమేశ్వరపురాణకృతిభర్తయు నగు బెండపూడి యన్నయామాత్యుడు జారుఁడనియు, యతినిఁగవయఁగోరి పల్లెఁ, బట్టణములఁగల ప్రౌఢస్త్రీలు

---

2 తనకృపాణము.........రాయవేశ్యాభుజంగబిరుద......సింగనామాత్యవరుఁడు—
శృంగారనైషధము-ప్ర॥ 9 పద్య.
లలనా జనతారుణ్యలక్ష్మనిభా—ద్వితీయాశ్వాసంతపద్యము—హరవిలాసము.

3 భీమేశ్వరపురాణము.

తామై కాంచీకంకణాద్యనేకాభరణములు లంచము లిచ్చుచుండిరనియు, నాలంచములు గొని వారికార్యము నెరవేర్చుచుండిరనియుఁ దెలియుచున్నది. ఈకాలమందువలె ఆకాలమందును, తిరునాళ్ళు యాత్రాస్థలములు నిట్టియసభ్యతల కాలవాలములుగానుండినవి. కృష్ణాతీరముననుండు 4 శ్రీకాకుళ స్వామితిరునాళ్ళు, ద్రాక్షారామక్షేత్రము నిట్టివిగావర్ణింపఁబడినవి. ప్రబంధలక్షణములనైనఁ బాటింపక భీమేశ్వరపురాణమున ద్రాక్షారామపురవర్ణనమందు శ్రీనాథుఁడాక్షేత్రమందు బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రాదులెవ్వరు లేనట్లుగా నొక్క-సానిజాతివారిని మాత్రమే వర్ణించియుండుటఁ జూడ నక్కాలమున నట్టియాత్రాస్థలములు సానులకు, వారి జారత్వమునకుఁ బట్టుగొమ్మలై యుండియుండవలెనని మనకుఁ దట్టకమానదు. మీఁదుమిగుల 5"దక్షపురిసాని కూఁతులఁ దవిలినాఁడు। విశ్వలోకకుటుంబి భీమేశ్వరుండు" అని జారత్వ మొక మహద్గుణవిశేషముగా ద్రాక్షారామభీమేశ్వరునికే యారోపింపఁబడెను.

కాళికాది శక్తిదేవతల జాతరలు జరుగుచుండుటయు, నాదేవతలకు "గొఱియలు, మేకపోతులును, గొమ్మపోతేళ్ళను" బలులిచ్చుటయు వాడుకగానుండెను. అట్టివాడుక బ్రాహ్మణేతరజాతులయం దెక్కు-వ విరివిగా నుండుటచే గాబోలు, పల్నాటికమ్మవారి ప్రోత్సాహముచే శ్రీనాథుఁడు రచించిన "పల్నాటి వీరచరిత్రమున" ఈజాతరలు, జాతరలందలి బోనగావళ్ళు, కుంభము, దున్నపోతుల బలులు మున్నగువానిఁగూర్చిన వర్ణనలు జేయఁబడినవి. "తిరుజోణము, పణ్యారము" అను నైవేద్యవిధానములుగూడ అప్పటి దేవతారాధనమందు వాడుకగానుండెను.

శ్రీనాథుఁడు తన కాలమం దెంతయో ప్రజాసామాన్యమునకు, అందు ముఖ్యముగా పల్నాటిజనులకు ప్రీతికరములుగా నుండిన వినోదవిశేషములఁగూర్చి వర్ణింపఁగోరి కాబోలు తన పల్నాటి వీరచరిత్రమందు కోడిపందెములు మున్నగు ద్యూతములు, జాతరలు, వీరపూజలఁగూర్చి విరివిగా వర్ణించియున్నాఁడు. అట్లయుండినచో రెడ్డిరాజుల కాలమందును, కాకతీయులకాలమందువలె ప్రజలు వివిధద్యూతక్రీడాలోలురై యుండిరనవలెను.

ఆకాలమందు బంధువులయం దనురాగము, నన్నదమ్ములందు సౌభ్రాతృత్వము

4. వల్లభాభ్యుదయము.

5 భీమేశ్వరపురాణము.

మిగులఁ గొనియాడదగినది. [6]ప్రోలయ వేముఁడు తాను సంపాదించినరాజ్యమును, "తనయనుజతనుజబాంధవమిత్రజనుల" కిచ్చుటయు, నతని రాజ్యసంపాదనమం దతనితమ్ములతనికి సాయపడుటయు, రాజమహేంద్రవరపు రెడ్డిరాజులందును, [7]వేమారెడ్డి, దొడ్డారెడ్డి, తమసోదరుఁడగు వీరభద్రారెడ్డికి ప్రాపుగానుంటయు నిందుకు ప్రబలనిదర్శనములు. రాజులందే కాదు, [8]వర్తకులందు నట్టి సౌభ్రాతృత్వము వెలయుచుండెను. వైశ్యశిఖామణియగు నవచి తిప్పయ్యసెట్టి యతని మొదటితమ్ముఁడగు తిరుమలసెట్టి రాచకార్యములు నిర్వహించియు, రెండవతమ్ముఁడగు చామిసెట్టి వ్యాపారనిర్వహణమునందుఁ దోడ్పడియు తమ సౌభ్రాతృత్వము నెఱపిరి.

2. ప్రజాసామాన్యము:— ఆకాలమందు సామాన్యప్రజలు, ముఖ్యముగా మెట్టభూములుగల రేనాడు, పల్నాడు మున్నగు నాంధ్రమండలములందు మిగుల నిరాడంబరజీవనులై, యమాయకులునై యుండిరి. అందు బ్రాహ్మణులుగూడ జొన్నన్నము, జొన్నకలి, జొన్నంబలి, జొన్నపిసరు, సజ్జలఅన్నమునే తినుచుండిరి. ఇప్పటి పల్లెలందువలె ఆనాటిపల్లెలందును విస్తళ్ళ [illegible], కుండలవంటకము, కొంచె మిల్లు, పసులగాటికి ప్రక్కన మంచముపై పడక, చద్దియన్నము భుజించుట వాడుకయందుండినవి. కాని పట్టణములందు ధనికులుగా నున్నవారు ముఖ్యముగా సన్నన్నము, అరిసెలు, బూరెలు,

6. తనకు సద్దంకి తగు రాజధానిగాఁ బ । రాక్రమంబున బహుభూములు నాక్రమించి
యనుజతనుజబాంధవమిత్రజనుల కిచ్చె । నెవరు రెవ్వారు వేమమహీశ్వరుండు.

కం. సర్వధురీణ ........ మల్లచమూవర । నిర్వంచక సోద
రత్వ......... హరవంశము—ఎఱ్ఱాప్రెగడ.

7 గీ॥ రాజరఘురాము లల్లాడరమణతనుజులు........
వేమభూవల్లభుండును వీరవిభుఁడు
నన్నదమ్ములు హరియును హరుఁయుఁబోలె
—భీమేశ్వరపురాణము

శా॥ ఔరా! యల్లయరెడ్డిదొడ్డవసుధాధ్యక్షుండు........
..................నిలిపె దిక్సీమాజయస్తంభముల్
—నిశ్శంక కొమ్మనామాత్యుని శివలీలావిలాసము

8 గీ॥ తమ్ములిద్దఱు తనయాజ్ఞ తలధరించి । యన్నిదీవులఁ దెచ్చు లాభార్థకోటి
యర్థులకు నిచ్చి కీర్తి బేహారమాడు నవచి త్రిపురాంతకుఁడు........
—హరవిలాసము

పాయసములు, వడలు మున్నగునవి భుజించుచుండిరి. విన్ననమంత్రివంటి భాగ్యశాలురు శ్రీనాథునివంటి కవీంద్రుల పంక్తిని హేమపాత్రాన్నము భుజించుచుండిరి. బియ్యము, తిలలు, పెసలు, బెల్లపుచెఱకు, జొన్నలు, సజ్జలు, మినుములు, మున్నగు ధాన్యములు బండింపఁబడుచుండెను. బెల్లము, నూనె, చింతపండు, ఖండశర్కరలు, నెయ్యి మున్నగు నితర భోజ్యవస్తువులు దయారుచేయబడుచుండెను. కదళీఫలములు పట్టణములందు భోజన సమయమున వాడుచుండిరి. తాంబూల మొక గౌరవసూచకముగా నివ్వబడుచుండెను. రాజులు బ్రాహ్మణభక్తులై, హైందవమతోద్ధరణకుఁ గంకణపాణులగుటచే బ్రాహ్మణు లగ్రహారములఁ బడసి, మాణిక్యాంగుళీయకాద్యనేకాలంకారములతోడ అగ్రహారము లందు విరాజిల్లుచుండిరి. వైశ్యులుగూడ రాజాదరణచే వాణిజ్యము వృద్ధిగాంచ ధనాధి కులై, పెక్కు దానములు గావించుచు, కవిపోషకులై, రాజసచివులై కీర్తికెక్కియుండిరి. "అగ్రహారములు విద్యాతపోవృద్ధవిప్రుల కిచ్చె" అని శంభుదాసుఁడు ప్రోలయ వేమునిఁ గూర్చి పల్కిన వాక్యముఁబట్టియు [9]"ధరయుం బనిచ్చి దశ్రుపెద్దుడు వేడ్క లీల మాణి క్యాంగుళీయకోపములు.........బ్రాహ్మణోత్తము లగ్రహారములయందు వేమభూపాలుఁ డనుజన్మ కీర్తిభద్రు ధాత్రి నేలింప" అని నాయనిపేంద్రునకు రెడ్డిరాజులఁగూర్చి శ్రీనాథుఁడు పల్కిన పద్యముఁబట్టియు, నాఁటి రాజులకున్న బ్రాహ్మణాదరణ తేటతెల్ల మగుచున్నది.

"కామతారిచెరువులు గట్టి ప్రతిష్ఠించి.........నిధులు సల్లింపను నిలిపె దోటలు సత్రములు చలివిందరల్ వెలయఁబెట్టె" అని శంభుదాసుఁడు ప్రోలయ వేమనఁగూర్చి చెప్పిన మఱియొక పద్యపాదమువలన రెడ్డిరాజు లెంత చల్లగా రాజ్యము చేసిరో ప్రజలెంత హాయి, నెమ్మది నొందవించిరో విశదమగును. అట్టి నెమ్మదిగలవా రగుటచేతనే ప్రజలు తండోపతండములుగా శ్రీశైలాదిదుర్గమక్షేత్రములకు యాత్రలు విరివిగా జేయుచుండిరి. అట్టి యాత్రికుల సౌకర్యార్థము, శ్రీశైలమునుండి పాతాళ గంగవఱకును, అహోబిల నృసింహక్షేత్రమునుండి దిగువవఱకును సోపానముల బ్రోలయవేమున్ కట్టించెను. అట్లు యాత్రికులు నిరాఘాటముగా, నెమ్మదిగా యాత్రల కేగుచుండుటచేతనే శ్రీశైలమందలి జంగమమఠాధికారులు లక్షాధికారులై శ్రీనాథుని వంటి కవిశ్వరులఁ బోషింపగల్గిరి. అంతవిరివిగా ప్రజలు శ్రీశైలాదిదుర్గమక్షేత్రయాత్రలు సాగించుచుండుటఁజూడ నాకాలమందు మార్గములందు దారిదోపిళ్ళు, క్రూరారణ్య

9 కాశీఖండము.

మృగబాధలు, పరరాజుల దాడిమున్నగునవేవియు లేకుండెనని తెలియనగును. అట్టి సుకరములు, సుగమములు, నిరపాయములు నగు మార్గములుంటచేతనే శ్రీనాథాదులు కొండవీటినుంచి యోరుగంటికి, అక్కడనుండి విజయనగరమునకు, నందుండి రాజమంద్రి మున్నగు స్థలములకు రాజాదరణార్థము, కవిత్వప్రదర్శనార్థము విచ్చలవిడి ప్రయాణములు సాగించగల్గుచుండిరి. అట్టి నిరపాయమార్గసహాయమువలననే అవచిదేవయ్య, తిప్పయ్యవంటి వర్తకులు పంజారతోడను, సింహళముతోడను వ్యాపారము జేయగల్గిరి.

ప్రజ లిట్టి నెమ్మదినేకాక, సకలసంపత్సమృద్ధిచే విరాజిల్లుచుండిరనుట కెన్నియేని నిదర్శనములు గలవు. దూరదేశములనుండి చందనాగరుకర్పూరహిమాంబుకుంకుమ రజఃకస్తూరికాది సుగంధద్రవ్యములును, చీనిచీనాంబరశ్రేణులు, నాణిముత్యాలు మున్నగు భోగ్యవస్తువులు విరివిగా దెప్పించి యవచి తిప్పయ్యవంటి వర్తకులు వ్యాపారము సాగించుచుండుట యొక కుమారగిరిరాజుకొఱకుగానే యైయుండదు. పల్లెలవారు, హీనకులజులు కాకున్నను, మధ్యతరగతి పట్టణవాసులైనను బెక్కరట్టి ద్రవ్యములు వస్తువులు విరివిగాఁ గొని నిత్య ముపయోగించుట వాడుకయందు లేకున్నచో నట్టివర్తకమంత విరివిగాఁ జరిగియుండదు. కనుక నాకాలమందు పట్టణవాసులు మిగుల భోగలాలసులై యుండిరనుటయం దావంతయు సందియము లేదు. ఇంతియే కాదు. ఆకాలమున [10]"ద్రాక్షారామపురీవిహారవరగంధర్వాప్సరోభామినీ । వక్షోజద్వయకుంభికుంభములపై వాసించునది" కస్తూరి; బ్రాహ్మణోత్తములందు కల్పింపనేర్చిరి......కస్తూరికా పుండ్రకముల నొసల; "అక్షయ్యంబగు కస్తూరికాభిక్షాదానము"లే శ్రీనాథునివంటి కవీంద్రు లాశించుచుండిరి. ఛాందసులగు అగ్రహారపుబ్రాహ్మణులే "జన్నిదముల మ్రోలఁ దారహారములు ముత్యాలసరులు" సవరించి, "శిఖల, నెన్నడుములఁ గమ్మని క్రొత్త చెంగల్వవిరులు చెరువంగనేర్చిన" యాకాలమున, శృంగారనిధులగు స్త్రీ లెట్టి భోగలాలసులై యుండిరో! నగరము లట్టి వర్తకస్థానములచేతను, అనేక నగరోపకంఠ ప్రతిష్ఠాపిత వివిధారామములచేతను, సకలసంపద్వైభవోపేతములై విరాజిల్లుచుండుటఁ గాబోలు అందుండి శ్రీనాథుడు పల్నాటియందలి పల్లెలకేగినపుడు "అంగడి యూరలేదు, వరియన్నములేదు, శుచిత్వమేమిలే దంగనలింపుగారు ప్రియమైన వనంబులు లేవు... దాత లెన్నంగను సున్న......"అని వాపోయినాడు. [11]"ఆతత భక్తిసంపద నహర్ని

10 తెలుగురాయని శ్రీనాథుఁడు కస్తూరి వేడిన పద్యము.

11 హరవిలాసము.

శముల్ ఘృత ఖండశర్కరా | పాతముతోన పూపములు పాయసముల్ గదళీఫలం బులుఁ స్వీకారము గాగ నన్నమును" శ్రీనాథునివంటి శంకరభక్తకోటికి బెట్టెడు దాత లుండు కొండవీటినగరమునుండి పోయినవానికి పల్నాటిపల్లెలందు దాతలు సున్నగాక మతేమగుదురు? పట్టణము లట్టి భోగభాగ్యములకు, శృంగారములకు, వైభవములకుఁ బెన్నిధానములై యుండఁ బల్లెలు పాప మిప్పటి పల్లెలఁబోలె మిగుల హీనదశయం దుండెను. బ్రాహ్మణపురోహితునికే పల్లెలందు దోసెడు కొంపెలో బసులతొక్కిడి మంచమ్ము, పాసిన వంటకంబు, మాసిన గుడ్డలు, వంటకుండలు, రాసెడు కట్టెలే గతియై యుండ నిక యితరపల్లెల ప్రజయొక్క శుచిత్వముఁగూర్చికాని, జీవనదశఁగూర్చికాని చెప్పబనియేమున్నది. [12]"చిన్నచిన్న రాళ్ళు చిల్లరదేవుళ్ళు, నాగులేటినీళ్ళు నాపరాళ్లు, సజ్జజొన్నకూళ్ళు సర్పంబులును దేళ్ళు, పల్లెనాటిసీమ పల్లెటూళ్ళు" అను శ్రీనాథునిపద్యము వలన నానాటి పల్లెల హీనదశయు, పల్లెటూరివారి దీనదశయు విశదముగాఁ దెలియు చున్నది.

అట్లున్న నీపల్లెటూరివారు మిగుల నమాయకులై, నిరాడంబరజీవనులై యుండిరి. అందువలననే శ్రీనాథునివంటి రసికుడు [13]"రసికుడు పోవడు పల్నా| డెసగంగా రంభయైన నేకులు వడకున్ | వసుధేశుడైన దున్నును |కుసుమాస్త్రుండైన జొన్నకూడే కుడుచున్" నని యున్నాడు. ఏకులువడకు పల్లెటూరి స్త్రీలు రంభలైనను, 'దాక్షారామపురవిహార వరగంధర్వాప్సరోభామినీ వక్షోజంబుల' కస్తూరికావాసనల యాఘ్రాణానుభవము గల శ్రీనాథునివంటి రసికుని కింపుగాని యంగనలగుటం దబ్రమేమి? పరమఛాందసులగు "నగ్రహారపు బ్రాహ్మణులుగూడ ముత్యాలహారములు వేసి, చెంగల్వ విరులుఁ జుట్టి, కస్తూరిపుండ్రములఁబెట్టి, యహర్నిశము నెయ్యి, చక్కెర, పాయసము, కదళీఫలా దుల మెక్కుట నిత్యముగాంచు శ్రీనాథునికి, దున్నుటయే వృత్తిగాగల్గి, జొన్నకూడే యాహారముగాగల పల్లెటూరి ప్రజలు వసుధేశులైననేమి, కుసుమాస్త్రులైననేమి, రసికులుగా గన్పట్టుదురా?"

అట్లయినను కవులు ఖండకావ్యములు, శతకముల రచించుట కవుడవుడే ప్రారం భించుటచేఁ బ్రజాసామాన్యమందు విద్యాభిరుచి కలిగినట్లు దోఁచుచున్నది. కవియు,

12 శ్రీనాథుఁడు పల్నాటికిఁ బోయినపుడు చెప్పిన చాటువు.

13 *Ibid*

బహుషట్తర్కవేత్తయును, భాషావిశారదుడును, [14]వాగ్వాదనిపుణుడును, లౌకిక విజ్ఞానసంపన్నుడును పురాణాగమజ్ఞాననిధియు నగు శ్రీనాథుఁడు కోమటివేము నాస్థానమున విద్యాధికారియై పండితులకవుల పరీక్షఁ జేయుచుండెను.

ఆకాలమందు పన్ను లెగగొట్టునట్టి నేరస్థులకు మన కీనాఁడు తెలియని కొన్ని విధములగు దండనలు వాడుకయందుండెనవి. [15]"నగరవీథుల నెండ కెదురుగా నూరేగించుట, నల్లనిగుండు భుజమున మోయించుట, కాళ్ళకు సంకెళ్ళువేయుట, ముంజేత వెదురుగోడియ నునుచుట" మున్నగునట్టివి. ఈదండనలు శ్రీనాథునికి బొడ్డుపల్లెను గుత్తఁ దీసుకొని ఫలము కృష్ణానది వఱదలవలనఁ బోయి పన్ను చెల్లించలేనపుడు గలిగినవి.

౨. మతము:– రెడ్డిరాజులు మొదటినుండియు ముఖ్యముగా శైవులు. అందులోఁ గొందఱు కొంతకాలమునకు వైష్ణవులైరి. శైవులైనను రెడ్డిరాజులు వైష్ణవద్వేషము లేనివారు. విష్ణ్వాలయాదరణగూడ గలవారు. పోలయవేముఁడు [16]శ్రీశైల దేవాలయమందువలె అహోబిలనృసింహక్షేత్రమునందు యాత్రికుల సౌకర్యార్థము సోపానములఁ గట్టించెను. [17]1410 వ సంవత్సరములో కాటయవేముని భార్య మల్లాంబిక రాజమహేంద్రవరమున మార్కండేయశివాలయమునుఁ గట్టింపగా, నామెభర్త 1405 లోనే సర్పవరము భావనారాయణస్వామి దేవాలయమునందు వసంతరాయమండపముఁ గట్టించెను. పెదకోమటిభూపాలుఁడు శైవుఁడగు శ్రీనాథునిఁ బోషించెను. పాల్కురికిసోమనాది శైవగ్రంథముల రచింపించెను. వీరు శైవులైనను వైష్ణవమతసహనాదరణలఁ గల్గియుండిరనుట నిర్వివాదాంశము.

[18]కోరుకొండరెడ్లు మొదటశైవులైనను, ముమ్మిడినాయకునికాలమునందు వైష్ణవులైరి. అతనికాలమునందే లక్ష్మిదాసి యనునొక వేశ్యచే కోరుకొండపురమున పరాశర

14 విద్యాధికారీ శ్రీనాథో వీరశ్రీకోమభూపతేః

—సింగపురి శాసనము & పొన్నుపల్లి శాసనము.

15 సీ॥ కవిరాజకంఠంబు……… సమరంవ………………

నగరివాకిట నుండు నల్లగుండు………

—మెకన్సి గారి ... చరిత్రము.

16 కం॥ శ్రీపర్వతసోపాన । స్థాపకుఁడు……… —హరవిలాసము.

శ్రీశైలే……సోపానపంక్తిం శుభాం………— మల్లాంబికయొక్క లోత్తర మూడిశాసనము.

17 *Ibid* & *L. R.*, Vol. 2, p. 237.

18 ఆంధ్రులచరిత్ర—Part III.

నృసింహమూర్తియాలయము గట్టఁబడెను. ఎటులైననేమి, రెడ్డిరాజులు హైందవమతోద్ధారకులు. కాకతీయుల రాజ్యము విచ్ఛిన్నమైనపుడు హైందవమతసంరక్షణార్థము ప్రోలయ వేముడు నూతనముగా రెడ్డిరాజ్యమును స్థాపించినవాడు గాన "అగ్రహారములు విద్యాతపోవృద్ధవిప్రుల కిచ్చి యజ్ఞకర్తలు" గఁ జేసెను. రాజాదరణ గల్గిన యాకాలమందు విప్రుల కేమికొఱత? యజ్ఞములకు లోభమేమి? ఇదంతయు రెడ్డిరాజులయొక్క హైందవమతాసక్తికి, బ్రాహ్మణభక్తికి నిదర్శనము. యజ్ఞము లొనర్చుటయం దాసక్తి మంత్రులకు గూడ నుండినట్లు తెలియుచున్నది.[19] కందుకూరి కోమటిరెడ్డికి మంత్రియైన కొమ్మనామాత్యుడు గొప్ప వేదవేదాంగవిదుడై, యజ్ఞములు గావించి సోమయాజి యయ్యెను. 1430 సంవత్సరమునందు యజ్ఞేశ్వరస్వామినిఁ బ్రతిష్ఠించెను.

హరవిలాసము, శివలీలావిలాసము, కాశీఖండము, భీమఖండము, శివరాత్రిమహాత్మ్యము మున్నగు శైవగ్రంథరచన యాకాలమందే చేయబడి యప్పటి యాంధ్రదేశమందలి శైవమతప్రాబల్యముఁ జాటుచున్నది. అయినను శంభుదాసుఁడు గూడ రామాయణము, హరివంశము, అహోబిలక్షేత్రమహాత్మ్యము మున్నగు వైష్ణవమతప్రాధాన్యత గల గ్రంథములు గూడ రచించెను. అట్టి హరివంశమునకు శైవమతానుయాయియైనను ప్రోలయవేముఁడు భర్తయాయెను; అహోబిల క్షేత్రమహాత్మ్యమును విని కాబోలు నతడా క్షేత్రమందు సోపానములుగట్టించి, వైష్ణవభక్తులకు, వైష్ణవక్షేత్రయాత్రికులకుగూడ తనరాజ్యమున స్థానాదరణలున్నవని చాటెను. అయినను శ్రీశైలమందలి జంగమ మఠాధికారులు లక్షాధికారులుగాను, కవిజనపోషకులుగా నుంటఁ జూడ రాజాదరణయే కాక, అధిక జనాదరణగూడ గల్గి శైవమతమెక్కుడు ప్రబలదశయందుండినట్లు రూఢిగాఁ దెలియుచున్నది. కాని యప్పటి మఠాధికారులు కేవలము మతముపేరిట తమ తమ హక్కులకు, నుదరపోషణకుగాఁ బెనగులాడువారుగాక తమధనఘనతలను, శిష్యులను, తెలివితేటలను, హైందవమతోద్ధరణార్థము, విద్యాపోషణార్థము, నూతనహిందూరాజ్యనిర్మాణార్థము వినియోగించిరి. శ్రీశైలమఠాధికారులు శ్రీనాథకవినిపోషించుటయు, నతనిచే శైవమతవ్యాప్తికై శివరాత్రిమహాత్మ్యమును వ్రాయించుటయు, శంకరపీఠాధిపతియగు మాధవవిద్యారణ్యులవారు విజయనగరసంస్థానాభివృద్ధులకుఁ గారకుఁడగుట నిందుకు తార్కాణము. ఇట్టి మఠములకేమి, ఎన్నియో శైవవైష్ణవాలయములకేమి, తదాలయార్చకులకేమి, రెడ్డిరాజులు పెక్కుదానము లొనర్చిరి. వారేకాక వారిభృత్యులు, భార్యలు, బిడ్డలు తమ

19 *Ibid*

తమ యజమానుల యొక్కయు, తాతల యొక్కయు, తండ్రుల యొక్క పుణ్యమునకుగాను వివిధదేవాలయములకుఁ బెక్కు దానము లొనర్చిరి. [20]ప్రోలయవేముడు తనతమ్ముడగు మల్లారెడ్డికి పుణ్యముగా నమరావతీనగరమందలి యమరేశ్వరాలయ శిఖరమునఁ బసిఁడికలశము స్థాపించెను. [21]కాటమరెడ్డి వేమారెడ్డి 1391లో భీమవరపు మండే నారాయణస్వామి యాలయమునకు, దదాలయార్చకునికిఁ బెక్కు దానములు గావించెను. [22]ఈ వేమారెడ్డి భృత్యుడగు కడియం మాచినేనిగారు వేమారెడ్డి కుమారుడగు కుమారరెడ్డి కక్షయసుకృత మౌనట్లుగా దాక్షారామ భీమేశ్వరుని కాస్థానశిలా మండపముఁ గట్టించి తన దైవభక్తియు, స్వామిభక్తిఁగూడఁ బ్రకటించెను. కాటయ వేముని భార్య మల్లాంబిక పతిహితముగా రాజమహేంద్రవరమున మార్కండేయేశ్వ రాలయముఁ గట్టించెను. ఆయాలయమునకు సంబంధించినవాడై యుంటచేఁగాబోలు నృసింహశాస్త్రియనువాని కామె మల్లవరమను గ్రామమును దానమిచ్చెను. [23]ఈ మార్కండేయశివాలయములోనే 1423వ సంవత్సరమందు వీరభద్రారెడ్డి భార్య అతని తల్లి, మార్కండేయశివసన్నిధిని దేవబ్రాహ్మణ క్షేత్రములమీది పన్ను తీసివేసెను.

ఈరీతి రాజులు, రాజసంబంధులే కాక, ధనాధికులుగానుండిన వైశ్యులుకూడ పెక్కుదానములు గావించి వారి మతాశక్తియు, దైవభక్తియుఁ బ్రకటించిరి. [24]1382వ సంవత్సరమునఁ బోలిశెట్టియను వైశ్యుడు తనతండ్రి పుణ్యమునకుగాను రాజమంద్రి నగరేశ్వరస్వామి గుడికి స్తంభదానముగావించెను. [25]1393 లో కోరుకొండయందు ముమ్మిడినాయక పుత్రుని రాజ్యకార్యనిర్వాహకులుగానుండిన సింహాద్రిసెట్టి, ఓబిలిసెట్టి అను వైశ్యద్వితయము కోరుకొండయందలి శ్రీరంగరామాలయమందలి విమానమండపమును, గోపురములను గట్టించిరి. [26]1404 వ సంవత్సరమున పెనుగొండవాసియగు వీరగిరిశెట్టియను వైశ్యుడు కొండవీటినగరేశ్వరాలయమునకు స్తంభదానము గావించెను.

---

20 ఆంధ్రులచరిత్ర—Part III.

21 *L. R.*, Vol. II, p. 235.

22 *Ibid*, p. 124 and 222.

23 సురవిప్రక్షేత్రకరం మార్కండేయేశ సన్నిధే......

—అనితల్లియొక్క కలువచేఱుశాసనము.

24 *L. R.*, Vol. 2, p. 211.

25 *L. R.*, Vol. 19. p. 107.

26 *L. R.*, Vol. 23, p. 283. —Kondaviti Inscriptions

[27]1431 వ సంవత్సరమున గంగమల్లిశెట్టియను కోమటి ద్రాక్షారామ రుద్రేశ్వరునికి శిలా నిర్మితమైన గుడికట్టించెను. [28] ఈ దేవాలయములం దప్పుడు నిత్యనైవేద్యదీపారాధనలును, తిరుబోణములును, పణ్యారములును వాడుకయందుండెడివి. ఈమామూలుపూజలకైనగర కట్టడియనునది యుండెడిది. దానిననుసరించి కొంత బియ్యము, మూడుమానికెల పెసలు, రెండు శేర్లన్నర చింతపండు, నెయ్యితవ్వెడు, బెల్లముపీశెడు, మినుములుఅడ్డెడు, నూనెమూడు మానికెలుగా భీమవరపు మండే నారాయణస్వామి యాలయమున కేర్పాటుగానుండెను. ఇట్టి నగరికట్టడినే 1391లో నితరదానములతోఁబాటు కాటయవేమారెడ్డి యా దేవా లయమున దానమిచ్చెను. సాధారణముగా దానములఁ గ్రహించుటయే యలవాటుగల బ్రాహ్మణులుగూడ తమకు రాజులవలన గల్గిన వృత్తి గృహారామక్షేత్రాదులెల్ల తిరిగి దైవార్పితముగ దానము జేయగల్గిన యక్కాలమందలి దైవభక్తి, త్యాగశక్తి, మతా సక్తి నెంత కొనియాడినఁ దనివిదీరును? [29] 1435వ సంవత్సరమున లింగమభట్టు అను బ్రాహ్మణుడు, తనకు 'అల్లాడరెడ్డి వేమారెడ్డి (వీరభద్రారెడ్డి అన్న) వలనగలిగిన వృత్తి గృహారామక్షేత్రములు ద్రాక్షారామ భీమేశ్వరార్పితముగ నిచ్చివేసెను. అదే వత్సరముననే అదేస్వామికి గౌతమజ్యోషి యను మఱియొక బ్రాహ్మణుడుగూడ అల్లాడ రెడ్డి వేమారెడ్డివలనఁ దనకు గల్గినదెల్లయు దానము గావించెను.

4. రాజులు, రాణులు:— పైన నుడివినరీతి రెడ్డిరాజులు మొత్తముపైన శైవ మతానుయాయులైనను, తదితరమతములయెడ సహనభావముఁ గలిగియుండిరి. శైవ కవులైన శ్రీనాథాదులనే కాక హరిహరోపాసకు లగు నెఱ్ఱాప్రెగ్గడ మున్నగువారిఁ గూడఁ జేరఁదీసిరి. శ్రీశైలాది శివాలయములకు, నహోబిలమాది విష్ణుక్షేత్రములకుఁ బెక్కు దానములు గావించిరి. కవులఁ బోషించుటయేకాక, తాముఁ గూడ కవులై యెన్నియో గ్రంథముల రచించిరి. కుమారగిరిభూపాలుడు వసంతరాజీయమును రచిం చెను. అతని బావమరది కాటయవేముడు, కాళిదాసు నాటకములకు వ్యాఖ్యానము రచించెను. పెదకోమటివేముడు 'శృంగారదీపిక' యను 'అమరుక' వ్యాఖ్య రచించెను. తాము కవులై, కవిజనపోషకులై, వారి సచివులకు, సంబంధులకు, మతాధికారులకు, వర్తకులకుఁ గూడ మార్గదర్శకు లయిరి. అవచి తిప్పయ్య, మామిడి సింగన, బెండపూడి

27 *L.R.*, Vol. 2, p. 175.
28 *Ibid*, p. 235 & 241.
29 *L. R.*, Vol. 2, p. 124—125.

అన్నయామాత్యాదులు ముమ్మిడి శాంతయ్య, కాటయవేమ, అల్లాడ వేములు, దొడ్డారెడ్డి మున్నగు రాజబంధువులును, కవిపోషకులుగా నెన్నదగినవారు. అందు మామిడి సింగన, కాటయవేముడు గ్రంథముల గూడ రచించిరి.

ఇంతియేకాక యప్పటిరాజులు ప్రజాహితకార్యపరాయణులు. ప్రోలయవేముడు చెఱువులు, గుళ్ళు ప్రతిష్ఠించెను. తోటలు, సత్రములు గట్టించెను. చలివిందరలు బెట్టించెను. నగరోపకంఠములు నారామములు వేయించెను. [30]రాచవేముకు జగనొబ్బగండ కాలువఁ ద్రవ్వించెను. [31]కందుకూరిరెడ్లయందు శ్రీగిరిరెడ్డి గొప్ప చెఱువులఁ ద్రవ్వించెను. ఇతని మంత్రి యగు కొమ్మన సోమయాజియు, నతని పుత్రులును, కందుకూరు, కొవ్వూరు చుండిగ్రామముల సమీపమున సస్యాభివృద్ధికి వలయు చెఱువులు, బావులఁ ద్రవ్వించిరి. శ్రీగిరిరెడ్డి పుణ్యమునకుగా నతని పెద్దతమ్ముడు రాచవేమన యనువాడు కందుకూరిలోని జనార్ధనస్వామిపేర నొక చెఱువును బెద్దపూడి గ్రామమున 1398 వ సంవత్సరమునఁ ద్రవ్వించెను.

రాణులందుఁ గూడ కొందఱు ప్రజాహితకార్యము లెన్నియో నొనర్చిరి. [32]పెదకోమటివేముని భార్య సూరాంబ సంతానసాగర మను చెఱువును ద్రవ్వించెను. [33]వీరభద్రారెడ్డిభార్య యగు ననితల్లి పరహితాచార్యుడను పరహితపరాయణుఁడగు వైద్యవరేణ్యునకు భూదానము గావించి వైద్యవృత్తినిఁ బోషించెను.

మాచల్దేవియవతారమే ద్రాక్షారామమందలి భువనమోహిని చిన్నపోతిరాజులిట్టివారగుటచేతనే కాబోలు, జారత్వమొక ప్రతిష్ఠావహగుణముగా నానాడుఁ బరిగణింపఁ బడెను. [34]భీమేశ్వరుఁడే సంతతము దేవవేశ్యాభుజంగుడై యుండినకాలమందు రాయవేశ్యాభుజంగులైన కాకున్న రాజులప్రతిష్ఠకు లోపము రాదా?

---

30 ......రాచవేమక్ష్మావరుండు । తల్లి సూరాంబచే
సముత్పన్నమగుచు । బరగుసంతానవార్ధక వరువ
గాగ । నొలయు గిరివాహినుల జగనొబ్బ గండ ।
కాలువఘటించె — అమీనాబాదు శాసనము—శ్రీనాధ విరచితము.

31 ఆంధ్రులచరిత్ర—Part III.

32 ఫిరంగిపురిశాసనము.

33 కలువచేఱుశాసనము.

34 కాలకూటోపసంహారకారి ...........దేవవేశ్యాభుజంగుఁ డతఁడు ........... భీమఖండము.

5. కవులు:— కనకాభిషేకములు, కస్తూరికాదానములు, హేమపాత్రాన్నములు, రత్నాంబరములు, లభించుచుండ నక్కాలమునఁ గవులకేమి కొదువ? అట్టి కాలముననున్న కవులుగదా ధన్యాత్ములు: వారికిగల గౌరవప్రతిష్ఠ లక్కాలమం దెవరికిని జరిగియుండవు. అట్టి మహాయుగముగాబట్టియే యపుడు వాఙ్మయ మభివృద్ధిఁ జెందినది. ఆకాలమందలి కవులుగూడ మునుపటికవులబోలె ఛాందసము లేక, లౌకిక విజ్ఞాన సంపన్నతఁగలిగి, కేవలము కవితాగోష్ఠియందే తగుల్కొనక ప్రభుత్వ కార్యనిర్వాహకులుగాగూడ నుండిరి. అందువలననే, నన్నయభట్టుకు పిదపఁ జావుభయముచే మున్నూరేండ్లుగా నేకవిచేగాని స్పృశింపఁబడని అరణ్యపర్వశేషము శంభుదాసునిచే నీకాలమునఁ బూరింపఁబడెను. మీఁదుమిగుల నీతడు ప్రోలయవేముని తమ్ముఁడగు మల్లారెడ్డికి మంత్రియైయుండెను. ఇక శ్రీనాథుఁడో చెప్పఁబనిలేదు. ఆతడరయని ఆంధ్రదేశము, నాశ్రయింపని యాంధ్రకవితాపోషకుఁడు, రచింపని వాఙ్మయశాఖ లేనేలేదు. విద్వదౌషధమగు నైషధము నాంధ్రుల కమృతప్రాయము గావించెను. అయఃపిండమగు కాశీఖండము నాంధ్రసరస్వతికి రసగుళికగాఁ జేసెను. వీరగేయముల రచించి ఆంధ్రుల కుదుకెక్కించెను. క్షేత్రమహాత్మ్యములఁ దెల్పి ప్రజలమనసులఁ జూరగొనెను. శృంగారకావ్యములల్లి భోగలాలసులకుఁ గిలిగింతఁబెట్టెను. విద్యాధికారియై ప్రభుత్వాధికారప్రజ్ఞ ప్రకటించెను. గౌడడింఢిమభట్టు నుద్భట వివాదప్రౌఢి నోడించి ముత్యాలశాలయందు ప్రౌఢదేవరాయనిచేఁ గనకాభిషేకముఁ జేయించుకొన్న కవిసార్వభౌముఁడై "సుకవితాయద్యస్తి రాజ్యేన"కిమ్మనుసదిలక్ష్యముగాఁ గల్గెను. కుళ్ళాయి పెట్టి, కోకజుట్టి మహాకూర్పాసముఁ దొడ్గిరాజదర్శనము గల్గునట్లు సందర్భోచితరీతి వేషములువేసి, వలయువారికడ నాదరణ వడయగల్గిన లౌకికవిజ్ఞానసంపన్నుఁడైన శ్రీనాథుని కెన యెవ్వరు? [35]బహుభాషాకోవిదులందు శ్రీనాథుఁడు మిన్న. విద్యాధికారియై విద్యాపరీక్షణవేళలందు బహుదేశజనులతో భాషింపనేర్చిన బహుభాషావిశారదుడు. [36]సంస్కృత ప్రాకృతశౌరసేనా ముఖ్యభాషా పరిజ్ఞానపాటవంబు గలవాడు. ఈతడే గాదు, నీతనిచే వాదమున నోడింపఁబడిన డిండిముఁడుగూడ అష్టభాషావిశారదుఁడని చెప్పఁబడినాడు. ఈయుగమందలి మఱియొక కవియగు నాచనసోముఁడు గూడ అష్టభాషలయందుఁ గవిత్వముఁ జెప్ప గల్గినవాడు.

35 భీమఖండము.

36 నాచికేతూపాఖ్యానము—దగ్గుపల్లి దుగ్గన

ఇట్టికవులేకాక, కవితాగోష్ఠియందు కౌతుకముఁ గల [37]బెండపూడి అన్నయామాత్యాదులు గూడ బహుభాషాప్రజ్ఞఁ గలవారుగా నుండిరి.

ఎటులైననేమి, ఆంధ్రకవితకు, నాంధ్రవాఙ్మయమున కీయుగము సువర్ణయుగ మని చెప్పఁగఁ దప్పదు. ఏదృష్టితోఁ గాంచిన కవితకుఁ గవుల కాకాలమునఁ గల్గిన గౌరవప్రతిష్ఠలు మఱియేకాలమం దాంధ్రలోకమున గలుగలేదు; యికఁ గలుగ నేరవని కూడ తెలతును. అందువలననే ఆకాలమందు కవులేకాక కవయిత్రులుగూడ వెలయుగల్గిరి. విజయనగరరాజవంశమునకుఁ జెందిన కంపరాయనిభార్య గంగాదేవి సంస్కృతమున మధురావిజయ మనుగ్రంథమును రచించెను. ముమ్మిడి శాంతయ్యతల్లి [38]యెమ్మమాంబ సకలవిద్యాప్రౌఢ భారతిఁ బోలినదిగాఁ జెప్పఁబడినది.

6. వ్యాపారము:— రెడ్డిరాజుల కాలమందు దేశమన్నివిధముల నెమ్మదిగల్గి యుండుటచే దేశమందలి వ్యాపారము మిగుల నభివృద్ధియయ్యెను. విదేశములతోడి వ్యాపారముగూడ వృద్ధి జేయఁగోరి మోటుపల్లిరేవున వృద్ధిగావించుటకు [39]అనపోతారెడ్డి క్రీ॥శ॥ 1358 సంవత్సరమందు నందు నెలకొని, అందుమూలమున వ్యాపారముసాగించు వారికి సుంకములేవియు లేకుండఁ జేసెను. మఱెన్నియో సదుపాయములు గావించి యా రేవున వ్యాపారము వృద్ధిగాఁ బ్రోత్సహించెను. ఈ సదుపాయములఁ బాశ్చాత్యదేశముల వారీకాలమునఁ దమదమ దేశవ్యాపార పారిశ్రామికాభివృద్ధికొఱకు అవలంబించు 'Free Trade policy' అనుదానికిఁ బోల్పనగును. ఇందువలన రెడ్డిరాజు లాంధ్ర వ్యాపార పారిశ్రామికాభివృద్ధికి దోహదమిచ్చినవారైరి. [40]పంజాబు, సింహళము, చోటంగి, తవాయి మున్నగు దేశాంతరములనుండియు, ద్వీపాంతరములనుండియు చందనాగరు కస్తూరి మాణిక్యగాణిక్యాదివస్తు సంచయముఁ దెప్పించుచుండిరి. కుమారగిరివంటి రాజు లిట్టివాని నుపయోగించుటకు వసంతోత్సవాదులఁ గావించి రాజాదరణ రాజపోషణ (Royal Patronage) చేకూర్చి యావ్యాపారమునకు వృద్ధిగూర్చుచుండిరి.

---

37 అరబీభాష తురుష్కభాష గజకర్ణాటాంధ్ర గాంధార ఘూ
ర్జరభాషల్ ..................అచ్చెరుపై వచ్చు నరేటియన్ననికి
—భీమఖండము.

38 శివరాత్రిమాహాత్మ్యము.

39 *L. R.*, Vol. 42, p. 423—425 & Ins. 103
*Inscriptions of Madras Presidency* by Rangachari, Vol.II.

40 హరవిలాసము.

[ఇప్పటివలె యంత్రపరిశ్రమలు లేకున్నను వలయు గ్రామపరిశ్రమలు విరివిగానే సాగు చుండినవి. అందు ముఖ్యమైనవిగాఁ బేర్కొనఁబడదగినవి:- (1) నూనెపరిశ్రమ (Oil making industry), (2) బెల్లము పరిశ్రమ (Gur making industry), (3) పాత్రపరిశ్రమ (Vessel-making industry), (4) సుగంధద్రవ్య పరిశ్రమ (Perfumery industry), (5) ఏకులు వడకుట (Spinning industry), (6) ఆభరణ పరిశ్రమ (Jewellery industry).

ఇందు నూనెపరిశ్రమ, ఏకులు వడకుట పల్లెటూరులందు స్త్రీలే సాగించుచుండిరి. సుగంధద్రవ్యముల కధికముగా బేరముండుటచే విదేశమునుండి రప్పించుటయే కాక, ఆంధ్రదేశమందందు కొన్ని కొన్ని చేయబడుచుండినవిగా దోచుచున్నది. అబ్దుల్ రజాక్ మున్నగువారివ్రాతలవలన నక్కాలమున విజయనగరమందు గులాబిపువ్వుల నెక్కువ ప్రియముగా గొనుచుండిరని తెలియుచున్నది. బహుశా గులాబిపువ్వులంత ప్రియముగా గొనుట, అక్కాలపుప్రజాసామాన్యమునకుఁ బ్రియతమమైన అత్తరు, పన్నీరు మున్నగు సుగంధద్రవ్యములఁ జేయుటకుగా నుండవచ్చును. ఈపరిశ్రమలకుఁ దోడుగాఁ గుళ్ళాయిలు, కూర్పాసములు కుట్టుట మున్నగునవికూడ దేశమున విరాజిల్లినవి. ఇట్లు వ్యాపారపరిశ్రమలచేత వర్తకము మిగుల నభివృద్ధి గాంచుటచే వైశ్యులు ధనికులై, ప్రజారాజసమ్మానితులై యుండిరి.

మీఁదుమిగుల నాకాలపు వైశ్యు లిప్పటి యాంధ్రవైశ్యులవలె రాజకీయములందు విముఖతఁ బాటించి ప్రభువులచే ముప్పతిప్పలుఁ బడువారుగారు. అందుచే ప్రభువులు గూడ వారి నుపేక్షింపకుండిరి. [41]అవచి దేవయసెట్టి పోలయవేమునికిఁ గుడిచేయిగా నుండగలిగిన సచివోత్తముడు. అవచి తిప్పయ్య కుమారగిరికిఁగూర్చు మిత్రుడై అతనిచే ఛత్రచామరాదిరాజ చిహ్నములఁ బడసెను. అతనితమ్ముడగు తిరుమలశ్రేష్ఠి వసంతోత్సవాది రాజకార్యముల నిర్వాహణమందు మిగుల సమర్థుఁడై యుండెను. [42]సింహాద్రిశెట్టి, ఓబిలిశెట్టి అనువారు కొండకొండ రాజ్యప్రభుత్వమునే యొకప్పుడు నిర్వహించిరి. అప్పటి వర్తకులు సకల విధ వ్యాపారములు గావించి, విరివిగా ధన మార్జించి ప్రభువులతో వలయు పలుకుఁబడిఁగల్గి, శిల్పకవిత్వాది లలితకళలకుఁ దోడ్పడి ప్రఖ్యాతిఁ గాంచిరి. ఇప్పటి కొందరు వర్తకులఁబోలె నోడనెక్కి సముద్రప్రయాణముఁ జేసిన

41 హరవిలాసము.

42 *L. R.* Vol. 19, p. 107.

వారిని సంఘబహిష్కారముఁ జేయు మూర్ఖఛాందస చాదస్తమానాటి విశాలమనస్కులగు వర్తకుల మనముల నావరించి యుండలేదు. కాన వారంతటివారానాడు గాగలిగిరి.

7. శాస్త్రవిద్యలు, లలితకళలు:— వైద్యము, జ్యోతిష్యము, తర్కము, వేదాంతము, ధర్మశాస్త్రము, ఆగమములు మున్నగు శాస్త్రవిద్యలును, కవిత్వము, సంగీతము, నాటకము, శిల్పము మున్నగు లలితకళ లాకాలమందు బాగుగా నభివృద్ధిఁ గాంచినవి. రాజులు వీనిఁ దామై పోషించుటయేకాక, తమవారినిఁగూడ పోషింపఁ బ్రోత్సహించిరి. పెదకోమటివేముని యాస్థానమున సింగనార్యునివంటి భిషగ్వరులును, మామిడి సింగనవంటి దైవజ్ఞశిఖామణులు నుండిరి. 43సింగనార్య వైద్యశేఖరునికి 1408 సంవత్సరమందు కృష్ణాతీరమున నున్న పొన్నుపల్లి గ్రామమును దానమిచ్చెను. మామిడి సింగన్న సోమసిద్ధాంతమను జ్యోతిషగ్రంథమునకు వ్యాఖ్య రచించెననీ పైన నుడివినారము. వీర భద్రారెడ్డి భార్య అనితల్లి పరహితాచార్యుడను వైద్యునికి కలువచేరను గ్రామము దానముజేసెనని పైనఁ జెప్పఁబడినది. ఈ యాచార్యుడు పరహిత భిషజుడు. అట్టివాని సంభావించి ప్రోత్సహించుట ప్రజలఁ బ్రజలఁబోలెఁ గాంచు ప్రభువులైనవారికెల్లవిధి. కాన రెడ్డిరాజులఁబోలె, వారి సమకాలికులగు విజయనగరప్రభువులుగూడ యీశాస్త్ర విద్యలకుఁ బ్రాపొసఁగిరి. 44మాధవ విద్యారణ్యుల వారొక్కరే సకలశాస్త్రవిశారదులై మాధవనిదానమను వైద్యగ్రంథమును, వ్యవహార మాధవమను న్యాయశాస్త్రగ్రంథమును, కాలమాధవమను జ్యోతిషగ్రంథమును, మాధవవృత్తియను భాషాశాస్త్రగ్రంథమును, మాధవ వేదార్థప్రకాశమను హిందూవేదాంతగ్రంథమును రచించెను.

శాస్త్రవిద్యలవలె లలితకళలుగూడ నీ రెడ్లయుగమునఁ బెంపొందినవి. కుమారగిరి వసంతరాజీయమను నాట్యశాస్త్రమును రచించెను. కాటయవేముడు నాటకత్రయమునకువ్యాఖ్యలు రచించెను. 45నరసింహకవియొక్క కాదంబరీనాటకమును, విశ్వనాథుని సౌగంధికాపహరణనాటకమును రెడ్లకాలమందే రచింపబడినవి. పెదకోమటివేముడును వీరనారాయణచరితభాణమును (నాటకవిశేషము) రచించెను. ఈతని యాస్థానకవియగు 'వామనభట్టుబాణుడు పార్వతీపరిణయము, శృంగారభూషణము' అనురూపకద్వయమును రచించెను. ఇటు నాటకముఁ బెంపొంద, దానితోడ సంగీతకళయుఁ బోషింపఁ

43 పొన్నుపల్లిశాసనము.

44 ఆంధ్ర ఉగాదిసంచిక of 1911.

45 శుక్ల సం॥ర ఉగాదిసంచిక

బడెను. పెదకోమటివేమునకు మిగుల సంగీతపాండిత్యముఁగలవాఁడై 'సంగీతచింతామణి' యను సంగీతగ్రంథమును రచించెను. [46]కందుకూరి రెడ్లయందు శ్రీ గిరిరెడ్డి మిగుల సంగీతవిద్యాప్రవీణుఁడు. కొండవీడు రెడ్డిరాజగు ముమ్మిడినాయకుడు విద్యాధికుల, శాస్త్రవిద్యలఁ బోషించెను. [47]విద్యానగరరాజులందు శ్రీనాథునికి కనకాభిషేకము గావించిన ప్రౌఢదేవరాయలు 'మహానాటకసుధానిధి'ని రచించెను. ఇతని యాస్థానపండితుడు అరుణగిరినాథుఁడు వీరభద్రవిజయమును డిమము (నాటక విశేషము) రచించెను. [48]ఈ ప్రౌఢదేవరాయని కాలమున, నతని యాసనమున కెదుటనున్న తెరకావలఁ బడుచులు సుందరవస్త్రాలంకారభూషితలై నృత్యములు సల్పుచుండి రని 1443-వ సంవత్సరమున విజయనగర వైభవముఁ గాంచవచ్చిన 'అబ్దుల్ రజాక్' అనువాడు వ్రాసియున్నాడు. ఆకాలమందు వీధినాటకముల వేయుచుండిరి. టంకశాలకు వెనుకనున్న బజారునఁ గల యిండ్లగోడలపై సింహవ్యాఘ్రాదుల యాకారములు చిత్రింపఁబడిన వని అబ్దుల్ రజాక్ వలననే తెలియుచున్నది.

శిల్పము:—హైందవమత పునరుద్ధారణకు బద్ధకంకణు లగుటచే రెడ్డిరాజులును, పెక్కు దేవాలయములు శిల్పకళాచాతురి మెఱయఁగట్టించిరి. నృసింహపురాణాది క్షేత్రమాహాత్మ్యములఁ దెల్పు గ్రంథములును, హరవిలాసాది భక్త్యుద్బోధకగ్రంథములునుఁ బ్రచారమునకు వచ్చుటచేఁ బ్రజలు దైవభక్త్యావేశవశులై పెక్కు లిట్టి దేవాలయ శిల్పనిర్మాణమునకుఁ దోహద మొసఁగిరి. ముత్యాలశాలలు, గృహరాజు మేడలు గట్టగల్గిన శిల్పకళావిశారదు లెందఱో వెలసిన కాలమది. ఈ రెడ్డిరాజులకు రాచకొండయందు సమకాలికుఁడగు రావుసింగభూపాలుడు గూడ [49]లలితకావ్యనాటకాలంకార చతురుడు సకలశాస్త్రవిశారదుఁడై యుండెను. కాన రెడ్డిరాజులకాలమందు, తమ రాజ్యమందే కాక, ఆంధ్రదేశమున నెల్లెడలఁ గవిత్వ సంగీతాది లలితకళలును, వైద్యజ్యోతిషాదిశాస్త్రవిద్యలును, మిగుల వృద్ధిఁ జెంది ప్రసిద్ధికెక్కినవనుటకు సందియ మించుకయు లేదు. [50]అల్లాడరెడ్డి, వేమారెడ్డి, గౌతమజ్యోషియను నొక జ్యోతిష్కునికి కెన్ని యో దానము లిచ్చెను.

46 ఆంధ్రులచరిత్ర, Part III.
47 శుక్ల సం||ర ఉగాదిసంచిక.
48 *Forgotten Empire*—R. Sewell.
49 వెల్గోటివారివంశచరిత్ర.
50 *L. R.* Vol. 2, p. 124—125.

10. వింతలు, విశేషములు, వినోదములు:—ఆకాలమందు విజయనగరాదికపట్టణములందు పూటకూటి యిండ్లుండినవి. కాని యీపూటకూటియిండ్లయందు వెల్లుల్లి, తిలపిష్టము, చల్ల, అంబలి మాత్రము దొరకుచుండెడివి.

[51]అప్పటివంటకములగూర్చి వెంకటేశ్వరశతకమందొక పద్య మున్నది.

చం॥ అరిసెలు నూనెబూరెలును, నౌగులు, జక్కెరమండెగల్ వడల్
బురుడలు, వాలుమండెగలపూపము లయ్యలమేలుమంగ నీ
కరుదుగ విందుబెట్టెఁ బరమాన్నశతంబుల సూపకోట్లతో
నిరతవిసిక్తలాన్నముల నేతుల సోనల వెంకటేశ్వరా!

ఇట్టి విందులు దేవతలకే ఇక దేవతా భక్తకోటికన్ననో

ఉ॥ [52]ఆతతభక్తి సంపద నహర్నిశమున్ ఘృతఖండశర్కరా
పాతముతోన పూపములు పాయసముల్ గదళీఫలంబులున్
స్ఫీతముగాగ నన్నములు పెట్టును శంకర భక్తకోటికిన్......

ఇట్టి సుఖభోజనములు, నిర్భయమునబోవు యాత్రలు, కస్తూరివాసనాది శృంగారములు, చింతారహితజారత్వము, రత్నాంబరధారణము, తారహారాద్యనేకాభరణములు, నా రెడ్డికాలమున, ఆచల్లనిరాజ్యమున నెమ్మదిగా గల్గి హాయిగాఁ గాలముగడపిన ఆంధ్రులకంతటిదశ యిక నేనాటికైన గల్గునా?

ఆకాలమందు మనదేశమందు, పాశ్చాత్య దేశములందువలె; దీనారములు, టంకములు, మాడలు మున్నగు బంగారునాణెములు వాడుకయం దుండినవి. ఈ టంకములు జేయుశాలనుబట్టియే నాణెములొనర్చుయంత్రశాలకు 'టంకశాల' యను శబ్దము మనయాంధ్రదేశమున నేనాటికి వాడుకయం దున్నది.

ఇట్టి బంగారునాణెములతోఁ, బ్రఖ్యాతిగాంచిన శ్రీనాథునివంటి కవులకుఁ గనకాభిషేకములుఁ జరుపుచుండెడువారు. అప్పటిరాజులు, గుఱ్ఱపుస్వారి, వేట, వేశ్యాసంపర్కము, విద్యాగోష్ఠి, పరరాజ్యములపైదాడి, వసంతోత్సవాది వినోదవిశేషములఁ గాలము గడుపువారు. [53]వీరభద్రారెడ్డి సోదరుడు దొడ్డారెడ్డి గుఱ్ఱపుస్వారియందు

---

51 తాళ్ళపాక అన్నమయ్యగారి వెంకటేశ్వరశతకము.

52 హరివిలాసము.

53 ఆంధ్రుల చరిత్ర—Part III.

గొప్ప పేరొందినవాఁడు. [54]శ్రీనాథునికిఁ గనకాభిషేకము గావించిన ప్రౌఢ దేవ రాయలు, 'ఏనుగవేట'యందు మిగులనిపుణుడగుటచే 'గజబెంటె' దేవరాయలని బిరుద మందెను. కుమారగిరిరెడ్డి వసంతోత్సవములందే మున్గి తేలుచు వసంతరాజనుఁ బేరున వెలసెను.

అనపోత, పోతనాదిక దేశీయనామశబ్దము లన్నికులములందున నెన్నియో వాడుక యందుండినవి. స్త్రీలకు గౌరవవాచకముగ సానిశబ్దము వాడబడుచుండెడిది. [55]బ్రాహ్మణ కవీంద్రుఁడగు బమ్మెరపోతన కూడ పోతనయే. ఈ ద్రావిడదేశీయ శబ్దము లప్పటి శక్తి దేవతాపూజాధికతవలన విరివిగా వాడుకయం దుండినవేమో? [56]శ్రీనాథునివంటి కవీంద్రుఁడుకూడ మొంటి స్తంభపుమేడ విషయముగాఁ దనమాట నిలుపుకొంటకు నవులూరి లోని పోతరాజను దేవునికే జాబువ్రాసెనట. ఆతని పోషకుఁడగు పెదకోమటివేముఁడు ముల్లగూరిమహాదేవికి, నాగవరపుఅమ్మ, వేములమ్మ, పుట్టలమ్మ, ముత్యాలమ్మ మున్నగు శక్తిదేవతాలయములఁగట్టి క్రిమోత్సవములఁ జరిగించెను.

[57]చేతివ్రాతకూడ ఆకాలమున నొకలలితకళ. కాటయవేమునికడఁ బసిఁడిగంట మునఁ 'గంటకమంత్రిలగుండెలు' జలుజలు జల్లుజల్లుమన, సత్కవివర్యులు మేలుమేలన వ్రాయఁగలిగిన 'రాయనిబాచడు' అను వ్రాయసకాఁడొకఁడుండెను. [58]బెండపూడి అన్న యామాత్యుఁడుకూడ 'కాకితమందలి వర్ణపద్ధతుంబు గన్నులపండువై యమరు' నట్లు పసిడి గఁటముతో నయకావ్యసరణిని వ్రాయగల్గినవాఁడు.

---

54 కొ॥ లక్ష్మణరావుగారి హిందూదేశచరిత్ర—మహమ్మదీయ మహాయుగము.

55 ఆంధ్రులచరిత్ర— Vol. III.

56 *L. R.*, 57—p. 21—23.

57 ఆంధ్రులచరిత్ర— Part III.

58 భీమఖండము & ఆంధ్రులచరిత్ర.

# పదునాల్గవ శతాబ్దిపూర్వపు రెడ్డివీరుల యున్నతి.

కొత్త భావయ్యచౌదరి.

వేంగీదేశమున చాళుక్యసామ్రాజ్యమును, ఓరుగంటియందు కాకతీయసామ్రాజ్యమును విజృంభించుచుండిన 11, 12, 13 శతాబ్దులలో రెడ్డికులజు లెచ్చటగాని ప్రత్యేక రాజ్యమును పాలించుచుండలేదు గాని చాళుక్య, కాకతీయసామ్రాజ్యములలో నప్పటికి నివసించుచునే యచ్చటచ్చట కొందరు రెడ్డివీరులు రాజసేవఁజేయుచుండి, దేశపాలనలో పాల్గొనుచు వచ్చినట్లు యిప్పటికి దొరకిన శాసనములనుబట్టియు, మన యాంధ్రభాషా వాఙ్మయమువల్లను స్పష్టపడుచున్నది. రెడ్డికులజులు ప్రత్యేక మొకతెగగా నేర్పడిన పిమ్మట ననగా దాదాపు 12 వ శతాబ్దమునుండి వీ రెచ్చటెచ్చట రాజసేవలో ప్రసిద్ధి నందుచు వచ్చిరో యావిషయములను సంగ్రహముగ నీవ్యాసమున బేర్కొనెదను.

శా.శ. 1039 సం॥లో కమ్మనాటిలోని పేరింపల్లి (బాపట్ల) ప్రాంతమున మావుందల కొమ్మిరెడ్డి కొడుకు పోతిరెడ్డి యనునతఁడును, శా. శ. 1085 సం॥ ప్రాంతమున తాడూరి పురపాలకుఁడగు మారసాని కేతిరెడ్డి చేజెర్లవద్దను ప్రసిద్ధిజెందిన రెడ్డివీరులుగ గన్పడుచున్నారు. వీరి శాసనములు బాపట్లలోను, చేజెర్లయందును గన్పడుచున్నవి.[1]

శా. శ. 1061 సం॥ ప్రాంతమున వెలనాటికులోత్తుంగ గొంకరాజువద్ద ముమ్మడి భీమవరం అయ్యపరెడ్డి కొడుకు నూంకారెడ్డియనునతఁడు కొకసెట్టిగానుండి ద్రాక్షారామమునందలి శ్రీ భీమేశ్వరస్వామి కఖండదీపదానము గావించియుండెను.[2]

శా. శ. 1080 సం॥ ప్రాంతమున కులోత్తుంగరాజేంద్ర చోడరాజువద్ద ఇలిందవాడ సూరపరెడ్డి యనునతఁడు ముదుసరియను నుద్యోగమునందుండెను. ఇతఁడుగూడ శ్రీ దాక్షారామభీమేశ్వరాలయమునందలి ఆదివినాయకదేవునకు మధ్యాహ్నసంధ్యవేళల యారగింపునకై 1500 చెట్లుగల పోకతోటను దానమిచ్చి శాసనము వ్రాయించి యుండెను.[3]

1 దక్షిణహిందూదేశశాసనసంపుటము VI శా. సంఖ్య 195, 598, 600.
2 డిటో IV ,, 1139.
3 డిటో IV ,, 1174.

తూర్పు చాళుక్యచక్రవర్తియగు కులోత్తుంగచోడదేవుని విజయరాజ్యము 15 సం॥ నాటికి (క్రీ. శ. 1091 సం॥) ద్రాక్షారామప్రాంతమున తెప్పనవిట్టపరట్టడి, బోనిరట్టడి, నడకుదిరి సూరపరట్టడి, అండపురి అయితమరట్టడి, బెండనిపూడి కామిరట్టడి, పెంబల్లి వాడసోమురట్టడి యనువారలు ప్రసిద్ధిగానుండి శ్రీభీమేశ్వరసన్నిధానమున వెలనాటి గొంకనృపాలుని యానగా బ్రతిజ్ఞ జేయుచు వ్రాయబడిన యొకశాసనమున చేవ్రాళ్ళు నుంచినట్లు గన్పడుచున్నది. [4]ఈరట్టడి బిరుదాంకితులందరును రెడ్డివీరులే యైయుందురని తలచుచున్నాను.

గుడిమెట్టసీమను శా. శ. 1112 సం॥ప్రాంతమున బాలించుచు వచ్చిన చాగిదోరయరాజను మహామండలేశ్వరునివద్ద గంధసిరి సూరపరెడ్డి యనునతఁడొకయుద్యోగిగా నుండి బెజవాడలోని శ్రీమల్లేశ్వరస్వామి కఖండదీపదానము గావించియుండెను.[5]

శా. శ. 1065 సం॥ ప్రాంతమున కడలునాంటిలోని ముంజేటిగంగిరెడ్డి యనునతఁడుండి తనవృత్తియైన అలమును సకలసంపదలతో శ్రీభీమేశ్వరునకు ధారాపూర్వక మొనర్చియుండెను.[6]

ధరణికోటను పాలించుచు వచ్చిన కోట బేతరాజువద్ద శా. శ. 1163 సం॥ప్రాంతమున ముత్తసాని కాటమరెడ్డి యనునతఁడొక యుద్యోగిగానుండి తనతమ్ముడు బైరెడ్డితోను, చెల్లెలు దెన్నసాని కుమారుఁడు యెఱ్ఱంగొమ్మనాయఁడుతోను, మరదియగు సూరపనాయునితోను కలిసి బేతరాజునకు ధర్మార్థముగా యనమదల గ్రామమందు (గుంటూరుతాలూకాలోనిది) వీరభద్రస్వామిని ప్రతిష్ఠించి యాదేవునికి పల్లపుభూమి మరుతును, మెట్టచేను ఖ3 ను దానమిచ్చి శాసనమువ్రాయించెను.[7] కమ్మరాష్ట్రమునందలి రెడ్డివీరు లీవిధమున బ్రసిద్ధిజెందుచుండు కాలముననే కాకతీయరాజులవద్దగూడ కొందరు సేనాధిపతులుగ బ్రసిద్ధినందుచు వచ్చిరి. అట్టివారిలో మొదట బేర్కొనదగినవాఁడు రేచెర్లబమ్మ సేనానిఅనుబమ్మిరెడ్డి. ఇతఁడుకాకతీయప్రభువుక్రీ.శ.1050-80 సం॥లకు మధ్య పాలించిన మొదటిప్రోలరాజువద్ద సేనాధిపతైఉండి, కాంచీపురచోళరాజులతో జరగిన యుద్ధమున వారిని జయించి మిక్కిలి ప్రఖ్యాతి బడసెను.[8] ఆతనితర్వాత నాతనివంశ

4 డిటో 1174
5 డిటో 790
6 డిటో 1361
7 డిటో 933
8 కాకతీయసంచిక. అనుబంధము. 18, 19 శాసనములు.

మున వరుసగా ముచ్చసేనాని, కాటచమూపతి, కామచమూపతి యను వీరులుద్భవించి కాకతిరాజుల కొలువులోనే యున్నట్లు కన్పడుచున్నది.[9] కామచమూపతి క్రీ.శ. 1115-1158 సం॥ల మధ్య పాలించిన రెండవప్రోలరాజు కాలముననుండి మంథన్యగుండాధిపుడను ప్రోలరాజు వైరిప్రతిని సంహరించి ఖ్యాతిగాంచెను.[10] ఈ కామచమూపతి కుమారులగు రేచెర్ల బేతిరెడ్డి, నామిరెడ్డి యనువారలు వరుసగా కాకతిరుద్రదేవునివద్దను (క్రీ. శ. 1156—1195 సం॥ మధ్య పాలించినవాఁడు) గణపతిదేవచక్రవర్తివద్దను (క్రీ. శ. 1198—1261 సం॥) సేనానులుగ వ్యవహరించిరి.[11]

ఈ యిర్వురును మిక్కిలి ప్రసిద్ధులుగా నుండినట్లు వీరికిగల బిరుదావళులే తెలుపుచున్నవి. సకలగుణగణాలంకార, పరనారీదూర, ఆమనికంటి పురవరేశ్వర, వీరలక్ష్మీనిజేశ్వర, మార్బలభీమ, రణరంగరామ, విశరణకర్ణ, శౌర్యసౌపర్ణ, పతిహితాంజనేయ, శౌచగాంగేయ, సత్యరత్నాకర, దుష్టజనభీకర, స్వామిద్రోహరగండ, బేతనదండ, మనుమకులాదిత్య, సుభటసంస్తుత్య నామాదిబిరుదములు బేతిరెడ్డియు, నాతనితర్వాత నామిరెడ్డియు వహించుచు వచ్చిరి.[12]

బేతిరెడ్డి భార్యయగు మైలక్కసానియు, నామిరెడ్డియు పిల్లలమర్రియందు వరుసగా శా. శ. 1130, 1117, 1124 సం॥ల యందు శ్రీ ఎఱకేశ్వర, కాచేశ్వర, కామేశ్వర, నామేశ్వరదేవాలయములను గట్టించి వాని కనేక భూదానములను గావించి యుండిరి.[13] బేతిరెడ్డి కుమారుడగు మల్లారెడ్డికూడ మిక్కిలి ప్రసిద్ధిగలవాఁడనియే మైలక్కసాని శాసనమున నభివర్ణింపఁబడియున్నాఁడు.[14]

ఈనామిరెడ్డి, బేతిరెడ్లు నేటి వెంకటగిరి సంస్థానము వారికి మూలపురుషుఁడుగా వారివంశావళియందుఁ జేర్కొనబడిన చెయ్యేరిపోలిరెడ్డికి మేనమామలుగాఁ గన్పడుచున్నారు. ఈపోలిరెడ్డి శా. శ. 1124 సం॥కు పూర్వమే సంతానముగల్గినపిమ్మట నవగా చెవిరెడ్డి యను కుమారుని గాంచినతరువాత చనిపోవుటవల్లగాబో లప్పటికింకను జీవించి

9 తెలింగానాశాసనములు. పుటలు. 13, 27, 32.

10 పాలంపేట శాసనము. (Hyd Arch Ser m. 3.)

11 కాకతీయులచరిత్రము కాకతీయ సంచిక.

12 తె. శా. పుటలు, 30, 35.

13 డిటో 18, 30, 35.

14 డిటో 14.

యుండిన యాతనితల్లియగు వల్లాసాని యాతనిపేరిట ప్రోలేశ్వరాలయ మొకటి గట్టించి నామిరెడ్డి యనుమతితో గొంతెభూమి నాదేవళమున కొసంగినట్లు నామిరెడ్డి శాసనము వల్ల తెలియుచున్నది.[15] ఈశాసనమందు చెయ్యూరను యింటిపేరు కన్పడకున్నను, సందర్భముల నన్నిటిని యోచించి చూడగా, వల్లాసాని కుమారుఁడగు ప్రోలయయే చెయ్యూరిపోలిరెడ్డిగాని యన్యుఁడుగాఁడని యూహించవలసి వచ్చుచున్నది. పిల్లలమర్రి రాజ్యమంతకు పూర్వమునుండి వెలుగోటివారివంశీకులదని వారివంశచరిత్రకారులు నిశ్చయించి. నామిరెడ్డి సోదరుఁడగు బేతిరెడ్డిని, చెయ్యూరిపోలిరెడ్డి కుమారుఁడును భేతాళ రెడ్డి యను నామాంతరముగల చెవిరెడ్డిని యొకరిగనే తలంచిరి గాని వారిర్వురకుగల సంబంధమును గనిపెట్టజాలకపోయిరి.[16]

చరిత్రకారులలో కొందరిప్పటివరకును లోగడ చెప్పబడిన రేచెర్ల రెడ్డి వంశమునకును, వెంకటగిరివారి మూలపురుషుఁడగు బేతాళరెడ్డి వంశమునకు సంబంధములేదనియు రేచెర్ల రెడ్ల పాలనముతర్వాత నీవెలమకులజు లారాజ్యమును సంపాదించిరనియు తలంచి యున్నారు. కాని యావంశీకు లన్యోన్యసంబంధము గలవారేనని యూహింపరైరి.[17]

నామిరెడ్డి యనంతర మాతని కుమారులగు కాటిరెడ్డియు, కామిరెడ్డియు మేనల్లుఁడగు చెవిరెడ్డియను బేతాళరెడ్డియు గణపతిదేవచక్రవర్తికడ సేనాధిపతులుగా మెలంగుచు వచ్చిరి గాని అమనగంటి లేక పిల్లలమర్రిరాజ్యము నామిరెడ్డి కుమాళ్ళే పాలించుచు వచ్చిరి. వారి శాసనములలో బేతిరెడ్డి, నామిరెడ్లు వహించిన బిరుదావళులే కన్పడుచున్నవి.[18] అచట చెవిరెడ్డి పాలనము లేకుండుటవల్లనే యాతని శాసనము లేమియు నాప్రాంతమున గన్పడుటలేదు. గణపతిదేవచక్రవర్తి (క్రీ. శ. 1261 సం॥లో) చనిపోయినపిమ్మట చెవిరెడ్డి కుమాళ్లు (దామ ప్రసాదిత్య, రుద్రనాయడులు) రుద్రమదేవి చక్రవర్తినికి బాసటగా నిల్చియుండిరి. అందు ప్రసాదిత్యనాయఁడామెకు బట్టము గట్టి కాకతిరాజ్యస్థాపనాచార్య బిరుదును వహించెను. మరియు రాయపితామహాంక బిరుదునుగూడ బొందెను.[19]

15 తెలింగానా శాసనములు, పుట 30.

16 వెలుగోటివారి వంశచరిత్రము.

17 కాకతీయ సంచికలోని శ్రీ మా. రామారావుగారివ్యాసము.

18 తెలింగానాశాసనములు పుటలు 40, 51.

19 వెలుగోటివారి వంశావళి.

చెవిరెడ్డివంశీకు లప్పటికి దేశమున విజృంభించిన వీరవైష్ణవమతమున బ్రవేశించి సంఘసంస్కరణము నారంభించి, యితర హీనకులస్థులతో సమానముగ వ్యవహరించుట వల్ల నప్పటినుండియు వెలమవారను పేరిట బ్రసిద్ధినొందినట్లు గన్పడుచున్నది.

రుద్రమదేవిచక్రవర్తిని చెవిరెడ్డికుమాళ్ళ సమర్థతను గుర్తించి పిల్లలమర్రి పాలనమును వారి పరము జేసినట్లు కన్పడును. గణపతిదేవచక్రవర్తి చనిపోయినపిమ్మట నాతనికిని, తమ తల్లిదండ్రులకును పుణ్యమునకై నామిరెడ్డి మనుమలగు గణపిరెడ్డి, మర్రిరెడ్డి, నామయ, మల్లయలు వ్రాయించిన నాగులపాటి శాసనములలో[20] వారేవిధమైన బిరుదములను ధరించినట్లు వ్రాయకపోవుటవల్ల నప్పటికి పిల్లలమర్రి రాజ్యమును, రుద్రదేవిచక్రవర్తిని చెవిరెడ్డికుమాళ్ళ పరమొనర్చియుండెనని తలంపవచ్చును. ఈశాసనములలో నుదహరింపఁబడిన రక్తాక్షి, క్షయసంవత్సరములు వరుసగా క్రీ. శ. 1264, 1266 సం॥ల నాటివిగా గన్పడుచున్నవి. అప్పటినుండియు నీరేచెర్ల గృహనామస్థుల విషయము చరిత్ర ప్రసిద్ధి గాలేదు గాని చెవిరెడ్డివంశీకుల ప్రతిభ క్రమముగా హెచ్చి, వారే వెలమకులమను పేరిట ప్రత్యేక తెగవారై నాటినుండి నేటివరకు పారంపర్యముగ ననేక స్థలముల బాలించుచు వచ్చినట్లును, ఆ తెగలోనివారే నేటి వెంకటగిరి సంస్థానాధిపతులనియు వెలుగోటివారి వంశావళివలన స్పష్టపడుచున్నది.

రుద్రమదేవిచక్రవర్తి కాలముననే శా. శ. 1216 సం॥ నాటికి గోన గన్నారెడ్డియను వీరుఁడు మిక్కిలి ప్రసిద్ధివహించి చక్రవర్తినికి సామంతుఁడుగా వర్ధమానపురము రాజధానిగా నాంధ్రరాజ్యములోని పడమటిభాగమున నధికారము వహించియున్నట్లు గన్పడును. ఈయనవద్ద విఠలనాథుఁడను సేనాని యుండెను. ఇతఁడుగూడ మిక్కిలి శూరాగ్రేసరుఁడై యుండెను. రాచూరిలోని యొక శాసనమునుబట్టి చూడగా నతఁడా మండలములోని ఆదవాని, తుంబుళము, మానువ, హాలువ మున్నగు దుర్గములు సాధించినట్లు తెలిసెడిని. ఈ గోనగన్నారెడ్డి కనేక బిరుదావళు లుండెను. సమస్త గుణగణాలంకార, సత్యరత్నాకర, సౌజన్యగౌరవ, అరిగండభైరవ, సాహసోత్తుంగ, కాకతీయకటకసన్నాహ, వీరవితరణోత్సాహ, కదుపులూరి పురవరాధీశ్వర, వీరలక్ష్మీనికేశ్వర, మనుమకులమార్తాండ, మీసరగండ, ఉభయబలగండ, గండరగండ, అభంగగండభేరుండ, హన్నిబ్బరగండ, హదిమువ్వరగండ, లాడకువరపెండార, చోళజగదాళవీరకాంతికార,

20 తె. శా. పుటలు 67, 68.

గళమాళి, దుష్టతురగరేఖారేవంత, సమరసముయ, దుర్వారవీరావతార, కోసగిమైలితల గొండుగండ, ఉప్పలసోమసితలగొండుగండ, ఏందిభూపాలుని తలగొండుగండ, మేడిపలి కాచయనాయకుని శిరఃఖండ, కందూరి కేశినాయని తలగొండుగండ, అపాక భీమనిర్ధూమ ధామ, నిరుపమసంగ్రామరామ, తెత్రాలజాటదిశాపట్ట, ఎఱువతొండ ధూమఘట్టనఘ రట్ట, బేడచెలుకినాయని నిస్సాణహరణ, సహజకార్యభరణ, కోటపెమ్మాడిరాయ కంఠాభరణచూఱకార, చోడోదయపట్ట సూత్రతురంగాపహార, రుద్రదేవ దక్షిణభుజ దండ, నిజకీర్తిపూరిత బ్రహ్మాండకరండ, పరబలోద్దండ, శ్రీ సోమనాథదేవదివ్య శ్రీపాద పద్మారాధక, పరబలసాధక, మున్నగు బిరుదము లితఁడు ధరించినవి.

వీనినిబట్టి రుద్రమదేవి రాజ్యారంభమున ధిక్కరించిన సామంతరాజుల నేకులతో నీ మహావీరాగ్రేసరుఁడు యుద్ధమాడి జయించినట్లు స్పష్టపడుచున్నది. వీనిని చర్విత చర్వణముగా జెప్పుటకన్న, పైబిరుదములవల్లనే సులభముగ గ్రహింపవచ్చును.

పైన నుడివిన రెడ్డివీరులందరివలెనే యీ గన్నారెడ్డియు శైవభక్తుఁడై యుండెను.

ఈకాలముననే గోనవిఠలరాజు కుమారుఁడు బుద్ధరాజనునతఁడు మిక్కిలి ప్రసిద్ధికి వచ్చి 'కవిలోకభోజుఁ' డను బిరుదును వహించి రంగనాథరామాయణ మను ద్విపద కావ్యమును రచించి తనతండ్రికి కృతి నొసంగెను. ఈతనితండ్రియగు విఠలరాజునకు "అరగండభైరవ" బిరుదమున్నట్లు గ్రంథమున వ్రాయఁబడెను. అందుచే విఠలరాజు గూడ నొక సేనాధిపతిగనే యున్నట్లూహింప నగుచున్నది.

ఈ బుద్ధరాజు తన కుమార్తె కుప్పాంబను దుర్జయవంశీకుఁడును, రుద్రమ దేవిచక్రవర్తినికడ నొక సేనాధిపతియు నగు మల్యాలగుండ దండాధిపుని కిచ్చి వివాహ మొనర్చెను.[21] ఈబుద్ధరాజుకుమారులలో 'మీసరగండ' బిరుదాంకితుఁ డగు కాచవిభుఁడను నతఁడు ప్రసిద్ధికి వచ్చెను. ఈ బిరుదమువల్లనే యితఁడు గూడ నొక సేనానిగ గన్పట్టును. కాచవిభుఁడు వీరపురుషుఁడగుటయే గాక తనతండ్రివలెనే కవీశ్వరుఁడై యుండి తానును దనతమ్ముఁడగు విఠలభూపతియును గలిసి యుత్తర రామాయణమను ద్విపదకావ్యమును రచించి తమతండ్రి కంకిత మిచ్చిరి.

వీరప్రతాపరుద్రదేవచక్రవర్తి పాలనమునాటికి (క్రీ. శ. 1296 సం॥) గోనబుద్ధ రాజునకు కాచమాంబయందు జనించిన మారయసాహిణి యనునతఁడు ప్రసిద్ధుఁడై,

21 వర్ధమానపుర, బూదపుర శాసనములు.

యాచక్రివర్తివద్ద అశ్వసైన్యాధిపత్యమును వహించియుండెను. ఇతఁడు భాస్కరరామా యణమునకు కృతిభర్తయయ్యెను. భాస్కరరామాయణము కృతినొందిన మారయ సాహిణి నియోగిబ్రాహ్మణమంత్రి యని 32 మంత్రులచాటుపద్యమున వ్రాయబడిన వ్రాత నిరాధారమైనదిగ గన్పడుచున్నది. పైన నుడివిన గోనవంశమువారందరును వరుసగా రామాయణములే వ్రాయించియున్నట్లు కన్పడుటవల్ల నీయనగూడ నీవంశము లోనివాఁడేననియు, దన పూర్వీకులపోకడనే పోయెననియు గ్రహింపవచ్చును.

ఈతఁడు కృతినొందిన రామాయణమును మల్లికార్జునభట్టు, కుమారరుద్రదేవుడు, భాస్కరుడు, అయ్యలార్యుఁడు నను నల్వురుకవులచే బూరింపఁబడినది. ఇందలి కొన్ని భాగములుశివునకంకితము చేయఁబడియున్నవి. ఈమారయసాహిణిపుణ్యమునకై పల్నాటి సీమ కధికారిగానుండిన మాచయసాహిణి క్రీ. శ. 1311 సం॥లో నొకధర్మముగావించి శాసనమువ్రాయించెను వీరప్రతాపరుద్రదేవునికడ నింకను గొందరు రెడ్డిప్రముఖు లుద్యోగులుగా నున్నట్లు నిదర్శనములుగలవు. వేమారెడ్డి, బొబ్బారెడ్డి మున్నగు ప్రముఖులు సేనాధిపతులుగా నున్నట్లును వారు రుద్రదేవుని పరిపాలనాకాలము చివర ననగా క్రీ.శ. 1323 సం॥లో జరిగిన మహమ్మదీయ దండయాత్రలలో బోరాడుచున్నట్లును స్థానికచరిత్రలవల్ల దెలియుచున్నది.

పైన నుదహరించిన రెడ్డిప్రముఖులేగాక నాంధ్రదేశమున నున్నతస్థితికివచ్చిన రెడ్డిజనులాకాలమున ననేకు లుండెడివారని యాంధ్రదేశమునగల వారిశాసనములను బట్టి నిశ్చయింపవచ్చును. ఇట్టి శాసనములు కొన్ని భీమేశ్వరాలయముననను, బెజవాడలోని మల్లేశ్వరాలయముననను మరికొన్నిచోట్లను గలవు. దిఙ్మాత్రముగ నుదహరించిన పైవిషయములనుబట్టి 12, 13 శతాబ్దములలో రెడ్డివీరు లాంధ్రదేశమున క్రమముగా పలుకుబడి సంపాదించి, దేశపాలనలో బాల్గొనుచు, కాకతీయ చాళుక్యసామ్రాజ్య నివాసస్థులుగానుండి క్రీ.శ 1323 సం॥ ప్రాంతమున ప్రతాపరుద్రుని యోరుగంటిరాజ్యమును మహమ్మదీయులు భగ్నపరచినపిమ్మట నద్దంకిలో వేమారెడ్డిచే స్వతంత్రరాజ్యమును స్థాపించుటకు దోహద మిచ్చిరని తలంపవలసియుండును.

# రెడ్డిరాజుల యజ్ఞాతశాసనములు.

నేలటూరు వెంకటరమణయ్య,
రీడర్ - మద్రాసు యూనివర్సిటీ.

ఈక్రింది నాలుగుశాసనములును కొండవీడు రాజమహేంద్రవరములు రాజధానులుగా సముద్రతీరాంధ్రదేశమును బరిపాలించిన రెడ్డిరాజులవి. షుమారు ౧౩౦ సంవత్సరములక్రింద కర్నల్ కాలిన్ మెకంజీగారు శాసనసంపాదనార్థము పంపిన గుమాస్తాలు ఈ శాసనముల మాతృకలనుజూచి నకళ్ళు వ్రాసికొనిరి. ఆ నకళ్ళబడి వ్రాసు కొన్న ప్రతులను ఇచ్చట ప్రకటించుచున్నాను.

ఇందు ౧వ శాసనము ద్రాక్షారామములోనిది. అసంపూర్ణము - శాసనము చెక్కియుండినరాయి మెకంజీసర్వేవారు చూచినప్పుడె భిన్నమై అందొక తునకమాత్రము వారికి లభించెను. లభించిన తునకపై నాలుగు (౧, ౨, 3, ౬) సంపూర్ణశ్లోకములును మూడు (౪, ౫, ౭) శ్లోకభాగములును గలవు. ఇవి వీరాన్నపోతనరపాలుని వంశమును వర్ణించుచున్నవి.

అనపోతారెడ్డి భార్య మనుమాంబిక
|
కుమారగిరిరెడ్డి
|
వీరాన్నపోతనృపతి.

ఈ శాసనలేశ మింకను గవర్నమెంటు శాసనశాఖవారికి లభ్యపడలేదు. మఱియెవ్వరును దీని నెచ్చటను బ్రకటించినట్లు తోఁచదు. దీనివల్ల నూతనమైన విషయములు రెండు తెలియవచ్చుచున్నవి. ౧. అనపోతారెడ్డి భార్యపేరు మనుమాంబిక యనుట మొదటిది. ఇతరత్ర ఎచ్చటను అనపోతునిరాణి పేర్కొనబడియుండలేదు. శ్రీ వే. ప్రభాకరశాస్త్రిగారు శృంగారశ్రీనాథమున 'ననపోతారెడ్డికి మనుమాంబయను భార్య' యుండినట్లు వ్రాసియున్నారు; కాని ఈ శాసనముఁ బేర్కొనరైరి. ౨. రెండవది, యనపోతమనుమాంబికల పుత్రుఁడైన కుమారగిరికి వీరాన్నపోతనరపతియను కుమారుఁ డుండెననుట - కుమారగిరిరెడ్డికి పుత్రుఁ డొకఁడుండెనని యాంధ్రుల చరిత్రాంతర్గత

మైన రెడ్లచరిత్రను బఠించినవారంద ఱెఱిగినవిషయమే. "కుమారగిరిరెడ్డి కొక కుమారుం డున్న ట్లొకటిరెండుశాసనములవల్ల దెలియు" వచ్చుచున్నట్లు శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు ఆంధ్రులచరిత్ర తృతీయభాగము ౧౯౩వ పుటయందు వ్రాసియున్నారు. ఆశాసనములెవ్వియో, ఆకుమారిని నామధేయ మేమో వారు తెల్పరైరి. మఱియు శ్రీ వే. ప్రభాకరశాస్త్రులవారు "కొమరగిరిరెడ్డికి ననపోతరెడ్డియని కొడుకుండెను...... ఒక ద్రాక్షారామశాసనమున 'శ్రీమత్కుమారగిరి భూపతేః కుమారో వీరాన్నపోత నృపతిః' అని కలదు. తర్వాత రాయి పగిలిపోయినది" అని వ్రాసియున్నారు. ఆ ద్రాక్షారామశాసనమే ఇది. ఇంతకుమించిన విషయము లీశాసనలేఖనము దెల్పువ వేవి యును లేవు.

తక్కిన మూఁడుశాసనములును కాటయవేమునివి. ఇందు మొదటిది (౨) కాటయ వేముఁడు చాళుక్యభీమవరములోని మండనారాయణస్వామికిఁ జేసిన భూదానముఁ దెల్పుచున్నది. శాసనము శకాబ్దము ౧౩౧౩ అంగీరసనాటిది. అప్పటికి కుమారగిరిరెడ్డి ఇంకను రాజ్యము సేయుచుండెను. అయినప్పటికిని రాజుప్రస్తావన మీశాసనమున నెచ్చటను గానరాదు. దీనినిమాత్రమే చదివినవారికి చాళుక్య భీమవరప్రాంతమున నాకాలమున రాజ్యము సేయుచున్న రాజు కాటయవేముడని తోఁచకపోదు. ఇట్లే రాజును బేర్కొనక కాటయవేముని మాత్రము బేర్కొను శాసనములు మఱికొన్ని కలవు.[1] ఇందువల్ల కాటమరెడ్డి వేమారెడ్డిరాజ్యమున రాజునకు సమానుఁడై రాజ్యపాలన మొన ర్చుచున్నట్లు తోఁచుచున్నది. ఈయూహ సరియైన దనుటకుఁ గాటయవేముని శాసన ములలోఁ గొంత యాధారము కలదు. తొత్తరమూడి శాసనమున

సింహాసనే నిధాయాసౌ కుమారగిరిభూవరమ్

అతేజయన్మహాతేజాః శ్రీకృష్ణ ఇవధర్మజమ్॥[2]

అను శ్లోకము కాటయవేముఁడే కుమారగిరిని సింహాసనము నెక్కించి యతనికిఁ బ్రాపై ధర్మరాజును శ్రీకృష్ణునివలె రక్షించుచున్నట్లు తెల్పుచున్నది. మఱియు నీతఁడు రెడ్డి సామ్రాజ్యమునకు నిర్వాహకుఁడై యుండినట్లు అనపర్తిశాసనమందలి

1 *S. I. I.*, V, No. 155; 259 of 1897. *S.I.I.*, V, No. 7.

2 *Ep. Ind.*, IV, p. 323. ఈశ్లోకమే ఇటీవల ఆంధ్రేతిహాసపరిశోధకసంఘపు త్రైమాసిక యందు ప్రకటింపఁబడి యనపర్తిశాసనమునఁ గూడ గాన్పించుచున్నది. (*J.A.H.R.S.*, XI, p. 210.)



కోరుకొండ: శిఖరముమీద దేవాలయము, మంటపము.

చతుర్విధోపాయ నయప్రవీణం
సామ్రాజ్యనిర్వాహ మహాప్రభావః
స్వసుఃపతిం కాటయవేమభూపం
రాగాదవాదీదతిగౌరవేన॥

యను శ్లోకమువల్ల స్పష్టమగుచున్నది.3 కావున కాటయవేముఁడు కుమారగిరిని రాజ్యాభిషిక్తునిఁ జేయుటయేగాక యతని సదా రక్షించుచు యతనికి మారు రెడ్డిరాజ్యమును పాలించుచుండెననుట నిశ్చయము. ఈ కారణముచేతనే కాటయవేముఁడు రాజగు కుమారగిరిని దలపెట్టక శాసనములను దనపేర వేయించుకున్నది.

ఇందలి మూడవశాసనమును కొన్నియేండ్లక్రింద డాక్టరు మారేమండ రామారావుగారు ప్రబుద్ధాంధ్రలో ప్రకటించిరి. నాల్గవశాసనములోని విషయమునకును దీనికిని సంబంధముండుటచేత దీని నిచ్చట మరల ప్రకటింపవలసివచ్చినది. ఇది కాటయవేమారెడ్డి తన కులస్వామియగు కుమారగిరిరెడ్డిగారికి అక్షయసుకృతము గలుగుటకై చేసిన దానము తెల్పుచున్నది. "అక్షయసుకృతము" అనుమాట నాధారపఱచుకొని కొందర ప్పటికిపూర్వమే కుమారగిరి స్వర్గస్థుఁడాయెనని తలఁచుచున్నారు. అట్లు తలఁచుటకుఁ గారణము మృతినందినవారి యాత్మకు సుకృతమును కలిగించుటకే ఇట్టి యక్షయసుకృతి దానములు సేయుదురన్న నమ్మకము. 'అక్షయసుకృతి'లోని 'అక్షయ'శబ్దము, 'అక్షయ్యోదకము'లోని 'అక్షయ'శబ్దమువలె మరణానంతరదశ కన్వయించునని వీరిభావము. కాని ఇందుకు విరోధముగ జీవదశయం దుండువారికి సుకృతమును గల్గించుటకు సైతము నిట్టి యక్షయసుకృతదానము సేయుచుండిరనుట కొక యాధార మగపడుచున్నది. క్రీ. శ. ౧౩౭౮ సం॥ నాటి యొకశాసనమువల్ల విశ్వేశ్వర గురువులు అను శైవాచార్యులొకఁడు "తమకు అక్షయసుకృతం అవునట్టుగాను" 'కాలోచితమూల్యం పెట్టి క్రయం కొన్న క్షేత్రం' భీమవరపు 'భీమేశ్వరప్రాకారంలోని మూలస్థానం సిద్ధేశ్వరలింగానకు' సమర్పించినట్లు తెలియుచున్నది.4 కావున, అక్షయసుకృతధర్మములను జీవదశయందున్నప్పుడుకూడ సేయుటకలదని తలఁచవలసియున్నది; కాని జీవదశయందున్నవారి యక్షయసుకృతము కొఱకుఁ జేయఁబడిన దానములను దెలియజేయు శాసనము లరుదు. నాయెఱిఁగినంతవఱకును అట్టిశాసన మిదియే. మఱియును నీవిశ్వేశ్వర

3 *J.A.H.R.S.*, XI, p. 203.
4 *S.I.I.*, V. Nos. 52, 57.

గురువులు సన్యాశి మైనట్లు తోఁచుచున్నది. అగునేని నిజమరణానంతర మట్టిదానమును సేయువా రుండరని తలఁచి పుణ్యలోకావాప్తికొఱకు జీవించియుండగనే తానే యట్టి దానమును జేసుకొని యుండవచ్చును. బ్రతికియుండగనే తమ యంత్యకర్మలను శ్రాద్ధములను జేసుకొనువా రిప్పుడును లేకపోలేదు. కావున, కుమారగిరి రెడ్డి క్రీ.శ. ౧౪౦౩ వ సం॥నకు తరువాత జీవించియుండెననుటకు సంశయాస్పదముకాని సాక్ష్యము బయల్పడు వఱకుచు అతఁడు ఈ సంవత్సరమునకు పూర్వమే గతించెనని తలఁచుట యుచితము. అట్టి తలంపసమంజనము కాదు. ఏలన కొన్ని శాసనములవల్ల కుమారగిరి క్రీ. శ. ౧౪౦౩ వ సం॥నకు పూర్వమే మృతినంది యుండుననుటకు నూహ పొడము చున్నది. క్రీ. శ. ౧౪౧౦ వ సం॥ నాటి కాటయవేముని యహోబలశాసనమున "ఆకొమరగిరయ్యంగారే ఈ కొమరగిరయ్యంగార్లై అవతరించిన ఈ కొమరగిరయ్యం గారికి" అను నర్థవంతమైన వాక్యమొకటి గానవచ్చుచున్నది.౫ ఇచ్చట 'ఆ' 'ఈ' లును 'అవతరించిన' యను మాటయును పరామర్శించదగినవి. 'ఆ' 'ఈ' లు అప్రత్యక్ష ప్రత్యక్ష భావములను సూచించును. ఆకుమారగిరయ్యంగా రప్రత్యక్షుఁడు. మృతినందిన వాఁడేనియు, సన్నిధానమున లేనివాఁడేనియుఁ గావచ్చును. ఈ కుమరగిరయ్యంగారు ప్రత్యక్షుఁడు. శాసనము వేయించినవారియెదుట నున్నవాఁడు. అప్రత్యక్షుడైన 'ఆ కొమరగిరయ్యంగారు' ప్రత్యక్షుఁడైన 'ఈ కొమరగిరయ్యంగార్లై అవతరించెనట. అవతరించుట యనఁగా జన్మాంతరము నంది పుట్టుట. కావున 'ఆ కుమరగిరయ్యంగారు ఈ కుమరగిరయ్యంగార్లై అవతరించిన' అనుటవల్ల ఆ కుమారగిరయ్యంగారు మృతినంది జన్మాంతరమెత్తి ఈ కుమారగిరయ్యంగార్లై పుట్టిరని భావము. ఇందు పేర్కొన్న ఆ'కుమారగిరయ్యంగారు' అనపోత మనుమాంబికల పుత్త్రుఁడును గొండవీటిరాజును నగు కుమారగిరిరెడ్డి. ఈ కుమారగిరయ్యంగారు కాటయవేమతల్లాంబికల పుత్త్రుఁడు. వేముని యనంతరము రాజమహేంద్రవరమున స్వల్పకాలము రాజ్యముసల్పిన ప్రభువు. 'ఆకుమారగిరయ్యంగారు ఈ కుమారగిరయ్యంగార్లై అవతరించె' ననఁగా కొండ వీటి రాజైన కుమారగిరి రెడ్డి మరణము నందిన తరువాత కాటయవేమారెడ్డికి పుత్త్రుఁడొకడు పుట్టెను. మృతినందిన కుమారగిరిరెడ్డియే జన్మాంతరమెత్తి తనకుఁ గుమారుఁడై పుట్టెనని యెంచి అతని పేరే తన కుమారునకుఁ బెట్టెను. కావున క్రీ॥శ॥ ౧౪౧౦వ॥సం॥ మునకు పూర్వమే కొండవీటి రాజగు కుమారగిరి కాలగతి నందెననియు, తరువాతఁ

5 84 of 1915.

దనకుదయించిన పుత్రునికా చనిపోయిన రాజుపేరు కాటయవేముఁడు పెట్టెననియు నహోబలశాసనము దెల్పుచున్నది. అప్పటికి పూర్వమిది జరిగి యెంతకాలమాయెనో ఈశాసనమునాధారపఱచుకొని చెప్పుటకు వీలుకాదు. కాని ప్రస్తుతవ్యాసమున కాధారమైన నాల్గవశాసన మీ విషయమును వ్యక్తముసేయుచున్నది. ఇందలి ప్రథమ శ్లోకమువల్ల కాటయవేమారెడ్డి పుత్రుఁడగు కుమారగిరిరెడ్డి క్రీ. శ. ౧౪౦౫ వ సంవత్సరమున జననము నందినట్లు తెల్పుచున్నది. ఇందువల్ల కొండవీటిరాజగు కుమారగిరిరెడ్డి తత్పూర్వమే మృతినందెననుట నిశ్చయము. అతని రాజ్యకాలములో కడపటి శాసనము క్రీ. శ. ౧౩౯౪ వ సంవత్సరమునాటిది. తరువాత నితఁడెంతకాలము రాజ్యముచేసెనో తెలియదు. పరంపరగవచ్చు నొక ప్రాచీనచాటువువ నితఁడు ౧౨ సంవత్సరములు రాజ్యము సల్పినట్లు తెల్పియున్నది. ఇది నిజమగునేని ఇతని రాజ్యకాల మీ సంవత్సరముననే సమాప్తినంది యుండవలయును. ఇది యెట్లుండినను కొండవీటియందు పెదకోమటి వేమారెడ్డి ప్రభుత్వము క్రీ. శ. ౧౪౦౪ వ వర్షమున బ్రారంభమాయెను.[6] కొంచెమించుమించుగ నాకాలమునుండియే కాటయవేముని పాలనయు రాజమహేంద్రవరమున నారంభమైనట్లు క్రింది మధురపూడి (౪) శాసనమువల్ల తెలియుచున్నది. కావున, కుమారగిరిరెడ్డి క్రీ. శ. ౧౪౦౪ వ సంవత్సరమునకు పూర్వమే మృతినందినట్లు తోఁచుచున్నది.

౧

ద్రాక్షారామభీమేశ్వరుని ఆలయములో పశ్చిమ ప్రాకారం దగ్గర పడియున్న పగిలిపోయినరాతిమీద శాసనం:—

అనపోతప్రభోః పత్నీ సపత్నీ ధరణీశ్రియోః
అనేకసుగుణశ్లాఘ్యాంబికామనుమాంబికా॥ ౧
కుమారగిరినాథస్య ప్రసాదాత్తనయస్తయోః
కుమారవిక్రమోజాతః కుమారగిరిభూపతిః॥ ౨
శ్రీకీర్తిప్రమదాస్వయంవరపతిః శ్రీవీరనారాయణ
స్సోయమ్ తత్రకుమారగిర్యధిపతిః ప్రాయేణకీర్తిప్రియః॥
కీర్తిశ్రీబహుమానమేవకురుతే మానాదికాదిస్వయం
కీర్తిభోగ్యమిదం శ్రియస్సుచరితం తస్యాథవానైపుణమ్॥ 3

అత్యంతం చిత్రమేతత్ కొమరగిరినృపస్సాంగడీరక్షపాలః
సద్యస్సంతోషమాపాదయదపరిమితం చాస్థినా-పరేషాం
నానా దేశక్షితీశవ్రజ ... ... ... ...

.........కుమారగిరిభూపతిః జయతిభోగసంక్రందనః ౫
కుమారగిరిభూపాలరత్నాకరసుధాకరః
అన్నపోతకుమారేంద్రో లోకానందాయవర్ధతే ౬
శ్రీమత్కుమారగిరిభూమిపతేః కుమారో
వీరాన్నపోత నృపతిః............॥ ౭

౨

పిఠాపురం తా॥ పైకి మ॥ భీమవరంలో మండనారాయణస్వామి అర్చకుడు భావవరపు జానకిరామాచార్ల వద్ద తామ్రశాసనం నకలు:—

సప్తాకాటయశౌరేః పౌత్రోమారస్య కాటవిభుసూనుః
వీరాన్నపోతనృపతేః జామాతా జయతి వేమభూపాలః॥

స్వస్తిశ్రీ శకవరుషంబులు ౧౩౧౩ అగు నేటి అంగీరససంవత్సర శు ౧౦ గురువారమునాటి మకరసంక్రాంతి పుణ్యకాలమందు శ్రీ చాళుక్యభీమవరపు శ్రీ మండెనారాయణస్వామి దేవరల అర్చకులు చిట్టూర్పుల తిరుమలయ్య వెంకటయ్యగారికి కాటమరెడ్డి వేమారెడ్డిగారు తమ తండ్రి కాటమరెడ్డిగారికిన్ని తమ తల్లి దొడ్డసానమ్మగారికిన్ని అక్షయసుకృతముగాను శ్రీ చాళుక్యభీమవరపు మండనారాయణదేవరలకు నిత్య నైవేద్య దీపారాధనమహోత్సవాలకు తూర్పుపొలములోను సుగతివారి యీడవనువఖ యెన్మిదిపుట్ల భూమిన్ని లక్ష్మిదేవికి మూడుపుట్ల భూమిన్ని ఆళ్వార్లకు రెండుపుట్ల భూమిన్ని ముప్పై పాడిఆవులున్ను శ్రీరామార్పణముగాను సమర్పిస్తిమి గనుక అందుల ఫలం స్వామికి సమర్పణచేస్తూను మీ పుత్రపౌత్రపారంపర్యం సుఖాన్న వుండ్డేది. యిది గాక నగరికట్టడ ముక్కసబియ్యము మూడుమానికెల పెసలు రెండుశేర్ల న్నర చింతపండు నెయ్యి తవ్వెడు బెల్లము వీశెడు మిన్ములు అడ్డెడున్ను నూనె మూడుమానికెలున్ను దక్షిణాతాంబూలానికి త్సవిలేను సమర్పిస్తిమి. యిందు యెవరు తప్పినా కాశీలో గోబ్రాహ్మణవధచేసిన పాపాన బొందుదురు.

కాటమరెడ్డి వేమారెడ్డివ్రాలు.

౪

పిఠాపురం తా॥లో చేరిన మవ్వుజే తొత్తరేవు అనే గ్రామకరణము వైదికి చివుకుల వీరన్న గారివద్దవున్న తాంబ్రశాసనముయొక్క నకలు.

శ్రీ కోర్కొండపతి ర్మహాత్మల గదా శంఖాది భృద్రక్షకః
శ్రీ లక్ష్మీనరసింహనామకహరిః భక్తాభివేష్ట(?)ప్రదః
వామాంకస్థరమా ప్రతీతవిభవః పద్మాసనస్థో జగ
న్నాథః శ్రీ కొమరాద్రిరెడ్డి జనానాభీష్టోజయత్యచ్యుతః॥ ౧
శ్రీ శాకేగిరినేత్రవహ్ని శశిభిర్గణ్యేశరద్యుత్తమే
కృష్ణే పార్థివనామ్ని వారేగురో ఫాల్గుణే
శ్రీ కోర్కొండ హరేర్మ దేవత భరద్వాజాయనాసత్యవత్
ఖ్యాతాయా కరణోద్య బాధకయుతం వర్షేచక భోగ్యాఖిలమ్॥ ౨
ధన్యః చివుకుల మాధవాయ విదుషే తొత్తరే డభిఖ్యాంచితం
ఆచంద్రార్కమ గారవస్తు సహితం వేదార్థవిత్ ధీమతే
పితృో స్త తుస్కృతాయ కాటమసుతోమారస్య పౌత్రో (హ్యదాత్)
గ్రామం కాటమరెడ్డి వంశతరణిః శ్రీ వేమభూపాలకః ౩
స్వదాత్తాద్ద్విగుణం పుణ్యాపరదత్తాను పాలనమ్॥

3

పిఠాపురం తాలూకా పైకిమ॥ తొర్రేడు గ్రామం కింద మజరామదురపూడికి దక్షిణభాగం చెరువు లోతట్టున పాతివున్న శిలాశాసనం నకలు:—

స్వస్తి శ్రీ శకవరుషంబులు ౧౩౨౭ అగు నేటి తారణసంవత్సర పుష్య బ॥ ౧౦ గురువారమునాటి మకరసంక్రాంతి పుణ్యకాలమునందు కాటమరెడ్డి వేమారెడ్డిగారు తమ కులస్వామి అయిన కొమరగిరి రెడ్డిగారికి అక్షయసుకృత మానట్టుగాను మదుర పూడి కొమరగిరివరదుని పేరను వేదాద్రి శ్రీ నరసింహదేవరకు ఆచంద్రార్కస్థాయి గాను. ధారవోసి సమర్పణచేసిరి. మంగళమహాశ్రీ.

# వసంతోత్సవము.

డాక్టరు. నేలటూరి వెంకటరమణయ్య,

రీడర్: మద్రాసు యూనివర్సిటీ.

ఇది ప్రాచీనకాలమునుండియు హిందువు లాచరించు వార్షికోత్సవముల యందొకటి. మధ్యయుగమున దాక్షిణాత్య హిందూరాజులు ఈ యుత్సవమును మహా వైభవముతో ప్రతివర్షమును నడిపెడివారు. వాత్స్యాయనకామసూత్రముల యందిది 'సువసంతక' మనియు, 'మదనోత్సవ' మనియుఁ బేర్కొనఁబడినది. "సూ: 206. యక్షరాత్రిః, కౌముదీజాగరః, సువసంతకః,...మదనోత్సవః" ఇత్యాది. ఇందుపై సంస్కృతవ్యాఖ్య-"సువసంతక ఇతి: సువసంతో మదనోత్సవః, తత్ర నృత్త గీతవాద్య ప్రాయాః క్రీడాః ఏతామహిమాన్యాః క్రీడాః-దేశ్యా ఆహ" అని మఱియు, దీనినే ఇంచుకంత విపులీకరించి బ్ర. శ్రీ. పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రిగారు తెనుఁగున ఇట్లు వ్రాసియున్నారు:

"సువసంతకము: సువసంతక మనఁగా మదనోత్సవము. ఈ యుత్సవమును తొమ్మిది దినములు జరుపుదురు. ఈ తొమ్మిది దినములను వసంతరాత్రు లనియు, వాసంతనవరాత్రము లనియు నందురు. ఈ యుత్సవసందర్భమునందు ప్రతిదినము నృత్యములు, నాట్యములు, పాటకచ్చేరీలు మున్నగు నుత్సవముల నన్నిటిని జరుపుచుందురు. ప్రాచీనులగు భారతీయ రాజవరులు ఈ యుత్సవ సందర్భములందే పండితగోష్ఠులను, శాస్త్రవిచారణలను, నాటకప్రదర్శనములను జరుపుచుండెడివారు. మొత్తము మీఁద నీ యుత్సవములందు సంగీతకము ప్రధానము. ఏ తత్సూచకముగ వసంతరాగ మని యొకరాగమును మేళకర్తలు కావించినారు. ఇంతవఱకును చెప్పిన యీ మూఁడును మహిమాన్యములగు క్రీడలు. అనఁగా వ్రతోత్సవసందర్భములందు ఆచరించునట్టి క్రీడావిశేషములని భావము...సువసంతకమును కొందఱు మాఘశుక్లపంచమిని నాచరింతురు." (వా. కా. సూ. ఆర్యభారతీ గ్రంథమాలిక. భ 2 పు 137.)

పై నుదాహరింపఁబడిన సంస్కృత వ్యాఖ్యయందు లేని సమాచారమును శ్రీ ఆదినారాయణశాస్త్రిగారే యే గ్రంథములనుండి క్రోడీకరించిరో తెల్పియుండిన పరిశోధకులకు సహకారిగ నుండెడిది. శాస్త్రిగారు వ్రాసినట్లు ఏకొందఱో మాఘశుక్ల పంచ

మిని వసంతోత్సవము నాచరించినను సామాన్యముగా దీనిని వసంతర్తువునందే నడపు చుండిరి. అట్లుగాదేని వసంతోత్సవ మను పేరు నిరర్థకమగును. దీనిని మధ్యయుగమున నాంధ్రదేశమున వసంతర్తువునందే జరుపుచుండినట్లు తెలియుచున్నది. క్రీ. శ. 14-వ శతాబ్దాంతమున నుండిన కొఱవి గోపరాజు వసంతోత్సవ కాలమును గూర్చి ఇట్లు వ్రాసియున్నాఁడు:

ఉ. ఇంతుల మానభంగము మ హీరుహపంక్తుల దర్పమూల మ
త్యంతమహోత్సవంబుల విహారము
..................................ప్రజల్
సంతసమంద నంతట వసంతమువచ్చె వనాంత భూమికిన్.

—సింహా. 7-7.

గీ. పూజ్యులైనవారిఁ బూజింపకున్నచో
మేలుదొలఁగునండ్రు మేదినీశ
యష్టసిద్ధులాదినగపడ్డవసక నే
డవ్వసంతపూజ శరుగవలయు.

—సింహా. 7:18

కావున వసంతోత్సవమును వసంతర్తువుననే జరుపుచుండిరని పైదానివల్ల తెలియ వచ్చుచున్నది. ఈ యుత్సవమున కధిదేవత వసంతుఁడు. కాలములయందు వసంతకాలము శ్రేష్ఠతమము. వసంతుఁడు ఋతువుల నేలెడి దొర. వసంతుని బూజించుటవలన కాలాత్మకుఁడైన పరమేశ్వరుఁడు ప్రియమందును. పూజ్యులను బూజింపకుండిన మేలు దొలఁగును. కావున పూజనీయుఁడగు వసంతుని బూజించుట యవసరము.

క. ఇంతియుకాదు నరేశ్వర
యింతులతోలువేట ఋతువు లేలెడి ఘనుఁడా
కంతుని ప్రాణసఖుండు వ
సంతుండున్నాఁడు కొలువగా జనవలయున్.

క. కాలో వసంతయనువా
క్యాలంకృతి నన్ని ఋతువులందధికుఁడు త
త్కాలోచిత పూజలచేఁ
గాలాత్మకుడైన విభుఁడు గడు ప్రియమందున్.

వసంతోత్సవమును, తత్సంబంధమైన వేడుకలను ఉపవనమున జరిపెడివారు(7:19). అందు తియ్యమామిడి క్రింద మంటపము నొక్కదానిని నిర్మించి (3:145), దానిని రంభా స్తంభంబులతోడను (3:172), మించుంబట్టల మేలుకట్లతోడను, బంగారు తోరణముల తోడను నలంకరించి తన్మధ్యమున పంచశరాధిదేవతల పట్టులుగా మణివేదికల పంక్తిని నిల్పుదురు. మఱియు నావేదికలను మృగనాభితోడ నలికి, కర్పూరము రంగవల్లికలచే నలంకరించి, పూర్ణకలశము నుంచి వానిని మరువకావృత పర్యంతమును గావించెదరు (3:172). అందు వసంతుని, రతిమన్మథులను, లక్ష్మీనారాయణులను, గౌరీశంకరులను, శచీపురందరులను నెలకొల్పెడివారు (7:26). రాజు నగరినుండి హయారూఢుడై వసంత పూజ యొనర్చుటకు బయలువెడలును (7:22). ఈమహోత్సవమున కాభరణంబులు అంగనలు(7:21). కావున సాలంకృతలగు స్త్రీసముదాయముతోడను, సుగంధద్రవ్యము లను మోచి తెచ్చు పరిచారికలతోడను, విటనట పీఠమర్ద విదూషక వైతాళిక వంది బృందంబులతోడను, కవిగాయకశూరాదిజనులతోడను వెడలి (3:140,7:21) మార్గము నకు ఇరుప్రక్కలను నుత్సవసందర్శనాగతులైన జనులు నిలిచి చూచుచుండ (7:140) భేరులు, శంఖములు మొదలగు మంగళవాద్యములను పెద్దగొరులపై నాసీనులైన వాద్య కాండ్రు మొరయింప (7:21) మహాకోలాహలముతో గూడ జనును. సామంతరాజ బృందము ఉపవనమునరాజురాకకై వేచియుండి అతడువచ్చినవెంటనే తాము దెచ్చిన కప్పమర్పించెడివారు. మంత్రియంతట వారినిరాజునకు పేరుపేరున నెఱింగించును. రాజు వారిని కుశలమడిగి వీడియము లిప్పించి గౌరవించును (7:23, 24). తరువాత మంట పము బ్రవేశించి పైపేర్కొన్న దేవతలను అర్ఘ్యపాద్య ధూపదీపాదిషోడశోపచారంబుల నారాధించి (3:172) పూజింప నారంభించును. అప్పుడు గాయనులుదుందుభిమర్దళములు మొదలయిన తూర్యములను, పంచ మహావాద్యములను (3:172) మ్రోయింప స్త్రీలు ఆటపాటలవినోదమును సూపుదురు.

వసంతఖేలనములు:— ఈ ఖేలనములకు కర్పూరాదిసుగంధద్రవ్యము లుపకరణ **ములు:** (1) పూజజరుగునప్పుడును తదనంతరంబును స్త్రీపురుషులొండొరులపై కర్పూర **మును** (3:172, 173, 174, 175) గంధసారము కస్తూరి, కుంకుమ, **హిమాంబువు** మొద **లగు** (**హం**: 1.305 4.96) సుగంధద్రవ్యములను జల్లుకొనువారు. ఈ సుగంధ ద్రవ్య **ములను** రాజు సేకరించి, వసంతఖేలనములలో బాల్గొనువారికి పంచియిచ్చువాడు (4:98). వసంతోత్సవక్రీడయం దత్యంతాసక్తుండును, కర్పూర వసంతరాయ సార్థకబిరుదాంకితుం

డును నగు కొండవీటి రెడ్డి రాజు కొమరగిరి నరపాలుని నగర సకల సుగంధద్రవ్యముల నొడఁగూర్చి యుంచి బండరు వొకటి యుండెడిది. దానికి యవచి దేవయ తిప్పయ యను సింహాపురి వైశ్యశిఖామణి యధ్యక్షుఁడు (హర. 1:30). ఇతఁడు వ్యాపారి. ద్వీపాంతరములకుఁ దన యోడల నంపి సరకులను దెప్పించి భరతఖండములోని నృపాలురకు విక్రయించెడివాఁడు. ఇతఁడు కొమరగిరి కర్పూర వసంతరాయనికి "ప్రతి సంవత్సరోత్సవమునకుం దగిన కస్తూరీకుంకుమఘనసారసంకుమదహిమాంబు కాలాగరు గంధసార ప్రభృతి సుగంధద్రవ్యంబు లొడఁగూర్చె"డివాఁడు (హర: పీఠి. 7). ఇవి యొక్కచోట దొరకు పదార్థములు గావు.

"తరుణాచీని తవాయి గోవరమణాస్థానంబులన్ జందనా
గరుకర్పూర హిమాంబు కుంకుమ రజః
కస్తూరికా ద్రవ్యముల్ శరధిం గప్పలిజోగులన్ విరివిగా..."

-హర. పీఠి. 27.

దెప్పించి 'కుమారగిర్యధీశ్వరుని వసంతవైభవము సర్వము నొక్కఁడ నిర్వహించు, (హర. పీఠి. 23) వాఁడు. ఇట్లానీతములయిన పరిమళద్రవ్యములను వసంతోత్సవసమయమున నరుదెంచిన కవిజనబృందంబుల కొసఁగెఁడివాఁడు (హర. 1.30). (2) సుగంధద్రవ్యములతోఁ బాటు వసంతమును గూడ నొండొరులపై జల్లుకొను నాచారము గూడ కలదని తోఁచుచున్నది.

క. "సుందరులఁగూడి వైభవ
బృందారకపతివసంత పీతాంబరుఁడై
బృందావనమున గోపీ
బృందాన్వితుఁడైన కృష్ణువిధమున నొప్పెన్".

అను (సింహా. 3.176) పద్యమే పైయూహ కాధారము.

(3) వసంతఖేలనములయం దింకొక్కటి జలకేళి. (4) పుష్పాపచయము, (5) డాగురుమూతలు, (6) ఉయ్యెలలూఁగుట మొదలైనవి మఱికొన్ని.

మఱియు వసంతోత్సవసమయమున పైఁ బేర్కొనఁబడిన క్రీడలయందే కాక విద్యావినోదములయందును కాలముగడపెడివారు. కొమరగిరి యాస్థానమునకు వసంతోత్సవము దిలకించుటకుఁ గవులువచ్చెడివారని శ్రీనాథుఁడు దెల్పుచున్నాఁడు (హర. 1.30). కర్పూర వసంతరాయనివలె ప్రతివర్ష వసంతోత్సవ నిర్వహణమునం దత్యంతాసక్తి గల రాజు ఆంధ్రభోజుఁడగు కృష్ణరాయఁడు. ఈ యుత్సవవేళయం దాతఁడు కవితాగోష్ఠియందు విద్యావినోదములఁ గాలము గడపువాఁడు.

క. ప్రతివర్ష వసంతోత్సవ
ఋతుకాగత సుకవిని కరగుంభిత కావ్య
స్మృతి రోమాంచ విశంకిత
చతురాంతఃపురవధూ ప్రసాదనరసికా.

అను ముక్కుతిమ్మనార్యుని పద్యమునుబట్టి ఈవసంతోత్సవసమయమున మిక్కిలి కౌతూహలముతో వచ్చు కవులు రాయనికిఁ దాము విరచించిన కావ్యములను వినిపించు వారు. కవులతోఁ బాటు విద్వాంసులును విద్యానగరమునకువచ్చి రాయనిగూడి విద్యా వ్యాసంగమునఁ బ్రొద్దుపుచ్చెడివారు. కవిపండితగోష్ఠులయం దేగాక నాటక ప్రదర్శనము లయందును కాలము గడచెడిది. వసంతోత్సవ మప్పుడే విరూపాక్షదేవునికి చైత్రోత్స వము సాగుచుండెడిది. అప్పుడు ప్రదర్శనార్థము రూపకములను కవులు నూతనముగ రచించి తెచ్చువారు. కృష్ణరాయవిరచితమనఁ బడు జాంబవతీకళ్యాణము విరూపాక్షుని ముందు వసంతోత్సవసమయమునఁ బ్రదర్శించుటకు వ్రాసినదే. జాంబవతీ కళ్యాణమే గాక వసంతోత్సవమునఁ బ్రదర్శించుటకు వ్రాసినవి మఱికొన్ని నాటికలును, ప్రహసన ములును గూడ కలవు. అందు విద్యారణ్యుని శిష్యుఁడగు వామనభట్టబాణుఁడు వ్రాసిన శృంగారభూషణ మొక్కటి. దీనిఁ జూడవచ్చిన విద్వాంసులను బాణుఁ డిట్లు వర్ణించి యున్నాఁడు.

రతితంత్ర దేశికానాం
రతిపతి నిగమాన్త వావదూకానామ్,
వైదగ్ధ్యభూషణానా
మేషా పరిషత్సమాగతా విదుషామ్.

వసంతోత్సవకాలమునఁ బ్రదర్శింపఁదగిన నాటకము శృంగారభూషణము. త న్నాటకమునుఁ జూడ నరుదెంచిన ప్రేక్షకు లిట్టి లక్షణములు గలవారలుగానే గదా యుండవలయును? అరుణగిరినాథ ప్రణీతమగు సోమవల్లీ యోగానంద ప్రహసనము మఱియొకటి. ఇందు శృంగారమును పచ్చిబూతులతో వర్ణించినాఁ డీకవిసార్వభౌముఁడు. కావున వసంతోత్సవము క్రీడాప్రధానమేయైనను కళాభివృద్ధికిఁగూడ కారణమైనది. వసం తరాయని వసంతోత్సవాసక్తి నాట్యసంగీతశాస్త్రములకు ఊత ఇచ్చినది. వసంతరాజీయ సంగీతచింతామణ్యాదిగ్రంథములయుత్పత్తికి బీజములను నాటినది. అట్లే యాంధ్రభోజుని వసంతానురాగము ఆంధ్ర ప్రబంధనిర్మాణమునకును సంగీతసూర్యోదయ, స్వరమేళకళా నిధ్యాదిగ్రంథరచనకును బురికొల్పినది.

# వామనభట్ట బాణుఁడు

సాగి వేంకటనరసింహము, ఎం. ఏ.

ఉపోద్ఘాతము: సంస్కృతాంధ్రవాఙ్మయములను రసజ్ఞశిఖామణు లగు రెడ్డిచక్రవర్తులు సమానగౌరవముతోఁ బోషించిరనుట యెల్లరకుఁ దెలిసిన విషయమే. అయినను ఆకాలపుఁ బరిస్థితుల ననుసరించి యాంధ్రమునకంటె సంస్కృతమునకే ప్రజల కెక్కువ గౌరవముండెడి దనుట నిర్వివాదాంశము. ఇట్టి సంస్కృత ప్రాముఖ్య మనాదినుండియు భారతజాతీయ జీవనమున మనకు గోచరించుచునే యున్నది. రెడ్డిరాజులును విశేషముగా సంస్కృతకావ్యప్రోత్సాహకులై స్వయముగా సంస్కృత కావ్యనిర్మాతలై ప్రసిద్ధి వడసిరి. ఎఱ్ఱాప్రగడ, శ్రీనాథుఁడు మొదలగు నాంధ్రకవులు వారిచే బోషింపఁబడిరనియు సింగనఅన్నయాది మంత్రిసత్తముల మూలమున తెలుగుకవులకు ఆదరము లభించెననియు నాంధ్రకావ్యములు ప్రదర్శించుచున్నవి.

రెడ్డిరాజులసంస్కృతభాషాభిమానము, అద్వితీయమని వారిదానశాసనములును వారు స్వయముగా వ్రాసిన సంస్కృతకావ్యములును చాటుచున్నవి. అనపోత, అనవేమ మహీపాలురకాలమున వారియాస్థానకవియగు బాలసరస్వతి వారియాజ్ఞచేఁ బెక్కుశాసనములను వ్రాసెను. ఆకాలమునందలి శాసనములన్నియు మనోహరములైన సంస్కృత శ్లోకములతో రాజవంశాదిప్రశంస చేయుచుండెను. ఇఁక దానప్రతిగ్రహీతలలో దిగ్దంతుల వంటి సంస్కృతపండితులు గలరు. శ్రీనాథుని సంస్కృతపాండిత్యము రెడ్డిరాజులయాస్థానమున నాతనికి మొట్టమొదట, స్థానము లభింపఁజేసినదని తోఁచుచున్నది. అతని తెలుగుకృతులలో కాశీఖండముతప్ప మిగిలినవి మంత్రులు గ్రహించిరేగాని రాజులు గ్రహింపలేదు. ఆస్థానకవి యను గౌరవము గూడ సంస్కృతకవులకే లభించినట్లు కాన్పించుచున్నది.

రెడ్డిరాజులసంస్కృత వాఙ్మయాభిమానము వారిగ్రంథములలోనే కాననగును. ఇందు కాటయవేమారెడ్డి వ్రాసిన, కాళిదాసనాటకత్రయ వ్యాఖ్య, కుమారగిరీయమను పేరిడి అగ్రస్థానము వహించుచున్నది. ఇఁక పెదకోమటి వేమారెడ్డి వైదుష్యము నాతని సర్వజ్ఞచక్రవర్తి యనుబిరుదమే చాటుచున్నది. అతని వ్యాఖ్యలు శృంగారదీపిక, సప్తశతసారటీక మొదలగునవి. సాహిత్యచింతామణి యతని యలంకారగ్రంథము. అందు

"మమైవ కావ్యే" "మమైవ భాణే" అనుటచే నతఁడు పెక్కుకావ్యములు వ్రాసె ననుట నిక్కువము. అట్టిచక్రవర్తికడ ఆస్థానకవీశ్వరుఁడైన వామన భట్టబాణుఁడను కవి చంద్రు నుద్దేశించి యీవ్యాసమును వ్రాయుచున్నాను.

ఆధారములు: వామనభట్టబాణుఁడు వ్రాసిన పార్వతీపరిణయము బాణకృతి యని పూర్వము (వాఙ్మయ చరిత్రము లారంభమైన కాలమునఁ) గొందఱు తలఁచిరి. కాని దక్షిణదేశగ్రంథాలయములనుఁ బరిశోధకులు వీక్షించినపిదప ఆ సంశయము వీడి పోయెను. శ్రీరంగమున వాణీవిలాస సంస్కృత గ్రంథమాలలో మొదటిదిగా 'పార్వతీ పరిణయము'ను, పదునారవదిగా వేమభూపాలచరితమునుఁ బ్రకటింపఁబడినవి. బొంబాయి నిర్ణయసాగర ముద్రాలయమున, కావ్యమాల ఏబదియెనిమిదవకుసుమముగా శృంగార భూషణభాణము ప్రకటితమైనది. రఘునాథాభ్యుదయము, నలాభ్యుదయము ననుకావ్య ములను శబ్దరత్నాకరము, శబ్దచంద్రిక యను నిఘంటువులను, హంససందేశ మను ఖండ కావ్యమును స్వయముగా జూచితిమనియు, ఇంకను రెండు మూడు గ్రంథము లెఱుగ వచ్చుచున్నవనియు, వేటూరి ప్రభాకరశాస్త్రిగారు తమ 'శృంగార శ్రీనాథమున' వ్రాసి యున్నారు. ఇందు నలాభ్యుదయము తిరువాన్కూరులోఁ బ్రకటింపఁబడినది. శ్రీనాథుని భీమఖండమునుండియు, వామనభట్టబాణుని వేమభూపాలచరితమునుండియుఁ గొలఁదిగ పోలికలనుఁ జూపు వ్యాసము నొకదానిని కురుగంటి సీతారామయ్యగారు భారతి 1936 మే సంచికలో వ్రాసిరి. ఇంకను సంస్కృత వాఙ్మయ చరిత్రములయందు 'కీతు' 'కృష్ణ మాచార్యర్' ప్రభృతు లీకవిని పేర్కొనిరి.

కవి వంశాదులు: ఈ కవిది వత్సవంశము. పేరు వామనుఁడు. వత్సవంశజుఁడైన బాణునికవిత్వమువంటి కవిత్వముగలవాఁడు గావున నితనికి భట్టబాణుఁ డను బిరుదము లభించెను. ఈతఁడు వరదాగ్నిచిత్తులపౌత్రుఁడు. కోమటియజ్వపుత్రుఁడు. విజయనగర మహానగరస్థాపనాచార్యుఁ డగు విద్యారణ్యుఁ డీయన గురువు. ఈయంశములు శబ్దచం ద్రికాశబ్దరత్నాకరారంభములం దిట్లుఁ బేర్కొనఁబడినవి.

"విద్యారణ్యగురూన్, సార్వభౌమాద్యఖల సత్కవీన్
నమస్కృత్యాథ బాణేన క్రియతే శబ్దచంద్రికా
వరదాగ్నిచితః పౌత్రః పుత్రః కోమటియజ్వనః
జాగర్తివామనో బాణో వత్సవంశశిఖామణిః."

ఇతఁడు విజయనగరమున కొంతకాలముండినట్లు శృంగారభూషణభాణము' చాటు చున్నది. విరూపాక్షచైత్రయాత్రాసమయమున విలాసశేఖరుఁ డను సరసుఁడు విజయ

నగరవుభోగవువీథినివర్ణించినట్లాభాణమున వ్రాసిఉండుటచే నితఁడు తన విజయనగరానుభవమును, పెదకోమటి వేమారెడ్డిచేఁ బాలింపఁబడుచుండిన కొండవీడు చేరినతరువాత వ్రాసినాఁడని తలఁచుచున్నాను. ఈ భాణమును విజయనగరములోనే వ్రాసెనని కొందరనిరి గాని యందు అతనిఉత్తమస్థితి పేర్కొనఁబడియుండుటచే యిది తరువాతి రచనమనవచ్చును. విజయనగరమందే యతఁడంత ప్రశంసనీయుఁడై యుండెననుటకుఁదార్కాణములు లేవు.

చూడుఁడు. భాణమున,

"సౌభాగ్యస్య నిధిః శ్రుతస్య వసతి ర్విద్యావధూనాం వరో
లక్ష్మ్యాః కేలిగృహం ప్రసూతిభవనం శీలస్య కీర్తేః పదమ్ ।
నిస్సామాన్యవికాసయా కవితయా జాగర్తి వత్సాన్వయః
శ్రీమాన్ వామనభట్ట బాణసుకవిః సాహిత్యచూడామణిః ॥"

విజయనగర సామ్రాజ్యమున విశేషముగా వినఁబడనట్టియు, కొండవీటి సామ్రాజ్యమున సుప్రసిద్ధమైనట్టియు, కోమటి నామ మీతని తండ్రికుండుటఁ బట్టియు నితరాంతరంగికసాక్ష్యములవలనను, ఇతఁడు కొండవీటిసీమయందు జన్మించియుండుననియు, ప్రసిద్ధమైన విజయనగరమున జగత్ప్రఖ్యాతులైన విద్యారణ్యుల సేవించి, కొంతకాలమచ్చట డిండిమసార్వభౌమాదికవుల నాశ్రయించి, మరల కొండవీడుచేరి రాజాదరణముఁ బొంది యాస్థానకవి యయ్యెననియు నేనూహించుచున్నాను. ఇది యింకను నిశ్చితమని చెప్పఁజాలను. ఎటులైనను కొండవీటనున్న కాలమున నాతఁడు వయస్సుమీరినవాఁడై యుండునని, అతని వీరనారాయణచరితమును (అనఁగా వేమభూపాలచరితము)బట్టి చెప్పవచ్చును.

శ్రీనాథుఁడప్పుడు విద్యాధికారిగను, శాసనాధికారిగను నుండినను, వామనునికే యెక్కువ గౌరవముండెనని తోఁచుచున్నది. ఈసందర్భమున విద్యాధికారి యనగా పండితపరీక్షార్థము శ్రీనాథుఁడు విద్యాధికారిగాని శ్రీ ప్రభాకరశాస్త్రిగారు తలచినట్లు విద్యాశాఖాధికారి (Director of Public Instruction) అనుట సమంజసము గాదు. అట్లనుటకు తగిన యాధార మేమియు లేదు. రాజు చిత్తము ననుసరించి వామనునకు వినయము చూపుచుండియు, శ్రీనాథుఁడు విద్యామాత్సర్యముచేఁ గాబోలు తనగ్రంథములలో నాతనిఁ బేర్కొనలేదు. డిండిమునివలె వామను నెదుర్కొనుటకు వీలులేదయ్యెను. కాని ఆస్థానకవి కృతి యెల్లరకు గ్రాహ్యమైనదగుటచే స్వకృతియైన శాసనమునందు శ్రీ

నాథుఁడు, వేమభూపాల చరితమునందు వామనుఁడు చేసినరాజప్రశంసను చేర్చవలసి వచ్చెను. అది ఇట్లు

శ్లో॥ చూడామణి ర్నృపాణాం దుర్మతి పరిపంథి శిఖరిదంభోలిః
సర్వజ్ఞచక్రవర్తీ పెద్దకోమటి వేమభూపతిర్జయతి.

పెద్దకోమటివేమారెడ్డి క్రీ.శ. సుమారు 1404-1420 సంవత్సరమువఱకు రాజ్యము చేసినట్లు, శాసనములవలనఁ దెలియునుగావున నప్పటికి వృద్ధుఁడైన వామనుఁడు, తన బాల్యమును, యౌవనమును విజయనగరమున 14-వ శతాబ్దాంతిమభాగమును గడిపి ఉండుననుట తగియున్నది. వామనునిపేరుగల 1441 సం॥ తామ్రశాసన మొకటి కలదు.♦

వామనబాణుని కృతులు:—

ఇతనిగ్రంథములనుబట్టియు, తదాదులయందలి గంభీరములైన ప్రతిజ్ఞలనుబట్టియు నితఁడు గొప్ప పండితకవియనుట స్పష్టము. వేమభూపాలచరితాంతిమశ్లోకమునుజూడుడు.

గాథాస్తాథాగతానా, మ్పోదధతు వితథతాం తార్కికా స్తత్త్వవిద్భిః
సత్రాః సత్రాన మాధ్వం ఫణిఫణితిజుషోవః కృతం ప్రక్రియాభిః
భూమ్నాం సాహిత్యసీమ్నామధిభువి భువనే వామనే భట్టబాణే
దీవ్యత్యస్మిన్ కవీంద్రే జహిత జహిత భోః కద్వదా విద్వదాస్థామ్.

ఈతఁడు పద్యకావ్యములు, నాటకములు, భాణములు, గద్యకావ్యములు నిఘంటువులు మొదలగ నన్ని ముఖములను తన ఘనతను వ్యక్తపరచెను. ఇతని కావ్యము లెన్ని కాలవాహినిలోఁ బడిపోయినవో తెలియదు.

<u>నలాభ్యుదయము</u>: ఈకావ్యము గణపతిశాస్త్రిగారిచే సంపాదితము. తిరువా న్కూరు గ్రంథమాలలోఁ బ్రకటితము. 8 ఆశ్వాసములగ్రంథము. 9-వ ఆశ్వాసములో 3-వ పద్యములో వ్రాతప్రతి ఆగిపోవుచున్నదఁట.

<u>రఘునాథ చరిత్రము</u> 30 ఆశ్వాసముల కావ్యము. తంజావూరు కేటలాగులో VI 2634 సంఖ్యగలదిగాఁ బేర్కొనఁబడినది.

హంససందేశము: ఇది మేఘసందేశమునకు నకలు.

♦ ఒక శాసనము నకలు లోకల్ రికార్డు 46 వాల్యూములో నున్నది. అనుబంధములో మూలము చేర్పబడినది.
—సంపాదకుఁడు.

కనకలేఖ: నాలుగంకములనాటకము. ఇది వీరవర్మకుమార్తయైన కనకలేఖతో వ్యాసవర్మవివాహమును వర్ణించును. ఋషిశాపముచే నీదంపతులు మానవజన్మ మెత్తిన గంధర్వులు. (కుప్పుస్వామిశాస్త్రిగారి రిపోర్టు 1919-41-2).

బృహత్కథామంజరి: కాదంబరీకథకు సంబంధించిన భాగముమాత్రము కలదు. ఇది అడయారు గ్రంథాలయములోఁ గలదట. నెం. II. 4. ఈకథనే బాణుఁ డాధారముచేసికొని కాదంబరి వ్రాసినాఁడని గ్రంథముచివర నున్నది. ఇది బాణకృతియని యుండుటచే వామనుఁడే దీనిని వ్రాసియుండవలయునని తోఁచుచున్నది. క్షేమేంద్రుని బృహత్కథామంజరిలో నిట్టికథ లేదు.

శబ్దచంద్రిక: (తంజావూరు కేటలాగు III 3380) ఇది యొక నిఘంటువు.

శబ్దరత్నాకరి: (అడయారు గ్రంథాలయము II 16) ఇదియు నట్టిదే.

పైనుదహరించినవానిలో నలాభ్యుదయముదక్క నన్నియు నముద్రితములే. ఇవి యమ్. కృష్ణమాచార్యులవారి సంస్కృత వాఙ్మయచరిత్రమునఁ జేర్పఁబడినవి.

మిగిలిన ముద్రితగ్రంథములలో పార్వతీపరిణయ మనునాటక మొకటి కలదు. అది బాణకవి గ్రంథ మనుకొనుటచే దానికి కొంత ప్రశంసవచ్చినది. కాని బాణుని ప్రతిభను అది వ్యక్తపఱచుట లేదు. ఇప్పుడది బాణునిది గాదని తేలినదిగావున దాని నిక ఆవిధముగా తలఁచువారుండరు. ఐనను వామనబాణుని గూర్చిన వ్యాసమునందు దీనికిఁ గొంచెము తావు గలదు.

కథాసంగ్రహము:—

నారదుఁడు హిమగిరికి వచ్చును - హిమవంతుఁడు పరిజనులయెదుట పార్వతికిఁ బెండ్లియీడు వచ్చినదనును. 'ఆభోగశాలి కుచకుట్మల మాయతాక్ష్యా' ఇత్యాది జుగుప్సాకరవర్ణన మిచట గలదు. నారదుఁడు శివునిసేవింపఁ బార్వతిని నియోగింపు మనును. హిమవంతుఁడు వల్లెయనగా నారదుఁడు, 'ఉపక్షిప్తం బీజం' అనును. ఇది ప్రథమాంకము. ద్వితీయాంకము— వాసన్తిక రంభతో పార్వతి శివుని నారాధించు చున్నదని చెప్పును. ఇంద్రసభలో శివుని జయింప కాముని ప్రతిజ్ఞ. తృతీయాంకము— మన్మథుని ప్రతిజ్ఞ నెరవేరును. శివుఁ డంతర్ధాన మగును. పార్వతి విరహము. చతుర్థాంకము— శంకరుఁడు కపటవటువుగా వచ్చి పార్వతియెదుట శివనింద గావించి తిరస్కృతుఁ డగును. పంచమాంకమున వివాహము వర్ణింపఁబడినది. చివరకు నారదునితో హిమవంతుఁ డిట్లనును.

'భవదుపజ్ఞస్తస్య ఫలమిదం బీజస్య' అనగా ఇది నీవు నాటినబీజమునకు ఫలమనిఅర్థము ఈ నాటకకథ కుమారసంభవకావ్యము ననుసరించి యున్నది. కుమార సంభవమునుండి కొన్ని భావములు గూడ యథాస్థితముగ గ్రహింపఁబడినవి. ఉదాహరణము—

"స కామః కార్ముకే సమధత్త మనోహరం బాణమ్"

పార్వతీ పరిణయము.

సంమోహనం నామచ పుష్పధన్వా ధనుష్యమోఘం సమధత్తబాణం.

కుమారసంభవము.

(2) "దనుజో వా మనుజో వా మునిరపి వా ముగ్ధచంద్రచూడో వా
సురలోక సుందరీణాం సభవతుబద్ధః కటాక్షశృంఖలయా.

పార్వతీ పరిణయము.

కుర్యాం హరస్యాపి పినాకపాణే ర్ధైర్యచ్యుతిం కే మమధన్వినోఽన్యే"

కుమారసంభవము.

బాణుని యనుకరణమున కొక తార్కాణము.

"యథాయథా సమాపతన్తి దూతా వరాణాం
వరాకీ లజ్జమానేవ చింతా తథాతథా నితరాం
ప్రవిశతి మే హృదయమ్—హర్షచరితమ్
కుచయుగలం పరిణద్ధం యదాయదా వృద్ధిమేతి తన్వంగ్యాః
వరచింతాహృతమనస్తథా తథా కార్శ్యమేతిమే గాత్రమ్".

పార్వతీ పరిణయము.

ఇందలి కథానిర్మాణమునందు చమత్కార మేమియు లేదు. ప్రస్తావన రత్నావళీనాటకము ననుకరించును. శైలి మనోహరముగ నున్నను ప్రత్యేకముగ ప్రశంసింపవలసిన దేదియు నందులేదు.

శృంగారభూషణభాణము: భాణలక్షణము ననుసరించి ఇందొక్కటే అంకము. ఒక్కటే పాత్రము. శృంగారము రసము. తానే ప్రశ్నించి ఇతరులప్రత్యుత్తరముల ననువదించుకొని సమాధానముచెప్పటతో సంభాషణము నిర్వహింపఁబడును.

రాజపురుషులు, సైన్యములు, ధనికులు, విటులు బహుళముగా నాశ్రయించుచుండిన యాకాలపు విద్యానగరపు భోగపు వీధిని వర్ణించుటయే దీని సారాంశము. నాయకుఁడు విలాసపురుషుఁడైన విలాస శేఖరుఁడు. ఆకాలపుపరిస్థితులనెఱుంగుట కుపకరించునని కథాసంగ్రహము నిచ్చెదను. సమయము విరూపాక్షునిచైత్రయాత్రామహోత్సవమట.

శ్రీనాథునివీథినాటకము, రావిపాటి త్రిపురాంతకుని ప్రేమాభిరామము నిట్టివి. అందు పాత్రలిద్దరు. వర్ణనలొక్క వీథులే గాక పెక్కువిషయములను దెలుపునవి. అందు శృంగార మింత పచ్చిగా నుండదు. కోడిపుంజులు, పొట్టేళ్ళపందెములు, రెంటను సమానముగానే ఉండును. ఇందు నాందినుండి భరతవాక్యమువరకు శృంగారోపాసనమే. అందు కొంత యితర ప్రశంస యున్నది. రంగ మోరుగల్లుపురము.

ఇఁక కథలోనికి వత్తము. సూత్రధారపారిపార్శ్వకులు, శృంగారప్రశంస, కథాసూచనము మొదలగునవి చేయఁగా విలాసశేఖరుఁడు ప్రాతఃకాలమున తనప్రియభోగిని యింటినుండి లేచి వేశవాటమున బయలుదేరి నడచుచు సాయంకాలమునకు కనకమంజరి కూతురైన యనంగమంజరి ప్రథమార్తవమహోత్సవమున కందుకొనవలయునని సంకల్పించును. ఇదె ఈక్రింది శ్లోకములోఁ జెప్పఁబడినది.

"దివసమఖిలం నీత్వా తాం తాం విలోకచమత్కృతాం
ముదితహృదయః సాయం గంతా సఖీమహమీక్షితుమ్

ముందొక హర్మ్యముపై 'మలయవతి' యుండఁగా దానితో మచ్చటాడినట్లు నటించును. అంత కలావతి కూతురు కమలవతి ఇంటియరుగుమీఁదఁ గూర్చుండియుండుటఁ గాంచును. ఆమె మలయగుప్తుని వెదకనంపి మాధవగుప్తుని రప్పించినదట. ఆయిల్లు గడచి యొక యింట మాధవుని కొడుకు మందారకుడుండ వానిని హెచ్చరించును. అతఁడు యజ్ఞమునకై తండ్రిదాచిన ధనమును దెచ్చి మన్మథసత్రమున దీక్షితుఁడయ్యెనఁట. తర్వాత పూర్వానుభూతయైన రత్నావలిని తాంబూలగ్రహణముచే నాదరించి, కనకలతాకామందకులను బ్రోత్సహించి, ఇందుమతిచేయు కందుకక్రీడ (బంతియాట) గాంచి, జారగ్రహగృహీతయైన తల్లిచే మేడమీఁద నిర్బంధింపఁబడినవాసంతికను సంభావించును. పిదప ధనమిత్రుని నేరమునకై పూదండతోఁ గొట్టుచున్న కలకంఠిని మందలించి, బాలచంద్రికకు గణదత్తుఁడు నేర్పుచున్న నృత్యమును గాంచి, డోలోత్సవమున మందారికా మకరందులను గాంచును. అచ్చట మందారిక పాడుచున్న హిందోలాగానమును మెచ్చుకొనును. ఆపైన విలాసవతి యనునది విటశేఖరునితో నాడుచున్న అక్షద్యూతమును దిలకించును. ఇప్పటికి మధ్యాహ్నమైనందున మనకథానాయకుఁడు చంద్రవతీమందిరోద్యానమున కొంచెము విశ్రాంతి బొందును. అటనుండి లేచి వేత్రవతీగృహమును, పొట్టేళ్ళ పందెమును, కోడిపోరును, మల్లయుద్ధమును (కుస్తీ) చూచి, మాలతికొరకు

మాధవసేన, చంద్రసేనుల ఖడ్గయుద్ధమును జూచును. అందు చంద్రసేనుఁడు జయించి యభినందితుఁ డగును. తరువాత యింటిలో మత్తకోకిల కూతురు మఁజుభాషిణి గాథను పాడగా విని ఆనందించి, "కింకిం నకరోతి గీత మబలానాం" అనును.

ఇప్పటికి ప్రొద్దు గ్రుంకవచ్చినది. కామమంజరి యిల్లు వర్ణించి, అనంగమంజరి పీఠముపైఁ గూర్చుండియుండ కన్నులపండువుగాఁజూచును. "సఖికిమతః పరేణానందేన" అని భరతవాక్యము.

ఇందు శైలినిగూర్చి విశేషముగా వ్రాయదగినది లేదు. పూర్వకవుల పోకడలను జక్కఁగ ననుకరించినా డనవచ్చును. కథావిశేషము తెలియనే తెలిసినది.

శైలి కొక్క ఉదాహరణము.

'ఉపదిశతి లోచనం తే కాముకలోకస్య కిమపి కౌటిల్యం'

దీనితో పూర్వకవిరచితము, 'ఉపదిశతి కామినీనాం యౌవనమద ఏవ లలితాని' అనునది పోల్చవచ్చును.

ఇతని కవితకు మెచ్చి షడ్భాషావల్లభ, కవిసార్వభౌమ అను రెండు బిరుదములను రాజితని కిచ్చినట్లు తెలియుచున్నది. ప్రాకృతమును నిర్వహించుటలో నితడు పూర్వకవుల కేమాత్రమును తీసిపోడు. పోతుపందెము నుదహరించెదను. చక్కని స్వభావోక్తి.

శ్లో॥ పశ్చాత్క్రంచి దివోపసృత్యమిలితౌ తిర్యఙ్నమత్కంధరౌ
శృంగగ్రాహిత లోహశృంఖల ఖలాత్కారకృధామేదురౌ।
కూటాస్ఫాలన ఘోరమస్తకయుగవ్యాఘాతభీమారవౌ
కుర్వాతౌప్రహతిం విటప్రణిహితౌ మేషౌ సరోషావిమౌ॥

ఈభాణములో నొక్క ముఖ్యాంశమును తెనిగించెదను.

"అహో ఈమె యెవతె? ముసలిరూపుతో చేతులో నొకపత్రికను బట్టుకొని, ఒక యువకు నీడ్చుచున్నది. అవును. సామెత నిజమే. లంజ ముదిసినకోతి యగును. నిజముగా నీమె తనకు అల్లునివలెనున్న మాధవదత్తునిడబ్బంతయు లాగి "నవమాలిక" ముఖము చూడవద్దని తఱుముచున్నది. పత్రముతీసికొని, ఈ వేత్రవతి కోర్టు కెక్కనున్నది. ఈవిషయమున నేనుగూడ సభ్యుఁడ నయ్యెదను. "ఓ వేత్రవతీ, ఆడదానికి తగిన ట్లింత దారుణమాచరించుచున్నావేమి? ఏమంటివి? అసరసుఁడుగా మాధవదత్తుఁ

డాచరించుచున్నాఁడనియా? అయిన చెప్పుమతని నేరము. 'ఇంట ఆరునెల లల్లుఁడుగా నుండి దమ్మిడి యివ్వ లేదనియా? (అపవారించి) అన్నా! నీపక్షమే మాట్లాడు చున్నానోయి! (ప్రకాశము) విను! వేత్రవతీ! నిజమే మాధవదత్తుఁడు దరిద్రుఁడే, నీకుమార్తె యింక, ఆరునెలలు బాకీయున్నది గదా? ఏమంటివి? ఇది నవ్వులకు సమయము గాదు. పత్రిక చూచుమనియా? (అని పత్రిక తీసికొని చదువుచున్నాడు).

"స్వస్తి మన్మథనామసంవత్సరమున విజయనగరవాసి మాధవదత్తుఁడు వేత్రవతి కూతురు నవమాలికకు వ్రాసి యిచ్చిన పత్రము".

"ఆరుమాసములు నీవు ప్రణయినివిగా నుండు నియమముతో నేను నూరు నాణెము లిచ్చుటకును, ప్రతినెల జోడు మంచిచీరె లిచ్చునట్లును, రోజు క్రొత్తదండలు, కస్తూరి కర్పూరపుతాంబూలములు 100 ఇంకను కోరినవన్నియు నిచ్చునట్లును ఒప్పుకొన్నాను."

నాయనా! మాధవదత్తా! వ్రాసియిచ్చిన తరువాత యింక వ్యవహార మేమున్నదోయి? కనుక జవాబు చెప్పు!

ఏమనుచున్నావు! (ఈపిశాచి నన్ను మోసగించి, డబ్బులాగి యింకొకనిని రప్పించుట కీయుపాయము చేయుచున్నదనియా? అందుకని నాచీరెలు నాకు తెమ్మనుచున్నావా? "అన్నా! ఈతప్పు మన్నించు! వేత్రవతీ! అల్లునిపిలిచి లోపలికి పొండు!" ఏమనుచున్నారు బావగారిఆజ్ఞ దాటరానిదనియా? సరి! గాని, సాయంకాలము అనంగమంజరి ఉత్సవమునకు రావలెను సుమా!"

వేమభూపాలచరితము:— ఇది వామనభట్ట బాణుని గ్రంథము లన్నింటను మిక్కిలి ముఖ్యమైనది. దీనిని 'ఆఖ్యాయిక' యందురు. బాణు ననుకరించు నుద్దేశముతో నిది వ్రాయబడినది. బాణుఁడు తన చక్రవర్తి పేర హర్షచరిత్రమును వ్రాసినట్లే, ఈకవి తన రాజుపేర వీరనారాయణచరిత మను నామాంతరముగల వేమభూపాలచరితమును వ్రాసెను. హర్షచక్రవర్తి తన యన్నను సంహరించి రాజ్యమునకు వచ్చెనని ప్రతీతి కలదు. దానిని కప్పివేయుటకు బాణుఁడు పెక్కువస్థలు పడినట్లే, దాయాదులను నెట్టివేసి రాజ్యమునకు వచ్చిన పెదకోమటివేమారెడ్డి చరిత్రమును గూడ కొంత కప్పివేసి వ్రాయవలసివచ్చినది. కాని హర్షునిరాజ్యము స్థిరమైనది. అతనికీర్తి దిగంతవిశ్రాంతమైనది. అందువలన నెన్ని యతిశయోక్తులు వాడినను బాణునకు చెల్లిపోయినది. పెదకోమటివేమారెడ్డి కట్లుగాదు. ఒకవైపు రాజమహేంద్రపు రెడ్డిరాజులు తనబంధువులు పక్కలో బల్లెములు. ఒకవంక మహమ్మదీయులు రాజ్యమును మ్రింగుటకు సిద్ధపడి

యుండిరి. వేటకోళవంక వెలమ లనుటుణము కాలుదువ్వుచుండిరి. పెక్కు ఓటములు తటస్థించెను. ఈస్థితిలో వామనభట్టబాణుఁడు ప్రయోగించిన యతిశయోక్తు లన్నియు ననత్యములక్రింద పరిణమించెను. సకలజగద్దిగ్విజయయాత్ర పరిహాసాస్పదమైనదయ్యెను. బాణు ననుకరించెదనని, బాణుని మించెదనని యెన్ని అంకెలు వేసినను, అవియన్నియు వమ్మైనవి, "పుణ్యైర్యశోలభ్యతే". హర్షచరిత్ర పీఠికవంటి పీఠిక వామనుఁడు వ్రాసినాఁడు. కాని బాణునికున్న వినయ మాతనికి లేదయ్యెను.

"బాణాదన్యే కవయః । కాణాఃఖలుసరసగద్యసరణీషు
ఇతిజగతి రూఢమయశో । వామనబాణోఽపమార్ష్టి వత్సకులః ॥
ప్రతికవిభేదన బాణః । కవితాతరు గహన విహరణమయూరః
సహృదయలోక సుబంధుః । జయతి శ్రీభట్టబాణకవిరాజః ॥"

ఇంకను మరిరెండు గర్జనములు గలవు. పాఠకులు హర్షచరిత్ర పీఠికను, కాదంబరి పీఠికను చూచి పోల్చుకొందురు గాక!

బాణుఁడు విష్ణువును వర్ణించినను శివభక్తి మెండుగా గలవాఁడు వామనుఁడు శివుని వర్ణించినను విష్ణుభక్తి యెక్కువగా గలవాఁడు.

బాణుఁడు-శివవర్ణనము— "అమలముక్తా శిలాఘటితలింగమశేషత్రిభువనవందిత చరణం చరాచరగురుం చతుర్ముఖం భగవంతం త్ర్యంబకమ్"—

వామనుఁడు-విష్ణుప్రశంస— "సాక్షాన్నారాయణ ఇవ సకల లోక వంద్యః— క్రూరగ్రాహగృహీత గజపతి రక్షణక్షణావిఖ్యాతస్య గరుడధ్వజస్యేవ సర్వలోక శరణత్వమ్, విశ్వమివ నారాయణమూర్తిః"

మనకవి తనప్రతాపమును జూపింపఁదలఁచి నగరార్ణవ శైలర్తు చంద్రార్కోదయాదులన్నియు వర్ణించెను. పదవిన్యాసమాధుర్యమున, ఆశయావిష్కరణ గాంభీర్యమున, సరసాలంకారయోజనమున, విప్రలంభశృంగారాదివర్ణనమున నాయికలసముచితా లాపసరణిని బాణునకు వామనబాణుఁడు తీసిపోవుననుటలో సందేహము లేదు. ఇతఁడు బాణునే గాక ఆయాసందర్భముల నితరకవులను గూడ ననుసరించెను. కాని కాదంబరీ కథానుసరణము మిక్కిలిగ గలదు. ప్రోలభూపతివేట చంద్రాపీడుని వేటవంటిది. అతఁడు లేళ్లను వేటాడుచు సుగంధవాయ్వాఘ్రాణమునఁ బోయి కన్యను జూచుట చంద్రాపీడుడు 'అశ్వముఖద్వంద్వము' ననుసరించి పోయి మహాశ్వేతను జూచినట్టిది.

ఇరువుర భేరీనాదములు ప్రయాణపటహములు, సైన్యధుమ్ము సమానముగ నున్నవి. వింధ్యాటవీవర్ణనము రెంటనుఁ దుల్యము. వామనుఁడు రఘువంశము ననుసరించి వేమ భూపాలునిజైత్రయాత్ర వర్ణించెనుగాని కాళిదాసువలె దేశముచూచినవాఁడు కాక పోవుట చేఁగాఁబోలు, భూగోళశాస్త్రమును తారుమారుచేసినాఁడు. చరిత్రము గూడ యుక్తము గా లేదు. అయినను చరిత్రములే తక్కువగానున్న దేశములో నిట్టివైనను చరిత్రకావ్యము లమూల్యము లనుట నిక్కువము.

కథాసంగ్రహము:— ఈగ్రంథమున నాలు గుచ్ఛ్వాసములు గలవు. అందు మొదటిదానిలోని కథ.

సుప్రసిద్ధమగు త్రిలింగమను జనపదము గలదు. అందద్దంకియను నగరి ఉన్నది. విష్ణుపాదోద్భవమగు నాల్గవవర్ణమున కామాభిధానుఁడు జనించి యవనిఁ బాలించెను. అతనివంశములో ప్రోల్లభూపతి వర్ణనీయుఁడు. ఆయనవేటకై బయలుదేరి లేడిచే దూరాకృష్టుఁడై కన్యనుగాంచెను. ఉభయుల మోహము.

రెండవ ఉచ్ఛ్వాసము— ఆసమయమున విదూషకునిరాక్షసుఁడు పట్టుకొనగా రాజు వెళ్ళి వానిని విడిపించి, మరలివచ్చి కన్యనుగానక విరహాక్రాంతుఁ డయ్యెను. అతఁ డింటికిఁజేరి ఉద్యానమున కాలము గడపుచుండగా, కన్యాచిత్రఫలకముతో నామె చెలి కత్తెవచ్చి రాజపుత్రివిరహము నతనికిఁ జెప్పను.

విక్రమసింహపురి యందు తుఖారఘట్టరాజుకూతురు అనంతాంబిక యాకన్య. నాయికావిరహమును విని రాజు సందేశ మంపును. ఇచ్చట 'దూరంబిససితయా' అను బాణునిశ్లోకమువలె చక్కని శ్లోకము గలదు.

శ్లో. జానా సివానవా త్వం బహుధా మమహృదయమదయ సంరంభః
తాడయతి చంద్రవదనే! త్వద పాంగనిదేశకింకరో మదనః.

మూడవ ఉచ్ఛ్వాసము— స్వయంవరము. వివాహము. ఆమె యం దతనికి మాచ, వేమ, దొడ్డ, అన్న, మల్ల పేర్లుగల కొడుకులు గలిగిరి. అందు మాచన్నకు రెడ్డి ప్రోతభూపుఁడు, కోమటేంద్రుఁడు, నాగేంద్రుఁడు అను ముప్వురు పుట్టిరి. అందును గుణజ్యేష్ఠుఁడు పెద్దకోమటేంద్రుఁడు రాజయ్యెను. అతఁ డనంతాంబను పెండ్లియాడి, ఇంద్రునర్చించి వేమభూపునిగనెను. రెండవకొడుకు మాచభూపాలుఁడు. వేమభూపుఁడు రాజయి శరత్కాలమురాగా దిగ్విజయము బయలుదేరెను. సేనలు తూర్పు సముద్ర తీరమున విడిసెను.

నాల్గవ యుచ్ఛ్వాసము— తరువాత కలింగ అంగ వంగ భంగాలములను జయించి గంగ ఒడ్డున విడిసి సముద్రము వెంబడి దక్షిణమునకు వచ్చి ద్రావిడుల నాక్రమించి, కాంచి చేరి పాండ్యులజయించి, సేతువుజూచి, తామ్రపర్ణిలో స్నానము జేసెను. పిదప కేరళమునుజూచి, మురచనదినిదాటి, మలయపర్వతములకడ విడిసి, కొన్నాళ్ళుండెను. అనంతరమున పశ్చిమదిశగా నేగి ఘూర్జర సౌరాష్ట్రములజయించి సోమనాథు నర్చించి, పారశీకమున కేగి యవనులజయించి అపరాంతరాజ్యము నాక్రమించెను. సింధురాజుతో బోరి జయించి, హూణులను, కాంభోజులను, కాశ్మీరులను వంచి ఎండకాలమున హిమ శైలమున విశ్రమించెను.

అంతట సైన్యముతో వింధ్యాటవికి వచ్చి చండికాలయమున ఆదిభైరవిని తంత్ర విధితోఁ బూజించి దాక్షారామపురికివచ్చి, భీమేశ్వరునకు మ్రొక్కి వేశవాటిని కేవలా వలోకనమున ననుగ్రహించి, వసిష్ఠాగౌతమీసేవితయగు గోదావరిని సేవించి తనపురికి వచ్చి భోగియై సరసకవికావ్యశ్రవణభూషణభూషితుఁడై పరమానందమున నుండె".

ఇందలి దాక్షారామవిలాసినీవర్ణనము భాణములోనివర్ణమును దలపించుచున్నను ఇక్కడ వేశ్యలను మెచ్చుకొనుటకంటె విమర్శించుటయే యెక్కువచేసినాఁడు. వర్ణనము విదూషకుఁడు చేసెననియు, అది విని రాజు నవ్వెననియు విదూషకునకుఁ బారితోషిక మిచ్చెననియు సరిపుచ్చి అందలి గౌరవమును కాపాడెను. ప్రోలయవేమారెడ్డి శ్రీశైల మునకు మెట్లుగట్టించెనని, యవనులజయించెనని మొదలగు చరిత్రాంశములచ్చటచ్చట నున్నవి. ఇఁక దండయాత్ర చదివినవారికి అది అసంగతములవుట్టయని బూటకముల బుంగ యని గోచరముగాక మానదు. వంశవృత్తము గూడ సరిగా చెప్పక దాటివేయ వలసివచ్చినదని యీపఅకే చెప్పినాను. ఇంతకంటె చరిత్రాంశములలోనికి వెళ్లుట నా వ్యాసమునకు తగదు. అపనిని పెక్కురు ఇతరవ్యాసములలో చేసియుందురు అని నా నమ్మకము. చర్విత చర్వణమేల ?

## వామనభట్ట బాణుఁడు—శ్రీనాథుఁడు

ఇరువురు నొకరినొకరు పేర్కొనలేదు. ఏకారణముచేనైన నేమి ? ఇరువురు సమర్థులైన కవులు. రెండుభాషలలో విడివిడిగా విజృంభించినవారు. ఇరువురు బాణుని కాదంబరినుండి పుటలకొలదిగా తమగ్రంథములలోనికి దింపుకొనియున్నారు. శ్రీనాథుని కాశీఖండము, శివరాత్రిమాహాత్మ్యములను బరిశీలించినవారి కీసంగతి వేరుగఁ జెప్పన క్కఱ లేదు. ఇఁక శ్రీ కురుగంటి సీతారామయ్యగారు చెప్పినట్లు భీమఖండములోను,

వేమభూపాలచరితములోను పెక్కువర్ణనములు తూచినట్లు సరిపోయినవి. వేమభూపాల చరితములోని త్రిలింగదేశవర్ణనము, భీమేశ్వరపురాణములోని దాక్షారామపురవర్ణనమును సరిగా పోలియున్నవి.

పరమసమర్థుఁడయ్యు శ్రీనాథుఁడు వేగముగా కృతులు రచించు తొందరలోను, నిరంకుశత్వము చేతను బాణు ననుకరించినట్లే వామనబాణుని గూడ ననుకరించెననుట అంత సత్యవిరుద్ధము కాఁజాలదు. అంతమాత్రముచేత శ్రీనాథుని పరపతి కేమియు నష్టము రాదు. ఈవర్ణనలన్నియు నీవిధముగ నెంతైన నున్నవని యెవరైన చూపగలుగు వరకు నిట్లే భావింపవచ్చునని తలఁచుచు కొంచె మావిషయ ముదాహరించి యీ వ్యాసమును ముగించుచున్నాను.

ఆంధ్రులచరిత్రము ప్రశంసనీయముగఁ జేయుటలో వామనబాణునివంటి సంస్కృతకవుల కృషి యనల్పమని మనవిచేయుచున్నాను.

### త్రిలింగదేశవర్ణనము (వామనభట్ట బాణుఁడు)

"సమంతాదఖండితాంభః సమృద్ధిః, విశ్వంభరా భ్రూలతానుకారి సేతులేఖైః తటతరుకుసుమాంతర క్షీరదమంద మకరంద స్యంద కందళితకల్లోలైః సలిలకేళీలోల కలహంస కామినీ కోలాహలానుకృత జలదేవతామణినూపుర ఝుణఝుణత్కారైః కారండవ పక్షవిక్షేపపరిచలిత పంకజపరాగపాళవిరచితాలీక సంధ్యానుబంధచకిత చక్రవాకయుగైః స్తనంధయైరివ సాగరరాజస్య అనేకైస్తటాకైరుపాశోభితః......... లలితలవలీలతాంగిత లవంగైః ॥

### దాక్షారామపురవర్ణనము (శ్రీనాథుడు)

"అఖండితాంభః సమృద్ధి విజృంభించి విశ్వంభరాభ్రూలతానుకారి సేతురేఖాలంకారంబులై తటతరుకుసుమాంతరక్షరదమందమకరందస్యందన కల్లోలంబులైన సలిలకేళీలోల కలహంసకామినీ కోలాహలానుకృతజలదేవతాచరణమణినూపుర ఝుణఝుణత్కారంబులై, కారండవపక్షవిక్షేపసంచరితపంకజపరాగపాళీవిరచితాలీకసంధ్యానుబంధచరిత చక్రవాకమిథునంబులై, పయోధిగన్న బిడ్డలుంబోని యొడ్డుచెరువులచేతను...... లలితలవలీలతాలింగితలవంగంబులును నగు శృంగారారామములచేతను."

# ఎఱ్ఱాప్రెగ్గడ — హరివంశము

కిళాంబి రాఘవాచార్యులు, ఎమ్. ఎ., బి. ఎల్.

ఆంధ్ర వాఙ్మయప్రపంచమున మూలపురుషులై మహాభార తాంధ్రీకరణముచేఁ గవిత్రయంబని విఖ్యాతిగాంచిన కవీశ్వరులలో నెఱ్ఱాప్రెగడ మూఁడవవాఁడు. ఆంధ్ర కవిత్వమునకు వీరు మార్గదర్శకులనియు వీరి రచనను మిగిలినకవులు సప్రమాణముగఁ గైకొనిరనియు నంద రంగీకరించిన విషయమే. ప్రబంధకవియు నెఱ్ఱాప్రెగడ కించుమించుగ సమకాలికుఁడు నగు నాచన సోముని నెఱ్ఱాప్రెగడకు మిన్నయని కొంద రిటీవల నిరూపింప ప్రయత్నించిరి. 'అలికంబున నక్షిని డాచినట్టి సర్వజ్ఞుఁ' డని చిన్నయ సూరిచే నుతింపఁబడిన నాచన సోమన ప్రబంధకవులలో నున్నతస్థానమును వహింప నర్హుఁడే కాని కవిత్రయముతో సమానుఁడని సహృదయు లంగీకరింపజాలరు.

## —: కవివంశాదికము :—

ఎఱ్ఱాప్రెగడ క్రీ. శ. పదునాల్గవ శతాబ్దమువాఁడు. ఆపస్తంబసూత్రుఁడు. శ్రీవత్సగోత్రుఁడు. నెల్లూరుమండలములోని గుడ్లూరు యతని నివాసస్థలము. ఇతని యింటిపేరు చెదలవాడవారని యతనివంశస్థుఁడును విప్రనారాయణచరిత్రకర్తయు నగు మల్లన వ్రాసిన 'ప్రతిభతో నారణ్యపర్వశేషముఁ జెప్పెఁ గవులకుఁ జెవులపండువులు గాఁగ' యను పద్యమువలనఁ దెలియుచున్నది. ఇతనితాత ఎఱపోతన వేఁగినాఁట కర్తా వర్తివృత్తిమంతుఁడని నరసింహపురాణమున గలదు. ఎఱ్ఱాప్రెగడ ప్రథమమున గుడ్లూరునివాసియై తరువాత చెదలవాడ యందుండెనని మన మూహింపవచ్చును. నరసింహపురాణమున గల వంశవర్ణమువలన నీక్రిందివంశవృక్షము మనకు లభించుచున్నది.

భీమన

బొల్లన = ప్రోలమాంబ

ఎఱపోతన = ప్రేంకమాంబ

బొల్లన    ప్రోలన    జన్నన    సూరన = పోతమాంబ

ఎ ... గడ.

పై వంశవృక్షము విస్పష్టముగ నున్నను, భాగవత షష్ఠస్కంధము నాంధ్రీకరించిన ఏర్చూరిసింగనకు బూర్వుడైన యెఱ్ఱనయు, కౌర్మకగ్రంథకర్తయగు యెఱ్ఱనయు, నెఱ్ఱాప్రెగడయు నొక్కరేయని కొందఱు విమర్శకులు వ్రాసియుండుట ప్రమాదజనితమని యూహింపనగును.

ఎఱ్ఱాప్రెగడకు మూలపురుషుఁడగు భీమన వెలనాటిచోడునివలన మిగుల మన్నన గాంచియుండెను. (క్రీ.శ 1156-1163); అతని కైదవతరమువాఁడైన ఎఱ్ఱాప్రెగడ, కాకతీయసామ్రాజ్య పతనానంతరము స్వతంత్రుఁడై క్రీ. శ. 1328-49 వఱకు నద్దంకి రాజధానిగ రాజ్యపాలన మొనర్చిన ప్రోలయవేమారెడ్డికి దన రామాయణ హరివంశముల గృతి నొసంగియుండుటచేఁ బదునాల్గవ శతాబ్ద ప్రథమభాగమున నుండెనని మనము నిర్ణయింపవచ్చును. 'ఉన్నత సంస్కృతాది చతురోక్తిపదంబుల గావ్యకర్తయై ......నరణ్యపర్వ శేషోన్నయమంధ్రభాష సుజనోత్సవమొప్పగ నిర్వహించుటచే' ప్రబంధపరమేశుఁడనియు, 'గిరిశపద భక్తిరసతత్పరభావము కలిమి' శంభుదాసుఁడనియు బిరుదములు వచ్చినటుల గవి నరసింహపురాణమునఁ దెలిపికొనియున్నాఁడు. ఎఱ్ఱాప్రెగడ శంభుదాస బిరుదాంకితుఁడై శంకరయతీంద్రుని శిష్యుఁడైనను శివకేశవులయందు సమానమగు భక్తిని గనబఱచెను. రామాయణ హరివంశరచనమే యిందులకు తార్కాణము. 'గోవింద గుణాదరసౌమనస్య ధన్యుఁడ'నని కూడ దన్ను నరసింహపురాణముననే వర్ణించుకొనియుండెను.

ఎఱ్ఱాప్రెగడ గ్రంథములు

ఈతడు రచించిన రామాయణములోనివని యొండు రెండు పద్యములు లక్షణ గ్రంథములను దాహృతములగుటయేకాని యాగ్రంథము మనకు లభించి యుండలేదు. వేమారెడ్డి యనుజన్ముఁడగు మల్లారెడ్డిపోషణమున నుండి తరువాత వేమారెడ్డి నాశ్రయించి రామకథను జెప్పినటుల హరివంశమున గలదు. మిగిలినగ్రంథములగు నరణ్యపర్వశేషము, హరివంశము, నరసింహపురాణమును మనకు లభించి యతని కాంధ్రవాఙ్మయప్రపంచమున నత్యున్నతస్థానమును సమకూర్చుచున్నవి. భారతారణ్యపర్వమున

'స్ఫురదరుణాంశురాగరుచి' యనుపద్యమునుండి యతనికవిత్వము ప్రారంభమని పలువు రంగీకరించియున్నారు. అయినను ఎఱ్ఱాప్రెగడ రచించినది నష్టభాగపురాణ మని యొక వింతవాదము నిటీవల కొందరు లేవనెత్తిరి. అది నిరాధారమగుటయే గాక గ్రంథాంతర ప్రమాణములకును, జనశ్రుతికిని విరుద్ధము. ఎఱ్ఱాప్రెగడ రచించినభాగమును నన్నయ తిక్కనాదులకవిత్వముతోఁ బోల్చిఁ జూచినచో నిది మఱియు విస్పష్టము కాగలదు. అతఁడు తనగ్రంథములందు నన్నయతిక్కనలనుమాత్రమే స్తుతించియున్నాఁడు. 'నన్నయ భట్ట మహాకవీంద్రు సరససారస్వతాంశప్రశస్తి' తన్ను జెందినదనియు, 'దత్కవితారీతి యుఁ గొంతదోఁప (దద్రచనయకా నారణ్యపర్వశేషమును బూరించితిననియు నతఁడు దెలిసికొనెను. అట్టి రచనయే నష్టభాగపురాణమనుభ్రమను గలుగజేసినది. కాని సవిమ ర్శముగ భారతభాగములఁ జదివినచో గవిత్రయకవనభేదము నెఱుంగవచ్చును. తరు వాతి కవీశ్వరులందఱితని మహాభారతకర్తగ బరిగణించియుండుట విదితము. అయినను విమర్శకులలో గొందఱు 'అరణ్యపర్వశేషోన్నయ' మనుదాని కొక విపరీతార్థమును స్ఫురింపఁజేసి ఎఱ్ఱాప్రెగడ రచించినది నష్టభాగపురాణమే యనియు స్వతంత్రరచనము కాదనియు వాదించుచున్నారు. ఇది పండితజనసమాదరణీయము కాదు.

ఎఱ్ఱాప్రెగడకు నన్నయతిక్కనలపై గల భక్తివిశ్వాసములు హరివంశమున బాగుగ దెలుపఁబడియున్నవి. 'ఉన్నతగోత్రసంభవము' అను పద్యమున నన్నయభట్ట కుంజరంబును, 'తన కావించినసృష్టి తక్కొరులచేతంగాదునా' యను పద్యమున కవి బ్రహ్మయగు తిక్కనను బ్రశంసించుటయే గాక వారుచూపిన త్రోవపావనంబని వచిం చెను. అందు నన్నయభట్టకృతభారతభాగమును ముందునిడికొని రచించుటచేనారణ్య పర్వశేషము 'తద్రచనయకా' స్ఫురించుటలో వింతయేమియును లేదు. అరణ్యపర్వశేష మున, నరసింహపురాణము నన్నయరీతిని సంస్కృతసమాసజటిలంబుగ రచింపఁబడినవి.

ఎఱ్ఱాప్రెగడ నృసింహపురాణమును అహోబలనాథుని కంకితమొనర్చెను. తన తాతయగు నెఱ్ఱపోతన తనభావమున సాక్షాత్కరించి తనప్రియదైవతంబగు నహోబ లేశ నరసింహునిగూర్చి కావ్యమును రచింపఁ బ్రోత్సహించెనని యతఁడు వ్రాసి యున్నాడు. తిక్కనయు తనజనకుఁడగు కొమ్మనదండనాథునియానతిచే దాను భారత మును రచింపబూనితినని విరాటపర్వమునఁ బీఠికయందు వర్ణించియుండెను. అట్టి పద్ధతినే ఎఱ్ఱాప్రెగడయు నవలంబించియుండెననుట స్పష్టము. తిక్కనయెఱ్ఱాప్రెగడలకాలమున బ్రజలు శివకేశవులయం దభేదప్రతిపత్తిగలవారై హరిహరారాధన మొనర్చుచుండి రని

తెలపవలసి యున్నది. నాచన సోమనయు నుత్తరహరివంశమున హరిహరనాథుని గీర్తించుటయే గాక ద్వితీయాశ్వాసమున హరిహరులయైక్యతను నిరూపించి 'ఎల్లలోకంబులకు దైవమేకమగుట, హరిహరాత్మ నెఱింగితిమనిరి సురలు' అని వర్ణించెను. అట్టి యైక్యతను గుర్తెఱింగియే శివభక్తితత్పరులయ్యు, తిక్కనయెఱ్ఱాప్రెగడలు ఉత్తరరామాయణము హరివంశనృసింహపురాణములు మొదలగు విష్ణుభక్తి ప్రతిపాదకగ్రంథముల రచించిరి. పురాణముల మూలగ్రంథముల విమర్శకదృష్టినిఁ బరిశోధించినచో విష్ణుసంబంధములగు పురాణముల నంబికాశివ స్తుతులును, శివపురాణముల లక్ష్మీనారాయణస్తుతులునుఁ జేర్పఁబడుట నిస్సంశయముగ నెఱుఁగనగును.

హరివంశము ఎఱ్ఱాప్రెగడ రచించిన గ్రంథములలోఁ దుదిగ్రంథమని కొందరు తలంచుచున్నారు. నృసింహపురాణమున నరణ్యపర్వప్రశంసయు, హరివంశమున రామకథాప్రశంసయు మాత్రము గలవు. వానివలన గ్రంథముల పౌర్వాపర్యముల నిర్ణయింప వీలులేదు. కొందరు మల్లన విప్రనారాయణచరిత్రమునందలి 'ప్రతిభతో నారణ్యపర్వశేష'మనుపద్యమునఁ దెలుపఁబడిన వరుసయే నాయాగ్రంథరచనలవరుస యని యంగీకరించియున్నారు. అదెట్లున్నను హరివంశ మతని గ్రంథములలో నత్యున్నతస్థానమును వహించుననుటలో సందియము లేదు. హరివంశమును భారతపరాంశమని బుధులింపారగఁ జెప్పుదురని కవి తెలిపియున్నాఁడు. మఱియు 'బంధురాష్టాదశపర్వనిర్వాహణాసంభావితంబగు మహాభారతంబు హరివంశపరిపూర్ణమగునట్లుగాఁ గ్రమవ్యాఖ్యాన మొనరించితెసఘు నీవు' (హరి. ఉత్త- 10:291) అనుటచే హరివంశముయొక్క ప్రాముఖ్యత మనకు విదిత మగుచున్నది.

### ప్రోలయ వేమారెడ్డి

ఈహరివంశగ్రంథము అద్దంకి రాజధానిగ యాంధ్రదేశము నేలిన ప్రోలయ వేమారెడ్డి కంకితము సేయబడినది. వేమారెడ్డి పంటదేసటికులమున జనించి, కాకతీయ సామ్రాజ్యమున సేనానాయకుడై తురుష్కులదండయాత్రలచే నాసామ్రాజ్య మంతరించెడు తరిని యద్దంకి రాజధానిగ కందుకూరు మొదలు గోదావరితీరమువఱకును తనభుజబలముచే రెడ్డిరాజ్యమును స్థాపించెను. ఈతఁడు క్రీ. శ. 1325-1350 వఱకు రాజ్య మేలెననియు, నతనియనంతర మతని పుత్రులు అనపోత, అనవేమారెడ్డులు రాజ్యము చేసిరనియు మనకుఁ దెలియును. ప్రోలయవేమారెడ్డికి సోదరులగు అన్నారెడ్డియు, మల్లారెడ్డియు, కుమారుఁడగు అనపోతారెడ్డియు, మేనమామకుమారుఁడగు నూకారెడ్డియు సేనా

యశులై యుండిరి. అందు మల్లారెడ్డి తనబాహుబలముచే సుప్రసిద్ధరేవుపట్టణ మగు మోటుపల్లిని జయించి స్వాధీనపఱచుకొనెను. ప్రోలయ వేమారెడ్డి తాను పరాక్రమము చేనాక్రమించినభూములను తన యనుజతనుజమిత్రబాంధవుల కిచ్చెనని హరివంశమున గలదు. తురుష్కులదండయాత్రలచే దేశ మంతయు నల్లకల్లోలముగ నుండుటచే నతడు వర్ణాశ్రమధర్మములకును, వేదాదివిద్యలకును దగిన చేయూత యొసగి తన యశశ్చంద్రికలనాంధ్రదేశమున వెదఁజల్లెను. అతనిభాగ్యవైభవము, రాజ్యపాలనము, దానములు, తటాకారామప్రతిష్ఠలును 'అగ్రహారములు విద్యాతపోవృద్ధులకిచ్చి' యను పద్యమున వర్ణింపఁబడినవి. (హరి. పూ. ౧-19).

ఈవేమారెడ్డియే శ్రీశైలయహోబలక్షేత్రముల సోపానముల గట్టించెను. అందుననేఅపరిమితభూదానపరశురాముడు, అనేకనగరోపకంఠ ప్రతిష్ఠాపిత వివిధారాముడు, పర్వతాహోబలనిర్మితసోపానుఁడు మొదలగు బిరుదములను వహించి కీర్తి కెక్కెను. మఱియు నతఁడును నతనివంశీయులును గ్రమముగ ధరించిన 'పల్లవాదిత్య, జగనొబ్బగండ, కేళాధిరాయ, చెంచుమలచూరకార, సంగ్రామధనంజయ, వీరనారాయణాద్యనేక సుప్రసిద్ధబిరుదములు హరివంశమునఁ బేర్కొనఁబడినవి. (1-11) బ్రహ్మకుండిసహ్యజాగౌతమీజలక్రీడావినోదుండనుటచేతనే యతనిరాజ్యవిస్తీర్ణము విదితము. అతడు గజపతి సేనలనుగూడ జయించెను. హరివంశమున (పూర్వ ౧-199)

మాలిని— బహుళ హయగజేంద్ర స్ఫారసేనాసహస్ర
ప్రహత కటకరాష్ట్రభ్రష్ట విద్విష్ట సంప
ద్గ్రహణ.........................

యనుపద్యమున వర్ణింపఁబడినది. ఎఱ్ఱాప్రెగడగ్రంథములలో వేమారెడ్డి కుమారుడగు అనవేమారెడ్డి ప్రశంసగానరాదు. అనవేమునిపూర్వజులగు అనపోత కోమటీంద్రులు మాత్రమే పేర్కొనఁబడిరి. కొన్నిప్రతుల 'ప్రోలయసూనుడు గోమటి' యను చోట 'మాచయసూనుడు గోమటి' యనియు పాఠాంతరము గలదు. (పూర్వ ౧-32) హరివంశరచనమునాటి కనపోతారెడ్డి యువరాజుగ నుండెను. కాని యనవేమారెడ్డి జన్మించియుండలేదనియో, లేక బాలుడై యుండెననియో యూహింపవలసి యున్నది. మఱియు కవి యీగ్రంథమున కృతిపతిని ప్రోలయవేమా, అన్నయవేమా యని వేర్వేఱుగ సంబోధించినను, యవి యన్నియు ప్రోలయవేమారెడ్డినిగూర్చియే యనియెఱుంగ నగును.

## సంస్కృతహరివంశము

సంస్కృత హరివంశము మహాభారతమున నొక భాగమనియు, ఖిలమనియు ప్రశంసించుట గలదు.

హరివంశ స్తతః సర్వపురాణాం ఖిలసంజ్ఞితమ్
ఏతత్సర్వశతం పూర్ణం వ్యాసేనోక్తం మహాత్మనా.

(మహా-ఆది ౨ అధ్యా)

హరివంశమును మహాభారతమునకుఁ జేర్పనిచో దానికి లక్షశ్లోకపరిమితి రాకపోవుటయు, హరివంశగద్యముల 'ఖిలేషు హరివంశపర్వణి' యని యుండుటయు పై యూహలను బలపఱచుచున్నదని విమర్శకుల యభిప్రాయము. మహాభారతమున కురుపాండవ వంశములు వర్ణింపబడినరీతిని హరివంశమున వృష్ణి, అంధకవంశములు వర్ణింపఁబడినవి. హరివంశమును పురాణమని పండితపామరు లంగీకరించియున్నారు. ఇప్పటికిని నేపాళ దేశమున న్యాయస్థానములందు సాక్షులు హరివంశమును దమ దలపైనిడుకొని ప్రమాణముచేయుట గలదని వింటర్నిట్జిగారు వ్రాసియున్నారు.[1]

సంస్కృత హరివంశమున (బొంబాయిప్రతియందు) సుమారు పదునారువేల శ్లోకములును, హరివంశ విష్ణు భవిష్యపర్వములని మూడుపర్వములును గలవు. హరివంశమునకును మిగిలిన పురాణగ్రంథములకువలె భిన్నప్రతులు కనవచ్చుచున్నవి. హరివంశమున పండ్రెండువేల శ్లోకములు గలవని మహాభారతమున గలదు.[2] మహాభారతహరివంశముల శ్లోకసంఖ్యనుగూర్చి వ్రాయుచు సి. వి. వైద్యగారు వ్రాతప్రతులయందు 12580 శ్లోకములు గలవని వ్రాసియున్నారు.[3] బొంబాయిప్రతియందలి శ్లోకసంఖ్య పదునారువేలకు మించుచున్నది.

ఆ ప్రతియందు ప్రథమపర్వమగు హరివంశపర్వము బ్రహ్మవాక్యవర్ణనముతో సమాప్తమునొంది ఏబదితొమ్మిదిఅధ్యాయముల గలిగియున్నది. విష్ణుపర్వము పూర్వార్ధ ఉత్తరార్థములతోఁగూడి ఉపాహరణముతో ముగిసి నూటముప్పదియొకటి యధ్యాయ

---

1. History of Indian Literature. Vol I. P. 452 (notes)
2. ఖిలేషు హరివంశశ్చ భవిష్యం చ ప్రకీర్తితమ్
   దశశ్లోక సహస్రాణి వింశచ్ఛ్లోకశతాని చ (పర్వసంగ్రహ-373)
3. Mahabharata— a criticism— by C. V. Vaidya.

ములతో నున్నది. మూడవదగు భవిష్యపర్వమున నూటముప్పదినాల్గు అధ్యాయములు గలవు. కలకత్తాప్రతులయందును, మన్మధనాధదత్తుగారిఆంగ్లానువాదమునందును మొదటి రెండుపర్వములలోకేపర్వముగ జేర్పబడి హరివంశ విష్ణుపర్వవిభాగము లేకఉన్నవి. అందు మొత్తమున నూటఎనుబదియేడుఅధ్యాయములు గలవు. భవిష్యపర్వమునన్ 48 అధ్యాయములు మాత్రమే యున్నవి.

హరివంశపర్వమున సృష్టిప్రకారము, మన్వంతరములు, సూర్యచంద్రవంశ వృత్తాంతములును, విష్ణుపర్వమున శ్రీకృష్ణుని చరిత్రమును వర్ణింపబడినవి. విష్ణుపర్వ పూర్వార్థమున పారిజాతాపహరణమువరకును, ఉత్తరార్థమున నుషాహరణాది వృత్తాంతములును వర్ణితములు. ఈపర్వమున శ్రీకృష్ణుని మహిమయు, బాల్యాదిక్రీడలును భాగవతదశమస్కంధమునందువలెనే వివరింపఁబడినవి.

భవిష్యపర్వమునందలి గాథలు యాంతరంగిక సంబంధము లేకయుండుటచేతను, హరివంశమునకు సంబంధింపనివిషయములు పెక్కులుండుటచేతను, పాశ్చాత్య విమర్శకులీభవిష్యపర్వమును దరువాత జేర్పబడినదానిగ దలంచుచున్నారు. ఇందు జనమేజయ వంశవర్ణనము, భూతోత్పత్తిప్రకారము, యజ్ఞాదికర్మలఫలము, మధుకైటభసంహారము, అవతారప్రశంస, శ్రీకృష్ణుని కైలాసయాత్ర, ఘంటాకర్ణవృత్తాంతము, పౌండ్రకవాసుదేవవధ, హంసడింభకోపాఖ్యానము మొదలగునవి కలవు. హరివంశపు ప్రతులనుఁ బరిశీలించిన నీపర్వమునఁ జాలమార్పులు కలిగినవని స్పష్టముగ నిర్ణయింపనగును. అందు కలకత్తాప్రతులలో నృసింహునితో దైత్యులయుద్ధము (44-46 అధ్యా) బలి యభిషేకానంతరము నాకలోకముపై దండెత్తుట దేవతలపరాజయము (49-65 అధ్యా) శ్రీకృష్ణుని కైలాసయాత్ర, ఘంటాకర్ణహంసడింభకోపాఖ్యానములు, త్రిపురవధయు (74,131,133, 134 అధ్యా) లేవు కొన్నియధ్యాయములు (17 మొదలు 19, 27 మొదలు 29) సంగ్రహముగ నున్నవి. మిగిలిన రెండుపర్వములందు నట్టిమార్పులు లేకుండుటయే గాక అధ్యాయములు, శ్లోకసంఖ్యయు గూడ సరిపోవుచున్నవి. కలకత్తా ప్రతుల శ్లోకసంఖ్య సుమారు 1300 మాత్రమే.

ఎఱ్ఱాప్రెగడ యాంధ్రీకరించిన హరివంశమున బొంబాయిప్రతులందువలె పర్వవిభాగములేక పూర్వోత్తరహరివంశములని విభజింపబడియుండును. నాచనసోమనయు దా నాంధ్రీకరించిన భాగము నుత్తరహరివంశమునియే పేర్కొనియున్నాడు. అందువలన

నాఁటి కాంధ్రదేశమున బ్రచారములోనున్న హరివంశపు ప్రతులు పర్వవిభాగములేక పూర్వోత్తరభాగముల మాత్రము కలిగియుండెనని మన మూహింపవచ్చును.

| సంస్కృతగ్రంథము. | ఎఱ్ఱాప్రెగడగ్రంథము. |
|---|---|
| (1) హరివంశపర్వము. | పూర్వభాగము ఆ 5-78 వఱకు. |
| (2) విష్ణుపర్వము-పూర్వభాగము. | ఉత్తర ఆ 4 చివరకు |
| (3) ,, ఉత్తరభాగము. | ,, పంచమాశ్వాసము (1-114 పద్య), సప్తమాశ్వాసము. |
| (4) భవిష్యపర్వము. | పంచమాశ్వాసము (115-250 ప) షష్ఠాశ్వాసము, అష్టమ నవమాశ్వాసములు. |

ఎఱ్ఱాప్రెగడ యాంధ్రీకరణము కొంచెమించుగ మూలానుసరణముగ నుండును. ఆతడు నన్నయతిక్కనలరీతిని కొన్నిఘట్టముల విపులీకరించియు, గొన్నిటిని తగ్గించియు, పురాణములందువలె నీతి, మతవిషయములను వదలక యాంధ్రీకరించెను. భవిష్య పర్వాంతమునగల శ్రీకృష్ణుని కైలాసయాత్ర మొదలగు కథాభాగము భవిష్యపర్వ గాథలకు సంబంధములేకపోవుటచే నయిదాఱు ఆశ్వాసముల జేర్పఁబడినవి. మూల గ్రంథములోని కొన్నిభాగము లేలొకో తెనిగింపఁబడలేదు. అందు ముఖ్యముగ పారి జాతహరణ వృత్తాంతమును పేర్కొనవచ్చును. ఇది పది పద్యములలో ముగింపఁబడినది. (ఆ 4. ప 212-222) నారదుడు కృష్ణునికి పారిజాత మొసంగుటయు, నతడు రుక్మిణికి దానినీయ సత్యభామ యాగ్రహించుటయు, మొదలగు కథాభాగములును, పుణ్యకవ్రత విధానమును పూర్తిగ విడువబడినవి.

సంస్కృతహరివంశ విష్ణుపర్వమున నరువదినాలుగవ యధ్యాయమున నరకాసుర వధానంతరము శ్రీకృష్ణుడు సత్యభామతో గరుడవాహనారూఢుడై త్రిదివంబునకు జని, యట పౌలోమవాసవులచే నభ్యర్చితుడై, యదితికి కుండలములనొసంగి, యామెచే దీవ నలనంది, నందనోద్యానమునఁ బారిజాతము గాంచి పెకలించి తార్క్ష్యునిమూపున నిడి ద్వారకకుఁ గొనిపోయినట్లు కలదు. ఈవృత్తాంతమును విని యింద్రుడతని ప్రశంసించెనట! ఇది పారిజాతహరణ గాథకును, యిందోపేంద్రుల యుద్ధవర్ణనమునకును విరుద్ధముగ నున్నది. (శ్లో 64-70). దీనివలన పారిజాతవృత్తాంతమంతయుఁ దరువాతఁ జేర్పబడినదా యను సంశయము కలుగకమానదు. రసోచితములగు ఘట్టములనాంధ్రీకరించిన సోముని గ్రంథమున గూడ పారిజాతహరణవృత్తాంతము గన్పడదు.

మఱియు విష్ణుపర్వోత్తరార్ధమునందలి షట్పురవధ, భానుమతీహరణము, ప్రభావతీప్రద్యుమ్నోపాఖ్యానము, భవిష్యపర్వమునందలి హంసడింభకోపాఖ్యానమును, యెఱ్ఱాప్రెగడగ్రంథమున లేవు. ఆంధ్రహరివంశమున గల యూర్వశీనరకాసురఘట్టము, సత్యభామయుద్ధము మొదలగునవి సంస్కృతగ్రంథమున (బొంబాయి కలకత్తా ప్రతుల గన్పడవు. యెఱ్ఱాప్రెగడకు లభించిన మూలమున పారిజాతహరణాదులు లోపించి యుండెనా? ఎఱ్ఱాప్రెగడగ్రంథమున నీభాగములు లేకుండుటచేతనే యిటీవల నేమాని భైరవకవి యీ యీ ఘట్టముల నాంధ్రీకరించి వానిని హరివంశోత్తరభాగమున నాలుగవ యాశ్వాసముచివర 5, 6, 7 ఆశ్వాసములుగఁ జేర్చి, యందలి అయిదవ యాశ్వాసమును యెనిమిదవదానిగా మార్చియున్నాడు. అందు కోటగిరి శ్రీనివాసభూపతి యెఱ్ఱనార్యుని గ్రంథమున 'పారిజాతహరణాదికథావళి లేకయున్నచో...... యెఱ్ఱనార్యుండు తెలిఁగింప డేలనొకో, తెలుఁగుఁ జేసినపిదపను దొలఁగెనొకో' యని వితర్కించి యీ కథలను దెలిగింపుమని ప్రోత్సహించినట్లు భైరవకవి వ్రాసెను.

ఈ సందర్భమున మనము నాచనసోముని గ్రంథమును గూడ విమర్శింప వలసియున్నది. సోము డెఱ్ఱాప్రెగడ కించుమించుగ సమకాలికుడు. అతని హరివంశమున భవిష్యపర్వములోని గాథలు కొన్ని మాత్రమే చేరియున్నను, అది కూడ నుత్తరహరివంశ మనియే పిలువబడుచున్నది. మూలగ్రంథమున గల పర్వవిభాగమందును లేదు. లభించినగ్రంథమున కృత్యాదిపద్యములును లేవు. ప్రథమాశ్వాసమున 'వైశంపాయనుండు జనమేజయున కిట్లనియె' నని ప్రారంభింపబడినది. దీనివలన సోముడు పూర్వభాగమును గూడ రచించెననియు నది నశించియుండుననియు గొందఱు ఊహించుచున్నారు. ఇందులకు దగిన యాధారములు మృగ్యములు. సోముని గ్రంథమున జరాసంధుడు మధురపైదండెత్తుట, రుక్మిణీపరిణయము, పారిజాత వృత్తాంతమును లేవు. రుక్మిణీసత్యభామలతో జూదము, హంసడింభకోపాఖ్యానము యెఱ్ఱాప్రెగడ హరివంశమున లేవు. ఆంధ్రదేశమందలి కొన్ని వ్రాతప్రతులయందు రుక్మిణిపరిణయాంతమువరకుగల భాగము పూర్వభాగమునగలదని కీ. శే. నడకుదుటి వీరరాజుపంతులుగారు వ్రాసియున్నారు. మఱియు నూర్వశీనరకాసురసంభాషణము యాంధ్ర పరిశోధక మండలివారి హరివంశపుప్రతియందును, బొబ్బిలి ప్రతులయందును గలదట.

శ్లో. జయ మాఘోషయామాస నరకో దానవోత్తమః
అమరావతీం తదా దైత్యః ప్రవిశ్య చ మహాసురః
ఊర్వశీం చ సమాహూయ వచనం చేదమ బ్రవీత్

భజ మామిహ వా మోరు నిర్జితశ్శక్ర ఆహవే
అహ మిన్ద్రో యమో రాజా వరుణో యాదవాం పతిః.
ఊర్వ. ఋషయో యదితే రాజన్ యత్న్యన్తి క్రతుభి స్సదా
తదా భజామి దైత్యేన్ద్ర నాత్రకార్యావిచారణా. 127 అధ్యా.

సోమన యెఱ్ఱాప్రెగడలు.

ఎఱ్ఱాప్రెగడ నన్నయతిక్కనల ననుకరించి పురాణములరీతిని మూలానుసరణ మొనర్చుచు హరివంశమును రచించియున్నాడు. నాచనసోముడన్నచో కొన్ని రసవత్తరము లగుఘట్టములమాత్రము గైకొని, ప్రబంధవర్ణనాదుల నిమిడ్చి శ్రీనాథాదులకు మార్గదర్శకు డయ్యెను. అతనిగ్రంథమున నరకాసురవధ, ఉషాపరిణయము మొదలగునవిమూలాతిరిక్తముగ విపులీకరింపబడినవి. ఇరువురు రచించిన హరివంశభాగముల నొకదానితో నొకటి పోల్చి సోముని కొందఱును, ఎఱ్ఱాప్రెగడను మఱికొందఱును మిన్నయని విమర్శక వ్యాసముల వ్రాసియున్నారు. ఈకవుల నీరీతిని విమర్శించుట సమంజసముగాదని తోచుచున్నది. వారివారి యాదర్శములు వేరు. ఎఱ్ఱాప్రెగడ భారతమున కనుబంధముగ హరివంశమును రచింపుచు బురాణములరీతిని మూలము నతిక్రమింపక, చక్కని తేటతెలుగు పదములతో తిక్కన భారతభాగము నాదర్శముగ గైకొనియున్నాడు. కథాంశములకే ప్రాముఖ్యము నొసంగి రసభావోచితములగు పదములచేతను, యౌచిత్యపోషణము వలనను తన కవిత్వమున కొక గాంభీర్యమును యున్నతస్థానమును సమకూర్చియున్నాడు. అందుననే మహాకవు లతని నన్నయతిక్కనలతో జేర్చి ప్రశంసించిరి. శ్రీనాథుడును 'పరిఢవింతు ప్రబంధపరమేశ్వరుని నేవ సూక్తివైచిత్రి నొక్కొక్కమాటు' అని యతనిం బొగడియుండుట మనకు విదితమే.

సోముడు ప్రబంధకవులలో నత్యుత్తమస్థానమును వహింప నర్హుడు. అతని గ్రంథరచన ప్రబంధకవులకు మార్గదర్శకమై వర్ణనములు, శబ్దాలంకార వైచిత్ర్యములు, ప్రౌఢకవిత్వపు పోకడలు, కవితాశైలిలో బిగువు, కాఠిన్యమును గలిగియుండును. ప్రబంధకవులలో మిన్నయని యంగీకరించుటతోం దృప్తినొందక యెఱ్ఱనార్యునికంటె నతని కున్నతస్థానము నొసంగ బ్రయత్నించుట కేవల మభిమానపూర్వకమని యెఱుంగ నగును. అట్టి యభిప్రాయము ననుసరించియే యెఱ్ఱాప్రెగడ భారతరచనము నష్టభాగ పురాణముకాని స్వతంత్రరచనముకాదను వింతవాదముకూడ బయలుదేరినది. ఆ భాగము నన్నయపద్ధతిని రచింపబడియుండుటయే యందులకు గారణము. భక్తిపార

వశ్యమున దన్మయత్వమునుజెంది పోతనరచించిన రుక్మిణీకల్యాణాది భాగవతభాగముల నెఱ్ఱాప్రెగడ హరివంశభాగములతో బోల్చుటయు సరియగు విమర్శనోపద్ధతి కాదు. పోతన కవిత్వము మూలగ్రంథముయొక్క ప్రాశస్త్యముచేతనేగాక భక్తిపారవశ్యతచే నెగిరి గంతులువైచుచున్నది.

నన్నయతిక్కనాదుల భారతభాగములరీతిని కవితాగాంభీర్యము, ఔచిత్యము, పదములకూర్పు, సహజములగు ప్రకృతివర్ణనములు, కథాంశముల ప్రాధాన్యమును గలిగి యెఱ్ఱాప్రెగడ కవిత్వము పండితజనాదరణీయమని వేఱుగఁ జెప్పనక్కరలేదు. తిక్కనవలెనే యెఱ్ఱనార్యుఁడును హరివంశమున దెనుగుపదముల విశేషముగ వాడి యున్నాఁడు. ప్రాచీనాంధ్రభాషాస్వరూపమును బాగుగ దెలియగోరువారు కవిత్రయ రచిత గ్రంథముల విమర్శకదృష్టితో బఠింపవలయుననుట యతిశయోక్తి కాదు. తన సమకాలికులవలన బ్రబంధపరమేశ్వరబిరుదమునంది, శ్రీనాథాదులచే సూక్తివైచిత్రికి గొనియాడబడిన శంభుదాసునిగూర్చి భిన్నాభిప్రాయములకు దావులేదని చెప్పవలసి యున్నది. పింగళి సూరనార్యుని యీక్రింది పద్యములు కవిత్రయాధిక్యమును వేనోళ్ళ జాటుచు నాంధ్రవాఙ్మయప్రపంచమునకు వారలసేవను విశదీకరించుచున్నవి.

చ. పలుకఁదలంప దవ్వులగు భారతరామకథార్థము ల్విభా
సిలఁగ నరంటిపం డొలిచి చేతికి నిచ్చినరీతి నాంధ్రవా
క్యలలితశక్తి నందఱకు సుప్రథితంబులు చేసినట్టి ధ
న్యుల నుతియింతు నన్నయబుధోత్తముఁ దిక్కన నెఱ్ఱ సత్కవిన్.

(కళాపూర్ణో)

ఉ. ఏయెడ నర్థగౌరవసమృద్ధియు శబ్దవిశుద్ధియుం దిరం
బై యనవద్యతం బఱగు నంధ్రవచస్థితి భారతంబు రా
మాయణమున్ వచించిన మహాత్ములనాత్మ దలంచెదం జగ
న్న్యాయుల నన్నపార్యునిని దిక్కసుధీమణి నెఱ్ఱ సత్కవిన్

(రాఘవ పాండ).

హరివంశాంధ్రీకరణము.

కవిత్రయమువారి భారతహరివంశముల యాంధ్రీకరణపద్ధతి యొకరీతిగనే యుం డును. అవసరమగుపట్టుల భారతీయధర్మములు, వేదాంతవిషయములు సులభముగ శ్రోత లకు బోధపడునట్లుగ గ్రంథరచనచేయబడినది. కథావేగము నరికట్టి వర్ణనాంశముల బెం

చుట వీరిపద్ధతి కాదు. రసోచితమగు శైలి, సంభాషణావైచిత్ర్యము, భావగాంభీర్యము, ఔచిత్యమును గలిగియుండుటచే భారతభాగవతహరివంశముల స్త్రీపురుషాదు లందఱు పఠించుచు నానందమును బొందుచున్నారు. ఎఱ్ఱాప్రెగడ కూడ మూలము నొక్కొక్కచో రసానుగుణ్యముగ పెంచియు, నొక్కచో సంకుచితమొనర్చియు, రసపోషణమొనర్చి యున్నాడు. మూలమునందలి పితృదేవతా ప్రభావమును, కలియుగధర్మములను గూడ నాంధ్రీకరించెను.

శ్లో. తతః స్వయంభూ ర్భగవాన్ సిసృక్షుర్వివిధాః ప్రజాః
అప ఏవ ససర్జాదౌ తాసు వీర్య మవాసృజత్ 1-27.
ఆపో నారా ఇతి ప్రోక్తా ఆపో వై నరసూనవః
అయనం తస్య తాః పూర్వం తేన నారాయణస్స్మృతః 1-28.
హిరణ్యవర్ణమభవత్ తదణ్డముదకేశయమ్
తత్ర జజ్ఞే స్వయం బ్రహ్మా స్వయంభూరితి నః శ్రుతమ్ 1-29.
హిరణ్యగర్భో భగవాన్ ఉషిత్వా పరివత్సరమ్
తదణ్డమకరో ద్ద్వైధ దివం భువ మథాపి చ 1-30.
తయోశ్శకలయో ర్మధ్య ఆకాశమసృజత్ ప్రభుః
అప్సు పారిప్లవాం పృథ్వీం దిశ శ్చ దశధా దధే 1-31.
తత్ర కాలం మనో వాచం కామం క్రోధ మథో రతిమ్
ససర్జ సృష్టిం తద్రూపాం స్రష్టుమిచ్ఛన్ ప్రజాపతీన్ 1-32.

ఈ శ్లోకములందలి భావమును ఎఱ్ఱనార్యు డీ సీసపద్యమున నెట్లిమిడ్చెనో చూడుడు.

సీ. అఖిల జగత్సృష్టి నాత్మ నపేక్షించి
యాత్మోద్భవుండు నారాయణుండు
జలముల సృజియించి సముచితంబగు
నిజవీర్యముం దిడుటయు విస్మయముగ
విమలహేమాకృతి నమరు మహాండమై
కరమొప్పెఁ దద్వారిగర్భమూర్తి
యై యుండి బహువత్సరాత్మకం బగు
కాలమేఁగిన నది యావియించుకొనుచుఁ

తే. బుట్టె నూజుఁడు క్రిందటి వ్రియ్యభునియు మీఁది
వ్రియ్యడివియును నడుమం బరంబుఁ జేసి
దిశలు కాలంబు మనసు బుద్ధియును వాక్క-
గామరోషరీత్యాది సర్గము నొనర్చె. హరివం. పూ. ౧-55

మఱియు సగరవంశవర్ణనమున (హరి. 14 అధ్యా.)

భగీరథునిగూర్చి కథాభాగమును

శ్లో. దిలీపస్యతు దాయాదో మహారాజా భగీరథః
యః స గంగాం సరిత్శ్రేష్ఠామవతారయత ప్రభుః -15.
కీర్తిమాన్ సమహాభాగః శక్రతుల్య పరాక్రమః
సముద్రమానయచ్చైనాం దుహితృత్వేన కల్పయత్ -16.

ఎఱ్ఱాప్రెగడ యెట్లు మనోహరముగా బెంచెనో దీనివలన తెలియగలదు.

వ. ఆదిలీప మహీపతికి భగీరథుండు జనియించి యేకరథంబునన వసుంధర యంతయు జయించి సార్వభౌమపదంబు నొంది

చ. (గిరిశజటాటవీ నియుతఖేలనలోల తరంగయై సురా
సురనరసేవనీయ జలశోభితయై యసమాన పావన
స్థిరమహిమాఢ్యయై) పరగు దేవ తరంగిణిఁ దెచ్చి యుర్విపైఁ
బరపి నిజప్రసూతయను ప్రస్తుతినందఁగఁ జేసె నెల్లెడన్.
పూర్వ. 2-71.

నన్నయతిక్కనల ననుసరించి యుండుటచే నెఱ్ఱాప్రెగడ కవిత్వము, మృదుమధురమై, భావగాంభీర్యము, ఔచిత్యపోషణము, రసోచితమగు శైలి, కూర్పు పొందికయును గలిగియున్నది. శృంగారవర్ణనములనౌచిత్యము పాటింపఁబడినది. ఈవిషయమున ప్రబంధకవులు పురాణకవులకు భిన్నముగ శృంగారాదివర్ణనములవిస్తరించి గతానుగతికమగు మార్గము నేర్పఱచుకొని తీవ్రమగు విమర్శనమునకు గురియైరి. ప్రబంధములయందలి ప్రకృతివర్ణనములు మొదలగునవి అతిశయోక్తులతోడను, యస్వాభావికమగు కల్పనలతోడను నిండిఉండును. నాచనసోముని గ్రంథమునగూడ ప్రబంధకవులకు మార్గదర్శకముగ వర్ణనాభాగములు విపులీకృతములైనవి. ఎఱ్ఱనార్యుడు రెండు పద్యముల దేల్చివైచిన యూర్వశీ నరకాసురుల సంభాషణ యందిరువదియేడు పద్యములుగ రచింపఁబడినది.

అందు శృంగార మతిభూమిం జేరెననుట నిర్వివాదాంశము. బొంబాయి ప్రతియందు నూటయిరువదియాఱు శ్లోకములుగల నరకాసురవధ నూటయేనుబది పద్యములైనది.
(ఉత్త.ఆ.7)

ఉషానిరుద్ధులకథయందు జిత్రరేఖ అనిరుద్ధునిఁ దోడ్కొనివచ్చిన సందర్భమున నెఱ్ఱాప్రెగడవారి ప్రేమరసమును వర్ణించినపద్య మెంతసరళమై యుత్తమ శృంగార వర్ణనమున కుదాహరణముగ నున్నదో చూడుడు.

సీ. కలలోన నొండొరులఁ గలసిన యప్పటి
యానందపూర్ణ ధన్యత్వములును
దెలిసి యొండొరులపైఁ బ్రేముడి దెరసిన
సంతాప బహుళ దశాంతరములు
నెమ్మి నొండొరులకు నెచ్చెలికతమున నబ్బిన
యసమ భాగ్యాతిశయము
గ్రియల నొండొరులకుఁ గీల్కొని యొదవిన
యౌవనోచిత కళావాప్తివిధముఁ

జెన్ను మిగుల నొండొరులకుఁ జెప్పికొనుచు
నద్భుతంబులు భయములు నాదరములుఁ
గౌతుకంబులుఁ బొరిపొరిగాఁగఁ బ్రియుఁడు
బ్రియయుఁ గ్రోలిరి నూతన ప్రేమరసము.
(7-204)

ఇటులనే రుక్మిణీకృష్ణుల సరససల్లాపములును వర్ణింపఁబడినవి.

మ. అనురాగంబులు ధన్యతం బొరయ నెయ్యంబుల్ ప్రియంబంద నె
మ్మనముల్ గోర్కులు చూఱలాడఁ దనియన్ మాధుర్య సౌందర్యతం
గని జృంభింపగ సోయగంబులు సముత్కర్షంబు వాటింప న
వ్వనజాక్షుండు విదర్భరాజసుతయున్ వర్తిల్లి రిచ్ఛాగతిన్.
(హరి. ఉత్త. 3.173)

శ్రీకృష్ణుడు చాణూరుని జంపినపుడు దేవకి మాతృప్రేమ మును గన్నవాడఁ దవ్వునఁ దాఱవైచిన... యనుపద్యమున సహజముగ వర్ణింపఁబడినది.

ఇట్టి రసనిష్యందములగు పట్టు లెన్నియేని యెఱ్ఱాప్రెగడ కవిత్వమునఁ జూపవచ్చును. ఇతని వర్ణనాచమత్కృతియు గ్రీష్మవర్షశరచ్చంద్ర వర్ణనముల గాంచిన స్పష్టమగును.

మ. హరి యంభోనిధిసొచ్చె శంభుఁడు తుషారాద్రీంద్రముం బ్రాఁకె వా
గ్వాయుఁ డుద్యన్మకరంద దుర్దినసమగ్రంబైన యుత్ఫుల్ల పం
కరుహంబున్ భజియించె దీని మునుగల్గం గాంచియే కాక యె
వ్వారి నింకేల సహించు గ్రీష్మమనఁగా వర్ధిల్లెఁ దాపోద్ధతుల్.

(పూర్వ. 6-134).

క. లలిత గగనరంగంబున నలయక క్రొమ్మెఱుఁగు గొండ్లియై యాడెడుచో
నలవడియె మొగులు దెరలును బొలుపగు వడగండ్లగములపుష్పాంజలులున్.

(పూర్వ. 6-109).

శరత్కాలవర్ణనము—

మ. తెలినవ్వు ల్వెలిదమ్మి నెమ్మొగములం దీపార నేపారు చూ
పులుదారై మదలోల భృంగరచన ల్పొల్పార వీచీ భుజా
వళి యాలింగనకేళి కుత్తలపడన్ వార్ధిం దగంగూడుచోఁ
గలఁకల్దేఱి తనర్చె నేఱులు శరత్కల్యాణ కల్యాకృతిన్.

(పూర్వ. 7-112).

కేవలము వర్ణనములందే గాక సంభాషణములందును కవి గనఁబఱచిన నేర్పు మనోహరముగ నుండును. ఆసంభాషణములు పాత్రోచితములై, యాంధ్రభాషాసౌష్ఠవమును వ్యక్తీకరించుచుండును.

ఉ. తెల్లని తమ్మిఱేకులకుఁ దియ్యువు నెచ్చెలులైన కన్నులం
జల్లని చూపుచూచి యిటు సంగతులై చనుదెంచినారు మీ
రెల్లను లోకముల్ శుభసమేతములే యనురాధముల్ ప్ర
వర్తిల్లనుగా సమస్త జగత్ పరిపీడ యొనర్పఁ గ్రమ్మఱన్.

(పూర్వ. 6-4).

క. అన్నా తాలుగఁడమీ నాకన్నది యిదె యాఁడుబిడ్డ గావుము దీని
న్నిన్నొకటి సేయఁగలదే కన్నియ యతిలోక పురుషకార సమగ్రున్.

(పూర్వ. 5-125.)

ఉ. కన్నియచేయి చేతఁగొని కౌతుకవేషమనోజ్ఞుఁడైన యా
వెన్నునిఁ జేరఁదెచ్చి యిది వీరభవ ద్భుజవీర్యశుల్కమై
మిన్నక కాదు నీదయి మేనమఱందలు నీకచేరె నీ
కన్నెఁ బరిగ్రహింపుమని కాంతిశరంబుఁ గరంబు జేర్చినన్.

(పూర్వ. 6-170).

క. పని చాలఁగలదు కమలానన క్రమ్మఱవత్తు నీవు నాసొమ్మని యా
వ్వనిత విడిపించుకొని తానును బలుఁడును నగుచు నతిమనోహర లీలన్.

(పూర్వ. 9-40).

శంభుదాసునికవితావిలాసములవివరింపనెన్నియుదాహరణములైనఁజూపవచ్చును. ఇతని కవిత్వరీతుల దరువాతి కవులును నాచనసోముఁడును యనుకరించి మెఱుగువెట్టుటకై ప్రయత్నించిరి. ఎఱ్ఱాప్రెగడ గ్రంథములందు హరివంశము ప్రధానమై యతనిబరిణతకవిత్వసంపదల కాలవాలమై వెలయుచున్నది. ఆంధ్రకవితాప్రపంచమున నన్నయతిక్కనలయనంతర మెఱ్ఱాప్రెగడయే యున్నతస్థానము వహింప నర్హుఁడని నిస్సందేహముగ జెప్పవచ్చును.

# శ్రీనాథ మహాకవి

బండారు తమ్మయ్య.

మ॥ స్మరసంహారక పాదపద్మయుగళీ ♦ సంసేవనోన్మత్తుఁడై
సరసప్రాకట సత్కవిత్వగరిమన్ ♦ సాటెందునున్ లేక సు
స్థిరమౌ కీర్తిని గాంచినట్టి కవితా ♦ శ్రీనాథు, శ్రీనాథు, మ
:ద్గురునాథున్ మదిలోన నెల్లపుడుఁ గొ ♦ ల్తున్ భక్తి విస్ఫూర్తిమై.

శా॥ బ్రాహ్మీదేవ్యవతారమూర్తి, గవితా ♦ భద్రాసనాధ్యాసి, శ్రీ
బ్రహ్మాండాది నుతేశ్వరార్చనసుధా ♦ పాథోధివీచీఘటా
జిహ్మేనూన విహారధీరకలహం ♦ సీభూతచేతస్కు, స
ద్బ్రహ్మజ్ఞుఁ భజియింతు నైషధమహా ♦ ధ్రగ్రంథసంధాయకున్.

శ్రీనాథుఁడు పదునేనవశతాబ్దియందు వెలసిన ప్రఖ్యాతాంధ్రకవిసార్వభౌముఁడు. "మణినావలయం వలయేనమణిః" అనునట్లు సుకవిమణియగు శ్రీనాథునిచే రెడ్డిసామ్రాజ్యవలయమును, దత్సామ్రాజ్యవలయముచే శ్రీనాథకవిమణియు నన్యోన్యము వన్నెకెక్కి విఖ్యాతిని గాంచిరి. అఖండశివపూజాధురంధరులగు రెడ్డిరాజుల యాస్థానముల నలంకరించి తనయసమానకవితామృతముచే వారికిని వారి యాశ్రితులకును నామెతలు పెట్టి తనతోపాటు వారినెల్ల స్థిరకీర్తులుగ నొనర్చి రెడ్డిసామ్రాజ్యవైభవమును జిరస్మరణీయముగ నొనర్చిన ధన్యమూర్తి యీకవిచక్రవర్తి. సుప్రసిద్ధుఁడగు నిట్టి సుకవిచంద్రుని చరిత్రము గూడ నిస్సంశయముగ మనకుఁ దెలియరాకుండుట శోచనీయము. దానిని గూర్చి వివాదగ్రస్తములగు విషయము లింకను వెలయుచుండుట విచారకరము.

ఈకవిసార్వభౌముని కవితావిహారమున కాంధ్రకర్నాట దేశములు రెండునుగూడ రంగస్థలములై యుండెను. "కర్నాటదేశ కటకపద్మ వనహేళి శ్రీనాథభట్టమౌళి" అని కాశీఖండమందుఁ జెప్పిన యొక పద్యమును, "తల్లీ! కన్నడరాజ్యలక్ష్మి! దయలేదా నేను శ్రీనాథుఁడన్" అని యొకానొక సందర్భమునఁ బలికిన మఱియొక చాటుపద్యమును నాధారముగఁ గొని యిట్టి ప్రఖ్యాతాంధ్రకవిని గర్నాటుఁడని వాదించు మహనీయులు కొందఱు గలరు. ఇది కేవల మవిచారమూలకమని వేఱ చెప్పనక్కఱలేదు. శ్రీనాథుఁడు నిరంతరము కీర్తికాంతాలోలుఁడు. ఇతనికి యశోభిలాషమపారము. యశోధనసంపాదనార్థ మతఁడు చైత్రయాత్ర లొనర్చుచుఁ బెక్క రాజాస్థానముల సందర్శించుచుండెడి

వాఁడు. కర్నాట సార్వభౌముఁడగు ప్రౌఢదేవరాయల యాస్థానమందలి డిండిమ భట్టారక కవిసార్వభౌమునిఁ దన పాండితీ శౌండీర్యమున నోడించి యచ్చటఁ గనకాభి షేకాదిసత్కారములఁ బడయుటకై కర్నాటదేశమునకు వెడలినప్పుడు రాజాశ్రయ సందర్శనాదులు లభింపక విసిగి వేసారి దినములు వెచ్చించు సందర్భములోఁ జెప్పిన "తల్లీ కన్నడరాజ్యలక్ష్మి" అను పూర్వోక్తపద్యముగాని, అటుతరువాత నచ్చటి రాజా స్థానమున మనోరథసిద్ధిని, స్వర్ణస్నానాది సత్కారములను బడసి స్వదేశమునకుఁ దిరిగి వచ్చిన కొలఁది కాలమునకు వ్రాసిన గ్రంథములోఁ దన యఖండ పాండిత్య ప్రభా వమునఁ గర్నాటాస్థానమునఁ గలిగించిన పండితహృదయరంజనమును సూచించుచుఁ బలికిన "కర్నాటదేశకటకపద్మవనహేళి" అను విశేషనామముగాని శ్రీనాథుడు పుట్టుక చేఁ గర్నాటదేశస్థుఁడనుటకు సాధకములు కానగునని బుద్ధిమంతు లెవరు నంగీకరింప జాలరు.

రాజమహేంద్రవరమున రెడ్డిసామ్రాజ్యమును బరిపాలించిన యళ్ళయవేమ వీర భద్రరెడ్లమంత్రియగు బెండపూడి యన్నమంత్రి కంకితమొసంగిన భీమఖండములో శ్రీనా థుఁడు "పాకనాటింటి వాఁడవు బాంధవుఁడవు" అని యన్నమాత్యుఁడు తన్ను సంబో ధించినట్లు వ్రాసియున్నాఁడు. ఆగ్రంథముననే తనతాత కమలనాభామాత్యుఁడు, 'వినమ త్కాకతిసార్వభౌముఁడు', 'వారిధితటీకాల్పట్టణాధీశ్వరుఁడు నని పేర్కొనినాఁడు', మఱియు నాప్రబంధమందే వేమవీరభద్రరెడ్ల వంశావతారవర్ణన మొనర్చుచుఁ దనయా శ్రయులగు నీరెడ్డిరాజులఁ బంటదేసటి మహాన్వయంబు పాకనాటి దేశంబున భద్రపీఠంబు నధివసించి సింహవిక్రమనగర, దువ్వూరు, గండవరాదిపట్టణంబులు నిజనివాసంబులుగాఁ దనరెనని ప్రశంసించినాఁడు. పైకారణములచే, ఆంధ్రదేశమందలి పాకనాఁడు శ్రీనాథుని జన్మదేశమనియు, నతనితాత పరిపాలించిన కాల్పట్టణ మందే సముద్రతీరమున నుండి యుండుననియుఁ దలంచుటకెట్టి సంశయము నుండరాదు.

పాకనాడు తొలుదొలుత పూంగినాడు, పూఁగినాడు, పోఁకనాడు, అని వ్యవ హరింపఁబడుచు రానురాను పాకనాడుగా మాఱినట్లు తెలియుచున్నది. పూర్వకాలమున నిది యిరువదియొక్క వేయి గ్రామములను గలిగిన విశాలవిషయముగా నన్నెచోడుని కుమారసంభవమునుబట్టియు, మంచనకేయూరబాహుచరిత్రమును బట్టియుఁ గాననగును. ప్రోలయ వేమారెడ్డినాఁటి శాసనమొకదానిలో పూంగినాటి విస్తీర్ణమిట్లు వర్ణింపఁబడినది. "ఆస్తే శ్రీగిరి పూర్వపాద నికటా దాపూర్వపాథోనిధే ర్దేశః కుండితరంగిణీ ముభయతః శ్రీపూంగి నామాంకితమ్" అనగా గుండ్లకమ్మనది కిరువంకలను శ్రీశైలము తూర్పుభాగ

మునుండి తూర్పుసముద్రము వఱకు వ్యాపించిన దేశము పాకనాడని తెలియు చున్నది. దీనినిబట్టి కొందఱు విజ్ఞులిప్పటి కర్నూలు మండలములోఁ గొంతవఱకుఁ గలిసి నెల్లూరుజిల్లాలోని కందుకూరునకును గుంటూరుజిల్లాలోని కొండవీటికిని మధ్య నున్న ప్రదేశము పాకనాటిసీమగా నిర్ణయించియున్నారు. కమలనాభామాత్యుని కాల్వపట్టణము నెల్లూరు, గుంటూరు జిల్లాలలో సముద్రతీరమున నెచ్చటనో యుండి యుండును. కాని యట్టి పట్టణమేదియు నిప్పుడు కానరాదు. ఇది నెల్లూరుజిల్లాలోని కృష్ణపట్టణ, కొత్తపట్టణములలో నొకటియైయుండునని కొందఱు, కృష్ణామండలమందలి కలుపటమని కొందఱు, నరసాపురమునకు బందరునకు మధ్య సముద్రతీరముననున్న కాళీపట్టణమని కొందఱు తమ యభిప్రాయములను బ్రకటించిరి. కాని యందొకటియు సత్యసమ్మతమని నిర్ణయింపరాకున్నది. ఈ చెప్పినవన్నియుఁ జాలవఱకు రెండువందల సంవత్సరములకు లోపున నూత్నముగ బయలుదేఱిన గ్రామములేగాని పదునాల్గవ శతాబ్దినుండియు వెలసియున్న ప్రాచీనపట్టణములు గాఁ గానరావు. అందునను నెల్లూరు జిల్లాలోని కొత్తపట్టణము క్రొత్తక్రొత్తఁగ నేఁబదియేండ్లలోపున వెలసినదనికూడఁ దెలియుచున్నది. కలుపటముమాత్రము కలుపట్టణమను పేరితోఁ దొమ్మిదవ శతాబ్దికిఁ బూర్వమునుండియు వెలసినటు లొకశాసనమువలనఁ దెలియుచున్నది. కాని కలుపట, కాళీపట్టణములున్న కృష్ణామండలము పాకనాటిసీమలోని భాగముగాఁ బరిగణింపఁదగిన యవకాశములే కానరావు. శైథిల్యములవలనఁ బ్రాచీనప్రాభవమును సూచించుచు ఒంగోలుతాలూకాలో సముద్రసమీపముననున్న కాల్‌స్థానకోటయను గ్రామమే యీ కాల్వపట్టణమై యుండునని యొకరు వ్రాసినారు. "పాకనాటింటివాఁడవు" అనగాఁ బ్రథమస్థలమగు బాకనాడు విడిచి మఱియొకదేశమునకు వలసవచ్చినవాఁడని యర్థ మనియు, శ్రీనాథునితాతయో యాతని పూర్వులో మొదటఁ బాకనాటివారైనను దరు వాతఁ గృష్ణామండలమునకుఁ గాఁపురము వచ్చియుందురనియు, ఆ మండలమందలి కలుపట, కాళీపట్టణములలో నేదియో యొకటి శ్రీనాథుని జన్మస్థానమై యుండుననియు, "నికటముననుండి శ్రుతిపుటనిష్ఠురముగ । నడరికాకులు బిట్టు పెద్దఱచినప్పు । డుదధి రాయంచ యూరకయుంట లెస్స । సైపరాకున్న నెందేని చనుట యొప్పు" అను భీమఖండపద్యమందలి "ఉదధిరాయంచ" యను విశేషణమువలనఁగూడ నిది ధ్వనించు ననియు, నామిత్రులు శ్రీ చేకుమళ్ళ కామేశ్వరరావుగారు అభిప్రాయపడుచున్నారు. (కాని యిచ్చట "ఉడిగిరాయంచ" యను పాఠముకూడ నున్నది). కృష్ణామండలమున విన్నకోటగ్రామమునఁ గాఁపురముండి యచ్చటి స్వామికిఁ దన భల్లాళచరిత్ర మంకిత

మొసంగిన వాలేశ్వరుఁడుగూడ తాను పాకనాటింటివాఁడనని వ్రాసికొనెనని వీరు తమ యభిప్రాయమున కుపపత్తిగాఁ దలంచుచున్నారు. శ్రీనాథుని మఱఁది దగ్గుబల్లి దుగ్గన యింటిపేరగు దగ్గుబల్లి కలుపట, కాళీపట్టణములకు సమీపమున నుండుట పైవాదమునకుఁ గొంత సాధకముగా నున్నది. శ్రీనాథుఁడు తన ముప్పాగడవని కడపటిదినములలోఁ గృష్ణాతీరమున బొడ్డుపల్లెను గుత్తకొనుటయుఁగూడ నిందుకు సహాయక మగును.

కావున శ్రీనాథుని పూర్వులసలు పాకనాటివారైనను, అతఁడో యతనితాతయో తరువాతఁ గృష్ణామండలమునకుఁ గాఁపురమువచ్చిరని తలంచుట చాలవఱకు సంగత ముగఁ గానవచ్చుచున్నది. కమలనాభుని కాల్పట్టణము, కలుపటము, కాళీపట్టణము, కాల్ స్థాన్ కోట, యను మూఁడింటిలో నేదియో యొకటి కావచ్చును. లేదా యది కాల వశమునఁ గడలిగర్భమున నడఁగియుండవచ్చును. ఏదియెట్లున్నను శ్రీనాథుని తాత కమలనాభుఁడు కాకతీయచక్రవర్తి యగు రెండవ ప్రతాపరుద్రుని కాలమున నిప్పుడు నెల్లూరు, గుంటూరు, కృష్ణామండలములలోని సముద్రతీరప్రాంతమును బరిపాలించు చుండిన యొక దండనాథుఁడో, దేశపాండ్యవంటి యధికారమందిన యమాత్య చూడా మణియో యైయుండవచ్చునని నిస్సంశయముగా నెంచవచ్చును. భీమఖండ కృతిపతి యగు బెండపూఁడియన్నామాత్యుని తాత యన్నమంత్రి కాకతిప్రతాపరుద్రుని మంత్రి యగు కలను ప్రతాపరుద్రునివలన, అరిపిగ్రామము నగ్రహారముగ గ్రహించినట్లు గ్రంథావతారికవలనఁ దెలియనగును. కావున నాతని సమకాలీనుఁడగు శ్రీనాథుని తాత కూడ రెండవప్రతాపరుద్రుని రాజ్యావసానకాలమగు క్రీ॥ శ॥ 1323 ప్రాంతమునఁ బ్రసిద్ధుఁడై యుండునని తలంపవచ్చును. అప్పటికి శ్రీనాథునితండ్రి మారయ బాలుఁడై యుండు ననియు నాతనికి నలువది సంవత్సరముల వయస్సుమీఱినపిదపనే శ్రీనాథుఁడు జన్మించి యుండుననియుఁ దలంచినచో శ్రీనాథుని జన్మకాలము క్రీ॥ శ॥ 1365—1370 కంటెఁ దరువాతికి వచ్చుట కవకాశములు లేవు. పలువు రిట్లే తలంచుచున్నారు. శ్రీ వేటూరి ప్రభా కరశాస్త్రిగారు పైనిజెప్పిన శ్రీనాథునితాతతండ్రులకాలవములనుగూర్చి యేమియుఁ బ్రశం సింపకయే, కాశీఖండావతారికయందలి

సీ॥ చిన్నారి పొన్నారి ♦ చిఱుతకూఁకటినాఁడు ♦ రచియించితి మరుత్తరాట్చరిత్ర ।
నూనూగు మీసాల ♦ నూత్నయౌవనమున ♦ శాలివాహనసప్త ♦ శతి నొడివితి ।
సంతరించితి నిండు ♦ జవ్వనంబునయందు ♦ హర్షనైషధకావ్య ♦ మాంధ్రభాష ।
ప్రౌఢనిర్భరవయః ♦ పరిపాకమునఁ గొని ♦ యాడితి భీమనా ♦ యకుని మహిమ
గీ॥ ప్రాయమింతకు మిగులఁ ♦ గైవ్రాలకుండఁ ♦ గాశికాఖండ మను మహా ♦ గ్రంథమేను ।
దెనుఁగు గావింతుఁ గర్ణాట ♦ దేశకటక ♦ పద్మవనహేళి శ్రీనాథ ♦ భట్టసుకవి॥

యను పద్యమునుబట్టి యందుఁ జేర్కొనఁబడిన వయోవిభాగములను దమయిచ్చవచ్చిన రీతిని నిర్ణయించి దానినిబట్టి శ్రీనాథునిజన్మకాలము క్రీ॥ శ॥ 1385 కంటె వెనుకకుఁ బోవీలులేదని తమశృంగారశ్రీనాథములో వ్రాసినారు. కాని దానినంగీకరించుట కనేక బాధకములున్నవని నాయభిప్రాయము. కొన్ని శాసనములవలన క్రీ॥ శ॥ 1404 నాఁటికి శ్రీనాథుఁడు పెదకోమటి వేమారెడ్డి యాస్థానమున విద్యాధికారిపదవి నలంకరించినట్లు కానవచ్చుచున్నదని శ్రీ శాస్త్రిగారే వ్రాసినారు. అనఁగా మయినారిటి వదలియు వదలని 18 లేక 19 యేండ్ల చిఱుతప్రాయమునాఁటికే యాతఁడట్టి ప్రౌఢపదవి నందెనని చెప్పవలసియుండును. శ్రీనాథుఁడెంత సహజప్రతిభాశాలి యైనను నిది కేవల మసంగతము లోకవ్యవహారవిరుద్ధము నని వేఱచెప్పనవసరములేదు. శ్రీనాథుఁడు తనతాత కమలనాభామాత్యునియొద్దనే విద్యాభ్యాసాదిక మొనర్చియుండవచ్చు నని కూడ వీరూహించిరి. ప్రతాపరుద్రుని జీవితకాలములో నాతనివలన సమ్మానమందిన కమలనాభామాత్యుఁడా సార్వభౌమునిరాజ్యావసానకాలమగు క్రీ.శ. 1323 నాఁటికయిన నలుబదియేండ్లవయస్సు కలిగియుండునని తలంచుట సర్వవిధముల సంగతముకాకపోదు. అట్లయినచో 1385 నాఁటి కతఁడు నూటేండ్లు నిండినవాఁడగును. అట్టివానియొద్ద శ్రీనాథుఁడెట్లు విద్యాభ్యాస మొనర్చియుండును? శాస్త్రిగారిపై యభిప్రాయము పరస్పరవైరుధ్యములకుఁ బ్రబలావకాశ మొసంగుచున్నది.

కావున బహువిధములఁ బర్యాలోచింప శ్రీనాథునిజన్మకాలము క్రీ॥ శ॥ 1365, 1370 ప్రాంతమనినిర్ణయించుటయేచాలసంగతముగానుండును. కాశీఖండమందలి "శ్రీనాథభట్టమౌళి" అనుప్రయోగమునుబట్టియు, శాసనములందలి "శ్రీనాథభట్టారకః" అను విశేషణమును జూచియుఁ గొందఱతఁడు వైదికుఁడేల కాఁగూడదని తలంచిరి. పదునాల్గవశతాబ్దికిఁ జాలఁబూర్వమే బ్రాహ్మణులలో వృత్తినిబట్టి వైదికనియోగభేదము లేర్పడినటులనేక ప్రమాణములున్నవి. శ్రీనాథుఁడు తనతాతకుఁ దండ్రికిఁ గూడ "అమాత్య" శబ్దమును జేర్చినాఁడు. బెండపూడి యన్నమంత్రి యాతనిని బాంధవుఁడ వనెను. దగ్గుబల్లిదుగ్గనామాత్యుఁడు శ్రీనాథునకుఁ దాను మఱఁదిననెను. ఇత్యాది బలవత్ప్రమాణములు శ్రీనాథుఁడు నియోగిశాఖాజనితుఁ డని రాద్ధాంతమొనర్చుచుండ నతఁడు వైదికుఁడనియెంచుట కెట్టి యవకాశములును లేవు. భట్ట, భట్టారక శబ్దములు పాండితీ సూచకములగు పూజ్యవాచకములు. తత్సూచకముగనే శ్రీనాథుఁడు గ్వాచిత్కముగ వానినుపయోగించికొనెను. శ్రీనాథుఁడు సరసకవితాశ్రీనాథుఁడే కాక సకల విద్యాసనా

ఘుఁడని కూడ నాతని గ్రంథములవలన వ్యక్తమగును. కృతిపతు లీతని యెడ నుపయోగించిన “బ్రాహ్మీదత్తవరప్రసాదుఁడవు” “ఉరుప్రజ్ఞావిశేషోదయోజ్జిహ్మస్వాంతుఁడవు” “బ్రహ్మాండాది మహాపురాణచయతాత్పర్యార్థనిర్ధారితబ్రహ్మజ్ఞానకళానిధానమవు” “ఆగమజ్ఞాననిధివి”, “తత్త్వార్థఖనివి” “బహుపురాణజ్ఞుఁడవు” అను విశేషణములు, “అధ్వర్యువేదశాఖాధీతినిష్ణాతుఁడ” నని యాతఁడు చెప్పికొనిన వాక్యము నీవిషయమును బ్రస్ఫుటమొనర్చును. ఈతని శిష్యుఁడు మఱఁదియు నగు దగ్గుబల్లి దుగ్గనామాత్యుఁడు తన నాసికేతోపాఖ్యానమున వ్రాసిన యీక్రిందిపద్యముకూడ నిందులకు సాక్ష్యమిచ్చును.

సీ॥ సంస్కృతప్రాకృత ♦ శౌరసేనీముఖ్య । భాషాపరిజ్ఞాన ♦ పాటవంబు
పన్నగపతిసార్వ ♦ భౌమభాషితమహా । భాష్యవిద్యాసమ ♦ భ్యాసబలము
అక్షపాదకణాద ♦ పక్షిలోదీరిత । న్యాయకళాకౌశ ♦ లాతిశయము
శ్రుతిపురాణాగమ ♦ స్మృతిసాంఖ్యసిద్ధాంత । కబళనవ్యుత్పత్తి ♦ గౌరవంబు
గీ॥ పూర్వకవిముఖ్య విరచితా ♦ పూర్వకావ్య । భావరససుధా చర్వణ ♦ ప్రౌఢతయును
గందళింపంగఁ గాశికా ♦ ఖండనైష । ధప్రముఖవివిధప్రబం ♦ ధము లొనర్చె॥

“చిన్నారిపొన్నారి” యను కాశీఖండపద్య మీతఁడు లేఁబ్రాయమునుండియే కవితాశక్తిని గల్గియుండెనని ప్రకటించును. ఇట్టి యఖండపాండితీసంపద నీతఁ డెంతకాలములో నార్జించెనో యేయే గురువులయొద్ద విద్యాభ్యాసమొనర్చెనో తెలియఁదగు సాధనము లీతని గ్రంథములందుఁ గానరావు. విద్యాగురువుల నెవరి నీతఁడు పేర్కొనలేదు. సహజప్రతిభాశాలులకు స్వల్పసంస్కారమాత్రముననే “ప్రపేదిరే ప్రాక్తన జన్మవిద్యా” యనునట్టు లఖిలవిద్యలు కొలఁదికాలముననే యధీనములు కాఁగలవు. కావున గురుకులవాసశ్రమ మత్యంత మక్కఱలేకయే సకలకళల నీతఁడు స్వల్పకాలముననే యార్జింపఁగల్గెనని తలంపనగును. సామాన్యులకైనచో నిందులకేండ్లును బూండ్లును బట్టునని వేఱ చెప్పనక్కఱలేదు. “కవితావిద్యాధరుఁడు; కవిపితామహుఁడు; సరససాహిత్యసామ్రాజ్యచక్రవర్తి” పద్మపురాణసంగ్రహ కళాకావ్యప్రబంధాధిపుఁడు “కలితకావ్యకళాలాభుఁడు” నగు తన తాత కమలనాభునియొద్దనే బాల్యమునఁ గొంతవఱ కీతఁడు విద్యాసంస్కారము నొందియుండును. తరువాత “విద్యారాజీవభవుఁ”డగు తండ్రి మారయామాత్యుఁడు గూడ నీతనిని విద్యావినీతునిగ నొనర్చియుండును. “పుణ్యాచార”యగు తల్లి భీమాంబికాదేవి సుశిక్షణముగూడఁ బవిత్రశీల మలవడఁజేసి “అనఘు” “పరమపుణ్యు” “పాత్రు” “కులపవిత్రు” న్నగు విశేషణములతోఁ దన్ను వర్ణించుకొనఁదగినంత గుణవంతునిగ దిద్దియుండును. మఱియు “బ్రాహ్మీదత్త వరప్రసాదుఁడ”వను విశేషణము

శ్రీహర్షునివలె నీతఁడుగూడఁ జింతామణీమంత్రసిద్ధిని గలిగియుండెనని సూచించును. ఏనుగు లక్ష్మణకవి రచియించిన యీక్రింది స్తుతికూడ నిందుకు సాధనము. "మహితచింతామణీ దివ్యమంత్రసిద్ధు నైషధాది ప్రబంధసందర్భనిపుణు, సకలవిద్యావిశారదు, సత్కవిత్వ పట్టభద్రుని శ్రీనాథుఁ బ్రస్తుతింతు". పై కారణములలో దేనివలననయిననేమి శ్రీనాథుఁడు చిరుకాలముననే పెక్కు విద్యలను సాధించి చిఱుతప్రాయమునాఁటికే చక్కని కవితాశక్తిని గలిగియుండెనని నిర్ణయింపనగును.

ఇట్టిప్రతిభాశాలులు సహజముగ నొకమూలఁ గూర్చుండి కాలక్షేపమొనర్చుచు నాత్మసంతుష్టి నందఁజాలరు. వారికి యశోభిలాషము మిక్కుటముగానుండును, మహాదాశ్రయమునఁ గాని వారి విద్యలు వన్నెకెక్కనేరవు. మఱియు శ్రీనాథుని తాత కమలనాభుఁ డెంతయార్జించినను నాతఁడు "ప్రదాత" యగుటచే నాయముకంటె వ్యయమే యెక్కువయై శ్రీనాథునికాలమునాఁటికివారికుటుంబమార్థికముగ సామాన్యస్థితియందేయుండి యుండును. కావున స్వార్థము, తీర్థముగూడ నొనగూడుటకై యాతఁడు మొదటినుండియు నున్నతపదస్థుల యాశ్రయసాహచర్యముల నాశించుచుండెను. కమలనాభుఁడు, మారయ, శ్రీనాథుఁడు అనునామములు విష్ణుదేవతాపరములయినను వీరి కుటుంబము శైవమతాభినివిష్టమే యయియుండెనని తలంచుట కనేకావకాశములు గానవచ్చుచున్నవి. మఱియు నాకాలమున "రాజానుమతో ధర్మః" యనునట్లు రాజాశ్రయము నభిలషించుమంత్రులు మున్నగువారు తమతమ రాజుల మతములనే తాముగూడ స్వీకరించుచుండిరి. కాకతీయులు మొదట జైనమతస్థులయినను రానురాను పాశుపతమునో, వీరశైవమునో స్వీకరించిరట్లు పలుకాధారములున్నవి. వారియొద్ద సామంతులుగానుండి తరువాత స్వతంత్రరాజ్యములను స్థాపించిన ప్రోలయవేముఁడు మున్నగు రెడ్డిరాజులు గూడఁ గాకతీయులవలెనే శైవమతావలంబన మొనర్చిరి. వారినిబట్టి వారి మంత్రులు, కవీశ్వరులు గూడ నామతమునందే యభినివేశము గలిగియుండిరి. కావుననే శ్రీనాథుఁడు నిండుజవ్వనము నాఁటికే "ఈశ్వరార్చనకళాశీలుండ" వని ప్రశంసింపఁదగినంత శైవమతాచారసంపత్తిని గలిగియుండెను. "భక్తియుతి, లింగపతి" "తస్మైదేయంతస్మాద్గ్రాహ్యం" మున్నగు శైవమతరహస్యముల నాతఁడు మొదటినుండియు గ్రహించి స్వార్థతీర్థములు చరితార్థములగుటకై పాకనాటిసీమలో భూపాలన మొనర్చు స్వమతస్థులగు రెడ్డిరాజుల రాజధానులు కొండవీడు, దువ్వూరు, నెల్లూరు మున్నగు పట్టణములకుఁ జిన్నప్పటినుండియుఁ జనుదెంచుచు, వారియాశ్రయాదికములకయి ప్రయత్న మొనరించుచుండెను. పరమధార్మికుఁడు, షట్కాలశివపూజారతుండు నగు అనవేమారెడ్డిని సందర్శించి "అనవేమమహీ

పాల! స్వస్త్యస్తు తవబాహవే | ఆహవే రిపుదోర్దండ | చంద్రమండల రాహవే'' అను శ్లోకమును జెప్పి సన్మానమందిన యాఱువేల నియోగికవి శ్రీనాథుఁడే యని కొందఱ యభిప్రాయము. వినుకొండనివాసియు, నెఱదాతయు నగు రాయనభాస్కరుఁడు, అన వేమారెడ్డివలన న్యగ్రహారాదిసమ్మానమందినట్లు తద్వంశ్యుఁడగు చింతగుంట కోదండ రామకవి తన సునందాపరిణయములో వర్ణించినాఁడు. అనవేమారెడ్డి యన్నయల్లుఁడగు కాటయవేమారెడ్డియొద్ద నీ రాయన భాస్కరుఁడు మంత్రిగా నుండినట్లు "కలయఁబసిండి గంటమునఁ గాటయవేమసమక్షమందు న | త్పలముగ రాయని ప్రభుని బాచఁడు ♦ వ్రాసిన వ్రాలమ్రోఁతలున్ | గలుగలుగల్లుగల్లురన ♦ గంటకసంత్రుల గుండెలన్నియున్ | జలుజలుజల్లుజల్లురను♦ సత్కవివర్యులు మేలుమేలనన్ ''అనుపద్యము వలనఁ గాననగును. ఈపద్యము శ్రీనాథ రచితమేయని కూడఁ గొందఱు తలంతురు. దీనినిబట్టి యనవేమారెడ్డికాలమునఁ గాటయవేముఁడు వినుకొండసీమకుఁ బరిపాలకుఁడుగా నియుక్తుఁడయ్యెనని యూహింపఁదగును. శ్రీనాథుని యవసానకాల చాటువునందలి "భాస్కరుఁడు మున్నె దేవునిపాలికరిగె'' అనుపద్యపాదమునుబట్టి శ్రీనాథుఁడు తనచిన్నతనములో అనవేమకాటయవేమరెడ్లకాలమున రాయనిభాస్కరునియాశ్రయమునుగూడఁ గలిగియుండెనని తలంపవచ్చును. రెడ్డిరాజులలోఁ గాటయవేముఁడు స్వయముగ గొప్ప విద్వాంసుఁడు. కాళిదాసనాటకత్రయమున కాతఁడు వ్యాఖ్యలొనర్చెను. శ్రీనాథుఁడీతనిని గూడ దర్శించి సమ్మానమందియుండవచ్చును. పాకనాటిసీమలో రెడ్డిసామ్రాజ్యము విస్తరిల్లుచున్నప్పుడు వీరమాహేశ్వరవ్రతుఁడైన కంచి చిఱుతొండ నంబివంశమునకుఁ జెందిన వైశ్యకుటుంబమొకటి వాణిజ్యాభివృద్ధికై కంచినుండి యరుదెంచి సింహవిక్రమపురమనఁబడు నెల్లూరునందుఁగూడఁ దాత్కాలిక నివాసమేర్పఱచుకొని వాణిజ్యము నెఱపుచుండెను. ఆవంశస్థులలో అవచి దేవయసెట్టియు, నాతని కుమారుఁడు తిప్పయసెట్టియుఁ బ్రోలయవేమ, అనపోతవేమ, అనవేమ, కుమారగిరి రెడ్లకాలమున వారిరాజధానులగు అద్దంకి కొండవీడుపురముల కరుదెంచి వర్తకవ్యాపారములు గొనసాగించుచు వసంతోత్సవసమయములందు వారి సుగంధభాండాగారాధ్యక్షులుగ వర్తిల్లుచుండిరి. అట్టి సమయములందు శ్రీనాథుఁడు శివభక్తుఁడగు తిప్పయసెట్టితోఁ గూడ సఖ్యమొనర్చి యాతని సత్కారములఁగూడఁ బడయుచుండెడివాఁడు. ఇట్లు బాల్యమునుండియు, శైవమత ప్రవిష్టులగు రాజులు, మంత్రులు దండనాథులు వ్యాపారులు మున్నగువారితో మెలంగుచు శ్రీనాథుఁడు శివభక్తిప్రబోధకములగు గ్రంథముల రచించుటయందాసక్తిఁ గలిగి యుండెను.

చిన్నారిపొన్నారి చిఱుతప్రాయమునుండియు నతఁడు గ్రంథరచనమునకుఁగడంగి యనేకగ్రంథముల రచించెను. అవియన్నియు లోకమునకింకను లభింపలేదు. కొన్నిటికిఁ బేరులుగూడఁ దెలియరావు. ఉపలబ్ధములై శ్రీనాథునివని నిస్సంశయముగ గ్రహింపఁ బడిన గ్రంథములు (1) శృంగారనైషధము, (2) హరవిలాసము, (3) భీమేశ్వరపురాణము, (4) కాశీఖండము, (5) శివరాత్రిమాహాత్మ్యము. పైగ్రంథములలో నీతనిచే నుదాహృతములై యింతవఱకు దొరకనికృతులు (1) మరుత్తరాట్చరిత్రము (2) శాలివాహనసప్తశతి (3) పండితారాధ్యచరిత్రము. ధనంజయవిజయమను కృతిఁగూడ నీతఁడు రచించినట్లు దంతులూరి బాపిరాజు తనమూర్తిత్రయోపాఖ్యానమున నుదాహరించెను. ఇవికాక (1) పల్నాటివీరచరిత్రము (2) కాటమరాజుకథ మున్నగు ద్విపద కావ్యములను మఱికొన్ని గేయకృతులను వీథినాటకమునుగూడ నీతఁడు రచించెనని వ్యవహారముగలదు. ఇందు మొదటిరెంటిని బూర్తిగలభింపలేదు. కొంతవఱకుఁ బ్రాచ్యలిఖిత గ్రంథాలయమున వ్రాఁతప్రతులున్నట్లు తెలియుచున్నది. వీరచరిత్రమందలి బాలచంద్రుని యుద్ధకథమాత్రము శ్రీ అక్కిరాజు ఉమాకాంతము పంతులుగారు ప్రకటించియున్నారు. శ్రీనాథునిగ్రంథముల వివరములఁగూర్చియు వాని పౌర్వాపర్యములఁ గూర్చియునిఁకఁ జర్చించెదను.

(1) మరుత్తరాట్చరిత్ర:— "చిన్నారి పొన్నారి చిఱుతకూఁకటినాఁడు" దీనిని రచించితినని శ్రీనాథుఁడు కాశీఖండావతారికయందు నుదాహరించెను. కావున నిది యాతని ప్రథమకృతియని స్థూలదృష్టిని దలంపవచ్చును. క్రీ॥ శ॥ 1380, 1385 ప్రాంతమున అనవేమారెడ్డి కాలమున నిది రచింపఁబడియుండవచ్చును. ఈగ్రంథ మింతవఱకు లభింపలేదు. మరుత్తుఁడు జగతీచక్రము నేకచ్ఛత్రముగఁ బరిపాలించి యఖండ యశ మార్జించిన చక్రవర్తి.

"ఈతనిచరిత్రము స్వల్పభేదములతో నైతరేయబ్రాహ్మణమునను భారతాశ్వమేధపర్వమునను,మార్కండేయపురాణమునను హరివంశమునను వర్ణితమైనది. వత్సంధ్రభూపాలునిసంతతియందుఁ గరంధముఁడనునామాంతరముగల బలాశ్వుండు జనించెను. వీర్యచంద్రుఁడను రాజు పుత్రిక వీరమహాదేవియం దతనికి అవీక్షితుండను కుమారుఁ డుదయించెను. భామినియను గంధర్వకన్యక యగస్త్యశాపవశమున విశాలరాజపుత్త్రియై జన్మించెను. ఆవైశాలినీస్వయంవరమున అవీక్షితుఁడవక్రపరాక్రమమున ననేక నృపాలురను నిర్జించి యామెను గ్రహించుటకై సంరంభమొనరింప నధర్మయుద్ధమున నాభూపాలురు బల్మిని నాతని బంధించిరి. ఈవార్త విని శత్రురాజులతో నిగ్రహించి కరంధముఁడు పుత్రుని బంధముక్తునిఁ గావించెను. స్వపరాక్రమమునఁ గాక శత్రులనుండి జనకునివలన విడుదల నొందుట కెంతయు లజ్జించి యవీక్షితుఁడు తండ్రి యెంత వలదనినను వినక వైశాలినిని గాని మఱి యెవ్వతెను గాని వివాహమాడక శాశ్వతబ్రహ్మచర్య మవలంబింతునని ప్రతినయొనర్చెను. వైశాలిని

యు నిట్టి పరాక్రమవంతుని విడనాడి మఱెవ్వనిని జేపట్టనని ప్రతినఁ గైకొని తల్లిదండ్రుల వీడి తపోవనమున కేఁగెను. అట్టులామె తప మొనర్చు కాలమున వృద్ధనాగేంద్రుఁ డొకఁ డామెను నాగలోకమునకుఁ గొనిపోయి యామెను బూజించి మునుముం దామె కుదయించు నందనుఁడు నాగులవలనఁ గలిగెడి యపకృతి కలిగి వారిని నిర్మూలింప నుద్యమించుననియు నప్పుడాతనిని నివారించి వారిని రక్షింప వర మొసంగుమనియుఁ బ్రార్థించును. అందు కామె యంగీకరించును. అవీక్షితుఁడు తనతల్లి యొనర్చు కిమిచ్ఛకవ్రతసందర్భమున నెవ్వరేమి యర్థించిన నది యొసంగుదునని ప్రతిన యొనర్చును. అప్పుడాతని తండ్రి కరంధముఁ డదియే సమయమని యెంచి సుపుత్రునిఁ బడసి కులముద్ధరింపుమని యాతని నర్థించెను. మాఱుమార్గము లేక యెట్లయినను ప్రతిజ్ఞాభంగము తప్పదని యూహించి యవీక్షితుఁడు తండ్రి ప్రార్థన మంగీకరించును. అరణ్యమునఁ దపమొనర్చు వైశాలిని యొకప్పుడు దృఢకేశుఁ డను పలాశివలన బాధింపఁబడి యాక్రోశ మొనర్చ వేఁటకై యరుదెంచిన యవీక్షితుఁ డాయార్తారవమును విని యచ్చటికేఁ జని రక్కసునిఁ జక్కడంచి యామెను రక్షించును. గంధర్వరా జేతెంచి వైశాలినీ పూర్వవృత్తాంత మెఱింగించి యామె ప్రార్థన మంగీకరించి యామెను బాణిగ్రహణ మొనర్చుమని వేఁడికొనఁగా అవీక్షితుఁ డెట్టకేల కందుల కియ్యకొని యాతనితో గంధర్వలోకమున కేఁగి యామెను బరిణయమై సుఖక్రీడలఁ దేలుచుండును. అచ్చట నాదంపతులకు మరుత్తుఁ డుదయించును. పత్నీపుత్రసహితముగ అవీక్షితుఁడు తండ్రి యొద్ద కేఁగి యాతని నానందమున నోలలాడించును. తపశ్చరణమునకై వనమున కేఁగ నెంచి కరంధముఁడు రాజ్యమును స్వీకరింపుమని యెంతచెప్పినను వినక యవీక్షితుఁడు తనపూర్వావమానమునే స్మరించి రాజ్యమునకుఁ దాన నర్హుఁడనని నిరాకరించును. ఎట్టును నాతని నొడఁబఱుప నేరక కొడుకు నొడంబాటుతో మనుమఁడు మరుత్తునకుఁ బట్టాభిషేక మొనర్చి కరంధముఁడు పెక్కువత్సరములు ఘోరతప మొనర్చి యనంతరమున పుణ్యలోకముల నలంకరించును. ఆతని భార్య వీరమహాదేవి యాశ్రమమునఁ దప మొనర్చుచుండును. మరుత్తుఁ డవక్రవిక్రమంబున నవనీపాలన మొనర్చుచు దేవదానవయుద్ధములలో మహేంద్రున కనేక పర్యాయములు సాయ మొనర్చుచు నాతని మన్ననలఁ బడయుచుండెను. కాని కొంతకాలమునకు మరుత్తుని ప్రాభవమునకు మహేంద్రుఁ డసూయఁగొని యాతని యాగములయం దుపద్రష్టగా నుండవలదని బృహస్పతి నర్థించును. ఆయన మహేంద్రునకుఁ జెవియొగ్గి వాచస్పతియు మరుత్తునకు వంశానుగతముగ నొసగు యాగోపద్రష్టృత్వము దానికి నొసఁగఁజాలనని వార్త నంపును. మరుత్తుఁ డీదుస్తంత్రమునకై వగచుచుండఁగ నారదుఁ డాతనికడ కేఁగుదెంచి బృహస్పతిచే నవమానితుఁడై కాశీక్షేత్రమున శివునిఁగూర్చి తప మొనర్చుచు నున్మత్తాకృతిని జరించు నాతని తమ్ముఁడు సంవర్తుని వృత్తాంతము దెలిపి యాతనిని యజ్ఞోపద్రష్టగా గ్రహించి కృతార్థుఁడవు గమ్మని బోధించి యాతనిని గాశినుండి గొని తెచ్చు నుపాయములఁ జెప్పి ప్రత్తెంచును. సంవర్తుఁడును మరుత్తుని ప్రార్థన మంగీకరించి శివానుగ్రహము గలుగు పొంటె నాతనికి శివమంత్రోపదేశ మొనరించి, హిమవత్ప్రాంతమున నుపస్థితమై యున్న ముంజపర్వతముకడ కాతనిఁ గొనిపోయి శివునిఁగూర్చి తప మొనరింపఁజేసి తత్ప్రసాదమున నచ్చటి పసిఁడిని ద్రవ్వి తండములుగఁ గొనితెచ్చి యాగోపక్రమణ మొనరింపఁజేయును. ఇంతలో నాశ్రమమునఁ దప మొనర్చు మరుత్తుని పితామహి వీరమహాదేవి, నాగులచ్చటి తాపసుల నేడ్వురఁ గఱచి మరణింపఁజేసి యచ్చటి జలాశయముల విషదూషిత మొనర్చిరనియును నాగసంహరణ మొనర్చి రాజధర్మనిర్వహణ మొనర్చుమనియును సందేశమును బంపును. ఈవార్త విని సంవర్తాస్త్రప్రయోగమున నాగలోకనిర్మూలన మొనరింప మరుత్తుఁడు సంరంభించునంతలో నాగులాతని తల్లి భామినిని శరణుచొచ్చి పూర్వప్రదత్తవరము నామెకు జ్ఞాపకము చేయ నామెయు భర్తయగు అవీక్షితున కీవృత్తాంతమును విన్నవించి శరణాగతత్రాణ మొనరింపుమని ప్రార్థించును. అందుల కవీక్షితుఁడు వల్లెయని కొడుకుతో సంవాదించియు నాతని యుద్యమమునుండి మరలింపఁజాలక యాతనితో యుద్ధమునకు

డిగొనును. ఇట్లు తండ్రీకొడుకులిర్వురు పరస్పరము నిజధర్మనిర్వహణమునకై యొకరినొకరు సంహరింప సంరంభించునంతలో సురలును మునులును నేతెంచి వారిని వారించి మృతులైన మునులిద్దఱను నమృతప్రదానమున బ్రదికించి మరుత్తుని నాగలోకప్రణాశమునుండి మరలించిరి. సంవర్తునిమంత్రప్రభావమువలన నింద్రాదిదేవత లెల్ల మరుత్తునియాగమున కాకృష్టులై హవిర్భాగములఁగ్రహించి యజ్ఞఫలములనాతని కనుగ్రహించిరి. మరుత్తునకు సకల సామ్రాజ్యాధిపత్య మొసంగి మహేంద్రుఁడు నాతనితోఁ బూర్వమైత్రితో మెలంగుచుండెను. నిరంతరయాగదీక్షచే సురలను, సమధికస్వర్ణదక్షిణలచే మహీసురులను సంతృప్తులఁజేయుచు మరుత్తచక్రవర్తి చిరకాలము జగచ్చక్రమును శాసించి వెలుఁగొందెను. ఇది పలుతావుల విభిన్నరీతుల వెలయు మరుత్తుని సంకలితచరిత్రసంగ్రహము".

భారతమార్కండేయపురాణములయందలి కథనుగైకొని, శివానుగ్రహమున సంవర్తుఁడు బృహస్పతిని, మరుత్తుఁడు మహేంద్రుని ధిక్కరించి చరితార్థత నొందినట్లు నిరూపించుచు శివభక్తిమహిమ నుద్ఘాటించుటకయి శ్రీనాథుఁ డీగ్రంథమునుఁ జిఱుతప్రాయముననే రచించి శివునకో లేక యొక శివభక్తునకో యంకిత మిచ్చియుండును. శ్రీనాథుని చిన్నారిపొన్నారి ముద్దుపలుకులతో వెలయు నీగ్రంథమును జదివి యానందించు భాగ్యసంపద లోకమున కెప్పటికైనఁ గలుగునో లేదో!

2. శాలివాహనసప్తశతి:—శ్రీనాథుఁ డీకృతిని నూనూగుమీసాల నూత్నయౌవనమున రచించితినని చెప్పికొనియెను. అనగా నాతనికి రమారమి యిరువదేండ్ల ప్రాయమప్పు డిది రచియింపఁబడియుండును. హాలుఁడు, శాలివాహనుఁడు, సాతవాహనుఁడు అను నామాంతరములఁ బరఁగు నాంధ్రరాజు ప్రాకృతభాషలో నార్యావృత్తములలో దీనిని రచించెను. సామాన్యజనుల జీవితవిషయములకు, శృంగారచర్యలకు సంబంధించిన గాథ లిందుఁ గూర్పఁబడినవి. ఒక్కొక్కశ్లోక మొక్కొక్కగాథను సూత్రప్రాయముగఁ జిత్రించును. అందుచే నీకృతియందుఁ బ్రత్యేకకథావస్తువు గానరాదు. ఆంధ్రగీర్వాణకవీశ్వరులు పలువురువలె శ్రీనాథుఁడు గూడ సహజముగ శృంగారరసప్రియుఁడు. అందుచే శృంగారరసప్లుతములగు సప్తశతీశ్లోకములను దెలుఁగునకుఁ దార్చవలెనను తలం పీతనికి నూత్నయౌవనప్రాయమునఁ గలుగుట నైసర్గికమే. ఆంధ్రుల యభాగ్యమువలన నీకృతిగూడ నింతవఱకు లభింపలేదు. లక్షణగ్రంథములలో

ఉ॥ వారణసేయ దావగొన ♦ వా! నవవారిజమందుఁ దేటి క్రొ
వ్వారుచునుంట నీవెఱుఁగ ♦ వా? ప్రియ! హా! తెఱగంటి కంటి క
వ్వారికిఁ గెంపురాదె? తగ ♦ వా మగవారల దూఱ, నీవిధుం
డారసి నీనిజం బెఱుఁగు ♦ నంతకు నంతకు నోర్వ నెచ్చెలీ.

అను పద్య మొక్కటిమాత్ర ముదాహృతమయినది. వల్లభరాయకృతముగాఁ బ్రకటితమైన క్రీడాభిరామమను వీథినాటకము శ్రీనాథరచితమే యని కొందఱ యభిప్రాయము.

దానిని గూర్చి ముందు చర్చింపఁబడును. శ్రీనాథుని సిద్ధహస్త మీ వీథినాటకమునఁ బలుతావుల వ్యక్తమగుచుండును. గ్రంథకర్త వల్లభరాయఁడేయైనను శ్రీనాథుని సాయము నతఁడు గ్రంథరచనమున నత్యంతముగా నందియుండుననుట నిక్కువము. సప్తశతీశ్లోకముల కాంధ్రీకరణము లనఁదగిన దిగువపద్యములు రెండీవీథినాటకమునఁ గానవచ్చుచున్నవి. అవి ప్రాయశః శ్రీనాథుని గ్రంథమందలివే యని నాయభిప్రాయము.

మ॥ పటుఝంఝూపవనోత్తృణాలయములో ♦ భద్రంబుగాఁ బట్టె కం
కటిపై ముచ్చుముడింగి నిర్భరవియో ♦ గగ్లానిశోషిల్లియు।
క్కుటి నిద్రించుచు నున్నవాడ వనితన్ ♦ గర్జావచః ప్రౌఢిమన్
దటిదుద్ద్యోతము నూపునట్ట నడురే ♦ ధారాధర శ్రేణికిన్.

గీ॥ మాఘమాసంబు పులివలె మలయుచుండఁ ♦ బచ్చడంబమ్ముకొన్నాఁడు పసరమునకు।
ముదితచన్నులు పొగలేని ♦ ముర్ముర‌ములు చలికి నొఱగోయ కేలుండు సైరికుండు.

పై మూఁడు పద్యములవలన శ్రీనాథుని సప్తశతీరచనము తెలుంగు కొంత నెఱుంగవచ్చును. శ్రీనాథుని కృతిని జదివి యానందించియే కాఁబోలుఁ దరువాత నాతని కాశ్రయుఁడుగా నుండిన పెదకోమటివేమభూపాలుఁడు సప్తశతీశ్లోకములలో నుత్తమములగు నూఱుశ్లోకములను గైకొని సప్తశతీసారటీకయను పేరితో వానికి వ్యాఖ్యాన మొనర్చెను.

౩. పలనాటివీరచరిత్ర:—పాకనాటిసీమలోఁ బర్యటన మొనర్చునప్పుడు శ్రీనాథుఁడు తత్సమీపమందలి పలనాటికిఁ బోయి యందు సంచార మొనరించుచుండెను. పలనాటివీరులచరిత్రము శ్రీనాథునికాలమునాఁటికే సుప్రసిద్ధమయి విశేషముగ జనాకర్షణము నందియుండెను.

ఇందలి యితివృత్తము చాలవఱకు భారతగాథను బోలియుండును. గురిజాల రాజధానిగాఁ బలనాడు పాలించు అనుగురాజునకు వీరవిద్యాదేవి, భూరమాదేవి, మైలమాదేవి యను ముగ్గురు భార్యలుండిరి. అతఁడు మైలమవలన అలగామరాజును, తక్కినభార్యలవలన మల్లిదేవాదులను బుత్రులఁగాంచెను. సోదరులందఱలో అలగామరాజు జ్యేష్ఠుఁడు. అనుగురాజు చనిపోవునపుడు పుత్రులను దనయనుగుమంత్రి బ్రహ్మనాయని కప్పగించెను. బ్రహ్మనాయఁడు రాజపుత్రులనందఱను సమానప్రేమమునఁ బెంచుచు రాజ్యనిర్వహణ మొనర్చుచుండెను. ఆకాలమున నాగాంబికయను నొక్కపడఁతి గొప్పపలుకుబడి గలిగియుండెను. ఆమె బ్రహ్మనాయని ప్రాభవమును సహింపకుండెను. అలగామరాజునొద్దఁ గ్రమముగఁ జనవుసంపాదించి యామె దన కపటదుస్తంత్రములవలన నాతనికి సవతితమ్ములపై ద్వేషమును రవులుకొలిపి, బ్రహ్మనాయఁ డూరలేనిసమయమున వారిని జెఱఁబట్టించెను. బ్రహ్మనాయఁడు తిరిగి వచ్చినపు డిదియంతయు గ్రహించి మల్లిదేవాదులను జెఱనుండి విడిపించి వారికి రాజ్యమును బంచి మాచెర్లకుఁ గొనిపోయి యచ్చట వేఱురాజ్యమును వారికేర్పఱచెను. నాగమ్మ యిదియు సహింపనేరక మలిదేవాదులను రాజ్యభ్రష్టులుగఁ జేయనెంచి యిరురాజ్యములవారికి కోడిపందెములఁ బన్ని యోడినకోఁడిగలవా రేడుసంవత్సరములు రాజ్యమునువీడి దేశాంతరవాస మొనరించు

నట్లు నిబంధన మొనర్చెను. కోడిపందెములలో దైవగతివలన మలిదేవరాజాదులోడిపోయిరి. ఒడంబడిక ప్రకారము వారు పలనాటిని విడిచి శ్రీశైలప్రాంతములకేగి భిక్షావృత్తియు నాథస్వామివలనఁ గొన్ని భూములు గుత్తగొని జీవించుచుఁ గాలముగడిపిరి. మలిదేవునిఁ బెంచి పెద్దలుగఁజేసిన ప్రేమమునకే పరివాసమున బ్రహ్మనాయఁడు గూడ వారి ననుసరించెను. పరివాసకాలపరిమితి తీరినతరువాత మలిదేవాదులు తమరాజ్యమును దమకు మరల నిమ్మని కోరిరి. నాగాంబికప్రోద్బలమున అలగామరాజందుల కియ్యకొనఁడయ్యెను. అందువలన నిరుపక్షములవారికి దారుణమగు రణము సిద్ధమయ్యెను. అలగామరాజుపక్షమున నాగాంబిక నాయకురాలై యామెపేరనే యప్పటినుండియుఁ బ్రసిద్ధికెక్కెను. మలిదేవాదులపక్షమున బ్రహ్మనాయఁడు సైన్యాధిపత్యము వహించెను. అవక్రపరాక్రమంబు నెరపి యుభయపక్షములయందును పలువురు వీరాధివీరులు వీరస్వర్గమలంకరించిరి. బ్రహ్మనాయని పుత్రుఁడు బాలచంద్రుఁడు బాలుఁడయ్యును భారతయుద్ధమున నభిమన్యునివలె నద్భుతపరాక్రమము ప్రదర్శించి మరణించెను.

ఈ వీరరణమున మరణమందిన వీరపురుషులను దైవతములుగ భావించి వారి పేరులతో లింగములఁ బ్రతిష్ఠించి పలనాటిప్రజలు పూజింపసాగిరి. ఆబాలగోపాల సన్నుతమగు నీవీరుల చరిత్రము నాబాలగోపాలముగ జనులందఱు గేయముగఁ బాడి యానందించుటకై మన కవివరుఁడు శ్రీనాథుఁ డాచరిత్రమును ద్విపదరూపమున రచింప దొరకొనెను. ద్విపదలలోఁ గూర్పఁబడిన పాల్కురికి సోమనాథుని బసవపురాణము, పండితారాధ్యచరిత్రముల నాతఁడు చిన్నతనమున ననురక్తితోఁ బఠించి జనాకర్షణమున వానికిఁగల శక్తిని గ్రహించియుండెను. అందుచే జనానురంజనమునకయి యిరువది ముప్పదేండ్ల నడిమివయస్సులో శ్రీనాథుఁ డీద్విపదకావ్యమును సులభశైలిలో రచించి యుండును. పసిపిల్లకిఁ దావియబ్బినట్లు లీవీరచరితము శ్రీనాథరచితమగుటచే మఱింత విశ్రుతి కెక్కి "వేయిసామడపోయినైనను వీరకథ వినవలెను." అను సన్నుతికిఁ దావలమయ్యెను. కాని శ్రీనాథుఁడు సంగ్రహముగవ్రాసిన యీగ్రంథమును జూచి తరువాతి మఱికొందఱు కవులు దానననుసరించి తాముకూడ ద్విపదలలోనే విస్తరించి దానిని వ్రాయఁగడఁగిరి. ఇందుచే శ్రీనాథకృతమయిన వీరచరితము, తరువాతివారు వ్రాసిన దానితోఁ గలిసిపోయి శ్రీనాథరచిత మేదియో సరిగా నిర్ణయింప రాక యమోమయ స్థితిలో గ్రంథప్రతు లేర్పడుటకుఁ గారణమయినది. దీనిచే శ్రీనాథుని వీరచరిత్ర మింత దనుక సరిగా నిర్ణీతమయి ప్రకటితమగు నవకాశము లేకపోయినది.

(4) కాటమరాజు కథ:— పలనాటిలో వీరకథవలెఁ బాకనాటిలోఁ బ్రసిద్ధి కెక్కినది కాటమరాజుచరితము. తిక్కనసోమయాజి కాశ్రయుఁడు నెల్లూరివిభుఁడు మనుమసిద్ధిరాజునకు, నెఱగడ్డపాటి యేలికయగు కాటమరాజునకుఁ బసువులమేఁతవిల్లుగురించి జరిగినపోరాట మిందలి యితివృత్తము. కవి తిక్కనపెదతండ్రికొడుకు రణతిక్కన వీరశయనమొందిన దీమహారణముననే. పైని జెప్పినకాలముననే పాక

నాటిజనులనాకర్షించి రంజించుటకై శ్రీనాథుఁ డీచరితమును గూడ ద్విపదలో రచించియుండును. కాని పలనాటి వీరచరితమువలెనే దీనిని గూడ నితరులనుసరించి వేఱుద్విపదకావ్యములు వ్రాయుటచే దీనికిఁ గూడఁ బయిని జెప్పినగతియే పట్టినది.

ఇందుచే నిది గూడ నింతవఱకు ముద్రితముకాలేదు. గొల్లసుద్దులు మున్నగు గేయరచనములు శ్రీనాథుఁడొనర్చెనందురు. అట్లయినచో వానినాతఁ డీకాలముననే చెప్పియుండును.

(5) <u>పండితారాధ్య చరిత్రము</u>:— పైని జెప్పిన ద్విపదకావ్యములు వ్రాయఁగనే తద్రచనము నెడఁదనకుఁ బ్రోద్బలమొసంగిన పాల్కుఱికి సోమనాథుని బసవపురాణ పండితారాధ్యచరిత్రములపై శ్రీనాథుఁడు దృష్టినిబఱపి ద్విపదలలోఁ గూర్పఁబడినను, శ్రుతిస్మృతిపురాణప్రమాణనిబద్ధమై, నిగమార్థసారసంగ్రహమై ప్రౌఢపాకమునఁ బడి జనసామాన్యమునకంత సులభబోధము గాకయున్న పండితారాధ్యచరిత్రమును బద్యకావ్యముగా రచించుటమంచిదని తలంచియుండును. అందుచే నతఁడు స్వబుద్ధిచేనైననేమి శివభక్తుఁడు, మిత్రుఁడు, పెదకోమటి వేమభూపాలసైన్యాధీశుఁడు నగు మామిడి ప్రెగడయ్య ప్రార్థనముననైననేమి యీపండితారాధ్యచరిత్రమును బద్యకావ్యముగాఁ గూర్చి యాప్రెగడయ్యకే యంకితమొసంగెను. మఱికొన్ని యితరకృతులు గూడఁ బెక్కులాతని కొసంగెనఁట. వానిపేరులైనను దెలియరాకున్నవి. ఈగ్రంథము పదిరెండవశతాబ్దియందు బసవేశ్వరునకు సమకాలీనుఁడును, గోదావరీమండలస్థుఁడును అగు మల్లికార్జునపండితారాధ్యుఁడాంధ్రదేశమున వీరశైవమతవ్యాప్తికై యొనర్చిన ప్రయత్నములను బ్రకటించిన మహిమాదికములను వర్ణించును. సోమనాథుని ద్విపదకావ్యము ముద్రితమయినది. కాని శ్రీనాథుని గ్రంథ మింతవఱకు దొరకలేదు. మఱియొకశతాబ్దితరువాత సోమనాథుని బసవపురాణమునుబద్యకావ్యముగారచించిన పిడుపర్తి సోమనాథుఁడు తన గ్రంథావతారికలో

సీ॥ విరచించె జైమిని వేదపాదస్తవం ♦ బొకపాదమున వేదయుక్తి నిలిపి
హరభక్తి వైదికం బని శ్రుతులిడి చెప్పెఁ ♦ బ్రతిభ సోమేశుఁ డారాధ్యచరిత
సరవి శ్రీనాథుఁ డా చరితపద్య ప్రబం ♦ ధము చేసె ద్విపదలు తెఱుచు నిలిపి
అతఁడు పద్యకావ్యముచేసె నైషధ ♦ మంచిత హర్ష వాక్యములఁ బెట్టి
గీ॥ సోమగురువాక్యములు పెట్టి ♦ భీమసుకవి గరిమ బసవపురాణంబు ♦ కన్నడించెఁ
గానఁ బూర్వకావ్యము వేఱు ♦ గతిగ చించు వారికాదికావ్యోక్తులు ♦ వచ్చునెగడు.

అని వ్రాసి శ్రీనాథునిపండితారాధ్యచరిత్రస్వరూపమును గొంత వివరించినాఁడు. చాల వఱకు సోమనాథుని ద్విపదపంక్తులే శ్రీనాథుని పద్యములలోఁ బొందుపడినవఁట. శ్రీనా

థునిగ్రంథము పిడుపర్తి సోమనాథాదులకాలమువఱకు వ్యా... ..లిందువలన వ్యక్తమగును.

(6) శృంగారనైషధము: నిండు జవ్వనమున దీనిని సంతరించితినని శ్రీనాథుఁడు చెప్పికొనినాఁడు. సంస్కృతభాషలోఁ బాండిత్యశౌండీర్యము మెఱయ నారికేళపాకమున శ్రీహర్షుఁడు రచించిన నైషధశృంగారకావ్యమున కిది యాంధ్రీకరణము. మహాభారతములోని నలదమయంతులచరిత్రములోని విషాదవృత్తమును విడిచి వారివివాహపర్యంతముగల శృంగారకథను మాత్రము గైకొని శ్రీహర్షుఁడు శృంగారవర్ణనలతో, నైషధమను పేరితో సంస్కృతమున నిరువదిరెండుసర్గల మహాకావ్యమును రచించినాఁడు. శ్రీహర్షునివలెనే పాండిత్యప్రకటనార్థము శ్రీనాథుఁడు నిండుజవ్వనమున నీకావ్యాంధ్రీకరణమునకుఁ గడంగి యుచితజ్ఞుఁడగుటచే దానికి శృంగారనైషధమని పేరిడెను. ఇది పెదకోమటి వేమారెడ్డి మంత్రియు, పండితారాధ్య చరిత్ర కృతిపతియగు మామిడి ప్రెగడయ్యకుఁ దమ్ముఁడు నగు సింగనామాత్యున కంకితమొనరఁగఁబడినది. గ్రంథమెప్పు డెచ్చట రచింపఁబడినది గ్రంథమునఁ గానరాదు. పూర్వోక్తమైన శ్రీనాథునిజన్మకాలనిర్ణయము ననుసరించి యాతనికి ముప్పది లేక ముప్పదియైదు వత్సరములప్రాయమప్పుడు రమారమి క్రీ॥ శ॥ 1395—1400 సంవత్సరములమధ్య నీగ్రంథము రచింపఁబడి యుండవలెను. అప్పటికిఁ గొండవీటి సామ్రాజ్యము పెదకోమటి వేమారెడ్డికి హస్తంగతమైనట్లు కానరాదు. కొమరగిరిరెడ్డియే కొండవీటిని బరిపాలించుచుండెను. కావున నీగ్రంథము కొండవీటనుగాక మఱొకచోటనే రచింపఁబడియుండును. ప్రోలయవేమారెడ్డి యద్దంకిలో రెడ్డిరాజ్యమును మొదట స్థాపించినప్పుడే తనసోదరులకు రాజ్యవిభాగ మొనర్చి వారిని వేర్వేఱు సీమలందుఁ బరిపాలకులుగా నియమించినట్లు ఎఱ్ఱాప్రెగ్గడ యాతని కంకితమొనరఁగిన హరివంశమువలనను, శాసనములవలనను గాననగును. కావున ప్రోలయవేమారెడ్డి జ్యేష్ఠసోదరుఁడు పెదకోమటివేముని పితామహుఁడు నగు మాచారెడ్డి యారాజ్యవిభాగములలో నొక గరిష్ఠభాగమునే పడసి దానిని బరిపాలించుచుండి యుండును. శాసనములందు గ్రంథములం దాతనిమొడ నుదాహృతములైన "హేమాద్రిదానవిభవుఁడు, ఆదిరాజన్యతుల్యాచారవిధి" మున్నగు విశేషణములీవిషయమును రాద్ధాంతమొనరించును. రెడ్డిరాజధానులుగా నుదాహరింపఁబడిన నెల్లూరు, దువ్వూరు, గండవరము, కొండపల్లి మున్నగు తావులలో నెచ్చటనో మాచారెడ్డి రాజ్యమొనరించియుండును. కొమరగిరిరెడ్డికొండవీటరాజ్యము చేయుచున్నప్పుడు పెదకోమటివేమారెడ్డి వంశా

నుగతమయిన తనతాతరాజ్యమునే పరిపాలించుచుండియుండును. మామిడి సింగనతాత నెల్లూరితూర్పురాజని గ్రంథాంతమునఁ జెప్పఁబడినది. అతనిపూర్వు లసలు నెల్లూరి వాస్తవ్యులై యుండవచ్చును. గ్రంథమందాతనికిఁ బ్రయుక్తములైన విశేషణములఁ బట్టి గ్రంథరచననాఁటికాతఁ డొక సామ్రాజ్యమును నిర్వహించుమహామంత్రిగా గోచరించుననియు నందుచేఁ బెదకోమటి వేమారెడ్డి మహావైభవముతోఁ గొండవీడు పరిపాలించుచున్నప్పు డాతనిరాజ్యమధ్యకాలమున క్రీ॥ శ॥ 1415 ప్రాంతముననే గ్రంథమురచింపఁబడియుండుననుటయే సమంజసమనియుఁ గొందఱభిప్రాయపడుచున్నారు. కొండవీటి రాజ్యము నాక్రమింపకపూర్వము సామ్రాజ్యవిశేషణోచితమగు నొక గొప్పరాజ్యవిభాగమును బెదకోమటివేమారెడ్డి పాలించుచుండెనని యంగీకరించినప్పుడు సింగనామాత్యునకుఁ బ్రయుక్తములైనవిశేషణము లసంగతములని తలంపనక్కఱయుండదు. పెదకోమటి వేమారెడ్డి కొండవీట రాజ్యమొనరించునప్పుడు వెలయించినశాసనములఁజూచినచో క్రీ॥ శ॥ 1404 సంవత్సరమునాఁటికే శ్రీనాథుఁ డాతని యాస్థాన విద్యాధికారిగా నున్నట్లు స్పష్టమగును. శ్రీనాథుఁడు తనకున్న వైభవప్రాభవములను వర్ణించుకొనుటలో నెప్పుడు నుదాసీనతవహించు స్వభావముకలవాఁడు కాఁడు. గ్రంథము క్రీ॥ శ॥ 1404 తరువాతనే రచింపఁబడినచో నాతఁడు తనవిద్యాధికారిపదవిని గ్రంథమం దుదాహరించియేయుండును. కాని యట్టిదేదియుఁ గానరాదు. కొండవీటిప్రశంస గ్రంథమందెచ్చటను గానరాదు. గ్రంథావతారికను జదివినచో సింగనామాత్యుఁ డప్పటికిఁ దమ యాస్థానమున నున్న విద్యాధికారినే పిలిచి కృతియడిగినట్లు కానరాదు. మామిడి సింగన జ్యోతిశ్శాస్త్రమునందు గొప్ప పండితుఁడు. సోమసిద్ధాంత మనుగ్రంథమున కీతఁడు క్రీ॥ శ॥ 1418 సం॥లో వ్యాఖ్యరచించినాఁడు. ఈగ్రంథరచనముగాని తద్విషయకమైనయుద్యమముగాని శృంగారనైషధములో నెచ్చటను జెప్పఁబడలేదు. "పంచాంగ స్థిరమంత్రి రక్షణకళాప్రౌఢుండు" అను విశేషణములో సింగనామాత్యుని యీపాండిత్యము సూచితమయ్యెనని కొందఱందురు. కాని యందలి పంచాంగములు రాజ్యాంగసంబంధికములగు సహాయ, సాధనోపాయ, దేశకాలవిభాగ, వినిపాతప్రతీకార, సిద్ధులని శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిలుగారు వ్రాసియున్నారు. దమయంతీ స్వయంవరసందర్భమునఁ జేయఁబడిన సరస్వతీస్తవములోనున్న, "నమస్సోమసిద్ధాంతకాన్తాననాయై" అను స్తుతివాక్యములోఁ గూడ నిది సూచితమైనదని కొందఱు తలంతురు. ఇదియు వట్టిభ్రమయే. "సోమసిద్ధాంతమే అనఁగా (ఆపేరుగల) కాపాలిక దర్శనమే లేక చంద్రునియొక్క అఖండరూపమే సుందరమైన ముఖముగాఁ గల నీకు" అని పై ప్రస్తుతికి శ్రీ వేంకటరాయ

శాస్త్రిలుగా రర్థము వివరించినారు. పైఁగా నీస్తుతి శ్రీహర్షుని మూలగ్రంథమునసే గలదు. చూడుఁడు.

శ్లో॥ యాసోమసిద్ధాంత మయానసేవ। శూన్యాత్మతావా దమయోద రేవ।
విజ్ఞానసామ స్త్య మయాంతరేవ। సా కారతా సిద్ధిమయా ఖిలేవ

ఇత్యాది కారణములచే శృంగారనైషధము కొండవీట క్రీ॥శ॥ 141౦ ప్రాంతమున రచింపఁబడిన దనుసిద్ధాంతమునే నంగీకరింపఁ జాలకున్నాను. పెదకోమటివేమన తాను కొండవీటిసామ్రాజ్యమును హస్తంగతమొనరించుకొన్నతరువాతఁ గొండపల్లి రాజ్యము దన తమ్ముఁడు మాచారెడ్డికొసంగినట్టు లాతనితమ్ముఁడు మాచారెడ్డి క్రీ॥శ॥ 1400 లో వెలయించిన బలిజేపల్లి శాసనమువలన ద్యోతకమగును. కావున శృంగారనైషధ రచనము నాఁటికిఁ బెదకోమటి వేమన కొండపల్లిలోనే రాజ్యమొనర్చుచుండినట్లు తలంచుట సంతముగా నుండునేమో? శ్రీనాథుని కాల్పట్టణము, కొండపల్లియు నేకమండలములోనివే గదా! ముందొనర్చు హారవిలాసరచనాకాలనిర్ణయమునుబట్టి గూడఁ బైనిజెప్పిన నిర్ణయమందలి సామంజస్యము బోధపడఁగలదు.

శృంగారనైషధమువంటి యుద్గ్రంథరచనమువలన లోకమునకు వెల్లడియైన శ్రీనాథుని పాండిత్యప్రకర్షము, కవితామహత్త్వము నాధారములుగా సింగనామాత్యుఁడీకృతి సమర్పణమువలనఁ గలిగిన యభిమానముచేఁ దనయేలిక పెదకోమటి వేమనకుఁ గొండవీటి సామ్రాజ్యము హస్తగతముకాఁగానే సిఫారసుచేసి శ్రీనాథునికి విద్యాధికారిపదము నిప్పించియుండును.

(7) <u>హారవిలాసము</u>:—శ్రీనాథునిపద్యకావ్యములలో నొకవిధముగ స్వతంత్రగ్రంథమని చెప్పఁదగిన దిది యొక్కటియే. చిఱుతొండనంబిభక్తిపరీక్షణము, గౌరీకళ్యాణము, దారుకావనవిహారము, హాలాహలభక్షణము, కిరాతార్జునీయము, అను హారుని విలాసములను గూర్చి వ్రాయుటచే దీని కీపేరు గలిగినది. ఇందు మొదటి లీల పాలకురికి సోమనాథుని ద్విపద బసవపురాణమునందలి సిరియాళకథ ననుసరించి వ్రాయఁబడినది. రెండవది కాళిదాసుని కుమారసంభవము ననుసరించిన యనువాదము. మూఁడు నాలుగు లీలలు స్కాంద బ్రహ్మాండపురాణకథలఁబట్టి కూర్పఁబడినవి. అయిదవది భారవిసంస్కృత కావ్యమునుండి గాక భారతారణ్యపర్వకథ ననుసరించి స్వతంత్రముగ వ్రాయఁబడినది. "ఆంధ్రభాషానైషధాబ్జభవుని" అను విశేషణము నిందు శ్రీనాథుఁడు చెప్పుకొనుటచే నీగ్రంథము నైషధానంతరము రచింపఁబడుట విస్పష్టము. కాని శ్రీనాథుని విద్యాధికారపదమిందుఁ గూడ సూచింపఁబడలేదు. కుమారగిరిరెడ్డి కొండవీట జరగించు వసంత

త్సరవసంతోత్సవములందతని సుగంధభాండాగారాధ్యక్షుఁడై, విరివిగా సముద్రవ్యాపారము నెఱపుచు నానాఁటి రాజులకెల్ల బహుదేశములనుండి పలువిధములగు వస్తువుల రప్పించి యర్పించుచు వారిచే విశేష సత్కారముల నందుచుండిన కిరాటకులరత్నము శ్రీనాథుని బాల్యసఖుఁడు నగు అవచి తిప్పయసెట్టి ప్రార్థనముపై నీగ్రంథము రచింపఁబడి యాతని కంకితమొనరింపఁబడినది. శృంగారనైషధము రచించిన కొలఁదికాలములోనే కొమరగిరి జీవితకాలములోఁ గొండవీటఁగాని యటుగానిచోఁ గొమరగిరి యనంతర మత్యంతసమీపకాలములోఁ గాని శ్రీనాథునికిఁ బెదకోమటి వేముని కొండవీటిరాజ్యాస్థానమున విద్యాధికారిపదము లభింపకపూర్వమే యిది రచింపఁబడి యుండవలెనని నా యభిప్రాయము. శృంగారనైషధమునఁ బెదకోమటి వేమన యెచ్చట రాజ్యమొర్చుచుండినది చెప్పకున్నను శ్రీనాథుఁ డీగ్రంథావతారికలో "కొండవీడు పురంబు రాజధానిగాఁ గీర్తిలతాధిష్ఠితాష్టాదశ ద్వీపాంతరాళుఁడు నగు కొమరగిరి వసంతనృపాలువలన నాందోళికాఛత్రచామరతురంగాది రాజ్యచిహ్నములు వడసి" అని తిప్పయ్యను వర్ణించుసందర్భమునఁ గొమరగిరిరెడ్డి కొండవీటిని బరిపాలించుచుండినట్లు పేర్కొనినాఁడు. తిప్పయ్యసెట్టి పూర్వులు కాంచీపురవాస్తవ్యులు, "కాంచిపురీనివాస" అను సంబోధనముకూడ గ్రంథమందొకయెడఁ దిప్పయ్యసెట్టికిఁ బ్రయుక్తమగుటచే నప్పటికిఁ గూడఁ గాంచీపురమే యాతనికాణాచి యని తలంపవచ్చును. కాని తిప్పయతాత పావాణిసెట్టి "సింహవిక్రమపట్టణశ్రేష్ఠుఁడైన సెట్టి జగజెట్టిపావాణిసెట్టివిభుఁడు" అని వర్ణింపఁబడుటచే రెడ్డిసామ్రాజ్యమున వాణిజ్యమొనర్పుటకై పావాణిసెట్టియో యాతనిపూర్వులో నెల్లూరునందుఁ గూడ నొకనివాసము నేర్పఱచుకొని రెడ్డిరాజ్యమునందలి తమవ్యాపారమునకై యాపట్టణము కేంద్రస్థానముగా నేర్పఱచికొన్నట్లు కాననగును. కావునఁ దిప్పయసెట్టి నెల్లూరినుండియే ప్రోలయవేమనకాలమున నద్దంకికి, అనవేమ కొమరగిరి రెడ్ల కాలమునఁ గొండవీటికి వచ్చుచు వసంతోత్సవసమయములందచ్చటఁ దాత్కాలికముగ నివసించుచుండినట్లు లెంచవచ్చును. ఇందుచే హరవిలాసరచనము కాంచీపురముననే తప్పక జరగియుండవలెనని తలంప నవసరములేదు. గ్రంథారంభమునఁ గాంచీపురాధిదైవతములగు, వరదరాజు, ఏకామ్రనాథుఁడు, కామాక్షి వర్ణింపఁబడుటకుఁ గారణము కాంచీపురము తిప్పయసెట్టికి నాతనిపూర్వులకుఁ గాణాచియగుటయుఁ బ్రథమ ద్వితీయాశ్వాసములలోఁ గాంచీపురమున జరగిన తిప్పయకూటస్థుఁడగు చిఱుతొండని చరితము వర్ణితమగుటయు నని యెంచవచ్చును. కావునఁ గొమరగిరిరాజ్యకాలముననే కొండవీటనో, నెల్లూరనో యీగ్రంథము రచింపఁబడియుండునని నాయాశయము. తిప్పయసెట్టి

కొక్క కుమారగిరితోఁ గాక యాకాలమందలి పలువురు రాజ్యాధిపతులతో వాణిజ్య సంబంధమున్నప్పుడు గ్రంథావతారికయందును, అంకితాంకపద్యములందును గూడ నాతఁడు కుమారగిరివలన నొందినసమ్మానములే విరివిగా మాటిమాటికి నుగ్గడింపఁబడు టచే నీగ్రంథము కుమారగిరి జీవితకాలమునఁ గాని తప్పినచోఁ దదనంతర మత్యంత సమీపకాలములోఁగాని క్రీ॥శ॥ 1400-1403 ప్రాంతమున రచింపఁబడెనని తలంచుటయే చాల సంగతముగా నుండును. "మంటి బహువత్సరంబులు" అని గ్రంథావతారికలో తిప్పయసెట్టి చెప్పికొనిన మాటనుబట్టి యీగ్రంథము నందికొనునాఁటి కాతఁడు రమారమి యెనుబది తొంబది వత్సరముల ప్రాయమువాఁడై యుండునని తలంపవచ్చును. కొందఱు తలంచునట్లు "బాల్యసఖ" విశేషణముచే శ్రీనాథుఁడు తిప్పయసెట్టియు సమవయస్కులై యుందురనియు శ్రీనాథునివార్ధకదశలో క్రీ॥శ॥ 1440 ప్రాంతమున నీగ్రంథము రచింపఁపడియుండుననియు భావింప నవసరములేదు. శృంగారశ్రీనాథకర్తలు చెప్పినట్లు క్రీ॥శ॥ 1425 ప్రాంతమున నీగ్రంథరచనము జరగియుండుననియుఁ దలంప నక్కఱలేదు. అనవేముని కాలమునుండియు శ్రీనాథుఁడు కొండవీటికి, రాజాస్థానములకుఁ బోవుచుండెననియు నప్పటినుండియు స్వమతస్థుఁడు, శివభక్తుఁడు నగు తిప్పయసెట్టితో నీతనికి సఖ్యమేర్పడియుండెననియు మొదటనే వ్రాసియుంటిని. కావున నిరువదియేండ్లపైనుండి యున్న స్నేహమును బురస్కరించుకొని బ్రస్తావించినప్పుడు తిప్పయసెట్టి శ్రీనాథుని బాల్యసఖునిగాఁ జెప్పుటలో నసంగతియేదియు సహృదయులకుఁ దోఁపనేరదు. తిప్పయశ్రీనాథులు సవయస్కులనిగాని, క్రీ॥శ॥ 1400 తరువాతఁ జాలకాలమునకే యీగ్రంథము రచింపఁబడెనని గాని తలంచుట కొన్ని గ్రంథస్థప్రమాణములకే బాధకము కాఁగలదు. తిప్పయసెట్టియు నాతనితండ్రి దేవయసెట్టియు, నిరువురుగూడ శ్రీశైలపర్వతసోపానస్థాపకుఁ డగు ప్రోలయ వేమారెడ్డికాలమున వ్యాపారిముఖ్యులుగా నుండినట్టు లీక్రింది పద్యములవలన వ్యక్తమగును.

క. శ్రీపర్వతసోపాన ♦ స్థాపకుఁడగు రెడ్డివేమ ♦ జగతీపతికిన్
ప్రాపైన యుపచిదేవయ ♦ యాపావాణికి జనించె ♦ నభ్యుదయముతోన్

క. శ్రీపర్వతసోపాన ♦ స్థాపకవేమక్షితీశ ♦ సామ్రాజ్యశ్రీ
వ్యాపారిముఖ్య! యన్వయ ♦ దీపక! యలకాధిరాజ! దేవయతిప్పా!

తండ్రికొడుకు లేక కాలమున వ్యాపారిముఖ్యులుగా నుండుటలో నసంభవమేమియు లేదు గదా! పైఁగాఁ బై పద్యములవలన దేవయసెట్టి శ్రీపర్వతసోపాననిర్మాణమునఁ బ్రోలయ

వేమారెడ్డికిఁ బ్రాభుఁగా నుండినట్లు ద్యోతకమగును గాని సామ్రాజ్య వాణిజ్యవ్యాపార ములలోఁ దిప్పయసెట్టియే ముఖ్యుఁడుగానుండినట్లు స్పష్టమగును. వేమారెడ్డి రాజ్యకాల ములో వ్యాపారి ముఖ్యుఁడుగా నుండిన తిప్పయసెట్టి కాతని రాజ్యావసానకాలమగు క్రీ॥ శ॥ 1350 నాఁటికైన నలుబదియేండ్లప్రాయ ముండియుండునని తలంచినచోఁ క్రీ॥శ॥ 1400నాఁటికాతఁడుతొంబదియేండ్లవాఁడగును. అట్లయిననే "మంటి బహువత్సరంబులు" అను నుడి యర్థవంతమగును. అప్పటికాతఁ డేయుబ్బదియేండ్లవాఁడో యని తలంచుట యసంగతము. జనసామాన్యమున కాయురారోగ్యములిప్పటికంటె సర్వవిధముల నెక్కు వగనుండిన యాకాలములో నలువదియేండ్ల వయస్సు ప్రత్యేక ప్రశంసకుఁ దావలము కాఁదగియుండదు. కావున హరవిలాసము క్రీ॥ శ॥ 1425-1440 ప్రాంతముననే రచింపఁ బడెనని తలంచినచో నప్పటికిఁ దిప్పయసెట్టి 115-130 సంవత్సరములవయస్సు కలవాఁ డగును. అప్పటి కాతఁడు కైలాసమునఁ బ్రాంతకాప్రై యుండునుగాని నెల్లూరఁగాని కాం చీపురమునఁగాని, పెద్దసెట్టిగా నుండుట యసంభవము. కావునఁ బైసిద్ధాంతములు సర్వ విధముల నసంగతములైనవని నాయభిప్రాయము. శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు పైని జెప్పిన రెండవపద్యములో "అన్వయదీపక" అనుపాఠము "సత్కులదీపక" అనిమార్చి ఏకసమాసముగా నన్వయించుట మంచిదని సూచించిరి. మనమేర్పఱచుకొన్న సిద్ధాంత ములనిల్వరించుటకై కవిపాఠములనిచ్చవచ్చినట్లు మార్చుసాహసమెవ్వరికి నెప్పటికిఁ బని కిరానిది. పాఠము నెందు కిచ్చట మార్పవలెను? తండ్రికొడుకులైన దేవయతిప్పయ లొకే రాజుకాలములో నుండిరనుటలో నసంభవ మేమి యున్నది? గ్రంథస్థపాఠములఁ బట్టి యేర్పడినసిద్ధాంతములే సహృదయసమ్మతములగును. శ్రీనాథుని రచనాసంవిధానము నెఱింగినచో "సత్కులదీపక" యను పాఠము నిచ్చట నాతఁడు చెప్పియుండఁడని గ్రహిం పవచ్చును. ఆపాఠప్రకార మర్థమేమని చెప్పఁదగును? ప్రోలయవేమునివ్యాపారి ముఖ్యుఁ డైన దేవయసెట్టి సత్కులమును దీపింపఁజేయువాఁడా! దేవయతిప్పా! అని గద్యార్థ ము చెప్పవలయును. ఇట్టిచో "దేవయతిప్పా" అను సంబోధన మసంగతముగానుండును. అంతరమంతగా లేనప్పుడు కొడుకును తండ్రి సత్కులమును దీపింపఁజేయువానిగా సంబో ధించుటకూడ సందర్భవిహీనముగానే యుండును. కావున వీరభద్రరావుగారు సూచించు పాఠము శ్రీనాథహృదయసమ్మతముగాదని చెప్పనవసరము లేదు.

శ్రీ ప్రభాకరశాస్త్రిగారి సంస్కరణముతో ఆనందముద్రణాలయమువారు నూత నముగాఁ బ్రకటించిన హరవిలాసములో "వ్యాపారిముఖ్య" యనుశబ్దము తరువాత సం బోధనచిహ్నమునుంచియు, "అన్వయదీపక" యనుటకు మాఱు "సాన్వయ దీపక"అను

పాఠము ముద్రింపఁబడినది. దీనివలనఁ గూడఁ దిప్పయసెట్టి ప్రోలయవేమునకు సమకాలీనుఁడు కాడని చెప్పుటకాకరమేమియు నేర్పడఁజాలదు. శ్రీశాస్త్రిగారైనను నీ పాఠప్రయోజనమునుగూర్చి యవతారికలో నేమియుఁ జర్చింపరైరి. తిప్పయసెట్టి కుమారగిరికి వసంతోత్సవసామగ్రి నొడఁగూర్చు సందర్భమును వర్ణించుటలో, "రాజ్య చిహ్నములు వడసి, ద్రవ్యంబు లొడఁగూర్చియు, మాణిక్యగాణిక్యంబులు తెప్పించియు, అర్థంబులు గుప్పించియు, విఖ్యాతిగాంచిన యవచి దేవయతిప్పప్రభుండు" అని శ్రీనాథుఁడు భూతకాలికక్రియ లుపయోగించెననియుఁ గొమరగిరిజీవితకాలముననే యీవిషయములుజరుగుచున్నకాలముననే గ్రంథము రచింపఁబడినచో "వడయుచు, నొడగూర్చుచు, విఖ్యాతి గాంచుచు," మున్నగు శత్రర్థకక్రియ లుపయోగింపఁబడి యుండుననియు శ్రీ ప్రభాకర శాస్త్రిగారు తమవాదసాధకమునకై యొక యాక్షేపమును వెలార్చిరి. ఇందలి సారస్యమును విస్తరించుట యనవసరము. పైనిజెప్పినవి సత్యార్థమునందుఁ జెప్పిన క్త్వార్థకరూపములుగాని యెన్నఁడో గడచిన వృత్తాంతములఁ దెలుపు కేవల భూతకాలికరూపములు కావు. ఇట్టి విపరీతార్థములే చెప్పవలసినచో "శ్రీ చెలువంబుగైకొనిన చేడియ యన్నమదేవి భార్యగా గోచరమే నేతింప నయకోవిదునింద్రిపురాంతకాధిపున్" అను పాఠమున నెట్టి వైపరీత్యమేర్పడునో పాఠకులూహింతురుగాక. కావున శాస్త్రిగారిపై యాక్షేపము వారి హరవిలాసరచనాకాలమును నిలువరింప నేరదు.

కాని శ్రీ ప్రభాకరశాస్త్రిగారు శృంగారశ్రీనాథవిమర్శనములో హరవిలాసరచనా కాలమును గూర్చి నే నుగ్గడించిన విషయములకుఁ బ్రత్యేకముగ సమాధానములేమియు నొసంగకున్నను బూర్వోక్తమగు హరవిలాసనూతనముద్రణముయొక్క యవతారికలోఁ దమవాదమునకు సాధకముగా నీక్రింది విషయ మొకటి యుదాహరించినారు.

సముద్రమథనకథ శ్రీనాథుని భీమఖండములోను హరవిలాసములోను గూడఁ గలదు. అందులో "క॥ కటుకమగు విషము విషధర। కటకంబగు కేలఁబూని ♦ కౌతూహలియై । ఘుటికాసంసిద్ధుఁడు రస। ఘుటికయునుంబోలె మృడుఁడు ♦ గుటుకున మ్రింగెన్" అను పద్యమును శ్రీనాథుఁడు మార్పేమియు లేకయే రెండు గ్రంథములందుఁ గూడఁ గూర్చినాడు. ఇది సంస్కృతభీమఖండమందలి "గ్రసతేస్మ జగత్త్రాతా । విషభృద్భూషణో విషం । ఘుటికాంఘుటికాసిద్ధో । బధ్వారసమయీమివ" అను శ్లోకమున కాంధ్రీకరణమనియు భీమఖండరచనానంతరము క్రీ॥శ॥ 1430 సంవత్సరములో హరవిలాసమును రచించుటచేతనే భీమఖండపద్యము నాతఁడాగ్రంథమునఁ గైకొనుట పొసఁగెనని

యు శ్రీశాస్త్రిగారి యభిప్రాయము. పూర్వోక్తములైన ప్రబలబాధకములకు శాస్త్రిగారు తగిన సమాధానములు చెప్పియున్నచో వారిప్పుడు ప్రకటించిన యీ వాదము సమంజసమని కొంతవఱ కంగీకరింపవచ్చును. కాని యాకొఱవలనెల్లఁ దడవక కేవలమీ పద్యమునుబట్టియే హరవిలాసము భీమఖండమునకు తరువాత రచియింపఁబడెనని నిర్ణయింపరాదని నాయభిప్రాయము. శ్రీనాథుఁడు హరవిలాసములోఁ గైకొనినకథలకు మూలములేమున్నవో కొంత యీవఱకే చెప్పియుంటిని. మూలకథలనాతఁడు మూలమునకు దగ్గఱగా నుండునట్లు లాంధ్రీకరింపక యిష్టమువచ్చినట్లు మార్చియుఁ బెంచియు నించుమించుగ స్వతంత్రరచనములుగ వెలయునట్లు లాతఁ డీగ్రంథమున గ్రహించి యున్నాఁడు. అందులో గౌరీకళ్యాణముమాత్రము కాళిదాసునికవితారసమునందలి గౌరవముచే నాతని కుమారసంభవమునకుఁ జాలఁ జేరికగా నుండునట్లు రచించినాఁడు. హరవిలాసమును శ్రీనాథుఁడు తొందరతొందరగఁ గొన్ని దినములలో రచించినట్లుకానవచ్చునని శ్రీ శాస్త్రిగారు తమ యుపతారికలో సెలవిచ్చి యీతొందరకతముననే యాతఁడు కాళిదాసునిమూలమునందలి రసమునకుఁ గొన్ని పద్యములలోఁ గలిగించిన భంగమును వివరించి యున్నారు. హరవిలాసమునందలి సముద్రమథనకథను గూడ శ్రీనాథుఁడు స్కాందపురాణాంతర్గతమగు గోదావరీఖండమందలి కథనుబట్టియే భీమఖండరచనమునకు ముందే రాజమహేంద్రవరమున కేఁగి బెండపూడి యన్నయమంత్రి యాశ్రయ మొందకపూర్వము కొండవీటిసీమలోనున్నప్పుడే తనకుఁదోఁచినమార్పులతోరచించెనని నాయభిప్రాయము. హరవిలాసభీమఖండములందున్న సముద్రమథనకథకును భాగవతమందలి క్షీరసాగరమథనకథకును సంబంధము లేదని శాస్త్రిగారు కూడ నంగీకరించియున్నారు. ఇఁక హరవిలాసకథకు నేఁజెప్పినట్లు సంస్కృతగోదావరీఖండ (భీమఖండ) కథ గాని లేక వేఱొక శివపురాణమునందలి మఱియొక కథ గాని మూలమై యుండవలెను. పర్యాలోచించినచో భీమఖండకథనే శ్రీనాథుఁడు హరవిలాసములో మూలముగఁ గైకొని తక్కిన యితర కథలవలెనే మూలమునకు దూరముగ నించుమించుగ స్వతంత్రరచనముగ నుండునట్లు కొన్ని మార్పులతో రచించినట్లు కాననగును. ఈక్రింది దృష్టాంతములఁ జిత్తగింపుఁడు.

సముద్రమథనావసరమున దేవదానవులు నిర్విఘ్నముగఁ గార్యము నెఱవేఱుటకై విఘ్నేశ్వరపూజ గావించినట్లు హరవిలాసభీమఖండములు రెండింటిలోఁ గూడఁ గలదు. (భాగవతములో నిట్టిదిలేదు). కాని భీమఖండములో సంస్కృతగ్రంథానుసారముగ మొదట హాలాహలము సముద్రగర్భమునుండి యుద్భవించినప్పుడు వారెల్ల భీతిల్లి శివుని

కరణుసొచ్చి యాదేవదేవుఁడు దానిని గళమున నిలిపి లోకసంరక్షణ మొనర్చినపిమ్మట ముందట్టి యరిష్టవస్తువు లుద్భవింపకుండుటకై యాతని యుద్బోధనపై గణాధిపతిని బూజించినట్లున్నవి. శ్రీనాథుఁడు హరవిలాసమును శాస్త్రిగారు చెప్పినట్లు తొందరగా రచించుటచే నిది సరిగా గమనింపక తొలుదొలుతనే మామూలు లోకమర్యాద ననుసరించి సురాసురులచే విఘ్నేశ్వరపూజ చేయించి యటుపిమ్మటనే హాలాహలముతరువాత నితరవస్తువులు పొడమినట్లువర్ణించినాఁడు. భీమఖండము రచించినతరువాతనే శ్రీనాథుఁడు హరవిలాసము రచించినచో నిట్లు జరగించియుండఁడని బుద్ధిమంతులకుఁ దోఁపకపోదు. మఱియు సముద్రమథనమునకు ముందు విష్ణువు మందరాచలమును గవ్వంగొండకై త్రవ్వి తెచ్చుటనువర్ణించుసందర్భములో సంస్కృతభీమఖండములో నీక్రిందిశ్లోకములున్నవి.

"అథ నారాయణో దేవ। స్సతోత్సాహ విజృంభితః। భుజాస్తంభై రుద్ధృతవాం। శ్చతుర్భిర్మందరాచలం। ఉత్తుంగశృంగోల్లిఖిత। స్వర్గగర్భాండకర్పరం। ఏతద్గండోపలధ్వాన। ప్రపూరితదిగంతరం। ధృత్వా తం కందుక మివ। స్వభుజాగ్రై శ్చతుర్భుజః నినాయచక్షీరవార్ధిం। పరిహృష్య ద్దేవదానవమ్॥"

దీనిని స్వేచ్ఛగా నాంధ్రీకరించుటలో శ్రీనాథుఁడు హరవిలాసములో "కందుక మివ" అను మూలమునందలి యుపమానమునుమాత్రము గైకొని పర్వతోన్మూలనవిధానమును మూలమునలేని విశేషణములతో నొక సీసపద్యమున వర్ణించినాఁడు.

సీ॥ అంగిరాభరణంబు ♦ లందుఁ గీలించిన। వజ్రాలకీలన ♦ వదలకుండ
పక్షస్థలంబున ♦ వైచిన నవకంపుఁ ♦ దులసిదండకు వాడు ♦ దోఁపకుండ
గడునొప్పఁదీర్చిన ♦ కస్తూరితిలకంబు ♦ చెమటబిందులచేతఁ ♦ జెదరకుండ
నెట్టెంబుసుట్టిన ♦ నెమ్మిపించముదండ ♦ కొనరేక యొక్కింత ♦ గుదియకుండ

గీ॥ శ్రవణకస్తూరిముకుళంబు ♦ జాఱకుండ। విపులకీల్కొప్పువదలికై ♦ పెక్కకుండ
నెత్తె శృంగారకందుకం ♦ బెత్తినట్లు। కైటభారాతిమందర ♦ క్ష్మాధరంబు॥

ఇఁక దీనినే భీమఖండములో నాంధ్రీకరించునప్పుడు ముఖ్యమగు కందుకోపమానము విడిచిపెట్టినాఁడు.

శా॥ బాహాస్తంభచతుష్టయంబున మురా ♦ పరిధ్వంసి లంఘించి యు
త్సాహంబొప్పఁగ నెత్తెమందరమహీ ♦ ధ్రం బుద్ధతిం గూట సం
దోహంబుల్ ద్రుహిణాండకర్పరము ను ♦ న్మూలింప దీక్షింపలం
గ్రాహింపంబటయాళునిష్ఠుర మహా ♦ గండోపలధ్వానముల్॥

అటుతరువాత మందరాద్రిని క్షీరాంభోనిధి దరికిఁ జేర్చినసంగతి చెప్పకయే భీమఖండములో "కపటకచ్ఛపమైన ♦ కైటభాంతకువీఁపు ♦ కొమరుమిగులిన చుట్ట ♦ కుదురుగాఁగ........బలిపురోగములగుదైత్య ♦ పరివృఢులును దివిజనాయకుఁ డాదిగా ♦ దేవతలును। దఱచిరంభోధి....." అనిసముద్రమథనప్రారంభమును వర్ణించినాఁడు. కాని హరవిలాసములో మూలమందలి "వినాయుచ క్షీరవార్ధిం ప్రవృత్యద్దేవదానవమ్" అను చివరిపాదములను

గీ॥ మందరాద్రిని మోయించి ♦ మాధవుండు । పట్టి తెప్పించె నిర్జర ♦ ప్రతతిచేత
నసురయూధంబుచేత దు ♦ గ్ధాబ్ధిదరికి । నబ్జగర్భుండు నేనును ♦ నభినుతింప॥

అని యాంధ్రీకరించినాఁడు. వీనినిబట్టి చూచిన శ్రీనాథుఁడు హరవిలాసభీమఖండములలో రచించిన సముద్రమథనకథకు మూలము సంస్కృతభీమఖండమే యనియు దానినాతఁడు రెండుగ్రంథములందును గూడఁ గొంత స్వాతంత్ర్యముతో వేర్వేఱుగ నాంధ్రీకరించినట్లును గానగును. అట్లొనర్చుటలో "గ్రసతేస్మ...... అను శ్లోకమునకు "కటుకమగు విషము......" అను పద్యమును మొదట హరవిలాసముననే రచించి యాపిమ్మట భీమఖండాంధ్రీకరణసందర్భమున దాని నాగ్రంథమున మార్పేమియు లేక యట్లే గ్రహించి యుండునని తలంచుట సత్యదూరము కానేరదు.

ఇంతకు హరవిలాసభీమఖండముల బాగుగఁ జదివినవారికి శైలినిబట్టి యేమియితరకారణములచేనైననేమి హరవిలాసమే ముందు రచింపఁబడెనని తోఁపక మానదని నా తలంపు. మఱియు శ్రీనాథుఁడు కొండవీటి సీమవిడిచి, రాజమహేంద్రవరమునకు వచ్చి బెండపూడి యన్నయమంత్రిప్రాపుచే వేమవీరభద్రరెడ్లయాశ్రయమందినతరువాత మరలఁ గాంచీపురప్రాంతమునకు గ్రంథరచనమునకై యేఁగియుండుననుటసంగతముగఁగానరాదు. దక్షారామక్షేత్రమును సందర్శించి యచ్చటి భీమేశ్వరమంగళ విగ్రహమును విలోకించి యాస్వామికి నిత్యకైంకర్యమొనర్చు నచ్చటి గంధర్వాప్సరసల నృత్తగీతాదిపాండిత్యములకు సంతసించినతరువాత నాతఁడు రచించిన గ్రంథములలో సందర్భమున్నను లేకున్నను దక్షారామమును నచ్చటి వేశ్యలను నేదోయొకవిధమునఁ బ్రవేశపెట్టి స్మరించుట యాగ్రంథములఁ జదివినవారికి ద్యోతకము కాకమానదు. హరవిలాసములో నట్టి దేదియుఁ గానరాదు. సముద్రమథనకథలో నప్సరోజననవృత్తాంతసందర్భమున నైనవారిని దడవి యుండలేదు. పైఁగా దక్షారామమునకు రూఢమైయున్న దక్షిణ కాశికావిశేషణమును శ్రీనాథుఁడు హరవిలాసములోఁ దిప్పయసెట్టి వర్ణనములో "శ్రీమద్దక్షిణకాశికాపురమహాశ్రీకాళహస్తీశ్వర । ప్రేమాత్మోద్భవ కాలభైరవ కృపాశ్రీవర్ధితైశ్వర్య" అని వ్రాసి కాశ

హస్తిక్షేత్రమునకువాఁడియున్నాఁడు; కాళహస్తికిదక్షిణకైలాసమనువిశేషణము రూఢమై యున్నది గాని దక్షిణకాశి యనువ్యవహారమున్నట్లు లేదు. ధూర్జటి కాళహస్తి మాహాత్మ్యము చిత్రించునది. శ్రీనాథునకుఁ గొండవీటిసీమలో నున్నప్పుడాతనిదృష్టిలో దక్షిణకాశియైనను, దక్షిణకైలాసమైనను గాళహస్తిక్షేత్రమేగాని దక్షారామము కాదు. దక్షారామము సందర్శించి భీమఖండము రచించినపిమ్మటనే హరవిలాసము రచించినచో నాతఁడు దక్షిణకాశికావిశేషణమును కాళహస్తికిఁ గూర్చియుండఁడనియే నా యభిప్రాయము. మఱియు బాలసఖుఁడగు తిప్పయసెట్టికొఱకపై నొక నూతన శైవప్రబంధము రచించునప్పు డాతఁడు తానదివఱకు రచించిన గ్రంథములోని కథను దత్ప్రబంధమునందలి కథాంగములలో నొకదానిగఁ బరిగ్రహించుట సంభవింపనేరదు. అనేకములగు శివలీలలు, హరవిలాసములు నున్నప్పుడు భీమఖండమును ముందే రచించియున్నచో నందలి సముద్రమథనకథను నాతఁడు హరవిలాసములోఁ గైకొనియుండఁడు.

(8) <u>ధనంజయవిజయము:</u> పెదకోమటి వేమారెడ్డికొండవీటిసామ్రాజ్యమును గైవసమొనర్చికొనినకొలఁదికాలములోనే శ్రీనాథుని కాసంస్థానమున విద్యాధికారిపదము లభించెను. స్వయముగఁ బెదకోమటివేమన విద్యారసికుఁడు. సంస్కృతమున శృంగారదీపిక యను నమరుకవ్యాఖ్యానము, సప్తశతీసారటీక, సాహిత్యచింతామణి యను గ్రంథములీతఁడు రచించినవి కానవచ్చుచున్నవి. విద్యాధికారిపదవి సులభమైనది కాదు. రాజదర్శనార్థమై దినదినమరుగుదెంచు బహుదేశబుధులతో భాషించి వారునేర్చినవిద్యలలో వారిని బరీక్షించి రాజుతోఁ జెప్పి యుచితరీతిని వారిని సత్కరింపఁ జేయువలెను. కావున నాదినములలో శ్రీనాథునకుఁ జాలఁగాల మీవిద్యాపరీక్షణములందే వినియుక్తమయియుండును. పైఁగా రాజుతో విద్వద్గోష్ఠి నెఱపుచు నఖిల పురాణ విద్యాగమముల వినిపించుచు నాతనిని "సర్వజ్ఞచక్రవర్తి"గాఁ జక్కదిద్దుటలోఁ గూడ శ్రీనాథునికాలము గడచియుండును. ఇత్యాదికారణములచేతనే కాఁబోలు క్రీ॥ శ॥ 1420 వఱకు రమారమి యిరువది వత్సరములు విద్యాధికారిగా శ్రీనాథుఁడు కొండవీటిలోనున్నను నాకాలమున నీతఁడు వ్రాసిన గ్రంథములేమియుఁ గానరాకున్నవి. పెదకోమటి వేమన కంకితముగా నీతఁడేమైన గ్రంథములప్పుడు వ్రాసినదిలేనిది తెలియదు. వ్రాసినవేమైననున్న నవి కాలగర్భమం దడఁగెనేమో? కాని కిరాతార్జునీయకథను హరవిలాసమున సంగ్రహముగ రచించుటతో సంతుష్టినందక శ్రీనాథుఁడు ధనంజయవిజయమనుపేరితో దానిని బ్రత్యేకప్రబంధముగరచించి యీకాలముననే దానిని బెదకోమటి వేమారెడ్డిమామయు, ధాన్య

వాటీపురాధీశ్వరుఁడునగు గన్నభూపాలునకంకితమిచ్చినట్లు తెలియుచున్నది. పెదకోమటి వేమన ప్రేరణము గూడ దీనికిఁ గారణముకానోవును. క్రీ॥ శ॥ 1410—15 ప్రాంతమున నీగ్రంథరచనము జరిగియుండును. కాని మనదురదృష్టవశమున నిదియునింతదనుక లభింప లేదు. గన్నభూపాలుని వంశ్యుఁడు దంతులూరి బాపిరాజు తన మూర్తిత్రయోపాఖ్యాన ములో నుగ్గడించుటచేతనే యీగ్రంథరచనావిషయము మనమెఱుంగఁగల్గితిమి. బహుశః శ్రీనాథుఁ డీగ్రంథమును "భారవేరర్థ గౌరవ"మ్మనుగౌరవమునకుఁ దావలమైన సంస్కృత కిరాతార్జునీయకావ్యము ననుసరించి రచించియుండును.

(9) భీమఖండము: పెదకోమటివేమన 1420 ప్రాంతమునఁ జనిపోయెను. మఱి నాలుగేండ్లలో నాతనితనయుఁడు రాచవేమనదౌర్బల్యమునఁ గొండవీటిరెడ్డిరాజ్య మంతరించెను. గజపతులో, నరపతులో దాని నాక్రమించిరి. రాజమహేంద్రవరమునఁ గొమరగిరిరెడ్డి జీవితకాలమున నేర్పడిన రెడ్డిరాజ్యశాఖ యింకను వైభవమును నెఱపు చుండెను. శ్రీనాథునకు రెడ్డిరాజ్యముపైఁగల యభిమానమునకు మేరలేదు. రాజమహేం ద్రవరమున రాజ్యమేలుచున్న యళ్ళయవేమవీరభద్రరెడ్లకుఁ దనకుఁ బూర్వాశ్రయుఁ డైన పెదకోమటి వేమనకు మనస్స్పర్థలున్నను బాకనాటింటివాఁడు, బాంధవుఁడు శివ భక్తుఁడు, నగు బెండపూడి అన్నయ్యయే వారియొద్ద మంత్రిగా నుండుటచేతను, వేమవీర భద్రరెడ్లుకూడ శివభక్తులగుటచేతనుదనకువారియొద్దనాశ్రయముదొరకకపోదనునూహతో కొండవీటిని వీడి శ్రీనాథుఁడు రాజమహేంద్రవరమునకుఁ దరలెను. అనుకొన్నట్లే యన్న మంత్రి యాతనిని సగౌరవముగ నాదరించెను. అతనికి దక్షారామభీమేశ్వరుఁ డింటివేల్పు. తన్మాహాత్మ్యప్రకటనపరంబగు స్కాందపురాణాంతర్గత గోదావరీఖండము నాంధ్రీకరించి తనకంకితమొసంగుమని యాతఁడు శ్రీనాథునిఁ బ్రార్థించెను. దక్షిణకాశియగు దక్షారామ మును నచ్చటి భీమనాథేశ్వరమహాలింగమును సందర్శించినంతనే శ్రీనాథుని సహజ శివ భక్తి కూడ నినుమడించెను. అందుచేఁ దీక్షయు, స్పర్థయుకూడ నొనగూడెనని వల్లెయని భీమేశ్వరపురాణ మను పేరితో దానినాతఁ డాంధ్రీకరించెను. అప్పటికి శ్రీనాథునకు రమా రమి యఱువదియేండ్లవయస్సుండును. అందుచేతనే "ప్రౌఢనిర్భరవయఃపరిపాకమునఁగొని యాడితి భీమనాయకునిమహిమ" అని యాతఁడు చెప్పికొనినాఁడు. నిర్భరశబ్ద తద్భవమే నిబ్బరము. ప్రౌఢము, నిబ్బరము నగు విద్యావయోనుభవములుగల కాలమునే యీవా క్యముసూచించుచున్నది. భీమఖండమునందలికవితాపరిపాకముగూడ నిందుకాదర్శముగ నున్నది. శృంగారశ్రీనాథకృతికర్తలు తామేర్పఱచుకొన్న నిర్ణయప్రకారము శ్రీనాథునకు

అప్పటికి నలుబది, యేఁబదియేండ్లవయస్సుండుననియు నప్పటికాతఁడు దక్షారామచళుక్యభీమవరగంధర్వాప్సరోభామినులతో శృంగారసముద్రమునఁ దొప్పదోఁగుచున్నాఁడనియు నసంగతవాక్యములు వ్రాసిరి. అవి పరిహారణీయములు. నిర్భరశబ్దమునకు దుర్భరమర్థమని వీరు దుర్భ్రమనొందిరేమో? అన్నమంత్రియొనర్చిన దేవకార్యములను వర్ణించు సందర్భమున "దక్షవాటికయందుఁ దరుణేందుమౌళికి మొగలివాకిటధామ ♦ మునురచించె। ప్రాగ్దిశావప్రగోపుర ♦ ప్రాంగణమున। సప్తమునిసింధుసోపాన ♦ సరణి కెలనఁ దీర్చె భవనంబు భీమయ ♦ దేవునకును" అని శ్రీనాథుఁడీగ్రంథావతారికయందు వ్రాసెను. ఈకార్యములను బ్రశంసించుచు, శా॥ శ॥ 1350 (క్రీ॥ శ॥ 1428)లో నెలకొల్పఁబడిన శాసనము భీమేశ్వరాలయమున నున్నది. ఇందుచే భీమఖండరచనము క్రీ॥ శ॥ 1430 ప్రాంతమున జరగియుండునని నిర్వివాదముగ నెంచవచ్చును.

(10) క్రీడాభిరామము: భీమఖండరచనమువలన శ్రీనాథునకు రాజమహేంద్రవరరెడ్డి రాజాస్థానమునఁ గొంతయాశ్రయమేర్పడినది. పరిపాలకులగు వేమవీరభద్రరెడ్లయాదరము గూడఁ గొంతవఱకుఁ గుదిరినది. కావుననే యీగ్రంథావతారికలో వారి వంశవర్ణనాదికమును గూడఁ బ్రసక్తానుప్రసక్తముగఁ గొంత నెలకొలిపినాఁడు. అప్పుడు విజయనగరమునఁ బ్రౌఢదేవరాయలు కర్నాటరాజ్యాధినేతయై వెలయుచుండెను. అష్టదిగ్జయయశోవష్టంభులు, డిండిమభట్టారక బిరుదాంకితులునగు పండితులు కొంతకాలమై కర్నాటరాజాస్థానము నలంకరించుచుఁ బాండిత్యశౌండీర్యమున దిగంతవిశ్రాంత యశస్వంతులై విరాజిల్లుచున్నవార్త శ్రీనాథునకు వినవచ్చుచుండెను. ప్రౌఢదేవరాయల యాస్థానమున నప్పుడీపదవియందుండినవాఁ డరుణగిరినాథుఁడు. ప్రౌఢనిర్భరవయఃపరిపాకము నిరంతరయశోభిలాషియగు మన కవివరున కా కర్నాటకాస్థానపండితునితో వివదించి యాతనిజయించి యనన్యసామాన్యయశంబు నార్జింపఁ బ్రేరించెను. దీనికిఁ దోడు ప్రౌఢదేవరాయలు వీరశైవదీక్షస్వీకరించి, వీరశైవకవులఁ బలువురనాదరించుచున్నవార్త శ్రీనాథునకుఁ గర్ణానందముగ వినవచ్చెను. నిజమనోరథసిద్ధికై యిదియెయదనని యెంచి, ఆతడు కర్నాటదేశమునకు జైత్రయాత్రోన్ముఖుఁ డయ్యెను. బెండపూడి అన్నమంత్రియు, వేమవీరభద్రరెడ్లును గూడ నీయుద్యమము నామోదించి యాతనిని బ్రోత్సహించి యుందురు. ఈప్రయాణమున మధ్యేమార్గమున శ్రీనాథునకు వినుకొండ దుర్గాధ్యక్షుఁడు, ప్రౌఢదేవరాయలభాండాగారాధ్యక్షుఁడు, శివభక్తుఁడునగు వల్లభరాయనితో వినుకొండయందో ములికినాటిలోని మోపూరునందో, విజయనగరమందో స్నేహము సంఘటిల్లెను. వల్లభ

రాయనిపూర్వులు కర్నాటకరాజులయొద్ద సేనానులుగను భాండాగారాధ్యక్షులుగను నుండిరి. ఇతని తండ్రియుఁ దాతయుఁ గూడఁ దిప్పనామాంకితులు. వినుకొండ సమీపమందలి త్రిపురాంతకక్షేత్రమున వెలసిన త్రిపురాంతకేశ్వరునకు పేరు భక్తులు. తాత తిప్పన్న "గంధవతీప్రతీకపురఘుస్మరపాదబిసప్రసూనపుష్పంధయచక్రవర్తి" యనియు "శ్రుతి పర్వత దుర్గ మహాప్రధాన రాడ్గంధగజం" బనియు వర్ణింపఁబడినాఁడు. తండ్రి తిప్పన్న "మూఁడుగ్రామగ్రాసములతోడఁగూడంగ", ములికినాట మోపూరుఁ బాలించెననియు, రాయనవరత్న భండారరక్షకుఁడుగా నుండెననియుఁ జెప్పఁబడినాఁడు. ఇందుఁ బేర్కొనబడిన రాయలు మొదటి దేవరాయలో లేక యాతని పౌత్రుఁడు రెండవ (ప్రౌఢ) దేవరాయలో యైయుండును. తండ్రి యధికారములన్నియు నాతనికుమారుఁడు వల్లభామాత్యునికిఁ గూడ సంక్రమించియుండును. రావిపాటి త్రిపురాంతకదేవుఁడను ప్రఖ్యాతకవీశ్వరుఁడు త్రిపురాంతక క్షేత్రమందలి త్రిపురాంతకదేవునకుఁ బాదసేవకుఁడై యాదేవునిపై త్రిపురాంతకోదాహరణమను మనోహరగ్రంథమును దెలుఁగున రచించెను. అతఁడే యాస్వామి తిరునాళ్ళకరుదెంచు భక్తులవినోదార్థము ప్రదర్శితమగుటకుఁ గాఁబోలు సంస్కృతమునఁ బ్రేమాభిరామమను నాటకమునుగూడ రచించెను. ఆరూపక మింకను లోకమునకు లభింపలేదు. అందలి శ్లోకములు మాత్రము కొన్ని ఛందోలంకారగ్రంథములలోనుదాహృతములైనవి. వల్లభరాయుని తాతకు రావిపాటి త్రిపురాంతకునకు స్నేహబాంధవము లుండియుండును. త్రిపురాంతకక్షేత్రమునఁ ద్రిపురాంతకాలయమువలె ములికినాటఁ గడపజిల్లా పులివేండ్ల తాలూకాలో నున్న మోపూరునందు భైరవాలయము సుప్రసిద్ధము. ఈ భైరవస్వామిని బ్రత్యక్షమొనరించి వల్లభామాత్యునితండ్రి తిప్పన సిద్ధసారస్వతశ్రీని వరించెను. తండ్రివలెనే వల్లభన్న కూడ నీభైరవస్వామి భక్తుఁడు. అందుచే నాతని తిరునాళ్ళకేతెంచు భక్తులయెదుటఁ బ్రదర్శించుటకై ప్రేమాభిరామమును గ్రీడాభిరామ మనుపేరితో వీథినాటకముగ నాంధ్రమున ననువదించి రచింపవలెనని యాతఁ డభిలషించుచుండెను. పైని జెప్పఁబడినట్లు శ్రీనాథునితో సమాగమము కలుగునప్పటికే గ్రంథరచన మునాతఁ డుపక్రమించి యుండును. ఈయుద్యమమును వినినంతనే సన్నయకు నారాయణభట్టువలె శ్రీనాథుఁ డాతనికిఁ దోడ్పడి గ్రంథమతిత్వరితముగ నవతికాలముననే ముగింపఁబడుటకై సాయమొనర్చియుండును. కావునఁ గ్రీడాభిరామమును వల్లభరాయఁడు శ్రీనాథునిసాయముతో రచించి యుండునని నాయభిప్రాయము. ఈగ్రంథకర్తృత్వముఁ గూర్చి వలసినంత వివాదమున్నది. ఈ గ్రంథమునకు మనకు దొరకినది తంజావూరు సరస్వతీమహాలునందలి యొక్క ప్రతిమాత్రమే. అది మిక్కిలి శిథిలమైనది. అందును నవతారికాభాగ

మునుమిక్కిలిశిథిలమై పెక్కుగ్రంథపాతములు గలిగియున్నది. లుప్తమైన యవతారికాభాగములో శ్రీనాథునితోడ్పాటు పేర్కొనఁబడియుండును. కాని నన్నయభారతము నన్నయ యొక్కని పేర వెలసినట్లే యీగ్రంథముకూడ వల్లభరాయని యొక్కని పేరనే వెలసినది. ఈగ్రంథమును మొదటఁ బ్రకటించిన శ్రీమానవల్లి రామకృష్ణకవిగారు తమపీఠికలో శ్రీధరచ్ఛందములోనిదని "మంచనవింటివో వినవో" యనుపద్యము వల్లభరాయని క్రీడాభిరామములోనిదిగా నుదాహృతమయినట్లును, ముద్దరాజు రామన్న, గణపవరపు వేంకటకవి, మున్నగు లాక్షణికులుగూడ వల్లభరాయని పేరనే పద్యముల నుదాహరించి రనియు అప్పకవి, కూచిమంచి తిమ్మకవి తమ లక్షణగ్రంథములలో నిందలి పద్యములను శ్రీనాథునిపేర నుదాహరించిరనియు వ్రాసియున్నారు. అప్పకవికిఁ దిమ్మకవికిఁబూర్వుఁడగు పెదపాటి జగన్నాథకవి తన ప్రబంధరత్నాకరములో దీనిలోనిపద్యములను వల్లభరాయని వీథినాటకములోనివనియే యుదాహరించెను. దీనినిబట్టి యీ గ్రంథకర్తృత్వముఁ గూర్చి పూర్వులలోనే భేదాభిప్రాయములున్నట్లు వ్యక్తమగును. ఇందుకుఁ గారణము గ్రంథము వల్లభరాయని పేరనుండుటయు, నవతారికలో శ్రీనాథునితోడ్పాటు బహుశః ప్రశంసింపఁబడియుండుటయు నని వేఱ చెప్పనక్కఱలేదు. పూర్వోదాహృతులైన లాక్షణికులలో శ్రీధరుఁడు ప్రాచీనుఁడు. శ్రీనాథుని కించుమించుగ సమకాలీనుఁడు. అప్పకవి, తిమ్మకవి యర్వాచీనులు. శ్రీధరచ్ఛందము మనకింకను దొరకలేదు. పద్యనిర్దేశముకూడఁ జేసియుండుటచే శ్రీరామకృష్ణకవిగారు దానినెచ్చటనో చూచిరనియే స్పష్టపడుచున్నది. ముద్దరాజు రామన్న, గణపవరపు వేంకటకవి రచించిన లక్షణగ్రంథముల వ్రాఁతప్రతులను దాము చూచితిమనియు వానిలో నిందలి పద్యములు వల్లభరాయనిపేర నుదాహృతములుకాలేదనియు శ్రీ ప్రభాకరశాస్త్రిగారు వ్రాసినారు. నిజమే కావచ్చును. ఏది యెట్లున్నను, శిథిలాతిశిథిలమైన యేకప్రతినిబురస్కరించుకొని ప్రత్యక్షప్రమాణమునకు భిన్నములగు సిద్ధాంతములఁ బ్రకటించుట సరిగాదని నామతము.

శ్రీనాథుఁడే గ్రంథమంతయువ్రాసి ధనలోభమున గ్రంథకర్తృత్వము వల్లభరాయని కంటఁగట్టెనని శ్రీప్రభాకరశాస్త్రి మున్నగువారివాదము. ఇదివట్టి సాహసము, వల్లభరాయఁడే గ్రంథకర్తయని శ్రీ వీరేశలింగముపంతులు మున్నగువారి యభిప్రాయము. ఈగ్రంథావతారికలో వల్లభరాయని స్తుతించు పద్యములెక్కువగా నున్నవనియు, గ్రంథాంతమున మోపూరి భైరవస్వామి వల్లభరాయనికి వైభవాభ్యుదయములు ఘటించుఁగావుతమని యాశీర్వచనమున్నదనియు, నిదిగూడ గ్రంథమన్యకవి రచితమే కాని

వల్లభరాయకృతము కాదనుటకు నిదర్శనమనియుఁ గొందఱమతము. కాని యిదితగిన కారణముకానేరదు. ఈగ్రంథము రూపకమని మనమెఱుంగవలయును. ఈ స్తుతిపద్యము లన్నియు సూత్రధారుని సంభాషణములోనివి. గ్రంథాంతమున భరతవాక్యముగూడ నాతఁడు పలికినదే. నాటకకర్తలలో నటీసూత్రధారుల సంభాషణద్వారమున నాత్మస్తుతి యొనర్చుకొనువారు నేఁటికాలమునఁగూడ నెందఱులేరు? ఇతరకవికృతమైనను గ్రంథము వల్లభరాయనిపేర రచింపఁబడినప్పుడు పయిదోషమెట్లును వచ్చితీఱును. కావున నీ యాక్షేపము సమంజసముకాదు. శ్రీనాథుని సిద్ధహస్తము గ్రంథమునఁ బలుతావులవ్యక్త మగును. శ్రీనాథుని రచనాసంవిధానము, ఆతని యితరకృతులందలి పద్యపాదైకదేశ ములు, మురిపెంపుఁబద ప్రయోగములు, సన్నిహితసాదృశ్యముగల సంవాదములు లెక్కకు మిక్కిలిగనిందుఁ బెక్కుతావులఁ గాననగును. శ్రీనాథునకీ గ్రంథములో నెట్టిసంబంధ మును లేదనినచో వల్లభరాయనికి గ్రంథచౌర్యదోషమనివార్యముగా నంటఁగట్టఁదగును. భరతవాక్య పద్యమున వల్లభరాయఁడు "కవీంద్రకాంక్షితత్రిదశమహీరుహం" బని వర్ణిం పఁబడుటచేత శ్రీనాథుఁడు ధనలోభముననే యీగ్రంథమును వల్లభరాయనిపేరఁ బ్రక టించెననరాదు. హరవిలాసకృతిపతిగూడ, "కవిసంఘమనోరథ కల్పకద్రుమా" యని సంబోధింపఁబడినాఁడు. వాంఛాపరిపూర్తి కిట్టి కవికల్పములకుఁ గృతిపతిత్వమొసఁగినఁ జాలును. ఇంతకుఁగ్రీడాభిరామము రమారమిమూఁడువందల పద్యములుగలిగినయేకాంక రూపకము. విధముచెడినను ఫలములభింపవలెను గదా! కావున ధనవ్యయముచే నిట్టి స్వల్పకృతికర్తృత్వారోపణమున వల్లభరాయఁడుసంతుష్టినందుట యసంభవము. కావునఁ బూర్వోక్తవిధమున స్నేహసంబంధము వలననే లబ్ధమయిన శ్రీనాథునితోడ్పాటుతో వల్లభరాయఁడు దీనిని రచించెననుట సహృదయసమ్మతమగునని నాయాశయము. శ్రీనాథుని యితరగ్రంథములందలి పదజాలము పోలికలుమున్నగువాని మాటయట్లుండ నీక్రిందివిషయములు శ్రీనాథునకీ గ్రంథముతోఁగల సంబంధమును రాద్ధాంత మొనరింపఁ జాలును.

సంస్కృత భీమఖండములో వ్యాసుని దక్షారామపురప్రవేశమునకయి కాల శుద్ధిని విమర్శించుచు నగస్త్యుఁడు వ్యాసునితో వచించినట్లుగా నీక్రిందిశ్లోకములున్నవి.

"ఉషస్సాన్స్యద్ధార్గి సిద్ధాంతశ్శకునం తు బృహస్పతేః
త్వన్మతం చిత్తనైర్మల్యం, విప్రవాక్యం హరేర్మతం
కీర్తనీయాభి జిత్కాల స్సర్వసిద్ధాంత సమ్మతః॥"

ఇందు వ్యాసుని పురప్రవేశమునకయి యగస్త్యుఁడు నిర్ణయించి నిశ్చయించినది సర్వసిద్ధాంతసమ్మతమగు నభిజిత్కాలమే. శ్లోకపాదములన్నియుఁ బ్రథమపురుషములో నుండి మూఁడవపాదము మధ్యమపురుషములో నుండుటఁజూచి శ్రీనాథుఁ డుచితజ్ఞుఁ డగుటచే నామూఁడవపాదమును విడిచి తన భీమఖండములో శ్లోకము నిట్లాంధ్రీకరించెను.

గీ॥ గార్గ్యసిద్ధాంతమత ముషఃకాలకలన ♦ శకునమూనుట యది బృహస్పతి మతంబు
విప్రజనవాక్య మరయంగ విష్ణుమతము ♦ సర్వసిద్ధాంత మభిజిత్తు సమ్మతము.

క్రీడాభిరామములోఁ గథానాయకులగు గోవిందమంచనశర్మ టిట్టిభసెట్టు లుషఃకాలశుభముహూర్తముననే యేకశిలానగరప్రవేశ మొనర్తురు. వీథినాటక ప్రదర్శనము కూడ నుషఃకాలమునఁ బ్రారంభమయి సాయంకాలమునఁ జంద్రోదయముతో ముగించుట ప్రాచీన సంప్రదాయముగఁ గాననగును. ఈ సందర్భమున నుచితమగు పద్యమును రచించుటలో శ్రీనాథుఁడుపయి భీమఖండశ్లోకమునే గైకొని యందుఁ బ్రస్తుతమునకుఁ బ్రసక్తించని యభిజిత్కాలమును విడిచి దానికి బదులుగా భీమఖండపద్యమున విడిచిన వ్యాసమతమును బ్రథమపురుషములో గ్రహించి యీక్రిందిపద్యమును క్రీడాభిరామమున రచించినాఁడు.

గీ॥ గార్గ్యసిద్ధాంతమత ముషఃకాలకలన ♦ శకునమూనుటయది బృహస్పతిమతంబు
వ్యాసమతము మనఃప్రసాదాతిశయము ♦ విప్రజనవాక్య మరయంగ విష్ణుమతము.

ఉచితములగు మార్పులతోనిట్లు సంస్కృత భీమఖండశ్లోకభావమును వేర్వేఱు తావుల వేర్వేఱురీతుల రచించుట యుచితజ్ఞుఁడగు శ్రీనాథునిపనియే యని వేఱచెప్పనక్కఱ లేదు. శాలివాహనసప్తశతీ శ్లోకములకు దెలుఁగుసేఁతలనఁదగి క్రీడాభిరామమునఁ గానవచ్చు "పటుఝంఝూపవనోత్కరాలయములో" "మాఘమాసంబు పులివలెమలయుచుండ", అను పద్యములనిదివఱకే పేర్కొనియుంటిని. శ్రీనాథుఁడే తన సప్తశతినుండి వాని నీగ్రంథమునను చితస్థలములఁగూర్చియుండు ననుట కసందియము ండరాదు. క్రీడాభిరామము ప్రేమాభిరామమునకు స్వేచ్ఛానువాదమే కాని కేవలమూలానుసరణముగాదు. గ్రంథనామమును మార్చుటకూడ దీనికిఁ దార్కాణము. పైకారణములచే శ్రీనాథునకీ గ్రంథరచనమున విశేషసంబంధ మున్నదని నిస్సందేహముగ నెంచఁదగును. శ్రీనాథుని వీథినాటక మను పేరితో ముద్రింపఁబడి ప్రచారమందున్న చిన్నిపొత్తమచ్చటచ్చటి చాటుపద్యముల గ్రథనమే గాని యదియొక్క గ్రంథముగాదు, దానికిఁ దలయుఁ దోఁకయు లేవు. శ్రీనాథుని నాటకములోనివని అప్పకవి యుదాహరించిన క్రీడాభిరామపద్యములు "కుసుమం బద్దిన చీరకొంగు వొలయన్" "కంచుక కేళి నల్వెడి ప్రకారమునన్" అనునవిగూడ నందుఁ

చేర్చి ముద్రాపకులు ముద్రించినారు. ఆనుపూర్విగ వీథీరూపలక్షణములుగలిగిన నిక్కమయిన శ్రీనాథునివీథినాటకము క్రీడాభిరామమే. పయిని జెప్పఁబడినట్టులిది శ్రీనాథుని విజయనగర ప్రయాణములో వినుకొండయందో మోపూరునందో, లేక విజయనగరమందో క్రీ. శ. 1432 ప్రాంతమున రచింపఁబడియుండును. ఇరువురువిటులు మంచనశర్మ యను బ్రాహ్మణుఁడు టిట్టిభసెట్టి యను కోమటియు రెండవప్రతాపరుద్రుని కాలములో నోరుగంటి పురంబున నుదయముననే ప్రవేశించి సాయంకాలమువఱకుఁ బురవీథులందు, వివిధవాటికలందు విహరించుచుఁ గనఁబడిన వినోదములను మనోహరముగ వర్ణించుచుఁ బోవుటయే యిందలి యితివృత్తము. ప్రాసంగికముగ శ్రీకాకుళాంధ్రదేవుని తిరునాళ్ళలో జరగు దుర్వర్తనములు గూడ నిందు వర్ణింపఁబడి కేలియొనర్పఁబడినవి. ఓరుగంటియందలి వేశ్యవాటికలు, పూటకూటిళ్ళు, కోడిపందెములు, పొట్టేళ్ళ పోరాటములు, మున్నగునవి హృదయంగమముగా వర్ణితములైనవి. శృంగారరసమే యిందుఁ బ్రాధాన్యము వహించును. పదునాల్గవ శతాబ్దినాఁటి యాంధ్రనగరస్థితి నెఱుంగఁ గోరువారి కిది యత్యంతోపకారకము. కర్నాటకాస్థానమునఁ బ్రవేశముగల్గుటకై వల్లభరాయఁడు గూడ శ్రీనాథునకుఁ దగిన యవకాశము లొనగూర్చియుండును. కొంతకాలవిలంబమైనను ముమ్మకవి మున్నగు నాస్థానకవుల యాదరమువలననేమి, చంద్రశేఖరక్రియాశక్తి యొడయరు మొదలగు వీరశైవోద్యోగుల సాయమువలననేమి, శ్రీనాథునకుఁ బ్రౌఢదేవరాయల దర్శనమును, అరుణగిరినాథునితోడి వివాదమున కంగీకారమును లభ్యమయినవి. వివాదవిషయములఁ గూర్చి యిదమిత్థమని నిరూపింపఁదగిన యాధారములు లేవుగాని యాసందర్భమున శ్రీనాథుడుచెప్పిన చాటువులుమాత్రము కొన్ని దొరకినవి. కవిసార్వభౌముల కిర్వురకు నుద్భటవివాదమే జరగినది. అరుణగిరినాథుని నోడించి యాతని విజయడిండిమముఁ బగులఁగొట్టించి, కవిసార్వభౌమాదికబిరుదములఁ గొడపి తన కవిసార్వభౌమ బిరుదము నచటఁ బాదుకొల్పి ప్రౌఢదేవరాయలచేఁ గనకాభిషేకమును బడసినాఁడు మన కవివతంసుఁడు. శ్రీనాథుని జీవితములో నిది యొక యుత్కృష్టసంఘటనము. వచ్చినపని యైనవెంటనే యాతఁడు మరల స్వదేశోన్ముఖుఁడైనాఁడు. అతఁడచ్చటి కేఁగినది యశోధన సంపాదనార్థమే గదా? వలసినచో ప్రౌఢదేవరాయలతనిని దన యాస్థానమున నిలిపియుండెడివాఁడేకాని యది శ్రీనాథుని కిష్టములేదు. అతఁడు కానాచియగు రెడ్డిరాజాస్థానమును విడువఁజాలఁడు. శ్రీనాథుఁడు కర్నాటుఁడు కాఁడనుట కీవిషయము గూడఁ దోడుపడఁగలుగును. వచ్చునప్పు డాతఁడు రాచకొండ

కేఁగి సర్వజ్ఞ బిరుదాంకితుఁడగు రావుసింగభూపాలునిఁ గూడ దర్శించి యాతనిచేఁ గూడ సత్కారములందినాఁడు. అప్పుడు చెప్పినదే "దీనారటంకాల" పద్యము.

(11) కాశీఖండము :— నూత్నవిజయోత్సాహముతో శ్రీనాథుఁడు రాజమహేంద్రవరమునకుఁ దిరిగివచ్చెను. దక్షిణకాశీఖండమును (భీమేశ్వరపురాణమును) రచించునప్పుడే శ్రీనాథునకు ఉత్తరకాశీఖండమునుగూడ నాంధ్రీకరింపవలెనను కుతూహలము సహజముగనే యుదయించియుండును. పెదకోమటి వేముని జీవితకాలములో నాతనితోఁ గాశీయాత్ర కేఁగియచ్చటి సన్నివేశములఁగూడ నాతఁడదివఱకే స్వయముగా సందర్శించియుండెను. విజయనగరమున కేఁగక ముందో యటనుండివచ్చిన స్వల్పకాలమునకో యాతఁడు కాశీఖండాంధ్రీకరణమున కుపక్రమించియుండును. ఈ యుద్యమము నాకర్ణించి వేమ భూపాలుఁడాకృతిని దనతమ్ముఁడు వీరభద్రారెడ్డి కంకితమిమ్మని శ్రీనాథుని హెచ్చరించెను. పదియార్వన్నె బంగారమునకుఁ బద్మరాగముతోడి సంపర్కము గలిగినట్లు సంతసించి శ్రీనాథుఁడాప్రార్థన మంగీకరించి వీరభద్రారెడ్డికంకితముగా గ్రంథమును ముగించెను. కాశీక్షేత్రమహత్త్వమే యిందలి యితివృత్తము. మూలమునకు భీమఖండమంతసన్నిహితముగా లేకయీ కాశీఖండరచనము సంగ్రహముగాఁగొనసాగినది. కవితాప్రౌఢియందు నిది భీమఖండమునకుఁ గీసవెలితియే మోయని నా యభిప్రాయము. "నైషధమ్ విద్వదౌషధమ్" "కాశీఖండమయఃపిండ" మ్మను నాభాణకము శ్రీనాథు తెలుఁగుకృతులఁగూర్చి యేర్పడినదే యని కొందఱందురు. కాని శ్రీనాథుని కాశీఖండమిట్టినానుడికి గుఱికాఁదగినంత కఠినశైలిలో లేదనుట నిక్కువము. "ప్రాయమింతకు మిగులఁగ్రాలకుండ" సీగ్రంథమునాంధ్రీకరించెదనని శ్రీనాథుఁడు చెప్పినాఁడు. భీమఖండరచనమునకు దీనికి మధ్యవిశేషకాలవ్యత్యాసమున కవకాశములేదు. క్రీ॥ శ॥ 1440 ప్రాంతమునాఁటికి రాజమహేంద్రవరమున వేమవీరభద్రారెడ్ల రాజ్యమేయంతరించినది. కావున క్రీ॥ శ॥ 1435 ప్రాంతముననే శ్రీనాథునకించుమించుగ డెబ్బదియేండ్ల ప్రాయమప్పుడే గ్రంథమురచింపఁబడెనని నిర్ణయింపఁదగును. "కర్ణాటపద్మవనహేళి శ్రీనాథభట్టమౌళి" యని యీగ్రంథావతారికలో "చిన్నారిపొన్నారి" యను సీసపద్యము చివరను జెప్పికొని విజయనగరమునఁ దానొనర్చిన కవి విబుధరంజనమును శ్రీనాథుఁడిందుగ్గడించెను. "కర్ణాటక్షితిపాలమౌక్తిక సభాగారాంతరావర్తిత స్వర్ణస్నాన జగత్ప్రసిద్ధ కవిరాట్సంస్తుత్యచారిత్ర" యని యంతిమాశ్వాస సంబోధనమునఁ దనకుఁ బ్రౌఢదేవరాయలొనర్చిన కనకాభిషేక సత్కారముఁ బ్రకటించెను.

(12) శివరాత్రి మాహాత్మ్యము: ఈశ్వరవిధానము లద్భుతావహములు. చంచలాకటాక్షము లతిచంచలములు. సకల కళ్యాణగుణశోభితంబై, పరమేశ్వర సేవాపరంబై, దానధర్మక్రియాసంరంభకంబగు రెడ్డిసామ్రాజ్యము కొండవీటనంతరించిన యిరువది యేండ్లలోనే "సుకృతీగతాయుః" అను సూక్తికి లోనై గౌతమీతీరమునఁ గూడ నస్తమయమును బ్రాపించెను. అఖండశౌర్యనిధులయ్యు దైవదుర్విపాకమున నల్లయ వేమవీరభద్రారెడ్లు శత్రులగు గజపతులతోడి సంగరములలో క్రీ. శ. 1440 ప్రాంతమున వీరశయనమలంకరించి శివసాయుజ్యమునందిరి. హతాశుఁడై శ్రీనాథుఁడు నిర్విణ్ణతనొందెను. అత్యధికగౌరవమునఁ దన్నాదరించు రెడ్డిసార్వభౌములతో దివికేఁగలేకయాతఁడు జీవచ్ఛవంబై యుండెను. పరమేశ్వరుఁడాతనికింకను మోక్షమును బ్రసాదింపఁడయ్యెను. ముదిమి గదిరి ముప్పుతిప్పలనొంద నాతనిపాలనుండెను. చేయునదిలేక గౌతమీతీరమునువీడి యాతఁడు మరలఁ గృష్ణాతీరమును జేరుకొని యొడ్డెరాజులయొద్ద నేవో కొన్ని గ్రామములను గుత్తగొని జీవనముచేయ నిశ్చయించుకొనెను. శ్రీనాథుని సహజ శివభక్తి చిన్నతనమునుండియు నాతనిని శివక్షేత్రసందర్శనమునకై పురికొల్పుచుండెను. సుప్రసిద్ధక్షేత్రమగు శ్రీశైలము నాతఁడు మొదటినుండియు ననేక పర్యాయములు సందర్శించెననుట కనేకావకాశము లున్నవి. శ్రీశైలక్షేత్రమున కాలామున వీరశైవ సింహాసనము లైదింటిలో నాల్గవదియగు పండితారాధ్యపీఠమున కధ్యక్షులగు భిక్షావృత్తిమఠస్థులు పరిపాలకులుగా నుండిరి. శ్రీనాథునికాలమున శాంతభిక్షావృత్తియతీశ్వరుఁడు తన్మఠాధికారియై యుండెను. శ్రీశైలమున కేఁగినప్పుడు శ్రీనాథుఁడీ భిక్షావృత్తిమఠజంగములను దర్శించి వారి యాదరసత్కారముల నందుచుండెను. కావుననే హరవిలాసములోఁ జెఱుతొండనంబిని నిష్టలింగాభిషేకమునకై యిక్షురసంబు తూమెఁడిమ్మనియభ్యర్థింపవచ్చిన జంగముని నాతఁడు భిక్షావృత్తిమఠజంగమునిగనే వర్ణించినాఁడు.

"అయ్యారాధ్యుద్భవ వంశసంభవుని నేకామ్రాధినాథాంబికా।
శయ్యామందిరనిర్మలాత్మకుని భిక్షావృత్తిజంగం బొకం।
డొయ్యం జేరఁగవచ్చి—"

క్రీ. శ. 1405 సంవత్సరమునఁ గూడ నీతఁడు పెదకోమటి వేమనతో శ్రీశైలమునకేఁగి యుండెను. అప్పుడే మామిడి సింగనామాత్యునిగురువు గురుశంకరారాధ్యులకుఁ బెదకోమటి వేముఁడు పినపాడుగ్రామము నగ్రహారముగానొసంగినది. రాజమహేంద్రవరమును విడిచివచ్చిన యాకడవటిదినములలో శ్రీనాథుఁడు మనశ్శాంతికై మరల నొక

సారి శ్రీశైలమునకుఁ జని శాంత భిక్షావృత్తి యతీశ్వరుని సందర్శించెను. ఆతండును, భృత్యుండగు ముమ్మయశాంతయు పేర నొక శైవప్రబంధంబు రచింపుమని యాజ్ఞాపించెను. వల్లెయని యీశానసంహితం జెప్పఁబడిన యురులింగోద్భవంబును సుకుమార చరిత్రాత్మకంబగు శివరాత్రి మాహాత్మ్యంబును గైకొని శ్రీనాథుఁడు పయిగ్రంథమును రచించెను. దొరకినంతవఱకీగ్రంథ మసమగ్రముగా నున్నది. ఇందు నాలుగాశ్వాసములు మాత్రమే కలవు. చతుర్థాశ్వాసాంతమునందలి గద్యలో సర్వము సంపూర్ణంబయ్యెనని చెప్పఁబడలేదు. పయిగా నీయాశ్వాసములోని చివరపద్య మిట్లున్నది.

గీ॥ పరమమునులు నూత్యాహసం ♦ భవుని నూతు । భక్తిఁ బూజించి యధిక తా ♦ త్పర్యగరిమ ।
భటులు ప్రమథులచే భంగ ♦ పడుటఁ జూచి । చిన్నవోయి యమండేమి ♦ చేసెఁ బిదప.

దీనినిబట్టి యింకను గొంతగ్రంథ ముండియుండునని వేఱచెప్పనక్కఱలేదు. దీనికిఁ గూడ శిథిలాతిశిథిలమయిన యొక్కప్రతియే దొరకినది. అందునను నవతారికాభాగము మఱింత శైథిల్యమునొందినది. దీనికి మూలమనఁదగు నీశానసంహితా భాగము రమారమి నూఱు శ్లోకములుగలది, ప్రాచ్యలిఖిత పుస్తకాలయమున నున్నదనియు దానిని బట్టికూడ నాల్గవయాశ్వాసము తరువాత మఱికొంత కథ యున్నట్లే గోచరించుననియుఁ దెలియుచున్నది. కథాభాగము తక్కువయగుటచే బాణుని కాదంబరిలోని వర్ణనలతో దానిని విస్తరించి శ్రీనాథుఁ డీగ్రంథమును గొలఁది దినములు శ్రీశైలములోనుండి యచ్చటనే రచించినట్లు కాన్పించును. కాదంబరీవర్ణన లిందు విశేషముగా నున్నవి. శ్రీనాథుఁడు పెదకోమటివేమన యాస్థానముననున్న యిర్వదియేండ్లలోను రచించిన గ్రంథ మేదియుఁ గానరానందున శ్రీ వీరేశలింగముపంతులుగారీగ్రంథమప్పుడు రచింపఁబడియుండునని విషయ విమర్శనమొనర్పక స్థూలదృష్టితోఁ దమకవిచరిత్రమున లిఖించినారు కాని యిది సరికాదు. గ్రంథమందలి యంతస్సాక్ష్యమును గవితాపరిపాకమును నిది కాశీఖండానంతరమే రచింపఁబడెనని సూచించును.

కవిసార్వభౌమ బిరుదమిందుఁ బేర్కొనఁబడినది.

'సత్కవి సార్వభౌముఁడగు శ్రీనాథకవివరేణ్యునిఁ గృపావిశేషంబునఁగాంచి'

(ఆ 1 ప 13)

వేడ్కఁగవిసార్వభౌముని విమలచరితు

(ఆ 1 ప 37)

దుర్గుణనిధియై వఱలిన (కాశీఖండమందలి) గుణనిధి, చరిత్రమునకును నీగ్రంథ మందలి కథానాయకుఁడగు సుకుమారుని చరిత్రమునకును విశేషసామ్య మున్నది.

కాశీఖండమున గుణనిధి తండ్రిచే బహిష్కృతుఁడై యడవులం బడిపోవునపుడు క్షుత్పిపాసాపీడితుఁడయి పలవించు సందర్భమున సంస్కృత కాశీఖండమున నీక్రిందిశ్లోకమున్నది.

“సదాహ్యభ్యుదితే భానౌ ప్రసూర్మే మృష్టభోజనమ్ దద్యాదద్యాత్రికం యాచే యాచే హా జననీ న మే” దీనికి శ్రీనాథుఁడు కాశీఖండమం దొనర్చిన రసవదాంధ్రీకరణము.

చ॥ అరుణగభస్తిబింబము దయాద్రి పయింబొడతేర గిన్నెలోఁ
బెరుగును వంటకంబు వడ పిండిలునున్ గుడుపంగఁ బెట్టు ని
ర్భరకరుణాధురీణయగు ప్రాణము ప్రాణము తల్లియున్నదే
హర హర! యెవ్వరింకఁ గడు పారసి పెట్టెదరీప్సితాన్నముల్.

సమానమగు కథపట్టువచ్చినప్పుడీ పద్యమునే శ్రీనాథుఁడు మార్పేమియు లేక యే శివరాత్రిమాహాత్మ్యమునఁ దృతీయాశ్వాసమునఁ బదుమూఁడవపద్యముగా నుపయోగించుకొనెను. కాశీఖండములోని మూలశ్లోకమే యీశానసంహితయందుఁగూడ నుండెననుటకు వీలులేదు. మఱియు భీమఖండకాశీఖండములలో నుదాహృతులయిన దక్షారామపంచారామ వేశ్యల ప్రశంసకూడ శివరాత్రిమాహాత్మ్యమునఁ గాననగును. పయి కారణములచేఁగాశీఖండము పిమ్మటనే యీ గ్రంథము శ్రీనాథుని యవసానదశలో రచింపఁబడెననుట కెట్టి సంశయమును లేదు. శ్రీనాథుఁడు నైషధహారవిలాస గద్యలలో “సకలవిద్యాసనాథ శ్రీనాథనామధేయ” యని వ్రాసికొనినను భీమఖండకాశీఖండములలో దానిని “సుకవిజనవిధేయ శ్రీనాథనామధేయ” యనిమార్చి వినయముఁ బ్రకటించినాఁడు. కాని శివరాత్రిమాహాత్మ్యముగద్య నైషధగద్య విధముననేయున్నది. కానియిది యొక గొప్పవిశేషము కాదు. ఇది లేఖకులపొరపాటున నయిననుజరగి యుండవచ్చును. బ్రహ్మవిష్ణువులు మదాంధులయి పరస్పరాధిక్యమునకయి పోరాడునపుడు శివుఁడు రుతరజ్యోతిర్లింగ రూపమున నుద్భవించి దానియాద్యంతములఁ జూచిరమ్మని వారిని నియోగింప వారందుకుద్యమించియు ఫలంబునొందనేరక గర్వభంగమునొంది శాంతించి యురులింగప్రభావంబు నెఱుంగుటయు, సుకుమారుఁడను మంత్రికుమారుఁడు సౌందర్యమదమత్తుఁడై కులపాలికలయాలువులఁ జెఱుచుచు విచ్చలవిడి సంచరించుటచే రాజుచే దేశమునుండి బహిష్కృతుఁడై విదేశముల కేఁగి చండాలాంగనాసంగమాదికములగువిశేష దోషములచే దూషితుఁడయ్యు నొక మహాశివరాత్రినాఁ డలవోక నాగేశ్వరలింగమును దానికి భక్తులొనర్చు పూజాదికము నాలోకించి, క్షుధాపీడకోర్వలేక భక్తులు నిద్రించుతఱి శివాలయములోఁ బ్రవేశించి యచ్చటి ఫలాహారములను దొంగిలించికొనిపోవు

నవుడు భక్తులు మేల్కొని చావమోఁదఁగా మరణించి శివరాత్రివిలోకనప్రభావముకతన సకలపాపవిముక్తుఁడై శివసాయుజ్యమునందుటయు నిందలి యితివృత్తము. శ్రీనాథుని గ్రంథములలో నెల్ల నిదియే కడపటిదిగఁ గానవచ్చును. ఇందవతారికాభాగము నాశ్వాసాద్యంతపద్యములు శ్రీనాథునినిసర్గశైలికన్నఁ బేలవముగనుండుటచేతను, అవతారికాపద్యములలోఁ గొన్ని దోషము లుండుటచేతను శ్రీనాథుఁడీ గ్రంథమురచించి యెవరికి నంకిత మొసంగకపూర్వమే ముమ్మయశాంతయ దానినెట్లో సంగ్రహించి యప్రౌఢకవితాబంధముగా నవతారికాదుల నవతరింపఁజేసి కృతిపతిత్వము తన కంటఁగట్టుకొనెనని శ్రీ కట్టి సాంబమూర్తి శాస్త్రిగారు తమ యభిప్రాయమును బ్రకటించిరి. గ్రంథమున కొక్కటియే శిథిలాతిశిథిలప్రతి దొరికినప్పుఁడిట్టి సిద్ధాంతముల వెలువరించుట సరిగాదని నామనవి. వలయువారిందుఁగూర్చి నేనొనర్చినచర్చలకు విమర్శనప్రతివిమర్శనములకు ఆంధ్రపత్రిక, క్రోధన అక్షయ సంవత్సరాది సంచికలను ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికలను (సం 17. సం 5. సం 18. సం 5-6) జిత్తగించునది.

## శ్రీనాథుని రసజ్ఞత, రాజనీతిజ్ఞత.

శ్రీనాథుని గుణవిశేషములలో గుణగ్రహణత యెన్నఁదగినది. పెదకోమటి వేమన విద్యారసికత కాతని విద్యాధికారి శ్రీనాథుని రసజ్ఞత తోడ్పడుటచేతనే పలువురు విద్వాంసు లాకాలమునఁ బలుసీమలయం దగ్రహారములఁ బడయుటకుఁ గారణమయినది. కవులు, పండితులు, తార్కికులు, జ్యోతిష్కులు, భిషక్కులు వీరు వారననేల వివిధవిద్యలయం దాటితేటిన నెల్లవారలను శ్రీనాథుఁడు పెదకోమటి వేమవచే నుచితరీతిని సత్కరింపఁజేసెను. శ్రీనాథుఁడు శాసనకర్తగా పెదకోమటివేమన క్రీ.శ.1404-1420 సం॥ మధ్య వేయించిన శాసనములలో మన కుపలబ్ధములయిన పొన్నుపల్లి, కసుకఱ్ఱు, కల్వవాముల, పినపాడు, పోట్లపాడు, ఫిరంగిపురము, నందమూరు, ఆలపాడు, పుల్లరిబోడు, రుద్రవరము మున్నగు శాసనములు పయివిషయమును వ్యక్తీకరించును. విద్యాధికారి యయ్యు వేమభూపాలునొద్దఁ బెద్దపలుకుబడిఁ గలిగియుండియు శ్రీనాథుఁడు తానేమియు నాతనివలన నగ్రహారాదికము గైకొనకుంట యాతని నిస్పృహత్వమునకుఁ బ్రబల నిదర్శనముగ నున్నది. రాజోద్యోగులలో నొకఁడై యాతఁడీవిషయమున నుదాసీనతఁ బూనినట్లు కానవగును. రాజనీతిజ్ఞతయందుఁ గూడ నీతఁ డనన్యసామాన్యమగు ప్రతి

భానిర్వాహణ మొనర్చియుండెను. మనుమసిద్ధియాస్థానమున తిక్కనామాత్యుఁడు కేవల కవిమాత్రుఁడుగఁ గాక యాతని రాజ్యస్థితికే మూలస్తంభమై యుండినట్లు చరిత్రము వలనఁ దెలియుచున్నది. కాకతిచక్రవర్తి గణపతిదేవునిఁ దనకవితామహిమమున మెప్పించి, తిక్కన మనుమసిద్ధిరాజ్య మాతనిశత్రులచేఁ గబళితముగాకుండ సురక్షిత మొనర్చె ననుట సుప్రసిద్ధము. రెడ్డిరాజులకు రాచకొండ, దేవరకొండలలో రాజ్యమేలు వెలుగోటి వెలమవారితోఁ దరతరములనుండి ప్రబలవైరము ప్రబలియుండెను. యుద్ధములో వారొండొరులను నిర్జించి పగతుల విగ్రహములను దమ కాలియందెలయందును, తమ్మపడిగలయందును బొదిగించి విజయప్రశస్తిసూచకములగు సింహతలాటములను ధరించుచుండిరి. పెదకోమటి వేమనకు దేవరకొండలో రాజ్యమేలు మాదయలింగమనీఁడు ప్రక్కలో బల్లెముగా నుండెను. సంగ్రామరంగమున నాతఁడు వేమారెడ్డినోడించి వంశానుగతంబై సందికంత పోతిరాజను పేరుగల రెడ్ల పేర్మి కటారిని గూడఁ గైవసమొనర్చుకొనెను. ఇది పెదకోమటి వేమనకు మిక్కిలి తలవంపుగా నుండెను. లింగమనీని యభంగుర పరాక్రమము నెఱింగిన యాతఁడు చేయునది లేక కార్యసాధనమునకై శ్రీనాథునే ప్రార్థించెను. అతండును రాజనీతిజ్ఞత మెఱయ దేవరకొండ కేఁగి తనకవితామాహాత్మ్యంబున మాదయలింగమనీని వశంవదునిగఁ గావించుకొని యాతనియొద్దనుండి యాకటారిని గొనితెచ్చి వేమారెడ్డి కర్పించి యాతని ఖడ్గధారచే నెఱవేఱని యీదుష్కరకార్యమును దన కవితాధారచే నిర్వహింపఁగల్గెను. పేరెన్నికగన్న యీవిన్నాణము కవిసన్నుతులకుఁ గూడఁ దావలమై మన్ననగాంచెను. వల్లూరి నరసింహకవి రచించిన నాగ్నజితీపరిణయమునందలి యీక్రింది పద్యమును జూచునది—

మ॥ ధనరాజ్యంబులు మాని నెమ్మదిఁ బ్రబో ♦ ధంబంది తెన్గోరు న
ట్టి నృపాలాగ్రణికోర్కి తీర్చుటకకుం ♦ ఠీభూత చేతస్కుఁడై
చని సాధించిన సత్కవిప్రవరు రా ♦ జన్యాగ్రణీమాన్యు నేఁ
బ్రణుతింతున్ బహుశైవ సంగదితకుం ♦ భద్రాఘు శ్రీనాథునిన్.

## శ్రీనాథుని మతము.

శ్రీనాథుఁడు పాకనాటి నియోగి బ్రాహ్మణుఁడని పైని నిరూపించి యుంటిమి. అతని గ్రంథములఁబట్టి యతఁడు శైవుఁడని చాలమంది యంగీకరించుచున్నారు. శైవములో దశవిధభేదములున్నట్లు కారణాగమాదులవలనఁ దెలియనగును. ఇష్ట లింగధా

రణము నంగీకరించిన శైవవిభాగములలోఁ గూడ శ్రౌతశైవము, మార్గశైవము, వీరశైవము మున్నగు నవాంతరభేదములు గలవు. బసవేశ్వర, మల్లికార్జున పండితారాధ్య పాలకురికి సోమనాథాదులచే నుద్ధరింపఁబడిన మార్గవీరశైవాదికములు శ్రీనాథునికాలము నాఁటికి విశేషవ్యాప్తిలో నున్నవి. రాజులు, రాజగురువులు, రాజమంత్రులు పలువురు తన్మతావలంబకులై యుండిరి. ఉపనయనసంస్కారసహితముగ లింగధారణము నందినని యోగిబ్రాహ్మణులు, ఆరాధ్యబ్రాహ్మణులనియు, ఉపనయన మక్కఱలేకుండ మను క్రియావేధాదీక్షాత్రయపూర్వకముగఁ గేవలము లింగయజ్ఞోపవీతమునే యనఁగా నిష్టలింగమునుమాత్రమే ధరించు శైవులు వీరశైవులు (లింగావతులు) అనియు నేఁడు వ్యవహరింపఁడుచున్నారు. ఉపనయన సంస్కారసహితముగ లింగధారణమొందు బ్రహ్మక్షత్రియవైశ్యులు శ్రౌతమార్గశైవవిభాగములక్రిందఁ జేరునట్టు లాగమాదులవలనఁ గాన్పించినను వాఙ్మయమునందు వారు గూడ స్థూలదృష్టితో వీరశైవనామముతోనే వ్యవహరింపఁబడినట్లు గోచరించును. శ్రీనాథుఁడు గూడ వీరశైవ, వీరమాహేశ్వరశబ్దముల నట్టిదృష్టితోనే తనగ్రంథములయందు వాడియున్నాఁడు. ఉపలబ్ధములైన శ్రీనాథునిగ్రంథములన్నియు "తస్మైదేయం తస్మాద్గ్రాహ్యం" అను రహస్యము ననుసరించి కాఁబోలు వీరశైవులకే యంకితములైనవి. పండితారాధ్యచరిత్రకృతిపతియగు మామిడి ప్రెగడయ్యయు, శృంగారనైషధ కృతిపతియగు నాతనితమ్ముఁడు సింగనామాత్యుఁడు గురుశంకరారాధ్యశిష్యులైనట్లు నైషధమందలి "శ్రీగురు శంకరమాని దయాగౌరవనిత్య వర్ధితాన్వయ" అను సంబోధనముఁబట్టి వ్యక్తమగును. ఈ గురుశంకరారాధ్యులకే క్రీ. శ. 1405 సంవత్సరములో మహాశివరాత్రి పుణ్యసమయమున సింగనామాత్యుఁడు పెదకోమటి వేమనచేఁ బినపాడుగ్రామము నగ్రహారముగా నిప్పించెను. ఈ గురుశంకరుఁడు ద్విటారాధ్యవంశ్యుఁడనియు పినపాడులో నిప్పటికి నతనిసంతతివా రున్నారనియు కొన్ని పురుషాంతరములక్రిందటివఱకు వారు లింగధారులుగా నుండిరనియుఁ దెలియుచున్నది. హరవిలాసకృతిపతి అవచితిప్పయసెట్టి లింగధారివైశ్యుఁడని యాగ్రంథావతారికవలన వ్యక్తమగును. "వీరశైవమయవ్యాపార పారీణతాఽసామాన్య ప్రతిభాతి నిర్వహణదీక్షా శాక్కరాధీశ్వరా" అను సంబోధనము. దీనిని మఱింత రాద్ధాంతమొనర్చును. భీమఖండకృతిపతి బెండపూడి అన్నామాత్యుఁడు కాశ్యపసగోత్రుఁడని దక్షారామభీమేశ్వరుఁడతని కిలువేలుపని శ్రీనాథున కాతఁడు బంధువని యాగ్రంథావతారికలోఁ జెప్పఁబడినది. శ్రీనాథుఁడీతనితండ్రి దేవయామాత్యుని "సింధుకరివాళభల్లాణ, సేనయాది, పరమమాహేశ్వరాచారపరులసరణి, నన్నవిభుదేవయామాత్యు నెన్నగవచ్చుఁ, బార్వతీ

వల్లభునిమీఁది భ క్తిగరిమ" అని పురాతనవీరశైవులతోఁ బోల్చినాఁడు. అన్నమంత్రి పరాశ్రీమాచులతో పాటాతని వీరశైవాచారసంపత్తి గూడ విశేషముగ భీమఖండమున వర్ణితమైనది. బెండపూడివారిలోఁ గాశ్యపసగోత్రులలో నారాధ్యబ్రాహ్మణులు నేఁటికి నున్నారు. కాశీఖండకృతిపతి వీరభద్రారెడ్డి వీరశైవుఁడని "విలసితకీర్తిశాలియగు వీర మహేశ్వరుదేహరంబు శ్రీనిలయమునన్" అనుపద్యమువలన వ్యక్తమగును. అతని కుల గురుఁడు ఘోడెరాయభీమేశ్వరుఁడు పట్టిసక్షేత్రమున వీరభద్రారాధకుఁడుగా నుండి నట్లు సిమ్మంతులకొమ్మన శివలీలావిలాసము నవతారికవలనఁ దెలియనగును. వీరభద్రుఁడు వీరశైవగోత్రకర్త లేవురిలో నొకఁడు. కాశీఖండావతారికలోఁ దన సాహిత్యసౌష్ఠవము నకుఁ గారణములు నుద్బోధకములుగా శ్రీనాథుఁడు వర్ణించిన సాధనసామగ్రిలో నీగురు వర్యుని పదసమారాధనమొకటి, శివరాత్రి మాహాత్మ్యకృతిపతి ముమ్మయ్య శాంతయ్య శ్రీశైలమందలి వీరశైవభిక్షావృత్తిమఠస్థజంగముఁడు. ఇక గ్రంథస్థసాక్ష్యమును విచారిం చినను శ్రీనాథుని వీరశైవత గోచరమగును. తనకును మామిడి సింగనకును గూడ గోత్ర కర్తయగు భారద్వాజమునీంద్రుని నైషధావతారికలో శ్రీనాథుఁడిట్లు వర్ణించుచున్నాఁడు.

శా॥ ఘోరంబైన తపోవిశేషమున ♦ సద్యోజాతవక్త్రంబునన్
గౌరీవల్లభుచేత దీక్షగొని ♦ యెన్ సప్తర్షులం దొక్కఁడై.
తారావీథి నలంకరించెఁ గొని ♦ యెన్ ద్రయ్యర్థసంఘాతమున్
భారద్వాజ మహామునీంద్రుఁ డగదే ♦ భక్తిం బ్రశంసింపఁగన్. (ఆ. ప. 19.)

"దీయతే లింగసంబంధః । క్షీయతే చమలత్రయం దీయతే క్షీయతే యస్మాత్ । తస్మాద్దీక్షేతికథ్యతే.

అని శైవాగమపురాణములలో దీక్షాశబ్దము నిర్వచింపఁబడినది. మఱియు భారద్వాజాది పూర్వమునీశ్వరులు లింగధారణ దీక్షనందినట్లు స్మృతిపురాణము లనేకము లున్నవి. కావున శ్రీనాథుఁడు తాను వీరశైవుఁడు కావుననె పైపద్యమునఁ దన గోత్రకర్తయగు భారద్వాజునివీరశైవదీక్ష నుల్లేఖించినాఁడని బుద్ధిమంతులకుఁ దోఁపకపోదు. "ఈశ్వరా ర్చనకళాశీలుండ" వని బ్రహ్మాండాదిమహాపురాణచయనిర్ధారిత బ్రహ్మజ్ఞానకళానిధాన మ"వని నైషధకృతిపతి యీతని సంబోధించినాఁడు. ఈశ్వరశబ్దము శివునియందు రూఢ మని కాళిదాసుఁ డుగ్గడించిన "యస్మిన్ ఈశ్వర ఇత్య నన్యవిషయ శ్శబ్దో యథార్థా రః" అను వచనమును శ్రీనాథుఁడుకూడ హరవిలాసములో ఏవేల్పులకులేని యీశ్వర శబ్దంబు దాల్చునెవ్వఁడు సుధాధాముతోడ". (ఆ. ప. 63) అని యనువదించినాఁడు. "వరుసనెనిమిది యన్యదేవతలఁ జెప్పు పది పురాణంబు లీశ్వరుఁ బ్రస్తుతించు" అని శ్రీనాథుఁ డుద్ఘోషించిన పది శైవపురాణములలో బ్రహ్మాండపురాణమొకటి. శ్రీనాథుఁడు

తన గ్రంథములోఁ బలుమాఱులు స్మరించు పంచబ్రహ్మషడంగమంత్రములలోఁ గడపటిదగు ఈశానమంత్రము శివుఁడే పరబ్రహ్మమని రాద్ధాంతమొనర్చుచున్నది. "విశద్భేదోచ్యతే విద్యా। శివజీవైక్యబోధినీ। తస్యాంరమంతయేశైవాః। వీరశైవా ఇతి స్మృతాః॥ అని సిద్ధాంతశిఖామణి. కావున శ్రీనాథునివంటి శివార్చనాశీలునకు బ్రహ్మాండాది శివపురాణములచే నిర్ధారితమైన బ్రహ్మజ్ఞానము వీరశైవమతగ్రంథప్రతిపాదితమగు శివజీవైక్యజ్ఞానమే (లింగాంగసామరస్యము) అని గోచరింపకమానదు. బ్రహ్మజ్ఞాన మాతనిదృష్టిలో నిట్టిదే యనుటకు హంసవిలాసములో చిఱుతొండ భక్తుఁడు శివయోగికాహారమై శివునియందైక్యము కానున్న సిరియాలకుమారుని స్వహస్తములతో ఖండింప నుద్యుక్తుఁడగుసందర్భమున శ్రీనాథుఁడు రచించిన క్రిందిపద్యముకూడ నిందుకు నిదర్శనము.

"మా శంకించకు మన్న; మావలని ♦ ప్రేమస్నేహవాత్సల్యసం ♦ పద
పాటింపవేమన్న నాలుక తుదిన్ పంచాక్షరీమంత్రమున్ ♦ పదిలం
బొప్ప పఠింపుమన్న! పరమబ్రహ్మర్థిసంసిద్ధి యి ♦ య్యది
సుమ్మన్న! యనుంగు నందన! ♦ సరాలా వీరశైవ వ్రతా."

మఱియు శివరాత్రిమాహాత్మ్యములోఁ గథాసందర్భమున కొంతగాఁ బ్రసక్తిలేకున్నను శ్రీనాథుఁడు సుకుమారుని నోట అద్వైతమతసిద్ధాంతము నిట్లు కేలి చేయించినాఁడు.

"జనులు వేదాంతమతానుసాధితె మహాబ్రహ్మ। బ్రహ్మహంసుంచాడు దు
ర్మహిమోహాంసులు కొంపకూనియఁకె। బహ్మాం జట్టిదారెట్టిరో।
యహహా! బ్రహ్మమువారయేస్మలుక। శయ్యాం ద్రెళ్ళి నిద్రింతురో।
జనము తస్కరముగాఁగఁ జేయుదురొ। విష్టామూత్రనిర్మోకముల్. (ఆ. 3 ప. 9)

శ్రీనాథుని గ్రంథములన్నియు శివభక్తిప్రబోధకములు. నిందుజవ్వనమునకు ముందే వీరశైవగ్రంథమగు పాల్కురికి సోమునిపండితారాధ్యచరిత్రమును బద్యకావ్యముగా ననువదించుట యాతని వీరశైవమతాభిమానమునకు ద్యోతకము. నైషధకథానాయకుఁడగు నలుని శ్రీహర్షుఁడే శైవునిగా వర్ణించినాఁడు. శ్రీనాథుఁడు కూడ నాతని నట్లే నిరూపించినాఁడు. అంతతోఁ బోవక శ్రీహర్షుఁడు మూలమునకు వ్యతిరేకముగ శివపూజాగృహమున కేఁగునప్పుడు నలునకుఁ గైదండయొసఁగిన బ్రాహ్మణునిఁగూడ శైవునిగాను, అతనిమామ భీమరాజును వీరశైవునిగను వర్ణించినాఁడు. "శైవుఁడగు బ్రాహ్మణబ్రహ్మచారి యిచ్చు హస్తమవలంబనంబుగ నల్లనడచి" (ఆ. 8 ప. 103) "వీరమాహేశ్వరాచారపారగునకు తనకు శశిమౌళియొసఁగిన కనకరథముఁ గామగమనమ్ము నైషధక్ష్మాధవునకు మామ యిచ్చెనుమాయని మహినుతింప" (ఆ. 6 ప. 95) ఇత్యాద్యనేక కారణములచే శ్రీనా

థుఁడు, కేవలస్మార్తశైవుఁడుగాక వీరశైవుఁడని యనుమానింపఁదగిన ప్రబలావకాశము లుండుటచే, ఆంధ్రపత్రిక రుధిరోద్గారి సంవత్సరాదిసంచికలో శ్రీనాథుఁడారాధ్యబ్రాహ్మణుఁడా?) యను వ్యాసమును వ్రాసియుంటిని. దీనిపైఁ గొందఱు బుద్ధిమంతులు వాదోపవాదములొనర్చిరి. మఱికొందఱు నాయభిప్రాయము నంగీకరించి, తాము గూడ శ్రీనాథునిని ఆరాధ్యబ్రాహ్మణునిగా గ్రహించిరి. ఇందుగుఱించి విశేషాంశముల నెఱుంగఁదలచువారు. "శ్రీనాథుఁడారాధ్య బ్రాహ్మణుఁడు కాఁడా?" (కళాపత్రిక.) శృంగార శ్రీనాథవిమర్శనమందలి శ్రీనాథునిమతము (సారస్వత సర్వస్వము సం॥ 1రు 07) అను అను శీర్షికలుగల నావ్యాసములను జిత్తగించునది. సత్యాన్వేషణపరులు దురభిమానము వీడి విషయవిమర్శన మొనర్చి తమకుఁ బోలిన తెఱఁగున శ్రీనాథుని మతతత్త్వమును గ్రహింతురుగాక!!

## శ్రీనాథుని శీలము

ఇందుఁ గూర్చి కొందఱు మహనీయులకు విపరీతాభిప్రాయములుండుట శోచనీయము. శ్రీ వీరేశలింగముపంతులుగారు కవిచరిత్రమందును శ్రీ వంగూరి సుబ్బారావుగారు వాఙ్మయచరిత్రమందును శ్రీనాథుఁడు ధనలోలుఁడనియు నందుచేతనే రాజాశ్రయాదులకయి ప్రయత్నించి రాజులు, మంత్రులు, దండనాథులు మున్నగువారికిఁ దన గ్రంథములనంకిత మొసంగెననియు నిందువలననే యాతఁడు పెద్దపెద్ద పురాణములను వేనిని నాంధ్రీకరింపలేదనియు, పురాణాంధ్రీకరణమీతనిచేతిలో ఖండములుగా విభక్తమయ్యెననియు వ్రాసియున్నారు. శ్రీనాథునకు యశోభిలాషమపారమనియుఁ దనప్రతిభాపాండిత్యములు రాజాశ్రయమునఁ గాని శోభింపనేర వనునభిప్రాయముచేతనే యాతఁడు రాజాస్థానములనాశ్రయించెననియు, వెనుకనే వ్రాసియుంటిని. ఒకమూలఁ గూర్చుండి యేస్కాందపురాణమాంధ్రీకరణమునకో గడంగి జీవితమెల్ల నందే వినియోగించినచో నాతఁడింతప్రశస్తికి వచ్చుటగాని యాంధ్రవాఙ్మయమున కింతసేవ యొనర్చుటగాని జరగియుండదనియే నాయాశయము. శ్రీనాథునిగ్రంథములేయేపరిస్థితులలో నెవ్వఁడెట్లురచింపఁబడినవో పైని నిరూపించియుంటిని. అతనిమతతత్త్వమును యథార్థముగ గుర్తించువారికాతని కృతిసమర్పణమందలి రహస్యము గోచరమగును. శ్రీనాథుఁడు తాను వీరశైవుఁడగుటవలన తస్మైక్షేయంతస్మాద్గ్రాహ్యం అను తన్మతరహస్యమును శివునకుఁ దద్భక్తునకు భేదములేదను మూలసూత్రమునుగుర్తించి తనగ్రంథములనెల్లఁ బరమమాహేశ్వరాచారసంపన్నులగు వీరశైవులకే యొసంగి తనతోపాటు వారిని గూడఁ గీర్తిస్థిరజీవులుగ

నొనర్చినాఁడని నాయాశయము. పాల్కురికి సోమనాథుఁడు కూడ తనగ్రంథములకు శివభక్తులగు తనమిత్రులను గథాశ్రితులుగఁ గూర్చికొనినాఁడు. పూర్వమెవ్వఁడో పరమపదించిన శివభక్తుఁడగు శ్రీరామునకుఁ బోతనభాగవతమంకితమిచ్చుటలోను, శ్రీనాథుఁడు సమకాలీనులగు శివభక్తులకుఁ దనగ్రంథములనొసంగుటలోను గలపరమార్థము మతదృష్టియొండొక్కటియే గాని వేఱుకాదు. రాజులమెప్పులకై వారియుంపుడుకత్తెలపై గూడ భోగినీదండకాదిలఘుకృతులజెప్పునికృష్టత్వమునకు పోతన యొకప్పుడైన నించుక పాల్పడినట్లు తెలియుచున్నది. కాని శ్రీనాథుఁ డట్టిపనుల కెన్నఁడు సిద్ధపడలేదు. కావునఁ బోతన కేవలనిస్పృహుఁడగు మహాయోగియనియు. శ్రీనాథుఁడందుకు వ్యతిరేకముగ ధనలోలుఁడగు మహారాగియనియు మాటిమాటికిఁజాటు మహనీయులకది తగనిపని యని మనవి చేయుచున్నాను. విద్యాధికారిగా నున్నపుడు పలువురు పండితులకుఁ బలుసీమలయందగ్రహారముల నిప్పించి వానికై తానేమియు నాసపడకుండుట శ్రీనాథుని నిస్పృహత్వమునకు ప్రబలనిదర్శనము. ఈగుణవిశేషమునే "ధనరాజ్యంబులు మాని నెమ్మదిఁ బ్రమోదంబంది" అని వల్లూరి నరసింహకవి మున్నగు పూర్వకవు లుగ్గడించి నమస్కరించిరి. నేఁటి విద్యాధికులందుకు విపరీతముగ వర్తించుటకుఁ గాలవైపరీత్యమే కారణము కాదగును.

ఇంతకంటె గణనీయమైనది శ్రీనాథుఁడు స్త్రీలోలుఁడను నపవాదము లోకమున నచ్చటచ్చటఁ బ్రాకినది. దక్కుమాలిన పుక్కిటికథలు బూటకంపుఁ బ్రాయములగుచాటువులను విడిచినచో నీయపవాదమును సమర్థించు ప్రబలాధారములు శూన్యములు. శ్రీనాథునకాంధ్రవాఙ్మయమునఁ గవిసార్వభౌమత్వ మున్నంతవఱకు, అయినవికానివి చాటువులాతని కంటఁ గట్టబడుటలో నబ్బురములేదు. అప్రమాణములగు నిట్టి యాధారములపై మృతజీవియైన యొకమహాపురుషుని కీర్తిమూర్తిని గళంకితమొనర్చుట చరిత్రకారులకుఁ దగనిపని. ఇట్టిపట్టులవా రౌదాసీన్యము వహించి యూరకుండుటయే యొప్పగుఁ గాని యూహలపై నూహలఁబన్ని సిద్ధాంతపూర్వకముగ శాశ్వతములగు గ్రంథములందు వ్రాయుట చాల శోచనీయము. శ్రీ వీరేశలింగంపంతులుగారు తమకవులచరిత్ర ప్రథమభాగపునర్ముద్రణములో నిందుఁగూర్చి యనవసరగ్రంథము పెంచి శ్రీనాథునకుఁ జాల నపచారమొనరించిరి. అందుపైఁ బంతులుగారిగ్రంథము వెలువడిన కొలఁది కాలమునకే వారివ్రాఁతలను విమర్శించుచు "శ్రీనాథమహాకవి గుణతత్త్వవిచారము" అనువ్యాసమును వ్రాసితినిగాని యది పెద్దగ్రంథముగాఁదయారయ్యెను. అంతలో శ్రీపంతులుగారు పరమపదించుటచే నాగ్రంథము బ్రకటించునుత్సాహము గూడ నీరసించెను. నా దౌర్భాగ్యమూలమునను ధనభావముకతనను నది యింతవఱకముద్రితమే. కేవల చారిత్రాత్మకము

లగు నందలి రెండుఖండములు "క్రీడాభిరామము శ్రీనాథునకు దానితోనున్న సంబంధము" "శివరాత్రిమాహాత్మ్యరచనాకాలవిమర్శనము" అనునవిమాత్రము ఆంధ్రపత్రికా సారస్వతానుబంధములో 1922 సంవత్సరములోఁ బ్రకటితములైనవి. అటుతరువాతఁ బ్రకటితమైన శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారి శృంగారశ్రీనాథములోఁ గూడ వారు శ్రీనాథుని శృంగారిశేఖరునిగాఁ దలంచి సూక్ష్మముగ నీవిషయముననే నిరూపించుటచే సారస్వత పత్రికలోఁ బ్రకటితమైన నాశృంగారశ్రీనాథవిమర్శనము నిందుగూర్చి కొంత విషయవిమర్శనమొనర్చియుంటిని. అందుకు సమాధానముగా శృంగారగ్రంథమాలలోఁ బ్రకటితమైన క్రీడాభిరామముయొక్క యవతారికలో శ్రీశాస్త్రిగారు "బూతుం బద్దెములిఁకపైఁ జేతులు వడకాడ మనసు చీదరపడఁగా । రోఁత జనింపఁగఁ గూర్చెద । నీతిపరుల్ లోఁజదువుఁడు నిర్లిప్తులుగాన్" అను నెత్తుగడతో నశ్లీలములగు చాటువులనుఁ బెక్కింటిని బ్రకటించి వానికర్తృత్వమును శ్రీనాథునకారోపించి వానినిబట్టి శ్రీనాథుని స్త్రీలౌల్యము రాద్ధాంతమగుననిప్రకటించిరి. చాటువులయు చుక్కటికథలయు నప్రామాణ్యము నొకవిధముగా శాస్త్రిగారు మొదట శృంగారశ్రీనాథములోనే యంగీకరించి యుండిరి. అప్రామాణములగునట్టి యాధారములు చారిత్రకవిషయసిద్ధాంతీకరణమునకుఁ బనికిరావని నేనుఁబూర్తిగనిరాకరించునప్పుడు మరలవానినేపట్టి ప్రమాణీకరించుటలో సారస్యము లేదు. ఈపద్యములు శ్రీనాథీయములే యని, అని ఆశాస్త్రిగారు చెప్పినారు. ఈయవధానులు గారొప్పినారు. వానిలోఁ గొన్నిటిని బ్రౌనుదొరగారు వివరణములు గూడ వ్రాసిపెట్టినారనినంతమాత్రమున నాపద్యములదెస శ్రీనాథునికర్తృత్వము చరిత్రకారులదృష్టిలో నిలువ నేరదు. కావున శ్రీశాస్త్రిగారు తమవాదసమర్థనమునకై క్రీడాభిరామపీఠికలోఁ జూపిన ప్రమాణములు క్రొత్తవి మఱేమి లేవనియే చెప్పవచ్చును. ఈ చాటుపద్యములో శ్రీనాథుని స్త్రీలౌల్యమును వేశ్యాసంపర్కమును స్థాపింపఁగలవనివీరుముఖ్యముగాఁ జెప్పునవి రెండు

(1) "అక్షయ్యంబుగ సాంపరాయని తెలుంగాధీశ! కస్తూరికా భిక్షాదానము సేయు రా సుకవిరాడ్బృందారక శ్రేణికిన్. దక్షారామ చళుక్య భీమపుర గంధర్వాప్సరోభామినీ వక్షోజద్వయ కుంభికుంభములపై వాసించుఁ దద్వాసనల్" అను పద్యములో గీతగీసినభాగము కాశీఖండావతారికలోని "ఈక్షోణిన్ నినుబోలు సత్కవులు లేరీనాఁటికాలంబునన్" అను పద్యముతో మార్పులేకుండ నుండుటచే నిది తప్పక శ్రీనాథకృతమే యని వీరివాదము. ఇంతమాత్రముననే యట్లు నొక్కి వక్కాణింప నక్కరలేదని నా యభిప్రాయము. శ్రీనాథునికంటెఁ బూర్వుఁడగు వేములవాడ భీమకవి గూడ నొక తెలుంగురాయనిఁ గస్తూరికా ఘనసారాది వస్తువులకే యర్థించినట్టులు "ఘనుఁ

డన్ వేములవాడ వంశజుఁడ దక్షారామ భీమేశ నం | దనుఁడన్ దివ్య విషామృత ప్రకటనానాకావ్యధుర్యుండ భీ | మనపేరు వినంగఁ జెప్పితిఁ | దెలుంగాధీశ! కస్తూరికా | ఘనసారాది సుగంధవస్తువులు వేగందెచ్చి లాలింపురా" అను చాటువువలన వ్యక్తమగును. ఇందలి తెలుంగురాయఁడు సాంపరాయని తెలుంగురాయఁడవుననిగాని కాదనిగాని చెప్పఁజాలము. తెలుంగురాయని మొదట సందర్శించినపుడు భీమకవి స్వనామచరిత్ర ప్రకటనాదికముగ నీపద్యమును జెప్పి కృతపరిచయుఁడయి నాతనిని మఱొకపరి దర్శించినపుడాతని తండ్రిపేరితోఁగూడ "సాంపరాయని తెలుంగాధీశ" అని సంబోధించి "అక్షయ్యంబుగ" అను పద్యమును జెప్పియుండునని తలంచుటలోన సంగతమేమియును లేదు. దక్షారామపురప్రాంతమున భీమకవి జన్మస్థలమగు వేములవాడకు రెండుమైళ్ల దూరముననున్న "సంపర" అను గ్రామము. సంస్కృత భీమఖండమునను దెలుఁగుభీమఖండముననుగూడ సాంపరాయనిపురమని పలుమాఱు పేర్కొనఁబడినది. ఇదికూడఁ బూర్వమొకరాజు పాలించు పట్టణమేయని స్థలజ్ఞులు చెప్పుచున్నారు. భీమకవి తన గ్రామసమీపమున సాంపరాయని పురమేలు తెలుంగాధీశుని సందర్శించి పై పద్యములు చెప్పియుండుననుట చాల సంగతముగా నుండును. భీమకవి పేర్కొనిన తెలుంగురాయనికి సాంపరాయనిపురమునకుఁ గల సంబంధము పరిశోధింపఁదగినది. కాశీఖండావతారికలో "ఈక్ష్ణోణిన్" అను పూర్వోక్తపద్యము వెనువెంటనే శ్రీనాథుఁడు వచియింతు వేములవాడ భీమనభంగి నుద్దండలీల నొక్కొక్కమాటు" అను సీసపద్యమును వ్రాసినాఁడు. భీమకవి యుద్దండశైలియందలి లోభగౌరవములచే శ్రీనాథుఁడు "కు" ప్రాసతో తానుగూడఁ పద్యము రచించి "అక్షయ్యంబుగ" అను భీమనచాటువులోని మూఁడవ పాదమునందలిభాగమును తన పద్యమునఁ గైకొని తత్స్మారకముగనే తరువాతి సీసపద్యములో నాతని స్తుతించినాఁడని నా యభిప్రాయము. పూర్వకవీంద్రారాధనరూపకమగు నిట్టి యనుకరణము గ్రంథచౌర్యము కానేరదు. భీమకవికూడ దక్షారామ వారవిలాసినీమణుల నృత్తగీతాది పాండిత్యముల కలరెడివాఁడని యాతని నృసింహపురాణములోనుండి లక్షణగ్రంథములో నుదాహృతమయిన "ఈక్షితివచ్చి వేగమే దక్షారామమున వారతరుణుల నృత్యం | బీక్షించి యంతకంటెను దక్షిణమున నేర్చె రంభతగవేర్పడఁగన్" అను పద్యమువలన వ్యక్తమగును. శ్రీనాథుని యవసానచాటువులో "రంభఁగూడెఁ దెనుంగురాయ రాహుత్తుండు కస్తూరికేరాజుఁ బ్రస్తుతింతు" అనియుండుటచే నాతఁడుగూడ నొక తెలుంగురాయనిఁ గస్తూరి నర్థించుచుండినట్లు తెలియనగును. కాని

యాతఁడు సాంపరాయని తెలుంగురాయఁ డవునో కాదో నిర్ణయింప నవకాశములేదు. శ్రీనాథునికాలములో సంబురాయనికొడుకు తెలుంగురాయఁ డొక డుండినట్టు లాతఁడు నెల్లూరిజిల్లాలో పొదిలిప్రాంతమున రాజ్యమేలినట్లు కొన్ని శాసనములున్నవి. క్రీ॥ శ॥ 1428 లో నాతఁడు సింహాచలయాత్రకు వచ్చి యచ్చట గూడ నొక శాసనమును వెలయించినట్లు కానవచ్చుచున్నది. ఈతఁడే "అక్షయ్యంబుగ" "ధాటీఘోటకరత్న" అను చాటుపద్యములలోఁ బేర్కొనఁబడిన సాంపరాయని తెలుంగురాయఁడు కాఁదగునని మనవారు తలంచుచున్నారు. కాని నేనుదాహరించిన సాంపరాయనిపురముఁగూర్చి సమ్యక్పరిశోధనము జరగినఁగాని యిదమిత్థమని నిర్ణయింపరాదని నా యభిప్రాయము. శ్రీనాథుఁడు వేమవీరభద్రరెడ్ల యాస్థానమున రాజమహేంద్రవరముననున్నప్పు డాతనికచ్చటఁ గస్తూరి కఱవయ్యెనా? దానికొఱకయి చాలదూరమున నెల్లూరిప్రాంతమున రాజ్యమేలు మఱొకరాజు నర్థింపవలసివచ్చెనా? ఇత్యాది సంశయములకుఁగూడ నవకాశము లేకపోలేదు.

ఇంతకు నీపద్యమును జెప్పినది భీమకవియైనను శ్రీనాథుఁడైనను మఱొక్కఁడైనను దానినిబట్టి యాతఁడు దక్షారామ చళుక్య భీమపుర వేశ్యాభుజంగుఁడని నిర్ణయింపరాదని నాయభిప్రాయము. మాంసము తినువాఁడయినను నెమ్ములను మెడకుఁ గట్టుకొనఁడుగదా! ఎట్టిదుండగీడయినను దనమిండల చనుగొండలపయి రాయుటకుఁ గస్తూరి నిమ్మని యాచించునా? ఈ పద్యార్థమునుగూర్చి శృంగార శ్రీనాథ విమర్శనములో నిట్లు వ్రాసియున్నాను. "చక్కఁగ నాలోచించువారికి మనోహరమగు వ్యంగ్యార్థమిందు ధ్వనించుచున్నది. తెలుంగురాయ నరేంద్రా! సుకవీశ్వరుల కక్షయముగా కస్తూరికాభిక్షాదానముచేయుము. అందువలన నీకు రంభాసంభోగాది రూపకమగు స్వర్గప్రాప్తి లభించును." అను నర్థమిందు ధ్వనించునని కొందఱు పండితులు చెప్పుచున్నారు. "గంధర్వాప్సరోభామినుల సంతతివారగు దక్షారామచళుక్యభీమపుర వేశ్యామణుల నృత్తగీతాదులకు మెచ్చి స్వామి మహోత్సవ సమయములందు రాజులు మంత్రులు కవీశ్వరులు వారిని సన్మానింతురు. ఈవేశ్యామణులకు వాంఛనీయములగు కస్తూరికాది సుగంధద్రవ్యముల నిట్టిపట్టుల బహుమానమిచ్చుట కవీశ్వరుల కుచితముగ నుండును. కావున నందునిమిత్తమయి సుకవీశ్వర శ్రేణికిఁ గస్తూరికాదిసుగంధ ద్రవ్యదాన మక్షయముగా నొసంగుము. వానినాకవీశ్వరులనుండి గ్రహించి యా వేశ్యారత్నములు తమ మకరికాపత్రరచనలకయి వినియోగింతురు. ఈపుణ్యముచే వీరికిఁ బ్రభవకారణములయిన గంధ

ర్వాప్సరోభామినులతోడి సమాగమరూపకమగు స్వర్గప్రాప్తి నీకు లభించును.'' అను భావమీపద్యమున స్ఫురించుననినాయభిప్రాయము. పద్యమందుఁ బ్రియుక్తములయిన బృందారక గంధర్వాప్సరోవిశేషణము లిందుకు స్ఫోరకములు. నేను ముచ్చటించిన వసురాయకవి శ్రీపాద కృష్ణమూర్తి కవిరాజు మున్నగు పండితకవులు కొందఱీదృశం బగు భావములనే సెలవిచ్చిరి.'' ఇందుకు శ్రీ ప్రభాకరశాస్త్రిగారు క్రీడాభిరామపీఠికలో నిస్సారములు నిరర్థకములునగు నాయాక్షేపముల ననువదించి సమాధానముచెప్పుట కిప్పుడు పూనుకొనను.'' అని వ్రాసి సమాధాన సంతృప్తి నందిరి. తమవాదమున కుప కరింపని యర్థములెల్ల వారిదృష్టిలో నిస్సారములు నిరర్థకములు నగుటలో నాశ్చర్యము లేదు. కవిశేఖర కవిసార్వభౌమ బిరుదాంకితులగు సుప్రసిద్ధ కవులంగీకరించినదే నేఁజె ప్పినయర్థము. శ్రీనాథుని యవసాన చాటువులోఁ దక్కినయాశ్రయులకుఁ (గాశీవిశ్వేశ్వ రైక్యము కైలాసగిరిశయనము, స్వర్గస్థత్వముఁ) జెప్పి తెలుంగరాయని విషయమున రంభా సమాగమమునే చెప్పుటగూడ పైపద్యమునకు నాయొనర్చిన యర్థమునకు సాధకమగునని సహృదయులు తలంతురని విశ్వసింతును.

ఇంక రెండవ పద్యము: "హా జలజాక్షి! హా కిసలయాధర! హా హరిమధ్య! హాశర! ద్రాజనిభాస్య! హాసురత తంత్రకళానిధి! యెందుఁబోయితే! రాజమహేం ద్రవిధిఁ గవిరాజననుంగిఖరించి భగ్న కం! తాజితకాలకూట ఘుటికాంచితమైన యు మాసచీకటిన్'' అనునది ఇది శ్రీనాథునిచాటు ధారయని తాతంభట్టుకవిలోకచింతామణి కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణసారసంగ్రహము బాలబోధచ్ఛందము, లక్షణదీపిక యన్ను గ్రంథములలో నుదాహృతమైనదనియు, పద్యమందలి రాజమహేంద్రవీథి, కవి రాజశబ్దములు శ్రీనాథకర్తృత్వమునకు సాధకములనియు శ్రీశాస్త్రిగారివాదము. లక్షణ గ్రంథములలో నుదాహృతములైనంతమాత్రమునఁ జాటుపద్యములకుఁ గర్తృత్వమును నిర్ణయించుటలో విశేషప్రామాణ్యము లభింపనేరదు. లక్షణగ్రంథకర్తలు తమ కిష్టమైన భాషాచ్ఛందఃప్రయోగముల నిల్వరించుటకై పూర్వులపేరఁ బద్యములు వ్రాసి గ్రంథ నామములు లక్షణగ్రంథనామములు గూడఁ గల్పించినారనియు శ్రీనాథునిపేరని ట్లుదా హృతమైన నందనందనచరిత్ర మీగణములోనే చేరుననియు, శృంగారశ్రీనాథములో సిద్ధాంతమొనర్చిన ప్రభాకరశాస్త్రిగారు పైపద్యమును పెద్దగా గణించి రాద్ధాంత మొనర్చుట యాశ్చర్యమే? సర్వశాస్త్రపారంగతుఁడగు విద్వాంసుఁడు చౌర్యరతమునకు నిర్ణయించుకొనిన శుభముహూర్తము మహాపర్వమగు నమావాస్యయందలి నిశీథమా?

అంతతోఁబోక యాతఁడామిండకత్తెయొనర్చిన మోసమువలన గలిగిన యాశాభంగము నకా యర్ధరాత్రిమున వీధినిబడివాపోవుటయా?' బళే! ఎంతచిత్రముగానున్నది. పోనిండు పట్టరాని వికారముతో నీ కలిగిన యనుభవము పద్యరూపముగా నాతఁడా క్షణమునఁ బక్షివలె నచ్చట వెలార్చెననియే యంగీకరింతము. తరువాత నిదిలోకమున కెట్లు వ్యాప్త మయ్యెను? ఎవరైన బొంచియుండి దానిని వ్రాసికొని ప్రకటించిరా? లేదా తగుదునని యాతఁడే విచ్చలవిడి రచ్చలందు మరల దాని నుచ్చరించెనా? ఇట్టి బూటకపుఁజాటువులు విమర్శమున కెంతమాత్రము నిలువఁజాలవనియు, వాని ప్రామాణ్యము శూన్యమనియు, బుద్ధిమంతులకుఁ జెప్పనక్కఱలేదు. వానినిబట్టి మహాపురుషులకీర్తిని గళంకితమొనర్చుట మహాపరాధము. ఈసందర్భముననే శ్రీనాథుని చాటువనిచెప్పు "గొఱియల మేఁకపోతుల" అను మఱొకపద్యము శ్రీనాథకృతము కానేరదని శ్రీ వీరేశలింగము పంతులుగారుకూడ వ్రాసియున్నారు.

శ్రీనాథుఁడు సామాన్యుడుగాఁడు. వీరవిహారమొనర్చి డిండిమభట్టారకాద్యుద్దండ పండితుల గూర్చినవాఁడు. అసూయగొనిన రాజమహేంద్రవరపండితులకు "శ్రుతిశాస్త్ర స్మృతు లభ్యసించికొని" "హంసీయానకుఁ గామికిన్" ఇత్యాదిపద్యములతోఁ దలవంపులు గలిగించినవాఁడు. అట్టివాఁడు దుశ్శీలుఁడే యైనచోఁ గసితో వారాతనిని గేలిసేయుటకై యానాఁడేమయినఁ గొన్ని ప్రహసనాదులో పద్యములో వ్రాసియుండకపోరు. కాని యట్టివేవియుఁ గనరావు, వినరావు. ధూర్జటిఁగూర్చి నిజమున్నను లేకున్నను, "స్తుతమతియైన యాంధ్రకవి ధూర్జటిపల్కులకేలగల్గె నీ యతులిత మాధురీమహిమ హా తెలిసెన్" అను పద్యమును బారంపర్యముగ లోకము మోసికొని వచ్చుచున్నది. కావున శ్రీనాథునికాలములో నాతని శీలమునుగూర్చి యపప్రథయేమియు నుండినట్లు కానరాదు. శ్రీనాథుఁడు స్త్రీలోలుఁడనువారందుకు సాధకముగ, నాతనివనిచెప్పు చాటువులనే యుదాహరింతురు. గాని తత్సూచకముగ నితరు లాతనిఁగూర్చిచెప్పిన పద్యమొక్కటియు నుదాహరింపఁజాలకున్నారు. ఈసందర్భమున నేను సామాన్యదృష్టితో శృంగార శ్రీనాథ విమర్శనములో "ఎట్టి జారుడయినను దన దుశ్చారిత్రము తానే ప్రకటించుకొనుచుఁ బద్యములు వ్రాయునా?'' అను వాక్యముపయి శ్రీ ప్రభాకరశాస్త్రిగారు క్రీడాభిరామపీఠికలో విశేషవిమర్శనమొనర్చి, యిందుకు లోకజ్ఞతచాల నవసరమనియు మానవప్రకృతి వివిధరీతులు గలదవుటచేఁ దమ దుశ్చారిత్రమును దామే వెల్లడించుకొనువారుకూడఁ గలరనియు వ్రాసి యిందుకు నిదర్శనముగా కీర్తిశేషులు విద్వాన్ అభి

నవ పండితరాయ బిరుదాంకితులు శ్రీమార్గ మాడభూషి వేంకటాచార్యులుగారు రామామణియను వేశ్యపైఁ జెప్పిన చాటువుల నుదాహరించినారు. నేను వ్రాసినవాక్యము సామాన్యవిధి ననుసరించినది. ప్రతివిధికి నపవాదములుండకపోవు. ఇందుకై శాస్త్రిగారేనాఁడో పరమపదించిన వేంకటాచార్యులుగారికి భిక్షావందన మాచరించుట యనవసరము. తమ వేశ్యాసాంగత్యము నాచార్యభూమికతో గ్రంథరూపమున వెలయించుకొనిన శాస్త్రులుగూడ నేఁడున్నారు. ఇట్టివానినిబట్టి శ్రీనాథుఁడుగూడ నట్టివాఁడేయని, యాతని యూరుపేరులేని పద్యముల నాతని కారోపించి వాని ననుసరించి యాతని శీలమును నిర్ణయించు సిద్ధాంతములు శాశ్వతములుగా నుండఁదగు గ్రంథములలోఁ జేయరాదనియే నా వాదము.

ఇఁక శ్రీనాథునిగ్రంథములఁ దిలకించినచో నవి యాతనియెడ నీదోషము నారోపించుట కెంతమాత్రము సాధకములుగావనియే నాయభిప్రాయము. సుప్రసిద్ధకవులు పెక్కురవలెనే యీతఁడు గూడ శృంగారరసప్రియుఁడవుట నిక్కువము. శ్రీ ప్రభాకర శాస్త్రిగారుద్దేశించిన యర్థమునగాక "శృంగారీ కవిశ్చేత్కావ్యం రసమయం జగత్" అను నిర్వచనముప్రకారమాతనిని శృంగారియని నిరూపించుట కెట్టియభ్యంతరమును లేదు. మొత్తముమీద నాతనిగ్రంథములు పరమ శివభక్తి ప్రబోధకములు. భక్తిరసప్రదర్శనములోఁగూడ నెడనెడమిళితమయిన శృంగారము భక్తిశృంగారమేగాని కేవలము రక్తిశృంగారముకాదు. శ్రీనాథుని గ్రంథములలో వ్యభిచారాది దురాచారములు కేలిసేయఁబడి దుర్నీతి ఖండింపబడినదేగాని, మెచ్చుటను బోషింపఁబడలేదు. శివరాత్రిమాహాత్మ్యములో "కాయజ విక్రియంబడయు గానికలంబున నుద్భవించి, యన్యాయము సేయునే యిటు దురాత్ముఁడు వీఁడు త్రపాభిమానముల్ మాయఁగఁదట్టితాంచు" అని యాతఁడున్నతనీతిని బోధించి బ్రాహ్మణుల కంగజవిశ్రుతి పనికిరాదని యుద్ఘోషించినాఁడు. క్రీడాభిరామములో శ్రీకాకుళాంధ్రదేవుని తిరునాళ్ళలో జరుగు దుర్వర్తనములు కేలిసేయఁబడి నిరసింపఁబడినవి. ఆ గ్రంథము సాంఘికదురాచారములఁ బ్రకటించి నిరసించుటకేర్పడిన హాస్యగ్రంథమేగాని దుర్నీతిని వ్యాప్తిచేయుట కుద్దేశింపఁబడినదికాదు. శృంగారనైషధములో నశ్లీలపద్యము లొండు రెండున్నను వానికుత్తరవాది మూలగ్రంథకర్తయగు శ్రీహర్షుఁడేగాని శ్రీనాథుఁడుకాదు. హరవిలాసములో దారుకావనవిహారసందర్భమునఁ బ్రయుక్తమయిన శృంగారముకూడ దానికి మూలమగు శివపురాణాదులలోని కథయందలి వర్ణనల ననుకరణమేగాని శ్రీనాథుఁడు నిరంకుశముగా స్వయముగఁ

దెచ్చిపెట్టినదికాదని నాయభిప్రాయము. (వలయువారు సంస్కృత బ్రహ్మాండపురాణ మందలి దారుకా వనవిహార కథఁ జూచునది.) శ్రీనాథుని వేశ్యాప్రియత్వమునకు భీమ ఖండమందలి వేశ్యా వర్ణాదికము సాధకమని తలఁచుట శోచనీయము. ఇంద్రుఁడు దక్షారామ భీమేశ్వరునకు భీమమండలము ధారవోయునప్పు డాతనినిత్యకైంకర్యమునకై యేఁబదిమంది యప్సరస్త్రీలఁగూడ నర్పించెనని సంస్కృత భీమేశ్వరపురాణమునఁ జెప్పఁ బడి యందలి ద్వాత్రింశాధ్యాయమున వారిసౌందర్యము, నృత్తగీతాది పాండిత్యము భక్తిసేవాపరతంత్రత మున్నగునవి విశేషముగ వర్ణింపబడినవి. భీమఖండము మూఁడవయాశ్వా సములో 77–79 పద్యగద్యములలో శ్రీనాథుఁడు వానిననువదించినాఁడు. ఈవిషయమునే కాశీఖండములోఁగూడ "మహిత భక్తినే భామల మనుమరాండ్ర, దక్షిణానంద వనమహాస్థానపతికి। భీమనాథేశ్వరునకు సుత్రాముఁడొసఁగె"॥ అని యుదాహరించి నాఁడు. దీనిని బురస్కరించుకొనియే ప్రథమాశ్వాసమందలి యవతారికలో స్వతంత్ర ముగ నొనర్చిన దక్షారామపురవర్ణములో నీవేశ్యాంగనలా క్షేత్రపరివారగణములోని వారేకావున వారినిఁగూడ జేర్చి వర్ణింపవలసినవాడయ్యెను. ఆపురములో సానులు తప్ప బ్రహ్మక్షత్రియవైశ్యశూద్రు లెవ్వరును లేనట్టుగా నొక్క సానులనుమాత్రమే యత్యధికముగా శ్రీనాథుఁడు బహుపద్యములలోన వర్ణించె ననియును, వారి నెప్పుడు వర్ణించినను వారి గౌరవమునకుం గొఱఁతరాకుండునట్లుగా, సాధారణముగా వారికి గంధర్వాప్సరోభామినీత్యాది విశేషణముల నాతఁడు ప్రయోగించుననియు, శ్రీ వీరేశలింగ ముపంతులుగారు వ్రాయుట యవిచారమూలకము. దక్షపురియందలి సాను లింద్రుఁడు మొదట నొసంగిన గంధర్వాప్సరస్త్రీసంతతివారగుటచే నెడనెడ శ్రీనాథుఁడు వారికి పైవిశేషణములను బ్రయోగించెనేగాని వారు సానులేయనుమాట యెచ్చటను దాఁచిపె ట్టలేదు సరికదా,? "సానులనుపేరి యప్సరశ్చంద్రముఖులు" (ఆ 1 ప 79) "సానియౌ శానిమై మహోత్సవమునందు" (ఆ 1 ప 104) "దక్షపురిసానికూఁతుల దవిలినాఁడు" (ఆ 1 ప 111) సానివాడకరుగఁ (ఆ 1 ప 111) సాని పెండ్లియెప్పుడు (ఆ1 ప 112) సానికూఁతుల పల్లవోష్ఠములఁబోలు (ఆ 5 ప 110) నిలింప గంధర్వాప్సరోభామినులగు సానికూఁతులు గొలువ (ఆ 1 ప 117) ఆవంశమ్మున సానికూఁతురులు (ఆ 6 ప 78) ఇత్యాదిగాఁబలుచోట్లుల దానిని బాహాటముగాఁ జాటినాఁడు. భీమఖండపురాణ మవు టచేఁ ప్రబంధపుర వర్ణనమున కంగములగు బ్రాహ్మక్షత్రియ వైశ్యశూద్రాదివర్ణనము శ్రీనాథునకిట నవసరములేదు. ఆపురమందలి దైవతములతోపాటు పయినిచెప్పినట్టు పరి

వారగణములోనివారవుట దేవదాసీగణము నభివర్ణించెనేగాని యామహాక్షేత్రమందలి తక్కిన వారలెల్ల నాతనిదృష్టిలో ప్రమథగణములగు మహేశ్వరమూర్తులే. కావుననే యొక్కపద్యములో వారినిట్లు వర్ణించినాఁడు. "ఏదెసఁజూచినన్ విబుధు లేదెసఁజూచిన మౌనిమండలం । బేదెసఁజూచినన్ హరిదధీశ్వరవర్గము వాసవాదియుం । దేదెసఁజూచిన న్నవమహేశ్వరమూర్తులు శ్రీనికుంభకుం । భోదరతండు భృంగిరిటి హూహూహహాహులు దక్షవాటికన్"॥ "వర్తనంబెల్ల శంభుసేవావ్రతంబు, మాటలెల్లఁ బంచాక్షరీ మంత్రరాశి । భోగమోక్షనివాసైక భూమియైన । దక్షపురినున్న జనులకో తలిరుబోఁణి॥ (భీమ అ 6 ప 39) శ్రీనాథుని శివభక్తిలో లవలేశమయిననేని మనబోటులాతని వర్ణనలందలి పరమార్థమును గ్రహింపక పయిగ నాతనిఁ బరిహసించుట పరమాపచారము. **

దక్షారామమందలి వేశ్యలానాఁడు భీమేశ్వరునిఁ ద్రిసంధ్యమును బరమభక్తితో గొలుచుచుండుటచే నీ స్వామిభక్త సంబంధమును భాగవతమందలి శ్రీకృష్ణ గోపికా సంబంధమువలె శ్రీనాథుఁ డౌపచారికముగ భార్యాభర్తృ సంబంధముగ నొండు రెండు చోటుల నభివర్ణించినాఁడు. అంతియేగాని కొందఱనునట్లు తనకున్న సానితగులము నీశానున కంటఁగట్టలేదు. "దక్షపురి సానికూఁతుల దవిలినాఁడు" (అ 1 ప 110) "దక్షవాటికా కటక విలాసినీ విటశిఖామణికిన్" (ఆ 6 ప 65) అను ప్రయోగములందలి భావార్థమిదియే. అట్లేగాకున్న నెట్టిమూఢుఁడైన శిలారూపముననున్న శివలింగముతో వారికిఁ గామసంబంధమును గల్పించునా? మఱియు "పదునాల్గు మహాయుగముల । ముదుకగు భీమేశ్వరునకు మొగచాలైయుం । దదు సానిపెండ్లియెప్పుడు । నది దక్షారామ మహిమ యగునో కాదో॥ (ఆ 1 ప 112)" అను పద్యమునుబట్టి యానాఁడు స్వామి కళ్యాణసందర్భమునఁ బ్రతివత్సరము భీమేశ్వరునకు దేవదాసీలలో నొకసానికిఁ గన్నె పెండ్లి తంతుజరుపు నాచారమొకటి ప్రబలుచున్నట్లు గోచరించును. దానిని బురస్కరించుకొనియే యీశాని (శివునిభార్య) యైన యీసాని నటరాజమూర్తియు నాదిభిక్షువు నగు నాతని ధర్మమును స్వీకరించి యాస్వామి మహోత్సవదినములలో భిక్షుకురాలి వేషముతో వీథులలో నృత్యమొనర్చుచు నింటింట బిచ్చమెత్తుచుండినట్లుకూడఁ గానవచ్చును. ఈ క్రిందిపద్యమును దిలకింపుఁడు.

---

** భీమఖండమునను దరువాత వ్రాసిన గ్రంథములందును శ్రీనాథుఁడు దక్షారామవేశ్యలను బ్రశంసించినది వేములవాడ భీమకవివలె నీతఁడుగూడ వారి నృత్తగీతాది పాండిత్యముల కెంతయు సంతసించియుండుటచేతనేయని బుద్ధిమంతులకుఁ జెప్పనక్కఱలేదు. అగస్త్యుఁడు కాశివిడిచి దక్షిణాపథమునకు వచ్చి దక్షారామ

సీ॥ విరులదండలతోడి వేణికాభారంబు పొంకంబుపిఱుఁదులఁ బొదలికూడ, మణి తులాకోటి కోమలఝణత్కారంబుఁ గవలి మట్టెల మ్రోఁత యవఘళింప, కుదురునిండినచిన్ని గుబ్బచన్నులమీఁద ముత్యాలతిరసరంబు మురువుఁజూప, వలమాన తాటంక వజ్రాంకుర చ్ఛాయ లేతవెన్నెలఁ బుక్కిలించియుమియ, గీ॥ సానియాకాసనియై మహోత్సవము నందుఁ। గేలనవచంద్రకాంతంపు గిన్నెఁ బూని। పిధిభిక్షాటన మొనర్ప వేళఁ జేయు। మరుల నృత్యంబు జగముల మరులుకొలుపు॥ (ఆ 1 ప 104) ఇంతేకాక భీమేశ్వరుని యుత్సవవిగ్రహము నాదినములలోఁ బెండ్లియైన యాసానియింటికి రాత్రులందుఁ బడకకుఁ బంపుచుండునట్లును గాననగును. చూడుఁడు "మ॥ ఎనయంగల్గినకూర్మి........ కన్నెరుకాదారి పొద్దున భీమేశుఁడు సానివాడ కరుగున్ ధూర్తప్రకారంబునన్" (ఆ 1 ప 111) సీ॥ గజచర్మమెన్నఁడో గాని నిచ్చలుగట్టు పసిడికమ్ములపట్టు పచ్చడంబు॥ (ఆ 1 ప 115) ఈయాచారము నిరసించి కేలియొనర్చుటకే పయిపద్యములను శ్రీనాథుఁడు రచించెనని నా తలంపు. "అది దక్షారామమహిమగునో కాదో" "ధూర్తప్రకారంబునన్" అను పదములు పరిహాసోద్దేశముననే ప్రకటింపనేర్చును. ఇట్టిసంగతులు పర్యాలోచింపక శ్రీనాథుఁడు తాను దక్షారామవేశ్యల వలచినవాఁడవుటచేఁ దనసంబంధమును దేవునకుఁగూడ నంటఁగట్టెనని విమర్శకులు వ్రాయుట యుచితముకాదు. ("సమర్థస్య హి దేవరాట్") అనుచో "దేవరాట్" శబ్దమును శ్రీనాథుఁడు దేవవేశ్యాభుజంగుఁడని యాంధ్రీకరించుట శ్రీ వీరేశలింగము పంతులుగారి దృష్టిలో నసభ్యమయ్యెను. ఆ కాలపు గ్రంథములలోను శాసనములలోను రాజులకు రాజమంత్రులకుఁ బ్రయుక్తమైన "రాయవేశ్యాభుజంగ" విశేషణముపయి దానికి స్ఫోరకమని పంతులుగారు గుర్తింపకుండుట శోచనీయము. కాని శ్రీ ప్రభాకరశాస్త్రిగారు దీనిని సంభావించుట ముదావహము.

భీమఖండ కాశీఖండములలో బెండపూడియన్న మంత్రిని వీరభద్రారెడ్డిని వర్ణించుసందర్భములలో వారి సౌందర్యనిరూపణముకై "మహిళాపాంచాల రమణీప్రద్యుమ్న

---

క్షేత్రమును సందర్శించినప్పుడాతఁడుకూడ నీ వేశ్యామణుల యీ పాండిత్యమునకు మెచ్చినట్లు శ్రీనాథుఁడు కాశీఖండములో వ్రాసిన

మ॥ మునిచూడామణి యెల్ల సత్కళలకున్ మూర్ధాభిషిక్తుండుగా।
వునఁ జారీకరణాంగహారముల తావున్ మెచ్చి కీర్తించుచున్।
శనివారోత్సవ మాచరించి కసెనాస్థానంబునన్ రాజనం।
దనయుం దానును దేశిమార్గమునగం ధర్వాప్సరోనృత్తమున్॥

అను పద్యముకూడ నిందుకు నిదర్శనము కాఁగలదు.

భావభవాకార" మున్నగు విశేషణములతోపాటు శ్రీనాథుఁడీ క్రింది విశేషణములను వ్రాసియున్నాఁడు.

శా॥ కాంచీకంకణ తారహారకటక గ్రైవేయ భూషావళుల్,
లంచంబిత్తురు దూతికాతతికి లీలన్ బెండపూడన్నికిన్
బంచాస్త్రోపముఁ దారతారకవయన్ బ్రార్థించి లోలోపలన్
బంచారామములందుఁ బల్వెలపురిం బ్రౌఢేందుబింబావనల్.

(ఆ 1 ప 77)

క॥ పంచారామవధూటీ, పంచాస్త్రవిహార కేళి పాంచాలునకున్॥ (అ 1 ప 80)

క॥ దక్షారామ వధూటీ వక్షోరుహ మృగమదాది వాంఛిత విలసద్వక్షః కవాట (ఆ 3 ప 227) క॥ వేశ్యాకటాక్ష దీక్షావశ్య విహారాపహసిత వాసవతనయా (ఆ 4 ప 212).

## కాశీఖండము.

క॥ పంచారామ వధూటీ పాంచాల (అ 3 ప 247)

శా॥ దక్షారామ ప్రమదా కఠోర కుచకుంభాభోగ సంక్లిప్త కస్తూరీ స్థాసక ముద్రిత స్థగిత వక్షోవీథికాభ్యంతరా (ఆ 1 ప 140) శా॥ దక్షారామ ప్రమదాకటాక్షలహరీ వ్యాపారనీరాజితా । కారశ్రీజిత మత్స్యకేతన॥ (ఆ 5 ప 337)" ఇందలి పరమార్థమును గ్రహింపక శ్రీనాథుని వేశ్యాలోలత్వమునకివి కూడ సాధకములనియు నా కాలములో వేశ్యాసంపర్కము పెద్దపదవులందున్నవారికి దోషముగాక ప్రతిష్ఠావహముగనే పరిగణింపఁబడుచుండెననియుఁ గావుననే యిట్టి వర్ణనలాకృతినాయకులకు సహ్యము లయ్యెనని యుఁ బంతులుగారు ప్రభాకరశాస్త్రిగారు కూడఁ దలంచుట శోచనీయము. దోషమే కాలమందును దోషమే యగుఁగాని గుణము కానేరదు. ఉల్లి యొకకాలమున సువాసనయు మఱొకకాలమున దుర్వాసనయు సంభవింపవు. పణ్యస్త్రీసాంగత్యమును బూర్వులు ప్రతిష్ఠావహముగనే పరిగణించినచో "పణ్యస్త్రీణాం ప్రత్యక్షరాక్షసాం" అను నిర్వచనములకు ప్రసక్తియే లేకుండవలెను. శ్రీనాథునికి మఱొకశతాబ్దితరువాతనున్న ధూర్జటిగూర్చి పరిహాసపూర్వకముగఁ బూర్వోక్తమువంటి పద్యము రచింపఁబడుట కవకాశమే కానరాదు. ఉన్నవారికి వేశ్యాసంపర్కమే కాలమందును నున్నది. కాని దానికేకాలమున నగౌరవమును బూర్వకాలమున గౌరవము నుండెనని మన కవులగ్రంథముల వర్ణనలందలి

భావముల గుర్తింపక సిద్ధాంతిమొనర్చుట సరిగాదు. ఆలంకారికులు నాయకగుణములలో "ఔజ్జ్వల్యము" ఒకటిగాఁ బ్రతిపాదించిరి. దీనిని దమ కృతినాయకులకు ఘటించుటలో మనకవులు పలుమార్గములఁ ద్రొక్కిరి. "నారీమన్మథ" "కామినీ పంచబాణ" మున్నగు సామాన్య విశేషణములు పరిపాటిగఁ గవులందఱు నుపయోగించెడివే. కావుననే "మంటి బహువత్సరమ్ములు" అని చెప్పికొనిన యువది తిప్పయసెట్టివంటి వయోవృద్ధుని వర్ణించుటలోఁ గూడ "లలనాజనతా ఝషలక్ష్మనిభా!" "కామినీహృద్యమూర్తీ" మున్నగు విశేషణములకూర్చుట శ్రీనాథుని కావశ్యకమయ్యెను. నిక్కమగు వలపునెఱుఁగక పురుషుని సౌందర్యమునుగూర్చిగాక ధనమునే వలచి యాతనిని సేవనమొనర్చుకొనుట వేశ్యాధర్మము. కావుననే పణ్యస్త్రీ రూపాజీవశబ్దములు వారికి నామాంతరములయ్యెను.

ఇందుచే సామాన్యస్త్రీలుగాక వేశ్యలుగూడ వలచునంతటి సౌందర్యముగలవారిని వర్ణించుటలోఁ గృతినాయకుల యౌజ్జ్వల్యమున కౌత్కృష్ట్యము నాపాదించుటయే శ్రీనాథుని యభిమతముకాని మఱొకటికాదు. కవులు నిరంకుశులు కావున వర్ణనలు భిన్నభిన్నమార్గముల నడచుట సాజముగాని భావమొక్కటియే. పయిపద్యములలో శ్రీనాథుఁ డుద్దేశించిన దక్షారామ ప్రమదామణులు, పంచారామవిలాసినులు, వేశ్యలేగాని కొందఱు తలంచినట్లు లాక్షేత్రములందలి పుణ్యాంగనలు కారు. వారిపాతివ్రత్యమునఁ గాతఁడెట్టి మాలిన్యమునుఁ గూర్పలేదు. ఈవేశ్యలుతిమ్మంతట తాము వలచియున్న మంత్రి పొందుగూర్చుటకయి తమ దూతికాతతికి లంచములిచ్చుచున్నారని వర్ణించుటలో నాతని సౌందర్యాతిశయముతోపాటు వారి మాయోపాయములకు వశ్యముకానేరని యాతని ధీరహృదయముకూడ సూచితమగునేకాని వేఱుకాదు. కావున వినివలన శ్రీనాథుఁడు వేశ్యాసాంగత్యము నామోదించువాఁడనికాని, తన కృతినాయకులను వేశ్యాలంపటులుగ నిరూపించుట యాతని యభిమతమనికాని సహృదయులు తలంపకుందురుగాక. ఇట్టివర్ణన లితరగ్రంథములందును గలవు. ఈ క్రింది దృష్టాంతములఁ దిలకింపుఁడు.

కం॥ బాలరతికేళీ పాంచాల (మారన మార్కండేయపురాణము ఆ-1 ప-233)

ఉ॥ వారవిలాసినీ వదన వారిజమిత్ర (మా॥ మార్కండేయ పు॥ ఆ-7 ప-284)

ఉ॥ సుముఖీజనరంజన! కామకేళీ పాంచాల! సముల్లసత్కుసుమ సాయకశాస్త్ర కళావిశారదా॥ (జక్కన విక్రమార్క చరిత్ర).

శా॥ సేవాళీకుంకుమ పంకలిప్త కుచకుంభ న్యస్త హస్తాంబుజా (ఆ-8 ప-240 పిన వీరన జైమినీభారతము)

క॥ శ్రీమత్కుసుమ శరోపమ । సామగ్రీ జనితహృదయ సంజ్వరవిలుఠ । ద్భామాసఖి సమర్చిత । కోమల చరణాభిరామ కోమటివేమా !॥ (ఎఱ్ఱాప్రెగడ హరివంశము ఆ-8 ప-1) దీనిపయి వ్యాఖ్యాన మనవసరము. ఎఱ్ఱాప్రెగడ ప్రోలయవేమునిం గూర్చి చెప్పిన పైపద్యము శ్రీనాథునివర్ణనలను దలందన్నుచున్నది. పరమమాహేశ్వరాచార సంపన్నులగు వారిరువురిశీలమునుగూర్చి యెవరికి నెట్టిసంశయమును లేదుగదా? కావున శ్రీనాథుని గ్రంథములందలి వర్ణనలంబట్టియే యైనచో నాతనియొక్కయు నాతని కృతినాయకులయొక్కయు శీలమునుగూడ నట్లే సంభవించుట సమంజసము. ***

*** చాటుపద్యములమాట యటుండ శ్రీనాథుని శీలమును నిరూపించుట కాతని గ్రంథములలోని పద్యములుకూడం గొంత తోడ్పడునని శ్రీ ప్రభాకరశాస్త్రిగారు క్రీడాభిరామపీఠికలో నొకింత ముచ్చటించి యీ క్రింది యుదాహరణముల నొసంగిరి.

(1) కాశీఖండములో శివశర్మోపాఖ్యానములోం గాంచీపురవర్ణనములో మూలవిరుద్ధముగ "ముదువంగ నేత్తురు మూలదాపటికిరాం జిమనబంధము వీంగ జీరువాఱ" అను కంచియువతులంగూర్చిన సీసపద్యమును జేర్చుట.

(2) కాశీఖండములోనే దక్షాధ్వర ధ్వంససందర్భములో యాగమునకువచ్చిన దేవతలను వీరభద్రునిచే దిట్టించుటలో "శితికంఠునకును నెచ్చెలికాండు గాండొకో యటమటీండైన యీ యక్షభర్త"......ఇత్యాది సీసపద్యము గీతిలో "ఏమి గుడువంగవచ్చినా రిండ్లువిడిచి । హరుని వెలివెట్టునట్టి యీ యాగమునకు" అని ప్రౌఢముగ వ్రాసి యశ్లీలార్థమును స్ఫురింపంజేయుట.

(3) హరవిలాసమున మాయాకిరాతవేషమునమన్న శివునిచే నర్జునుని "వెండిప్రయోజన మేమీ! రండాసుత! దీనిపై శరము నిగుడింపను" అని తిట్టించుట.

(4) శివరాత్రిమాహాత్మ్యములో సుకుమారునకుం జండాలాంగనలతోడి సాంగత్యము వర్ణించుటలో నౌచిత్యము పాటింపకుండుట. కంచియువతులంగూర్చిన పద్యము శ్రీనాథుని చాటువయియుండుననియు నది పముంగా నున్నచో నశించునేమోయని తలంపుతో నందలి లోభముచే దానిని బ్రసక్తిలేకున్నను గాంచీక్షేత్రవర్ణనలలో మూలము లేకున్నను శ్రీనాథుండు కాశీఖండములోం జేర్చెననియు శాస్త్రిగారు శృంగార శ్రీనాథములో సమాధానమును జెప్పియేయున్నారు. దీనివలన నాతని శీలమునకు మాలిన్యమెట్లొదవునో? ఇంతకు దీనిని శ్రీనాథుండే బుద్ధిపూర్వకముగం జేర్చెనో లేక దానిని శ్రీనాథుని చాటువుగా నెంచు లేఖకులే చేర్చిరో నిజము దైవమునకెఱుక.

శ్రీ శాస్త్రిగారుచెప్పినట్లు "ఏమిగుడువంగవచ్చినారు" అను పద్యమును శ్రీనాథుండు వీరభద్రునినోటం బలికించలేదు. ఈశ్వరునివద్ద సెలవుగైకొన్నతడవుగ వీరభద్రుండు దక్షునియాగవాటికకేతెంచివచ్చియు వచ్చుటతోడనే యచ్చటి సభ్యులకె దండప్రహారముల తో సంభావనలు వడ్డించుటకే పూనుకొనెను. అతండు నాతనిభటులు కొట్టుటకేగాని తిట్టులకేమాత్రము దొరకొనలేదు. ఇంక శాస్త్రిగారు సెలవిచ్చినపద్యము దానికి ముందు వెనుకలనున్న యితరపద్యములు "పరమమహేశ్వరుండు దధీచుండను విప్రర్షి" పలికినవే గాని మఱొకటికాదు. శాస్త్రిగారు కాశీఖండమును జక్కంగం జిత్తగింతురుగాక. ఇంతకు నీపద్యమును శ్రీనాథుండు

## శ్రీనాథునికవిత.

ఇది సర్వజనహృదయంగమమయినది. దీనిఁగూర్చి భేదాభిప్రాయములు లేవు. కావున నిందువిషయమయి విశేషచర్చలోనర్పవలసిన యవసరము లేదు. శ్రీనాథుఁడు తన గ్రంథములలోఁ గవితాలక్షణములఁగూర్చినవివరము లంతగా వ్రాసియుండలేదు. పూర్వాచారము ననుసరించి పూర్వకవుల స్తుతియించుటయేగాని కుకవిదూషణమునకుఁ గూడ నాతఁడు పూనుకొనలేదు. కొండవీటినుండి రాజమహేంద్రవరమునకుఁ గ్రొత్తగా వచ్చినప్పు డచ్చటిపండితులు, కవులు మత్సరగ్రస్తులయి యాతని కవితాపాండిత్యములఁ గూర్చి కొంత యసహనమును వ్యక్తపఱుపగా నప్పుడుమాత్రము వ్యంగ్యమర్యాద ననుసరించి తన్నిరాకరణరూపముగఁ గొన్ని పద్యములాతఁడు భీమఖండావతారికలో రచించినట్లు గోచరించును. ఈసందర్భముననే కొన్ని పద్యములు గవిత్వలక్షణమునుగూర్చియుఁ దనకవితనుగూర్చియు వ్రాసియున్నాఁడు. ఇతనిహృదయమునలరించు కవితాస్వరూప మీక్రిందిపద్యమున ద్యోతకమగును.

మ॥ హరచూడా హరిణాంక వక్రతయుఁ గాలాంతస్స్ఫుర చ్చండికా।
పరుషోద్గాఢ పయోధర స్ఫుటతటీ పర్యంతకాఠిన్యమున్।
సరసత్వంబును సంభవించె ననఁగా సత్కావ్యముల్ దిక్కులన్।
జిరకాలంబు నటించుచుండుఁ గవిరాజీ గేహరంగంబులన్॥

---

ఋషిసత్తముఁడగు దధీచిచేతఁ బలికించినను రౌద్రమూర్తియగు వీరభద్రునిచేఁ బలికించినను "కుడుచు" అను పద్యమును వ్యంగ్యముగ నాతఁడు శాస్త్రిగారుద్దేశించిన యశ్లీలార్థముననే యుపయోగించినను వారేమరల సెలవిచ్చినట్లు దానివలన నాతని ప్రౌఢత, కవిసార్వభౌమత్వము వ్యక్తము కాఁగలవేకాని యది యాతని శీలమునకు రవంతయుఁ గొఱంతగలిగింపదని నాయభిప్రాయము.

కిరాతార్జునీయములో "రంభానుత"యను నిందావాచకముకూడ నిట్టిదే దీనిపయి వ్యాఖ్యాన మనవసరము. శ్రీనాథుని శీలమునకది కళంకదాయకము కాఁజాలదు. అది యాతని ప్రౌఢతనమునే మెఱయించును.

శివరాత్రిమాహాత్మ్యములో సుకుమారునకు జండాలాంగనాసాంగత్యమును గల్పించి దానినింపుక జుగుప్సాకరముగ వర్ణించుటలో శ్రీనాథుని యుద్దేశ మెట్టి తలఁపరాని పాపములయినను దుష్కార్యములయినను శివరాత్రియందు శివసందర్శనమువలనఁ బటాపంచలగునని చెప్పి తన్మూలమున శివరాత్రి మాహాత్మ్యమునఁ గౌత్కృష్ట్యము నాపాదించుటయేగాని యశ్లీలశృంగారమును వర్ణించి యుబలాటమును దీర్చుకొనుటకుఁగాదు. ఇది దోషమే యగుచోఁ బురాణకర్తలు పలువు రందుకు గుఱికావలసినవారే. అది యొక్క శ్రీనాథునకే పట్టలేదు. ఇంతకు దీనిని శ్రీనాథుఁడే స్వయముగఁ దెచ్చిపెట్టెనా? మూలమగు నీశానసంహితలో సుకుమారునకు జనంగమప్రమదతోడి కూటమి యసలు కూర్పఁబడనేలేదా! ఏదియెట్లున్నను శాస్త్రిగారు తలంచినట్టులిది శ్రీనాథుని శీలమును నింద్యమొనర్ప నేరదని సహృదయులకుఁ జెప్పనవసరములేదు,

వక్రత, వ్యంగ్యము, ధ్వనియనునవి యాలంకారికమతములో నించుమించుగఁ పర్యాయపదములుగఁ బరిగణింపవచ్చును. కుంతకుఁడను నాలంకారికుఁడు వక్రోక్తికి గొంత విలక్షణత యొసఁగి "వక్రోక్తిజీవితము" అను గ్రంథము రచించినాఁడు. శ్రీనాథు డుద్దేశించిన వక్రత కుంతకుని మతము ననుసరించినదేయని కొందఱ యభిప్రాయము.

శ్రీనాథుఁ డుద్దేశించిన కాఠిన్యము గాఢసమాసబంధమని యెంచనగును. ఈతని గ్రంథములలోఁ బలుతావుల నది ప్రత్యక్షమగుచుండును. శ్రీనాథుని కవితయందలి యీ గుణవిశేషమునుగూర్చి రాధామాధవకవిగూడ నిట్లు స్తుతియించినాఁడు.

"సూనాస్త్ర ప్రమదా మదస్ఫురిత వక్షోజాత కాఠిన్యమున్। బూనంజాలు వచో
విలాసముల నేర్పుల్ సూపి కర్ణాటక। క్ష్మానాథేంద్రు సభన్ గవిత్వ విజయోత్సా
హంబు గైకొన్న మా। శ్రీనాథుం గవిసార్వభౌముఁ గొలుతున్ సేవాంజలుల్ గీల్కొ
నన్॥ ప్రౌఢదేవరాయల యాస్థానమున డిండిమభట్టు నోడించినప్పుడీ కాఠిన్యగుణంబు కలిమినే శ్రీనాథుఁడు కవిత్వవిజయమును గైకొనినట్లు పయిపద్యముఁబట్టి యూహింపవగును. అరుణగిరినాథుఁ డెంతపండితుఁడైనను నిట్టికవితజెప్పుటలో శ్రీనాథునకు బెండువడి యుండును. అన్నిటికంటె శ్రీనాథునకు హృదయంగమమయినది సరసత్వము. అదిలేని కవిత తక్కినగుణము లెన్నియున్నను రాణింపనేరదు. ధ్వనికాఠిన్యములు కావ్యమునఁ బ్రతిపద్యమున నెలకొల్పుట సులువుకాదు. అదియంతగా నవసరముగూడఁగాదు. వాని కతివ్యాప్తి కల్గినచోఁ గావ్యము వన్నెకెక్కఁజాలదు. కవిత్వమునకుఁ బ్రాణమనదగినది రసమే. బ్రహ్మానందమువలెనే రసస్వరూపముగూడ ననిర్వచనీయము. అది యనుభవైకవేద్యము. ఏభాషలోఁజెప్పినను సమర్థుఁడైనకవి మృదుమధుర పదసమ్మేళనమొనర్చు విన్నాణమువలననే ముఖ్యముగాఁ దనకవిత్వమున సరసత్వమును సంఘటించుచుండును. శ్రీనాథుఁ డిందు సిద్ధహస్తుఁడు. అతఁడేపద్యముఁజెప్పినను పదములఁగూర్చు వైఖరినిబట్టి యం దనిర్వచనీయమగు రససంపత్తి వెల్లివిరియుచుండును. కావుననే రసికకవివతంసుఁడగు రఘునాథభూపాలుఁ డీతనిగ్రంథముల నిట్లు స్తుతియించినాఁడు.

శా॥ సందర్భంబున వార్థగర్భమగుచున్ జాటుక్రియన్ మించఁగా। జిందుల్ ద్రొ
క్కుచు నిండియుంతట రస శ్రీమెచ్చు గొల్పంగనా। నందాంభోధి తరంగముల్ బలె ప్రబం
ధంబుల్ భువిన్నిల్పి దా। నం దెల్లంబుగఁ గీర్తిగాంచిమను శ్రీనాథున్ బ్రశంసించెదన్॥

కావ్యరచనమున శ్రీనాథుని మదికినెప్పుడు హెచ్చుగనచ్చినది యీ సరసత్వమే. రాజమహేంద్రవరమున కీతఁడు వచ్చినప్పు డసూయగొనిన యచ్చటిపండితులలో నితని

కవితగూర్చి గుసగుసలు బయలుదేఱియుండును. శృంగారనైషధము నుద్దేశించి కొందఱి తనికి సంస్కృతమందున్న పాండిత్యము తెలుఁగులో లేదని, హరవిలాసాదులఁ దిలకించిన వారికితనికి తెలుఁగులో నున్నంత ప్రవేశము సంస్కృతములో లేదని ఇత్యాదిగా సందర్భ రహితముగ వాకొనియుందురు. అట్టివారినుద్దేశించియే శ్రీనాథుఁడీ క్రిందిపద్యమును చెప్పియుండును. "ప్రౌఢి బరికింప సంస్కృతభాషయందు। పలుకు నుడికారమున నాంధ్ర భాషయందు। నెవ్వరేమన్న నందు గాకేమికొఱఁత। నాకవిత్వంబు నిజము కర్ణాటభాష॥ ఇందు నాల్గవపాదములో హరచూడాహరిణాంకవక్రతద్యోతకమగుచున్నది. ఈపండితులు వాకొనునట్లు నాకవిత్వ మాంధ్రగీర్వాణములు రెంటిలో నేదియుంగాదు. మఱి యందుకు విలక్షణముగ మూఁడవది కర్ణాటము. (కన్నడము అని పరిహాసపూర్వకమగు బాహ్యార్థ మును నేఁజెప్పినది సంస్కృతముగానిందు, తెలుగుకానిందు ఏదిచెప్పినను రసప్రధానమై (గర్ణములలో హాయిగఁ బ్రవేశించి) వీనులకు విందుగొల్పుచు హృదయమున కానంద మును గూర్చునదియే నాకవితయను నాంతరంగికార్థమును నిందు ధ్వనించుచున్నదని నాయభిప్రాయము. శాశ్వతముగ నిలుచు సరసగ్రంథముల రచింపనేరక స్వపాండిత్య ప్రకటనార్థ మేవియో గడబిడగలశబ్దములతో శ్లోకములనో పద్యములనో చెప్పి జీవించు శుష్కపండితులగూర్చి కాఁబోలు నాసందర్భమున నే యీ క్రిందిపద్యము నాతఁడు చెప్పినాఁడు.

వెనవసుధాస్థలంబున గవీంద్రులు కొందఱు శేముషీమషీ। రసము మనః కటా
హకుహరంబుల నించికలంచి జిహ్వికా। కిసలయతూలికం గొని లిఖింతురు కబ్బము
లెన్నఁగా మహా। వ్యసనముతో నిజానన వియత్తల తాళపలాశరేఖలన్॥

డిండిమభట్టారకునితో వివదించుటకయి కర్ణాటకాస్థానమున కేఁగినప్పుడుకూడ సరసత్వమునెడనే మనసుంచి తన కవితాస్వరూపము నాతఁడిట్లు వ్యక్తమొనరించినాఁడు.

సీ॥ పంపావిరూపాక్ష ♦ బహుజటాజూటికా
రగ్వధ ప్రసవసౌ ♦ రభ్యములకు ।
తుంగభద్రా సము ♦ త్తుంగవీచీఘటా
గంభీర ఘుమఘుమా ♦ రంభములకు ।
కళసాపురప్రాంత ♦ కదళీవనాంతర
ద్రాక్షాలతాఫల స్తబకములకు ।

కర్నాటకామినీ ♦ కర్ణహాటకరత్న
తాటంకయుగధాళ ♦ ధళ్యములకు।
గీ॥ నిర్నిబంధ నిబంధమై ♦ నెనయుకవిత
తెలుఁగునను సం ♦ స్కృతంబునఁ బలుకనేర్తు॥

శ్రీనాథుని గీర్వాణభాషాపాండిత్య మపారము. ఆభాషయందిప్పటికి వెలసిన నిగమాగమ పురాణేతిహాసములు కావ్యనాటకాలంకారములు, శాస్త్రములన్నియు నీతనికిఁ గరతలామలకములు. వివిధగ్రంథములందలి శ్లోకములు సూక్తులు నీతని జిహ్వాగ్రమునఁ దాండవమాడుచుండెడివి. అందుచేతనే యప్రయత్నముగ ననేక సంస్కృతశ్లోకముల కనువాదము లీతనికృతులలో దొరలుట, రచన చాలవఱకు సంస్కృతపదబాహుళ్యము కలిగియుండుట సంభవించినది. బ్రాహ్మీదత్తవరప్రసాదుఁడగు నీతఁడు కాశీఖండావతారికలో నొనర్చిన భారతీస్తవము, "క:కపీఠిక నోంకార ఘంటమెఱయఁ। జెలఁగుఁ గావుత మన్మనఃక్షేత్రసీమ। కవికుటుంబంబు పాలిటి దివిజసురభి। జలజసంభవుభోఁటి భాషావధూటి॥" అను పద్యముగూడ భట్టగోపాలుఁడు కావ్యప్రకాశికపయి రచించిన సాహిత్యచూడామణి యను వ్యాఖ్యయొక్క యవతారికలోని "ప్రణౌమిక్వణదోంకార।మణిఘంటావిభూషితాం। కవిలోక కుటుంబస్య। కామధేనుం సరస్వతీమ్॥" అను శ్లోకమున కనువాదమేయని నామిత్రులు శ్రీ నిడుదవోలు వేంకటరావుగారివలనఁ దెలియవచ్చినది. సంస్కృతవాఙ్మయమునకీతని హృదయమ్మెంతయధికారముండెనో దీనివలనఁ దెలియఁగలదు. పూర్వకవిస్తుతులలో నీతఁ డుదాహరించినంతమంది సంస్కృతకవులను మఱే యాంధ్రకవియుఁ జేర్కొనలేదు. వీరిలో లోకమునకిప్పటికిని దెలియరాని చిత్తపుఁడు మొదలగువారున్నారు. ఈసంస్కృతకవులలో వాల్మీకి, వ్యాస, కాళిదాస, భవభూతి, భట్టభాణ, మయూర, మురారికవుల రచనల కనుకరణములు శ్రీనాథునికవితలో నెక్కువగఁ బ్రత్యక్షమగుచుండును. ధాటీకాఠిన్యములు మెఱయ సమాసజటిలముగఁ జెప్పిన పద్యములలోఁగూడ నితఁడు మృదుమధుర సంస్కృతపదములనే యుపయోగించును గాని కర్కశములగు మాఱుమూలపదముల మచ్చునకైనఁ బ్రయోగింపఁడు. సరసత్వము ప్రధానలక్ష్యమగుటయే యిందుకుఁ గారణము. శ్రీనాథుని కవితాస్వరూపము నిరూపించుటకివిచాలును. ఇఁక నీతని రచనావిధానమునుగూర్చి యాలోచింతము. శ్రీనాథుని గ్రంథములు చాలవఱకు ఆంధ్రీకరణములేయని మొదటనే చెప్పియుంటిని. ఆంధ్రీకరణఫక్కిలో నీతఁడు చాలవఱకు భారతకవులమార్గమునే యనుకరించెను. మూలము

లతోఁ బోల్చిచూచిన నీతని కృతులలో న్యూనాతిరిక్తములు విశేషముగనే కానవగును. శృంగారనైషధము కావ్యాంధ్రీకరణమగుటచే నిది కొంతవఱకు మూలమునకెక్కువ చేరికగనుండునుగాని బొత్తిగా నాంధ్రీకరింప కసలే విడిచిపెట్టినశ్లోకములు, మూలశ్లోకాతిరిక్తముగఁ జేసిన యనువాదములు' పరివర్తనములు. చేర్పులు మార్పులు నిందుకూడ ననేకములున్నవి. ఈకృతినిగూర్చి పాటించినవిధానము నాతఁడే యిట్లు చెప్పికొనినాఁడు. "అశేషమనీషి హృదయంగమంబుగా, శబ్దంబనుసరించియు, నభిప్రాయంబుగుర్తించియు, భావంబుపలక్షించియు, రసంబు పోషించియు, నలంకారంబు భూషించియు, నౌచిత్యం బాదరించియు, ననౌచిత్యంబు పరిహరించియు, మాతృకానుసారంబునం జెప్పఁబడినఁ యీభాషానైషధకావ్యంబు." "అనౌచిత్యంబు పరిహరించితినని శ్రీనాథుఁడు చెప్పినను, "లలనయోకర్తు వగ్గుకృకలానము" (ఆ 6 ప 111) అవ్వలిదిక్కు-మోమయి (ఆ6 ప113) యజమాన ప్రమదావికస్వర(ఆ 7 ప 133)మున్నగుచోటుల నది పాటింపనేలేదని కొంటఱ యాక్షేపము. వీనిలో మొదటి రెండుపద్యములు నలుని వివాహసందర్భమున జరిగిన బువ్వపుబంతివర్ణనలలోనివి. అచ్చట స్త్రీపురుషు లన్యోన్యమొనరించిన హాస్యచేష్టావినోదములు వివరింపబడినవి. అందు ప్రతిపాదింపబడినది హాస్యరసము. మూడవపద్యము కలిపురుషుఁడు నిషధపురమునఁ బ్రవేశించి యందందు చరించుచు నొనరించిన చర్యల వర్ణించుసందర్భములోనిది. ఇచ్చట హాస్యము, జుగుప్స రెండునుకూఁడ బ్రదర్శితములు. కావ్యములయందలి యౌచిత్యవిచారము చాల సూక్ష్మమయినది. ప్రకరణమునుబట్టి యౌచితీస్వరూపము మాఱుచుండును. ఒకచో ననుచితమైన వర్ణన మఱొకసందర్భమున నౌచితినే నెలకొలుపఁగలుగును. కావున నాయాతావులం దుద్దేశింపఁబడినఁ యాయారసంబులఁ బోషించుటకయి శ్రీనాథుఁడు పైపద్యముల వినుపక యాంధ్రీకరించెను గాని యౌచిత్యమునందు దృష్టిలేక కాదు. నైషధము తృతీయసర్గలో హంస దమయంతికి నలుని సౌందర్యమును వర్ణించుసందర్భములో దేవతాస్త్రీలుకూడ నాతని సౌందర్యాకరణమునఁ గామవికారము జెందుచున్నారని సూచించు శ్లోకములను గొన్నిటిని శ్రీహర్షుఁడు రచించినాఁడు. ఆపట్టున నప్సరస్త్రీరత్నమగు రంభ లోనయిన విశ్వతితో పాటు జగజ్జననులగు ఉమారమాశచీసరస్వతుల చాపలమునుకూడ నాతఁడు సూచించినాఁడు. ఇది యనుచితమనియెంచి రంభఁగుఱించిన శ్లోకమునుమాత్రమే తెలిఁగించి శ్రీనాథుఁడు తక్కినవానిని విడనాడి తన యనౌచితీ పరిహారణవిధానమును బ్రదర్శించినాఁడు. "సకస్తీకపరిశీలితుంమయా, గమికర్మీకృత నైకనీవృతా । అతిథి త్వమనాయిసా

దృశో। స్పదసత్సంశయగోచరోదరీ॥ అను శ్లోకములో గీతగీసిన ప్రయోగములందలి ప్రలోభముచే శ్రీనాథుఁడొక్కపద్యమునువ్రాయుటతోఁ దృప్తినొందక "మృదురీతిం బ్రతివాసరంబు" (ఆ 2 ప 20) "కమలేందీవరషండమండిత (ఆ-2 ప-21) అను రెండు పద్యములను వ్రాసి యాప్రయోగమునకట్లే గైకొనినాఁడు. దీనినిబట్టి కొందఱవిచార మూలకముగ శ్రీనాథుని నైషధము సంస్కృత పదభూయిష్ఠమనియు మూలపదములకు డు, ము, వు, లు చేర్చుటతప్ప నాతఁడొనర్చిన పరివర్తన మంతగా లేదనియుఁ జెప్పు సాహసమునకు సిద్ధమగుచున్నారు. ఇది కేవలము భ్రమ. ఈశ్లోకము నిట్లు లాంధ్రీక రించుటకుఁ బై పదములందలి మక్కువయే కారణముగాని వేఱుకాదు. "గమికర్మీకృత" ప్రయోగమునందలి యాసక్తిని దరువాతరచించిన భీమఖండములో గూడ నాతఁడిట్లు ప్రకటించినాఁడు. "శితికంఠప్రియమందిరం బయిన యాక్షేత్రంబునం దెచ్చటన్। మృతుఁడై యున్ననరుండు పొందు గమికర్మీభూతకైవల్యమున్॥ మఱియు సంస్కృత గ్రంథముల నరసముగ నాంధ్రీకరింప నెంచువారికిఁ గొంతవఱకు సంస్కృత పదబాహు ళ్య మావశ్యకమే యగునని నా యభిప్రాయము. సక్క మాలోచింప శ్రీనాథుని భీమ ఖండ కాశీఖండాదులలో గాననగు సంస్కృతసమాసజటిలత్వము నైషధమున నంతగా నగుపడదు. మృదుమధురము లగు నాంధ్రగీర్వాణపదములతో లలితముగ రచించిన పద్యములు నైషధమునం దనేకము లున్నవి. కొన్నికొన్నిచోటుల మూలమును మార్చి క్రొత్తభావములం జేర్చి మూలమునకు వన్నెవెట్టిన పట్టులు గూడ నం దెక్కువగా నున్నవి. మచ్చున కొందు రెండు దృష్టాంతములఁ జిత్తగించుఁడు.

శ్లో. మదేకపుత్రా జననీ జరాతురా। నవప్రసూతిర్వరటాతపస్వినీ।
గతిస్తయోరేష జనస్తమర్దయ। న్నహోవిధే త్వాం కరుణారుణద్ధినో॥
(నైష. 1-135)

నలునిచేఁ బట్టువడినప్పుడు హంస విలపించు పట్టునందలిది యీశ్లోకము. దీనికి శ్రీనా థుఁడు మూలమును బెంచి యాంధ్రగీర్వాణపదంబులు సముంబుగ జతగూర్చి జాతీయత జాలువాఱ నిసర్గమనోహరముగ నొక సీసపద్యమును వ్రాసినాఁడు.

సీ. తల్లి మదేకపుత్త్రిక పెద్దకన్నులు గానవిప్పుడు; మూఁడు కాళ్ళముసలి;
యిల్లాలు గడుసాధ్వి యేమియు నెఱుఁగదు; పరమపాతివ్రత్య భవ్యచరిత,
వెనుకముందరలేదు నెనరైనచుట్టాలు, లేవడి యెంతేని జీవనంబు;
గానక కన్నసంతానంబు శిశువులు, జీవనస్థితి కేన తావలంబు;

వడునట్లు గావించిన కూర్పుపేర్పు గొనబుఁదనమును గుబాళించుచున్నది. మఱికొన్ని తావుల మురిపెము గడుసుఁదనము వోలుకాడు నొండురెండు పదముల వలయుచోటుల నెలకొలిపి యందు మూలమున నెనలేని రామణీయకమును బద్యమున కాతఁడు గలిగించుచుండును.

గీ. వనిత నీచిత్తమున కేను వత్తునేని
కామతంత్రంబునకు సంచకర్వుగాఁగఁ
జుంబనము సేయు నిమ్మోష్ఠ బింబమిపుడు
గండుగోయిల చిగురాకుఁ గమిచినట్లు (శివ ఆ. ౪ ప. 6౪)

ఇది సుకుమారుఁ డరణ్యమునఁ బ్రథమసమావేశమునఁ జండాలాంగనతో నెఱపిన ప్రసంగములోనిది. ఇందలి సంచకర్వు (బజానా) అను పదప్రయోగమునఁ గలుగు ననిర్వచనీయానందము వివరింప నవసరములేదు, నాలవపాదమున యతిస్థానములందుండియు "గండు" "కమిచి" యనుపదము లర్థసంపదకు బలుపు గూర్చుచున్నవి.

సీ. హారావాలంబను నల్లనేరేడుపండు
మిసిమింతుఁడును గాఁగ మ్రింగినాఁడు
పెను వ్రేలికొనగోర బిసరుహాసను మోము
కెందమ్మి విరివోలె గిల్లినాఁడు
పంచవన్నియతోడఁ బ్రసవనారాచుని
నెట్టిచిచ్చుటకంట జుట్టినాఁడు
మెఱుఁగుఁ గోఱలుపుల్ల మృత్యుదేవతనోరు
ధట్టించి యఱకాలఁ దన్నినాఁడు
గీ. త్రిపురదైత్యావరోధనారీవిలాస
దంత తాటంకముల కెగ్గు దలఁచినాఁడు
దక్షపురి సానికూఁతులఁ దవిలినాఁడు
విశ్వలోకకుటుంబి భీమేశ్వరుండు. (భీమ ఆ 1 ప 110.)

సీ. ఎవ్వాఁడు డాచేతి క్రొవ్వాడి నఖమునఁ
జిదిమె భాషాదేవి చిగురుముక్కు—

కనకమేఖలఁ గ్రుచ్చి కటిఁ దాల్చె నెవ్వాఁడు
చెఱఁగుపైఁ బూపాఱు మెఱుఁగుఁబండ్లు
కొరకెవ్వఁడు పదాంగుష్ఠభాగంబున
నుడురాజపట్టగుజ్జుఱఁ గనూఁదె
కఱిగె నెవ్వఁడు ఖడ్గధారాచలంబున
నగ్నినాలుక లేచు నంటఁగట్టి
గీ. మోదె నెవ్వాఁడు ముప్పది మూఁడుఁ గోట్ల
వేలుపులఁ బాఱఁబాఱ వెన్వెంటఁ దగిలి
యట్టి శ్రీవీరభద్రుఁడీ యద్రిమీఁద
భద్రకాళియుఁ దానుండుఁ బద్మనయన. (కాశీ ఆ 3 ప 32)

ఈ పద్యములలో గీతగీసిన జాను తెనుంగుపదములు గూర్చిన విన్నాణంపు సొంపు చెప్పనలవికాదు.

సీస, గీత పద్యరచనమునం దీతఁడు చూపిన సంస్కారము తరువాతి కవులకు మార్గదర్శకమయి యాపద్యముల కపూర్వశోభను గలిగించినది. సీసరచనమున నిట్టి సంస్కారమును దొలుదొలుతఁ బాల్కురికి సోమనాథుఁడు తన అనుభవసారచతుర్వేదసారములలోఁ బ్రారంభించి శ్రీనాథ నాచనసోమనాథాదుల కాదర్శకుఁడయిన విధమును "పాలకురికి సోమనాథకవి అనుభవసారము" (ఆంధ్రసాహిత్యపరిషత్తు రజతోత్సవసంచిక) అనువ్యాసమున నిరూపించియుంటిని. శ్రీనాథుఁడు సోమనాథుని మార్గమును దీర్చిదిద్ది యందు సిద్ధహస్తుఁ డయినాఁడు. సాధ్యమయినంతవఱకు సీసరచనమునఁ బ్రతిపాదమునను బూర్వోత్తరార్ధములందు వేసకి వానికే యెచ్చటి కచ్చటికే పదములు తెగి విడివడునట్లు రచించుటలో శ్రీనాథుని నిపుణత నిరుపమాన మయినది. ఇందుకుఁ బయినిఁ జూపిన సీసగీతపద్యములే నిదర్శనములు. శ్రీనాథుని సీసగీతములఁ జదువునపుడు పాఠకునికిఁ బ్రాణములు లేచివచ్చును. మత్తేభశార్దూలాదివృత్తరచనములోఁ గూడ నిట్టి సంస్కారమునే యీతఁడు చాలవఱకు నెఱపుచుండెను. అందుచేఁ దూఁగుటుయ్యేలలోఁ బరుండునప్పటి సుఖపారవశ్యము చదువరుల కీతని పద్యములఁ జదువునప్పు డనుభూత మగుచుండును. మచ్చున కిక్రిందిపద్యములఁ జిత్తగించునది.

శా॥ ప్రాతఃకాలము తీవ్రభానుఁ డుదయింపన్ సప్తగోదావరీ
స్రోతఃపూరనమునన్ మునింగి యుభయుల్ సోమార్ధచూడామణీ

జ్యోతిర్లింగమయస్వరూపుఁ గొలిచెన్ శుద్ధాంతరంగంబునన్
బాతివ్రత్య మహాప్రభావనిధి లోపాముద్ర భీమేశ్వరున్॥

(కాశీ ఆ 3 ప 17)

గీ. కృపఁ దలంపఁగదయ్య యోనృపవరేణ్య!
యభయ మీవయ్య యో తుహినాంశువంశ!
కావఁగదవయ్య యర్థార్థి కల్పశాఖ!
నిగ్రహింపకుమయ్య యో నిషధరాజ! (అ-1 ప-109)

శ్లో. సువర్ణశైలాదవతీర్య తూర్ణం । స్వర్వాహినీవారి కణావకీర్ణైః
తం వీజయామః స్మరకేళికాలే । పక్షైర్నృపం చామరబద్ధసఖ్యైః॥ (నైష 3-22)

ఇది హంస దమయంతితో నలునిఁ గూర్చి ప్రశంసించు సందర్భములోనిది. ఇందు "స్మరకేళికాలే'' అనునది నలుని సపత్నీకత్వమును సూచించి వైరస్యజనక మగునని యెంచి శ్రీనాథుఁడు శ్లోకము నెంతసరసముగఁ దెలిగించెనో చూడుఁడు.

గీ. కనకశైలంబు డిగ్గి యాకాశసింధు । సలిలములఁ దోఁగి మిగులంగఁ జల్లనైన
చారుహాటకమయగరుచ్చామరముల । వీతు నతనికి వైశాఖవేళలందు.

(అ-2 ప-51)

శ్లో. యశో యదస్యాజని సంయుగేషు । కండూతిభావం భజతా భుజేన
హేతోర్గుణాదేవ దిగావగాహీ । కూలంకషత్వ వ్యసనం తదీయమ్.

(నైష. 3-39)

ఇది హంస దమయంతియెదుటఁ జేయు నలుని పరాక్రమాదికవర్ణనములలోనిది. రణవ్యాపారమునందుఁ గండూతిగల నలుని భుజములవలనఁ బొడమిన యాతనికీర్తి కారణగుణంబునఁ బోలె దిక్కులను నదులయొక్క యొడ్డులతో నొరయుచున్న దని దీని యర్థము. శ్రీనాథు డిచ్చట మూలమునకు వన్నెపెట్టి కీర్తికిఁ బ్రవాహారోపణ మొనర్చి యా కీర్తిప్రవాహము దిగ్గజకుంభకూలములతో నొరయుచున్నట్లుగా మార్చి వర్ణించినాఁడు.

మ. రణకండూభరదుస్సహం బయిన యా రాజన్యదేవేంద్రు ద
క్షిణబాహాగ్రమునన్ జనించిన మహాకీర్తిప్రవాహంబుగా
రణసంక్రాంతగుణానుషంగమున నొప్పి స్ఫీత దిఙ్మత్త వా
రణగండస్థలకుంభకూలములతో రాయుం దివారాత్రముల్. (అ-3 ప-52)

వేయేల. విద్వదౌషధ మగు శ్రీహర్షనైషధమును శ్రీనాథుఁడు విద్వదమృతముగ నాంధ్రీకరించినాఁడని శ్రీవేదము వేంకటరాయశాస్త్రిగారు వ్రాసినది సత్యసమ్మతము. దీనితరువాతరచించిన హరవిలాస మించుమించుగ స్వతంత్రగ్రంథ మగుటచే నందు సంస్కృతపుఁబాలు తక్కువయైనది. నైషధాంధ్రీకరణమునుగూర్చి యాతని సమకాలీనులలోఁ గలిగిన యభిప్రాయముఁ గూడఁ గొంతవఱ కిందుకుఁ గారణ మయియుండును. లలితములగు తెలుఁగుపలుకుబడుల కూర్పునకు శ్రీనాథుని కృతులలో హరవిలాసమే తగిన లక్ష్యము కాఁదగును. దీనితరువాత రచింపబడిన భీమఖండ కాశీఖండములు సంస్కృతపురాణాంధ్రీకరణము లగుటచే వీనిలో మరల సంస్కృతపదబాహుళ్యమున కవకాశ మెక్కువయైనది. ఈ రెండుగ్రంథము లించుమించుగ నొక్కపాకముననే పడినవి. మూలముతోఁ బోల్చిచూచిన న్యూనాతిరిక్తములు నైషధమునకంటె నిందెక్కువగఁ గానిపించును. అందునను భీమఖండమునఁగంటెఁ గాశీఖండరచనమున శ్రీనాథుఁడు సంగ్రహీకరణము నెక్కువగఁ బాటించినాఁడు. క్రీడాభిరామమునకు మూలమగు ప్రేమాభిరామము లభింపనందున నిందు మూలానుసరణ మెంతవఱకున్నదో సరిగా నిర్ణయింపరాకున్నది. శివరాత్రిమాహాత్మ్యము ప్రకరణానుకూలముగ బాణుని కాదంబరినుండి గ్రహింపఁబడిన వర్ణనలతో విశేషముగ విస్తృతి నందినది. ఇందుఁ గథాభాగము చాలఁ దక్కువయే. మూలమగు నీశానసంహితలో రమారమి నూఱు శ్లోకములందున్న కథను గైకొని నాలు గాశ్వాసములకు మించిన గ్రంథము రచించుట కూడ నీవిషయమును విశద మొనరించును.

శ్రీనాథుఁడు తనకృతులయందు నెఱపిన సరసత్వము సర్వతోముఖమయినది. దాని నిరూపించుటకయి గ్రంథవిస్తరభయమునఁ గొలది దృష్టాంతములమాత్ర ముదాహరించెదను. ఇంతకు ముందు చెప్పినట్లు ముఖ్యముగ నీతఁడు పద్యములఁగూర్చు విన్నాణమును బట్టియే యీతనిపద్యములయం దాసరసత యుద్గతమయి హృదయానందము గలిగించును. మచ్చునకీ క్రింది గీతపద్యము చూడుఁడు.

గీ. చలి ప్రవేశించు నాగుల చవితినాఁడు
మెఱయు వేసవి రథసప్తమీ దినమున
నచ్చుసీతు ప్రవేశించుఁ జెచ్చుపెరిగి
మార్గశిర పుష్యమాసాల మధ్యవేళ. (శివ అ 3 ప 15)

ఇందెట్టి యలంకారముగాని యర్థవిశేషముగాని లేదు. మామూలుగా మనమాడుకొను జల్లిమాటలే శ్రీనాథుని కలమునుండి పద్యబద్ధమయి వెలువడి నవ్యత, సరసత,

మెఱయ నొప్పుగులుకుచున్నవి. అచ్చసీతు, పెచ్చుపెరిఁగి యనుజాను తెనుఁగుపదములు "మాసముల" అనుటకు "మాసాల" అను విశేషరూపము, "మధ్యవేళ" అను లలిత మధుర సంస్కృతపదము అనువగు తావుల నెలకొని వింతసొంపులు వెలార్చుచున్నవి. అందుకుఁదోడు చెక్కితీర్చినటు పదములు పద్యపాదములు నెక్కడికక్కడికిఁ దెగి విడి

మ॥ శనివారోత్సవమాచరించె ముని శిష్యవ్రాత ముందాను గ
మ్మని పణ్యారముతోడ బూరెగమితో మండెంగ తండంబుతో
ననుగుంబాసెముతోడఁ బాండుకలమాహారంబుతో నేతితో
ఘనరంభాఫల ఖండశర్కరలతోఁ గారుణ్యపాథోధికిన్॥

(భీమ ఆ 2 ప 67)

ఉ॥ స్థాణుని లోచనాంచలము దావుగఁ దీవ్రతరార్చులన్ నిజ
ప్రాణముఁ గొన్న నాఁటిపగ యాత్మదలంచియొ నీకటాక్ష దృ
క్కోణము ప్రాపుగ స్మరుఁడు గోల్కొని పంతమెలర్పఁ గాఁగొనెన్
బాణ దశార్ధపాతమునఁ బావక భూరిమనోభిమానమున్॥

(నైష ఆ 4 ప 31)

చ॥ బలబలవేగ తేపకడఁ బంకజదీర్ఘికఁ దీర్థమాడి నె
చ్చెలులును దాను నిందుముఖి శేషవిభూషణుఁ బూజసేయ ని
చ్చలు దెలికన్నులున్నొలక చన్నులు బొమ్మలమీఁద వ్రాలుకుం
తలములు సూచిపోరులు మనంబున నువ్విళులూరుచుండఁగాన్॥

(కాశీ ఆ 5 ప 144)

ధాటీకాఠిన్యముగల దీర్ఘసమాసబంధమును శ్రీనాథుఁడు సాధారణముగ నారభటియు గాంభీర్యము నవసరముగల పట్టులనే ప్రదర్శించుచుండును. అట్టిపట్టుల నాతఁడు ముఖ్యముగ మత్తేభశార్దూలముల రచించును. చూడుఁడు.

శా. సందర్శించిరి భీమనాథుఁ ద్రిజగత్సమ్మోహనాకారు, న
ర్ధేందూత్తంసుని దక్షిణాబ్ధిలహరీ హేలావిహారక్రమా
స్పందాయాగతగంధవాహ పరిషత్స్వానాతిరేక స్ఫుర
త్తుంది స్వాంగక దందశూకకటకాస్తోకేష్ట బాహార్గళున్.

(భీమ. అ-3 ప-185)

శా. అష్టాశీతి సహస్రసంయమి జనవ్యాకీర్ణతీరద్వయీ
జుష్టోదంచిత సప్తసింధు సలిలస్రోతోవగాహక్రియా
తుష్టస్వాంతుఁడనై భజింతుఁ గరుణాదుగ్ధాబ్ధి భీమేశ్వరున్
దృష్టాదృష్టఫలప్రధాన విభవాధిష్ఠానచేతస్కునిన్. (భీమ. అ-3 ప-200)

శా. ఆడెం దాండవమార్భటీపటహ లీలాటోపవిస్ఫూర్జిత
క్రీడాడంబర ముల్లసిల్ల గరళగ్రీవుండు జూటాటవీ
క్రోడాఘాతకఠోర కోటకరుటీ కోటీలుఠచ్ఛింధు వీ
చీడోలావటలీ పరిస్ఫుటతర స్ఫీతధ్వనిప్రౌఢిమన్. (భీమ. అ-4 ప-148)

శా. ఆటోపారభటిస్ఫురన్నిశ్వరుఁడు దన్నుం దంద వర్ణింపఁ ద
చ్చాటుప్రౌఢికిఁ జేసె ధూర్జటి మహాశ్లాఘాశిరఃకంపమున్
జూటీకోటవిటంకకోటి విలుఠత్స్రోతస్వినీవీచికా
కోటీధాటి రటత్కరోటి కుహరక్రీడావకాశంబుగన్.

(కాశీ. అ-4 ప-253)

ఇందులో ధాటీసమారంభ మెంతయున్నను సమాసబంధ మెంత జటిలముగ నున్నను జాలవఱకు మృదుమధురములగు సంస్కృతపదములతోనే వాని నాతఁడు గూర్చుచుండును. కాని కొంతదనుక శబ్దాలంకారమును మన్నించి యందు కనువగు పదములనే గయికొనును. ఇంతకు నీపదము లన్నియు సహజగంభీర మగు ప్రవాహముతో వాని యంతట నవి దొరలివచ్చినట్టు కాన్పించునేగాని వానికై యాతఁ డించుకయుఁ దడువులాడిన జాడలు గానరావు. సమాసబంధము లేనిచోటులఁ గూడ మొత్తముమీఁద నీతఁడు సంస్కృతపదములనే యెక్కువగ వాడి వానియం దభిరుచి చూపుచుండును గాని పవడములు, ముత్తియములు మేళవించి గూర్చిన తావళములవలె లలితములగు గీర్వాణపదములను దెలుఁగుపదములను గుదిగూర్చి రచించిన పద్యములు, పద్యపాదములు గూడ నీతని రచనములలో లెక్కకు మిక్కిలిగనే కానవచ్చును. ఈ క్రింది దృష్టాంతములఁ జూడుడుఁడు.

సీ. పాటలంబగు జటాజూటంబు నడునట్టు
వూసచుక్కలరాజు పొడవుచూపు
వెడఁదయైన లలాటవీథీవిటంకంబు
కట్టఱకొవ్వేడి కన్నుఁగూర్పుఁ

గంబుసన్నిభమైన కంఠప్రదేశంబు
గరళకూటముఛాయఁ గ్రాంచి యమియఁ
గడు మనోజ్ఞములైన కర్ణపార్శ్వంబులఁ
బెనుపాఁపపోఁగులు బిత్తరించు
గీ. వివిధకైవల్యకల్యాణవేదియైన
భీమమండలికాపుణ్యభూమియందు
గీటపక్షి సరీసృప క్రిమిచరాది
జంతుకోటికిఁ బ్రాణావసానవేళ. (భీమ. అ-3 ప-19)
సీ. చీకిలించుకయందుఁ జిగురుఁదెవ్వలలోనఁ
గుసుమసాయకువైరి నొసలికన్ను
పద్మనాభుని కౌస్తుభముకాంతి పొలివోవఁ
బద్మచన్నులమీఁది పసుపుదాఁకి
తళుతళుక్కలనింగిఁ దాటించి చనుఁగాని
నిలువనేరదుహ్రాదినీప్రకాశ
మస్తినాస్తివ్రికాశానుసారంబున
మినుమినుక్కమనుచుండు ననలుదీప్తి
గీ॥ పగలు వగలయ్యె శశివిభా ప్రసరమునకుఁ
దానపోదిక్కు దీప్తిసంతానమునకు
ననఁగఁ బొగడొందు కనకవర్ణాభుఁడైన
భానుఁ డిప్పురవరనమీపమునసడుచు॥
(కాశీ ఆ 3 ప 195)
ఉ॥ కందక గాజువాఱక వికాసము దప్పక మందహాస ని
ష్యందము చెక్కుటద్దముల జాఱఁగ నెమ్మది నిద్రవోవున
ట్లందమునొందె ధాత్రిసిరి యాలకుమారుని వక్త్రచంద్రుఁ డా
నందమునొందె నవ్వుడల నాఁ గమనంబును భర్తచిత్తముణ్॥
హర ఆ 2 ప 119)
చ॥ జలుఁగగు వల్కలాంచలము చెన్నయి చన్నులమీఁదఁ జాఱఁగా
నలుకఁ దుపార శైలసుత యవ్వలిమోమయి నాలుగే వ్వుదం

బుసుసని భ్రూకుటీకుటిల ముగ్ధలలాటము ఖేందుబింబమై
మలఁగి కనుంగొనెఁ భుజగమండను సక్కపట ద్విజోత్తముఁ॥

(హార ఆ 4 ప 34)

ఇఁకఁ గేవలము ముద్దుమురిపెములు గురియు జాను దెనుఁగుపలుకులనే చాలఁగ జాలువార్చి రసము గురియించిన తావులుకూడ సీతని కృతులయం-దనేకములు గానవగును.

గీ॥ కుడిచికూర్చుండి మీరేల కొఱఁతయైన । కుమ్ములాడెదరో యన్నదమ్ములార
గొఱ్ఱెకొఱ్ఱియు సెలగట్టెఁ గొట్టికినట్లు । కటకటా మీవివేకంబు గీసుపడఁగ.

(భీమ ఆ 4 ప 54)

సీ॥ శ్రీపాదములఁ బైడి చిరుగజ్జియలతోడ
రవణిల్లు గండపెండారమమర
వెలిదామరలఁబోలు వెడఁదకన్గొన్నులు
మద్దికాయలతోడ నుద్దివడయ
మొలకకూఁకటిఁగ్రాలు ముత్యాల రవిరేక
భసితంపుఁ బొట్టుతో బాదరింపఁ
బాలబుగ్గలకాంతి పల్లవంబులతోడఁ
జిన్నికేసగవులు చెలిమిసేయ
గీ॥ లజ్జయొలుకఁగని కటిమండలంబుమీఁద
వలుఁద వజ్రాల కమరు గర్వంబుసూప
దివ్యబాలకుఁ డొక్కండు తేజరిల్లెఁ
గాశివిరేశ శంభులింగంబు నడుమ॥

(కాశీ ఆ 3 ప 240)

సీ॥ కమ్మఁగాఁ గాచిన కట్టుసంజుళ్లను
నీరువెళ్లఁగ నొత్తి నేతవేఁచి
చక్కఁగాఁ దఱిగిన సన్నమాంసంబులు
పరిపాటిమై జుఱ్ఱుఁ బదనువండి
మూల్గుటెమ్ములతోడ మందకగాకుండఁగ
జాఁదుబాగుననల్ల చారుగాచి

వలయుసంబారాలు వడియాలు బలియించి
దళమైనక్రొవ్వుతోఁ దాలఁబోసి
గీ॥ షడ్రసోపేతములుగాఁగఁ జమరభంగి । నమృతపాకంబులుగఁ జేసి రాజనంబ
సెట్టిసిరియాలువంశాబ్ధి శీతకరుని । సతులు తిరువెంగనాంచియుఁ జందనికయు॥
(హర ఆ 2 ప 121)

సీ॥ తలమీఁది చదలేటి దరిమీలఁ దిసఁజేయు
కొంగలు చెలఁగి కొంగొంగురనఁగ
మెడదన్ను పునుకల నిడుపేరులొండొంటిఁ
బోరిపోరి దాఁకి బొణ్బొణుగురనఁగఁ
గట్టినపులితోలు కడకొంగు సోఁకి యాఁ
బోతుతత్తడి చిట్టు బుట్టుమనఁగ
గడియంపుఁబాములు కకపాలలోనున్న
బూదిపైఁ జిలికిన బుస్సురనఁగ
గీ॥ తమ్మిపూఁజాని పునుకకుఁ జమ్మసాచి । దిట్టతనమున బిచ్చము దేహియనుచు
వాడవాడల భిక్షించు కూడు గాని । యిట్టిదివ్యాన్నములు మెచ్చ నేశివుండు.
(హర ఆ 5 ప 16)

ప్రతిపాదించినవిషయము చిత్తమునఁ బాగుగా హత్తుటకుఁ బాఠకులకు రసావేశము కలుగుటకుఁ బాల్కురికి సోమనాథుఁడు తన బసవపురాణ పండితారాధ్య చరిత్రములలో బలుతావుల సమానార్థకములగు బహువిధపదములను శర పరంపరలుగఁ బ్రయోగించియుండుట యాగ్రంథములఁ జదివినవారికెల్లఁ దెల్లమగును. నాచన సోముఁడు, శ్రీనాథుఁడు నీవిషయమునఁగూడఁ బాల్కురికి సోమనపథమును గొంతవఱకనుగమించి తమ కృతులలో రసవిస్ఫురణము గావించియున్నారు. శ్రీనాథుని గ్రంథములందలి యిట్టిపట్టులఁ గొన్ని కనుంగొనుఁడు.

సీ॥ అనువుదప్పిరి నొచ్చి రలసిరావదనొంది
రదవదలైరి చీకాకుపడిరి
యంగలార్చి కేడ్చి రారటంబొందిరి
బ్రమసిరి పాఱిరి పల్లటిలిరి
బెగ్గడిల్లిరి పికాపికలైరి సొలసిరి
కలకలఁగూసిరి కలిలపడిరి

గగ్గులకాడ్రైరి కలఁగి రోటాడిరి
వెలవెల్ల నైరి నివ్వెఱఁగుపడిరి
గీ॥ అవుకుసవుకైరి కరికరిమైరి దస్సి
రొల్లఁబోయిరి వేఁరి తల్లడిలిరి
సిగ్గువడి రొచ్చవడిరి యిస్సియిస్సియైరి
తారకునిచేత మునులు బృందారకులును॥

(హర ఆ ౩ ప 10)

"ముక్కంటీ! నీకు మ్రొక్కెదను శివా! నీకు నవాంజలి; భవా! నీకభివాదనంబు; పాండురంగా! నీకుదండంబు; రాజశేఖరా! నీకుజేజే! హరా! నీకుజోహారు; గిరీశా! నీకు వరివస్య; యష్టమూర్తీ! నీకుఁ బ్రతిష్ఠ; యీశానా! నీకు దాస్యంబు; త్రిపురహరా! నీకుపాసన; మృడా! నీకు శరణు; మృత్యుంజయా! నీకుఁ బ్రపత్తి; ప్రమథాధిపా! నీకు నారాధనంబు; పినాకీ! నీకు నమస్కారంబు; కైలాసనిలయా! నీకుఁ గ్రొవులు; పశ్యల్లలాటా! నీకు నేటికోళ్ళు; గౌరీమనోహరా! నీకు నమస్కారంబు."

(భీమ. అ-3 ప-211)

"కీనాశకింకరుల ముసలభిండివాలతోమరముండలాగ్రత్రిశూలపట్టసంబులఁ బ్రహరించిన, విచ్ఛిన్నబాహూరుచరణవక్షః ....లలాటకృకాటులై పచ్చియు నొచ్చియుఁ జచ్చియుఁ దెరలియుఁ బొరలియుఁ దొరఁగియు డాఁగియుఁ గ్రుస్సియు, డస్సియుఁ గందియుఁ గుందియు, మ్రొగ్గియుఁ దగ్గియు, నలసియు సొలసియు వికావికలై దిక్కుమొగంబులయి యూరుసౌరులై గుర్రయై బందబందై భండనంబు విడిచి......వెలవెలంబోయి కృతాంతుని సన్నిధికిం బోయిరి—"

(శివ. అ-4 ప-౭౮)

పదములకూర్పు పిన్నాణంపుసొంపుచేత నీ రసము వెల్లివిరియఁ జేయు జాణతనము సాజముగ నలవడియుండుటచే శ్రీనాథుఁడు శ్లేషయమకాదిశబ్దాలంకారములకుఁ గాని యుత్ప్రేక్షాద్యర్థాలంకారములకుఁ గాని యంతగా బారకొనఁడు. శృంగారనైషధ మర్థాలంకారభూయిష్ఠమగు శ్రీహర్షనైషధమున కాంధ్రీకరణ మవుటచే నందులో నట్టియలంకారములు విశేషముగఁ గాననగును గాని తక్కిన కృతులలో నాతఁ డట్టి యర్థాలంకారములకయి తడవులాడక కొన్నియెడల శబ్దాలంకారముల మాత్రమే మన్నించి వానిని బ్రదర్శించును. కొన్నిపట్టుల నెడనెడ నర్థాలంకారములఁ బ్రయోగించినచో నందు ముఖ్యముగా ఉపమయు నుత్ప్రేక్షయుఁ గయికొనును. సూర్యచంద్రోదయాస్తమయాది

ప్రకృతివర్ణన సందర్భములలో నీతఁడు కొంతవఱకు శబ్దాలంకారముల నాశ్రయించును. భీమఖండ ద్వితీయాశ్వాసమునను, కాశీఖండ ప్రథమాశ్వాసమునను నిట్టిట్టుల నాతఁడు రచించిన పద్యము లిందులకు నిదర్శనములు. కాశీఖండమందలి సూర్యోదయవర్ణనలోని పద్యములు చాలవఱకు మయూరుని సూర్యశతకశ్లోకముల కాంధ్రీకరణములుగఁ గాననగును. కాని భీమఖండ ద్వితీయాశ్వాసమందలి పద్యములు కేవలము స్వకపోలకల్పితము లనియే చెప్పవచ్చును. సంస్కృతభీమఖండమున నీవర్ణనలు గానరావు. శ్రీనాథుఁ డాదరించు శబ్దాలంకారస్వరూపము నెఱుఁగుట కీక్రిందిపద్యములు చిత్తగించునది.

క. చరమాచలశిఖరంబునఁ
దిరమై యొక్కింతతడవు దినకరుఁ డొప్పెన్
వరుణుని శుద్ధాంతంబున
నరవిందాక్షులకు మించు టద్దం బగుచున్. (భీమ. అ-2 ప-27)

గీ. సంజకెంపును దిమిరపుంజంపు నలుపు
గమిచి బ్రహ్మాండభాండంబు గరము మెఱసెఁ
బరమపరిపాక దశవృంతబంధ మెడలి
పతనమగు తాటిపండుతోఁ బ్రతిఘటించి. (భీమ. అ-2 ప-30)

ఉ. కాయజవిక్రియం బడయఁ గానికులంబున సంభవించి యీ
న్యాయము సేయునే యిటు దురాత్ముఁడు వీఁడు త్రపాభిమానముల్
మాయఁగఁ దట్టియుంచు నతిమాత్రము లజ్జితుఁడైన కైవడిన్
దోయజషండబాంధవుఁ డధోముఖుఁ డయ్యె నభోంగణంబునన్.
శివ. అ-3 ప-91)

సీ. గిరినికుంజములఁ గుంజరపుంజ మనుశంకఁ
గంఠీరవంబు లుత్కంఠ నెగయఁ
బల్వలంబులఁ గిరి ప్రకరంబు లనుశంక
నెఱుకురాజులు విండు లెక్కువెట్టఁ
గడలి మధ్యంబునఁ గాకోల మనుశంక
జలదేవతలు భీతి సంభ్రమింప
నదములఁ గువలకాననవాటి యనుశంక
నిందిందిరశ్రేణు లెదురుకొనఁగ

గీ॥ రజతగిరియందుఁ దాండవా రంభరభస
భంగిపతిత పరశ్వధ పాణివికట
కంధరారుద్ధ గజకృత్తి కంథకంక
పఙ్క్తిమతులకుఁ దోఁప నంధకారంబుపగిదిబలె॥ (భీమ ఆ 2 ప 35)

శబ్దాలంకారములలో యమకానుప్రాసముల దెసను గొంతవఱకు ముక్తపదగ్రస్తమునెడను నీతఁడు మక్కువగొనును. అనుప్రాసములలో నంత్యానుప్రాసమును బోతనామాత్యునివలె నతిమాత్రముగఁ గాక పరిమితముగనే యీతఁడు పాటించును.

శా॥ ఆలోకించె మహామునీంద్రుఁడు గుమారారామమున్, వింధ్యకు
టీకాలోపాంత ధరాలలామము, బహుక్రీడావనశ్యామముఁ
బ్రాలేయాచాల కన్యకాధవజటా భారాసనార్ధేందు రే
ఖా లానాయిత హేమకూటకలధౌ తాట్టాలకగ్రామముఁ॥
(భీమ ఆ 2 ప 61)

ఉ॥ వేదవిభాగము౦ బరిఢవించినపుణ్యుఁడు వేడ్కఁబూన్చె బి
ల్వీదళపూజనంబు గడులెస్సఁగఁ గూరిమి శిష్యపంక్తితో
నాదిమభిల్లు నిత్యకరుణామృతపూరముజల్లు బుండరీ
కోదరభల్లు కృత్తికరి యూథపుమల్లునిఁ గొండయల్లునిఁ॥
(భీమ) ఆ 2 ప 73)

శా॥ కాంచెఁ గాంచన గర్భసంభవుఁడు దగ్రగ్రావకోటిస్థల
చ్ఛంచన్నిర్ఝర వేణికానలిల సంజాతాబ్జ సౌగంధ్యముఁ
బంచాస్యస్ఫుట కంఠనాదహత కుంభత్కుంభి గర్వాంధ్యముఁ
న్యంచద్ధాటక భూమిభృచ్ఛిఖర గర్వావంధ్యముఁ వింధ్యముఁ॥
(కాశీ ఆ 1 ప 87)

ఇట్లు పద్యముపొడవునను నంత్యానుప్రాసము పాటించినపద్యము లీతని కృతులందు లెక్కకుమిక్కిలి తక్కువగానేయుండును. ఇంతకన్న నీ యంత్యానుప్రాసమును బ్రదర్శించిన పాదైకదేశములు గద్యభాగములు నెక్కువగఁ గానవగును.

గీ॥ శౌర్యమునను గ్రుచ్చవిచి నవ్యసాచి (హర ఆ 7 ప 144)
ఉ॥ .........వచ్చితిఁగాశికిఁ బుణ్యరాశికిఁ॥ (భీమ ఆ 2 ప 95)

సీ॥.........చటుల నక్రకులీర పాఠీన తోయగర్భాభోగ తుల్యభాగ॥
(భీమ ఆ 3 వ 20)

గీ॥ గాఢ సమ్మోదభవనేత్ర కంకణునకు మంకణున కాత్మదృగ్భోగి కంకణునకు॥
(భీమ ఆ 5 వ 3)

గీ॥ కాలమీవారఁ దరవారిఁ గడిగినాఁడ॥ (కాశీ ఆ 3 వ 30)

గీ॥ "వత్సలత మీఱ నలవోక వత్సమేఁక"॥ (కాశీ ఆ 5 వ 333)

వ॥ అక్కిరీటి చిక్కనిమనంబు పక్కగానక కానక కాసినవెన్నెలయుంబోలె.
(హర ఆ 7 వ 134)

వ॥ సాష్టాంగంబెఱఁగిన ఫల్గును ఫల్గున వాత్సల్య హేలాసముత్సేకంబున గాఢ గూహాన సంభావితుం జేసి (హర ఆ 7 వ 143)

వ॥ అని చూడఁజూడ నయ్యెందు చూడుండానంద క్రీడావాటికాక్రీడ క్రీడావిహార హేలాచికీర్షం బద్ధంబులోని నీడయుంబోలెఁ బాడసూపి యవిముక్తక్షేత్రపీఠంబగు వీరేశ్వరలింగంబునందుఁ గుడుంగఁబునందునుంబోలె డాగియుండె.
(కాశీ ఆ 3 వ 245)

ఇఁకఁ దక్కిన వృత్త్యనుప్రాసాదులను యమకమును నెలకొలుపుచు నీతఁడు ప్రకటించిన భంగులు పలుతెఱంగులు. మచ్చునకుఁ గొన్ని పరికింపుఁడు.

సీ॥ కుంభినీధరసుతా కుచకుంభపరిరంభ సంభావనా కేళి శాలిచేత
గగనకల్లోలినీ కల్లోలమాలికా స్ఫాలిత బాలేందు మౌళిచేత॥
(భీమ ఆ 2 వ 21)

సీ॥ చంద్రబింబానన చంద్రరేఖామౌళి నీలకుంతలభార నీలగళుఁడు
ధవళాయతేక్షణ ధవళాఖిలాంగుఁడు మానసంజీవిని మదనహరుఁడు
(భీమ ఆ 2 వ 147)

సీ॥ భవుభవానీభర్త భావసంభవవైరి భవరోగభంజను ఫాలనయను
భోగవద్భూషణభోగి భోగిరాజవిభూషు భూనభోభివ్యాప్తు భువనవంద్యు
భగవంతుభర్గుని భసితాంగరాగుని భానుకోటిప్రభా భాసమాను
భాగీరథీమౌళి భగదృగ్విపాటను భూరధాంగునిభద్రభూతిధరుని॥
(భీమ ఆ 3 వ 88)

క॥ నీహారభూదరేశ్వరు నీహారమణీయమూర్తి నిందుకరహిమా
నీహారహారకుముద సుధాహార సమానకాంతి నభివర్ణింతున్॥

(భీమ ఆ 3 ప 161)

వ॥ వెండియుఁ బాకవశవిశీర్ణ దిశాశాల్మలీగుల్మ తూలరాశి దేశీయంబులు వియదురగ నిర్మోకశకల భ్రమంబులు నభ్రముపతి శరీరశుభ్రంబులు నగు సితాభ్రంబుల భ్రంబునఁ బరిభ్రమించి ఖండఖండంబులై యాఖండల కోదండంబుల గగనమండలంబు నలంకరించె. (కాశీ ఆ 3 వ 23)

వ॥ అనంతరంబ యమ్మునీశ్వరుండు తపఃప్రభావంబున భవుని ఫాలలోచను భర్గు భాగీరథీతీరభవను భక్తనిధి భావనా సులభస్వభావు భజింతుఁ గాక యని భవభయోదన్వదుత్తారయాన పాత్రంబైన కాశీక్షేత్రంబునకుఁ జని (కాశీ ఆ 3 వ 223)

ముక్తపదగ్రస్తము ముఖ్యముగ నాశ్వాసాంతపద్యములలోనే క్వాచిత్కముగ నీతఁడు ప్రదర్శించినాడు.

ఉ॥ భానుసమాన మానగుణ బంధుర బంధురమానిదాన, దా
నానుకృతాంబువాహధన దాఁబురవాహన కామధేను సం
తానకకర్ణ కర్ణసుఖదాయి వచోరచనాధురీణ, రీ
ణానతరాజ, రాజమకుటాంఘ్రి సరోరుహ భావితాత్మకా॥ (నైష ఆ 3 ప 206)

మ॥ అవనీభారధురీణ, రీణరిపుసైన్యాధీశ, ధీశక్తివై
భవలీలాజితకావ్య కావ్యరచనా పారీణతావాస, వా
సవభోగ ప్రతిమాన, మానవినయాచారార్ధ సంభార, భా
రవిసంకాశ మహాకవీంద్ర పరిషత్ప్రస్తూయమానోదయా॥ (భీమ ఆ 4 ప 211)

వచనరచనయందుఁగూడ శ్రీనాథుఁడు గనఁబఱచిన మెఱుంగులు బహుముఖంబులు. గద్యరచనమునందును గొన్ని యెడల నీతఁడు గాఢ దీర్ఘసమాసబంధముతో ధాటీకాఠిన్యములఁ బ్రతిపాదించును. మఱికొన్ని తావుల లలితములగు తెలుఁగుపదములను సంస్కృతశబ్దములను మేళవించి సమానపాటవము లేకుండ మృదుమధురరచనపచరించును. కొండొక పట్టుల నలఁతి యలఁతి తునియలనే నెలకొలిపి ముద్దుమురిపెములు గురియించును. ఋతువర్ణనలయందుఁ దత్తత్సమయముత్పన్నములగు సస్యసంతతుల సౌందర్యమును బ్రదర్శించుచుఁ బ్రన్నని సన్నసన్న శబ్దములతో విన్నాణమ్మును మెఱయించును.

"ఓం జయజయ దేవదేవ! గంధర్వ సిద్ధ విద్యాధర చారణ కిన్నర కింపురుష లహంపూర్వికా సంఫుల్లపుటంబు లగు చేతస్సంపుటంబులం బుటపుట నగు భక్తివిశేషంబుల శేషాహికటకభూషావిశేషాభిరామంబులగు మీ కోమల శ్రీపాద కిసలయంబుల ఘుసృణమణి కోటీకోటీవిటంక సందానిత మందార మాలికా మకరంద బిందుధారా ధోరణీప్రవాహంబుల నహరహంబును నభిషేకింతురు;...... (భీమ. అ-3 వ-211)

"అక్కటకటా! దైవంబ నీకంటికి జేలగింజయుం బెద్దయయ్యెనే? జననీ! ముదిసి ముప్పుఁ గాలంబున సుతశోకసాగరం బెబ్బంగి నీఁదఁ గలదానవు? ప్రాణేశ్వరీ! యేచందంబున మద్విరహవేదనాదవానలంబునకు దరికొనియెదవు. సఖులార! యేప్రకారంబునం బుటపాకప్రతీకాశంబైన కరుణరసంబునఁ బురపురం బొక్కెదరు. బిడ్డలార! యేలాగున నతితృష్ణాపాసాకులంబులై కులాయకూలంబులం గులకులం గూసెదరు...

(నైష. అ-1 వ-110)

"కావునం దీరంబులేని విరహభారపారావారంబున మునుంగం బాఱుచున్న నాకుం దెప్పగా విరించి నిన్నుఁ గల్పించినాఁడు. మిముబోంట్లగు పెద్దల గుణంబులు పరార్థప్రవణంబులుగదా. పోమ్ము, గార్యమ్ము సాధింపుము. పునస్సమాగమంబయ్యెడు నీవు వచ్చునంతకు నిచ్చోటన యుండుదుం జుమీ. చూతముగదా నీగమనవేగం బని పల్కి యన్నీడజంబు వీడుకొల్పి క్రీడావనంబులో నొక్క నికుంజక్రోడంబునీడ నన్నరేంద్రుండు చంద్రకాంతశిలాతలంబున విశ్రమించి, రాయంచపలుకులు మనంబునం దలపోయుచుండె. (నైష. అ 2 వ 35)

"దివ్యస్వయంభూజ్యోతిర్లింగమూర్తి భీమేశ్వరుండు నిర్వికల్పంబును నిరస్తసమస్తోపాధికంబును నైన నిష్కళంకస్వరూప బు విడిచి, యారకూటపాటలంబై కుసుంభచ్ఛాయ నగు జటాఘటలంబును బాండురపుండరీకముకుళడుండుభంబు లను కంఠ నంకురింపం జేయుంజాలు బ్రహ్మకపాలమాల్యంబును, జిఱునవ్వు జిగి మొఱుంగిడిన చెక్కుటద్దంబుల నీడ చూచు నిద్దంపు నాగకుండలంబులును, గోత్రయుఅనంజ కెంజాయ రంజిలు కాఱుమొగులు కైవడిఁ జిలుపచిలుపని నెత్తురుల జొత్తిల్లిన పచ్చియేనికతోలు పచ్చడంబును, గంఠోత్కంఠ భువన భవన రక్షణ దాక్షిణ్య లక్షణ కస్తూరికాలేపననైపథ్యంబునుం బోని కాలకూటవిషమషీకంఠంబును, సాయాహ్నసమయసంఫుల్లమల్లికాకుసుమసముల్లాసంబు నుల్లసంబాడు తెల్లని మేనును......ధరియించి...

(భీమ అ 4 వ 123)

"ఇవ్విధంబున సురాసురవ్యూహంబు లుత్సాహంబులు మదంబులు ముదంబులు శౌర్యంబులు ధైర్యంబులు క్రౌర్యంబులు వీర్యంబులు హుంకారంబులు హుంకారంబు లుల్లాసంబులు ప్రహాసంబులు బలంబులు చలంబులు జవంబులు రవంబులు నదల్పులు విదల్పులు తీకలు తాఁకులు ఱాఁకలు కూఁకలు మూఁకలు పేఁకలు తెగింపులు నగింపులు నింపులు సొంపులు పెంపులు గుంపులు పరువులు మురువులు గెలుపు మొలుపు మాహా వష్టంభ సంరంభ విజృంభణంబునఁ దరతరంబు తరువం దరువఁ దరితాడు పాపతేని యొడలు మలకలు పురులువిడి తరులువడి...... (భీమ అ 4 వ.60)

"దక్షారామ కటకాప్సరస్తాటంకినీ వదనారవిందలావణ్య బిందునిష్యందంబు చందురుఁడు కందర్పదిగ్విజయకీర్తి స్ఫూర్తియుంబోసి యచ్చవెన్నెల విచ్చలవిడిం గాయం దొడంగె. కుముదంబులు ముదంబందె, లాంగలి చెంగలించె, తెల్లులసిల్లె, కాసర గాచె, దోస దోరగిలంబారె, పయ్యెర విసరె, వారివం డఱియె, కరిమదంబు గురిసె, వంచిపోతు పోతరించి ఖణిల్లున ఱంకెవైచె, అస లడుగుపడియె, నెఱి నిసుకదబ్బ చూపె, నిద్ర చవియయ్యె, ఏడాకులపొన్న క్రన్నన పెరిగె, వరిగ వెరిగె, గసగస యొనక మొనఁగె, పెసరుసురుకొనియె, దవసిక పొదలె, తెక్కపాసంగు ముక్కపడియె, మదకలకలహంస సారసకలాలాపకోలాహలవ్యాజృంభితశకు భంబులయిన విహారవేశం తంబులు కాంతాకుచద్వయద్వయసవారిపూరితంబు లయ్యె. నయ్యవసరంబున (కాశీ అ ౨ వ 23)

జాతీయములగు పలుకుబడులను దెలుఁగు నుడికారపు సొంపుమెఱయు సామెత లను సమయోచితముగఁ బ్రయోగించుటలోఁ గూడ నితఁడు జాణతనమును బ్రకటిం చును. మచ్చునకుఁ గొన్ని పరికింపుఁడు

గీ. పైత్యదోషోదయంబునఁ బరుసనైన
జిహ్వకుఁ బంచదారయుఁ జేదుగాదె (నైష అ 2 వ 82)

గీ॥ ఆలుమగఁడును నొకకుత్తుకైనఁగాక యిట్టిధర్మంబు మిన్నక యేలకలుగు॥ (హర ఆ 2 వ 76)

గీ॥ దానవుఁడుగాక వాఁడేటి తండ్రిచెపుమ చెక్కగీటిన వసవల్చు చిఱుతవాని॥ (హర ఆ 2 వ 60)

ఉ॥ కట్టియచూడఁగ దోసకాయలె విశుద్ధ యశోధన! యన్యచిత్తముల్॥ (హర ఆ 2 వ 63)

గీ॥ ఆవగింజంత బూదిమై నలఁదికొనిన వెలఁది గుమ్మడికాయంత వెత్తిపుట్టు॥
(హర ఆ 2 ప 99)

క॥ "మానవతీ! మగవాఁడో మానో" యనుమాట నేటి మాటయె చెప్పుమా॥
(హర ఆ 2 ప 100)

చ॥ పడితిమి కుక్కలుంబడని పాటులు............లోఁ
బడితిమి పాలలోఁ బడిన బల్లుల కైవడి............ (హర ఆ 3 ప 15)

క॥ పఁకింపఁ జంకదుడ్డును శరణార్థియు నను నట్టిచందము దోఁచెన్॥
(హర ఆ 7 ప 17)

గీ॥ పువ్వుముడిచిన పురవీథి భూమియందుఁ గట్టె మోవంగవలసిన కారణమున॥
(భీమ ఆ 2 ప 10)

ఉ॥ ముక్కు మొగంబు చూడ కొక మోసపుమాటకు విశ్వనాయకుం
డెక్కడికైనఁ బొమ్మనుచు నెట్టనిచూపులఁ జూచెనల్కతో॥ (భీమ ఆ 3 ప 8)

మ॥ సరిసామంతుఁడు శ్రీకుమార వనితా చాళుక్య భీమేశ్వరే
శ్వరు దేవుం డుపకంఠ బాంధవుఁడు శ్రీ సంవేద్యరాడ్భైరవుం
డిరువుంబొర్వును బల్వలేశుఁడు మృకండేశుండు గానేల........."
(భీమ ఆ 5 ప 89)

గీ॥ అడుసులోపలఁ దాటిపం డదిమినట్టు లదుమునునె కాని॥ (కాశీ ఆ 1 ప 114)

గీ॥ ఉడుము నడికిననడుకునే జడియపెట్టు (కాశీ ఆ 2 ప 144)

గీ॥ మోసపోక మున్నాసమ్మూ ముద్దరాలు దారెనడిసప్పులేక పాతాళమునకు
(కాశీ ఆ 5 ప 289)

గీ॥ చులకఁగాల్వట్టి యీడ్చినఁ జూరువట్టి వేలుదురుగాక తనవారి విడుతురెట్లు॥
(కాశీ ఆ5 ప 293)

మ॥ ననకల్దాఁచినఁ బెండ్లిమానునొకో! దుశ్చారిత్రముల్ గంటిరే॥
(కాశీ ఆ 5 ప 311)

గీ॥ ఈశ! పల్లేరుదుడిచి పాడెక్కినారు (కాశీ ఆ 6 ప 155)

గీ॥ వంటయిలుసొచ్చెఁ గుండేలు వనజనయన॥ (కాశీ ఆ 6 ప 221)

గీ॥ మొనసి హితమాచరించిన ముండముక్కు
కోఁతపడెననుమాటయే గోచరించె॥ (కాశీ ఆ 6 ప 225)

గీ॥ అవ్విశిష్టుఁడు విష్టపాభ్యంతరమున
వీసమంతటిమాత్రంబు వెలితిసృష్ట॥ (కాశీ ఆ 6 ప 277)

గీ॥ కిన్నరాధీశు నగరికిఁ గీసవెలితి॥ (శివ ఆ 2 వ 3)

గీ॥ తాతకట్టిన చేఱువంచుఁ దగునెమునుఁగ
నిల్లు విడువంగలేక చావేలమనకు?॥ (కాశీ ఆ 6 ప 294)

గీ॥ అదివిహంగమమేను విహంగమంబ
పెసరగింజకుఁ దక్కువే పెసరగింజ॥ (కాశీ ఆ 6 ప 296)

గీ॥ అల్లువారికి నెల్లనీ యవగుణంబు
వెన్నతోఁ బెట్టినదియింత విసువనేఁ॥ (కాశీ ఆ 7 ప 50)

గీ॥ ఏమి గుడువంగవచ్చినా రిండ్లువిడిచి
హరుని వెలివెట్టినట్టి యీయాగమునకుఁ
బంచవదనుని కనుజేవురించనేని
తల్కుణముసంద తమయాండ్రు త్రొళ్ళుదగవె॥ (కాశీ ఆ 7 వ 60)

గీ॥ కాలకంఠునికంటె ముక్కంటికంటెఁ
దీర్థములు దైవములు లేవు త్రిభువనముల
సత్యమింతను సత్యంబు సంయమీంద్ర! (కాశీ ఆ 7 ప 122)

గీ॥ ఒట్టువెట్టినభంగినే యుగ్మలియును
బిలిచి యొకపట్టెడన్నంబు వెట్టదయ్యె॥ (కాశీ ఆ 7 ప 135)

గీ॥ చేంపంటలఁ గొయ్యలే చెప్పఁగాదె॥ (కాశీ ఆ 7 ప 143)

ఉన్నయూరు కన్నతల్లియు నొక్కరూపన్న కీతి॥ (కాశీ ఆ 7 వ 163)

## శ్రీనాథుని పాండిత్యము.

శ్రీనాథుని శిష్యుఁడు మఱఁదియు నగు దగ్గుబల్లి దుగ్గనామాత్యుఁడు తన నాసికేతోపాఖ్యానమున శ్రీనాథుని నుతించుచు వ్రాసిన "సంస్కృత ప్రాకృత శౌరసేనీముఖ్య భాషాపరిజ్ఞాన పాటవంబు......" అను పద్యమును మునుముందే యుదాహరించియుంటిమి. అందువలన నాతని బహుభాషాపరిజ్ఞానము వేదవేదాంత న్యాయవైశేషిక సాంఖ్య శబ్దశాస్త్రాది పాండిత్యము పాఠకులకు ద్యోతకము కాఁగలదు. శ్రీనాథుని గ్రంథములను సవిమర్శముగఁ బరికించినచో నిందుకు వలసినన్ని నిదర్శనములు లభింపఁగలవు. గ్రంథవిస్తరభయంబున, గొలఁది దృష్టాంతములమాత్ర ముదాహరింతును.

చ. విలసితకీర్తిశాలియగు వీరమహేశ్వరు దేహరంబు శ్రీ
  నిలయమునం దిసంధ్యము ను...... (కాశీ అ 1 వ 49)

దేహర మనునది దేవాగారశబ్దమునకుఁ బ్రాకృతరూపముగఁ గాననగును.

శా. మాళిం గోహాళి సంఘటించిన క్రియన్ మధ్యాహ్నవేళన్ మహా
  కాశంబైన నభోవిటంకమున వీఁకన్ గాసె బీఱెండ (హార అ 7 వ 109)

ఇందలి కోహాళి శబ్దముగూడ "కుళ్ళాయి" లేక "మేలుకట్టు" యను నర్థమిచ్చు ప్రాకృత భాషాపదముగఁ గానవచ్చును. ఇట్టియర్థమునసే నాచన సోముఁడు గూడ దీనిని వాడి యున్నాఁడు. ఇట్లే మన నిఘంటువుల కెక్కని ప్రాకృతశబ్దము లనేకములు శ్రీనాథుఁ డడ నడఁ దన కృతులలో వాడియున్నాఁడు.

"గారాపుం గొడుకు పొలసు మేలోగిరంబుతోడం గూడ భరితభోజనంబు
  గా వడ్డించి...... (హార అ 2 వ 125)

భరితప్రితమన శైవులలోఁ గావలసిన భోజనపదార్థ మంతయు నొక్కమాఱుగ మును ముందే వడ్డించుకొని శివార్పితము గావించి యించుకయు మిగులకుండఁ బారణముసేయు ప్రసాదనియమము.

తోరహత్తంబునందుఁ బార్థుండు గడిమి సలిపె...... (హార అ 7 వ 83)

(తోరహత్తము = మల్లబంధవిశేషము)
(నాట్యపరిభాష)

చారీకరణాంగహారముల తావుల్ మెచ్చి కీర్తించుచున్ (కాశీ అ 3 వ 19)

ఇత్యాదిశబ్దములు శ్రీనాథునకుఁ బలువిద్యలందుఁ గల పారిభాషికపదవిజ్ఞానమును వెల్లడించును.

సీ॥ ముక్తిప్రయోజనంబునఁగు టీచకకోటి
  సావిత్రితత్త్వంబు సంగ్రహించెఁ
బరమహంసలు పుర బ్రహ్మార్థమీమాంస
  శోధించి రుపనిష ద్వీధులందు
నిగమాంతవాసనా నిర్వృతస్వాంతులై
  హంసులుండిరి దృఢైకాంతపదతఁ
బ్రిత్యగ్రకోజాల రజ్జునంబంధంబు
  దండంబులు బహూదకుండుదాల్చె (కాశీ అ 3 వ 236)

"పుండరీక చర్మాసనంబునఁ బ్రాఙ్ముఖుండై దక్షిణజానూరుమధ్యంబు వామపాదంబును, వామజానూరుమధ్యంబున దక్షిణపాదతలంబును విన్యసించి సమగ్రీవామూర్ధకాయుండును, సంవృతాస్యుండును నిశ్చలుండునునై, నాసాగ్రంబున సుధాధారాబిందు నిష్యందంబునందు నిందుబింబంబు వీక్షించుచుం బ్రాణాయామంబుచేసి........

(కాశీ ఆ 3 వ 239)

సీ॥ గజదైత్యదమనుండు కార్పాసఫలతూల
వర్తిప్రరోహ భావము భజింప
వడకు గుబ్బలిరాచ వారికూరిమికన్య
యాలంబనస్తంభ యష్టిగాఁగ
బరమవిశ్వాస తాత్పర్య నిర్భరభక్తి
సంపద్విశేషంబు చమురుగాఁగఁ
బ్రవితత ధ్యాన ధారాసముచ్ఛ్రాయంబు
సమధికోజ్జ్వలతర జ్వాలగాఁగఁ
గీ॥ గామమును గ్రోధమును నాదిగాఁగఁగలుగు
శాత్రవులు పాతకములైన శలభములుగ
విమలవిజ్ఞానదీపంబు వెలుఁగఁజేసె
సప్రతిమధైర్య సంపత్తి యాజ్ఞదత్తి॥ (కాశీ ఆ 4 వ 141)

"ఇవ్విధంబున యాజ్ఞదత్తి విజాతీయ ప్రత్యయావ్యవహిత సజాతీయ ప్రత్యయ సంతానానువృత్తి రూపంబైన నిధిధ్యాసనంబున నివాత నిష్కంప దీపంబునుంబోలెఁ బెద్దకాలంబు కాలకంఠు మంగళజ్యోతి ర్లింగమూర్తి సంతరంగంబున నాలింగనంబు సేయుచుండె.

(కాశీ ఆ 4 వ 142)

సత్యంబు నిత్యంబు శుద్ధంబు బుద్ధం బనంతంబు శాంతంబు కూటస్థ మాత్మ ప్రతిష్ఠం బఖండంబు సత్తద్ద్వితీయంబు చిత్తేజ మానంద మాద్యంబవేద్యంబు దిగ్దేశ కాలవ్యవచ్ఛేదనీయంబు బ్రహ్మంబు దత్తత్త్వముల్ వేదవేదాంతవిద్యా మహావాక్య మీమాంస హంసుల్విచారింతు రధ్యాత్మయోగంబునన్, షణ్ణవత్యంగులీమాన యుద్దేహ మధ్యాంతరాళానలావాస కోణత్రయీగేహ రోహత్ప్రభాలేఖికా స్యూతనిర్భిన్న షట్పుష్కరీగర్భ విష్కంభ నిష్కంప నీవార శూకోపమాధామ ధామచ్ఛటాకోటి శంపాలతాలంఘిత ద్వాదశారేందు నిష్యందమానామృతాసార ధారాప్లవా స్పందితానందులై యోగిబృం

దారకల్ లీలతో లోనఁ గండ్రితనిక్కనిక్కమై, యాతఁడొక్కండ భూతాత్మభూతంబు నందుండి నానాత్వముంబొందినట్లుండు నెట్లాఘటాంతస్థితంబై ఘటాకాశమయ్యుక్ మఠాంతస్థితంబై మఠాకాశమయ్యుక్ నిజంబొక్కయాకాశ మాకాశముల్ పెక్కులై నట్టి చందంబుల్ భ్రాంతి దోఁచుంగదా! (కాశీ ఆ 7 దండకము 73)

క॥ పరిణమిల్లిరి పులకాంకురములు మేనులఁ బొడమఁగ
వ్యాల్లేఖామంత్రోపవని పల్లవికా కుసుమమునకు సతియుంబతియుక్॥

(కాశీ ఆ 3 ప 39)

ఇత్యాదిస్థలములఁ దిలకించిన శ్రీనాథునకు మంత్రయోగశాస్త్రములందు సాంఖ్య వైశేషికాది తత్త్వములందుఁగల యభినివేశము వ్యక్తముకాఁగలదు.

గీ. అదవీయసి మోక్షపదవి యధికవివేకా (కాశీ అ 6 ప 294)

ఉ. వేదపురాణశాస్త్ర పదవీనదవీయసియైన పెద్దము
తైమవ...... (కాశీ అ 7 ప 160)

సీ. సాఖశాయనికులై సనకాది యోగీఁద్రు లనురాగ వీక్షణం బభిలషింప

(భీమ ఆ 4 ప 49)

మాలిని॥ సారస్వతశ్రీహిమితనుఃకవిరోధీద్ధ్రత్సరోజాతజాతా (భీమ ఆ 4 ప 213)

మ॥ నీ నయనాబ్జంబులకిచ్చు భవ్య శకునానందైక కల్యాణముక్
శయనోత్థాయము భోజరాజతనయా సంఫుల్ల నేత్రాబ్జముల్॥ (నైష ఆ 8 ప 3)

శా॥ ప్రాతఃకాలము వాయసంబు ఫణినాం పత్యుక్తశాస్త్రంబులో
దాతజ్స్థానులు చెప్పఁ డెవ్వియను చందంబొప్పఁ "గాకా" యనం
జాతుర్యం బలరార నుత్తరము విస్పష్టంబుగాఁ గోకిల
వ్రాతంబిచ్చెఁ "దుహీతుహీ" యని గృహారామప్రదేశంబులక్॥

(నైష ఆ 8 ప 19)

శా॥ మృత్స్నాస్వాదనప్రక్రియా వ్యాసంగంబునఁ గమ్రనైన
యదసీయంబైన బింబోష్ఠముక్ (శివ ఆ 2 ప 4)

ఈ మొదలగు తావులు శ్రీనాథుని "పన్నగ పతిసార్వభౌమ భాషితమహాభాష్య విద్యాసమభ్యాస బలము" వెల్లడింపనేర్చును. సంస్కృతకవులలోఁ గాళిదాసు, భవభూతి, బాణుఁడు, మయూరుఁడు, మురారి మున్నగువారి గ్రంథములలోని భావములకుఁ బదజాలమునకు నాంధ్రకవులలోఁ గవిత్రయ నాచనసోముల పద్యరీతులకు శ్రీనాథుని

కృతులందెల్ల ననేకములగు ననుకరణములు ననువాదములు గోచరించి యాతని "పూర్వకవి ముఖ్యవిరచితా పూర్వకావ్య భావరస సుధాచర్వణ ప్రౌఢతను" గాథముగ విశదీకరించును. వాని కిట నుదాహరణము లొసంగిన మఱింత గ్రంథవిస్తరమగును. కాన నందుకుబూనుకొనను.

### శ్రీనాథుని యవసానము.

ఎట్టివారికిని గాల మొక్కరీతిఁ గడువఁబోదు.. శ్రీనాథుఁడెవ్వఁడును గీర్తిధనము కొఱకుఁ బ్రాకులాడినవాఁడేగాని దఃధనంబగు వట్టిధనము నార్జించుటకుఁగాని దానిని నిలువసేయుటకుఁగాని పాటుపడినవాఁడు గాఁడు. ధనసంపన్నులగు రాజాధిరాజులయుఁ దదుద్యోగులయు నాశ్రయ మెంతయున్నను గేవల ధనార్జనమునకయి దానినాతఁ డుపయోగించుకొనియుండలేదు. ప్రదాతయని పేరువడసిన కమలనాభామాత్యుని మనుమఁడవుటచే నుపలబ్ధమయిన ధనము నెప్పటికప్పు డాశ్రితసంరక్షణమునకుఁ గుటుంబపోషణమునకు వినియోగించుటయేకాని ముప్పుగడచుటకయి యాతఁ డేమియు మూటగట్టినట్లు కానరాదు. శ్రీనాథుని యవసాన మెట్లుగడచెనో సరిగా నిర్ణయించుటకుఁ దగిన యాధారములు లేవు. కాని శ్రీనాథరచితములేయని పలువురు విశ్వసించు నీక్రిందిపద్యములవలన నాతఁడు వార్ధకమున మిక్కిలి యగచాట్లకు లోనయినట్లు కానవగును.

సీ॥ కవిరాజుకంఠంబుఁ గౌఁగిలించెనుగదా
పురమేఁగ నెదురెండ బొగడదండ
సార్వభౌముని భుజాస్తంభ మెక్కెనుగదా
నగరివాకిటనుండు నల్లగుండు
ఆంధ్రనైషధకర్త యంఘ్రియుగ్మంబున
దగిలియుండెనుగదా నిగళయుగము
వీరభద్రారెడ్డి విద్వాంసుముంజేత
వియ్యమందెనుగదా వెదురుగొడియ
గీ॥ కృష్ణవేణమ్మ గొనిపోయె నింతఫలము
బిలబిలాక్షులు తినిపోయెఁ దిలలుఁ బెసలు
బొడ్డుపల్లెను గొడ్డేఱు మోసపోతి
నెట్లు చెల్లింతుఁ డంకంబు లేడునూర్లు॥
సీ॥ కాశికావిశ్వేశుఁ గలిసె వీరారెడ్డి
రత్నాంబరంబు లే రాయఁడిచ్చుఁ

కైలాసగిరిఁబంట మైలారవిభుఁ డుండెఁ
దినవెచ్చమే రాజు తీర్పఁగలఁడు
రంభఁగూడెఁ దెనుంగురాయ రాహుత్తుండు
కస్తూరి కే రాజుఁ బ్రస్తుతింతు
స్వర్గస్థుఁ డయ్యె లిప్పనమంత్రి మఱి హేమ
పాత్రాన్న మెవ్వని పంక్తిఁగలదు
గీ॥ భాస్కరుఁడు మున్నె దేవుని పాలికరిగెఁ
గలియుగంబున నింకనుండఁ గష్టమనుచు
దివిజ కవివరు గుండియల్ దిగ్గురనఁగ
నరుగుచున్నాఁడు శ్రీనాథుఁ డమరపురికి॥

ఈపద్యములు చాటువులగుటచేతను నివి శ్రీనాథకృతములే యని నిశ్చయించుటకుఁ దగిన ప్రమాణములు లేకుండుటవలనను శ్రీ గురుజాడ శ్రీరామమూర్తి పంతులు గారు వీని కర్తృత్వమునుగూర్చి శంకించిరి. ప్రథమపురుషములోనున్న రెండవపద్యమును బ్రాణావసానసమయమున శ్రీనాథుఁడు స్వయముగఁ బలికియుండుట కొంతవఱకు సంశయాస్పదమగుటచే నాపద్యమును శ్రీనాథు నుద్దేశించి మఱియొకఁడెవఁ డయిన రచించియుండునని తలంపఁదగునేమో కాని మొదటిపద్యమునుగూడ నట్లే యితరులు చెప్పియుందు రనుట కవకాశము కానరాదు. అట్టిపద్యము నన్యులు చెప్పనవసరముండదు. అది తప్పక శ్రీనాథకృతమే యని యంగీకరింపఁదగును. రాజమహేంద్రవరమునఁగూడ రెడ్డిసామ్రాజ్య మస్తమించిన యనంతరము నిలువ నాశ్రయములేక మరల జన్మమండలమునకేఁగి "కృషితో నాస్తి దుర్భిక్షమ్" అను సూక్తి నాలోచించి శ్రీనాథుఁడు వ్యవసాయమునకుఁ గడంగి యప్పటి దేశనాయకులయొద్దఁ గొంతభూమిని కృష్ణాతీరమున గుత్తకుఁ గొనియుండును. కాని దినములు మంచివి కానప్పుడే కృషియు ఫలింపనేరదుగదా! బొడ్డుపల్లె నేఁడు కృష్ణాతీరమునఁ గానరాదు. ప్రాయశః కాలవశమున నది నదీగర్భమున నడఁగియుండును. కృష్ణానది వఱదవలనఁ బండినపంట నష్టమయి యేర్పఱచుకొన్న పన్ను చెల్లింపనేరనప్పుడు కవితారసికులు కాని యప్పటి నాయకులు పన్నుకయి శ్రీనాథుని పలుబాములఁ బెట్టియుందురు. అప్పుడా యెడ్డెదొరలకు శాశ్వతమగు నపకీర్తి కలుగునట్లు వారినిమాత్రమేమియు నిందింపక తనకర్మమునే దూఱుకొనుచు శ్రీనాథుఁడు పయిచాటువులలో మొదటిపద్యము చెప్పియుండును. దీనిని జదివి కంటఁదడిపెట్టని కవితాభిమాను

లుండఁజాలరు. దైవోపహతుండయి శ్రీనాథుఁ డవసానమున నెట్టికడగండ్లకు లోనయి నను నది యాతని చరిత్రమున కేపాటి కళంకమును గలిగింపక యాతని కీర్తిమూర్తిని నాంధ్రహృదయముల బాగుగ హత్తించి యాతనియెడ భక్తిగౌరవములఁ బెంపొందించు టకే మఱింత తోడ్పడఁగలదని నానమ్మకము.

మన కర్తవ్యము.

మహాశయులారా! శ్రీనాథుఁడు రెడ్డిసామ్రాజ్య కీర్తివిస్తారమునకు, ఆంధ్ర సారస్వతస్ఫూర్తివికాసమునకుఁ గావించిన పరిశ్రమ మనిర్వచనీయము సంతతస్మరణీయము రామరాజ భూషణుఁడు తన వసుచరిత్రమున ఆంధ్రవాఙ్మయమునకుఁ బోషణకర్తగా సంభావించిన యీ కవిసార్వభౌముని ఋణమును నాంధ్రసోదరు లెన్నటికిఁ దీర్పఁజాలరు. ఆతని గ్రంథముల సేకరించి చక్కఁగ ముద్రించి సవిమర్శముగఁ బఠించి యానందించుటకంటె నామహాపురుషునియెడ మనము చూపఁదగిన విశేషకృతజ్ఞత యుండనేరదు. శ్రీనాథుఁడు రచించితినని చెప్పికొనిన గ్రంథములలో మరుత్తరాట్చరిత్ర శాలివాహన సప్తశతి, పండితారాధ్య చరిత్రము నిప్పటికిఁగూడ నలభ్యములే. లక్షణగ్రంథోదికోదాహరణములవలన నాతని పేర వినవచ్చు నందనందన చరిత్రము, వల్లభాభ్యుదయము, ధనంజయవిజయముకూడ నింతవఱకు దొరకలేదు. ఇఁక నాతఁడు చెప్పినట్లు తెలియవచ్చు గేయకృతులు పలనాటి వీరచరిత్ర, కాటమరాజుకథ మున్నగువానిగతి పయిని వివరించియే యుంటిని. ఉపలబ్ధములయి ప్రచారమందున్న శృంగారనైషధము హరవిలాసము, భీమఖండము, కాశీఖండము, శివరాత్రిమాహాత్మ్యమునను కావ్యములు గూడఁ బరిశుద్ధములగు ప్రత్యంతరములు పరిశోధించి సరియైన పాఠములతోఁ బరిష్కరించి బాగుగ ముద్రింపఁబడలేదు. వీనిలోఁ గడపటి మూఁడుగ్రంథముల ముద్రణము చాల శోచనీయస్థితియందున్నది. కావున రెడ్డిచరిత్రాభిమానులుఁ ఆంధ్ర భాషాభిమానులు విశేషపరిశ్రమ మొనర్చి యలభ్యములగు శ్రీనాథుని కృతులను సంపాదించుటయు, ముద్రితగ్రంథములకుఁగూడ జక్కని వ్రాఁతప్రతులను సేకరించి యొక పండిత పరిషత్తు నేర్పఱచి మూలగ్రంథములయినను బాగుగఁ బరిష్కరించి యా పరిషత్పక్షమునఁ బరిశుద్ధముగఁ బ్రకటించుటయు నత్యంతావశ్యకమయియున్నది. శ్రీమంతులగు భూపాలురు, విశ్వవిద్యాలయాధికారులు గూడ నిందుకుఁ దోడ్పడి శ్రీనాథుఁ డాంధ్రభాష కొనర్చిన మహోపకారమున కాతని ఋణమును గొంతవఱకయినఁ దీర్చి కృతార్థులయ్యెదరు గాక యనిప్రార్థించెదను.

# కాటయవేముని వైదుష్యము.

వ్యాకరణ విద్యాప్రవీణ విద్వాన్ చిలుకూరి పాపయ్యశాస్త్రి.

ఆంధ్రదేశమున జనించి, ఆంధ్రదేశమును పాలించిన కుమారగిరిరెడ్డికి-ఇంద్రునకు బృహస్పతివలె, యుధిష్ఠిరునకు శ్రీకృష్ణునివలె మంత్రిత్వము నెఱపి, తనయసహాయశూరతచే సంగ్రామార్జునుఁడను ఖ్యాతివడసి, ప్రభువై, పండితుఁడై, కవిపండితపోషకుఁడై ఖ్యాతిగాంచిన యుత్తమపురుషుఁడు కాటయవేముడు. ఈతఁడు మారక్ష్మాపతిపౌత్రుఁడు. అనవేమభూపాలుని దౌహిత్రుఁడు. ఈశుభచరిత్రునిఁ గన్న తలిదండ్రులు కాటక్షోణిపతి దొడ్డాంబికలు. కుమారగిరితోఁ బుట్టువయగు మల్లాంబిక యీతని యర్ధాంగి. ఈతని శూరతకుఁ గార్యచతురతకు మెచ్చి కుమారగిరి, రాజమహేంద్రవరము ముఖ్యగు తనరాజ్యమునందలి తూర్పుదెస నీతనికిఁ బాలింపుమని యిచ్చినట్లు తొత్తరమూడిశాసనము దెలుపుచున్నది.[1]

ఈతఁడు మంత్రిత్వము నంగీకరించి కార్యములఁ జక్కఁ జేయునపుడు కుమారగిరిరెడ్డి శత్రుజయభారమంతయు నీతనికి వదలి, తానెల్లపుడు నర్తనప్రదర్శనములతోడను, వసన్తోత్సవములతోడను గాలము గడపెనఁట.[2]

అట్లు మంత్రిపదవియందున్నప్పుడే యీతఁడు వైరికుల పరశురాముఁడై దుర్గముల

---

1. శ్లో. కుమారగిరి భూపాలో యస్మై విక్రమతోషితః
ప్రాదాత్ ప్రాచీం భువం రాజమహేంద్రనగరీముఖాం.

See Epigraphia Indica Vol. IV page 318-327.

2. భాగ్యం నామ సమగ్రమీదృశ మతిస్నేహైకపాత్రం యతో
వీరం కాటయవేమ ముద్ధతరిపుధ్వంసే నియుజ్యస్వయమ్
నిత్యం నందతి నర్తనై రభినవైః కాన్తై ర్వసన్తోత్సవైః
సంతానాభ్యుదయైః కుమారగిరి భూపాలో నృపాలోత్తమః.

మాళవికాగ్నిమిత్రవ్యాఖ్య. శ్లో. ౨.

జయతి మహిమాలోకాతీతః కుమారగిరి ప్రభోః
సదసి లకమాదేవీయస్య ప్రియా సదృశీప్రియా
నవసుఖినయం నాట్యార్థానాం తనోతి సహస్రధా
వితరతి బహూనర్థానర్థి వ్రజాయ సహస్రశః.

శాకుంతల వ్యాఖ్య. శ్లో. 3.

నైదింటిని జయించి, కొండవీటిరాజ్యసీమను సింహాచలమువఱకు వ్యాపింపజేసెను.[3] కుమారగిరివలనఁ బారితోషికముగ నందిన భూభాగమిదియే. తనకు రాజ్యము నొసఁగి విఖ్యాతునిగఁ జేసిన కుమారగిరియం దీతనికి కృతజ్ఞత మెండుగఁ గలదు. కావుననే కాటయవేముఁడు తాను నెలకొల్పిన శాసనములందుఁ దఱచుగ కుమారగిరిని, తత్పూర్వులను నుగ్గడించియే యున్నాఁడు. ఇంతియగాక కుమారగిరి రచియించిన 'వసన్తరాజీయ'మను నాట్యశాస్త్రగ్రంథము నుదాహరించుచు 'కుమారగిరిరాజీయ'మను పేర కాళిదాసుని రూపకత్రయమునకు వ్యాఖ్య యొనరించినాఁడు. ఈ విషయములన్నియు శాకుంతలవ్యాఖ్యానారంభమున విపులముగఁ దెలిపినాఁడు. ఆశ్లోకముల నిటఁ బొందు పఱుచుచున్నాఁడను.

కీర్తిప్రతాప సౌభాగ్య త్యాగభోగవిభూతిభిః
ఏకఏవ కలౌశ్లాఘ్యః కుమారగిరిభూపతిః. ౧
వీర శ్రీరమణీవిలాసముకురో వైరిగ్రహగ్రామణీః
సర్వగ్రాసవిధుంతుదః సితయశః పుష్పాభివర్షీ ఘనః
దత్తాశాసనపత్రికా వసుమతీరక్షావిధౌ శంభునా
ఖడ్గో దిగ్విజయీ కుమారగిరి భూభర్తుస్సముజ్జృంభతే. ౨
జయతి మహిమాలోకాతీతః కుమారగిరిప్రభోః
సదసిలకుమాదేవీ యస్యశ్రియా సదృశీప్రియా
నవమభినయం నాట్యార్థానాం తనోతి నవహస్రిధా
వితరతి బహూనర్థానర్థిప్రజాయ సహస్రశః. ౩
రాజవేశ్యా భుజగః శ్రీ కుమారగిరి భూపతిః
శస్త్రీ కాటయవేమస్య ప్రిగల్భా తత్రిదూతికా. ౪
పాదారవిందాత్పరమస్య పుంసో
వర్ణశ్చతుర్థోఽజని విశ్వవంద్యాత్
పునాతినిత్యం భువనాని సింధుః
పుణ్యైః ప్రవాహైః సహజాయదీయా. ౫
వంశేఽస్మిన్నుదితో మహీయసి మనోర్వంశే జగత్పావనే
ధీరోదాత్త గుణోత్తరో రఘురివ శ్రీకాటయాఖ్యోనృపః
దానక్రీత్రిపరేణ యేన విదధే భూదేవసంతర్పణం
భూయింష్ఠైః పరిపంథిపార్థివ జగయ [1]వ్యాకేనలధైర్యాఙ్గవనైః. ౬

తస్మాద భూదఖిల [2]ధర్మవిదాం వరేణ్యో
[3]కుమారక్ష్మాధిపతి రప్రతిమప్రభావః
అన్యానపాస్య నృపతీనభిరూపముచ్చై
ర్వవ్రే స్వయం యమజ మిందుమతీవ కీర్తిః. ౭
తస్యాస్తాం తనయౌ సమగ్రవినయౌ విఖ్యాతదోర్విక్రమౌ
కాటక్షోణిపతిశ్చ [4]కుమారనృపతిః కాన్తానితాన్తౌజసా
లక్ష్మీకీర్తి వసుంధరాభి [5]రభజ త్సౌభాగ్యమాద్య స్తయోః
కౌసల్యాది వధూజనై ర్దశరథశ్శోభాం ప్రపేదేయథా. ౮
అసహాయ శూర ఇతి కాటయప్రభుం
ప్రవద న్తి [6]కుమారనృపతే స్తనూభవం
భువనాది దుర్గజయ సాహసేనయో
జలదుర్గమల్ల బిరుదః ప్రశస్యతే ౯
పృథ్వీం బ్రాహ్మణసాచ్చకార విదధే [7]హేమాద్రి దానానియః
సోపానావలి మాతతాన[8] విషమే పాతాలగంగాపథే
దొడ్డాంబా ముపయమ్యతస్య తనయాం వేమప్రభోః కాటయః
పుత్రం వీరమలబ్ధ రామసదృశం వేమం విభూత్యై భువః. ౧౦
గుణానాం పుణ్యానాం వసతి [9]రనపోతక్షితిపతేః
స్వసా శ్రీ దొడ్డాంబా సమభవదుమాయాః ప్రతినిధిః
పితా భూభృన్నాథః పతిరపిమహేశః ప్రియసుతో
మహాసేనో యస్యాః స్వయమథయ దార్యేతి కథితా. ౧౧
[10]కుమారక్ష్మారమణః పితామహతయా, మాతామహత్వేనచ
శ్రీ వేమక్షితినాయకః ప్రథయతే యస్యాభిజాత్యశ్రియమ్
ధన్యః కాటయవేమభూపతి రసౌయద్భాగినేయ స్తతో
జామాతాస్వయ మన్నపోతనృపతేః క్షోణీశచూడామణేః. ౧౨
శ్రీకృష్ణేనసమః కుమారగిరి భూపాలో నృపాలో త్తమః

---

పరిషద్భాండాగారమునందలి 1864 సంఖ్యగల తాటియాకుప్రతియందలి పాఠభేదములు—

1. పార్థివజన వ్యాపాదలబ్ధైః. 2. అఖిలధర్మవిదాం. 3. రామ. 4. రామనృపతిః. 5. అభవ త్సౌభాగ్యం. 6. రామ. 7. సోమాదిదానాని. 8. విషయే. 9. రకరో త్తత్ క్షితిభువః. 10. రామ.

స్వామీయస్య వసన్తరాజ బిరుదో[1] వీరాన్నపోతాత్మజః
సంగ్రామార్జున మామనన్తి సుధియస్తం భీమసేనాకృతిం
భూమా కాటయవేమః భూధరమహః కర్ణప్రియాస్తద్గుణాః. ౧౩
వల్లాలపంచక మకరో త్ప్రధనే నిర్జిత్య వైరిణోరామః
వైరికులపరశురామః కాటయవేమస్తు కీర్తివార్ధిశతమ్. ౧౪
ధాటీఘోటీ ఖురాగ్ర త్రుటితగిరితటే యత్ర[3] మాల్లేటిదుర్గం
దుర్గం కిమ్మీరసంజ్ఞం దలితరిపుబలే దుర్గమంకొండపూంశిమ్
దుర్భేదం వజ్రకూటం జితవతి రభసా రామగిర్యాఖ్యదుర్గం
విఖ్యాతం వీరఘోటం గలిత మనుష్యాదాం[4] వీరసన్నాహధార్ష్ట్యమ్. ౧౫
మునీనాం భరతాదీనాం భోజాదీనాంచ భూభుజామ్
శాస్త్రాణి సమ్యగాలోచ్య నాట్యవేదార్థవేదినామ్. ౧౬
ప్రోక్తం వసన్తరాజేన కుమారగిరి భూభుజా
నామ్నా వసన్తరాజీయం నాట్యశాస్త్రం యదుత్తమమ్. ౧౭
తత్ప్రోక్తేనైవమార్గేణ దర్శితాశేషలక్షణమ్
కవీనామాశ్రయో మంత్రీ కాటభూపతనూభవః. ౧౮
సోఽయం వేమవిభుః కుమారగిరిణా రాజ్ఞానియుక్తః కృతీ
నాట్యానాం త్రితయంకృతం కృతధియా శ్రీ కాలిదాసేనయత్
తస్యోదీర్ణరసార్ణవస్య రసికః శాకున్తలాదేస్స్వయం
వ్యాఖ్యానంకురుతే కుమారగిరి రాజీయాఖ్యమస్మైహితం.

కీ. శే. జయంతి రామయ్యపంతులుగారు Epigrophia Indica Vol. IV (1896-97)లో కాటయవేముని తొత్తరమూడి శాసనమును ప్రకటించుచు, దాని కనుబంధముగ నీశ్లోకములను ప్రకటించియున్నారు. ఆనాఁడు వారి కీశ్లోకములు పరవస్తుజగన్నాథస్వామిగారివలన లభించినట్లును దెలిపినారు. పిమ్మట పరిషత్పత్రిక 10వ సంపుటము 1వ సంచికలో బ్రహ్మశ్రీ పెండ్యాల సుబ్రహ్మణ్యశాస్త్రిగారు వీనిలో 15 శ్లోకములను (పాదారవిందాత్పరమస్య పుంసః అనుశ్లోకము మొదలుగఁ దుదివరకు) మాత్రము ప్రకటించినారు.

పరిషత్పుస్తకభాండాగారమునందలి 1864 సంఖ్యగల వ్రాతప్రతియందుఁబైశ్లోకములన్నియుఁగలవు. కాని 1940 లో బాలమనోరమాగ్రంథమాల వారు ప్రకటించిన

1. వీరో. 2. భూభుజం. 3. మాల్లెపిదుర్గం. 4. దుర్గసన్నాహ.

యీ శాకుంతలవ్యాఖ్యానమునఁ బైశ్లోకములు లేవు.

కాటయవేమునిఁగూర్చి, యీ శ్లోకములు దెలుపుచరిత్రాంశములకును శాసనముల వలనఁదెలియు నాతని చరిత్రాంశములకును సామ్యమేగాని విరోధముగానరాదు. ఈశ్లోకములవలనఁ దెలియు కాటయవేముని వంశవృక్ష మీరీతిగ నున్నది.

కాట




మారనృపతికి, కాటనృపతి మారలేక రామనృపతియును పుత్త్రులిద్దరున్నట్లు లీశ్లోకములు మాత్రమే తెలుపుచున్నవి. శాసనములం దట్లగపడదు.

వీనిలో నాల్గవశ్లోకమున 'సదసిలకుమాదేవీ యస్యశ్రియాసదృశీప్రియా' అను చోట 'యస్య ప్రియాసదృశీప్రియా' అనుపాఠము నంగీకరించి కుమారగిరి రాజ్యకార్యములను వీడి వేశ్యలతో విహరించుచుండెనని కొందఱనినారు, కాని రామయ్యపంతులుగారు ప్రకటించినప్పుడును, పరిమత్ప్రతియందు 'శ్రియాసదృశీప్రియా' అనియే గలదు. ఈపాఠమునందే ఔచిత్యమును గానవచ్చుచున్నది. ఏలయన ఆమె లక్ష్మితోఁ దుల్యయయినపుడే 'లకుమాదేవి' యను నామమును యాచకబృందమునకు వేలకొలఁది ధనము నొసఁగుటయుఁ బొసఁగును. మఱియు, కుమారగిరి 'వసన్తరాజీయ'మను నాట్యగ్రంథమును రచించెనుగానఁ దాఁ దెలిపిన నాట్యాంశముల నభినయింపఁజేసి యానందించుటకై చతురయగు నీ లకుమాదేవి నాస్థానలాసికనుగ గ్రహించియుండవచ్చును. ఇంతమాత్రమున నీతనికి వేశ్యాలోలుపత్వము నంటఁగట్టనక్కఱలేదు. ఈతనితండ్రియగు అనవేమభూపాలుఁడును వసన్తోత్సవములను విరివిగ జరిపెననియు, నాతనికి వసన్తరాయ బిరుదమున్నట్లును, తొత్తరమూడి శాసనము చాటుచునేయున్నది.[3] కావున వసన్తోత్సవముల జరుపుట నీతనితోడనే యుపక్రమింపఁబడినదిగాదు.

3. తొత్తరమూడి శాసనము. శ్లో. 12, 14.

పరిషత్తునందలి వ్రాఁతప్రతిలో 'మూర' అను చోటులందెల్ల 'రామ' అనుపాఠము గానవచ్చుచున్నది. ఎనిమిదవశ్లోకమున 'కాటక్షోణిపతిశ్చ రామనృపతిః' అని యుండుట సమంజసముగాని మిగిలినతావుల 'రామ' అని యుండుట యుక్తముగాదు. కాటనృపతి తండ్రి 'మారనృపతి' అనియే శాసనములందెల్లెడలను గానవచ్చుచున్నది. సుబ్రహ్మణ్యశాస్త్రిగారు ప్రకటించిన శ్లోకములందును 'కాటక్షోణిపతిశ్చ రామనృపతిః' అనియే కలదు.

ఇఁక, కాటయవేముని కాలము శాసనాద్యాధారములచే క్రీ. శ. 1385 మొదలు 1423 వఱకునని స్పష్టముగఁ దెలియుచున్నది. కుమారగిరిరాజీయ వ్యాఖ్యాన రచనాకాలమెప్పుడో యెఱుఁగఁదగియున్నది. ఆవిషయమునుగూర్చి తెలిపెదను. పైశ్లోకములలో 16,17,18,19 శ్లోకములు కాటయవేముఁడు కాళిదాసు రచించిన రూపకత్రయమునకు వ్యాఖ్యసేయ నేలయుద్యమించినాఁడో తెలుపురీతి యిట్లున్నది. "నాట్యవేదార్థమును బాగుగ నెఱిఁగిన భరతాది మహర్షులును, భోజుఁడు మున్నగు ప్రభువులును రచియించిన నాట్యశాస్త్రములను బాగుగ నవగతము చేసికొని 'వసన్తరాజ' బిరుదభూషితుఁడయిన కుమారగిరి 'వసన్తరాజీయ' మను నుత్తమమయిన నాట్యశాస్త్రగ్రంథమును రచించెను. అందుఁ దెలుపఁబడిన మార్గము ననుసరించి కవుల కాశ్రయభూతుఁడు మంత్రియు, కాటభూపాలుని పుత్త్రుఁడు నగు వేమభూపాలుఁడు కుమారగిరిచే నియోగింపఁబడి, పరిపక్వబుద్ధిగల కాళిదాసునిచే రచింపఁబడిన ఉద్వేల రసార్ణవమగు నాట్యత్రితయము (అభిజ్ఞాన శాకుంతలము, మాళవికాగ్నిమిత్రము, విక్రమోర్వశీయము) నకు 'కుమారగిరిరాజీయ'మను పేర వ్యాఖ్య యొనరించుచున్నాఁడు." దీనినిబట్టి చూడ కాటయవేముఁడు కుమారగిరియొద్ద మంత్రిగ నున్నపుడే యీవాఖ్యల రచించినట్లు స్పష్టమగుచున్నది. ఈకాలము 1390 ప్రాంతమగును. కావున మల్లినాథుఁడు కాళిదాసుని శ్రవ్యకావ్యత్రయమునకు వ్యాఖ్య రచించినకాలముకంటె నలువదివత్సరములు పూర్వమే యీతఁడీ రూపకత్రయవ్యాఖ్య యొనరించియుండెను. "కోలాచల మల్లినాథసూరి రెండవ ప్రౌఢదేవరాయలకాలములోనివాఁడని యాతఁడు రచియించిన 'వైశ్యవంశసుధాకర'మను గ్రంథమువలన నిర్ధారితమగుచున్నది. రెండవ ప్రౌఢదేవరాయలకాలము క్రీ. శ. 1426 మొదలు 1466 వఱకుఁ గాన నాకాలమువాఁడగు మల్లినాథసూరియు 1425 సం॥రమునకుఁ దరువాతివాఁడగును." అని డాక్టరు వి. రాఘవన్‌గారు 'కోలాచల

మల్లినాథసూరి-వైశ్యవంశసుధాకరము' అను వ్యాసమునఁ దెలిపియున్నారు.[4] కావునఁ గాళిదాసుని కావ్యముల కుత్తమమగురీతిని వ్యాఖ్య రచించినవారలలోఁ బ్రథముఁడీతఁడే యనవచ్చును. ఈ వ్యాఖ్యలకుఁ బూర్వమునను, తరువాతను బెక్కు-వ్యాఖ్యలు వెలువడినను వానిలో నీతనివ్యాఖ్యయే యుత్తమము. క్రమముగ నీవిషయమును తెలిపెదను.

కాటయవేముని వ్యాఖ్యతోఁగూడిన యీ మూఁడురూపకములు మున్నొకప్పుడు తెలుఁగులిపిలో ముద్రితములైనవి. కాని యీ ప్రతులిప్పుడు లభించుటలేదు. నిర్ణయసాగరముద్రణాలయమువారు మాళవికాగ్నిమిత్రము నీవ్యాఖ్యతో ముద్రించియున్నారు. నేఁటికి బాలమనోరమాగ్రంథమాలవారు శాకుంతలము నీవ్యాఖ్యతోపాటు నాగరిలిపియందే ముద్రించియున్నారు. విక్రమోర్వశీయవాఖ్యమాత్రము తిరిగి ముద్రితముకాలేదు. నాకు శాకుంతల మాళవికాగ్నిమిత్రవ్యాఖ్యలు లభించినవి. విక్రమోర్వశీయవాఖ్య లభింపలేదు. నాటకలక్షణసమన్వయమును దెలుపునపుడీ వాఖ్యలయం దుదాహరించిన శ్లోకమునుబట్టి వసన్తరాజీయము కేవలము నాట్యవిషయములను దెలుపు గ్రంథముగాఁ దెలియవచ్చుచున్నది. వసన్తరాజీయమను గ్రంథము కలదని దీనివలన మన కెఱుఁగుటయేగాని యట్టి వ్రాఁత ప్రతిమాత్రము నేఁటిదనుకఁ గానరాదయ్యె.

కాళిదాసుని కవిత్వము 'హ్రదాఃప్రసన్నా ఇవగూఢనక్రాః' అనునాతని సూక్తిరీతిని ప్రసన్నదురవగాహము. సాధారణముగ నా కవితయందలి భావము లందర కవగతమగుచున్నట్లగపడినను లోకవ్యవహారమునందు శాస్త్రములందు నిష్ణాతులగు పెద్దలకుఁగూడ దుర్బోధములు. అట్టితఱి నా కవిహృదయము నవగతముచేసికొనుటయేగాక వ్యాఖ్యానరూపమున వ్యక్తముచేయ సమకట్టుట కాటయవేముని వైదుష్యాతిశయస్ఫోరకమని వేఱె చెప్పనేల?

కావ్యములందు నాటకము రమ్యమనియు, నాటకములన్నిటిలోను శాకుంతలము రమ్యమనియుఁ బెద్దల సూక్తి. ఇట్టి యీ శాకుంతలనాటకమునకు వ్యాఖ్య రచించిన పెద్దలును బెక్కురు గలరు. కావున నీ కావ్యమున కీతఁడెట్లు వ్యాఖ్యసలిపియున్నాఁడో తెలిపినచో నీతని వైదుష్యము వ్యక్తమగును గాన నా పద్ధతిని దెలిపెదను. కాళిదాసుని

4. See A Volume of Indian and Iranian Studies presented to Sir E. Denison Ross Kt. C. I. E. page 234-35.

దృశ్యశ్రవ్యకావ్యములకు వ్యాఖ్యలు రచించిన విజ్ఞులు పెక్కుఱుగలరు. గాని శ్రవ్యకావ్యములకు మల్లినాథుఁడును దృశ్యకావ్యములకు కాటయవేముఁడును అన్యానాతిరిక్తముగ వ్యాఖ్యానమొనరించినవారిలో నగ్రగణ్యులు.

కావ్యవ్యాఖ్యానపద్ధతులు చిత్రవిచిత్రగతుల నడచును. కొందఱు ప్రతీకలనెత్తి తన్మూలమునఁ బ్రకృతవిషయము నుపపాదింతురు. కొందఱు ప్రతిపదార్థ వివరణ మొనరింతురు. మఱికొంద ఱుభయమును గూర్తురు. కొందఱు విశేషణసార్థక్యములను వెలువఱుతురు. కొందఱు శాస్త్రీయవిషయములను బాగుగ విమర్శించి యితరవిషయములఁ దాటస్థ్యము వహింతురు. కొంద ఱలంకారసమన్వయముమీఁదనే దృష్టి నిగుడింతురు. ఏయేతావుల నేయేయంశము నెంతవఱకుఁ జర్చింపవలయునో యంతవఱకు నాయా సంప్రదాయానుసారముగఁ జర్చించి, పాఠకులకు సంశయ మొదవకుండ రచియించుట యుత్తమ వ్యాఖ్యాతృపద్ధతి. కాటయవేముఁ డట్టి పద్ధతినే యంగీకరించియున్నాఁడు.

కాటయవేముఁడు వ్యాఖ్యసలుపుతఱిని సాధారణముగఁ గవివాక్యములను వదలకయే క్లిష్టపదముల కర్థవివరణముచేయుచు వచ్చినాఁడు. దీనిచే వ్యాఖ్యానము చదువునపుడే కథాభాగమును నవగతమగుచుండును. మూలమునందలి సంశయములు వివరణముచే గతార్థమగుచుండును. అనఁగా మూలముఁ జదువుకొనుచు వ్యాఖ్యానముఁ జదువ నవసర మంతగఁ గలుగఁబోదు. కావున నీవ్యాఖ్య లోకరీతిగా స్వతంత్రగ్రంథము లనదగియున్నవి.

పదపదార్థములను నిర్ణయించునపు డొక శబ్దముయొక్క నిష్పత్తిప్రకారమును దెలుపు వ్యాకరణాంశములను బాగుగఁ జర్చించి, ప్రమాణముగఁ బాణినీయాదిసూత్రముల నుదాహరించియేయున్నాఁడు. దీనిచే నీతనికిఁగల వ్యాకరణశాస్త్రపరిజ్ఞానము బాగుగ వ్యక్తమగుచున్నది. ప్రాకృతపదముల నిష్పత్తినిగూర్చి యీతఁ డితరవ్యాఖ్యాతలకంటె విస్తృతముగ వివరించియున్నాఁడు. అట్టితావులయందలి పదపదార్థవివేచన మీతనికిఁగల ప్రాకృతవ్యాకరణజ్ఞానమును జాటుచునేయున్నది. అష్టభాషాపాండిత ధురీణుఁడనని యీతఁడు చెప్పుకొనలేదుగాని నిజమున కీతని కట్టి ప్రాకృతాదిభాషాపాండిత్యము సమగ్రముగఁ గలదు గాన నీతని కీబిరుద ముండదగినదనియే భావింపవచ్చును.

దృశ్యకావ్యములు నాట్యప్రధానములు. వానికి వ్యాఖ్య యొనరించునపు డేయే నాట్యాంగము లేయేతావులఁ గూర్పబడినవియో, ఆ యంగములకు నితివృత్తమునకు నెట్టిసంబంధముగలదో తెలుపుచు సందిగ్ధస్థలములందుమాత్రమే యర్థవివరణ మొనర్చుట

యుత్తమపద్ధతి. అంతియగాని విశేషణసార్థక్యములకొఱకే విశేషయత్నము సలుపుట సరిగాదు. శబ్దార్థోభయాలంకారసరణి సరిపడినదా? లేదా? యని చర్చించుటయు సమంజసముగాదు. విశేషార్థములనునవి పాఠకుని బుద్ధివైశద్యము ననుసరించి విచిత్రముగ స్ఫురించుచునే యుండును. ఈ యర్థమే కవ్యభిప్రేతమని నిర్ణయించుట యేరికిని శక్యముకాదుకదా? కావున నట్టి వ్యాఖ్యాడంబరమున కితఁడు గడంగక యామూల చూడముగ నాటకలక్షణసమన్వయముఁ దెలిపి దురవగాహములగు విషయములను సుబోధమగు రీతిని వ్యక్తపఱిచినాఁడు.

మఱియొక విశేషముగూడఁ గానవచ్చెడిని. సాధారణముగ నలంకారశాస్త్రగ్రంథములలో శబ్దార్థోభయాలంకారములను, రసభావాదులను జర్చించిన గ్రంథములు పెక్కులుగలవు. నాట్యవిషయములను జర్చించిన గ్రంథములే తక్కువ. వీనికిఁ బ్రచారము సత్యల్పము. అట్టితఱి నాట్యలక్షణములను తన వ్యాఖ్యలందంతటను లగింపఁజేయుటయేగాక, వీనిపై పూర్వపక్షసిద్ధాంతములనుగూడ సాఁగించినాఁడు. అట్టియొకయంశము పరికింతము.

విచినయ నీయమ నన్యమానసా
తపోధనం వేత్సినమాముపస్థితం
స్మరిష్యతిత్వాం నసబోధితోఽపిసన్
కథాంప్రమత్తః ప్రథమంకృతామివ.

శాకుంతలము 4 అంకము.

ఈశ్లోక వ్యాఖ్యానసందర్భమున—"ఇతరమునందు చిత్తములేనిదానివై యెవనిఁ గూర్చి యాలోచించుచు, తపోధనుఁడనైన నన్ను గుర్తింపకుంటివో యాతఁడు బోధితుఁడయ్యును నిన్ను స్మరింపఁడు" అను నీవాక్యముచేఁ దోఁచుచున్న శకుంతలాభిధవరూపమయిన బీజమునకు ప్రాప్త్యాశాసమన్వయముచే నిట గర్భసంధియని యెఱుఁగఁదగును. ప్రాప్త్యాశాపతాకలకు సమన్వయము గలిగినపుడే గర్భసంధియగునుగదా? ప్రాప్త్యాశా బీజముల సమన్వయముచే గర్భసంధియగుటెట్లని పూర్వపక్షముచేసి, పతాక సంభవింపనప్పుడు బీజసంబంధమును గర్భసంధి నిష్పత్తి ప్రయోజకము గావచ్చునని "పతాకా సంభవే బీజంబిందుంవా విన్యసేద్బుధః" అనుకారిక నుదాహరించినాఁడు. దీనివలన నీతనికి నాట్యాంశవిచారణమునఁగల సూక్ష్మదృష్టి వ్యక్తమగుచున్నది.

జనాన్తిక భాషణము, అపవార్య భాషణము, ఆకాశభాషణము, ఆత్మగతభాషణము, ప్రకాశభాషణము మున్నగు రూపకముల యందుపయోగించు విషయములనీతడు సోపపత్తికముగఁ దెలిపినాఁడు. ఇదియు నీతనికిఁగల నాట్యశాస్త్రజ్ఞానమును వ్యక్తము చేయఁజాలియున్నది.[5]

తానేదియేని యొక విశేషార్థమును దెలుపఁదలఁచినచో దానిని సమర్థించుటకై కావ్యాంతరములందలి వాక్యములను గైకొనినాఁడు. అట్టివానిని గొన్నిటినిట ప్రదర్శింతును.

మాళవికాగ్నిమిత్రమున—“దేవానామిదమామనన్తి మునయః శాన్తం క్రతుం చాక్షుషం”[6] అను ప్రసంగమున నాట్యమునకుఁ గ్రతుత్వమునుఁ ‘కర్మయజ్ఞః ఫలంస్వర్గః,’[7] అను కుమారసంభవశ్లోకముచే సమర్థించినాఁడు.

శాకుంతలమున—ప్రథమశ్లోకమునందలి ప్రత్యక్షాభిః ప్రపన్నస్తనుభిరవతువః,[8] అను నంశమును మిగిలిన భూతములు ప్రత్యక్షములైనను ఆకాశము ప్రత్యక్షమగుటయెట్లని ? కొందఱనుటయున ‘నీలం నభః’ అను వ్యవహారము గలదుగాన ఆకాశమునకుఁ బ్రత్యక్షత్వముగలదనినాఁడు. మఱియు నీవిషయమును సమర్థించునట్టి ‘తేఽప్యాకాశమసిశ్యామమ్’[9] అను కుమారసంభవశ్లోకము నుదాహరించినాఁడు.

తృతీయాంకమున—‘అంగైరనంగతప్తై రవిరలమాలింగితుం పవనః’[10] అనువాక్యమునకు వ్యాఖ్యయొనర్చుసందర్భమున ‘పవనః ఆలింగితుం శక్యం’ అనునపుడు, పవన శబ్దము పుంలింగము. శక్యం అనునది నపుంసకలింగము. ఈరెండింటికిని సమన్వయము పొసగుటెట్లని ‘శక్యం’ అను శబ్దమవ్యయముగాన సరిపడునని తెలిపినాఁడు. ఈవిషయమును సమర్థించుటకై ‘శక్యమంజలిభిః పాతుంవాతాః కేతకిగంధినః’ అను రామాయణ ప్రయోగము నుదాహరించినాఁడు.

చతుర్థాంకమున—‘గుర్వపి విరహదుఃఖం ఆశాబంధ స్సాహయతి’[11] అను వాక్య వ్యాఖ్యానావసరమున ఆశాపాశము దుర్భరమయిన విరహదుఃఖమును సహింపజేయునను

5. చూ. శాకుంతలము-కుమారగిరి రాజీయోపేతము. పుట. 22-23-61.
6. మాళవికాగ్నిమిత్రము. 1 అంకము. శ్లో 4.
7. కుమా. 2 వ సర్గ. శ్లో 11.
8. శాకు. ప్రథమాంకము. 1 శ్లో.
9. కుమా. 6 సర్గ. 36 శ్లో.
10. శాకుం. 3 అంకము. 4 శ్లో.
11. శాకు. 4 అంకము. శ్లో. 16.

నీయాంశమును 'ఆశాబంధః కుసుమసదృశం ప్రాయశో హ్యంగనానాం సద్యః పాతి ప్రణయి హృదయం విప్రయోగే రుణద్ధి'[12] అను పూర్వమేఘశ్లోకవాక్యముచే సమర్థించినాఁడు.

ఈతనికి లోకవ్యవహారజ్ఞాన మధికముగ నున్నట్లు తెలియవచ్చెడిని. 'యయాతే రివశర్మిష్ఠా భర్తు ర్బహుమతా భవ- సుతంత్వమపి సమ్రాజం సేవపూరు మవాప్నుహి' శాకు. 4 అం. 7 శ్లో.

అను శ్లోకవ్యాఖ్యానమున 'పురుచక్రవర్తి' అని గదా వాడుక? 'పూరు' అనుట పొసఁగుటెట్లని- పురు-పూరు అను వ్యవహారముండుటచే సమర్థితమగునని తెలిపినాఁడు.

ప్రథమాంకమున—'భగవాన్ కాశ్యపః శాశ్వతే బ్రహ్మణిస్థిత ఇతి ప్రకాశః' అనుచోట భగవాన్ 'కణ్వః' అనఁదగియుండ 'కాశ్యపః' అని యేలయనినాఁడని శంకించి, విప్ర క్షత్రియుల నామములను గోత్రము ననుసరించి చెప్పవలెను 'విప్ర క్షత్రియనామానికుర్యాద్గోత్రానుసారతః' అను వాక్యము నుదాహరించి, కావుననే పౌరవ, "కాశిక" యనుట యని సమర్థించినాడు.

ప్రభువును 'భర్త' అని, 'స్వామి' అని పిలువఁదగినవారి నిట్లు తెలిపినాఁడు. పరిజనులు భర్తయని, మంత్రులు మున్నగువారు స్వామియని పిలువవలెను. 'స్వామీ చైవేతి నృపతిః భృత్యై ర్భర్తేతిచాధమైః,' అను శ్లోకము నుదాహరించినాఁడు.

ఇఁక నీతనికిఁగల ధర్మశాస్త్ర పరిజ్ఞానముఁ బరికింతము. తృతీయాంకమున "ఆగామినిచతుర్థదివసే నివృత్తపారణో మే ఉపవాసో భవిష్యతి. తత్రదీర్ఘాయుషావశ్యం సన్నిహితేన భవితవ్యం" అనుచోట నీవాక్యముచే జ్యేష్ఠశుద్ధ పూర్ణిమ యందు మూఁడు రాత్రు లుపవసించి చేయఁదగిన తటాక సావిత్రీవ్రతము తోఁచుచున్నది. "త్రిరాత్రం లంఘయిత్వాతు చతుర్థేదివసేఽహ్యహం" ఇత్యాది స్కాందపురాణస్థ శ్లోకము నుదాహరించినాఁడు.

'అథ్యాక్రాంతా వసతిరమునా' ఇత్యాదిశ్లోకమున ప్రజాపాలనము తప స్సెట్లగునో సమర్థించుచు విజ్ఞానేశ్వరీయమునందలి "అభిషేకాది గుణయుక్తస్య రాజ్ఞః ప్రజాపాలనం పరమోధర్మః" అనువాక్యము నుదాహరించినాఁడు.

షష్ఠాంకమున-'ననుగర్భః పిత్ర్యంరిక్థ మర్హతి' అను వాక్యవ్యాఖ్యానముఁ బరికింతము. పెక్కుమంది భార్యలున్నపుడు, విభక్తుఁడై పుత్రులు లేకుండ మరణించినవాని

12. మేఘ. 1 సర్గ. 10 శ్లో.

యాస్తిని భార్యలు మున్నగు వారు గ్రహించుట కర్హులని 'పత్నీదుహితరశ్చ' ఇత్యాది యాజ్ఞవల్క్యస్మృతి వ్యాఖ్యానావసరమున విజ్ఞానేశ్వరుఁడు తెలిపియుండ, గర్భముతే నప్పుడు పత్నినివదలి అపుత్త్రకునిధనము రాజును బొందునని కాళిదాసెట్లువచించినాఁడనుశంక నుద్భావనచేసి, విజ్ఞానేశ్వరునికంటెఁ బూర్వులయిన ధారేశ్వరుఁడు మున్నగు వారు 'పుత్త్రులులేనివానిధనము రాజును బొందును' అని యీశ్లోకమునకు వ్యాఖ్యానము చేసియున్నారుగాన, ఆకాలమువాఁడగు కాళిదాసు ధారేశ్వరాదుల వ్యాఖ్యానమునను సరించి యిట్లు ప్రతిపాదన చేసియున్నాఁడని సమర్థించినాఁడు.[12] ఇది ఈతనికిఁగల ధర్మశాస్త్రపరిజ్ఞానమును బాగుగఁ దెలుపుచునేయున్నది. యాజ్ఞవల్క్యస్మృతికి ధారేశ్వరుని వ్యాఖ్యానమున్నట్లు మితాక్షరివ్యాఖ్యానమున ధారేశ్వరుఁ డుగ్గడింపఁబడుటచే సుస్పష్టమే. కాని ఈధారేశ్వరుఁడెవఁడో, యేకాలమునాటివాఁడో మనకు నిర్ధారితముగఁ దెలిసినచో నాతనికాలము బట్టి కాళిదాసుని కాలము నిర్ణయింపవచ్చునను నంశము నీవ్యాఖ్యానము మనకుఁ దెలుపుచున్నది. కాళిదాసుని కాలనిర్ణయము చేయుటకై, ననుగర్భః 'పిత్ర్యంరిక్థ మర్హతి' అను నీవాక్యము నాధారముగాఁ జేసుకొని, యాజ్ఞవల్క్యాదిస్మృతులు బయలుదేఱుటకుపూర్వమే యిట్టి వ్యవస్థయున్నదిగాన కాళిదాసు A.D. మొదటి శతాబ్దివాఁడని కాళేపండితులు నిర్ణయించినారు. కాని యీవ్యాఖ్య యాయంశమునకు విరుద్ధముగనే బోధించుచున్నది.

కాళిదాసునికాలము నిర్ణయించుట యిప్పుడు కేవల మూహామీఁదనే నిర్భరమై యున్నను నేఁటికి సుమారైదువందల యేఁబదివత్సరములకుఁ బూర్వుఁడయిన కాటయ

12. ననుగర్భః గర్భస్థః పిత్ర్యం పితృసంబంధి రిక్థం ధనం దాయ మర్హతి.
అత్ర పత్నీషు విద్యమానాసు విభక్తస్యాపుత్త్రస్యవిత్తం పత్న్యాదయో
గృహ్ణీయురితి 'పత్నీదుహితర' శ్చేత్యాది వచనబలాత్, విజ్ఞానేశ్వరే.
వత్న్యాదీనాం ధనగ్రహణే ప్రతిపాదితమేతత్. తత్కథం పత్నీం పరిహృత్య
గర్భాభావే ధనస్య రాజగామిత్వం ప్రతిపాదిత మితినాశంకనీయమ్.
విజ్ఞానేశ్వరాదిభ్యః పూర్వైః ధారేశ్వరాదిభిః "అదాయికం రాజగామి
యోషిద్భృత్యౌర్ధ్వదైహికమ్. అపాస్య శ్రోత్రియద్రవ్యం శ్రోత్రియేభ్య
స్తదర్పయేత్. అన్యత్ర బ్రాహ్మణాత్కింతు రాజాధర్మపరాయణః.
తత్ స్త్రీణాం జీవనం దద్యాదేషదాయవిధి స్స్మృతః"
ఇతి అపుత్త్రక ధనస్య రాజగామిత్వం ప్రతిపాదితమ్. అత
స్తదానీంతనే నానేన కవినా తద్వ్యాఖ్యానుసారేణ ఇత్థముక్తమిత్యనుసంధేయమ్.
చూ. శాకుంతలము. కుమారగిరిరాజీయోపేతము పుట. 166-167.

వేమునినాఁటికింకను నాతతికాలాదికమునుగూర్చిన ప్రసంగము పరంపరాగతముగ నుండి యుండవచ్చునుగాన, అట్టి వినికిడినిబట్టియు, పై ప్రామాణ్యమునుబట్టియుఁ దనవ్యాఖ్యానమున కాటయవేముఁ డట్లు వ్రాసియుండవచ్చును.

వ్యాఖ్యాతలలోఁ గొందఱారంభమునఁ దమ పాండిత్యప్రకర్షనుఁ దెలుపుటకై విపులముగఁ జర్చించి రానురాను సంగ్రహముగ రచింతురు. ఈతఁడును మల్లినాథుఁడును ఉపక్రమోపసంహారములం దెల్లెడలను సమానముగనే వ్యాఖ్యచేసి యున్నారు. వైఖానసకులతిలక శ్రీమాన్ శ్రీనివాసాచార్యులుగారు తమ శాకుంతల వ్యాఖ్యానమున నాలుగంకములవఱకు విపులముగ విశేషణసార్థక్యములనుఁ దెలిపియున్నారు. తరువాతి యంకములందంతటి విపులత గానరాదు. కాళిదాసుని వాక్యములలోని కొన్ని పదములు విశేషార్థములనుఁ దెలుపునవి, కొన్ని తెలుపనవియు నుండుననుట కెవ్వరు సమ్మతింతురు?

మఱియొక సంగతి శ్రీనివాసవ్యాఖ్యకుఁ జాలవఱకుఁ గాటయవేముని వ్యాఖ్యయాధార మనవచ్చును. కారణమేమనఁ జాలవఱకు నిందలి వాక్యములు, నందలి వాక్యములు తుల్యములే. పోనీ శ్రీనివాసవ్యాఖ్య కాటయవేమునివ్యాఖ్యకంటెఁ బ్రాచీనమందుమా? అదియుఁ బొసఁగదు. అటనటఁ గాటయవేముఁడుఁ దెలిపిన వ్యాఖ్యానాంశములీవ్యాఖ్యానమున ఖండింపబడుచు వచ్చినవి.[13] కావున శ్రీనివాసవ్యాఖ్య యర్వాచీనమే రాఘవభట్టు మున్నగువారు రచియించిన వ్యాఖ్యలయం దిట్టిపోలిక గానరాదు. కాటయవేముఁడు సూక్ష్మముగఁ దెలిపినవానిని విపులీకరించినతావులును బెక్కులు శ్రీనివాసవ్యాఖ్యయందుఁ గలవు. వానిలోఁ గొన్నిటి నిటఁ జూపువాఁడ.

ప్రథమాంకమున—రాజా- 'అలమన్యథామాం సంభావ్య రాజ్ఞః పరిగ్రహోఽయమ్,'
అను వాక్యమునకు—

అస్మా నన్యథా సంభావ్య అలం-రాజేతి నమన్తవ్యమ్. పరిగృహ్యతే స్వీక్రియతే ఇతి పరిగ్రహః. స్వపరిగ్రహమిద మంగుళీయకం రాజ్ఞస్సంబంధి ఏవం మన్తవ్యమితి శేషః. అనేన రాజరాజకీయయో స్సామాన్యేన సత్యరూపేణైవ వచనేన ప్రచ్ఛాదనం కృతమితి గమ్యతే. కుమారగిరి రాజీయవ్యాఖ్య.

అన్యథా సంభావ్య రాజేతిమత్వా. పరిగృహ్యతే స్వీక్రియతే ఇతి పరిగ్రహః ఇద మంగుళీయకం రాజసంబంధీతినమన్తవ్య మితి శేషః. అనేన రాజరాజకీయో

---

13. చూ. శ్రీనివాసవ్యాఖ్యానము. షష్ఠాంకము. శ్లో. 2. వావిళ్ళ ప్రతి. పుట. 255.

స్వాయాస్యేన వచనేన ప్రచ్ఛాదనం కృతమితి బోద్ధవ్యమ్.

శ్రీనివాస వ్యాఖ్య.

ద్వితీయాంకమున—రాజా-'భగ్నోత్సాహః కృతోఽస్మి మృగయాపవాదినా మాఢవ్యేన' అను వాక్యమునకు—

మృగయామపవదతి దూషయతీతి తథోక్తస్తేన-మాఢవ్య ఇతి విదూషకస్య నామ.

కుమారగిరి రాజీయవ్యాఖ్య.

మృగయాపవాదినా-మృగయామపవదతే దోషానుక్త్వా దూషయతీతి స తథోక్తః శీలార్థక ప్రత్యయేన సార్వకాలికనిందా వ్యజ్యతే. మాఢవ్య ఇతివిదూషకస్యనామ.

శ్రీనివాసవ్యాఖ్య.

తృతీయాంకమున—"శక్యమరవిందసురభిః...... అవిరలమాలింగితుం పవనః" అను శ్లోకమునకు—

పవనః ఆలింగితుం శక్యమ్ అత్రశక్యమితవ్యయమ్ అన్యథా శక్య ఇతిస్యాత్ తథా చోక్తం రామాయణే శక్యమంజలిభిః పాతుం వాతాః కేతకి గంధినః-ఇతి.

కుమారగిరి రాజీయవ్యాఖ్య.

అవిరళం గాఢం ఆలింగితుం శక్యం శక్యమిత్యవ్యయమ్ నచేచ్ఛక్య ఇతి ప్రయోగస్స్యాత్ తథా రామాయణేఽపి శక్యమంజలిభిః పాతుం వాతాః కేతకిగంధిన ఇతి.

శ్రీనివాస వ్యాఖ్య.

షష్ఠాంకప్రారంభమున—

నాగరికః నగరే నియుక్తః తత్రనియుక్త ఇతిఠక్ స్యాలః రాష్ట్రియః కర్తేత్యర్థః మణి ర్బధ్యతే అస్మిన్నితి మణిబంధనం మణిస్థాపనస్థానమ్ తత్రోత్కీర్ణం లిఖితం నామధేయం యస్య తత్తథోక్తమ్ దక్షిణోరనయోరతినీచ పాత్రత్వాన్మాగధీ భాషా.

కుమారగిరి రాజీయం.

నాగరికః నగరేనియుక్త ఇతి నాగరికః. తత్రనియుక్తఇతి ఠక్ప్రత్యయః. నగర పాలక ఇతి యావత్ తస్యస్యాలః. పత్నీ భ్రాతా మణిర్బధ్యతే అస్మిన్నితి మణిబంధనం. మణిస్థాపనస్థానం. తత్రోత్కీర్ణం వ్యక్తం నామధేయం యస్య స్తస్యేతి తథోక్తం. దక్షిణోరతి నీచపాత్రత్వాన్మాగధీ భాషాప్రయుక్తా. —శ్రీనివాసవ్యాఖ్య.

ఇట్టి పోలికలింకను ననేకములు గలవు. విస్తరభీతిచే విడచినాఁడను. దీనినిబట్టి శ్రీనివాసవ్యాఖ్యానమునకుఁ గాటయవేముని వ్యాఖ్య విశేషముగ నుపకరించినదని చెప్పక తప్పదు.

కుమారగిరిరాజీయములోఁ గూడిన శాకుంతలనాటకమును జదివి జర్మనీదేశమున విఖ్యాతపండితుఁడగు 'గొయిటే' అనునాతఁడు తాండవమొనర్చెనని చరిత్రకారులు వ్రాసియున్నారు. నిక్కముగఁ బరికించినచోఁ గాళిదాసుని హృదయముఁ జూఱఁగొని కాటయవేముఁడు రచించిన వ్యాఖ్యాత్రయము సహృదయుల హృదయములను దాండవింపఁ జేయుదగియే యున్నది.

ప్రాచీనాంధ్రప్రభువులలో నెవరేని గ్రంథకర్తలన్న వెంటనే నాకర్తృత్వముఁ దదాస్థానకవులకో, పండితులకో యంటఁగట్టుటయే తఱుచుగఁ దటస్థించుచు వచ్చినది. కాని, కాటయవేముని వ్యాఖ్యానములకుమాత్రము నేఁటిదనుక నట్టి యపవాదము బయలుదేఱియుండలేదు. కాళిదాసుని రూపకత్రయమునకుఁ గాటయవేముఁడు వ్యాఖ్య రచియించినట్లందఱు నైకకంఠ్యముగ నొప్పుకొనియే యున్నారు. ఆంధ్రుల కిదియొక మహాభాగ్యమే.

కావున మధురమగు ఫణితిని, సరళమగు రీతిని, అన్యూనాతిరిక్తముగ రచియించిన యీ రూపకవ్యాఖ్యాత్రయమును పాఠకులు సహృదయతతోఁ బరికించి, కాటయవేముని వైదుష్యమును గనుఁగొని యానందించెదరుగాక యని యాశించుచున్నాఁడను.

ఓమ్, శమ్.

# శివలీలావిలాసము.

నిడుదవోలు వేంకటరావు, ఎమ్. ఏ.

1. రాజమహేంద్రవరమున నేలిన రెడ్డిరాజులచరిత్రమును తెలిసికొనుటకు నాధారములైన ప్రాచీనాంధ్రకావ్యములలో శివలీలావిలాస మొకటి. ఇది నిశ్శంకకొమ్మనామాత్యునిచే రచియింపఁబడినది. శ్రీనాథ మహాకవి కాశీఖండమునకుఁ గృతిపతియగు వీరభద్రారెడ్డితమ్ముఁడగు దొడ్డారెడ్డి కీగ్రంథమంకితముగా వెలయుచున్నది. కావున నాంధ్రవాఙ్మయమున [1]"శ్రీనాథ యుగము"న బుట్టిన గ్రంథములలో నిదియు నొక్కటియై చారిత్రకముగ, సారస్వతముగ మన కెంతయు నుపయోగపడుచున్నది.

2. అయినను వాఙ్మయాభిమానులదురదృష్టమువలన నీగ్రంథమంతయుఁ బూర్తిగ లభింపలేదు. మొదటి రెండాశ్వాసములు మాత్రమే లభ్యమైనవి గ్రంథావతారికయందు దైవస్తుతి, కవిస్తుతి మొదలగు భాగములు లేవు. కాని యదృష్టవశమున వంశక్రమమునుండి మాత్రము క్రమముగనే యున్నది. ఇందులనుఁ గొన్ని పద్యము లచ్చటచ్చట నసంపూర్ణముగా నున్నవి. అయినను నాకాలమునఁ బుట్టి శ్రీనాథాదిమహాకవుల గ్రంథములఁదోడ్పాటున నిందుల చారిత్రకవిషయములు కొన్ని సమన్వయింపవచ్చును. కావున నీమాత్రము దొరకినదియు మనభాగ్యమే.

ఈ రెండాశ్వాసములను బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారు సంపాదించిరి. ఈవ్యాసమున కాధారమైనది వారి వ్రాఁతపుస్తకపుమాతృకకుఁ బుత్త్రికయే.

3. శివలీలావిలాసమున దొడ్డారెడ్డి వంశక్రమ మిట్లు వర్ణింపఁబడినది— "శ్రీతరుణీశపాదసరసీరుహదేశమున నొక నిర్మలవంశము సంభవించెను. అందు దేసటులత్యుదారులైరి. ఆవంశమున దొడ్డజనపాలుఁ డనేకరాజులవెనుక జన్మించెను. అతనిభార్య జన్నమాంబ. ఈ దొడ్డ జన్నమాంబాదంపతులకు 'అల్లాడ క్షితిపతి' జన్మించెను. అల్లాడరాజు చోళభక్తిక్షితీశ్వరునిపౌత్త్రియు భీమలింగమనుజేశ్వరునిపుత్త్రికయునగు వేమాంబికనుఁ బెండ్లియాడెను. అల్లాడరాజునకు వేమాంబవలన వేమ, వీరభద్ర, దొడ్డ, అన్న

1. శ్రీనాథ యుగమనగా క్రీ.శ. 1350 నుండి క్రీ. శ. 1500 వఱకునని వాఙ్మయచారిత్రకవిశారదు లభిప్రాయము.

యులు' అను నలువురు కొడుకులఁ గాంచెను. వారిలో మూఁడవవాఁడగు దొడ్డరాజే శివలీలావిలాసకృతిపతి”.

4. పైని యుద్ధరించిన విషయము స్పష్టముగ నుండుటకై వంశవృక్షమీదిగువ నిచ్చుచున్నాఁడను.

(దేసటివంశమున) దొడ్డ-జన్నమాంబ

అల్లాడ-వేమాంబ




(వేమాంబ భీమలింగరాజు కూతురైనను నామె చోళభక్తిరాజు పౌత్త్రిగాఁ జేర్కొనుట నాకాలమున చోళభక్తిరాజునెడల గలిగిన గౌరవమే కారణము. అతఁడు చాల ప్రసిద్ధుఁడు).

5. కొమ్మన వంశవృక్షమునఁ దొలివాఁడగు దొడ్డరాజునుఁగూర్చి చారిత్రకముగ విశేషములఁ దెలిపియుండలేదు. తరువాతి యాతని తనయుఁడగు నల్లాడ రాజునుఁ గూర్చి యిట్లు చెప్పియున్నాఁడు.

సీ. పెద్దకోమటివేమ పృథ్వీశు వెను సూచి యతని సంపద నెల్ల నపహరించె
ఖాధిపతిగెల్చి గజపతి దళాంభాళాఖ్యాన బిరుదంబు నలవరించె
వివిభుఁ దోలి యొగివాని యిండ్ల పట్టులు ద్రవ్వించి బలువుచెరిపె
రసురత్రాణుఁ బోరనిర్జితుఁ జేసి కొల్లవట్టించెఁ దత్కూటములను
గెరలుచుండి తురగరేవంతు డవఘళురాయమాన మర్దనాయరాంక
దీప్యమాన నిష్ప్రతిప్రతాప విహారి దొడ్డవిభుని యల్లదొడ్డశౌరి

2. శివలీలావిలాసమున కొమ్మన వీరిని దేసటివంశమువారినిగాఁ జేర్కొనినను వీరెవ్వరికిని పేరులవెనుక 'రెడ్డి' అను పదము నుపయోగింపలేదు. మనకు లభ్యమైనగ్రంథమున నీ రెడ్డిశబ్దములేదు. మిగిలినభాగమున ప్రయుక్తమైనదేమో? కొమ్మన వీరినెప్పుడు పేర్కొనినను, 'మనుజవిభుఁడు జనవిభుఁడు' మొదలగు విశేషణములతోఁ జెప్పును. శ్రీనాథునిగ్రంథమున వీరికి రెడ్డిపదము చేర్పఁబడియున్నది చూడుఁడు కాశీఖండము. ఎఱ్ఱాప్రెగడ హరివంశమునను నీ రెడ్డిపదము ప్రయుక్తమైనటుల గాన్పింపదు.

ఈ పద్యము నాచేసినసంస్కరణములుఖండలీకరణముగావించి వ్రాయుచున్నాను. అప్పుడిందుల చారిత్రకవిషయములించుక గ్రహించుట కవకాశమున్నది.

సీ. పెద్ద కోమటివేమ పృథ్వీశు వెనుసూచి యతని సంపదలెల్ల నపహరించె
(కటకా(ఖా)ధిపతిగెల్చి గజపతిదళవిభాళాఖ్యాన బిరుదంబు నలవరించె
(ఒడ్డాది(వి)విభుఁదోలి యొగివాని యిండ్లెల్ల పట్టుబుద్ధిఁ ద్రావించి బలువుచెఱిపె
(ధారా(ర)సురతాణుఁ బోరనిర్జితుఁ జేసి కొల్లవట్టించెఁదత్కూటములను
గెరలుచుండి తురగరేవంతుడవఘళ రాయమాన మర్దనాయకాంక
దీప్యమాన నిష్ప్రతిప్రతాపవిహారి దొడ్డవిభుని యల్లదొడ్డశౌరి

అల్లాడరాజునుఁగూర్చిన విషయములఁ గొన్ని చారిత్రకముగ సరిపోవుచున్నవి.

1. ఈతఁడు క్రీ.శ. 1400–1420 వఱకు కొండవీటి నేలిన రెడ్డిరాజును శ్రీనాధ మహాకవి కాశ్రయదాతయునగు పెద్దకోమటి వేమారెడ్డిని జయించినట్లు అల్లాడరెడ్డి కోరుమిల్లి శాసనమిట్లు తెలుపుచున్నది.

శ్లో. జిత్వానల్పవికల్పకల్పితబలం తంచాల్పఖానుంరణే
మిత్రీకృత్యసమాగతం గజపతిం కర్ణాటభూపంచతం
హత్వాకోమటివేమసైన్యనికరం భూయోపి రామేశ్వరాత్
రాజ్యం రాజమహేంద్రరాజ్యమకరో దల్లాడభూమీశ్వరః.

(కోరుమిల్లీశాసనము)

ఒడ్డాదిని యల్లాడరాజు జయించినట్లు కాశీఖండమందలి యీ క్రిందిపద్యము తెలుపుచున్నది.

మ. జయధాటీసమయంబులన్ విలయజంఝామారుతాడంబర
స్మయహారిప్రవిజృంభమాణ ఘననిస్సాణోగ్రభేరీస్వనం
బయియొడ్డాది భయంకరోడ్డమర శౌర్యంబైన శ్రీరెడ్డి దొ
డ్డయ యల్లాడనృపాలునకు బిట్టల్లాడుదిక్చక్రముల్. 1–29

తక్కినవిరెండును కొంతవఱకు నతిశయోక్తులే కావచ్చును. లేక తొలుతవారి రాజ్యమునఁగల ప్రదేశముల బట్టుకొనునప్పుడు వారినోడించి యావెనుక వారితో మైత్రి పొసగియుండవచ్చును.

6. అల్లాడరెడ్డివెనుక వేమభూపాలుని ప్రతాపాదికమిట్లు తెలుపఁబడియున్నది.

ఉ. ఆరఘురాముఁ డాశ్రిదరసమగ్రతలంకవిభీషణున్ యశం
బారగనిల్పి రాజ్యమహాస్వతుఁ జేసిన పోల్కె వేమయ)

తన్నారఘురాముఁ దాశ్రితుని సంగరభూమిని బుంగశౌరి శృం
గారపుఁగోట నిల్పెడి తగన్ శరణాగతరక్షణాంకుఁడై

♦ శృంగారంకోటను బుంగరాజాకాలమునఁ బరిపాలించుచుండె ననుట మనకుఁ గ్రొత్తవిషయము.

కాని యీశృంగారంకోటను దొడ్డరాజు జయించినట్లు కాశీఖండమున నిట్లు చెప్పబడి యున్నది.

శా. ఔరా! అల్లయరెడ్డి దొడ్డవసుధాధ్యక్షుండు ధాటీచమూ
భేరీభాంకృతిఘోరఘోషము నటించె నిర్భేదించె నొడ్డాది శృం
గారంకోటయు లోతగడ్డయును నుద్ఘాటించె నత్యుద్ధతిన్
క్షీరాంభోధితటంబున న్నిలిపె దిక్సీమాజయస్తంభముల్.

ఇచ్చట 'అల్లయరెడ్డి దొడ్డ' అనుదానికి బదులుగా దొడ్డయరెడ్డి యల్లడని యుండఁదగును. అల్లయరెడ్డి నందనుఁడు దొడ్డారెడ్డియే కదా శివలీలావిలాస కృతిభర్త. వాస్తవముగ దొడ్డారెడ్డి జయించినచో నావిషయము కొమ్మన తనగ్రంథమునఁ జెప్పకుండునా? తన కృతిపతినిఁగూర్చిన యంశమే విడుచునా. కావున లేఖకప్రమాదముచే నిట్లయ్యెనని యూహింపదగును. ఇంతియకాక వేమరాజనేక రాజులను, రాజ్యములను జయించెనని యిట్లు చెప్పఁబడియున్నది.

మా (రా) కవరపువానమనుజవల్లభు నోర్చి పల్లవత్రినయనోద్భాసియగుచు
నందపురేశ్వరు నఖువార్చి యాగాధాంధకార జగజ్జ్యోతి కరణియగుచు
రంప యిమ్మడి రాజు సొంపుమా నెన్నిక.....................

గీ. మాడియముల, ధరణిపులగెల్చి తత్తదుద్దండబిరుద
సముదయములెల్లఁ దన యధీనములుగాగ, వెలయునల్ల భూపాలక వేమవిభుఁడు.

ఇందు మొదటిపాదమునఁ గల మాకవరమున వానరాజును పారఁదోలి పల్లవోజ్జ్వలవంశ్యుఁడగు పురుషోత్తముఁ డనురాజునకుఁ బట్టముఁగట్టెనని కొమ్మన యిట్లు చెప్పుచున్నాఁడు.

అలఘుం డల్లయవేమభూవిభుఁడు రాయస్థాపనాచార్యుఁ డిం
పలరం మాకవరరబునందు శుభరాజ్యప్రాజ్యగా పల్లవో

♦ శృంగారంకోట నేఁడు శృంగవరపుకోటగాఁ బరగుచున్నది. విశాఖపట్టణమండలమున విజయనగరమునకు 20 మైళ్లదూరముననున్నది.

జ్వలవంశ్యుం బురుషోత్తమాఖ్యునిడి విశ్వస్తుత్యకృత్యంబునన్
విలసిల్లెం బ్రబలియొవ్వరవిభునకున్ విశ్వంభరామండలిన్.

మాకవరము విశాఖపట్టణమండలమున సరసీపట్నము తాలూకాయందు కలదు. ఇది మాడుగులకు నలుక్రోసుదూరమున గలదు. మాడుగులే సప్తమాడియములు.

మాకవరమున నల్లాడరెడ్డి జయించిన సంగతి శ్రీనాథమహాకవి కాశీఖండమున నిట్లు వర్ణించి యున్నాఁడు:

మ. కొనియెం గంచుకముల్ సముద్భట నటత్ ఘోటీభటప్రౌఢిఁ గై
కొనియెం వేడుక జిడికోట యహాశక్షోణీశు లల్లాడఁ జే
కొనియెం మాకవరంబు లీలమదవత్ ఘోరారిసంహారియై
ఘనుఁ డల్లాడ మహీశు వేమన నిరాఘాటైకధాటీగతిన్.

పల్లవవంశ్యుఁడగు నీపురుషోత్తమరాజు విశాఖపట్టణమండలమున వీరఘట్టమును పరిపాలించుచుండెను. ఈతనినే మాకవరమున నల్లాడ వేమన నిలిపియుండును. ఈతని కొమారుఁడగు సౌభాగ్యరాజులశాసనము క్రీ. శ. 1420 నాఁటిది శ్రీసింహాచల క్షేత్రమునఁ గలదు. అది ఇది.—

స్వస్తి శ్రీ అవ్యాత్ కరీంద్రరిపుభూధ (ద) రనాయకస్స శ్రీపల్లవాఖ్యకులజాత మహీపవర్యం। సౌభాగ్యదేవమనిశం సతతం నృసింహపుత్రకళత్ర సహితం ద్విజ పారిజాతం] శ్రీ శకవరుషంబులు ౧౩౪౨ గునేంటి జ్యేష్ఠ శుక్ల ౧౦ మిధునవరాననువీరగోట ప్రిపురుషోత్తమరాజులకొడుకు భారద్వాజగోత్రుండైన సౌభాగ్యదేవరాజులు తమకు సుకృతంగాను శ్రీ నరసింహనాథ్యునికి నిత్యం సమర్పించెను.

ఈవేమారెడ్డి తనతమ్ముఁడగు వీరభద్రారెడ్డికి రాజమహేంద్రి నగరరాజ్యము పట్టముగట్టినట్టును, దానాతనికి సహాయుఁడైనట్టును కొమ్మన యిట్లు చెప్పియున్నాఁడు.

ఉ. తేజమెలర్ప నవ్వసుమతీవరశేఖరుఁ డొప్పు సర్వధా
త్రీజనరక్షణక్రమధురీణుని తమ్ముని వీరధీమణిన్
రాజమహేంద్రనామనగరంబునఁ బట్టముకట్టి సంచిత
శ్రీజయకీర్తి సారభవి శేమవిజృంభిత దిక్సమేతుఁడై.

---

(South Indian Inscriptions Vol. VI No. 1101. Simhachalam Inscriptions Page 443) పురుషోత్తమరాజును నాతని భార్యయగు మదనశేఖయు శ్రీ సింహాచలస్వామికి సమర్పించిన శాసనములందు గలవు.

రాజమహేంద్రవరము నేలిన రెడ్డిరాజులలో నల్లాడరెడ్డితనయుఁడు వేమారెడ్డి శ్రీసింహాచలక్షేత్రమున శాసనము వేయించెనని నిశ్శంక కొమ్మన తన శివలీలావిలాసమునం దిట్లు చెప్పియున్నాఁడు.

"సీ. ఉక్తవేళల షోడశోపచారంబుల, శివునిచిత్తంబు రంజితము సేయుఁ
బ్రతివత్సరంబు నుద్భటవసంతోత్సవ, శ్రీలదిక్చయము వాసితము సేయు
దయతోడి చూపుల [నయరీతిని] ంబదా, నత నృపాలురఁ బదోన్నతులఁ జేయు
పుహామాదిక్రియా దానక్రియామహాత్మ్యంబున, విప్రుల నతిదశాన్వితులఁ జేయు
ననినఁ గొనియాడఁదరముగా దతని మహిమ, ప్రకట సింహాచలోత్తర భాగవిఖిత
వివిధ జయశాసనాక్షర విసరకరస, మిద్ధగుణుఁడల్లవిభుని వేమేశ్వరుండు"

సింహాచలమున నీక్రింది యుదాహృత శాసనమట్టి శాసనమని నేను తలఁచుచున్నాఁడను.

శుభమస్తు। రస శరగుణ శశిపరిమిత శకవర్షానన్దనభసి సితపక్షే
భౌమచుర్దశ్యాం శ్రీవేమేంద్రో దేవవిప్రధనమముచత్
అల్లక్షితిపవేమేంద్రః స్వకరస్థ మదాత్కరం
దేవేభ్యవ విప్రేభ్యః కాళింగ్గంస్వభుజోర్జితం
దేవానాంబ్రాహ్మ[ణా]నాంచ్చ పుర్వం పూర్వగతంకరం
వేమేంద్రో దానశౌండ్డోయం ప్ర[త్య]దద్దానవారిణీ

స్వస్తిశ్రీ శకవరుషంబులు ౧౩౫౬ అగు నేఁటి ఆనంద సంవత్సర శ్రావణ శు ౧౪ మ। అల్లాడరెడ్డింగారు కుమారుండైన వేమారెడ్డింగారు తమకు రాజ్యాభివృద్ధిగానున్ను, ఆయురారోగ్యైశ్వర్యాభివృద్ధిగానున్ను, పుత్ర ప[వు]త్రాభివృద్ధిగానున్ను, స్వభుజార్జితమైన కలువపల్లి, ఒడ్డాది, పొట్నూరు, సైతమైన స్థలాలకుం జెల్లిఉళ్ళంగల దేవబ్రాహ్మణీమలకుం జెల్లి అగ్రహారాలకును, ఖండికలకును పూర్వాము నుండుకున్న మతియాదక్రమానం బెట్టిరి. ధర్మం శ్రీవైష్ణవరక్ష శ్రీశ్రీంజేయును దరాహోశి పూర్వానను తారుపాలింసి దేశాలంగల దేవబ్రాహ్మణీమల అగ్రహారలఖండికలతోటి మరియాదాక్రమానసే ఆశంద్రార్కస్థాయిగానుమానిరి మంగ్గళ మహా శ్రీ శ్రీ.

(దక్షిణహిందూదేశ శాసనసంపుటము VI. పుట. 471. నం. 1168 రు.).

పైశాసన మాస్థానమండపమున నుత్తరద్వారముపైని చెక్కబడియుండుటచేతను 'సింహాచలోత్తరభాగలిఖిత' అని కొమ్మన చెప్పియుండుటచే నిదియే యాతఁడు సూచించి

యుండునని తెలియఁదగియున్నది. ఈశాసనకాలము రస-6, శర-5, గుణ-3, శశి-1 శాకాబ్దములు 1356 అనఁగా క్రైస్తవమానము 1434 అగుచున్నది. కాగా శివలీలా విలాసము క్రీ. శ. 1434 సంవత్సరమునకు వెనుకనే రచియింపఁబడిన ట్లూహింపఁదగి యున్నది. వేమారెడ్డి 'స్వభుజార్జితమైన' కాళింగదేశమని శాసనమునఁ జెప్పఁబడియుం టుటచే కలువపల్లి, పొట్నూరు, ఒడ్డాది మున్నగుస్థలములనాతఁ డింతకుముందు కొలఁది కాలముక్రిందటనే తనపరాక్రమముచే జయించెనని తెలియుచున్నది.

7. వేమారెడ్డి తరువాత రాజమహేంద్రవరమును నొక పెద్ద గద్యతో వర్ణించి వీరభద్రారెడ్డిఁగూర్చి కొమ్మన కొంత ప్రశంసఁ గావించెను. ఇందులో చారిత్రక విష యము లేవి లేవు.

8. ఆపైని కృతినాయకుఁడగు దొడ్డరాజు ఈతఁ డిరువదినాల్గు మూళ్ళ నిడుపు గుఱ్ఱముచే దాఁటించినట్లు కొమ్మన యిట్లు చెప్పినాఁడు.

మ. అరరే అల్లయ దొడ్డభూవిభుఁడు వాహారోహారేవంతుఁడిం
పరుదారన్వడి మూలగూరి కడ వాహ్యాళిస్థలిన్ రాజకుం
జరసింహంబను వారువంబును యదృచ్ఛాలీల దాఁటింపఁడే
తిరమై యిర్వదినాల్గుమూళ్ళ నిడుపు త్సేకంబుచే యొత్తుగన్.

ఈవిషయమును శ్రీనాథమహాకవి తనకాశీఖండమున నిట్లు ప్రస్తావించియున్నాఁడు.

మ. హరిదాఁటించెఁ బురోపకంఠమున వాహ్యాళి ప్రదేశంబునన్
దరుదై యళ్ళయరెడ్డి నందనుఁడు దొడ్డయ్యాతమాధీశ్వరుం
డిరువైనాలుగుమూళ్ళ మేరయని గోసిగ్గింపగాఁ నెలయ
ద్ధరణీనాథుని కీర్తిదాఁటె కడు నుద్దండించి బ్రహ్మాండమున్.

కాశీఖండము.

ఈతఁడు ఘోడిరాయ భీమేశ్వర మహాదేవుని శిష్యుడు. ఈ మహానీయుఁడు రాజమహేంద్రవరము నేలిన రెడ్డిరాజుల వంశగురువు. ఈతఁడు పట్టిసక్షేత్రవాసి.

ఈతని ప్రశంస శివలీలావిలాసమున నిట్లు కలదు.

క. వీరల వంశగురుండును
దారగుణోత్తరుఁడు నగుచు తత్త్వమహత్త్వం
శ్రీరుచి ఘోడియరాయప
ధారాధుఁడు భీమదేశికాధిపుఁ డొప్పున్.

సీ. అవిరళైశ్వర్యమహత్త్వ సంపన్నత
మాళెన శాసట మలయువాఁడు
సంశ్రిత రక్షణాస్థా పరిపూర్ణత
నాభామహోజ్జ్వలు ననువువాఁడు
వేదశాస్త్రాదిక విద్యానిరూఢత
వదన సరస్వతి వడువువాఁడు
• వివిధాన్న వితరణ..................
చరణే సమీక్షణ నమతవాఁడు
తగుఁ బ్రశంసనేయ దండచ్యన్మద నిభం
జనుఁడు వినయ వినతమణి కిరీట
ధృణి సమంచితుఁడు ఘోడియరాయాంశ
గుణుఁడు భీమదేవ గురువరుండు.

మ. నిపుణత్వంబున బ్రస్తుతింపవలయున్ శ్రీవీరభద్రాచలా
గ్రిపుదివ్యాలత భర్మ్యహర్మ్యతల జాగద్వీరభద్రా.........
.....................సంపూర్ణ భీమేశ్వరున్
త్రిపురారీంద్ర గురూత్త మాత్మభవునిం దేవేంద్ర కోలాహలుల్.

ఆశ్వాసాంతపద్యములలో ద్వితీయాశ్వాసాంతమునఁ బంచారామబ్రశంసకలదు. పంచారామ ప్రశంస భీమఖండమునఁ గలదని విమర్శకులకుఁ దెల్లమే.

ఈవిధముగ శివలీలావిలాసమునందలి చారిత్రక విషయములు సమకాలికుల గ్రంథములతోడను శాసనములతోడను సరిపోవుచున్నవి. ఇఁక గ్రంథవిషయము.

శివలీలావిలాసమున ముప్పదియాఱు శివలీలలు వర్ణింపఁబడినవి. శివలీలలనుఁ బంచవింశతి లీలలుగాఁ బాల్కురికిసోమనాథుఁడు పండితారాధ్యచరిత్రమున వెలయించినాఁడు. కొమ్మన శివలీలా విలాసకృత్యాదినాలీలల. నిట్లు పేర్కొనినాఁడు.

1, శివుఁడు సచ్చిదానంద రూపంబున వెలుఁగుట, 2. యదృచ్ఛాప్రకృతి సంబంధమునఁ బురుషత్రయభంగి నంగీకరించుట, 3. సృష్టికర్తయై భాషాధిపుఁ బ్రబోధించుట, 4. ప్రజాభివృద్ధికై సతీపరిగ్రహణము, 5. గజముఖ పట్టాభిషేకము, 6. చంద్రధారణము, 7. ధర్మపురుషతపోవిభవంబున కలరి వాహనముగావించుట, 8. భృంగిరిటి కాల్కి

యనర్మసఖత్వ మొసఁగుట, 9. గంగధారణము, 10. యమ గర్వభంజనము, 11. జలంధరవధ, 12. దారుకావనవిహారము, 13. హాలాహలభక్షణము, 14. సుదర్శనదానము, 15. దక్షిణామూర్త్యవతారము, 16. దక్షుని యప్రియంబులకు దుఃఖితుఁగాఁ జేయుట, 17. మన్మథదహనము, 18. వటుభావంబున గిరిజభావముఁ దెలియుట, 19. ఆమెనిమ్మకు మెచ్చి యామెనుఁ బెండ్లియాడుట, 20. తారకవధోద్యోగము, 21. కుమారు నుత్పాదించుట, 22. శతమన్యువిభవంబున కలుగుట, 23. ఉపమన్యు గరుణించుట, 24. త్రిపురాసురసంహారము, 25. విరించి శిరఃఖండనము, 26. విరించిని భిక్షాటనమునకుఁ బంపుట, 27. నందకుని కాలభైరవునిచేఁ జంపించుట, 28. దక్షాధ్వరధ్వంసము, 29. మృత్యువును జయించుట, 30. అర్ధశరీరము నంగీకరించుట, 31. శరభావతారము, 32. చండీశ్వర ప్రసాదము, 33. త్రివిక్రమ కంకాళ ధారణము, 34. కిరాతవేషము, 35. పాశుపతాస్త్ర దానము, 36. ఉరులింగరూపమున విలసిల్లుట.

ఉపలబ్ధమగు గ్రంథములోఁ బదునొకండవ లీలయగు జలంధరునివధతో ద్వితీయాశ్వాసము ముగియుచున్నది. ఆపై నెంతగ్రంథమున్నదో యెఱుఁగరాదు. శివలీలా విలాసమున గణాధిపతిజననము నన్నిచోడదేవుని కుమారసంభవమునందలి గణాధిపజననమువలెనే వర్ణింపఁబడియున్నది. కేవలము పౌరాణికముగ ననఁగా నలుఁగుపిండి బొమ్మకుఁ బ్రాణప్రతిష్ఠగావించి విఘ్నేశ్వరునిగా వెలయుచుంటఁగాక, పార్వతీపరమేశ్వరులు గజరూపములతోఁ గ్రీడింపఁ గజాననుఁడుత్పత్తియైనట్లు శివలీలావిలాసమున వర్ణింపఁబడినది. కొమ్మనకు ముందు నన్నిచోడదేవుఁ డిట్లే గజాననోద్భవము వర్ణించినాఁడు.

నన్నిచోడుఁడీవిషయమును 'సుప్రభేదాగమ' మను నాగమగ్రంథమునుండి గ్రహించియున్నాఁడు. కొమ్మన నన్నిచోడనినుండి యీవిషయము గ్రహించియున్నాఁడు. శివలీలావిలాస మంతయు లభ్యమగునేని యాంధ్రశైవవాఙ్మయమునకు నది యొక నూతనాలంకారముగా విలసిల్లును.



# కుమారగిరిరెడ్డి నూతన అనపర్తి తామ్రశాసనము

(శా॥ శ॥ 1312 క్రీ॥ శ॥ 1390)

రాళ్లబండి సుబ్బారావు, ఎం.ఎ ,ఎల్ టి., ఎం.ఇ.,యస్.
చరిత్రోపన్యాసకులు, సర్కారుకళాశాల-అనంతపురం.

---

కొన్ని సంవత్సరములక్రిందట ఈ పట్టణమునకు సమీపముననున్న కోరుకొండ గ్రామమున దొరికిన రెడ్డిరాజుల తామ్రశాసనపురేకులు కొన్ని నాకును, కొన్ని నా మిత్రులు భావరాజు వెంకటకృష్ణారావునకును దొరకగా వాటిని పరిశోధించి ప్రతిబింబములతో సహా వాటినిగూర్చి మే ముభయులమును మా ఆంధ్రేతిహాస పరిశోధకమండలి త్రైమాసిక పత్రికలో ప్రకటించితిమి. ఇదివరలో తెలుగున ప్రకటింపబడమి, ఇప్పుడీ రెడ్డివర్ధంత్యుత్సవ సంచికయందు దీనిని ప్రకటించడమైనది.

ఈ దానశాసనకర్తయగు కుమారగిరిరెడ్డి క్రీస్తుశకము 1382 మొదలు 1403 వరకు తూర్పు ఆంధ్రదేశము నేలెను. ఈతని భావమరదియు, కళింగదేశమును సింహాద్రి పర్యంతము జయించినట్టియు, కాటయవేమారెడ్డి దానశాసనములు మరిరెండుకూడా దీనితోపాటు కోరుకొండగ్రామమున దొరికినవి. కాటయవేముడు కుమారగిరిరెడ్డికి ముఖ్యమంత్రియు, సేనాధిపతియునై ఆతనిని కొండవీడు సింహాసనమున సుస్థిరముగ ప్రతిష్ఠాపించెను. మరియు వాయవ్యమూలనున్న భామిని సుల్తానులును, ఈశాన్యమూలనున్న తూర్పు గాంగ రాజులును, నైరృతిమూలనున్న విజయనగరరాజులును, పశ్చిమదిశను రాచకొండను పరిపాలించుచున్న వెలమరాజులును, కొండవీడురాజ్యమును కబళింప జూచుచుండగా కాటయవేముడు వారినందరిని పారద్రోలి గోదావరికి ఉత్తరమునను, సింహాద్రికి దక్షిణముననున్న కళింగదేశమును జయించి, దానిని రెడ్డిరాజ్యములో కల్పియుండుటచేత కుమారగిరిరెడ్డి ఆభాగమునకు రాజధానియైన రాజమహేంద్రనగరమున తన కుమారుడైన రెండవ అనపోతరెడ్డిని రాజప్రతినిధిగా నియమించి, కాటయవేముని రాజ్యసంరక్షకునిగా నుంచి, అనపోతు అకాలమరణానంతరమున రాజమహేంద్రనగరము రాజధానిగాగల సింహాద్రి పర్యంత భూభాగమును కాటయవేముని స్వాతంత్ర్య పరిపాలనమునందుంచివేసెను. గనుకనే రాజమహేంద్రనగరమునకు చేరువనున్న కోరుకొండ గ్రామమున కుమారగిరి శాసనములోపాటు కాటయవేముని శాసనములుకూడ రెండు దొరుకుటకు కారణమైనది.

ఈ శాసనము 11 అంగుళములు పొడవు. 5 అంగుళములు వెడల్పుగల్గిన 5 రాగి రేకులమీద చెక్కబడినది. ప్రతి రేకునకు ఎడమప్రక్కనున్న రంధ్రముగుండా రాగి కడియమును తొడిగి, దాని కొనలు ఒక ముద్రయం దమర్చబడినవి. ముద్రమాత్రము మాకు దొరకలేదు. రేకుల అంచులు రేకులమీదనున్న వ్రాత అరిగిపోకుండ కొంచము పైకి ఎత్తబడినవి. వ్రాత మొత్తముమీద బాగుగనే యున్నది. శాసనపుభాష సంస్కృతము. కాని 14-వ శతాబ్దపు తెలుగులిపిలో వ్రాయబడినది. 84 పంక్తులు గలవు. అక్షరములన్నియు ఒకే లేఖకునిచేత వ్రాయబడినట్లు కనబడదు. ఇప్పటి అక్షరములవలెగాక తలకట్లు, గుడియు వేరువిధముగా వ్రాయబడినవి. ఎ, ఏలకు, ఒ, ఓలకు, ద, ధలకు, డ, ఢలకు భేదము కనపర్చకపోవుటచేత సందర్భమునుబట్టి మనము సరిగా తెలుసుకొని వ్రాయవలసియున్నది. రేఫము వలపలగిలుక వల్ల చూపబడినది. పాదాంతమందు "మ" కారపు పొల్లునకు బదులుగా అనుస్వారమే అనేకచోట్ల వ్రాయబడినది. శాసనమంతయు చక్కని సంస్కృతశ్లోకములచేత నలరారుచున్నది. దానముచేయబడిన గ్రామము యొక్క పరిహద్దులుమాత్రము తెలుగుభాషయందే ఇవ్వబడినవి.

కుమారగిరిరెడ్డియొక్క తామ్రశాసనము ఒక్కటైనను ఇదివరలో దొరికినట్లుగాని నాకు తోచదు. ఇదే మొదటిశాసనము. గనుకనే దీని ముఖ్యత. చారిత్రక ముఖ్యత గూడ చాలగలదు. కుమారగిరికాలమున కళింగదేశము కాటయవేమారెడ్డిచేత జయింపబడినట్లును, రాజమహేంద్రనగరము ఆ జయింపబడిన దేశమునకు రాజధానిగా నియమింపబడినట్లును, ఆ జయము దానకాలమునకు అనగా శక సం॥ 1312కు సరియైన క్రీస్తు సం॥ 1390 కి కొంచము పూర్వమునగాని ఆ సంవత్సరముననేగాని జరిగినట్లును, కుమారగిరికొడుకు అన్నపోతయనియు, దానగ్రామముపేరు " అనుపఱితి " యనియు, జయింపబడినదేశమునకు అన్నపోతుని రాజప్రతినిధిగాను, కాటయవేముని రాజ్యసంరక్షకునిగాను నియమించినట్లును, రెడ్డిరాజ్యమునకు కొండవీడు రాజధానిగా నుండెననియు, ఇంకను అనేక ముఖ్య చారిత్రకవిషయములు మనకు తెలియుచున్నవి. ఈ శాసనకాలమునకుముందే కుమారగిరితో తనరాజ్యమునకు దక్షిణ, పశ్చిమ, పశ్చిమోత్తర దిశలందున్న రాజులు సఖ్యము చేసుకొనిరనియు, ఉత్తరతూర్పు దిశనున్న కళింగ రాజు మాత్రము వైరముబూనియుండుటచేత అతని నోడించుటకు తన భావమరదియగు కాటయవేముని బంపగా అతడు సింహాద్రి పర్యంతప్రదేశమునేగాక మహానది వింధ్య పర్యంతప్రాంతములవరకు వ్యాపించియున్న ప్రదేశము నంతనుగూడ జయించెనని తెలియుచున్నవి. ఈ విషయమే శ్రీనాథుడు తన హరవిలాసమున దెల్పెను.

"హరిహరరాయ ఫేరోజసహా సురధాణ గజాధిపాధి భూ
వరులు నిజప్రభావ మభివర్ణనసేయఁ గుమార గిర్యధీ
శ్వరుని వసంత వైభవము సర్వము నొక్కఁడ నిర్వహించుమా
తిరుమలనాథశెట్టికిని ధీగుణభట్టికి నెవ్వరీడగున్."

మరియు రాజధానియైన కొండవీడునుగూర్చి ఇట్లు వర్ణించెను:—

"పరరాజ్య పరదుర్గ పరవైభవశ్రీల । గొనకొని విడనాడు కొండవీడు
పరిపంథి రాజన్య బలముల బంధించు । గురుతైన యురుతాడు కొండవీడు
ముగురు రాజులకును మోహంబుపుట్టించు । కొమరుమించినవీడు కొండవీడు
చటుల విక్రమకళా సాహసంబొనరించు । కుటిలాత్ములకుజోడు కొండవీడు
జవనఘోటక సామంత సరసవీర । భటనటానేక వస్తుకటగ్రంథ
సింధురార్భటీ మోహనశ్రీలఁ దనరు । కూర్మి నమరావతికిజోడు కొండవీడు."

ఈ శాసనమునుబట్టియు, శ్రీనాథుని వ్రాతలనుబట్టియు, కుమారగిరి వసంతోత్సవములు జరుపుచుండెననియు, అందుచేత వసంతరాయుడను బిరుదము పొందెననియు, మరియు వసంతరాజీయమను నాట్యశాస్త్రమును వ్రాయగల్గెననియు, వసంతోత్సవములు జరుపుటకు సుగంధశాల నొకదానిని నిర్మించి దానికవసరమగు ద్రవ్యములను అవచి తిప్పయ్య మొదలగువారిద్వారా తెప్పించుకొనుచుండెననియు, తెలియుచున్నది. శ్రీనాథునిదని చెప్పబడు ఈ క్రిందిపద్యము వలన ఈ విషయములు కొన్ని తెలియుచున్నవి.

"పంజాబు కర్పూర పాదపంబులు తెచ్చి । జలనోగిబంగారు మొలక తెచ్చి
సింహళంబున గంధసింధురంబులు తెచ్చి । హురుమంజి బలు తేజి హరులు తెచ్చి
గోవ సంశుద్ధ సంకుమదద్రవము తెచ్చి । యాఁ పగనాణి ముత్యాలు తెచ్చి
చోటంగి కస్తూరి కాటంకములు తెచ్చి । చీనిచీనాంబర శ్రేణిఁదెచ్చి
జగదగోపాలరాయ వేశ్యాభుజంగ । పల్లవాదిత్య భూదాన పరశురామ
కొమరగిరిరాజు దేవేంద్ర కూర్మిహితుడు । జాణజగజెట్టి దేవయ చామిసెట్టి.

ఈ పద్యమునుబట్టి ఆకాలమున కొండవీటిరాజ్యమునకు పంజాబు, గోవా, చీనా, ఆర్మజ్, జావా మొదలగు దూరప్రాంతములనుండి విలువగల వర్తకసామగ్రి వచ్చుచుండెననియు, రాజులు యుద్ధములయందేగాక వర్తకాభివృద్ధికి వాఙ్మయాభివృద్ధికిగూడ చాల పాటుపడుచుండెడివారనియు తెలియును.

## శాసనమూలము (1)

### మొదటిరేకు, రెండవప్రక్క.

1. శుభమస్తు [1] యస్మిన్నుద్వహతి క్షితిం యవనికావార్ధి స్తదీయోధ్వనిప్రో-
2. ద్యన్మంగలహృద్య వాద్యనినదో మాహామార్తికః పద్మభూః [।] శేషాశే-
3. షఫణీ మణిద్యుతిశ్రతైర్నీరాంజనం చాభవత్ [।] భూధారాధిపస్య
4. విష్ణుఃఖిల శ్రేయాంసి పుష్ణాతువః । [౨] బింధురివాఖిలాగమాత్తాగం
5. డస్థలలలిత దానజలబిందుః । బిందుకవాహో భూమ్నభువనానం-
6. దాబ్ధివర్ధన నవేందుః । [3] వ్యోమారామస్థలకమ్యశర శాఖామనోహారిణి
7. పుష్పవంతౌ (2) వస్వ్యతాం మనోరథఫలప్రదా [3] అస్తి త్రిభువనాధారో మేరునా (ర్నా-)

### రెండవరేకు — మొదటిప్రక్క.

8. స మహీంధరః నూత్నరత్న ప్రభాజాల నీరాజితదిగంతరః: [౪] భాతి తద్దక్షిణేభాగేవర్షం భా
9. రతముత్తమం [।] తత్రాపి భారతం ఖండ మఖండవ(వి) భాకరం(మ్) |౫| తత్రోత్కళత్రిలింగోత్తం
10. సా రాజహంసా స్సహాస్రశః అపాలయన్ ధరాం ధర్మతత్పరా శ్శతుర్జిత్పరా[ః] । [౬] తతః
11. క్రమాత్ విక్రమవాన్ ధరిత్రీం ప్రతాపరుద్రక్షితిప శ్శశాస [।] శ్రీ కాకతియ్యాన్వయవార్ధి-
12. చంద్ర స్సామ్రాజ్యలక్ష్మీ విజితామరేంద్రః [౭] వన్యోదయే చారువసుప్రసిద్ధా
13. తస్మిన్ మహీనాయకతిగ్మభానౌ [।] అస్తంగతే కాలవశాదభాసీత్[3] దోషకవం
14. దుర్యవనాంధకారః [౮] సతాం హృదయపద్మాని వికాసం విజహుః క్షణాత్ విచేరుశ్చోర
15. ఖద్యోతా స్తస్మిన్ ధ్వాంతే నిరంతరే [౯] తతః పరం సన్మునిభిర్నికామం ధ్యేయేబ్జనూతేః ప
16. దపంకజాతే । జాతాన్వయే వేమనృపాలవర్య స్సత్యోన్నతః ప్రోదుర భూదుదారః [౧౦] ఆసీదా

1. శాసనపురేకులనుండి మూలము సంగ్రహింపబడినది.
2. విశేష్యమును దెల్పు రెండక్షరములు చెక్కబడలేదు.
3. ఇచ్చట కర్తనుదెల్పు మఱికొన్ని అక్షరములు లోపించినవి.

రెండవరేకు - రెండవప్రక్క.

17. సేతు శీతక్షితిధరయుగలీ మధ్యదీప్త ప్రతాపస్సీమా
శైలేంద్ర సామస్థల చరఖచరీగీ
18. తవిఖ్యాతకీర్తిః । రాజద్రాజన్యవర్యోస్ఫుట
ముకుటతటీ రత్ననీరాజితాంఘ్రిర్వేమ
19. క్ష్మామండలేంద్ర స్సకల సుకృతినామగ్రణీ
రుగ్రశౌర్యః [౧౧] పవనజవనవాజి వ్రాతరం
20. గత్తరంగే యవనబల మహాబ్ధౌ భూతధాం[4]త్రీం
నిమగ్నాం । విపులవిజయ ధామా
21. యస్సముధ్ధృ[5]త్య చక్రే నిజభుజమణిభూషాం
వీరనారాయణాంకః । [౧౨]
22. సోపానాని కృతాని యేన కృతినా పాతాలగంగా
తటే శ్రీశైలస్య మహీశ మౌలిమ
23. ణినా తాన్యేవ చిత్రంపునః [౧౩] సోపానాని భవం[6]త్రి
మేరు శిఖరా రోహాయ నాకాప
24. గా గ్లాహాయ త్రిదశాంగనాజన మహాసౌధాద్ధి రోహాయచ
[౧౪] హేమాద్రిదానాధ
25. రణోన్నతస్య తస్యక్షితీశస్యసుతా వభూతాం శ్రీ
యన్నవోత క్షితిపాన్న వేమ మహీ

మూఁడవరేకు—మొదటిప్రక్క.

26. శ్వరౌ శాశ్వత ధర్మలోలౌ [౧౫] తయోద్వయో
రగ్రభవో భవాంఘ్రిసముచ్చ
27. నా సంభృతరాజ్యవృద్ధిః ధాటీముఖై రేవ విరోధి
రాజదుర్గాణి జగ్రాహ చతుర్విధాని [౧౬]
28. హేమాద్రి నిర్దిష్ట మహావిశిష్ట దానాని దీనావన
కేలిలోలః చకార యస్సర్వ దిగంతరాల న్ప
29. పాల మాలిస్థిత శాసనశ్రీః [౧౭] తదన్నవోత క్షితిపాంబురాశౌ కుమా

4. 'ధాత్రీం' అని చదువవలయును.
5. 'సముద్ధృత్య' అని యుండవలయును.
6. 'భవన్తి' అని చదువవలయును.

30. రగియ్యాణాఖ్య నృపాలచంద్రః అఖండవిఖ్యాతకీ
మండలశ్రీ[7] శ్రియాస
31. మం ప్రాదు రభూత్ కలావాన్ । [౧౮] అభ్రంలిహా
గ్రేమ్వారి రాజసౌధజా
32. శేషు దూర్వానిచయం సమ్భ్రాంతాత్ అంకూర[8]ఇత్యా
స నృపః కృపావా నరీరజ చ్చాం
33. ద్రమసం కురంగమ్ [౧౯] వసంతవేలా సు
దిశావధూనాం కర్పూరఖండైః కృతమండ(న) శ్రీః కు
34. మారగిర్యాణాఖ్య వసంతరాయః కీర్తి ప్రతాపా
భరణో విభాతి । [౨౦] పుత్రః పాద్దుర భూ
35. త్తస్య కుమారగిరి భూపతేః అన్నవోత ఇతిఖ్యాత(ః)
స్వపితా మహావిక్రమః । [౨౧]

మూడవరేకు — రెండవప్రక్క.

36. సుకుమారతరాకార స్స కుమారశిఖామణిః । జయావహ
తు మహాశక్తిః కుమా-
37. ర ఇవ రాజతే । [౨౨] తం బాలమంకమారోప్య
కుమారగిరిభూపతిః [9]ద్దాక్షా
38. ధామే తులాదానమకార్షీ దతికౌతుకాత్ । [౨౩]
అథ తస్మై కుమారాయ యో రా [౦]
39. విభాసినే । దేశం దిగ్విజయాక్రాంతం దాతు
కామ స్స భూపతిః । [౨౪] చ
40. తుర్విధోపాయనయ ప్రవీణం సాం
రాజ్య నిర్వాహ మహా ప్రి
41. భావం । స్వసుః పతిం కాటయవేమభూపం
రాగాద వాదీదతిగా
42. రవేణ । [౨౫] ఉదీచ్యాశ్చ దాక్షిణాత్యాశ్చ
ప్రతీచ్యాశ్చ మహీశ్వరాః ఆచరం

---

7. 'శ్రీః' అని చదువవలయును.

8. 'అంకూరయిత్వా' అని చదువవలయును.

9. 'దాక్షా'—అని చదువవలెను.

43. తి సదా మైత్రి మస్మాభి రతికౌతుకాత్ । [౨౬]
తస్మాత్సింహాద్రి పర్యంత ప్రాచ్యా ఏవ
44. మహీశ్వరాః । జేతవ్యాస్తన్మహీపాలా నథు నా
జయలీలయా [౨౭] ఇతి ప్రా ][ప] తాపాభరణే

నాల్గవరేఖ—మొదటిప్రక్క

45. స తేన వసంతరాయాంక మహీశ్వరేణ ఆజ్ఞాపితః
కాటయవేమశౌరి.రపాంసు
46. కేలివ్యధితారివీర: [౨౮] తతశ్శైల పురాత్తస్య
కుమారగిరిభూపతేః । రమ్యం రాజమహేం
47. ద్రాఖ్యనగరీం ప్రత్యపద్యత । [౨౯] తన్నగర్యాం
గరీయస్యాం ప్రాకారాంతరభూషణం ఆ
48. స్తే శ్రీ గోపికాధీశ శ్శ్రీకృష్ణ బ్రహ్మా ప్రతిష్ఠితం [౩౦]
చక్రం నియుజ్య సమదాసుర భంజనాయ బు
49. ద్ధిం నియమ్య భువనత్రయ రంజనాయ । సంక్రీడతే
జగతి యస్సురమౌలి—
50. రత్ననీరాజితాంఘ్రి కమలః కమలాసహాయః
[౩౧] ఇత్థం ప్రభవోదయ భా-
51. సమానం తం గోపికానాథ మశేష శేవ్యం
మహామతిః కాటయవేమశౌరి జగాయప్రశి[సి]
52. ద్యై [ధ్యై] మనసాప్రణమ్య । [౩౨] అస్మిన్ దిగ్వి
జయే తుభ్యంగ్రామ మత్యూర్జితం విభోదాస్య
53. మీతి ప్రతిశ్రుత్య సత్యశాసనవైభవః । [౩౩]
మాహూర్తికన్యస్త మనోజ్ఞలగ్నే ప్రస్థాన-
54. భేరీపటహప్రణాదైః । వీరావయన్ విశ్వదిగంత
రాణి ప్రాతిష్ట [ష్ఠ] త ప్రాజ్ఞ్యపతీన్ విజేతుం । [౩౪]
55. తతో విధ్యాంద్రి సింహాద్రివర్తి మహీశ్వరాన్
జిత్వా తద్దేశదుర్గేషు నియుజ్య స్వాధికారిణః । [౩౫]
56. అథ గజపతిముఖ్యై రర్పితోదాత్త మత్త ద్విప
హయమణి భూషాడంబరోపాయనాని ।

57. కౌమరగిరిమహీశస్యాగ్రభాగే విధాయ ప్రకట
విజయధామా కాటయాధీశవేమః । [౩౮]
58. ప్రణమ్య తస్మై ధరణీశ్వరాయ సంభావితస్తేన
బహుప్రకారైః । కృతార్థ (ర్థి) జన్మానమముం
59. స్త సమ్యగాత్మానమా నమ్రవిరోధివీరః। [౩౭]
తతో నిజభుజాలబ్ధ మహావిజయ-
60. హేతవే హిమాచల సముత్తుంగ పతి రేతవే ।
రాజద్రాజమహేంద్రాఖ్య-
61. పురీ నిత్యనివాసినే శ్రీమద్గోపాల దేవాయ
శాశ్వతైశ్వర్యదాయినే । [౩౯] కుమారగిరి
62. భూభర్తుస్సుతేన రవి తేజసా అన్నవోతకుమారేణ
సామ్రాజ్యరుచిరశ్రియా । [౩౯] తుల్య
63. భావినదీతీర గ్రామముద్దామవైభవం । సోయం
కాటయవేమాంకః । ప్రాదాపయదుదా
64. రధీ: । [౪౦] సకుమార స్తత స్తస్య దేవస్యార్చన
కోవిదా వైఖాన సకలశ్రేష్ఠావాద్యే శింగయ -

ఐదవ రేకు, మొదటిప్రక్క

65. వేంగతా [౪౦] సంభావ్య దేవో భవదీయ ఏష పుష్టాతి
రాజ్యశ్రియ మస్మదీయాం । అతో
66. మహాగ్రామ మనేక సస్య మస్మైదదామీతి ముదా బ్ర[1]
వాణః [౪౨] శాకాబ్దే నేత్ర చంద్ర జ్వలనశశి
67. మితే మాసివైశాఖ సంజ్ఞే ప ప్రమ్యాం శుక్ల పక్షే కొమర
గిరి విభో స్సూనురింద్ర ప్రతాపః గ్రామం శ్రీ
68. యన్నవోత ప్రభురనుపజతి ప్రోథనామాభిరామం
ప్రాదా దాచంద్రతారం నిజవిజయకృతే గో
69. పీశాధీశ్వరాయ [౪౩] ప్రాచ్యాం కడమలపుంతః
పశ్చిమతః తాడితోంట కడయోరగోం
70. గుః । ఉమరూబండ ఉదీచ్యాం వేలంగలపుంతశ్చ
దక్షిణాభాగే [౪౪] ఆగ్నేయాందిశి

1. 'బ్రువాణః' అని చదువవలయును.

71. భాతి సర్వవిదితో నేరేడుబండ స్తతో నైర్ఋత్యాం
దిశి పుణ్యజీవనవతీ సాతుల్యభాగా నదీ

72. వాయవ్యే పిచసీమ్ని లోక విదితో మూసాయుచెఱువు
దిశీశాన్యాం కొక్కెరబండ ఇత్యభిమ

73. తో గ్రామస్యసీమా ఇమాః [౭౫] రాజ్ఞాం మాలిమణేః
కుమారగిరి భూపాలస్య సూనుః ప్రభాభా

74. సుధీనిధిరన్నపోత నృపతి శ్రీవీరనారాయణః। ధత్తాం
భూరమణీం భుజే విజయతాం.

అయిదవరేకు - రెండవప్రక్క.

75. ప్రత్యర్థి పృథ్వీపతీన్ ధర్మ్యాన్ పాలయతాత్ శ్రియం
వితనుతా దాచంద్ర తా[1] రకం [౭౮] సా

76. మాన్యోఽయం ధర్మసేతు నృపాణాం కాలే కాలే పాల
నీయో భవద్భిః। సర్వాన్నేవం భావినః

77. పార్థి [థి] వేంద్రాన్ భూయో భూయో యాచతే
రామచంద్రః [౭౭] శ్రీమనుమదుర్గ సుధీయు పా

78. త్రేణ సుతేన పిన్నయార్యస్య అన్నయకవినా విర
చితం శాసన మాభాతి గోపికా భర్తుః [౭౮]

79. శింగనార్యేణ వల్లభశ్చ వేంగలార్యేణ భావ
నః అయ్యలుశ్చేతి దేవస్య సమా

80. రాధనకోవిదాః [౭౯] ఆందోలికాల పచ్ఛత్రచామ
కాది విరాజితః[2] లబ్ధసా

81. నాధిపత్య శ్రియోఽభలార్యశ్చ విశ్రుతః [౫౦]
ఏవం సావృత్తయో రాజని నికాజన

82. విశ్రుతః। కొమరగిరివ్రాలు.

సంక్షిప్తార్థము.

శాసనము విష్ణునియొక్కయు, చంద్రునియొక్కయు, స్తోత్రముతో ప్రారంభించి, మూడులోకములకు ఆధారభూతమైన మేరుపర్వతమును దానికి దక్షిణముననున్న భరత

1. 'తారారుణమ్' అనికాని 'తారాగణమ్' అనికాని చదువవలెను.
2. 'విరాజితః' అని యుండవలయును.

వర్షమును, అందుండు భరతఖండమును పేర్కొనును. అందు క్షత్రియవంశమునకు చెందిన అనేకరాజులు భూమిని పాలించిరి. అందు కాకతీయ వంశాబ్ధిచంద్రుడగు ప్రతాపరుద్రుడు మిక్కిలి బలమైనరాజు. అతనితరువాత దేశము అరాజకమై అంధకారమున మునిగెను. కొంతకాలమునకు రాజ్యమునకును ప్రజలకును సంతోషము కలిగించులాగున విష్ణుపాదములనుండి జనించిన కుటుంబమునకు చెందిన వేముడనురాజు ఆసేతు హిమాచలపర్యంతము తన నిర్మలమైన కీర్తిని వ్యాపింపజేసెను. అతడు ఒకరాజ్యమును సంపాదించెను. యవనులు, లేక మహమ్మదీయుల స్వాధీనమునందున్న దేశమును సంరక్షించి వీరనారాయణుడను బిరుదమును పొందెను. అతడు పాతాళగంగ, లేక కృష్ణనదీతీరము నుండి శ్రీశైలపుకొండ చిగురువరకు సోపానములు కట్టించెను. అతడు అనేకదానములను చేసెను. అతనికి అన్నపోత, అన్నవేమ అను కొడుకు లిద్దరుండిరి. అన్నపోత తన శత్రువులను జయించి వారికోటలను పట్టుకొని రాజ్యమును వ్యాపింపజేసెను. అతనితరువాత అన్నవేముడు రాజై అనేకదానములను చేసి అనాథులను సంరక్షించెను. తరువాత అన్నపోతకుమారుడగు కుమారగిరి రాజ్యమునకువచ్చెను. అతడు సర్వకళలను శాస్త్రములను అభ్యసించెను. వసంతోత్సవములు జరుపుటచేత వసంతరాయ బిరుదమొందెను. కుమారగిరి కొడుకు రెండవవీర అన్నపోత అందమునను, ధైర్యమునను కుమారస్వామిని బోలెను. అతనిని తోడయుందుంచుకొని తండ్రియగు కుమారగిరి దాక్షారామమందు తులాపురుషదానమునుచేసెను. తనకొడుకునకు క్రొత్తరాజ్యమును సంపాదించియిచ్చునుద్దేశముతో తన భావమరదియు మంత్రియు, సేనాపతియు నగు కాటయవేమునిపిల్చి కుమారగిరి యిట్లుచెప్పెను. "ఉత్తరమునను, దక్షిణమునను, పశ్చిమమునసనున్న రాజులు తమంతటతామై మనతో స్నేహముగనున్నారు. కాని, తూర్పుదిశనున్న రాజులును, సింహాచలమునకు అవతలనున్న రాజులును, మనతో స్నేహముగలేరు. గనుక వారిని జయించి వారిదేశములను మనదేశములో కలిపివేయవలెను"

అట్లు వసంతరాయునిచే ఆజ్ఞాపింపబడి కాటయవేముడు పెద్దసైన్యముతో శైలపురము, లేక, కొండవీడును వదలి రాజమహేంద్రనగరము చేరెను. ఆనగరమధ్యమందు శుకబ్రహ్మచే నిర్మింపబడిన అసురధ్వంసకుడగు గోపీనాథుని, లేక గోపాలస్వామియాలయముండెను. తన దండయాత్రయందు విజయము కలుగవలెనను ఉద్దేశ్యముతో కాటయవేముడు గోపీనాథుని పూజించి తనకు విజయము సిద్ధించి, తాను తిరిగివచ్చినచో దేవుని పూజకై ఒక మంచిగ్రామము నిచ్చెదనని ప్రతిజ్ఞచేసెను. తరువాత సుముహూర్తమున జయభేరి మ్రోగించి, తూర్పుదిశనున్న రాజ్యమును జయించి, తన రాజ్య

మును విస్తరింపజేయు నుద్దేశ్యముతో తన సేనతో బయలువెడలెను. ఉత్తరమున వింధ్యాద్రి, దక్షిణమున సింహాద్రి మధ్యనున్న దేశముల రాజులను జయించి, ముఖ్యమైన పట్టణములకు కోటలకు తన ఉద్యోగులను నియమించెను. కటకము రాజధానిగా గల గజపతిరాజు (నాల్గవ వీరనృసింహదేవు) వద్ద కప్పము గైకొనెను. అనేక మదపు టేనుగులను, గుర్రములను, అమూల్యములగు ఆభరణములను, విలువలేని లోహములను గైకొనెను. వీటిని గొంపోయి కాటయవేముడు కొండవీడుననున్న తన యేలిక కుమారగిరికి సమర్పించెను. తన బావమరిది సాహసకృత్యమునకు సంతసించి కుమారగిరి అతనిని అనేకవిధముల బహూకరించెను. తరువాత కాటయవేముడు కుమారరాజగు రెండవ అన్నపోతుతో గూడి రాజమహేంద్రనగరమునకు వచ్చెను. వీరనారాయణ బిరుదము పొందిన అన్నపోతు నూతనముగ సంపాదించిన రాజ్యమునకు రాజప్రతినిధిగ రాజమహేంద్రనగరమున నియమింపబడెను. అప్పుడు తన యేలికయగు అన్నపోతును ఒప్పించి గోపీనాథదేవుని దేవభోగమునకై ఒక మంచి గ్రామమును దానమిచ్చుటకు అనుజ్ఞ పొంది, గోపీనాథుని అర్చకులను, వైఖానస కులమునకు చెందినవారును, అగు శింగయ, వెంగళల నిద్దరను అన్నపోతు సముఖమునకు పిలిపించెను. అప్పుడు అతడు వారితో యిట్లనెను. "మా శత్రువులను ఓడించి విజయము లభింపజేసి మా ఐశ్వర్యమునకు మా రాజ్యమునకు ముఖ్యాధారభూతమైన గోపీనాథదేవుని అర్చకులు మీరు. ఆదేవుని అర్చనకై మేమిప్పుడు ఒక మంచి గొప్ప గ్రామమును దానమిచ్చుచున్నాము".

దానకాలము శకసంవత్సరము 1312. అనగా క్రీస్తు 1390 సంవత్సరమున యీ దానము చేయబడెను. తుల్యభాగాతీరమున నున్న అనుపఅని గ్రామము అన్నపోతవరము అనుపేర దేవభోగముగ చేయబడి దానమివ్వబడెను. దానగ్రామముయొక్క సరిహద్దులు:—తూర్పు కడమలపుంత, పశ్చిమము యోరగొంగు, ఉత్తరము ఉమరుబంద, దక్షిణము వెలగలపుంత, దక్షిణ తూర్పుమూల నేరేడుబందు, దక్షిణ పడమరమూల తుల్యభాగ, ఉత్తర పశ్చిమమూల పోకమాసాయ చెరువు, ఉత్తర తూర్పుమూల కొక్కెరబంద.

ఈశాసనమందలి శ్లోకములు మనుమదుర్గ మనుమడును, పిన్నయార్యుని కొడుకును అగు అన్నయకవిచే కూర్చబడినవి. దానప్రతిగ్రహీతలు శింగయ. వల్లభార్య, వెంగభార్య, అయ్యలార్య స్థానాధిపతి ఓభలార్యకురాజు, ఒక పల్లకి, గొడుకు, చామరములు మొదలగునవి యిచ్చెను. కొమరగిరివ్రాలు అని ఉన్నది.

# రెడ్డిపదోత్పత్తి వికాసము *

కందుకూరి ఈశ్వరదత్తు, బి.ఏ.,

౨

రెడ్డిపదోత్పత్తి వికాసమునుగూర్చి వ్రాసిన ప్రథమవ్యాసమునందు రాష్ట్రకూట, రట్టడి, రెడ్డిపదములు సమానార్థకములనియు, నివివృత్తిసూచకములై తర్వాత ఉద్యోగ ద్యోతకములై పిమ్మట కులసంజ్ఞను దాల్చెననియు నిరూపించితిని. ఆర్థికరూపమును విడ నాడి అధికారవేషమును ధరించి, ఆంధ్రదేశమునం దిప్పుడొక ప్రత్యేకకులమును నిరూ పించుచున్న రెడ్డిపదము సాంఘికపరిమాణమును, చారిత్రక విచిత్రమును, సారస్వత వికాసమును ప్రదర్శించుచున్నది. ఈవ్యాసమునందు రట్టడి రెడ్డివాచ్యులనుగురించియు, సారస్వతమున రట్టడిపదార్థమునుగూర్చియు చర్చించుచున్నాను.

రట్టడి రెడ్డివాచ్యులలో బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్య, వెలమ, కమ్మ, కులాదు రులకు చెందినవారుగలరు. అట్టిరట్టడి రెడ్డినామాంతముగలవారిని నాలుగుకులములకు చెందినవారిని వాఙ్మయమునుండియు శాసనములనుండియు నీదిగువ పేర్కొనుచున్నాను.

కాకునూరి అప్పకవి తనతాతయైన పెదసోమయను వర్ణించుచు నాతడు రట్టడి యని పేర్కొనెను.

ఉ॥ వట్టెము పోతనార్యసుతవర్యుఁ డనందగు పెద్దిభట్టుతో
బుట్టువ కృష్ణుఁ గైకొని సుపుత్త్రిల వెంగనఁ గన్నిభట్టు బ
ద్దిట్టను గంగయ, న్నుతలఁ దిమ్మను, రంగను లింగ గోనమన్
రట్టడిఁ గాకునూరి పెదరంగయసోముఁడు గాంచె వేడుకన్.

ప్రథమాశ్వాసము, పీఠిక ప. 80.

పైనుదహరించిన కాకునూరి అప్పకవి వైదికుడు. తాతను తాను రట్టడిగా వర్ణించెను. ఈ సోమయ్యతాత సోమయ్య, అనగా, కాకునూరివంశమునకు మూలపురుషుడు గొప్ప పండితుడై కాకునూరి అగ్రహారమును, నిడుదవెల్లి, బొద్దినేపల్లి, నివరళిపురి అను గ్రామ ములలో మాన్యక్షేత్రములను సంపాదించెను. ఆతనిమనుమడే రట్టడియైన పెదసోమయ. కాకునూరి అప్పకవి తన తాతను రట్టడిగా వర్ణించునప్పుడు దాని కొక విపరీతమైన నిం ద్యార్థ మేమియు నుండదనియు, ఆత డొక అగ్రహార, మాన్యక్షేత్రములు గాణాచిగా ననుభవించుచున్న సంతతిలో జన్మించుటచేత నాతడు రట్టడిగా పేర్కొనబడె ననియు నూహించుటయే సమంజసమని నా మనవి.

---

* ఈశ్వరదత్తుగారి పేరితో వ్రాసిన యీ సంచికలోని వ్యాసమునకు అనుబంధము—సంపాదకుడు.

భట్టుమూర్తి కవికృతమైన చాటుపద్యములలో నొకదానియందు తాను రట్టడి నని చెప్పుకున్నాడు. కృష్ణదేవరాయల మంత్రిశిఖామణియైన తిమ్మరుసుపై కోపోద్దీపితుడై, భట్టుమూర్తి యీ క్రిందిపద్యమును జెప్పెనని చాటుపద్య మణిమంజరిలో వ్రాయబడెను.

ఉ. గొట్టుదు దుష్టవిద్విరదకోటులఁ బంచముఖోద్భటాకృతిన్
బెట్టుదు దండముల్ సుకవి బృందముకే నతిభక్తిసారతన్
గట్టితి ముల్లెలేబదియుఁ గాఁగల నూటపదాఱులెవ్వఁడౌ
రట్టడ భట్టుమూర్తికవి రాయని మార్గమెఱుంగఁజెప్పితిన్.

పై నుదాహరించిన పద్యములో రట్టడి పదమునకు నిందితుడు కఠినుడు బెట్టిదుడు అను నింద్యార్థముగాక యిదియొక బిరుదువాచకముగా నుపయోగింపబడెనని యూహించుచున్నాను.

రామరాఘవ శతకకర్తయైన పల్లిపార్వతీశకవి కుపితుడై యొక వైశ్యకులోత్తంసుని నిందించుచు నీక్రింది పద్యములను చెప్పెనని తెలియుచున్నది.1

కం॥ అలఁగుచు రేపల్లెంగల
బలవంతుల చుట్టునిన్ను బలిదిప్పుచు బో
లిమేరయొద్దఁ బెట్టెద
వెలయఁగ పువ్వాడ మొండి వెంకటరెడ్డీ!

కం॥ భూవరులు నర్దవారులు
భాసురుల పదీశులంత భావింపఁగా
శ్రీసహితులెల్ల వైశ్యులు
వాసిగ రేపల్లెఁ బొగడ వశమే మాకున్!

కం॥ ఇలలోఁ దాతల నెన్నఁగ
ఫలమేమిఁక నిన్నుఁజూడఁ బొల్పడితిని నా
బల మెఱుఁగ వేమి చెప్పను
వెలయఁగ పువ్వాడ మొండి వెంకటరెడ్డీ!

కం॥ బలిముఖులై నినుఁగొని
బలమున నూరూరఁ బాతచెప్ప తరలచే

1. భక్తిరస శతక సంపుటము ౫. వావిళ్ళ ప్రచురణము. శ్రీ అక్కిరాజు ఉమాకాంతముగారు పైశతకమునకు పీఠిక వ్రాయుచు "ఈ పద్యములలోని వెంకటరెడ్డి యనువారు రెడ్డికులజులని భ్రాంతి కలుగవచ్చును గాని వైశ్యులేయని యెఱుంగనగు" నని సెలవిచ్చిరి.

నలగఁగ్గొట్టుచుఁ ద్రిప్పెద
వెలయఁగ వువ్వాడ మొండి వెంకటరెడ్డీ!

వెలమకుల తిలకులును, వెంకటగిరి సంస్థానాధీశ్వరులు నైన వెలుగోటివారు తమ వంశ చరిత్రిలో రెడ్డిశబ్దవాచ్యులైన పోలిరెడ్డి, చెవిరెడ్డి యనువారలను తమ మూల పురుషులుగా వ్రాయించుకొన్నారు.[2]

సీ॥ అనుమనగల్లను - ఘనమైన పురమున
ననుమనగంటి గో - త్రాన్వయుండు
పొలుపొందు చేయూరి పోలిరెడ్డి సుతుండు
రెండెడ్లఁ గట్టుక రేచఁడనెడు...

ఆ చెవ్విరెడ్డియు నంత సంతసమున
(జెలువు మీఱఁగ బోయి) చేనిఁజూచి
..................................

అట్లె కమ్మవారిలో రెడ్డి బిరుదమును జేర్చుకొన్నవారు గలరు. దుర్జయవంశజుల మని చెప్పుకొను కమ్మవారిలో కొందరు రెడ్డినామాంతము గలవారున్నట్లు శాసన దృష్టాంతము లున్నవి. కాకతీయగణపతి మహాప్రధానియు, దుర్జయ వార్ధివర్ధనుడును నగు మల్లెల వేమాద్రిరెడ్డి యొకడు గలడు.[3] కమ్మవారిలో వాసిరెడ్డి, కొమ్మారెడ్డి మొదలైన గృహనామములు గలవారున్నారు.

నాయుడు, సీడు, నాయకుడు అను బిరుదులు గలవారు బ్రాహ్మణులలో నున్నట్లు శాసన దృష్టాంతము లున్నవి. చూడుడు.

“బాగిమాదిమయ్య నాయకుల కొడుకు- గోవిందరాజులయు, మారకవ్వ కొడుకు- కొడుకు- శ్రీమల్లక్ష్మణ దండనాయకుల మహాప్రధాని సిద్ధిమయ్యనాయకులు”

వేంగీ వసుధాంగానా తిలకమై శిష్టతమా దేవ బృందావాసంబగు వాన రంబుపతి యుద్యత్కీర్తి యజ్ఞత్రయ వ్యావర్ధిష్ణు మహిష్ఠుత ప్రకట పుణ్యారంభుడై యొప్పె సద్భావిం బోతనసోమయాజి నిచిత బ్రహ్మాండ తేజండిలన్.

---

2. వెలుగోటివారి వంశావళి. పుటలు 1—2. శ్రీ వెంకటరమణయ్యగారిచే సంస్కరింపబడి, మదరాసు యూనివర్సిటీవారిచే ప్రకటితమైన గ్రంథము.

3. కాకతి గణపతిదేవ దివ్య శ్రీపాద శేఖర పరబల భీకర దుర్జయకుల వార్ధివర్ధన శ్రీ మన్మహాప్రధాని మల్లల వేమాద్రిరెడ్డి. S. I. I. Vol. IV. No. 1333.

S. I. I. Vol. IV. Nos. 675, 1094.

అతనికి నాత్మజుండు సుజనాగ్రణి దోడ్డపనాయకుండు దత్సుతుడనవద్య కీర్తిమతి సూర్యుడు..........

రట్టడి, రెడ్డి, నాయుడు, నీడు, నాయకుడు అను పదములు పర్యాయపదములని యు, నవి పూర్వకాలమున నాల్గువర్ణములవారును, భిన్నకుల సంజాతులును బిరుదు వాచకములుగా తమ నామముల తుదలనో మొదలనో తాల్చెడువారనియు నిరూపించి నాను.

కీర్తికాంతకును, కవితాకాంతకును రట్టడి బిరుదు చేర్చిన కవులును గలరు. వెలుగోటివారి వంశావళిలో నొకచోట (పుట 63) కవి కీర్తికాంతను రట్టడిగా వర్ణించినాడు.

కం. భట్టనఁగ రుద్రరూపము
భట్టనఁగా రాచవేల్పు పాటించని యా
తొట్టరి రాజులకబ్బున
రట్టడి పత్తీర్తికాంత రావుపసంతా.

అల్లె ఎడపాటి ఎఱ్ఱనమహాకవి తాను రచించిన శృంగారమల్హాణ చరిత్రలో కావ్యకన్యను రట్టడిగా వర్ణించె

ఉ. ఇట్టిమహాప్రధాన పరమేశ్వరమూర్తివిగాన నీవు చే
పట్టితి మేలుచుండి పురపాలక కాళనమంత్రి చంద్రమున్
గట్టిగఁ గృష్ణరాయుజన కాంతునకీయక దాఁచినట్టు యా
రట్టడియైన యెఱ్ఱకవి రాజిత మల్హాణ కావ్యకన్యకన్.

ప్రథమాశ్వాసము. పుట—9.

శృంగారభల్లాణ చరిత్రలో నొకచోట రట్టడిపదప్రయోగమున్నది. శివుడు విట జంగముడై భల్లాణరాజు భక్తిని పరీక్షించుటకై వచ్చి, సంభోగార్థము వారకాంతను గూర్పగోరిన సందర్భములో విటజంగముడు చేసిన ప్రసంగమునందు దానురట్టడి సంగమ రాజునని వచించుకొనెను.

ఈమాటవినినేను నీరూపుఁదాల్చి
వేమాఱుభక్తుల వేశ్యలననగి
పుట్టునే విటుఁడనై భోగింతు నిత్య
రట్టడి సంగమరాజును నేను.

ద్వితీయాశ్వాసము. పుట—34.

ఆంధ్రసారస్వతమునందు రట్టడిపదము విశేష్యముగాను మఱియొక యర్థమున గన్పట్టుచున్నది. ఈ పదమునకు ఉద్ధతుడు బెట్టదుడు, నిందితుడు, కఠినుడు, అనునర్థములును, బెట్టిదమైన, నింద్యమైన, కఠినమైన అను నర్థములును గలవు. రట్టడి పదమునకే యర్థము 'రట్టు' (దూఱు-నింద) అనుపదమునకు అడి ప్రత్యయమును జేర్చినచో గల్గినదని తలచుచున్నాను. శబ్దరత్నాకరములో రట్టడి పదమునకు 'నింద్యము' అని యర్థ మీయబడినది.

శ్రీనాథునికి సమకాలికుడైన గౌరనమహాకవి ద్విపద హరిశ్చంద్ర కావ్యమునందు రట్టడిపదము విశేష్యముగాను, విశేషణముగాను పై యర్థములందే ప్రయోగించెను. హరిశ్చంద్రుడు చంద్రమతిని అమ్మజూపు సందర్భమునందును,

మగఁటిమినని మొనమార్కొని పోరి
పగరకువెన్నిని భటముఖ్యులార
కట్టల్కవేటాఱు గావడివేయు
రట్టడి బిరుదుల రాహుత్తులార. (పుట 139)

కాలకౌశికుని గుణవర్ణన సమయమునందును,

కోరినధనములు కొండుకొండనుచు
నక్కఱగండఁడై యప్పటప్పటికి
వెక్కసంబుగనూర్లు వేలునప్పిచ్చి
రట్టడై తిరిగి పత్త్రంబులు గొనుచుఁ
బెట్టకచ్చినఁగల్ల పెనవులు వెనఁచి
తిట్టువారును దానుఁదిరి తీవులాడి

వృద్ధిని లెక్కించి వెసనప్పుబెత్తి
కాలకౌశికుఁడనఁగాఁ బేరువడసి. (పుట 144)

రట్టడిపదము 'బెట్టిదమైన' కఠినుడు అనునర్థమునందె గౌరన ప్రయోగించినట్లు శ్రీ వేదము వెంకటరాయశాస్త్రిలుగారు టిప్పణము వ్రాసిరి.

రట్టడిపదము ఆంధ్రసారస్వతములో నిప్పుడు నాయకుడు, భూస్వామి, యను నర్థమునందుగాక బెట్టిదుడు నిందితుడు అను నర్థమునందె వాడుకలోనున్నది. మొదటి యర్థమున నీపదము పదమూడవ శతాబ్దముననుండి వాఙ్మయమున కనబడదని వ్రాసినది పొరబాటు. అట్టియర్థమున పదునేడవ శతాబ్దివఱకు గలదని చెప్పవచ్చును. కాని రెండవయర్థమునందె యీ పదము సారస్వతమున బహుళముగా ప్రయోగింపబడినది.



రాజమహేంద్రవరం పాతకోటకు ఈశాన్య భాగమందలి శిథిలబురుజులు.



కోట ఉత్తరభాగము. నదినుండి కోటలోనికిపోవు మార్గము.



గోదావరీనదియొడ్డున కోటశిథిలము.

# కోరుకొండ రెడ్ల చరిత్రము.

## కోరుకొండసీమ.

వడ్డాది అప్పారావు.

రాజమహేంద్రవరమున కుత్తరభాగమున మన్నెప్రాంతములు సరిహద్దుగా కోరుకొండసీమ కలదు. దీనికి పశ్చిమభాగమున గోదావరినదియు, దక్షిణభాగమున గుత్తి-వాటివిషయమును, ఉత్తరమున అంపయును, తూర్పుభాగమున ప్రోల్నాడును కలవు. ఈ కోరుకొండసీమ సస్యసంభరితమై నివాసయోగ్యమైన స్థానము. శత్రువులకు సులభముగా చొరుటకు వీలులేని వనదుర్గమని చెప్పవచ్చును. కాకతీయ చక్రవర్తులకు పూర్వకాలమునుండియు ఇదియొక నాయంకరముగానుండి సిద్ధేశ్వరము కోటయను నగరము రాజధానిగా గోదావరీతీరమంతయు కోనసీమసహా నాయకులచే పరిపాలింప బడుచున్నట్లు స్థానికచరిత్రలు వాకొనుచున్నవి.[1] మల్లపదేవుని యనంతర మీసీమ అన్నలదేవునిచే పరిపాలింపబడినది. ఈ అన్నలదేవుని ప్రతాపరుద్రుడు జయించి ఈ సీమను తనరాజ్యములో కలుపుకొనెను. ఈ అన్నలదేవుడు గొప్ప నీతివేత్త; ప్రజారంజకముగా దేశమును పరిపాలించెను. కోరుకొండసీమలో కొంతభాగము అడవులతోనిండియున్నది. అన్నలదేవుడా యరణ్యములను కొట్టివేయించి రయితులకు ధర్మకవుళ్ళిప్పించి, ఈసీమను వృద్ధిపఱచెను. దీనిని ఆనాడు కోటసీమయని ఉదహరించుచున్నటుల తోచుచున్నది.

### మంచికొండగోత్రపు రెడ్లు.

క్రీ॥శ॥ 1323 లో ప్రతాపరుద్రదేవుడు బందీగా కొనిపోబడుటచేతను ఆంధ్రదేశములోని చాలాభాగములు మహమ్మదీయులచే కొల్లగొట్టబడుటచేతను, దుర్గముల వదలి నాయకులు అశ్వభటాదికములతో అడవులబట్టిపోవుటచేతను, దేశ మరాజకమయ్యెను. అప్పుడు ప్రోలయ కాపయనాయకుల అధ్యక్షతను కాకతీయనాయకులు సమ్మేళనమై మహమ్మదీయులను దేశమునుండి తరిమివేసిరని ఇదివరలో వ్రాసియేయున్నాము. ఆ మహా విపత్కాలమున కోరుకొండసీమను గణపతినాయకుడను మంచికొండగోత్రికుడు కోరుకొండరాజధానిగా పరిపాలించుచుండెను. గణపతితండ్రి కేశవనాయకుడు. కాకతీయ ప్రతాపరుద్రదేవుడు ఈ కోటసీమను అన్నలదేవుని జయించి తీసుకొని కేశవరెడ్డి నాయకునిగా నియమించియుండెనని ఊహించవచ్చును. మంచికొండ కేశవనాయకుడు చిరజీవియై బహుకాలము నాయంకరము ఏలెను. అక్కలపూడి శాసనములోని "స్వర్గతే పితరి పశ్చిమేవయసి, అపసంజ వసుధాం నిజేభుజే" యనువాక్యములపై నీ యూహ

1. Local Recards Vol. 19—63.

బలమగుచున్నది. గణపతి కొంతకాలము నాయకత్వమునసుండి, స్వర్గస్థుడుకాగా, పమరుడగు కూనపనాయకుడు నాయంకరత్వభారము వహించెను. కూనయ బహుగుణాన్వితుడనియును, విఖ్యాత దోర్విక్రముడనియును, గంభీరస్థిరధీయునియును వర్ణింపబడియున్నాడు. ఈ కూనయకుమారుడు ముమ్మడీంద్రుడు. ఈ ముమ్మడీంద్రుడు క్రీ॥ 1340-70 వరకును రాజ్యమేలెను. ఈ వంశములో ఈ ముమ్మడీంద్రుడే మిక్కిలి పరాక్రమవంతుడు. ఈతని భార్య 'ప్రఖ్యాత ఆంధ్రసురత్రాణుడగు' ముసునూరి కాపయనాయకుని సోదరికుమార్తె. కాపయనాయకుడు స్వయముగా నీ వివాహముచేయించెనని అక్కలపూడి శాసనములో తెలుపబడినది. తత్కారణమున ఈతనికి బలవద్బంధుసహాయముకలిగెను. ముమ్మడినాయకుడు కోరుకొండరాజధానిగా ఉభయగోదావరీ తటమధ్యప్రాంతమందలి చెంగలి, కుళవాడ, కోన, వానారముల సౌభాగ్యవంతుడై చిరము పాలించెను.

"ప్రథితోభయ గోదావర మధ్యప్రాంతేషు మహితసౌభాగ్యవాన్
పాలయతి ముమ్మడీంద్రశ్చెంగలి, కుళవాట కోనవానారాన్॥"

ప్రథితోభయగోదావర మధ్యప్రాంతములనగా కొందరు గోదావరి ఉభయతటములని యర్థము చెప్పుచున్నారు. అది సరియైనది కాదు. రెండుగోదావరుల నడిమిదేశమునకు సమీపమందున్న చెంగలాదినాడులనియే పైదాని యభిప్రాయము. చెంగలియనునది చెంగలినాడు; ఇప్పుడిది చాగల్నాడని వ్యవహరింపబడుచున్నది. ఇది కోరుకొండసీమకు తూర్పుగానున్నది. ఇప్పుడిది పెద్దాపురం తాలూకాలోని భాగము అయిఉన్నది.

కుళవాట, కుళవాడ, కూరాడ అయివుండును. ఇది ఏదియో తెలియుటలేదు. కోన సుప్రసిద్ధమగు కోనసీమ. ఇది ప్రస్తుతపు అమలాపురపు తాలూకా అయివున్నది. వానారమనునది ఏది? దీని ప్రశంస శాసనములలో కనుపడుచున్నది. శా. శ. 1062 నాటి ఒక శాసనములో[2]

శ్రీ వేంగీ వసుధాంగనా తిలకమై శిష్టప్రమోదేవ బృందావాసంబగు వానరంబు పతియుద్యత్కీర్తి యజ్ఞత్రయవర్తిష్టు మహిష్ఠుత ప్రకట పుణ్యారంభుడైయొప్పె సద్భావింబోతనయాజి నిచిత బ్రహ్మాండ తేజుండిలన్॥

అనపోతురెడ్డి కొమ్ముచిక్కాలవలస శాసనములో[3] కూడ నీవానారసీమ కలదు. చిక్కాలగ్రామమునకు "ప్రోలయ కొమరగిరిపురమ"ని నామకరణముచేసి తనఅన్నగారి పుణ్యముకొరకు అనపోతురెడ్డి పింనయయను బ్రాహ్మణునకు దానముచేసెను. ఈచిక్కాల

2. S. I. I. IV—No. 675.
3. J. A. H. R. S. III—229.

గౌతమీనదికి పడమరగా యోజన దూరమున వానారసీమలోని సుప్రసిద్ధనగరమైన పాలకొల్లునకు దగ్గరగా నున్నదని చెప్పబడినది. ఆకాలమున పాలకొల్లు, నరసాపురము, భీమవరము, మొదలగు గ్రామములకు వానారసీమయని వ్యవహారమైనట్లు విదితమగుచున్నది. పైవానినిబట్టి ముమ్మడినాయకుడు ప్రస్తుతపు రాజమండ్రి తాలూకా, పెద్దాపురం తాలూకాలోని కొంత భాగము పాలకొల్లు నరసాపుర ప్రాంతములు కోన పాలించెనని చెప్పవలసియున్నది. కాని ఇది నిజముగ కాన్పించుటలేదు. కోన హైహయవంశజులు పాలించుచుండిరి. వానారసీమలోని భాగములు ఉండీశుల పాలనలోకూడ నుండినట్లు ఇదివరలో వ్రాసియున్నాము. వారిని జయించి తద్దేశభాగములు తమ రాజ్యములో కలుపుకొనినటుల ప్రమాణములు లేవు. ముమ్మడినాయకునకు సింగానాయుడు, గంనానాయుడు అను ఇద్దరు తమ్ములు కలరు. తాను కోరుకొండనుండి సింగయనాయుని కోటయందును, గంనానాయుని తాడిపాకయందును ఉంచి ముమ్మడిపరిపాలన సాగించుచుండెను. ఈకోటి కోటిఫలిగాని కోతాముగాని కాదు. రాజమండ్రితాలూకాలోని కోటియనుగ్రామము. నేటికిని కలదు. తాడిపాక, తాటిపాక. పోలవరము జమీందారీలోనిది కాదగును.[4] తాడిపాక యనునది రాజవోలుతాలూకాలో ఒక గ్రామమున్నది. శ్రీ వీరభద్రరావుగారితాడిపాక అది యని ఊహించిరి. స్థానికచరిత్రలలో సింగానాయుడు, గన్నానాయుడు కొమ్మనాపల్లె ముఖ్యస్థానముగా చేసుకొనియుండిరని కలదు. కొమ్మనాపల్లె అమలాపురంతాలూకాలోని గ్రామముగా నున్నది.

### ముమ్మిడినాయకుడు—పరాశరభట్టరు.

ఈ ముమ్మడినాయకుని పితృపితామహులును, బంధువులును ఆగమశైవమునందు అభిమానముకలవారు. ఆకాలమందు శైవమతవ్యాప్తి విశేషము. వైష్ణవమత ఆదరణము తక్కువ. కాని ముమ్మడినాయకుడు వైష్ణవమత మవలంబించి, శ్రీరంగమునందలి వైష్ణవగురువులకు శిష్యుడయ్యెను. పరాశరభట్టను వైష్ణవగురువు ధీరల దేశికుడు. ఆపరాశరభట్టు ముమ్మడియాహ్వానమున కోరుకొండకువచ్చి ముమ్మడికిని అతని సోదరులకు వైష్ణవమిచ్చెను. ముమ్మడికి రంగవర్ధనుడని మతాంతరప్రవేశకాలమున నామకరణమొనర్చెను. అతడు కోరుకొండలోనే చనిపోయినట్లు తోచుచున్నది. మరణ మాసన్నమైనప్పు డాతడు ముమ్మడినాయకుని బిలచి, తాను చనిపోయినతరువాత నృసింహస్వామిరూపములో కోరుకొండ శిఖరముపై వెలసెదనని చెప్పి మరణించెను. తరువాత కొంతకాలమునకు లక్ష్మీదాసియను వేశ్య స్వప్నమున పరాశరభట్టు దర్శనమిచ్చి, కోరు

4. Ep. Ind. XIII—page 261.

కొండపై వెలసితినని చెప్పెను. లక్ష్మీదాసి ముమ్మడీందుృనకీ స్వప్నవృత్తాంతమును తెలుపగా ఆతడు పశ్చాత్తాపపడి, దేవాలయము నిర్మించుటకై లక్ష్మీదాసికి సహాయమొనర్చెను. లక్ష్మీదాసియే నృసింహమూర్తిని కోరుకొండపై ప్రతిష్ఠగావించెను. ఆదేవుని అంగరంగభోగములకు రెండు గ్రామములకూడ దానమిచ్చెను. కోరుకొండ కీకారణమున పరాశరశైలమని పేరు. ఈదేవాలయము క్రి. శ. 1353 లో నిర్మాణముచేయబడినది. ఇది చిన్న ఆలయమైనను బహుసుందరముగా నిర్మించబడినది. ఇందు ముమ్మడినాయకుని విగ్రహము చక్కగా చెక్కబడినది. అక్కలపూడిశాసనమునాటికే ఈ దేవాలయము నిర్మింపబడినట్లును అది దివ్యస్థల మయినట్లును, ఈ క్రిందిశ్లోకమువలన చున్నది.

"కిముచ్యతే పురస్యాస్య సౌభాగ్యః పరమంపుమాన్
దివ్యస్థానాని సంత్యజ్య యదత్రాస్తేశ్రియాసహ.॥

ముమ్మడినాయకుని యనంతరము ఆతని సోదరుడు సింగయనాయకుడు సింహాసన మెక్కెను. ఈతని పరిపాలనమైనతరువాత ముమ్మడికుమారులు కూనారెడ్డి, రామారెడ్డి, కాటమరెడ్డి మొదలగువారు ఐదుగురు కుమాళ్ళు.[5] ఇందు అగ్రజుడు కోనారెడ్డి సింగయనాయకుని అనంతరము కోర్కొండసీమ పాలించెను. కూనారెడ్డి సుమారిరువదియైదు సంవత్సరములు పరిపాలించి స్వర్గస్థుడుకాగా ఆతని కుమారుడు ముమ్మడిరెడ్డి క్రి. శ. 1394 సంవత్సరమున సింహాసన మెక్కెను. సింహాద్రిసెట్టి బలిసెట్టి యనువారలు వైశ్యులీతని కార్యకర్తలుగా నుండిరని స్థానికచరిత్రలు వాకొనుచున్నవి.[6] ఈతనితరువాత కోరుకొండసీమ కొండవీటిరెడ్ల రాజమహేంద్రవర రాజ్యములో కలసిపోయి, వారలచే పరిపాలించబడినది.

ఈకోరుకొండరెడ్లు అనవేమారెడ్డికాలమువరకును స్వతంత్రులుగానే యుండిరి. అనవేమారెడ్డి గోదావరీపరిసరప్రదేశమును కొండవీటిరాజ్యములో కలుపుకొనుటకు ...మునాలుగు దండయాత్రలను చేసెను. బహుశా క్రి.శ. 1377 సంవత్సరములో ...తడు కోరుకొండపై దాడి వెడలి ముమ్మడీందుని తమ్ముడగు సింగయనాయుని నోడించి కోర్కొండసీమను రాజమహేంద్రి దుర్గాధ్యక్షుని పాలనములోనికి తెచ్చెను. ఈసమయములోనే అనవేముడు ఇమ్మడీందుడను తన మంత్రికి లోహితగోత్రజుడగువానికి మల్లయమంత్రి కుమారునకు ఇమ్ముడిలంకయను గ్రామమునకు అనవేమపురమని పేరు

5. L. R. 19—page 100.
6. L. R. 19—page 102.

పెట్టి అగ్రహారదానము చేసెను. సింగయనాయుడును తరువాత కూనపనాయుడును రెండవ ముమ్మడినాయుడును కొండవీటిరెడ్ల సామంతులుగానే పరిపాలనచేసిరనుటకు సందేహములేదు. రెండవ ముమ్మడిరెడ్డి తరువాత నీరాజ్యము ఏకారణముననో అంత మొందియుండును.

## కోరుకొండ రెడ్లశీలము.

ఈ మంచికొండరెడ్లు ఉన్నతగోత్రసంభవులు. సమకాలికులలో వీరికి అధికగౌరవము కలదనుటకు "ప్రఖ్యాతాంధ్ర సురత్రాణుడును" త్రిలింగరాజ్యనేతయును అగు ముసునూరి కాపయనాయకుని చెల్లెలికుమార్తెను ముమ్మిడినాయకునకిచ్చి ఆతడు స్వయముగా వివాహముచేయుటయే కారాణము.

ప్రఖ్యాతాంధ్ర సురత్రాణః స్వయం కాపయనాయకః ।
తస్మై స్వసు స్సుతాం ప్రాదాన్మమ్మడీంద్రాయ భూభుజే॥

ప్రతాపరుద్రుని నిర్యాణమైనవెనుక ఆంధ్రదేశమునుండి తురకల వెడలగొట్టి తెలుగువారి స్వాతంత్ర్యమును కాపాడుటకు సాయపడినవారిలో ఈనాయకులు ముఖ్యులు. తరువాత వీరు కోరుకొండసీమను ప్రజారంజకముగా పాలించిరి. కోరుకొండసీమయందు అభివృద్ధికాదగిన విషయము లెన్నియోనిఉండెను. అడవులకొట్టి భూమిని వ్యవసాయార్హముగ చేసి పాడిపంటలు వృద్ధిచేయవలసిఉండెను. అన్నలదేవుడు చూపినమార్గమును వీరుపట్టి దేశసంపదను వృద్ధిచేసిరి. ఇతరదేశములపై దండెత్తి అనవరతమును పరరాజులతో పోరాడుచు దండయాత్రలు నలుపుచు, కాలమును చిలిపికయ్యములలో, ఆనాటి సంప్రదాయప్రకారము వ్యర్థపుచ్చలేదు. ఇతరులను వృథాభిమానిత్వమును పూని నిందనల్పు కార్యముల చేయలేదు. శూరులైనను బలహీనులగు పరరాజుల తలలనరికి తమ్ముపడిగములబెట్టి యుమ్మువేయుటవంటి ఘోరాచారముల తలపెట్టలేదు. వీరు అభ్యస్తవిద్యులు. ధర్మశాస్త్రవేత్తలు. వైదికమత ఉద్ధారకులు. వీరు శుద్ధస్వాంతులు; రాగాది దోషదూరులు. తమోగుణరహితులగుటచేతనే త్యక్తశాప్యులు. వ్రపత్తి మార్గపధికులు. శ్రీరంగ మెక్కడ; కోరుకొండయెక్కడ? పరాశరభట్టరువంటి మహాగురూత్తముని వీరిశీలము వలలనే ఆకర్షించి, ఆగమశైవమత విజృంభణ అధికమై వైష్ణవాగమములు మరుగుపడుచున్నకాలములో నారాయణపర్వతమును తిరుగ స్థాపించిరోయన్నటుల లక్ష్మీనృసింహస్వామిని ప్రతిష్ఠించి, దివ్యస్థలముగా నొనర్చిరి. అంతటినుండియు ఈదేశమున విష్ణుభక్తి వీరిమూలమున హెచ్చినది. శాసనములలో వీరి పౌరుషముకంటె వీరి శాంతాదిగుణములే వర్ణింపబడినవి. అక్కలపూడి శాసనములోని

తజ్జాతీయాః కర్మఠాః త్యక్త శాఠ్యాః
శుద్ధస్వాంతాః శ్శాంత రాగాదిదోషాః
రాజన్యానామేత్య సాహాయ్య ముర్వ్యాం
స్సర్వంభారం నిర్వంహంత్యేవ సమ్యక్.

అనువాక్యములు మధ్యవైష్ణవము ముదిరిననాటి ఆత్మశ్లాఘా పరములగు వాక్యములు కావు. దివంగతులగు శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు "వైష్ణవగురుప్రబోధనల గళంకవాసి యుత్కృష్టమైన రాజ్యపదవికి వచ్చినతరువాత నావిర్భవించిన కులాభిమానజనిత వాక్యములుగా మనమూహింపవలసినదే" యను వాక్యములు అనాదరణపాత్రములని నిస్సంశయముగా ఘోషింపవచ్చును.

ముమ్మడినాయకుని కుమారుడుకూడ విశిష్టాద్వైత పక్షపాతి. ఈతడు తండ్రిచేసిన ధర్మకార్యముల వృద్ధినొందించి తానుకూడ మరికొన్ని ధర్మముల జేసెను. స్వామికొండకు దక్షిణభాగమున దిగువ నొక దేవాలయమును ఆతడు నిర్మించి అందు రంగనాయక స్వామిని ప్రతిష్ఠచేసి, కైంకర్యాదులకు భూదానములను చేసెను. ఆ దేవాలయ ప్రాకారములో వైభవరాయుని ప్రతిష్ఠజేసి ఆలయమును కట్టించెను. కట్టళ్ళేర్పాటు జేసెను. అర్చకులకును, ఉత్సవములకును, అంగరంగభోగములకును భూదానముల జేసెను.

మంచికొండగోత్రము.

కేశవనాయకుడు 1250-1300
|
గణపతినాయకుడు 1300-1325
|
కూనపనాయకుడు 1325-40
|
సింగయ — గంనయ — ముమ్మడీంద్రుడు 1340-70

సింగయ: అన్నారెడ్డి

ముమ్మడీంద్రుడు: రామ — కాట — కూనపనాయకుడు 138[illegible]-1394
|
ముమ్మడి 1394-1395

# ఎఱ్ఱాప్రెగ్గడ రామాయణము♦

శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి.

౧

చదలువాడ యెఱ్ఱాప్రెగ్గడ భారతారణ్యపర్వశేషమును, రామాయణమును, నృసింహపురాణమును, హరివంశమును రచియించెను. హరివంశమున నిట్లున్నది.

"శా. నాతమ్ముండు ఘనుండు మల్లరథినీ నాథుండు నిన్నాతత
శ్రీతోడన్ సముపేతుఁ జేసి యెలమిన్ జేపట్టి మా కిచ్చుటన్
జేతోమోద మెలర్ప రామకథ మున్ జెప్పించి యత్యుత్తమ
ఖ్యాతిం జెందితి నింకనుం దనియ నేఁ గావ్యామృతాస్వాదనన్.

దీనిఁబట్టి రామాయణము హరివంశమునకుఁ బూర్వకృతి యనియు, నది ప్రోలయ వేమారెడ్డిగారి ప్రేరణముననే రచితమయ్యెననియుఁ దెలియనగును.

"వల్మీకభవు వచోవైఖరి రామాయణంబు నాంధ్రప్రబంధంబుఁ జేసె"

నని యెఱ్ఱాప్రెగ్గడ వంశమువాఁ డిటీవలివాఁడు చదలువాఁడ మల్లయకవి చెప్పినాఁడు. దీనిఁబట్టి యీరామాయణము సంగ్రహ రూపమయినదిగాక సకల వర్ణనాపూర్ణమయిన సంస్కృత రామాయణానుసారియయిన, ప్రశస్తప్రబంధముగాఁ దెలియనగును.

ఇట్టి యెఱ్ఱాప్రెగ్గడ రామాయణమిప్పుడు గానరాదు. లక్షణ గ్రంథములలో నెఱ్ఱాప్రెగ్గడ రామాయణ పద్యములు పెక్కు లుదాహృతము లయియున్నవి.

౨

కూచిమంచి తిమ్మకవి సర్వలక్షణసార సంగ్రహమున ఎఱ్ఱాప్రెగ్గడ రామాయణములోనివని యీ క్రిందిపద్యముల నుదాహరించినాఁడు.

ఉ. "అంగముతోడఁ గట్టు మిట యజ్ఞవిఘాతక చోరు నెందు వో
వంగలవాఁడ వింక నిటు వైళమ తాపసవేషధారివై.

ఉ. "సందడి యధ్వరక్రియ క సంగతమేని బలంబుతోడఁ బెన్
గ్రిం దదియేల యేన తగఁ గార్ముక హస్తుఁడనై కడంగి మీ
ముందఱ నిల్చెదన్ గ్రతువు ముట్టకయుండఁ బ్రచండదైత్యరా
జిం దగ దవ్వుదోల వెసఁ జించెదఁ బెంచెద మీకు మోదమున్.

♦ ఈ వ్యాసము రెడ్డిరాజ్యవర్ధంత్యుత్సవమునాడు చదువుటకు వ్రాయబడినది. 'భారతి' పత్రికలో కూడ ప్రకటింపబడినది. — సంపాదకుడు.

చ. అనుటయు మంత్రిమాటకుఁ బ్రియంపడి యాతని నాదరించి యా
మ్మనుజకులేంద్రుఁడు..............

ఉ. నూర్వురు నొక్కచందము మనోగతి సైరణచేసి యన్న నా
సర్వకులంబు నుత్తమయశంబున నుంచితి రమ్మలార, మీ
కుర్విని సాటి యే యబల లొండొరు దేవతలున్ బటుత్వమా
నిర్వహణం బొనర్చుటకు నేరరు మర్త్యులఁ జెప్పనేటికిన్.

చ. అనఘ యకంపమై విమలమై పరిపూర్తియు లోఁతుఁ దియ్యమున్
ఘనతయుఁ గల్గి సజ్జనము సన్మదృశస్థితిఁ జాల నొప్పు మీ
ఱినయది యన్నదీజలము తేపున నుంచిది............

ఉ. కోఱలు నుగ్గునుగ్గయిన క్రూరఫణీంద్రు గతిన్ దరంగముల్
మాఱిన భూరివారిధి క్రమంబున రాహుకరాళవక్త్రమున్
దూఱిన తీవ్రభానుక్రియ దుర్బలసైన్యతఁ బుత్త్రహీనతన్
గీఱి పరాభవాభిగతిఁ గిడ్పడి భూపతి నెమ్మనంబునన్.

శా. తాఱంగాఁగిననేల తంపఱఁ బాతాళంబు దాఁకన్ జనం
దూఱం జిమ్మిరి మిన్ను దాఁకి తరఁగల్ తోరంబులై నల్గడల్
పాఱం బెల్లుగ నేఱు లుబ్బఱముగాఁ బైపైన నీరెక్కి దై
వాఱన్ జెర్వులు చెన్నుమీఱె సకల ప్రాణుల్ ముదంబందఁగాన్.

క. నూఱు చెఱంగుల నెఱసులు
మీఱఁగ నీవిభ్రమములు మెఱయించి మునిం
గాఱఁగఁ జేయుము మేనక
చూఱకొనదె యతని తెలివి సొమ్ములు మున్నున్.

మ. చెఱకుందోఁటలఁ బెంచి శాలిమయ సుక్షేత్రస్థలుల్ నించి యా
కృఱ లేకుండఁగఁ బూగనాగలతికా కాంతారముల్ ప్రోచి యే
డ్తెఱ నంతం గుముదోత్పలాళివనవాటీకోటిఁ బాటించి పె
న్జెఱువుల్ వొల్పెఁ బురంబునల్దెసలఁ బ్రస్ఫీతాంబుపూర్ణస్థితిన్.

కూచిమంచి తిమ్మకవి గోదావరిమండలమున పిఠాపురమునకు చేరువను 'కందరాడ, చంద్రమపాలెము' అను గ్రామముల వసించెను. ఈ గ్రంథమును క్రీ. శ. ౧౭౫౦ సంవత్సరప్రాంతమున రచించెను. అతఁ డుదాహరించిన యెఱ్ఱాప్రెగ్గడ రామాయణ పద్య

ములు ఇతరలక్షణ గ్రంథములనుండి సేకరింపఁబడినవికావు. అతఁడు స్వయము గ్రంథమును బరిశీలించి యుద్ధరించినవే. ఇన్ని పద్యముల నితరలాక్షణికు లెవరు నుదాహరింపలేదు. ఇప్పటికి ౧౯౦ ఏండ్లనాఁడు గోదావరిమండలమున కూచిమంచి తిమ్మకవి యింట ఎఱ్ఱాప్రెగ్గడ రామాయణము సురక్షితమై యుండెనని దీనివలనఁ దెలియఁగలదు.

చదలువాడ యెఱ్ఱాప్రెగ్గడ రచనములో నీ కవిస్తుతిపద్య మొకప్రాచీన పద్యసకలనమునఁ గానవచ్చినది.

శా. సారోదార సమంచిత స్ఫుర దురుస్ఫాయ ల్లస ల్లాలిత
(స్ఫారంబుల్ వె?) సఁ దిప్పిపెట్టుచును శబ్దద్రవ్యహీనుల్ సదా
తారుం జెప్పితి మంచుఁ జెప్పికొనుటల్ తప్పే నిరాఘాటవా
క్సారభ్యప్రతిభా విజృంభితులు మెచ్చర్ గాక యానందముల్.

ఇది యెఱ్ఱాప్రెగ్గడ రామాయణ కృత్యవతరణికలోనిది గావలెను.

ఈ క్రిందిపద్యమును, 'ఎఱ్ఱన రామాయణములోనిదా?' అని యెప్పుడో నోటుబుక్కులో వ్రాసికొంటిని. ఎక్కడనుండి యుద్ధరించితినో యిప్పుడు గుర్తింపజాలను.

ఉ. చివ్వన మేను వంచి రవి సోఁకఁగఁ దోఁక విదల్చి పాదముల్
వివ్వఁగఁ బట్టి బాహువులు వీచి మొగంబు బిగించి కొండ జౌ
జవ్వన నూఁగి ముందటికిఁ జాఁగి పిఱిందిఁ దూఁగి వార్ధిపై
ఱివ్వన దాఁటె వాయుజుఁడు ఱెక్కలతోడి సురాద్రియో యనన్.

కూచిమంచి తిమ్మకవిగాక మఱికొందఱు లాక్షణికులును ఎఱ్ఱాప్రెగ్గడ రామాయణములోని పద్యములను తమ లక్షణగ్రంథములం దుదాహరించినారు. అట్టివి మఱికొన్ని యీ క్రిందివి:

గణపవరపు - వేంకటకవి ప్రయోగరత్నాకరము:

క. ధాత్రీ సురసేవారతి
భ్రాతృ భృతి గురూక్తి పాలబంధురమతి దు
శ్శాత్రవవారణ చణస్థితి
మిత్రానందకర విఖ్యాతి మీయం దమరున్.

"శుద్ధాంశునిటాలుని నవసుధా లాపముల్ వినవలె ననెడునాస."

క. ఆదశరథ సూనుండు ప
యోధిజలం బింకనేసి యొకశరమునఁ గ్ర

వ్యాద విభుఁ డునిమి సీతను
మోదంబునఁ జేకొని కపిపుంగవుతోడన్.

—ఎఱ్ఱాప్రెగ్గడ సంక్షేపరామాయణము.

గణపవరపు వేంకటకవి ఎఱ్ఱాప్రెగ్గడ సంక్షేపరామాయణము లోనివిగా నుదాహరించిన పద్యములు ప్రశస్తరచనము కలవికావు. అతఁడు ప్రబంధరత్నాకరమున కొన్ని లక్షణములను గల్పించి వానికి లక్ష్యపద్యములను ప్రసిద్ధకవుల గ్రంథములలోనివిగాఁ గొన్నింటిఁ గల్పించి యుదాహరించినట్లున్నాఁడు. ఈత డుదాహరించిన ఎఱ్ఱాప్రెగ్గడ రామాయణపద్యములు కల్పితములైనను గావచ్చును; లేక, ఎఱ్ఱాప్రెగ్గడ రామాయణములో గ్రంథారంభభాగమగు సంక్షేపరామాయణములోని వయినను కావచ్చును. అంతేకాని ఎఱ్ఱాప్రెగ్గడ సంక్షేపరామాయణమని వేఱొక గ్రంథమును రచియించయుండఁ డనుకొందును. ఎఱ్ఱాప్రెగ్గడ తనతండ్రి సంస్కృతాంధ్రకవితావిశారదుఁడు సూర్యసుకవి యని తనగ్రంథములఁ జెప్పికొన్నాఁడు. సూర్యకవి కృతము సంస్కృతమున సంక్షేపరామాయణ మొకటి యాముద్రితము కలదు. ఆ సూర్యసుకవి మన యెఱ్ఱాప్రెగ్గడ తండ్రియగునేమో! ఆ సంస్కృత సంక్షేపరామాయణమునకు ఎఱ్ఱాప్రెగ్గడ రామాయణమునకు సంబంధమేమైనఁ గలదేమో - ఎఱ్ఱాప్రెగ్గడ రామాయణము దొరకినప్పుడు తెలియవలెను.

3

ఇపుడు సముద్రితమై వెలసియున్న భాస్కరరామాయణమునఁ గూడ ఎఱ్ఱాప్రెగ్గడరామాయణపద్యము లనేకములు యిరియున్నట్లు తెలియవచ్చుచున్నది. పెక్కేండ్లకు పూర్వము ప్రాచ్యలిఖిత పుస్తకభాండాగారమున తెలుఁగు గ్రంథములకు డిస్క్రిప్టివ్ క్యాటలాగు (Descriptive Catalogue) వ్రాయునపుడు భాస్కరరామాయణమును సామాన్యదృష్టిని పరిశీలింపఁగా పాఠభేదములు చాలఁగాఁ గానవచ్చినవి. ఆ విషయ మప్పు డందు వెల్లడించితిని. ఆనందముద్రణాలయమువారి భాస్కరరామాయణముద్రణముకొఱకు వారియొద్ద పండితులుగా నుండిన కీ॥ శే॥ తంజనగరం తేవప్పెరుమాళ్ళయ్యగారు అరణ్యకాండమున ప్రధానపాఠముగా గ్రహింపఁబడిన పద్యము లనేకములు ఏ తాళపత్రప్రతిలోను గానరాకుండెను, పాఠాంతరములుగా పుటలయడుగున చిన్నటైపుతో ముద్రింపఁబడిన పాఠములే తాళపత్రప్రతులలో నున్నవి. తొలుఁదొలుత భాస్కరరామాయణమును ముద్రించినవాడు కరాలపాటి రంగయ్యగారో, నిశ్చింత తేవప్పెరుమాళ్ళయ్యగారో యని మే మప్పుడు గుర్తించితిమి. వా రేప్రతులను చూచి

ముద్రించిరో యెఱుఁగరాదు. కరాలపాటి రంగయ్యగారు గొప్పకవి. ఆయన కొన్ని ప్రౌఢ గ్రంథములను రచించెను. అరణ్యకాండమున ప్రధాన పాఠముగా గ్రహించిన పద్యముల నాతఁడు రచించి చేర్చెనేమోయని కూడ మే మప్పు డనుకొంటిమి - తాళ పత్రప్రతులలో నా పద్యములు కానరాలేదు గాన.

ఇటీవల భాస్కరరామాయణమును పరిశీలించుచుండగా వావిళ్లవారి ముద్రణమున యుద్ధకాండములోని ఈక్రింది పద్యము 'ఎఱ్ఱాప్రెగడవారి పద్యమని ప్రతీతి' అను అధోజ్ఞాపికతో కానవచ్చెను.

ఉ. త్రివ్వడు గంటులం గురువు దేఱను నెత్తురు రాకమున్న యే
నొవ్వియు నేవికారము మనోగతిఁ జెందకమున్న సాయకం
బవ్వలఁ బోకమున్న మకుటాట్టవిఘట్టనరావ మొప్పఁగా
నువ్వన నుప్పతిల్లె నసురోద్వహ మూర్ధచయంబు గ్రక్కునన్
—ప. ౧౧౫౪.

అది చూచి వ్రాఁత ప్రతులను పరిశీలింతుమనగదా ఉదాహృతమైన యీ పద్యము ఎఱ్ఱాప్రెగడ వారిదని యుండుట మాత్రమే కాక దీని పూర్వపద్యము

ఉ. ఉన్నవి యున్నయట్ల తల లుర్వికి డిగ్గ శిరఃప్రవాహముల్
మున్నొకసారె నిండురెగ మోపినసాయక మట్లె యుండఁజాఁ
గ న్నఱిఁదూవు వెల్లియని ఖేచరకోటినుతించె నంచితో
త్పన్న దశాస్యరాఘవ తపఃకరలాఘవ చిత్రసంపదల్.

అను పద్యము 'భాస్కరుని వారి' దనికూడఁ గలదు. ఈ పద్యములు పెక్కుప్రతులలోఁ గానరావు. కొన్ని ప్రతులలోనే కలవు. ఇవి రాముఁడు రావణుని తలలు తెగఁగొట్టు ప్రకరణము నందలివి. యుద్ధకాండములోని యీ భాగము పెదవేదగిరి నాయనింగారి ప్రేరణమున అయ్యలార్యుఁడు పూరించినది. ఈ భాగమునకు భాస్కరరచనము నేఁడు కానరాదు. భాస్కరుఁడు కడముట్ట నారణ్యకాండము రచించినట్టు ప్రతీతియు లేదు. ఇందు భాస్కరరచనముగ పద్యముండుటనుబట్టి చూడఁగా భాస్కరుఁడు యుద్ధకాండమును కడముట్ట రచించెనని యేర్పడుచున్నది. ఇవేకాక, యుద్ధకాండమున మఱికొన్ని పద్యములు కొన్నిప్రతులలో మాత్రమే యధికముగాఁ గానవచ్చుచున్నవి. దొరకిన యుద్ధకాండ ప్రతులనెల్ల పరిశీలించినయెడల నట్టివి మఱికొన్ని పద్యములు కూడ భాస్కరునివిగనో, ఎఱ్ఱాప్రెగ్గడవిగనో వేర్పడఁగల వనుకొందును. యుద్ధకాండవిషయ మిట్లుండెను.

అరణ్యకాండమున ముద్రణములందు ప్రధాన పాఠముగ గ్రహింపఁబడిన గ్రంథ భాగములు తాళపత్రప్రతులలో సాధారణముగా దొరకుచున్నవియు, పాఠాంతరముగా నధఃకరింపఁబడినవియు నగు గ్రంథభాగములకంటెఁ బ్రశస్త రచనము కలవి. ఒకవేళ నవియెల్ల ఎఱ్ఱాప్రెగ్గడ రచనమే యేమోయని యొకపెద్దసందేహము నాకుఁ గలిగెను. ఆ గ్రంథభాగములలో వాల్మీకిరామాయణానుసారులు కానివి కొన్నిరచనములు కలవు.

చ. "తపనుఁడు వేఁపఁజొచ్చెననుఁ దమ్ముఁడ, వృక్షముక్రిందఁ బెట్టు నాఁ
దపనుఁడు రేయి లేఁడు వసుధావర, చంద్రుఁడుగాని, చంద్రునిన్
నృపసుత, యెట్లుటెంగిలిని నీవు, మృగాంకముచూడ నున్కి-హా
చపలమృగాక్షి, చంద్రముఖి, జానకి, యెక్కడ నున్నదానవే."
"సౌమిత్రే, నను సేవ్యతాం తరుతలం చండాంశు రుజ్జృంభతే
చండాంశోర్నిశి కాకథా రఘుపతే, చంద్రోఽయ మున్మీలతి,
వత్సైతద్విదితం కథన్ను భవతా ధత్తే కురంగం యతః
క్వాసి ప్రేయసి, హా కురంగనయనే, చంద్రాననే, జానకి.''

—ప్రసన్నరాఘవము.

ఇత్యాదులు.

ఇట్టి యీ ప్రధానపాఠరచనముకూడ ప్రాచీనకవికృతమే కావలెను. కాని, యిది భాస్కరరామాయణమను పేర లభ్యమగుచున్న గ్రంథములోనిది కాదు—భాస్కర రామాయణ తాళపత్రప్రతులలోఁ గానరాదుకాన. ఇట్టి సందేహములతో నేను చీకాకు పడుచుండఁగా డాక్టరు నేలటూరి వెంకటరమణయ్యగారు తమ కానెగొందిలో నొక భాస్కరరామాయణపుఁ దాళపత్రప్రతి దొరకె ననియు, అం దారణ్యకాండమున ఎఱ్ఱాప్రెగ్గడ కృతములుగా కొన్ని పద్యములు గానవచ్చె ననియు తెలిపి ఈ క్రింది పద్యములను నాకుఁ జూపిరి.

ఉ. ఆనెఱి జోదు కేలు దొనకై నిగుడించుట యమ్ము మౌర్వి సం
ధానము నేత్ర నిండఁ దిగఁ దార్కొని లక్ష్యము సేయు టేయుడుల్
గాన నజస్ర మండలిత కార్ముక మొక్కటి గంటిఁ గంటి న
ద్దానవ[illegible]ఘ దేహసము దాయ నిరంతరపాతవేగముల్.

స్రగ్ధర. [illegible]మానంబు నప్పూర్వ గతి నవలతికాకార మంగంబు చంద్రున్
బురుణించున్ ముద్దుమో మంబురుహదళములం బోలు, గన్నుల్ ప్రవంచీ

స్వరసంకాశంబు పల్కఁగా జలదళినిచయ స్ఫూర్తియై యుండు వేణీ
భర మాతన్వంగి క్రింద ప్రముఖ నిఖిల దిక్పాలకాభీలశౌర్యా.

చ. అలినిభ వేణి చంద్రసదృశానన యుత్పలపత్రనేత్ర కో
మల లతికాభిరామభుజ మంజులవృత్తలసత్కుచద్వయీ
కలిత సుమధ్య హృద్యకటి కామ్యతరోరువు రమ్యజంఘ యు
జ్జ్వలచరణాబ్జ తద్వనిత జానకినా విలసిల్లు రావణా.

వా రిందుకై మదరాసులోని యితర తాళపత్రప్రతుల నెల్లఁబరిశీలించిరట! ఆ విషయము నిట్లు చీటిలో వ్రాసి పంపిరి.

"ఈపద్యాలు నేను ఆనెగొంది నుంచి తెచ్చిన ప్రతిలోనివి. అందు 'ఎఱ్ఱాప్రగ్గడ పద్యాలు' అను శీర్షికతో గూడియున్నవి. ఇదిగాక అడయారు లైబ్రరి G. No. XXXII T. 13G. 'యెరప్రగడవారి పద్యం' (తాళ. ప ౯౬ పం. ౧) అనుమాటకు తరువాత పైమూడు పద్యాలు కలవు. ఇంకను మద్రాసు యూనివర్సిటీ కలెక్షన్ (ఎఱ్ఱాప్రగ్గడ పేరులేకున్నను) ౧/౧౫౦ నంబరు ప్రతియందు మూడుపద్యములును గానవచ్చుచున్నవి. అట్లే ౧/౪-౨౬ లో కూడా పద్యాలు పేరులేకుండా కాన్పించుచున్నవి. G. Or. Mss. Madras 14-10-7 దీనిలో 'ఎఱ్ఱాప్రగడ పద్యాలు' అన్నమాటలేదు కాని ఆపద్యాలలో "కరిణీయానంబు", "అలినిభ వేణి" అన్నపద్యాలు కాన్పించుచున్నవి."

ఈమూఁడు పద్యములతో పాటు తక్కిన అరణ్యకాండ రచనాభేదము లెల్లఁగూడ ఎఱ్ఱాప్రెగ్గడ రచనములు కావచ్చునేమో యనికూడ నే ననుమానించుచున్నాను.

అయోధ్యాకాండమునఁగూడ రచనాభేదములు చాలఁగాఁ గలవు. అందుఁగూడ గొన్ని యెఱ్ఱాప్రెగ్గడ పద్యము లుండునేమో! ఇట్లు భాస్కర రామాయణగ్రంథ భాగము లెన్నో చిక్కులతో నున్నవి. అవి యెల్ల జాగ్రత్తగాఁ బరిశీలించి యిదమిత్థమని నిర్ణయింపవలసి యున్నవి. భాస్కరరామాయణమున ఎఱ్ఱాప్రెగ్గడ రచనములు గొన్ని చేరియుండుట తథ్యము.

౪

ఈ నడుమ నేను ప్రాచ్యలిఖిత పుస్తకశాలలోని యొక సంకీర్ణపద్యముల తాళపత్రి సంపుటమును పరిశీలించుచుండఁగా అందు రామాయణ యుద్ధకాండమున పద్యములు ముప్పది కానవచ్చినవి. చదువఁగా నవి ప్రసిద్ధములైన భాస్కరరామాయణాది గ్రంథములలోనివిగా తోఁచలేదు. భాస్కర రామాయణమును, భారతారణ్యపర్వాం

తర్గతరామాయణమును, భాగవతాంతర్గతరామాయణమును, మొల్లరామాయణమును, రామాభ్యుదయమును, ఘనగిరి రామకవి సకలవర్ణనాపూర్ణరామాయణమును పరిశీలించి చూచితిని. ఈ కానవచ్చిన ముప్పది పద్యములు నందెందును గానరాలేదు. ఈ పద్యములుగూడ ఎఱ్ఱాప్రగ్గడరామాయణములోనివి కావచ్చు ననుకొనుచున్నాను. అవి యీక్రింద చూపుచున్నాను:

చ. అనిలజ రావణానుజులు హస్తములన్ గయిదండ గొంచుఁ గ్రి
క్కునఁ జనుదెంచి, భానుజుఁడు గొల్వ సుఖంబున నున్న రామచం
ద్రునిఁ గని పాదముల్ శిరముతో నొఱయన్ బ్రణమిల్లి లేచి ని
ల్చిన యెడ నెమ్మొగమ్ము వికసిల్లి విభీషణుడుం బ్రియంబునన్. ౧

* * *

ఉ. తమ్ముఁడ! నేఁడు నాకుఁ బ్రమదంబు ఘటిల్లె దశాస్యనందనుం
డిమ్మెయిఁ గూలుటన్ మనకు నింక జయం బగునంచు సిగ్గు లోఁ
గ్రమ్మఁగ నున్న లక్ష్మణుని గ్రక్కున నంకమునందు నుంచి వ
క్షమ్మునఁ జేర్చుచున్ శిరము సారెకు మూర్కొనుచుం గ్రమంబునన్. ౨

* * *

చ. శరముల నవ్విభుం డతని గాయము లంటుచు నూర్పు పుచ్చుచున్
బురఁబురఁ బొక్కుచున్ శిరము మూర్కొని యెంతయు నూఱడింపుచున్
దురమున లెస్స గూల్చితివి దుర్దముఁ డైనవిరోధిఁ భక్తికం
ధరుఁడును నింకఁ గూలునని నామది నిశ్చయబుద్ధి నొందెడున్. ౩

* * *

చ. ♦మసలక రామరావణులు మార్కొని యుద్ధము సేయుచుండఁగా
నిసిత శరంబులు లొండొకటి నేర్పునఁ ద్రుంచుచు నుగ్రశక్తిమై
దశశిరుమస్తక ప్రతతి దాఁకినఁ జిత్రమ డుల్లు నాపుమై
నుసిరిక మ్రానిమీఁదఁ బిడు గూనినఁ గాయలు డుల్లునాకృతిన్. ౪

* * *

♦ ఇట్టి పద్య మొకటి బాలబోధ మనులక్షణ గ్రంథమునను ఉదాహృతమయి యున్నది. అది యిది:

చ. దశరథరాజ సూనునకు దానవనాయకుఁ డేపుమాపినన్
విసరుహమిత్రనందనుఁడు భీతి యొకింతయు లేక యుగ్రుఁడై
వెస గద వ్రేసె వ్రేసినను వేగమ రాలెఁ గిరీట రత్నముల్
ఉసిరిక మ్రానిమీఁదఁ బిడుగూనినఁ గాయలు డుల్లు నాకృతిన్॥ ఈ పద్య మెవ్వరిదో!

ఉ. అక్కట ధూళిఁ బ్రుంగుడయి యంగము నెత్తుటఁ దోఁగి వేదనన్
స్రుక్కుచు ధాత్రిపైఁ బొరలుచున్ బడి లక్ష్మణుఁ డిట్టులుండ నా
కెక్కడియుద్ధకాంక్ష యిఁక నెక్కడివిక్రమగౌరవక్రమం
బెక్కడిప్రాణ మెక్కడిమహీసుత యెక్కడి రాజ్యసంపదల్. ౫

* * *

ఉ. కందక రాజువాఱక మొగంబు వికాసముఁ జెందఁ జేతు లీ
యందములైనకాళ్లు నరుణాంబుదహాఁబులలీలఁ జూడఁ జె
న్నొందెడు జీవహీను లిటు లుండరు ప్రాణముతోడ నున్నవాఁ
డిందు సహోదరుండు ధరణీశ్వర, నీకు విషాద మేటికిన్. ౬

* * *

చ. మనమున నిశ్చయించి పవమానతనూజుఁడు మూఁడుమాఱు లే
వునఁ గదలించి యంశుధర ముంబలె నీలరుచిం జెలంగుత
ద్వనగిరిశృంగమున్ బిడిచి కైకొని పై కెగురంగవైచి యా
చి నిలువఁ బట్టుచున్ వెస సుషేణునిఁ జేరఁగ వచ్చి యచ్చటన్. ౭

* * *

ఉ. ఆతనిరౌద్రరేఖ గని యబ్ధి గలంగెఁ జలించె శైల మా
త్పాతిక వారిదంబు లతి దారుణరావములై జనించె ధా
త్రీతలమెల్ల బిట్టదరె దిక్కులు వ్రీలె సమస్తభూతముల్
భీతి వహించె డెంద మగలెన్ రజనీచరలోకభర్తకున్. ౮

* * *

చ. అనయము సర్వభూతముల యందును గోద్విజులందు శైలకా
ననగగనాఖిలాసల ఘనత్వము మించ సహస్రపాదలో
చనశతశీర్షమూర్తివయి సారగతిన్ వసియించి సాద్రికా
వనియు సమస్తభూతముల వారి వహింతువు నీవె రాఘవా! ౯

* * *

మ. తరుణాదిత్యనిభద్యుతిన్ మెఱసి రక్త శ్రీచ్ఛటాశాటికా
ధరయుం దప్తసువర్ణభూషణయు నుద్యన్నీలధూమాభ్రబం
ధురధమ్మిల్లయు నౌ విదేహతనయన్ దోర్లోల్త వెన్మంటలోఁ
జొరనేతెంచిన రూపుతోన జగముల్ సోద్యంబునన్ జూచినన్. ౧౦

* * *

చ. అవనిజనంబులెల్లను దశాననుఁ డంతిపురంబునందుఁ బె
క్కు-వు దివసంబులున్న జనకాత్మజ శోధితఁ జేయ కీ యనా
ర్యవిహితవృత్తిఁ దెచ్చె రఘురాముఁడు బాలిశుఁ డంచు నెంచ రా
భువనములెల్ల నమ్మొటకుఁ బో యిటు సేసితి హవ్యవాహనా. ౧౧

* * *

చ. ప్రకటత రాత్మతేజమున రక్షితయా మిథిలాధిరాజక
న్యకను బయోధివేలఁ బలె నాశరుఁ డెందు నతిక్రమింపఁ డె
న్నికకును నిప్పవంటి మహాసీయచరిత్రము గల్గు నిట్టి జా
నకిని దరంబె వానికి మనంబున నేనియుఁ జుల్కఁ జూడఁగాన్. ౧౨

* * *

ఉ. వైరిజయంబు గాంచి బలవంతుల మిత్రులఁ గూడి తేజమున్
పారయశంబునున్ గనిన నాదు సమాగమనంబు నీవు సొం
పారఁగఁ జెప్పుచో నతని యాననవర్ణవిలోకనేంగితా
కార వచోవిశేషముల నైపడి నేర్పునఁ జూడు మేర్పడన్. ౧౩

* * *

మ. అతులంబై వశవర్తియై రథతురంగానేక పాకీర్ణమై
పితృపైతామహమైన రాజ్యము మదిన్ భేదింపఁగాఁ జేయు సం
తత మెవ్వానికినైన రాజ్యఫల మాత్మన్ గోరినన్ గైకయీ
సుతుఁడే యేలుచునుండఁగాక విపుల క్షోణీతలం బంతయున్. ౧౪

* * *

చ. అతఁ డడరించు శస్త్రముల యారవముల్ శరపుంఖజాతమా
రుతములు గ్రమ్మినన్ కులగిరుల్ గదలెన్ గలఁగెన్ బయోనిధుల్
క్షితి వడఁకెన్ మనంబునఁ జలించిరి పన్నగలోకవాసు లు
న్నతరుచిఁ బాసి మాసె దిననాథుఁడు మందటిలెన్ సమీరుఁడున్.. ౧౫

* * *

చ. వడి నమరేంద్రముక్తమగు వజ్రములీల యుగాంతకాలునై
వడిఁ బరతెంచి రావణుని వక్షముగాఁడి ధరిత్రిఁ దూలెఁ బ
ల్విడి దశకంఠుఁ ద్రుంచి రఘువీరుఁడు నేఁడని మేలువార్త యే
ర్పడ ఫణిలోకవాసు లలరన్ వివరింపఁగ నేఁగెనో యనన్. ౧౬

* * *

శా. అపుణ్యవ్రాతఁ బట్టినప్పుడె తదీయుండై యనిర్వార్యమౌ
కోపాగ్నిన్ మసిగాక నీవునికి రక్షోనాథ లోకంబునన్
బాపాత్ముండగువాఁడు పాపఫలమున్ బ్రాప్తవ్యకాలంబునన్
బ్రాపించెన్ నిజపాపకర్మఫల మిబ్భంగిన్ నిజం బెందుటన్. ౧౭

* * *

చ. సవిత్రుఁడు చంద్రుఁడుం దిశలు సంధ్యలు రేలుఁ బగళ్ళు గాలియున్
భువియును నాదిగా సకలమున్ గను సాక్షులు వీ రెఱుంగ నేఁ
బ్రవిమల సద్గుణోత్తర ధురాపరిభూషిత నైతి నేని హ
వ్యవహుఁడు నన్ను నిప్పుడు దయాయుతచిత్తతఁ బ్రోచుఁగావుతన్. ౧౮

* * *

శా. ఆరీతిన్ భువనత్రయిం గలుగువా రత్యంతశోకార్తులై
ధీరత్వంబు పరిత్యజించి యలధాత్రీనందనం జెందుదు
ర్వారాపన్నత యెంచుచున్ బలుకఁ ద ద్వాక్యంబు లాలించుచున్
ధారాళాశ్రులతో మనం బెరియఁ జింతన్ రాముఁ డున్నత్తతిన్. ౧౯

* * *

చ. ఖలునిఁ గబంధునిన్ నిశిత కాండములన్ దునుమాడి వాని ప
ల్కులు విని ఋశ్యమూకమునకున్ జని భానుజుఁ గూడి వాలి ను
జ్జ్వలబలుఁ గూల్చి యర్కసుతు వానరరాజ్యమునందు నుంచి యా
య్యలఘుఁడు పంపె భూమితనయన్ వెదకన్ గపివీరకోటులన్. ౨౦

* * *

చ. నిరుపమమూర్తి రామధరణీపతి శోభనవేళ నాడి ర
చ్చరపువుఁ బోండ్లు కిన్నరులు సారెకుఁ బాడిరి దేవదుందుభుల్
మొరసెను ధాత్రి సస్యములు మోహనలీల వహించె వృక్షముల్
వరసురభిప్రసూన ఫలవర్గములన్ విలసిల్లె నెంతయున్. ౨౧

♦ ♦ ♦

చ. అని కొనియాడుచున్ జలరుహాక్షులు సేసలు మీఁదఁ జల్లఁగా
ననఘచరిత్ర! రామ! సుగుణాకర! వర్ధిలుమంచుఁ బౌరు లె
ల్లను దనచుట్టుఁ గొల్వఁగ నలంకృతమైన రథంబుపై ముదం
బున భరతాగ్రజుండు రఘుపుంగవుఁ డీగతి వైభవంబునన్. ౨౨

♦ ♦ ♦

చ. జలనిధిఁగట్టి మించుకపిసైన్యముతో వనరాశి దాఁటి దో
ర్బలమున లంకపై విడిసి రావణముఖ్యనిశాటకోటులన్
గలన జయించి భూతనయ గ్రమ్మఱఁ గైకొని నిత్యకీర్తులన్
వెలసినవాఁడు రాముఁ డిటు వింటిమె కంటిమె యిట్టిచిత్రముల్. ౨౩

♦ ♦ ♦

శా. భేరీకాహళశంఖతూర్యములు గంభీరంబులై మ్రోయఁగాఁ
దారామార్గమునందు దేవఋషిగంధర్వస్తుతుల్ మీఱ సే
వారూఢిం దగ వందిమాగధులు కైవారంబు గావించుచున్
సారోదారవిచిత్రవైఖరుల నానందంబు గల్పింపఁగన్. ౨౪

♦ ♦ ♦

ఉ. రావణుఁ గూల్చి క్రమ్మఱ ధరాసుతఁ జేకొనివచ్చుచున్నవాఁ
డావసుధాకళత్రుఁ డిదె యాప్తులతోడ మహేంద్రుతో శచీ
దేవియుఁబోలె సీత జగతీతలనాథునిఁ గూడి సంతత
శ్రీవిలసిల్ల నున్నయది చేరినవాఁడు సుమిత్రపట్టియున్. ౨౫

♦ ♦ ♦

చ. అలికుల వేణులన్ జలరుహాక్షులఁ జంద్రనిభాస్యలన్ విని
ర్మలమణిహేమభూషణ సమగ్రల భార్యలఁగా వరింపు గ
న్యల గుణజాతియుక్తలఁ బదార్గుర గ్రామశతంబుఁ జూడఁ జె
న్నలరెడు లక్షగోవులఁ బ్రియం బెసఁగించిన నీకు నిచ్చెదన్. ౨౬

* * *

ఉ. కొంచక కోటపై నిలిచి కొందఱు భీమఃలాఢ్యులైన
క్తంచరు లుగ్రతోమరగదాపటుశక్తుల వానరాలి మె
ప్పించిరి వానరేంద్రులును జేర్చి రణంబునఁ గోటపైకి లం
ఘించి నిశాటులన్ ధరణికిం బడనీడిచి నొంచి రుద్ధతిన్. ౨౭

* * *

మ. నిను సేవించినఁ గల్గు మానవులకున్ వీటీవధూటీఘటీ
ఘనకోటీశకటీకటీతటిపటీ గంధేభవాటీపటీ
రనటీహారిపటీ సువర్ణమకుటీ ప్రచ్ఛోటికా పేటికల్
కనదామ్నాయ మహాతురంగ శివలింగా నీలకంఠేశ్వరా! ౨౮

* * *

ఈ ౨౮-వ పద్యము, నీలకంఠేశ్వరస్తుతి రూపమయినది. అది వేఱొక గ్రంథములోనిది యయినను గావచ్చును. కాని, యీ సంకీర్ణ పద్యసంపుటమున నుదాహృత రామాయణ పద్యములతో నున్నది. కాన రామాయణములోనిది గావచ్చుననుట సంగతమగును. ఎఱ్ఱాప్రెగ్గడ నెల్లూరు మండలమందలి గుడ్లూరి నీలకంఠేశ్వరస్వామి భక్తుఁడు ప్రోలయ వేమారెడ్డిగారి ప్రేరణమున నాతడు రామాయణము నా నీలకంఠేశ్వర స్వామి కంకితముగా రచించెనేమో! ఈ పద్యము గుడ్లూరి నీలకంఠస్వామి స్తుతి సందర్భములోనిది గావచ్చును!

ఈ పై పద్యములలో ఎఱ్ఱాప్రెగ్గడ రచనాగౌరవము కానవచ్చుచున్నదా యని సందేహము తోఁచును పద్యము లన్నియు సలక్షణములై యున్నవి. గొప్ప రచనా ప్రౌఢిమ కానరాకున్న దనవచ్చును కాని యెఱ్ఱాప్రెగ్గడ తొలుతటికూర్పుకాన యిందు రచనమునఁ గొంత వెన్నాటు గలదేమో!

శ్రీనాథుఁడు 'పరిభవింతుఁ బ్రబంధ పరమేశ్వరునిశైవ సూక్తివైచిత్రి నొక్కొక్కమాటు' అని తన యెఱ్ఱాప్రెగ్గడ రచనానుకరణాభిమానమును వెల్లడించుకొన్నాఁడు. ఈక్రిందిపద్యద్వయమున ఎఱ్ఱాప్రెగ్గడ సూక్తి వైచిత్రియు, శ్రీనాథుని తదనుకరణమును గానసగును.

ఉ. కందళ రాజవాటిక మొగంబు వికాసమునొందెఁ జేతు లీ
యందము లైనకాళ్లు నరుణాంబురుహంబులలీలఁ గాంతిఁ జె
న్నొందెడు జీవహీనులిటు లుండరు ప్రాణములోడనున్నవాఁ
డిందు సహోదరుండు ధరణీశ్వర నీకు విషాద మేటికిన్.

ఉ. కందళ రాజవాటిక వికాసము డిందక మందహాసని
ష్యందము చెక్కుటద్దముల నాటక నెమ్మది నిద్రవోవున
ట్లందమునొందె ధాత్రి సిరియాలకుమారకు వక్త్రచంద్రుఁడా
నందమునొందె నవ్వు డెలనాఁగమనంబును భర్తచిత్తముల్.

—శ్రీనాథుని హరవిలాసము.

ఎఱ్ఱాప్రెగడ "సూక్తివైచిత్రి" శ్రీనాథుని సమకాలవుఁ బ్రసిద్ధకవి జక్కనకూడ,

"ఈత్రయిఁ దాఁ బ్రబంధపరమేశ్వరుఁ డై విరచించె శబ్దవై
చిత్రి నరణ్యపర్వమున శేషము ... ... ... ... ..."

అని ప్రశంసించెను.

సంస్కృత వాల్మీకి రామాయణమునకును ప్రాచీనాంధ్రరచనములగు రంగనాథ భాస్కర రామాయణములకును జాల భేదములుగలవు. రంగనాథ భాస్కరరామాయణములుగూడఁ గొన్ని కాండములందుఁ బోలికలు గలిగి, కొన్ని కాండములందు లేక యున్నవి. రంగనాథ రామాయణమున విశిష్టాద్వైత విషయములు గొన్ని యధికముగాఁ జేరినవి. కొన్ని కథాభేదము లున్నవి; అధికకథ లున్నవి. అందుఁ గొన్నిటికి సంస్కృత మూలము గానరాదు. దేశికథాసంప్రదాయముల ననుసరించి వానిని కవి చేర్చియుండ వచ్చును. ఎఱ్ఱాప్రెగ్గడ రామాయణాంధ్రీకరణము హరివంశాంధ్రీకరణమును బోలియుండు ననఁదగును. ఇప్పు డుపలబ్ధములయిన పద్యములు సంస్కృతానుసారులుగా నున్నవి. ఆయాపద్యముల పట్టులను సంస్కృత వాల్మీకి రచనములతోను, తెలుఁగు రంగనాథ భాస్కరరామాయణ రచనాభాగములతోను బోల్చి చూచిన నీ యెఱ్ఱాప్రెగ్గడ పద్యములు సరిగా సంస్కృతానుసారులుగా నుండుట వ్యక్తమగును.

రంగనాథ భాస్కరరామాయణములు ఎఱ్ఱాప్రెగ్గడ రచనమునకంటెఁ బూర్వము వెలసిన వనఁదగినవి. ఎఱ్ఱాప్రెగ్గడ కించుక తర్వాతికాలమువాఁ డగును భాస్కరరామాయణ యుద్ధకాండశేషమును బూర్తిసేసిన అయ్యలార్యుఁడు. ఇంచుమించుగ నాతని కాలముననే తెలుఁగున మఱొక రామాయణాంధ్రీకరణము వెలసినది.

క. రామాయణకృతికృతియై
తా మెఱయుచు నాంధ్రకవిపితామహుఁ డనఁగా
భూమిం జినభీమన యను
నామంబున వెలసె సత్యనారన ఘనుఁడై.

—సింహాసనద్వాత్రింశిక.

'చిన్నభీమన్న' యని 'ఆంధ్రకవిపితామహు' డని పేరందిన, రామాయణకృతి కర్తయైన యీ సత్యనారన అనపోతకుమార సింగభూపతి (వెలుగోటి వెలమరాజు) కాలమువాఁడు. అయ్యలార్యున కీతఁ డించుమించుగా సమకాలమువాఁ డగును. ఈ రామాయణముగూడ నిపుడు గానరాదు. ప్రాచీనలక్షణగ్రంథకారులుగాని, యితర ప్రాచీనకవులుగాని యీ సత్యనారనను స్మరించినట్లు గానరాదు.

ఎఱ్ఱాప్రెగ్గడ రామాయణము ఎఱ్ఱాప్రెగ్గడ నాఁటనుండి కూచిమంచి తిమ్మకవి నాఁటిదాఁక సుప్రచారము గలదిగాఁ దెలియవచ్చుచున్నది. నూటయెనుబదియేండ్ల క్రిందటిదాఁక సురక్షితమై యున్న యీ గ్రంథ మీనాఁడుగూడ నెక్కడనేని అపరిజ్ఞాతముగా నుండవచ్చును. గోదావరీమండలమున కందరాడ, చంద్రమపాలెముల (కూచి

మంచి తిమ్మకవి యూళ్లు) చుట్టుపట్టులఁగాని, కృష్ణా గుంటూరు నెల్లూరు. కడప కర్నూలు మండలములలోఁ గాని అది దొరకఁదగు ననుకొనుదును నెల్లూరు కర్నూలు కడప మండలములలో ప్రాచీనగ్రంథపరిశీలన మింకను సరిగా జరుగవలసియున్నది. ఆయాచోట్ల నపరిచితముగా నున్న తాటియాకుకట్టలను పరిశీలించి యెఱ్ఱాప్రెగ్గడ రామాయణము నే పుణ్యాత్ముఁడేని యుద్ధరింపఁ గల్గునని విశ్వసించుచున్నాను. ఎఱ్ఱాప్రెగ్గడ నృసింహపురాణము తప్పులతో నొక్కప్రతిమాత్రమే ప్రాచ్యలిఖిత పుస్తకశాలలోఁ గలదు. దానికిని మంచిప్రత్యంతరము కావలెను. ఆంధ్రవిశ్వవిద్యాలయాధ్యక్షులగు శ్రీ కట్టమంచి రామలింగారెడ్డిగారు ఎఱ్ఱాప్రెగ్గడ రామాయణమును సంపాదింప గల్గితిమేని యది మన లోకభాగ్యవిశేషమనియు, దాని నార్జింపఁగలవారి కెంత సహాయ్యమేని చేయ నుత్సహింతు మనియు రాజమహేంద్రవరమున జరిగిన రెడ్డిసామ్రాజ్యవర్ధంత్యుత్సవమునఁ జెప్పిరి. శ్రీ రామలింగారెడ్డిగారి పవిత్రాశయము సఫలమగుట కపేక్షించుచున్నాను.

# అధ్యక్షోపన్యాసము

బ్ర॥ శ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రి.

సహృదయవర్యులారా !

ఆంధ్రపరిశోధకమండలివా రింతకుముందు చాళుక్య కాకతీయ రాజ్య వర్ధంతుల జరపిరి. రాజమహేంద్రవరమున గోదావరీతరంగ డోలావిహార వినోదముల నాలమై త్రైలోక్య విజయసౌధ విశాల మహానంద చంద్రశాలాధిరూఢులై సర్వవిద్యాగోష్ఠులు నెఱపిన రెడ్డిరాజుల రాజ్య వర్ధంతికూడ వారు నెఱపుట, అందును రాజమహేంద్రవరమున నెఱపుట పరమానందవిషయము. ముప్పదియేండ్లనుండి యాంధ్రులలో చరిత్ర పరిశోధన కుతూహలము వెల్లివిరియుచున్నది. దానిఫలితమే రాజమహేంద్రవరమున పరిశోధకసమితి నిర్మాణము. ఇందు మిత్రులు శ్రీ రాళ్ళబండి సుబ్బారావుగారు, భావరాజు వెంకటకృష్ణారావుగారు, వడ్డాది అప్పారావుగారు మొదలగువారు మంచిపరిశ్రమల నెఱపుచు, పరిశోధకపత్రిక నాంగ్లమున వెల్లడించుచు, నెన్నో యపూర్వాంశరత్నముల ద్రవ్వియెత్తి యిచ్చుచున్నారు. ఇట్టిమిత్రుల యాదరానురాధమే నన్నీనాడీ యాధ్యక్షమున నిర్బంధించినది. పెక్కేండ్లనుండి సారస్వత చరిత్ర వ్యవహారములకు దూరస్థుడనై ముక్కుమూసికొని యేకతమున కాలము గడపుకొనుచున్న నేను పయిమిత్రుల యాదరము నిర్బంధింపకున్నచో నేదో యిందరుకుల యాధ్యక్షోపన్యాసము కావించుటకుగాని, యిక్కడికివచ్చుటకుగాని పూనుకొనియుండను. మిత్రుల నిర్బంధమొకప్రక్క మహనీయమైన రెడ్డిరాజ్యమునుగూర్చి తలచినపుడెల్ల నాలో బొడము నానందోద్బోధమొకప్రక్క రెక్కలుపట్టి నన్నిక్కడికి లాగికొనివచ్చినది.

ఆదికాలమునుండియు ఆంధ్రవాఙ్మయ భాగ్య భాండాగారమున రెడ్డిఱేండ్లు గొప్ప భాగస్వాములయి ప్రఖ్యాతి గాంచుచున్నారు. వారి మహనీయతను పదింపదిగా నేను ప్రశంసించుచు నేయున్నాను.

ఇప్పటికి ముప్పదియైదేండ్లకుముందు నే నిర్వదియేండ్ల ప్రాయమువాడనయియుండగా చెన్నపురికరిగితిని. నాడు ప్రాచ్యలిఖిత పుస్తకశాలలో గ్రంథసామగ్రిని బరిశీలింప జొచ్చినప్పు డందు 'మెకంజీ లోకల్ రికార్డ్సు' అనుపేర మున్నూటదాక గలదేశచరిత్ర సంపుటములలో ఎక్కడబట్టినను రెడ్డిరాజుల దానధర్మములయు, శాసనములయు ప్రశంసలు పుష్కలముగా గానవచ్చెను. మధ్యాంధ్రదేశము—అనగా నేటి గోదావరి కృష్ణ, గుంటూరు, నెల్లూరు, కర్నూలు, కడప మండలములు. ఆనాడు వేదవేదాంగాది విద్యలు నేర్చిన బ్రాహ్మణులతో నిండియుండుటకును, అం దనేకులు అగ్రహారికులై

సంపత్సమృద్ధు లగుటకును, దుర్గములు, చెఱువులు, కాలువలు, ధర్మవనములు, పాడి పంటలు, గలిగి దేశము సుభిక్ష మగుటకును, దేవాలయములు నిత్యోత్సవములతో దేజరిల్లుటకును, వేయేల! నేటి తెలుగునాటివారి తెలివితేటలకు, నాగరకతకును గూడ పదునాలుగు పదునైదు శతాబ్దులలో నూటయేబదియేండ్లే అయినను పెంపొందియున్న రెడ్డిమహారాజ్యము నొక ప్రధానకారణమన్న చరిత్రాంశ మాచరిత్రాంశపు సంపుటములలో కరతలామలకముగా గోచరించెను. నేడు మధ్యాంధ్రదేశమున—బ్రాహ్మణులు అన్నవస్త్రములుగలిగి విద్యావిభవములు గలిగి పలువు రున్నారనగా దీనికి గొప్పకారణ మానాడు రెడ్డిరాజులు, వీరి పూర్వుల విద్యావిశేషముల నాదరించి చేసిన యగ్రహారాదిసత్కారములగుననుట యథార్థకథనము కొండవీటిరెడ్డిరాజులయు, రాజమహేంధ్రవర రెడ్డిరాజులయు, శాసనముల గొన్నింటినేని జూచినను నీవిషయము తెల్లడికాగలదు. శ్రీనాథు డిట్లు చెప్పినాడు.

సీ॥ ధరియింపనేర్చిరి దర్భవెట్టెడువ్రేళ్ళ
లీల మాణిక్యాంగుళీయకములు
కల్పింపనేర్చిరి గంగమట్టియమీఁదఁ
గస్తూరి కాపుండ్రకములు నొసల
సవరింపనేర్చిరి జన్నిదంబుల మ్రోలఁ
దారహారములు ముత్యాలసరులు
చెఱువంగనేర్చిరి శిఖల నెన్నడుములఁ
గమ్మని క్రొత్త చెంగల్వవిరులు
ధామముల వెండియును బైడిఁ దడబడంగ
బ్రాహ్మణోత్తము లగ్రహారములలోన
వేమభూపాలుఁడను జన్మ వీరభద్రు
ధాత్రి యేలింప గౌతమీతటమునందు.

'భీమఖండము'

శ్రీశైలము అహోబలము, పంచారామములు, మొదలగు పుణ్యస్థలముల వైభవమును రెడ్డిరాజు లెంతో పెంపొందించిరి. మధ్యాంధ్రదేశమున వేద, శ్రౌత, స్మార్తోభయమీమాంసా, తర్క, వ్యాకరణ, సంగీత, సాహిత్య, వైద్య, జ్యోతిషాది శాస్త్రములకు వారు చాల నభ్యుదయము గూర్చిరి. వారు షట్కాలశివపూజాధురంధరులయి ఆముష్మిక పరాయణులయి వెలసిరి. నేడును రెడ్డికులమువారిలో పలువురు

భాగ్యభరితులు, శీలశోభితులు, త్యాగులు, భోగులు, ప్రతిభాశాలులు, విద్వాంసులు, కవులు వెలయుచున్నారనగా దానికి ఆనాటి రెడ్డిరాజేంద్రుల వంశపారంపర్యపు సంస్కారమే ప్రధానకారణ మనుట యసంగతము గాదు ముప్పదియేండ్లనుండియు నాకీ రెడ్డిరాజ్య వైభవానుస్మరణమున నభిమానము మెండు. ఇట్టి యభిమానము నానాడే 'శ్రీనాథ చరిత్ర' రచనాసందర్భము గొంత తీర్చుకొంటిని.

నేడిక్కడ రెడ్డిరాజుల విద్యావిలాసములగూర్చి మాత్రమే కొంతవివరింతును.

మ. మహనీయంబుగ నంధ్రభూవలయముం బాలించుచుం బ్రాజ్ఞులై
బహుకావ్యంబులు చెప్పుచున్ మఱియుఁ జెప్పంజేయు చాముష్మిక
స్పృహతో ధర్మములాచరించుచు జగజ్జేగీయమానంబుగా
సమముల్ వుచ్చిన రెడ్డిరాజుల సముద్యత్కీర్తిఁ గీర్తించెదన్.

## గోనబుద్ధారెడ్డిగారు తత్పుత్రులు.

పాల్కురికి సోమనాథుని మూలమున తెలుగున ద్విపదరచనకు విలువ హెచ్చెను. ద్విపదరామాయణమున దత్కర్తలు బుద్ధయ. తత్పుత్రులు కాచయ విఠయులనియే కలదు. కాని వారికులమేదో యందు దెలియరాదు. వారియింటిపేరుమాత్రము 'గోన' యని యనేకప్రతులలోను 'కోన' యని కొలదిప్రతులలోను గలదు. వారు రాజ్యము నేలినయేలికలగుట గ్రంథమున స్పష్టముగా నున్నది. పశ్చిమాంధ్రదేశమున 13, 14 శతాబ్దులలో రాచూరుదుర్గ నిర్మాతలై రాజ్యమేలినవారు 'గోన' వంశమువారు రెడ్లను ప్రఖ్యాతులు. వారియింటిపేరు 'కోన' యనుట సరికాదు. ఆనాటి శాసనములందెల్ల వారియింటిపేరు 'గోన' యనియే కలదు. ఆనాడు 'కోన' యింటిపేరువారి క్షత్రియులు. కోనసీమ (గోదావరీమండలము) పాలకులు వేఱుగా నున్నారు. గోనపదసంగతి, బుద్ధ, కాట, విఠ్ఠనామసంగతి[1] రాచూరుదుర్గ నిర్మాతలగు రెడ్డిరాజులకే కలదు. కావున రంగనాథ రామాయణ ప్రసక్తులు రెడ్లేకాని క్షత్రియులు గారని నిశ్చయింపవలెను. ఐతిహ్యమును, ఆప్తవాక్యమును బ్రమాణముగా గొనకున్నచో బ్రాచీనచరిత్రనిర్మాణమును దుష్కరమగును. రంగనాథుడను కవియేలేడని అతడు కల్పితపురుషుడని నే ననజాలను. బుద్ధారెడ్డిగారును తత్పుత్రులును వాల్మీకిరామాయణమును దెలుగున ద్విపదరచనలో వెలయించిరంటిని. గ్రంథమున గ్రంథకర్తలు బుద్ధభూవిభుడును దత్పుత్రులును అనియే

1. రాచూరు దుర్గ నిర్మాణము రెడ్డిరాజులు కావించినదనుట శాసనములబట్టియేకాక వింతగా "గోన కాటారెడ్డిగారి కథ" యున్న కథకవితా రచనవల్లను దెలియనగును. ఆకథను రేడియోప్రసంగమున నేను వెల్లడించితిని.



రెడ్డిరాజ్య వర్ధంత్యుత్సవ సభ్యులు; మండలి కార్యవర్గము.



కొదకొండ దేవాలయములోని ముమ్మడినాయకుని శిలావిగ్రహము.

కలదు. కాని దానిని రంగనాథుకను కవి రచించినట్లు ప్రతీతి. తదనుగుణగాథలు ప్రాచీనములగు వెలుగోటివారి వంశ చరిత్రైక శిలానగర చరిత్రాదులలో గూడ నున్నవి. రంగనాథుడు కల్పితుడు కాకున్నను అతనితో డ్పాటుగ్రంథరచనమునందున్నను గ్రంథోత్పత్తికి బైపభువులు కారణమగుట స్పష్టముగదా! పూర్వోత్తరరామాయణములు వేర్వేఱు పురుషుల రచనములుగా నాకు దోపవు. తెలుగునకీ రెడ్డిరాజులు వెలయించిన ద్విపదరామాయణము ప్రౌఢకవితా రసికులకేగాక పామరజనులకుగూడ సాహిత్యానందము సమకూర్చుచు నత్యధిక ప్రచారము కలదిగా నున్నది. ఆంధ్రరామాయణములలో రసపారవశ్యమును గలిగించు రచన మిట్టిది వేఱొకటిలేదు. ప్రాచీనలాక్షణిక కవులందఱును నీ రామాయణప్రయోగములను బరమప్రమాణముగా బరిగ్రహించిరి. ఆంధ్రప్రజాసామాన్యమును రామాయణకథామాధురిని నాస్వాదింపజేసిన రామాయణ మిదియే.

### పోలయవేమారెడ్డిగారు

వీరు కృష్ణ, గోదావరి, పినాకిని అను నదీత్రయముచే రక్షితమయిన మధ్యాంధ్రదేశము నేలిన రెడ్డిరాజవంశమునకు మూలపురుషులు. కవిత్రయములోని యెఱ్ఱాప్రెగ్గడ కవీశ్వరుని ఆస్థానకవినిగా నాదరించి పోషించినమహనీయులు. కవిత్రయములోని వాడు యెఱ్ఱాప్రెగ్గడ భారతారణ్య పర్వశేషమున గొన్నిపట్టుల నన్నయరచనకు మెఱుగుగూర్చియు, హరివంశమున గొన్నిపట్టుల దిక్కనరచనకు జక్కవగూర్చియు నిర్వహించినాడు. అరణ్య పర్వశేష పూరణమున షష్ఠాశ్వాసమున సైంధవావమాన ఘట్టమును, హరివంశమున శ్రీకృష్ణ బాల్యవిలాసఘట్టమును నా కభిమానగ్రంథభాగములు. అనాగరికులయిన వ్రేపల్లె గొల్లవారియిళ్ళలో జగన్మోహనమూర్తి శ్రీకృష్ణమూర్తి యవతరించి బాలక్రీడలు, దివ్యానుభూతులును వెలయించుట, అక్కడి పామరజనులకందుచే గలిగిన యానందాశ్చర్య సంరంభములు ఎఱ్ఱాప్రెగ్గడవారు చాల చక్కని తీరునదేసి తెలుగు మఱుగులు వెలయగా వ్రేతల యిళ్ళలో శ్రీకృష్ణు డారగించిన వెన్నామీగడ రుచుల దలపించు మించు రచనతో వెలయించినారు. ఆంధ్రప్రబంధ వాఙ్మయమున నిట్టి రసవద్ఘట్టము మఱి యన్యత్ర కానరాదని నానమ్మకము. ప్రోలయవేమారెడ్డిగారు రామాయణమును, హరివంశమును నత్యాదరముతో నాలకించువారట.

క. రామాయణహరివంశ

శ్రీమన్మధుర ప్రబంధసేవ, చిరయశ

స్సామర్థ్య, నిత్యనిఘృణ
శ్రీమల్ల చమూవరేణ్య సేవిత పాదయగా.

ఇందు పేర్కొనబడిన రామాయణ హరివంశములు ఎఱ్ఱాప్రెగ్గడగారు రచియించిన యాంధ్రప్రబంధములే కావచ్చును.

హరివంశరచనకు బూర్వము పోలయవేమా రెడ్డిగారికే అంకితముగా మన ప్రబంధ పరమేశ్వరుడు రచియించిన రామాయణమహాప్రబంధ మీనాడు గానరాకుండుట శోచనీయవిషయము.

పోలయవేమా రెడ్డిగారు సాహిత్యమునసేగాక సంగీతమునను జాల రసికులు. హరివంశమున నిట్లున్నది.

కం. కేళాదిరాయ వితరణ । కేళీనిరపాయ నృత్యగీత కథా లీ
లాలలితోత్సవ నిరతిశ । యాలంకృత భాగ్య సుస్థిరాయుర్భాగ్యా!

వారియాస్థానమున లొల్లమహాదేవకవియని యొక విద్వాంసు డుండెను. ఆయనను గూర్చి యావంశమున నేడవతరమువాడు లొల్ల లక్ష్మీధరుడిట్లు చెప్పెను.

యః కర్ణాట వసుంధరాధిప మహాస్థానే సువర్ణాయితో
యో విద్వన్నికషాయితో నృపగృహే వేమాఖ్య పృథ్వీశితుః
శ్రీమల్లొల్లటభట్టశిష్య ఇతి యో లొల్లాఖ్యయా శ్రూయతే
శ్రీశేషాన్వయ శేఖర స్సహిమహాదేవో విపశ్చిన్మహాన్"

ఈ మహాదేవకవికి లొల్లవారని యింటిపేరు. భరతమహాముని రచియించిననాట్యశాస్త్రమునకు వ్యాఖ్యానము రచియించిన లొల్లటభట్టునకు శిష్యుడగుటచే వచ్చినదట. ఇది నిజమేని నాట్యశాస్త్రవ్యాఖ్యాత లొల్లటభట్టు ఆంధ్రుడగుట అతడుగూడ రెడ్డిగారి ప్రాపుగలవాడగుట అనుమానింపదగినదగును. ఈ లొల్లమహాదేవకవివంశమున తర్వాతివారెల్లరుగూడ మహావిద్వాంసులు. వీరు క్రమముగా రెడ్డిరాజుల యాస్థానమున విద్వాంసులుగానుండి, తర్వాత వచ్చిన గజపతుల యాస్థానమునను విద్వాంసులుగా నుండి వారితర్వాతవచ్చిన కృష్ణదేవరాయలవారి యాస్థానమునను విద్వాంసులుగా నుండిరి. ఈ గజపతులయు కృష్ణరాయలయు నాస్థానమునసున్న లొల్ల లక్ష్మీధరపండితునకును, మహాదేవకవికిని నడుమనున్న విద్వాంసులు: మహాదేవాచార్యుడు లక్ష్మీధరార్యుడు, విరించిమిశ్రుడు, పురుషోత్తమమహోపాధ్యాయుడు, లక్ష్మణార్యుడు, విశ్వనాథభట్టు అనువారు రెడ్డిరాజుల యాస్థానమునసే ఉన్నవారగుదురు. వారు సంగీత సాహిత్య పూర్వోత్తర మీమాంసాది శాస్త్రములందు గొప్పగ్రంథములు రచియించిరి.

వానిపేళ్లివి: భట్టలొల్లటగ్రంథవివరణము, సాహిత్యపారిజాతము, స్మృతికల్పతరువు, భరతార్ణవపోతము, సాహిత్యమీమాంస, మీమాంసాజీవాతువు, ప్రిభాకరామృతవాహిని ప్రిభావళీఖండనము, పదయివివేకదీపిక—అనునవి. ఈవంశమువారిప్పటికిని పంపన్నహితులై కొల్లూర వెలయుచున్నారు.

హరివంశమున నీప్రోలయ వేమారెడ్డిగారిని యెఱ్ఱాప్రెగడ యిట్లుప్రస్తుతించినాడు.

సీ. అగ్రహారములు విద్యాతపోవృద్ధ విప్రులకిచ్చి యజ్ఞకర్తలుగమనిచె
గోమరారఁజెఱువులు గుళ్ళుప్రతిష్ఠించి లోకసంభావ్యంబులుగ నొనర్చె
నిధులునల్లిండ్లు నునిలిపెఁ దోఁటలు సత్రములు చలువపందిరుల్ వెలయఁబెట్టె
హేమాద్రి పటకీర్తి తామితవ్రతదాన నివహంబులన్నియు నిర్వహించె
జేసె జేయుచు నున్నాఁడు సేయనున్న
వాఁడు పునరుక్తకృతి శుభావలులనెల్ల
ననఁగ శ్రీవేమ విభున కయ్యలరుపేర్మి
నశమెవర్ణింపఁ దద్భాగ్య వైభవంబు.

సీ. కేయూరకంకణా కృతిఁ బరాక్రమ వితరణములు బాహాభూషణతనొంద
ననుకూలగృహిణి చాడ్పున నృపశ్రీయొద్దఁ గదలక సకలసౌఖ్యములనొసగ
నమృతసేవనము చందమునను సద్ధర్మ తాత్పర్య మధికమోదంబు బెనువ
గరతలామలక విఖ్యాతి నాతతనీతి గరిమంబు నిజవివేకమున వెలయ
జాహ్నవీ ప్రవాహముభంగిఁ జరితమఖల, భువనపావన పరిపూర్తిఁబొలుపుమిగుల
బరగువేమక్ష్మానాథు పాటిసృపులు, గలరెయెవ్వారు ధారుణీతలమునందు.

ఎఱ్ఱాప్రగడగారిదట యాకిందిపద్యము. చాటవుకాబోలును.

ఉ. వీపునమోసెఁ గచ్ఛపము వెండిభుజంగమరాజు మస్తక
స్థాపితఁజేసెఁ నీవు వసుధారమణిన్ బెదకోమటేంద్ర! బా
హాపరి రంభగుంభ సముదంచితఁ జేసితి వింతయొప్పునే
మోపరులే మెఱుంగుదురు ముగ్ధలతోడి విహారసౌఖ్యముల్.

ఈయనకాలమున 'మోటుపల్లి' యను ప్రాక్సముద్రతీరగ్రామము రేవుపట్టణముగానుండెడిది. అక్కడి సముద్రపు టవలియొడ్డుననుండి లివాయి (నేడు తవాయియే) తరుణాసీరి (నేడు తెన్నాసిరమ్) మొదలగు ద్వీపాంతరప్రదేశములనుండి యోడవ్యాపారములు చాల జరుగుచుండెడిది. ఎఱ్ఱాప్రెగ్గడ యిట్లుచెప్పినాడు.

శా. "బాహాదర్పమునన్ బ్రతీపధరణీ పాలావలిం దోలి యు
త్సాహాదగ్రుడు పోటుపల్లిగొని సప్తద్వీప పద్వస్తు సం
దోహంబున్ దనకిచ్చు నెచ్చెలి సముద్రుం బ్రీతిగావించుచున్
మాహాత్మ్యంబు వహించె మల్లరథినీనాథుండు గాఢోద్ధతిన్".

ఈ ప్రోలయవేమారెడ్డిగారు బంధుసముద్రులు. ఎనుబదినాలుగు స్థలములలో దుర్గములను నిర్మించి తనబంధువుల నాయా దుర్గములందు నెలకొల్పిరి. ముప్పదియాఱగ్రహార దానముల దానముచేసిరి. శ్రీశైలమునకు నహోబలమునకు మెట్లుకట్టించిరి.

అన్నపోతారెడ్డిగారు.

ఈయన తనతండ్రికాలమున రాజధానిగానున్న యద్దంకిని విడిచి కొండవీటిని రాజధానిగా జేసికొని దానిని చాల బెంపొందించినాడు.

"కొండవీడుం రాజధానీం సవిచిత్రామకల్పయత్
దృష్ట్వాత్వష్టాపి వైచిత్ర్యమ భూద్యస్యాస్సవిస్మయః

* * *

సోఽన్నపోత నృపస్స్వేన నిర్మితాయాం పురిస్థితః;
కుర్వన్ హేమాద్రి దానాని చిరంభువ మపాలయత్.

ఎఱ్ఱాప్రగ్గడ హరివంశమును రచించుకాలమున ననపోతారెడ్డిగారు యువరాజుగా నుండిరి. ఈయన రాజ్యమునకు వచ్చునాటి కెఱ్ఱాప్రగ్గడ పుణ్యలోకముల కరిగియుండును. బాలసరస్వతియను కవీశ్వరు డీయన యాస్థానమున విద్యాధికారిగా నుండెను. "అన్నపోతనరేంద్రస్య విద్వాన్ బాలసరస్వతిః" అని యాతడు శాసనకృతులందు జెప్పికొనెను. వెన్నెలకంటి యింటిపేరుగల కవీశ్వరు లీయన్నపోతభూపతిపేర నేవోగ్రంథములు రచించిరట. అవి యేవో దొరకలేదు. "వేమయ యన్నవోతభూజానికి సత్ప్రబంధము లొనంగిన వెన్నెలగంటివారిలోన" అని విష్ణుపురాణకర్త వెన్నెలకంటి సూర్యకవియు, "వెన్నెలకంటి సూర్యుడు వివేకగుణాఢ్యుడు వేదశాస్త్రసంపన్నుడు రెడ్డివేమ నరపాలకుచేత మహాగ్రహారముల్ | గొన్నకవీంద్రకుంజరుడు" అని జక్కనయు నీవిషయమును బ్రశంసించిరి. ఈమహారాజు రెడ్డిరాజ్యమును జాల బెంపొందించినవాడు; చాల యుద్ధములు జరిపి జయములందినవాడు.

అనవేమారెడ్డిగారు.

అనపోతారెడ్డిగారి యనంతర మీయన రాజ్యమునకు వచ్చెను. ఈయన చాల ధర్మాత్ముడు. ఈశ్వరభక్తుడు; షట్కాలశివపూజాధురంధరుడు.

"అరుణోదయ తపనోదయ
సంగవ మధ్యాహ్న సాయ మర్ధనిశాః;
శివపూజా సమయాష్టక్
ప్రతిదిన మనవేమ పార్థివేంద్రస్య"

అని వర్ణనగలదు. ఈయన యాస్థానమునఁ గొన్నాళ్లు బాలసరస్వతికవియే విద్యాధికారిగా నుండెను. పిదప, త్రిలోచనార్యుఁడను నుద్దండకవి విద్యాధికారిగా నుండెను.

"మహానట జటాచ్ఛటానట దమంద మందాకినీ
కలక్వణితకంకణ ప్రజవిజృంభి వాగ్గుంభనః;
కవిః కవికులోద్భవో భువనభవ్య దివ్యోదయ
శ్శివాగమ విశారదో జయతి శారదావల్లభః

ఈ త్రిలోచనార్యుఁడు గొప్పకవియగుటేకాక శైవాగమ విశారదుఁడునట! 'ప్రకాశభారతియోగి' యని పేరుగలవాఁడు ఆంధ్రకవీశ్వరుఁ డింకొక్కఁడుకూడ నీయన యాస్థానమున నుండెను. దాక్షారామ భీమేశ్వరాలయమున ననవేమభూపాలుఁడు కట్టించిన గొప్పకట్టడములఁగూర్చి యీప్రకాశభారతియోగి మంచి సీసపద్యములతో శాసన కావ్యమురచించినాఁడు. ఈయన కైలాసవాసికాఁగా నొకవిద్వాంసుడిట్లు విలపించినాడు.

భువిసత్యన వేమభూపతీంద్రే విదుషాంజీవన మేవజీవనమ్
దివిసత్యన వేమభూపతీంద్రే విదుషాంజీవన మేవజీవనమ్.

కొమరగిరి రెడ్డిగారు.

అనవేమారెడ్డిగారికి పిదప నాయన యన్నకుమారుఁడు కొమరగిరిరెడ్డి రాజయ్యెను. ఈయన చాల అదృష్టవంతుఁడు. ఏలనఁగా, ఈయనకు మనుతుల్యుఁడని పొగడ్త గాంచిన ప్రాజ్ఞుఁడు కాటయవేమారెడ్డి మంత్రిగా నుండెను.

"ఆసీదమాత్య రత్నం కాటయవేమ ప్రభుస్తస్య,
అతి సురగురు భార్గవమతి రతిభార్గవ విజయవిజయ విఖ్యాతః"
"సింహాసనే నిధాయాసౌ కుమారగిరి భూవరమ్
అతేజయన్మహా తేజాః శ్రీకృష్ణ ఇవధర్మజమ్."

—తొత్తరమూడి శాసనము.

శ్రీకృష్ణదేవుఁడు ధర్మరాజును బోలె కాటయవేమారెడ్డి కొమరగిరిరెడ్డిని సింహాసనమున గూర్చుండఁబెట్టి సర్వాభ్యుదయములను సమకూర్చుచుండువాడు. రాజ్యపరిపాలనతంత్రమెల్ల కాటయవేమారెడ్డిగారు నిర్వర్తించుచుండగా, భోగభాగ్యపరాయణులై

కొమారగిరిరెడ్డిగారు వసంతోత్సవములతోను, వారాంగనాభినయములతోను కాలము గడుపుచుండువారు. వీరికాలమునఁ గొండవీటిరెడ్డిరాజ్యము గొప్పదశలో నుండెను.

"భాగ్యం నామసమగ్రమీదృశ మతిస్నేహైకపాత్రంబులో
వీరం కాటయవేమ ముద్ధతరిపు ధ్వంసేని యుజ్యన్వయమ్;
నిత్యం నందతి నర్తనైరభినవైః కాంతైర్వ సంతోత్సవైః
సంతానాభ్యుదయైః కుమారగిరి భూపాలో నృపాలోత్తమః"

ఇచట 'సంతానాభ్యుదయైః' అనుటకు సప్తసంతానముల యభ్యుదయములని అర్థము చెప్పుకొనవలెను.

కొమరగిరిరెడ్డిగారికి ధర్మపత్ని నిర్విశేషురాలు 'లకుమాదేవి' యను ప్రియురాలుండెడిది. ఆమె కొమరగిరిరెడ్డిగారి కొల్వున వేలతెఱఁగుల నవనవాభినయములు వెలయించుచుండెడిది. అర్థివ్రజమును వేలకొలఁదిగా ధనమొసఁగి యాదరించుచుండెడిది. ఈ లకుమాదేవి వేశ్యకాబోలును.

"జయతి మహిమా లోకాతీతః కుమారగిరిప్రభో
స్సదసిలకుమాదేవీ యస్య ప్రియాసదృశీప్రియా;
నవ మభినయా నాట్యార్థానాం తనోతిసహస్రధా
వితరతి బహూనర్థా నర్థివ్రజాయ సహస్రశః."

కొమరగిరిరెడ్డిగారి కాలముననే కొండవీట 'గృహరాజసౌధ' మను గొప్ప ప్రాసాదము నిర్మింపఁబడెను. ఇంతదాఁక నీసౌధము, పెదకోమటి వేమారెడ్డి కాలమున వెలయింపఁబడినట్లు తలఁపఁబడుచుండెను. ఈనడుమ క్రొత్తగా దొరకిన తామ్రశాసనములు (ఇవి శ్రీ భావరాజు వెంకటకృష్ణరావుగారిచే ఆంధ్ర హిస్టారికల్ రీసర్చి సొసైటీ జర్నల్‌లో ప్రకటింపఁబడినవి.) ఈసౌధమును కుమారగిరిరెడ్డిగారే కట్టించిరని తెలుపుచున్నవి. మఱియుఁ గుమారగిరిరెడ్డిగారు 'వసంతరాజీయ' మనుపేర నాట్యశాస్త్ర గ్రంథము నొకదానిని రచించిరట. అది యిప్పుడు కానరాదు.

"మునీనాం భరతాదీనాం భోజాదీనాం చభూభుజామ్,
శాస్త్రాణి సమ్యగాలోచ్య నాట్యవేదార్థ వేదినామ్
ప్రోక్తం వసంతరాజేన కుమారగిరి భూభుజా
నామ్నా వసంతరాజీయం నాట్యశాస్త్రం యదుత్తమమ్."

శ్రీనాథుని హరవిలాసమును కృతినందిన యవచి తిప్పయశెట్టి తన చిన్ననాట నీ కుమారగిరిరెడ్డిగారి ప్రతివర్ష వసంతోత్సవములకు తరుణాసీరి, తవాయి, గోవ, రమణ,పంజార,

జలనోగి, పూరుమంజి, యాంప, బోట ఇత్యాది ద్వీపాంతరములనుండి తెప్పించిన సుగంధద్రవ్యములను కొండవీటికి గొనివచ్చి సుగంధద్రవ్య భాండారము నెలకొల్పి తుమ్మిపోవుచుండెడివాడు.

### కాటయ వేమారెడ్డిగారు

ఈయన కుమారగిరిరెడ్డిగారి సోదరికిభర్త. కాళిదాసీయమయిన నాటకత్రయమునకు కుమారగిరీయములు అను వ్యాఖ్యానములు రచియించినవాడు. ఈవ్యాఖ్యానములు చాల ప్రసిద్ధములయినవి.

కుమారగిరి భూనాథో యస్మై విక్రమతోషితః
ప్రాదాత్ప్రాచీం భువం రాజమహేంద్రనగరీముఖామ్.

రాజమహేంద్రవర రాజ్యమును కాటయ వేమారెడ్డియు, కుమారగిరి రెడ్డికుమారుడు అనపోతారెడ్డియు, కాటయ వేమారెడ్డియల్లుడు వీరభద్రారెడ్డియు, నాయన తమ్ముదమ్ములగు వేమారెడ్డి, దొడ్డారెడ్డి, అన్నారెడ్డి అనువారును గలసి చీకటి చిల్కసముద్రము దాక వ్యాపింపజేసి పాలించిరి. కొమరగిరిరెడ్డిగారి తుదికాలమునకే కొండవీటిరెడ్డిరాజ్యము, రాజమహేంద్రవర రెడ్డిరాజ్యము వేఱుపడెను. కొండవీటిరెడ్డిరాజ్యమునకు పెదకోమటి వేమారెడ్డి రాజయ్యెను.

### పెదకోమటి వేమారెడ్డిగారు.

ఈ రెడ్డిరాజ్యమునకు దొలిపురుషుడగు కాటయ వేమారెడ్డిగా రెట్టిజగద్గేయకీర్తులో ఇంచుమించుగా కొండవీటిరెడ్డిరాజ్యమునకు దుదివాడనదగిన యీ పెదకోమటి వేమారెడ్డిగారుకూడ నట్టివారు. ఇంచుమించుగా క్రీ. 1404 నుండి 1420 దాక నీమహానీయుడు కొండవీటిరెడ్డిరాజ్యము నేలెను. ఈయనకు రాజమహేంద్రవర రెడ్డిరాజ్యము ప్రబలవిరోధిగా నుండెను. కాటయ వేమారెడ్డిగారివలె నీయన స్వయము గొప్పవిద్వాంసుడు. కవిసార్వభౌముడయిన శ్రీనాథుని నాస్థానమున విద్యాధికారినిగా జేసికొని పోషించిన మహాభాగ్యశాలి. ప్రబంధ పరమేశ్వరుని, కవిసార్వభౌముని నాస్థానకవులగా నాదరించి పోషించు మహాభాగ్యము ప్రోలయ వేమారెడ్డిగారికిని, నీ పెదకోమటివేమారెడ్డిగారికిని చిరకాలము లభించినది. ఈ వేమారెడ్డిగారికి 'సర్వజ్ఞచక్రవర్తి' యని బిరుదు.

"చూడామణి ర్నృపాణాం దుర్మద పరివంధిశిఖరి దంభోళిః;
సర్వజ్ఞచక్రవర్తీ పెదకోమటివేమభూపతిర్జయతి"

ఈ శ్లోకము శ్రీనాథుని శాసనకృతులందేకాక వామనభట్టబాణుని వేమభూపాలచరిత ముఁగూడ గలదు. రాచకొండ దేవరకొండలు రాజధానులుగా పశ్చిమాంధ్రదేశము నేలిన రేచెర్ల వెలమరాజులకును, కొండవీడు, రాజమహేంద్రవరము రాజధానులుగా రాజ్యమేలిన పంటదేసటి రెడ్డిరాజులకును ప్రబలవిరోధము. వారు ఒండొరులమీఁది కీర్తిప్రతాపయశస్సుల నార్జింపయత్నించిరి. రేచెర్ల సింగభూపాలుఁడు సర్వజ్ఞబిరుద మందగా కొండవీటి రెడ్డిరాజు, మనపెదకోమటివేమారెడ్డి సర్వజ్ఞచక్రవర్తి బిరుదమందెను. అక్కడ నొక సింగభూపాలుడు సంగీతరత్నాకర వ్యాఖ్యానమును రసార్ణవసుధాకరమును రత్నపాంచాలికను, రచింపగా మనరెడ్డిగారు సంగీతచింతామణిని, సాహిత్యచింతామణిని అమరువ్యాఖ్యను సప్తశతీసారవ్యాఖ్యను నింకగొన్ని నాటకకృతులను రచియించిరి. విశ్వేశ్వరకవిచంద్రాదులు వెలమరాజులు యాస్థానమున కవులుగానుండగా వామనభట్టబాణాదులిక్కడ నుండిరి. మహనీయుడు బమ్మెరపోతనవారి యాస్థానమున నుండెనుగాని యానిస్పృహుడు నరస్తుతివిముఖుడై వారిగౌరవాదరముల నపేక్షింపడయ్యెను. మనరెడ్డిగారి యాస్థానమున పోతరాజుగారికి దీసిపోని విఖ్యాత కవీశ్వరుడు శ్రీనాథుడు విద్యాధికారిపదమున వెలుఁగొందెను. ఇక్కడ నించుక శాఖాచంక్రమణము. వెలగోటివారి వంశమున సింగభూపాలురు పలువురున్నారు. అందు కవితాప్రసక్తులు పదునాల్గవశతాబ్ది తుదను, పదునైదవశతాబ్ది మొదటను వర్తిల్లినవా రిర్వురు సింగభూపాలురు. అందు తొలి సింగభూపాలుఁడు రసార్ణవసుధాకరము, రత్నపాంచాలిక మొదలగు గ్రంథములకుఁ గర్త. చమత్కారచంద్రికాకారుఁడగు విశ్వేశ్వరకవి చంద్రు నాస్థానకవిగా నాదరించినవాఁడు.

ఈతని మనుమఁడు వేల్పోకసింగభూపాలుఁడున్నాడు. ఈతనికే సర్వజ్ఞుఁడనిబిరుదు. శ్రీనాథకవిసార్వభౌముఁడు, బమ్మెరపోతరాజు, నీసర్వజ్ఞ సింగభూపాలునితో సంబంధము గలవాడు. ఈతని తల్లిదండ్రులు పోచమాన్నపోత భూపాలకులు. వసంతావనీనాథుఁడీతని తమ్ముఁడు. బమ్మెర పోతరాజు భోగినీదండకము నీతనిపేరనే రచించెను. శ్రీనాథుఁడీతననే దర్శించెను. ఈతఁడు పదునైదవశతాబ్ది మొదటికాలమువాఁడు.

ఈతని తాత సింగభూపాలుఁడే రసార్ణవసుధాకరాది గ్రంథకర్త. ఆతనికి శ్రీనాథపోతనలతో సంబంధముగలదనుట యప్రామాణికము. ఆతఁ డన్నమాంబా పోతభూపతుల కొడుకు. ఆతని సోదరులపేళ్ళు వేఱు. ఇంతవిస్పష్టచరిత్ర విషయము నెందుకో కొందఱిప్పుడు తార్మాఱుచేయుచున్నారు.

పెదకోమటివేమారెడ్డిగారి మంత్రియు, శ్రీనాథుని శృంగారనైషధకృతిపతియు

వగు మామిడి సింగనమంత్రి సోమసిద్ధాంతమను జ్యోతిషగ్రంథమునకు వ్యాఖ్యరచించెను. పెదకోమటివేమారెడ్డిగారు అనేకులకు జ్యోతిషవిద్వాంసులకు, గొప్ప వైద్యవిద్వాంసులకు, యజ్ఞములుచేసిన శ్రోత్రియులకు, శైవాచార్యులకు, అనేకాగ్రహారములు దానము చేసెను. ఆదానముల కన్నింటికిని, శ్రీనాథకవీశ్వరుఁడు శాసనకావ్యకర్త. వారి వైదుష్యములను శ్రీనాథుఁడే పరీక్షించువాడు.

సీ. వినిపించినాఁడవు వేమభూపాలున
కఖిలపురాణ విద్యాగమములు
భాషించినాఁడవు బహుదేశబుధులతో
విద్యాపరీక్షణ వేళలందు
వెదచల్లినాడవు విశదకీర్తిస్ఫూర్తి
కర్పూరములు దిశాంగణములందు
కల్పించినాఁడవు గాఢపాకంబైన
హర్షనైషధకావ్య మాంధ్రభాష.

ఇవియెల్ల పెదకోమటివేమారెడ్డిగారి యాస్థానిలో శ్రీనాథుఁడు జరిపిన విద్యాధికారి కృత్యములు. 'విద్యాధికారీ శ్రీనాథోవీర శ్రీ వేమభూపతేః' అని శాసనకృతులలో నాతఁడు చెప్పుకొన్నాడు.

పెదకోమటివేమారెడ్డిగారి కృతులు: (1) శృంగారదీపిక—ఇది అమరుశతకమునకు వ్యాఖ్యానము. అమరుశతకవ్యాఖ్య లన్నింటికంటె దీనికే గౌరవము హెచ్చు. రసభావాలంకార నాయికానాయక లక్షణాదివిషయ విచారముతో నీవ్యాఖ్యానము చాల విపులముగా నున్నది. ఇది ముద్రితమయియున్నది. (2) సప్తశతీసారటీక:— రెండువేలేళ్ళకుముందు హాలుడను ఆంధ్రశాతవాహనచక్రవర్తి సంధానించిన 'గాథా సప్తశతి' యను నేణ్ణూరు ప్రాకృతగాథలనుండి సారతరములగు – నూఱుగాథలను – పెదకోమటి వేమారెడ్డిగారు సంగ్రహించి వానికి వ్యాఖ్య రచించిరి. ఈగ్రంథ మింకను ముద్రితముకాలేదు. దీని కొక్కప్రతిమాత్రమే దొరకినది. అది ఓరియంటల్ లైబ్రరి (ప్రాచ్యలిఖిత పుస్తకశాల) లోఁ గలదు. నూనూగుమీసాల నూత్నయౌవనమున శ్రీనాథుఁ డీగాథాసప్తశతిని దెలిఁగించినాఁడు. శ్రీనాథుని యాబాలగ్రంథ మిపుడు గానరాదు. అది మనరెడ్డిగారి కంకితమయియుండును. (3) సాహిత్యచింతామణి:— ఇది యలంకారశాస్త్రగ్రంథములలోఁ బేర్కొనఁదగిన 'యుత్కృష్టగ్రంథము. కావ్యప్రకాశమువంటిది. ప్రతాపరుద్రీయ వ్యాఖ్యాత కుమారస్వామి సోమపీథి దీని నుదాహ

తించినాఁడు. మహిమభట్టు వ్యక్తివివేకము నిది ఖండించును. ధ్వనికారుని మతమును పరిపోషించును. ఇకదనేక గ్రంథములలోని శ్లోకము లుదాహరింపఁబడినవి. "యథామమైవభాణే" అనియు, "యథామమైవకావ్యే వీరనారాయణచరితే" యనియుఁ బెక్కుశ్లోకము లుదాహరింపబడినవి. కోమటివేమారెడ్డిగారి కృతులగు నాగ్రంథము లిప్పుడు తెలియరావు. (4) సంగీతచింతామణి:—ఈగ్రంథము తిరువనంతపురమున నున్నది. కవీశ్వరు లీసర్వజ్ఞచక్రవర్తి నిట్లు పొగడిరి:

"జ్ఞాతా యది నహిదాతా, దాతాచేత్కో౽పి భువినచజ్ఞాతా;
జ్ఞాతా దాతా చాభూః పెదకోమటి వేమభూపతే చిత్రమ్."
"అర్థిజనచింతితార్థా, దధికంచేత స్తతో౽పి తేవాణీ,
అస్యా అపి దిశతికరః, పెదకోమటి వేమభూపతే చిత్రమ్."
"శ్రితపోషణ రిపు శోషణ, బుధతోషణ సత్యభాషణాది గుణాన్,
ధత్తే దశరథరామః, ప్రాగద్యకలౌతు కోమటి విభువేమః."

* * *

వామనభట్టభాణుఁడను కవీశ్వరుఁడు పెదకోమటి వేమారెడ్డిగారి చరిత్రమునే 'వేమభూపాలచరిత్ర' మనుపేర సంస్కృతమున గద్యకావ్యముగా రచించిరి. శ్రీనాథుడే కాళోలును పెదకోమటి వేమారెడ్డిగారిమీద రచించిన చాటుధారలు పెక్కులు చాటుపద్యమణిమంజరిలో జూడదగును.

ఈకాలముననే కందుకూరు రాజధానిగా రాజ్యమేలుచున్న పిన్నకోమటిరెడ్డి గారి కుమారుడు శివలింగభూపతి హరదత్తాచార్యుడు "చతుర్వేదతాత్పర్యసంగ్రహ" మనుపేర రచించిన ప్రౌఢసంస్కృత గ్రంథమునకు వ్యాఖ్య రచియించెను. ఆయన యాస్థానమున నీశ్వరభట్టు అను గొప్ప విద్వాంసుడుండెను. ఆయన తోడ్పాటుతో రెడ్డిగారా గ్రంథమును రచించిరి.

పెదకోమటివేమారెడ్డిగారితర్వాత తత్పుత్రుడు రాచవేమన మాఁడేండ్లుమాత్రమే రాజ్యమేలెను. అంతటితో కొండవీటిరెడ్డిరాజ్య మంతమందెను. కాని, పెదకోమటి వేమారెడ్డిగారు తాము జీవించియుండగానే తనతమ్ముడగు మాచారెడ్డిగారికి కొండపల్లె దుర్గము రాజధానిగాఁ దత్ప్రాంతదేశమును గొంత రాజ్యమేలుకొనఁ బంచి యిచ్చి పంపిరి,

"పెదకోమటి మాచేంద్రో వేధసా నిర్మితో౽, నృపః
ఇతరేతునృపా స్సర్వే విశ్వామిత్రేణ నిర్మితాః"

అని యీయన పొగడ్తఁ గనెను. ఈ రెడ్డిగారు క్రీ. 1414 సం॥రమునను, తత్పుత్రుఁడు తిప్పయ రెడ్డిగారు క్రీ. 1415 సం॥రమునను చేసిన యగ్రహారదానశాసనము లున్నవి.

పెదకోమటి మాచారెడ్డిగారు కొండపల్లిలో రాజ్యమేలుచు

"అకలంక సకలభాషా కవితా మూర్ధాభిషిక్తాయ,
విద్వన్నిరూఢ రాజాస్థాన సుధాంభోధిపూర్ణచంద్రమసే."
"గద్యశ్రీ బాణకవేః పద్యేఽపి తథైవ కాళిదాసకవేః,

* * *

ఉజ్జ్వలత రాష్ట్రభాషా కవితాసామ్రాజ్య పట్టబంధస్య,
పుత్రాయాన్నయ సుకవేః శ్రీభారద్వాజగోత్రాయ"
"అనుజేనపాణి బదరీకృతపాణిని ఫణితిమార్గేణ,
త్రిపురారి సుకవిమణినా సంస్మరయితేస లక్ష్మణం రామమ్
పాల్గుమి శ్రీకంఠగురోః పంచాక్షరమంత్ర పౌనరుక్తస్య,
శిష్యాయ

బల్లేపల్లిగ్రామము నగ్రహారముగా నొసఁగెను. తర్వాతివత్సరమున మాచారెడ్డిగారి కుమారుఁడు తిప్పయ్య రెడ్డిగారు గుడివాడతాలూకాలో పామఱ్ఱునగ్గరగల యేకమూరు గ్రామమును ప్రతాపరుద్రదేవుని భాండాగారాధిపుఁ డగు మల్లనకు మన్మఁడగు బంక మల్లయయను బ్రాహ్మణునికి దానముచేసెను. తండ్రికొడుకు లిద్దఱదగ్గరను సరహరి యను విద్వాంసుఁ డాస్థానకవిగా నుండెను.

కొండవీటిరెడ్డిరాజ్యముతోపా టీకొండపల్లిరాజ్య విభాగమును జెడిపోయినది. వెలుగోటి వెలమరాజులు కొంతభాగమును విజయనగరరాజ్యము కొంతభాగమును వేమ వీరభద్రారెడ్లు కొంతభాగమును గొనియుందురు.

## వేమ వీరభద్రారెడ్లు.

క్రీ. 1425 సం. ప్రాంతములఁ గొండవీటి రెడ్డిరాజ్యము కూలిపోఁగా శ్రీనాథు డటుపయి సమధికాభ్యుదయముతో నున్న రాజమహేంద్రవర రెడ్డిరాజ్యమునకుఁ జేరి నాఁడు. అంతదాఁక శ్రీనాథున కాశ్రయమయిన పెదకోమటి వేమారెడ్డిగారికి ప్రబల శత్రువులై రాజమహేంద్రవర రాజ్యమును బెంపొందించినవారు—కుమారగిరిరెడ్డిగారి కుమారుఁడు అనపోతారెడ్డి, వేమ వీరభద్రారెడ్ల తండ్రి అల్లాడరెడ్డి, కాటయవేమా రెడ్డి, తత్పుత్త్రుఁడు కుమారగిరిరెడ్డి వీరెల్లరు రాజమహేంద్రవరమున క్రీ. 1390-1420

సంవత్సరముల నడిమికాలమునఁ జనిపోయిరి. రాజమహేంద్రవర రాజ్యము కాటయ వేమారెడ్డిగారి కుమార్తె యగునని తల్లిమూలమున తద్భర్తయగు వీరభద్రారెడ్డిగారికి సంక్రమించెను. వీరభద్రారెడ్డి మంత్రియగు బెండపూఁడి యన్నమంత్రి శ్రీనాథునకు బంధువు. తొల్త శ్రీనాథుఁ డాతని ప్రాపుఁ బడసెను. ఆతని కంకితముగా క్రీ. 1430 కి దరువాత భీమఖండము రచించెను. ఆకృతి యవతరణికలో వేమవీరభద్రారెడ్లను వర్ణించెను. క్రమముగా 1430 తర్వాత శ్రీనాథుఁడు 'రాజమహేంద్రవరవు' "వీరభద్రారెడ్డి విద్యాంసుఁ" డయ్యెను.

ఈకాలమున శ్రీనాథునితోపాటు రాజమహేంద్రవరమున నిశ్శంక కొమ్మనామాత్యుడని మఱొక యాంధ్రకవి యుండెను. అతఁడు వీరభద్రారెడ్డి తమ్ముడగు దొడ్డారెడ్డి కంకితముగా శివలీలావిలాసమని ప్రౌఢప్రబంధము రచించెను.

వీరభద్రారెడ్డిగారి కంకితముగా శ్రీనాథుఁడు కాశీఖండము రచించెను. శ్రీనాథుఁడు ఆంధ్ర కవీశ్వరులలో వింతతీరువాఁడు. అతఁడు తత్పూర్వాంధ్రకవులు చేయు పురాణాంధ్రీకరణ పద్ధతికిఁ జాల మార్పు కల్గించినాఁడు. కాశీఖండ భీమఖండ పురాణములను దెలిఁగించినను వానిని స్వతంత్ర ప్రబంధములు వోలెఁ దెలిఁగించినాఁడు. భీమఖండము గోదావరీతీర దేశ దివ్యవైభవ వర్ణన మనఁదగినది. కాశీఖండము గొప్ప పురాణ గ్రంథ మయినను నీతఁడు దాన తన యిచ్చవచ్చినతీరునఁ గొన్ని క్రొత్తవిషయములు జేర్చి కొన్ని మార్చి మూలముతో నంతగా సంబంధము లేనితీరున అతి ప్రౌఢమయిన ప్రబంధశయ్యతో స్వతంత్రకృతి యనఁదగినట్లు రచించినాఁడు. తెలుఁగు కాశీఖండము నెవరుగాని కాశీ మహాత్మ్యాది పురాణకథాపరిజ్ఞానమునకయి చదువరు. అది ప్రౌఢాంధ్ర కవితాపరిజ్ఞానమునకయి చదువఁదగిన ప్రబంధమే. ఇట్లే శివరాత్రిమహాత్మ్యమని మఱియొక గ్రంథమును శ్రీనాథుఁడు రచించినాఁడు. ఈశాన సంహితలో దానిమూలము నూఱు శ్లోకములు గలది. తెలుగుగ్రంథము విచ్చలవిడిగా వర్ణనలతో, శృంగార ప్రసక్తులతోఁ బెరిగినది. పురాణాంధ్రీకరణమని పేరేగాని శ్రీనాథుని తెలిఁగింపుట ఆయన యిష్టప్రకారము సాగినవే. శ్రీనాథునకు ప్రౌఢకవితాపాకముమీఁదఁ బ్రీతి: తదనుగుణముగా నాతఁడు గ్రంథగ్రంథిమయమయిన శ్రీ హర్షనైషధమును దెలిఁగించినాఁడు. ఆయన డెందము మెచ్చిన కవితాసందర్భ మిట్టిది.

"హారచూడా హరిణాంక వక్రతయుఁ గా
లాంత స్ఫురచ్చంద్రికా
పటుపోద్గాఢ పయోధరస్ఫుటతటీ
పర్యంత కాఠిన్యమున్

పరసత్వంబును సంభవించె ననఁగా
సత్కావ్యముల్ దిక్కులన్
జిరకాలంబు నటించుచుండుఁ గవిరా
జీ గేహరంగంబులన్.

ఈయన గ్రంథములలోకెల్ల కాశీఖండము పండఁబారిన కవితారచనా శౌండీర్యము గలది. ఇట్టి కవితా వైభవమునకుఁ గారణములను శ్రీనాథుఁడిట్లు చెప్పుకొన్నాడు.

ఆంధ్ర క్షమామండలా ఖండలుండైన
వేమభూపతి కృపావీక్షణంబు
ఘోడరాయాంక సద్గురురాజ భీమేశ్వ
రస్వామి పదసమారాధనంబు
కమలాద్రి నిలయ మార్కండేయ శివమౌళి
చంద్రాంశు నవసుధా సారధార
వేదాద్రి నరసింహ విపులవక్షస్థలి
కల్హార మాలికానందలహరి.
కారణంబులు సుదోహదములుగాఁగ
సంభవించిన సాహిత్య సౌష్ఠవమున
వీరభద్రేశ్వరుఁ బ్రబంధ విభునిఁ జేసి
కాశికాఖండముఁ దెనుంగుగా నొసర్తు.

ఈ సాహిత్య సౌష్ఠవకారణములెల్ల శ్రీనాథునకు రాజమహేంద్రవరమున సమకూరినవే.

ఇట్టి కవితా వైభవముల వెలయఁజేయుచు, సర్వ సౌఖ్యముల ననుభవించుచు నించుమించుగా క్రీ. 1450 సం॥ దాఁక శ్రీనాథుఁడు రాజమహేంద్రవరమున వర్ధిల్లినాఁడు. అంతలో రాజమహేంద్రవరమున వేమవీరభద్రా రెడ్ల రాజ్యమును నంతరించినది.

రఘువంశమున దశరథుఁడు రాజ్యపట్టాభిషిక్తుఁ డగునాఁటనుండి మహామంత్రిగా నుండి దశరథమహారాజు మరణము మొదలుగాఁ దద్వంశ క్లేశములనెల్ల ననుభవించుచు సుమంత్రుఁడు చిరకాలము జీవించినట్లు, మన శ్రీనాథుఁడును పెదకోమటి వేమారెడ్డిగారి రాజ్యలాభము నాఁటినుండి తదాస్థానమున విద్యాధికార్యున్నతోద్యోగము వహించి, కొండవీటి రెడ్డిరాజ్య వైభవములు పిదప రాజమహేంద్రవర రెడ్డిరాజ్య వైభవములు సమసిపోయినపిదపఁ గూడ జీవించి దీర్ఘ జీవితమును బరువును మోపినట్లు మోపవలసినవాఁడయ్యె. దాని నిఁక స్మరింపను.

మహావైభవ మనుభవించిన రెడ్డిరాజ్య మిట్లంతరించినను చాఁప చిరిగి చదర లయినట్లు తద్రాజ్యము చెదరులుగాఁ గొన్నిచోట్ల నేటికిని వర్ధిల్లుచున్నది. ఆంధ్రాభ్యుదయమునకు వారెంతో తోడ్పడుచున్నారు. గద్వాల, వనపర్తి, ఆత్మకూరు, దోమకొండ, మునగాల, ఇంకను గుంటూరుమండలమున రావూరు రాజధానిగా విజయనగర రాజులక్రింద రాజ్యమేలినవాఁడు, బసవయ రాఘవరెడ్డి వెన్నెలకంటి సూర్యనార్యునిచే పదునాఱవ శతాబ్ది యారంభమున విష్ణుపురాణమును ఆంధ్రీకరింపించెను. ఈ విష్ణుపురాణము శ్రీనాథుని పురాణాంధ్రీకరణ ప్రౌఢిని దలఁపించుచు మూలానుసారముగాఁ జాల హృద్యముగా నున్నది.

గోదావరీతీరమున బిక్కవోలు రాజధానిగా రాజ్యమేలిన కామినేనివారు కృతికర్తలై కృతిపతులై యాంధ్రభాషకు చాల నభ్యుదయము గూర్చిరి. పట్టమెట్ట సోమనాథకవి కామినేని కామిరెడ్డిగారి కవీశ్వరుఁడై సూత సంహితాదిగ్రంథముల రచించినాఁడు. ఈ మహాకవి రచనము చాల మేలయినది. కామినేని మల్లారెడ్డిగారు షట్చక్రవర్తి చరిత్రమని ప్రశస్త ప్రబంధము రచించిరి. వీరి యాస్థానిలో పెక్కుగ్రంథములు వెలసినవి. పదునేడవశతాబ్దిలో అద్దంకిసీమలోని మూగచింతపల్లెలోఁ బుట్టి సర్వాంధ్రద్రవిడదేశ సంచారియై వేలకొలఁది యాఁటవెలఁదులను విజ్ఞుల జిహ్వారంగములపై నాట్యమాడించిన దొడ్డకవి వేమన పద్యకర్త వేమారెడ్డిగారు రెడ్డిజాతి జగజ్జ్యోతి. సహజకవితాధారల యాటగడ్డ.

గద్వాల, వనపర్తి, ఆత్మకూరు, దోమకొండ, మునగాల సంస్థానులు పేర్వెలసిన కాలముననుండియు నంధ్రవాఙ్మయాభ్యుదయమున కెంతేని తోడ్పడుచున్నవి. గద్వాలలో ముష్టిపల్లి సోమభూపాలుని కాలమున కాణాద పెద్దనసోమయాజి మహాకవియై యధ్యాత్మరామాయణ ముకుందవిలాసాది గ్రంథములఁ బెక్కింటిని రచియించినాఁడు. సోమభూపాలుఁడును సంగీతసాహిత్య చతురుఁడై స్వయము కవియై జయదేవగీత గోవిందము పద్యగేయాత్మకముగాఁ జాల చక్కగా దెలిగించినాడు. గద్వాలసంస్థానమువలెనే ఆత్మకూరు, వనపర్తి, దోమకొండ సంస్థానములును గవిపోషణమున వాఙ్మయరక్షణమున నాటికి, నేటికి బేర్వెలయుచున్నవి. నేఁడును నైజాంరాష్ట్రమున రాయలసీమలో, మధ్యాంధ్రదేశమున సుగుణగణ్యులగు రెడ్డిగృహస్థు లెందఱో కలరు. అందు గవు లెందఱో కలరు. ఆంధ్రాభ్యుదయమునకు నాడు, నేడునుగూడ రెడ్డిసంఘము గొప్ప యాలంబమై వెలసినది, వెలయుచున్నది. నేటికిని అంధ్రసారస్వత భాగ్య భాండాగారములో రెడ్డికులమువారొక గొప్పభాగస్వాములనియు, రేపటి యాంధ్రాభ్యుదయమున వారొక ముఖ్యనిర్వాహకులై నిలువగలరనియు, వారియెడ నాకుగల పరితోషమును మరల బ్రకటించుచు నీ యుపన్యాసము ముగించుచున్నాను.

# రెడ్ల ఆధునిక విధి

డాక్టర్ సర్ కట్టమంచి రామలింగారెడ్డిగారు, ఎం. యే., (కాన్‌టబ్)
వైస్‌ఛాన్సలరు, ఆంధ్రయూనివర్సిటీ.

మనకులమందు బుట్టిన యమానుష శౌర్యులు మున్ను సంగరా
వని తమ కార్యసిద్ధిగని వన్నియు వాసియు గాంచిరిప్పుడో
ఘనతర బాహుసంపదకు గాలము కాదు, వచోమయంబులీ
దినములు కత్తులేలయికి? తీటగ బూనుడు నాటుకల్ వడిన్॥

---

## గీతిక.

కవికొండల వేంకటరావు

1. కొండలకోనలు చెరువులనీట
కత్తుల మొనలు శత్రురుధిరమున,
ప్రతిబింబింపగ పాలించారు
రెడ్డిప్రభువులు కోరుకొండలో !
2. బావులు కాల్వలు తవ్వించారు,
మన్యంబంతా ధాన్యపుఁబంటఁ
గన్నుపండువు గావించారు,
రెడ్డిప్రభువులు కోరుకొండలో !
3. దేవాలయంబు గట్టించారు,
ద్వారముముందు నిలబడ్డారు;
నిలువువిగ్రహాలై వెలిశారు.
రెడ్డిప్రభువులు కోరుకొండలో !

## రెడ్డిరాజ్యవర్ధంతి.

శతావధాని, కవిభూషణ, కృత్తివెంటి వెంకటసుబ్బారావు, ఎం. ఏ.

ఉ. రెడ్డిధరాతలేంద్రులు వరిష్ఠకవీంద్రులపోర తమ్ము తా
మొడ్డిరి గారడీ యని, యయారె! రసగ్రహణైకశీలురై
యడ్డములేమి పోటులవు, దట్టిఁడ రెడ్డియు, నెట్టనాథుఁడున్,
'దొడ్డ'యు, 'రామలింగఁ' డనుతోడన తక్కువియున్, ప్రభుండునై.

కుద్దులపల్లి సుబ్రహ్మశర్మ.

శా. శ్రీరాజీవదళాయతాక్షుడు రమాసీమంతినీ హృత్ప్రియుః ।
పారావారశశాంకు డుజ్జ్వలమణీభర్మాంగద వ్రాతవి।
స్తారాలంకృత నీలదేహుడగు సీతారామచంద్రుండు వి
ద్యారాశి ప్రతిభాభిశోభిత సభాస్తారావళిన్ బ్రోచుతన్. ౧

సీ. శ్రీమంతులై యశశ్శ్రీ నెల్లదిశల నటించి మించంగఁ బోషించినారు
హేమాద్రి దానచింతామణి ముఖరభవ్యాంకమున్ గొని కీర్తి నలరినారు
కొండవీడనదగు కొండవీటిని రాజ్యపదవినిగావించి పరఁగినారు
శ్రీనాథముఖ కవిశ్రేణికి ముంగొంగు పసిడియనంగ సొంపెసగినారు
తే. గీ. అరసి నలుబదినాల్గగ్రహారములను, భూసురులకిడి యైహికాముష్మికముల
గాంచినారు, మతంబురక్షించినారు, పాపహరులు మా రెడ్డిభూపాలవరులు. ౨

శా. దేవబ్రాహ్మణ భక్తియుక్తులగుచున్ దివ్యస్థలశ్రేణికన్
తోరవల్ గూరిచి ధర్మముల్ నలిపి సంతోషాత్ములై యాత్రికుల్
సేవల్ జేసి తరించి మించువథల్ సృష్టించి పుణ్యాత్ములై
తీవిన్ మోక్షముగాంచినారుగద రెడ్డిక్ష్మామనోనాయకుల్. ౩

ఉ. శాంతశమాది సద్గుణవిశారదు లార్యులు కోవిదుల్ బుధుల్
స్వాంతములందు సంతసిలి చాలగ నాదృతిసేయ గేయమై
యెంతయు వాఙ్మయ ప్రచయనవ్యక్షమునాదగి రెడ్డిరాజ్య వ
ర్ధంతి యమోఘమై వెలయుతన్ సితపక్షశశాంకరీతిగన్. ౪

శా. అయ్యా మీరలు పంపినట్టి శుభలేఖార్థంబు వీక్షించగా
వెయ్యార్లిచ్చినమాడ్కి నాదుమది యుర్వీభ్యారి పైనంబుగాన్
దయ్యాలట్టుల విఘ్నపాశములు బాధల్ వెట్టగామానితిన్
నెయ్యంబొప్ప ననుగ్రహించి నను మన్నింపంగ బ్రార్థించెదన్.

రెడ్డిపౌరుషము.

బండారు తమ్మయ్య.

చ॥ వననిధిగర్భమందడఁగి వంతలనెంతయుఁ దూలుధారుణీ।
వనరుహపత్రనేత్ర, నవ పంకజకోరక దంష్ట్రికోద్వహం।
బొనరిచి ప్రోదిసేయు పురుషోత్తము పౌరుషకేళి, రెడ్డిరా।
ట్తనయుల పౌరుషంబును సదాధరణిన్ వెలుఁగొందఁ జేయుతన్.

సీ॥ దుష్టులశిక్షించి శిష్టులరక్షించు
పరమార్థ ధర్మ నిర్వాహణమందు।
అరులను నిర్జించి యరులను నార్జించు
కలితమహార్థ సంగ్రాహణమందు।
కవిపండితులఁబ్రోచి కావ్యసత్కళలను
భరియించు కామతత్పరతయందు।
షట్కాల శివపూజ సరవిమైజరగించు
మోక్షసంపాదైక దీక్షయందు।
బహుశాస్త్రనిధులకుఁ బలుసీమలం దగ్ర
హారంబు లొసఁగు దోహలమునందు।
వాణిజ్యవృద్ధికై పరదేశములతోడ
వ్యాపారముల్ సల్పు యత్నమందు।
సాగరప్రతిమాన సరసుల నిర్మించి
భూతతృప్తినిగొల్పు పూన్కియందు।
స్థిరతరంబుగ నిల్వ దేవాలయములకు
నిత్య వసతిగూర్పు నిష్ఠయందు।

గీ॥ వ్యక్తమౌ రెడ్డిరాజుల పౌరుషంబు।
తెల్గునాటను సతతప్రదీప్తమగుచు।
వెల్గుచున్నది సకల దిగ్వీథులందు।
అదియ భజియించి తరియింపు డాంధ్రులార!॥

## రాజమహేంద్రవర రెడ్డిరాజ్యము.

అల్లాడరెడ్డి కొండవీటిప్రభువగు అనవేమారెడ్డి బంధువగుటచే సేనాధిపతిగ నియమింపబడి, అతని తూర్పునాటి విజయములలో పాల్గొనినాడు. గోదావరి పరిసర ప్రాంతములు కుమారగిరి కాటయవేములనాడుగాని, కొండవీటి రెడ్డిరాజ్యములో భాగములు కాలేదు. ఇందు శత్రురాజులు బలిష్ఠులై చిరకాలము ప్రతిఘటించుచుండిరి. అందుచే అనవేమారెడ్డి యీతనిని రాజమహేంద్రమునందు తన 'చమూనాథు'నిగా నిల్పియుంచెను. అల్లాడరెడ్డి బహు పరాక్రమవంతుడు. ఈతడు బెండపూడి లింగామాత్యుని దండనామాత్య మంత్రాంగమున, ఒకవైపు ఉండ్రాజులతోను, మన్యపుదొరలగు (అంప) నాగవంశ్యులతోను, ఝూడు, వంతు, మాడెములు, ఒడ్డాది రాజులతోను కయ్యములు సాగించుచు కొండవీటి సామ్రాజ్యమును కాపాడుచువచ్చెను. ఈ విషయములు శ్రీనాథుని భీమఖండములోని బెండపూడి లింగనామాత్యుని వర్ణనా సందర్భమునందలి పద్యములవలన గ్రహింపవచ్చును. అనవేమారెడ్డి అనంతరము కుమారగిరిరెడ్డి ప్రభుత్వమునకు రాగానే కాటయవేమారెడ్డి మహామంత్రియు, మహాదండనాయకుడుగను నియమింపబడెను. కాటయవేమారెడ్డి తూర్పునాటిని జయించి కొండవీటిరాజ్యములో కల్పుకొనెను. ఈ విజయములు అల్లాడరెడ్డియు అతనికుమార్లు వేమారెడ్డి, వీరారెడ్డి, దొడ్డారెడ్డి పరాక్రమములవల్ల సాధింపబడినవే. ఈ సందర్భములో కాటయవేమునకును అల్లాడరెడ్డికిని అన్యోన్యమైత్రి ఏర్పడెను. కాటయవేమారెడ్డి కూతురు అనితల్లిని వీరభద్రారెడ్డికి ఇచ్చి వివాహము చేసియుండిరి. దీనిలో వీరలమైత్రి దృఢమాయెను. కాటయవేముడు కొమరగిరివద్ద రాజమహేంద్రరాజ్యమును గ్రహించి వీరలసహాయముతో పాలించుచుండెను.

అని తల్లికలువచేరు శాసనము బయలుపడువరకును అల్లాడరెడ్డి రాజమహేంద్రరాజ్యాధిపతియని చరిత్రకారులు భావించుచుండిరి. దీనికి శ్రీనాథుడు భీమఖండములోని "తత్సంబంధ బాంధవంబున............అల్లాడ భూవల్లభుండు రాజమహేంద్రంబు రాజధానిగా............భువనమండలంబు పరిపాలించె" ననువాక్యము అతిశయోక్తి. నిజముకాదు. అల్లాడరెడ్డి ఎప్పుడును రాజుకాదు. రాజమహేంద్రరాజ్యము స్వతంత్రము కాగానే కాటయవేముడు ప్రథమప్రభువు. అతడు చనిపోయినతర్వాత అతనికుమారుడు కుమారగిరి రాజయ్యెను. కాని అతడు కొలదికాలములోనే చనిపోయెను. అప్పుడు దేశము "కన్నృపతి జలరాశి నిమగ్నము" కాగా అల్లాడరెడ్డి రాజ్యమునుద్ధరించి

వేమాత్మజ అనితల్లికి పట్టముగట్టెను. అంతటినుంచి రాజమహేంద్రిరాజ్యావసానము వరకును అనితల్లియే రాణిగా దేశము పాలించెను. ఇది ఈ క్రింది కలువచేరుశాసనము లోని శ్లోకమువల్ల స్పష్టము.

“వినత నరపాల పాలీకన ముకుమాళి ప్రగుదిత గంధ పదాబ్జా
అనితల్లీ పతిదైవా ఘనసచివీభూత భావుకో భువమవతి

దీనితాత్పర్యమేమనగా,

అనితల్లిరాజ్యపాలనములో భావగారు మంత్రియునియును, పతి దైవమనియును. ఇదియే నిజము. వేమావీరభద్రారెడ్లు రాజ్యము చేసినట్లు వ్రాయువ్రాతలు స్తుతివాక్యములు.

## అల్లాడరెడ్డి విజయములు.

అనవేమారెడ్డి ఒడ్డాదిమత్స్యవంశరాజ్యమును జయించుటకు చెన్నమనాయుని దండనాయకాగ్రణిగా నియమించి అల్లాడరెడ్డి నాతనికి సహాయముగా పంపెను. అప్పటి మత్స్యవంశపురాజు వీరార్జునుడు కళింగ గజపతుల సామంతుడు. పరాక్రమవంతుడు. ఈతని జయించుటలో అల్లాడరెడ్డి తన పరాక్రమముచూపి ప్రసిద్ధిగాంచెను. శ్రీనాథుడు కాశీఖండములో ఈ విజయమును ఇట్లు ప్రశంసించినాడు.

జయధాటీ సమయంబునన్ విలయ జంఝామారుతాడంబర
స్మయహారి ప్రవిజృంభమాణ ఘననిస్సాణాగ్ర ఫేరీస్వనం
బయి యొడ్డాది భయంకరోడ్డమర శౌర్యంబైన శ్రీరెడ్డి దొ
డ్డయల్లాడ నృపాలువాలునకు బిట్టల్లాడుదిక్చక్రముల్.

అల్లాడరెడ్డి ఈ యొడ్డాది జయము అనేకతావుల వర్ణింపబడినది.

భీమఖండములో ఈసంగతియే .

“ఒడ్డాది మత్స్యవంశో దయార్జును చేతఁ బల్లవోద్భవుచేత జలచమంది”— అనివర్ణింప బడినది. ఈతడు కళింగదేశములో రఘూదు, సప్తమాడెములు, వంతురాజులను, అంపయనెకి పాకొండలోని గిరిదుర్గమును పాలించుచున్న నాగరాజులను కూడ జయించెను. కాని ఈ రాజ్యములు రెడ్డిరాజ్యాంతర్గతము అనవేముని కాలమునాకు కాలేదు. కుమారగిరి యనంతరము పెదకోమటివేముడు రాజమహేంద్రి రాజ్యముపై

దండెత్తినపుడు రామేశ్వరమువద్ద అతని నెదుర్కొని, అల్లాడ రెడ్డి ఓడించెను. ఓటమితో పెదకోమటి హతాశుడై తిరుగ రాజమహేంద్రి రాజ్యమును కన్నెత్తియైనను చూడ లేదు—

అల్లాడరెడ్డి రాజ్యతంత్రములో చాల నిపుణుడు. అప్పటికి బలవంతులుగానున్న యవన, కర్ణాట, కటక భూధవులతో అతడు చెలిమి వాటించి తననాయకత్వము క్రిందనున్న రాజ్యమును నిలిపి వృద్ధి నొందించెను. పెదకోమటి వేముడు రాజమహేంద్ర రాజ్యముపై దండెత్తినపుడు కళింగగజపతిని రాజమహేంద్రి రాజ్యమును తూర్పునుండి దండెత్తుటకు ప్రోత్సహించి పంపియుండెను. కాని అల్లాడరెడ్డి రాజనీతి నైపుణ్యముచే ఆ గజపతితో సంధి గావించుకొని పంపివేసెను. ఈ విషయము కోరుమిల్లి శాసనములో "మైత్రీకృత్య సమాగతం గజపతిం" అని వర్ణింపబడినది. లింగనామాత్యుని వర్ణించుచు శ్రీనాథుడు—

"యవన కర్ణాట కటక భూధవులతోడ చెలిమి
వాటించి యేలించె దెలుగుభూమి,
దననిజస్వామి నల్లాడ ధరణినాథు భళిరె
యరియేటి లింగన ప్రభువరుండు"—

జ్ఞానప్రసూన మాలికలో ప్రచురింపబడిన భీమేశ్వర పురాణములో, పైపద్యములో చెలిమియని యుండవలసిన చోట బలిమి అని తప్పుగా పడినది.

అల్లాడరెడ్డివంశ్యులు సినాకినీనదీతీరస్థ దువ్వూరిగ్రామవాసులు. ఈ దువ్వూరు నెల్లూరిజిల్లాలోనిది. కొండవీటిపంటరెడ్ల పంటకూడ నెల్లూరిజిల్లాలోనిగ్రామమే. భీమఖండములో శ్రీనాథుడు శివలీలావిలాసములో నిశ్శంకకొమ్మనామాత్యుడును, వీరిని దేసటులుగా వర్ణించినారు. ఈ దేసటిశబ్దవిచారణ నేను వేరొకవ్యాసములో విపులముగా వర్ణించినాను. ఈ దేసటి ఉద్యోగవాచకము. వీరిగోత్రము. పోల్వాలిగోత్రమని కొమ్ముచిక్కాలవలనశాసనములో నున్నది.

"ప్రోలాధిపోభూత్, ప్రథనేషుశూరః పోల్వాలిగోత్రార్ణవ పూర్ణచంద్రః"
తత్రాసీన్మహితో మహీప తిలకో పతాయున్నతః త్యాగీ।
దొడ్డమహీపతిః సకృతవాన్ పోల్వాల గోత్రాగ్రణీః॥

Ep. Ind XIII—P. 241.

కొండవీటిరెడ్లగోత్రము పెల్లచేరుగోత్రము అనవేమునిగోత్రము పెల్లచేరుగోత్రమని శ్రీశైల వీరశిరోమండపశాసనములో కలదు. — (No. 20 Ann. Rep. for Epi. for 1915).

అల్లాడరెడ్డి వంశకర్త కోటయ్య. ఆతని కుమారుడు పెరుమాండిరెడ్డి. ఈతనికి ఐదుగురు కుమాళ్లు:—అల్లాడరెడ్డి—పోలారెడ్డి — పెదకోటారెడ్డి— దొడ్డారెడ్డి — చినకోటారెడ్డి. అందు దొడ్డారెడ్డి చెన్నాంబికలకు, పోలారెడ్డి, కోటారెడ్డి, అల్లాడరెడ్డి అనువారలు కుమాళ్లు. ఇందులోని పోలారెడ్డికి కొమరగిరిరెడ్డి అనపోతారెడ్డి అను కుమాళ్లు. వీరు వానారసీమను పాలించుచుండిరి.

అల్లాడరెడ్డి కొండవీటిరెడ్లకు బంధువు. అనవేమారెడ్డి పౌత్రి వేమాంబిక నీతడు పెండ్లియాడెను.

అనవేమక్షితిపాలు పౌత్రియగు వేమాంబా మహాదేవికిన్
ఘనుడయ్యల్లడ భూమిపాలునకు సంగ్రామస్థలీగాండివుల్, -

అనవేమునికొడుకెవ్వరో తెలియదు. శ్రీ వీరభద్రరావుగారు (ఆం॥ చ॥ 3—263) "ఈ పైపద్యమందలి పౌత్రియను శబ్దమునకు దౌహిత్రి (కుమార్త్యాః పుత్రి) యని యర్థము గ్రహింపవలయును" అని వ్రాసినారు. (శృం॥ శ్రీ॥ పుట 290) శివలీలావిలాసములో అవతారికలో అల్లారెడ్డిభార్య వేమాంబికయనియును "చోళ భక్తీశ్వర సూనుడగు భీమలింగరాజు'' కూతురనియును కలదు.

"భరిత శ్రీనిధియై మహీరమణు డొప్పన్ జోళభక్తి క్షితీ
శ్వర సూనుండగు భీమలింగ మనుజేంద్రశ్రేష్ఠు సత్పుత్రి భా
స్వర కారుణ్య దశాజనావన విధాసంధాత్రి వేమాంబికన్
వరియించెన్ జతిభక్తి గౌరవ దృఢ వ్యాపారరీత్యంబికన్.

కా—1—32.

పై చుట్టరికమును సందేహించుటకు వీలులేదు. చోడభక్తీశ్వరునకు భీమలింగమనియున్ను, అనదేవుడనియును ఇర్వురు కుమాళ్లున్నట్లు భావించవలసియున్నది. అనదేవుని రాజమహేంద్రవరశాసనములో ఈ యూహను బలపరచుసంగతులేవియును కానరావు. కాని యిట్టిసంబంధబాంధవ్యములానాడు కలవు. అల్లాడరెడ్డి పెద్దకుమారుడు వీరారెడ్డి భార్య హంరాంబ. ఆమె కాటయవేముని పౌత్రియనియును, కాటారెడ్డికూతురనియును, హరిహరరాయల దౌహిత్రియనియును కోరుమిల్లి శాసనములోనే కలదు. దీనినిబట్టి కాటయవేమునికుమారుడు కాటయకు హరిహరరాయల కూతురునిచ్చి వివాహము చేసినట్లు తోచుచున్నది. ప్రభాకరశాస్త్రిగారు పౌత్రీం కాటయవేమ యేత్యాదిశ్లోకములో,

"పుత్రీం కాటయవేమయ క్షితిపతేః అనియును పౌత్రీంచ కాటప్రభోః అనియును ఉండవలెననియును, అది శాసనోత్కీర్ణకుని తప్పనియును, వ్రాసినారు. (శృం॥ శా॥ పుటలు—286—287). ఈ యూహ సరియైనదని మా అభిప్రాయము. కాటయ వేమునకు కాటయయను కుమారు డున్నట్లు ఇతర ఆధారములు లభించి యుండలేదు. కుమారగిరియను ఒకే కొడుకు కలడు. అతడు చనిపోవుటచేతనే రాజమహేంద్రిరాజ్యము అతనితల్లికి సంక్రమించినది. ఈనాడు ఈ దేసటి రెడ్లు క్షత్రియులుగ పరిగణింపబడినట్లు స్పష్టము. అందుచేతనే నిశ్శంకకొమ్మన"

వరకమలాప్తవంశమున గాంచి యహోభువమార్గణా ।
దరమునమించి శాంభవ కథా పరణిస్మదినుబ్బి యుల్లవ
ద్భరతమత ప్రవర్తన ముతంబు వహించి తనర్తు రింపుసాం
పరుడుగ రామభద్రుడును నల్ల నృపాలక వీరభద్రుడున్॥

ఇది పరియైనవే యనుటకు శాసనాధారమునుకలదు. కొరుమిల్లిశాసనములో Ep. XIII. 241 to 259 లో

......రాజ్యం రాజమహేంద్రి రాజ్యమకరో కల్లాడభూమీశ్వరః
శచీవల్లభస్య శివేవశంభోః పద్మేవసా పద్మవిలోచనస్య
వేమాంబికా చోడకులేందు భీమభూపాత్మజా భూన్మహితాస్యజాయా
శ్రీవేమ భూమీశ వీరభద్రభూనాథ దొడ్డక్షితిపాన్నభూపాః
అల్లాడశౌరేరభవన్ కుమారాస్తస్యాం యథాపంక్తి రథస్యపుత్రాః"

వీనిబట్టి సందేహమునకు తావులేదు. అనవేమారెడ్డి తన కూతును చోడభక్తి రాజున కిచ్చి పెండ్లిచేసెను. ఈ చోడభక్తిరాజు సుప్రసిద్ధుడు. మహా పరాక్రమశాలి. మహా శైవభక్తుడు. అనదేవచోడునితండ్రి. ఈ చోడులు క్షత్రియులుగా పరిగణింపబడిన వారు. రెడ్లు చతుర్థవంశజులనియే శ్రీనాథాదులచే వర్ణింపబడినారు. శ్రీనాథుడు కాశీ ఖండములో వేమారెడ్డి ఈశ్వరార్చనము చేయు నవసరము వర్ణించుచు, అతడు అఘ మర్షణస్నాన మాచరించెననియును, మూలమంత్రాక్షరములతోడి మంత్రించిన భూతి ధరించుననియును, 'ప్రాసాదపంచాక్షరీ'యుక్తపూజనము సల్పుననియును వ్రాసినాడు. వీనినిబట్టి వీరు క్షత్రియులుగా భావింపబడుచున్నట్లు ద్యోతపడుచున్నది. కాని శ్రీనాథా దులు కంఠోక్తిగా వీరు చతుర్థ్వ కులజులని చెప్పియున్నారు. ఈ యుభయాభిప్రాయ ములను సమర్థించుట చాల కష్టము. కాని ఈ రెడ్లు క్షత్రియజాతిచ్యుతులైన శూద్ర

లుగా భావింపబడినట్లు స్పష్టము. వీరిలో కొందరు యజ్ఞోపవీతమును ధరించుచున్నటుల తోచుచున్నది. క్షత్రియధర్మమైన ప్రజాపాలనాదికమును సమర్థతతో నిర్వహించినారు. దుష్టశిక్షణమును శిష్టరక్షణమును చేసినారు. అవైదికములును, పరదేశ సముద్భూతములు నగు మతములనుండి హిందూమతమును రక్షించి పునరుద్ధరించినారు. అట్టి వీరి కంటె క్షత్రియులెవ్వరు?

## అల్లాడరెడ్డి వేమారెడ్డి

అల్లాడరెడ్డి పెద్దకుమారుడు వేమారెడ్డి మహాపరాక్రమవంతుడు. వీరత్వమునకు నితడు అల్లాడరెడ్డి కొమాళ్లలో మేటి. ఈతని సహాయముననే రాజమహేంద్ర రెడ్డి రాజ్యము విస్తరించెను. ఈతడే అతని తల్లికి సహాయకుడుగనుండి, రాజ్యమును శత్రువుల నుండి కాపాడెను. ఈతడే వీరభద్రారెడ్డిని ప్రేరేపించి, శ్రీనాథునిచే కాశీఖండము తెలుగు చేయించెను. ఈతని విజయములనిట్లు శ్రీనాథుడు పేర్కొన్నాడు.

కొని యెంగంచుకముల్ సముద్భటవటద్ఘోటీభటప్రౌఢి గ్గై
కొనియెన్వేడుక జీడికోట యహిమాంశుక్షోణిసుతల్లాడజే
కొని యెన్మార్కవరంబు వీకమదవద్ఘోరారి సంహారియై
ఘనుడల్లాడ మహీశువేమన నిరాఘాటైక ధాటీగతిన్॥

సప్తమాడియమారాయ చంద్రబింబాననా చికురవల్లరులపై జిన్నిపువ్వు
ఝూంపె జంతుర్నాటి జననాథశుద్ధాంత కుచకుంభములమీఁది కుంకుమంబు
బారహాదొంతి భూపాల లీలావతీ గండస్థలంబుల గలికినవ్వు
కలువపల్లొడ్డాది కటకాధిపతి వధూసీమంత వీధుల జేరుచుక్క —

వీరభద్రారెడ్డినిగూర్చి వ్రాయుచు—

ప్రాకట విక్రమస్ఫురణ రాజమహేంద్రము రాజధానిగా
నేకసితాతపత్రమున నేలెను వీరనృపాలుడుత్తమ
శ్లోకుడు వేమశౌరియనుజుండు సమున్నతవైభవాఢ్యుడై
చీకటియున్ గళింగయును జల్కసముద్రము సింహశైలమున్.

అని రాజ్యవిస్తారమును చెప్పినాడు.

ఆశ్వాసాంత పద్యములలో వీరభద్రుడు

కసిమికోట వెంకటాయి కప్పకొండ కిల్లెదాది
విరోధిరాజుల హాలహాలమనియును, ధారాపట్టణ సార్వభౌమ
సురథాణ్ద్రోపహారితుడనియును స్తుతింపబడెను.

వీరిరాజ్యము ప్రస్తుతపు తూర్పుపశ్చిమ గోదావరి జిల్లాలుగల ప్రదేశమంతపైనయును స్థిరముగా నాటుకొనియుండెను. వీరిపాలనము ప్రజారంజకముగ నుండెను.

## వేమ వీరభద్రారెడ్లు—లింగానాయుడు.

లింగమనాయునికిని పెదకోమటి వేమారెడ్డికిని జరిగినయుద్ధములు ఇదివరలో కొండవీటిరెడ్ల చరిత్రములో వర్ణింపబడినవి. లింగమనాయుడు పెదకోమటి వేమారెడ్డిని జయించి, రాజమహేంద్రవర రాజ్యముపై దండెత్తెను. ఈ ధాటిలో వేమ వీరభద్రారెడ్లు ఓడిపోయి సంధి గావించుకొనిరి. వెలుగోటివారి వంశావళిలోని పద్యములలో లింగానాయని ఈవిజయము ప్రశంసించ బడియున్నది. (వెలుగోటివారి వంశావళి-మద్రాసు యూనివర్సిటీ ప్రచురణము-పుటలు 41-42) ఈ పరాజయముతో వేమ వీరభద్రారెడ్లు బలహీనులైరి. ఒకప్రక్క ఒడ్డెరాజులను, మరియొకప్రక్క విజయనగర రాజులును విజిగీషువులై, వీరి రాజ్యముపై ఒత్తుకొని వచ్చుచుండిరి. కొండవీటిరాజ్యము నాశనమై పోగానే రాజమహేంద్రి రెడ్డిరాజ్యము నిలుచుటకు అవకాశము ఆనాటి రాజకీయ పరిస్థితిలో లేకపోయెను. క్రీ. శ. 1444 సంవత్సరమునకు పూర్వమే విజయనగరాధీశుడగు ప్రౌఢదేవరాయులు రాజమహేంద్రవర రాజ్యముపై దండెత్తి వేమ వీరభద్రారెడ్లను జయించెను. వేమవీరభద్రారెడ్లీ యుద్ధములో నిహతులైయుందురు. అంతతో ఈరెడ్డి రాజ్యము అంతమాయెను. ద్రాక్షారామ భీమేశ్వర దేవాలయములోని ఒకశాసనములో (S. I. I. IV-no. 1375) ప్రౌఢరాయలు రాజమహేంద్రవర రాజ్యాధిపతియని చెప్పబడినది. రాజమహేంద్రవర రాజ్యము ప్రౌఢదేవరాయల పాలనములో నిలువ లేదు. కొలది సంవత్సరములలో కపిలేశ్వర గజపతి ఈరాజ్యమును జయించి ఒడ్డిరాజ్యములో కలుపుకొని సుస్థిరముగా పాలించునట్లు శాసనములు చాటుచున్నవి.

వడ్డాది అప్పారావు.

# రెడ్ల పుట్టుక

౧

రాష్ట్రకూట వంశోద్భవుల్ ♦ రడ్డులంచు
రూఢిపఱచుచు హంపిలో ♦ ప్రోలిరెడ్డి
వ్రాసినొక శాసనంబల్లె ♦ పల్వురనిరి
రవికులోత్పన్నులని మన ర ♦ డ్డివరుల.

౨

మాన్యక్షేత్రంబుఁ జాలించి ♦ మహితకీర్తిఁ
గొన్నరాష్ట్రకూట్వంశజు ♦ లన్న నెవరు?
రవికులాంతర్గతంబునై ♦ రాణ జెందు
చంద్రవంశాన్వయులునగు ♦ సాత్యకేయు
లంచు నుడివెడి శాసనా ♦ ద్యఖిలకృతులు.

౩

పదినైదు శతాబ్దపు ♦ ప్రముఖులందు
నాగిరెడ్డియు వేమభూ ♦ నాథుఁడొకఁడు
దాము రవివంశజులమని ♦ దానశాస
నములు లిఖించి రవి ప్రమా ♦ ణములు గావె?

౪

ఇంకఁ బ్రాచీనులగు వార ♦ లిట్లె వ్రాసి
రవియు దార్కాణములుగాగ ♦ నలరుచుండు,
మన్మకుల్ల వంశజుండని మారసాని
కేతిరెడ్డి శాసనము బ ♦ ల్కెడినిసూవె?

౫

సూతసంహితఁ గూర్చిన ♦ జేత సోమ
నాథుఁ డధ్యాత్మరామాయ ♦ ణమురచించె
ఘనుఁడు కాణాదపెద్దన ♦ కవివరుండు
రవికుల వంశ్యులందు ♦ రడ్డివరుల.

౬

సూర్యవంశజుఁడగు భీమ ♦ చోడపుత్రి
వేమయల్లాడరెడ్డిని ♦ బెండ్లియాడె
చంద్రవంశ్యహరిహరు పుత్రి ♦ చారుగాత్రి
కాటరెడ్డిని జేపట్టె ♦ గాదె యిట్లు
లేన్ను ధృవపఱచెడి రెడ్ల ♦ యినకులంబు.

౭

హరిహరుని మన్మరాలగు ♦ హరిహరాంబ
కాటరెడ్డికి బుట్టిన ♦ కన్నెమిన్న
దనరె యల్లాడభూపతి ♦ తనయుఁడైన
వేమభూపాలు భర్తగా ♦ స్వీకరించి.

౮

అన వేమరెడ్డి భూపతి
తనయయు బెండ్లాడె చోడ ♦ ధాత్రిశు భ
ఘనిపుత్రి భీమ చోడుని
నినకుల సంజాతు నిట్టె ♦ వెన్నగలిగెనో.

౯

అయిన శ్రీనాథ సుకవీంద్రుఁ ♦ డలఘు కాః
ములను హరిపాదజులుగాగ ♦ ముచ్చటించె
మతవిభేదము లందిన ♦ మహిత కులము
నెఱుఁగడేమొ పూర్వాపర ♦ చరితలతఁడు.

౧౦

దేశకాలానుగుణ్యులై ♦ తేజరిల్లి
తుదకు వాఖోపశాఖలై ♦ చెదరి రెడ్లు
పంట, రేనాటి, మోటాటి ♦ పాకనాటి
మొరస, మోథ్యాదీ నామములై ♦ వరలిరిలః

౧౧

పల్లవాదిత్య నామాది ♦ పలుబిరుదులు
రడ్డిప్రభువులు ధరియించు ♦ రీతిఁజూడ
నాదిపల్లవ నరపతు ♦ లైనవారి
తోడ బంధుత్వములుగల్గు ♦ జాడదెలియు.

—♦ కొండవీటి రెడ్డి ప్రభువులు ♦—

౧

పదునాల్గు శతాబ్దంబున
సదమల రత్నఖని నాంధ్ర ♦ క్ష్మాతలమెల్లన్
విదిత యశోభవుండయి
ముదమున వీరప్రతాప ♦ భూపుండేలెన్.

౨

ముష్కర తురుష్కదాసులు ♦ ముమ్మరముగ
నమ్మహారాజు సీమల ♦ నాక్రమింప
ధంచి తండోప తండాల ♦ ముంచిపడఁగఁ
ఘోరులతి భీకరంబుగఁ ♦ బుడమిఁ గలఁగె.

౩

అభయంకర రణముల ♦ నాంధ్రవీరు
లెంతగా శౌర్యముంజూపి సేపుఁగొన్న
దుదకు నేకశిలాపురి ♦ తురకప్రభుల
కైవసంబయ్యె నేమందుఁ ♦ గాలమహిమ.

౪

ప్రాపయి హిందువు లెల్లరు
కాపయ నాయకునిగూడి ♦ కఱకుతురకలన్
రాపాడి యోరుగల్లున
స్థాపించిరి రాజధాని ♦ చతురత మెఱయన్.

౫

అచటిమేటి చమూపతు ♦ లల్లనల్ల
నన్నిజాభ్యుదయమ్మున ♦ కానబడిరి
రాచకొండకు వెల్మవీ ♦ రవరులరిగి
తమదు రాజ్యాభివృద్ధికై ♦ శ్రమలఁబడిరి.

౬

అల్లెదేసటి పోలయ ♦ యనువిభుండు
పంటరెడ్డి కులేంద్రుఁడు ప్రాభవమున
నొక్కసైన్యాధిపతిగాఁగ ♦ నొప్పియుంట
నతని సుతుఁడగు వేమయ ♦ యశయమున
సైన్యములఁద్రిప్పి, దాటికృ ♦ ష్ణాస్రవంతి
పూంగినాఁడాక్రమించెనా ♦ పుణ్యమేమొ.

౭

అచటి హిందూ సురత్రాణు ♦ ననుసరించి
ధరణికోటను బాలింప ♦ తమ్ముమల్ల
ధాత్రిపుని నియమించియు ♦ ద్దామశక్తి
రాజ్యమును విస్తరించెన ♦ నాతిచయము
భయము దక్క ప్రతాపంబు ♦ బైటబడఁగ.

౮

—♦ దేసటి వేమారెడ్డి ♦—

తన రాజధాని నద్దంకిగా నొనరించి
పూంగినాఁడేలెనే ♦ పుణ్యమూర్తి
శ్రీశైల సామీప్య ♦ కృష్ణా స్రవంతికిఁ
జిత్రసోపానముల్ ♦ జెలఁగఁజేసె
నట్టు లహోబలు ♦ నాలయంబునగూడ
నిర్మించె నెవ్వాఁడు ♦ ధార్మికుఁడయి
అమరేశ్వరస్వామి ♦ కతిభక్తి నర్పించె
బంగరు కలశముల్ ♦ రంగుమీర
హరివంశ రామాయ ♦ ణాది కావ్యంబుల
గృతినొంది శాశ్వత ♦ కీర్తిఁబడసె
గీ. నగ్రహారంబులుగఁజేసి ♦ యూతుకూరు
బ్రీతి మంచాలఁ వలివేరు ♦ పెదవలియును

బ్రాహ్మణోత్తముల కొసంగె ♦ భక్తిమీరఁ
బ్రాతనల్లిల్లు లన్నిఁటి ♦ వరుసనిలిపె
దురకరాజులు హరియింపఁ దోలివారు.

౯

రామామాత్యుఁడు మల్లినాథుఁడును మం
త్రాంగంబులన్ మేటులై
భూమిభారం గడు నేర్పుమై నడుపఁగాఁ
బెల్సారె రాజ్యంబునం
దేమేమో ఘనదాన ధర్మవ్రతముల్
హేమాద్రిఖండంబునం
దామోదించినరీతి సల్పె సితిఁడా
యారీశులన్ భక్తిచే.

౧౦

తనదు దాస్థాన కవిశంభు ♦ దానుజేసి
యాంధ్రభాష నెక్కుఁడు శ్రద్ధ ♦ నాదరించి
శాస్త్రవిదులను బోషించి ♦ శత్రుకోటిఁ
బారద్రోలె దేసటివేమ ♦ పార్థివుండు
ప్రోలిరెడ్డి సుతుండు నా ♦ పూంగినాట.

౧౧

అడిగినట్టి వారి ♦ కమిత భూదానమ్ము
లొసఁగుచుండి సీమ ♦ నిద్ధకీర్తి
వరలిదాల్చెనితఁడ ♦ పరిమితభూదాన
పరశురామ బిరుదు ♦ ప్రాభవమున.

౧౨

చెరువులును బావులెన్నో స ♦ చ్చెరువుగాఁగ
సీమలో నిర్మితముజేసి ♦ సీమమెప్ప
నచ్చటచ్చట జలివేంద్ర ♦ లాదినిల్పి
ప్రజల సౌఖ్యాభి వృద్ధికై ♦ పాటుపడితె.

౧౩

అనుజులగు మల్లరెడ్డియు ♦ నన్నరెడ్డి
కొమరుఁడన పోతరెడ్డియు ♦ గూర్చుబావ
మఱఁది నూకయరెడ్డి లో ♦ బఱుప నరుల
వేమభూపాలు పాలన ♦ విస్తరిల్లె.

౧౪

అనపోత నాయఁడాతని
యనుజుడు. మాధవునిగూడి ♦ యనిఁదారసిలన్
ఘనముగను ధరణికోటం
జెనకుచు బారంగద్రోలె ♦ సింహ సదృశుఁడై.

౧౫

కటకభూపాలుఁడైనట్టి ♦ గజపతీంద్రుఁ
డిట్టు లొకమారు దండెత్తి ♦ యితనిరాజ్య
మపహరింపఁ దలంపఁగా ♦ నమితశౌర్య
సాహసంబున నోడించి ♦ సాగనంపె.

౧౬

పరమపూజ్యాంధ్రలోక త ♦ పఃఫలంబు
సీమ నివసించు విబుధాళీ ♦ నోముపంట
కాపుజన సంఘమునకును ♦ గల్పతరువు
నాగనీపంట కులమహీ ♦ నాథుఁడొప్పె.

౧౭

పంచవింశతి వత్సరాల్ ♦ ప్రాభవమున
జగదభీష్టంగా భువి ♦ సాకి యతఁడు
స్వర్గధామంబు జొరగ వి ♦ శ్రాంతిఁగోరి
రాజ్యలక్ష్మి వరించెనా ♦ రాజసుతుని
పూజ్యపతి యగు నా ♦ యనపోతనృపతి.

—♦ అనపోతారెడ్డి ♦—

౧౮

మణికేశ్వరమునను ♦ భూపతికి నొసంగె
నారామ భూముల ♦ త్యంతభక్తి

శ్రీగిరి లింగంబు ♦ శ్రీమల్లినాథ లిం
గంబుల నిర్మించి ♦ ఖ్యాతినొందె
ముకుళపురిన్ క్షణ ♦ ముగ నున్న పరదేశ
వ్యాపార సుంకముల్ వదలివైచె
రణమునకై వచ్చు ♦ ననపోత మాదయ
లను వెల్మవీరుల ♦ వెనుకకంపె
దన రాజధాని న ♦ ద్దంకినిఁ దొలఁగించి
కొండవీడున నెల ♦ కొల్పినాఁడు.

గీ. కాటరెడ్డయు నల్ల నూ ♦ కయ్యరెడ్డి
భావుకులు దమ్ముఁడౌన వేమ ♦ పార్థివుండు
రాజ్యమును వి స్తరింప ద ♦ ర్పంబు బూని
పుడమి బాలించె నాయన ♦ పోతనృపతి.

౧౯

ఒక్క సూర్యోపరాగాన ♦ నుత్సుకతను
పోతభూపతి కోడూరు ♦ పురవరంబు
బ్రాహ్మణులకు నల్లిల్లుగా ♦ బంచి యొసఁగె
వివిధ దేశాల తనకీర్తి ♦ విస్తరింప.

౨౦

ద్వాదశ షష్టాబ్దము లీ
మేదిని బాలనమొనర్చి ♦ మేటినృపాలుం
డాదర్శ భూవరుండని
మోదంబున జనులు బొగడ ♦ బుణ్యుం డొప్పెన్.

౨౧

అనపోతరెడ్డి వర్యుఁడు
జనినన్ స్వర్లోకమునకు ♦ శాశ్వతముగ నా
యనుజన్ములలో నొకఁడగు
ననవేమ నృపాలుఁడంత ♦ నధిపతి యయ్యెన్.

## ♦ అనవేమారెడ్డి ♦

౨౨

హేమాద్రి దానచిం ♦ తామణి రీతుల
వ్రత దాన ధర్మముల్ ♦ వరుసనలిపె
దనతండ్రి సోదరుల్ ♦ దారిజూపఁగ బ్రాహ్మ
ణాగ్రహారంబుల ♦ నచ్చటచట
మన్యమాపురము ని ♦ మ్మడిలంక, కొల్లూరు
పెదచెరుకూరులఁ ♦ బ్రీతినిచ్చె
మామిడి పెద్దనా ♦ మాత్యుండు మంత్రిగా
జేరికొల్వఁగ యశ ♦ శ్రీలఁగాంచె
రాజమహేంద్ర పు ♦ రంబును నిరవద్య
పుర్యాది దుర్గముల్ ♦ పోరఁగూల్చె

గీ. సింహపురిదాక రాజ్యంబు ♦ జేర్చి యేలె
వెలమనృపతుల దేశంబు ♦ వీకఁ జొచ్చె
వాడపలి ప్రాంతమునదన ♦ ప్రతిభఁజూపి
విమల సత్కీర్తిపరుఁడైన ♦ వేమనృపతి.

౨౩

వేనవేలు సువర్ణముల్ ♦ విరివిగాఁగ
సంస్కృత కవీంద్రులకు వెద ♦ జల్లినాఁడు
ప్రాక్సముద్రాధిపతియయి ♦ వణిజ వరుల
దేశవాణిజ్య సంపదల్ ♦ దీర్చి దిద్దె
ధీమహితుఁడగు నాయన ♦ వేమవిభుఁడు.

౨౪

ముల్లఁ గూరమ్మ దేవతన్ ♦ మోదమలర
నిలిపి పడిదర గ్రామంబు ♦ పలకలూరు
ముల్లగూరునొసంగెనా ♦ భోగములకు
దేవతాభక్తిమెజగ ♦ ద్ధితముగాఁగ.

౨౫

సరస సంగీతసాహిత్య ♦ చతురవచన
వివిధకళలాది బేర్గొన్న ♦ వేశ్యలకును
భూరి దేవాలయములకు ♦ పొలుపుమీర
సర్వమాన్యంబులిచ్చియ ♦ శంబుగాంచె
వివిధసీమల నాయన ♦ వేమనృపుఁడు.

౨౬

అష్టాదశవత్సరములు
విష్టపముననేలుచుండ్రి ♦ విష్టపతుల్యన్
గష్టసుఖంబులఁగాచెను
శిష్టజనోద్ధరణ సల్పి ♦ చిరకీర్తినుఁడై.

౨౭

మ్లేచ్ఛరథము రాజ్యకాంక్షయు ♦ బెచ్చుపెరిగి
వెలమరెడ్డి నృపాలుర ♦ చలముహెచ్చె
నంతబవరములెన్నియో ♦ యాంధ్రభూమి
గల్లె జయమెవ్వారికిగాని ♦ గానబడక.

౨౮

పిన వేదగిరి నృపాలుని
ననిలోఁ దగఁ బార్చిపేచ్చి ♦ యనవేముండున్
ఘనసింహతలాటబిరుదు
గొనియెన్ దన వైరివరుల ♦ గుండెలవియఁగన్.

౨౯

ఇట్టి రణరంగములమధ్య ♦ నేపుమీరి
వెలమ నృపతులతోఁ బోరి ♦ భీకరముగ
గడకు సింగయయనపోత ♦ కాంతువలన
నాజిలో వీరస్వర్గంబు ♦ నందెనితఁడు.

30

ఇమ్మహీనాథుఁడిటుల స్త ♦ మించినంత
కొమరగిరి యనపోతని ♦ గూర్మిసుతుఁడు
రాజ్యభారంబుబూనెన ♦ రాతులెల్ల
నతనితో మైత్రి సలిపిరి ♦ చతురుఁడంచు.

31

♦ కుమారగిరిరెడ్డి ♦

సంస్కృతభాషావి శారదత వసంత
రాజీయనాట్యశా ♦ స్త్రమురచించె
వింతగాసలిపి వ ♦ సంతోత్సవములవ
సంతరాజనుపేరు జగతిఁగాంచె
కొమరుఁడంకస్థలిఁ ♦ గూర్చుండ ఘనతులా
పురుష దానంబుల ♦ బూన్కిసలిపె
అవచితిప్పయశెట్టి ♦ యఖిలద్వీపంబుల
వస్తువుల్ దేగనై ♦ భవతఁగొనియె
గీ. నాల్గుచెఱఁగుల రాజ్యాధి ♦ నాథులెల్ల
దనకుహితులుగ నుండఁగా ♦ ధరణినేల
వినయవిద్యావివేకసం ♦ జనితకవికు
మారగిరిరెడ్డి భూపతి ♦ మహితయశుఁ

32

ఆపదోద్ధారకుండునా ♦ నధికదాన
ధర్మగుణశాలిగానొప్పి ♦ తండ్రిఁబోలి
భోగదేవేంద్రుఁడని ప్రజల్ ♦ బొగడుచుండ
కొమరగిరి పదునేడేండ్లు ♦ సమతనేలె.

33

చీనిచీనాంబరాల్ గంధ ♦ సింధురమ్ము
పరిమళించెడి కర్పూర ♦ పాదపములు
ఘుమ ఘుమాయించుచుండ సం ♦ కుమదభద్ర
నాణెముత్యాల సరులును ♦ హారులు కరులు
దేశదేశాలదెప్పించి ♦ తేజరిల్లె.

34

నీమమొప్పారగాటయ ♦ వేమనృపతి
విపులరాజ్యంబు రక్షించు ♦ వీరవరుఁడు
తోడునీడయి యుండనే ♦ కీడులేక
శాంతియుతమగుపాలన ♦ జరపెనితఁడు.

35

తనదు ప్రతినిధిగాఁజేసి ♦ దనయునుంగు
సుతుని వీరాన్నపోతభూ ♦ పతినిరాణ్మ

హేంద్రపురినిల్పి రాజ్యంబు ♦ నేలినాఁడు
దర్పమునగొండవీటి నీ ♦ ధాత్రిపుండు.

౩౬

వీరాన్నపోతవర్యకు
మారుఁడు దనముందెయెట్లో ♦ మరణింపగన్
ఆరాజమంద్రి రాజ్యము
నేరుపుమైకాటవేమ ♦ నృపతికొసంగెన్.

౩౭

పెంచిపెద్దఁజేసి ♦ వృద్ధికిదెచ్చిన
పుత్రమరణమునకు ♦ బొగిలిపొగిలి
కొమరగిరియు దనదు ♦ కొండవీటిరాజ్యంబు
వారసులకు నదలి ♦ పరముజెందె.

౩౮

వంశముఖ్యుఁడు పెదవేమ ♦ పార్థివుండు
కొండవీఁడాక్రమింపఁగా ♦ గోరెనంత
కాటవేముఁఎదిర్చి సం ♦ గరములెన్నొ
సల్పిననురాజ్యలక్ష్మివ ♦ శంబుగాక
జేరెపెదవేమ పార్థివ ♦ శేఖరునకు.

— ♦ పెదకోమటి వేమారెడ్డి ♦ —

౩౯

నిజబాహుబలముచే ♦ నిర్జించిపాలించెఁ
గొండవీడుపురమునా ♦ ఖండలువలె
వీరనారాయణ ♦ బిరుదాంకుఁడయ్యెదే
వరకొండ వెల్మలఁ ♦ బారద్రోలి
యమరుకావ్యమునకు ♦ వ్యాఖ్యతానెరచించి
సర్వజ్ఞబిరుదంబు ♦ సరవిఁగొనియె
విద్వాంసులందఱిఁ ♦ బ్రీతి గాఁగనుచుండి
సంస్కృతభాషయ ♦ శంబునిలిపె.
గీ. పండితుండగు వామన ♦ భట్టుచేత
సంస్కృతంబున వ్రాయించె ♦ చరితమెల్ల
వేదగిరిరాజు ననిలోన ♦ వెదకిచెండె
వీరుఁడాపెదకోమటి ♦ వేమనృపతి.

౪౦

శ్రీనాథకవినివిద్యా
స్థానాధిపుఁ జేసిసర్వ ♦ సంస్థానములన్
మానిత యశోధనమ్ములఁ
బూనిక నార్జింపఁ బంచెఁ ♦ బుధపూజితుఁడై.

౪౧

గృహరాజ సౌధమున న
త్యుహమును వసియించెశిల్పి ♦ తత్త్వజ్ఞుఁడనన్
ఇహమున నేరాజ్యంబున
"సహి" యీనిర్మాణమనిజ ♦ నంబులుమెచ్చన్.

౪౨

పొన్నపలిఁ కనుపూరులు ♦ భూసురులకు
నగ్రహారంబులుగ జేసి ♦ ఖ్యాతినందె
ములకలూరును బండారు ♦ పలియుముల్లఁ
గూరమా దేవతకునిచ్చి ♦ పేరుగాంచె.

౪౩

సింగనామాత్యుఁ డనుమంత్రి ♦ శేఖరుండు
బ్రజ్ఞమైరాజ్యతంత్రంబుఁ ♦ బలుక మెచ్చి
ఛత్రచామరాందోళికా ♦ చయమునిచ్చి
యగ్రహారంబుల నొసంగి ♦ ఖ్యాతిఁగాంచె.

౪౪

గన్నభూపాలు సత్పుత్రి ♦ కామతల్లి
సూరమాంబను బెండ్లియై ♦ సుతులఁగాంచె
నామె సంతానముగరం ♦ బనెడిచెర్వు
నిర్మితముజేసి పేరొందె ♦ ధర్మబుద్ధి.

౪౫

కదనగాండీవిఁ గనొబ్బ ♦ గండఁడాది
బిరుదముల నేకముందాల్చి ♦ వెలమప్రభుల

దండయాత్రల నన్నింటి ♦ దరిమికొట్టి
నిలిపెనీ రెడ్డిరాజ్యంబు ♦ నిపుణుఁడగుచు.

౪౬

ఫిరోజషాయను గుల్బర్గ ♦ ధరణివిభుఁడు
దనకునెచ్చెలిమైనసాయ ♦ మొనరఁజేయ
వీరవరుఁడయి కాటయ ♦ వేముఁతోడ
రాచకొండాది విభులతో ♦ రణములెన్నొ
సల్పెజయలక్ష్మి యెవ్వారి సరకుగొనదు.

౪౭

ముల్లగూరమ్మ దేవత ♦ మోదమొంద
గుడియు ప్రాకారమొక్కటి ♦ గోపురాలు
విశ్వమోహనముగ గట్టె ♦ వేమవిభుఁడు
ముల్లగూరున ప్రజలెల్ల ♦ నుల్లసిల్ల.

౪౮

వేదగిరిరాజుఁజంపిన ♦ విధమెఱింగి
వీకమైలార యనపోత ♦ విభులు రేగి
ఘోరరణములు సల్పెదు ♦ ర్వారముగను
దుదకుపెదవేమ భూపాలు ♦ ద్రుంచిరందు
రాచవేమ సుతుండంత ♦ రాజ్యమందె.

—♦ రాచవేమన ♦—

౪౯

నాల్గువర్షంబులేలెను ♦ నాల్గుచెఱఁగు
లెట్టిపాలన సల్పెనో ♦ యెఱుకపడదు
రాచవేమనకొండవీ ♦ ట్రాజ్యమందు
భూరిసంతాన సాగరం ♦ బునకుకాల్వ
యొండునిర్మించి విఖ్యాతి ♦ నొందెనతఁడు.

౫౦

రాచకొండ నృపాలురు ♦ రణమునందు
దేవతా ఖడ్గమొకదాని ♦ దెచ్చియుండ
వైరిలింగయ కేమని ♦ పలుకుమనెనొ
నందిపోతకతారి శ్రీ ♦ రాధసుకవి
బంపి తెప్పించు టొకకార్య ♦ భరముబూనె.

౫౧

ప్రజలకీ వేమవర్యుని పాలనంబు
వచ్చులే దంద్రుపన్నులు ♦ హెచ్చుకతవ
నాయసంతృప్తిగలయట్టి ♦ యల్లుఁడెవఁడీ
వెనుకఁగాఁబొంచి యీవిభుఁ ♦ దునిమెనం

౫౨

ఆరాచ వేమనార్యుని
గారాపుందమ్ముఁడంద్రు ♦ గావేమకవిన్
ధారుణి యోగీశ్వరుఁడయి
కారణజన్మకవి యనగ ♦ ఖ్యాతివహించెన్.

౫౩

తనసుధామధురోక్తుల ♦ దన్పెఁబ్రజల
గన్పడినరాళ్లపై నెల్లఁ ♦ గవిత వ్రాసి
శిలలఁ బలికించిగీతాల ♦ నిలపెనంద్రు
వేమసుకవీంద్రు నెంతని ♦ వినుతిజేతు
పరుసవేదిని గాంచిన ♦ బరమయోగి.

౫౪

పూజ్యమా కొండవీటిసా ♦ మ్రాజ్యమెల్లఁ
గైవశంబయె మెల్లన ♦ దేవరాయ
నరపతికి, రెడ్డిరాజ్యవి ♦ నాశనంబు
గాలవశమున గల్గుట ♦ గానుపించు.

౫౫

కాకతీయాంధ్ర రాజ్యంబు ♦ కలిమిదగ్గి
రడ్డిరాజ్యంబుశతవత్స ♦ రములుచెల్లె
గాలచక్ర పరిభ్రమ ♦ గాలఁదెలియఁ
గాలముందాటనేరికిఁ ♦ గాదుగాని.

౫౬

దేవబ్రాహ్మణ విద్యావి ♦ దేశవణిజ
సంపదలనెల్లగాపాడి ♦ పెంపుఁజేసి
కీర్తిఁగొన్నారవీ రెడ్డి ♦ నృపతులెల్ల
నాంధ్రలోకంబు హర్షింప ♦ ననవరతము.

౫౭

ముష్కర తురుష్కపాలన ♦ మునకురోసి
యాంధ్రదేశంబునకు గొప్ప ♦ యానకట్ట
గాగనీ రెడ్డిరాజ్యంబు ♦ గ్రాలుచుండఁ
దురకవాహిని రాకుండఁ ♦ దోలఁగెనపుడు.

౫౮

కొండవీటిదుర్గ ♦ కోటలు పేటలు
పాడువడిన విపుడు ♦ జూడఁగలము

అచటగానబడెడి ♦ యఖిలవస్తువులందు
పూర్వవైభవముల ♦ పొలుపుదెలియు.

—♦—

—♦ రాణ్మహేంద్రపుర రెడ్డి ప్రభువులు ♦—

పదియునాల్గు శతాబ్దంపు ♦ ప్రాభవమున
నాంధ్రహిందూ సురత్రాణుఁ ♦ డైనపిదపఁ
గాపనృపతి గోదావరీ ఖండమునకు
దనదుతోఁబుట్టు నల్లుని ♦ దర్పశాలి
మంచికొండ కూనారెడ్డి ♦ నెంచియెంచి
కోరుకొండ నేలుమటంచుఁ గూర్మిఁబంచె.

౨

కోరుకొండకు జోయియా ♦ కూనరెడ్డి
దుర్గమొక్కటి నిర్మించి ♦ తురకచయము
నడచి పాలించెనంతట ♦ నతనిసుతుఁడు
ముమ్మడీంద్రుఁడు రాజయి ♦ ముదముగొలిపె.

౩

—♦ ముమ్మడి నాయకుఁడు ♦—

అంగర సీమయు ♦ జాంగలునాట్సీమ
కురవాటి సీమయు ♦ గోనసీమ
కొత్తాముసీమయు ♦ గోదావరీసదీ
సారభూఖండాల ♦ జనులనేల
బూనియు నిజరాజ ♦ ధానికోర్కొండను
నిలిపి శత్రులనెల్ల ♦ నులిమివైచి
లక్ష్మీనృసింహునా ♦ లయము కోర్కొండను
గట్టించి రెండూళ్ల ♦ కాన్కనిచ్చి
ముప్పదేడులు రాజ్యంబు ♦ మోదమునను
జేసి సత్కీర్తినార్జించె ♦ చెలువుమెరయ
మంచికొండ కూనారెడ్డి ♦ మాన్యసుతుఁడు
ముమ్మడీంద్రుఁడా ప్రభువువర్యుఁబాగడవశమె

౪

జ్ఞాతివైరంబు బూనక ♦ నీతిదమ్మ
సింగనృపతిని గన్నయన్ ♦ చేతిక్రింద
నుంచి పరిపాలనంబిచ్చి ♦ కాంచెఁగీర్తి
భ్రాతృప్రేమంబు జూపిన ♦ రాజనంగ

౫

వైష్ణవమతానురక్తిఁ నీ ♦ ప్రభుఁడు శిష్యుఁ
డై పరాశరభట్టను ♦ యార్యునకును
దనదురాజ్యమునందామ ♦ తంబువృద్ధిఁ
గాగఁజేసెను సత్కీర్తి ♦ కాముఁడగుచు.

౬

పంచ పాండవులనురీతిఁ ♦ గాంచెనితఁడు
పుత్రపంచకమును జనుల్ ♦ బొగడుచుండ
నగ్రజుఁడు కూనరెడ్డియు ♦ నన్నరెడ్డి
వరుస గాటమరెడ్డియున్ ♦ ధరణిపతులు
నతనితర్వాత బాలించి ♦ ఖ్యాతిగనిరి.

౭

దేవతాసౌధ నిర్మాణ ♦ దీక్షఁబూని
వాని బోషింపభూములు ♦ దానమిచ్చి
తండ్రిబోలిన తనయులు ♦ దారులనెడి
యశము నార్జించి నారలీ ♦ యవనిపతులు.

౮

వీరికాలమునకు ♦ బోరులుహెచ్చైన
వెల్మ వీరవరులు ♦ భీమపురిని
గాపసార్వభౌము ♦ గదిసి దోర్బలమున
హతము జేసిరంత ♦ నాహవమున.

౯

—♦ కొండవీటి ప్రభుత్వము ♦—

వీరిజాడ పిదప ♦ నేరికిదెలియరా
దొక్కవేళనందె ♦ ప్రసుక్కినారా
యైనగొండవీటి ♦ యధిపతి యనపోత
విభుని పాలనంబు ♦ వెలిఁగె నిచట.

౧౦

అతనిపాలనమున ♦ కడ్డు దగిలిభక్తి
రాజుమొదలుగాగ ♦ ప్రభువతంసు
లాక్రమించినంత ♦ నారాజ్యభాగంబు
విడచిపెట్టి కొండ ♦ వీటినేలె.

౧౧

కొండవీటిరాజ్య ♦ కువలయ పతియన
వేమనృపతి మరల ♦ వీకవెడలి

కోరుకొండలోని ♦ కోటలం గూలిచి
సీమలేకముగను ♦ జేర్చియేలె.

౧౨

ఆతనిపిమ్మట కొమరగి ♦ ర్యాఖ్యనృపతి
కైవశంబయె రాజ్యంబు ♦ క్రమముగాను
కాటరెడ్డి వేమారెడ్డి ♦ ఖ్యాతిఁబడసి
యాప్తబంధువై పాలన ♦ మంతజరుప.

౧౩

—♦ కాటయ వేమారెడ్డి ♦—

కొమరగిరికి నరవర్యుని ♦ కూర్మిబల్కి
రాణ్మహేంద్ర రాజ్యంబున ♦ ప్రతిభవడసి
వీరవర్యుఁడు కాటయ ♦ వేమనృపుఁడు
పాలనమొనర్చె నచ్చటి ♦ ప్రజలుమెచ్చ.

౧౪

కొమరగిరి సామంతుఁడై ♦ కొన్నియేండ్లు
కొన్నియేండ్లు స్వతంత్రుఁడై ♦ కోర్కెమీర
దీక్షు ముప్పదివత్సరాల్ ♦ తెరిపిలేక
యేలినాఁడెల్ల నృపతుల ♦ నేపడంచు.

౧౫

తూర్పుదేశాల నిర్జించి ♦ దురమునందు
దర్పశాలి వీరాన్నపో ♦ తవిభుగూడి
గోపినాథునకును మొక్కు ♦ కొనియొసంగె
కొమరగిరి భూపుడనప్తి ♦ కూర్మినిడఁగ.

౧౬

వింధ్యాద్రిమొదలుగా ♦ వివిధ ప్రదేశముల్
సింహాద్రివరకును ♦ జేర్చినేలె
పాలకొలను సర్వ ♦ వరముద్రాక్షారామ
దేవాలయంబుల ♦ దీక్షగనియె
వీరుఁడై కోమటి ♦ పెదవేమ భూపాలు
రణమున నెదిరించి ♦ రాజ్యమేలె
సంస్కృతవిద్యావి ♦ శారదుఁడై కాళి
దాసకృతములకు ♦ వ్రాసెవ్యాఖ్య

గజపతులతోడ వైరంబు ♦ కతననెన్నొ
కదనముల్ గల్గినను లెక్కగనకపోరె
నారయల్లాడరెడ్డిసా ♦ యపడనేలె
విపులరాజ్యంబు కాటయ ♦ వేమనృపతి.

౧౭

రాణ్మహేంద్రమునమా ♦ ర్కండేశ్వరులను బ్ర
తిష్ఠింపగాజేసె ♦ దేవిచేత
గోపవరంబును ♦ గోపినాథస్వామి
కర్పించిభక్తిచే ♦ ఖ్యాతినొందె
నాబలారాద్యుల ♦ కగ్రహారములిచ్చి
బ్రాహ్మణోత్తములందు ♦ భక్తిజూపె
మల్లవరంబును ♦ మహితాగ్రహారంబు
నరసింహ పండితు ♦ నకునొసంగె.
ఫిరోజిషా వెల్మవీరులు ♦ వీకతోడ
సాయపడ నన్నెచోడుని ♦ సంగరమున
గుండుగొలను ప్రాంతమ్మున ♦ గూలెనకట
కడకు గజరావుతిప్పని ♦ ఘాతబలిమి.

౧౮

కాలగతిదప్పనెవరికిన్ ♦ గాదుగాన
నపుడె కాటయవేముని ♦ యాప్తసైన్య
దశసహస్రంబు భీతిల్లి ♦ తారసిల్ల
జాలకను నన్నదేవుని ♦ శరణుజొచ్చె.

౧౯

ఎంతకాలము జరగెనో ♦ యిట్లుమరల
రేగి దొడ్డయ యల్లాడ ♦ రెడ్డినృపతి
యన్నదేవు జయించిరా ♦ జ్యాధిపతిగ
గొమరగిరి నాముప్రభుపుత్రు ♦ గూర్మినిలిపె.

౨౦

అతఁడుగొన్ని నెలలె ♦ యవనిబాలించిన
ద్గతికిజేరినంత ♦ నతనియనుజ
యమల గుణగణాంబ ♦ యనితల్లికై వశ
మయ్యెరాజ్యలక్ష్మి ♦ నెయ్యమొప్ప.

౨౧

—♦ అల్లాడరెడ్డి ♦—

అల్లాడరెడ్డి భూపుం
డల్లననామె ప్రతినిధిగ ♦ నవనీశుండై
చెల్లించితనదు దర్పం
బెల్లెడలఁ బదేండ్లురాజ్య ♦ మేలెన్ వీఁకన్.

౨౨

జనవిభుని పుత్రులందున
ననితల్లికినీడుజోడు ♦ నానొప్పుయశో
ధనమూర్తి వీరభద్రుం
డనితల్లిం బెండ్లియాడి యధిపతియయ్యెన్.

౨౩

—♦ వీరభద్రారెడ్డి ♦—

చిల్కసరసుదాక ♦ జెండాడు శత్రువీ
రులను జయ స్తంభ ♦ ములను నిలిపె
భానుదేవుఁ జయించి ♦ ప్రబలాధివీరుఁడై
పొలుపారఁగఁ గళింగ ♦ భూమినేలె
తెలుఁగుబాసకు వన్నె ♦ దెచ్చినశ్రీనాథ
కవిచేత గృతినొందెఁ ♦ గావ్యములను
కంచిపంచారామ ♦ కాశిశ్రీగిరులందు
స్వాములసేవించి ♦ భూములొసఁగె.
పరహితాచార్యవైద్యుని ♦ పటిమఁగాంచి
కలువచేరను గ్రామంబు ♦ గానుకనిచ్చె
పట్టమహిషియౌ యనితల్లి ♦ వాక్కునింపి
వీరభద్రానృపుండు వి ♦ వేకశాలిన్.

౨౪

జ్యేష్ఠసోదరుఁడగు వేమ ♦ నృపతి తనకు
దోడునీడయి రక్షింప ♦ దొడ్డభూపుఁ
డన్నరెడ్డియనుజులు ♦ వన్నెఁదేఁగ
రాజ్యమేలెను వీరభ ♦ ద్రానృపుండు.

౨౫

ఈనృపాలుని సామంతుఁ ♦ డెన్నదగిన
వాసిరెడ్డి కులీంద్రుఁడై ♦ వరులువాఁడు
పోతవిభుఁడెన్నొ దేవళాల్ ♦ ఖ్యాతినిల్పెఁ
బీఠికాపురమందున ♦ విమలభక్తి.

౨౬

తాళవృక్షంబులిచ్చట ♦ దక్కువైన
నాల్గులక్షల దెప్పించి ♦ నాటెనితఁడు
కమ్మవంశజులందున ♦ ఘనయశుండు
మన్నె దేవేంద్రుఁడనిజను ♦ లెన్నుచుండ.

౨౭

ప్రజలసౌఖ్యాళికిటుపాటు ♦ బడుచునుండి
వెలమప్రభువగు లింగయ ♦ వీరవరుఁడు
రణమొనర్పంగ రాఁబరా ♦ క్రమముజూపి
వీరస్వర్గంబునొందెనా ♦ వీరనృపతి.

౨౮

ఆంధ్రజనులకు సంతాప ♦ మతిశయిల్ల
రాజమహేంద్ర పురంబున ♦ రడ్డిరాజ్య
మస్తమించెను వీరభ ♦ ద్రానృపుండు
ప్రాణముల నాహవంబున ♦ బాసినంత.

౨౯

రెడ్డి, వెల్మ, నృపాలుర ♦ రడ్డికంబె
యాంధ్రభూమిని స్థిరమయి ♦ యలరకున్నె
యొండొరులకును వైరంబు ♦ లుద్భవిల్లి
యతిశయిల్లి వారలపుట ♦ మార్చుకున్న.

౩౦

వివిధసీమల శాసనాల్ ♦ వెలయఁజేసి
గ్రంథముల్ వ్రాయఁజేయస ♦ త్కవులపూనిక
నీనృపాలురచరితంబు ♦ లింతవరకు
తేటతెల్లంబులయ్యె శో ♦ ధించిచూడ.

—♦ కొత్తభావయ్య చౌదరి ♦—

# రెడ్డి సంచిక.

## అనుబంధము I

### శాసనములు.

### I శా॥ శ॥ 1252.

1. శాకాబ్దే యుగబాణ భాస్కరయుతే అంగీరస శ్రీసమే
వైశాఖే ఉడుపేద్విపే కుజదినే శ్రీవేమభూపాలకః।
బ్రహ్మభట్ల మహీసురాయ నగరీం వర్వేటి గ్రామాభిధాం
ప్రాదాదుజ్వల దష్టభోగ సహితా మాచంద్ర తారార్కగమ్॥

### తాత్పర్యము.

శాకాబ్దములు 1252 అగు అంగీరస సంవత్సర వైశాఖమాసమున మంగళవారమునాడు శ్రీ వేమభూపాలుడు బ్రహ్మభట్లు అను బ్రాహ్మణునకు అష్టభోగసహితముగ వర్వేటు అను గ్రామము దానమిచ్చెను.

---

1. ఈ వర్వేరు శాసనమింకను బయలుపడలేదు. పైశ్లోకముమాత్రము లోకల్ రికార్డులలో 57 వాల్యూం 131 పుటలో భద్రపరుపబడినది. ఈశ్లోకము వర్వేటు శాసనములోని నిజమైన భాగమని నమ్మవచ్చును. రెడ్డిరాజ్యస్థాపకుడగు ప్రోలయవేముని మొదటిశాసనమిదిగానే ఇంతవరకును కనుపట్టుచున్నది. దీనితో సమకాలికమైన శాసనమొకటి మద్దులపల్లి గురుబ్రహ్మశర్మగారి 'కొండవీటిసామ్రాజ్య'మను గ్రంథమున 39-వ పుటయందీయబడినది. అది ఇట్లున్నది.

శ్లో॥ అనవేమ మహీపాలో, బిలపర్వత పాలకః నేత్రబాణబాహు చంద్ర శాలివాహన శకేషు చ
గౌతమీశ ప్రతిష్ఠాంచ మల్లేశ ప్రసాదతః కత్తితయంచ భూదానం యావదాచంద్రతారకం॥

పై శ్లోకములోని బిలపర్వతమనగా ప్రస్తుతపు బెల్లకొండ. బిలపర్వతపాలకుడగు అనవేమభూపాలుడు శా॥ శ॥ 1252 సంవత్సరమున గౌతమేశ్వరుని ప్రతిష్ఠించినట్లు పైశ్లోకము తెలుపుచున్నది.

ఈశాసనము చాల సంశయాస్పదమైనదని నేనభిప్రాయపడుచున్నాను. [సం॥]

### II శా॥ శ॥ 1254

(1) శ్రీనారీ సహితుండై శ్రీ నరసింహుండు తనదు సేవాపరులను
శ్రీనగర కంటిసెప్పుడు శ్రీనిలయులంజేసి కరుణం జేకొని కాచును.

(2) సదానగరకంటీశో నృసింహో భక్తవత్సలః। తరంగిత కృపాదృష్ట్యాపాయాద్వస్సార్వకాలికమ్॥

(3) స్వస్తిశ్రీ శకవర్షంబుల విస్తరణం బెట్టిదనినం వేయిటి మీంద
నిస్తారం మిన్నూ ఱును ప్రస్తుతికెంబదియునాల్గు వరలెడిచోటను.

(4) శ్రీముఖ వైశాఖ శితపక్షపంచమి నాదివారమున మధ్యాంహ్నమందు
నగరకంటనుకాంత నరసింహ్వదేవర సంనిధా........నంతలమునను
జగములు ప్రోవం బాంచాళి పురంబు శ్రీగోపశయ్య మనను గోర్కెదీర్ప
అరుగ భూవరుణిచ్చనని చెల్లనిచ్చెను బుద్ధాంకుంటెంబది పుట్లుపొలము
అదియు నూరుగా సమర్పించెం జెనుకాలి । సింగవిభుండు నారసింహ్వునకును
నారసింహపురము నలినొప్పచునన । వేమమహీంద్రు పుణ్యవిహారమయ్యె.

♦ పైశాసనము గుంటూరుజిల్లాలోని నకరికల్లు గ్రామమునందలి నరసింహస్వామి ఆలయములో నున్నది. ఈశాసనము లోకల్ రికార్డులు 57 వాల్యూం 149 పుటయందనేక తప్పులతో నీయబడినది. దీని శుద్ధప్రతిని దివంగతులగు జయంతి రామయ్య పంతులుగారు తమ శాసన పద్యమంజరిలో 67 నంబరుగా ఇచ్చినారు. (E.R. 84/16 ఎపిగ్రాఫికల్ రిపోర్టు). ఈ శాసనమందలి 'అనవేమ' నామము ప్రోలయవేమునిదే. ఇతర శాసనములందును ఈపేరుతో ప్రోలయవేముడు నిర్దేశింపబడినాడు. (చూడుము. An. Rep. S.I.Ep. for 1225—26 appendix A. no 5) ఎఱ్ఱాప్రెగ్గడ హరివంశమున 'ప్రోలయవేమ', 'అన్నమవేమ', 'కోమటి వేమ' అనునవి పర్యాయనామములుగ వాడబడినవి.

## III శా॥ శ॥ 1257.

♦ 1 శ్రీ త్రిపురాంతకేశ్వర॥
2 స్వస్తిశ్రీ॥ విజయాభ్యుదయ శాలివాహన శకవర్షంబులు 1257 అగు నేటి యువ
3 నామసంవత్సర కార్తీక శుద్ధ 12 గురువాసర మన్వాది మహాపుణ్యకాలమునం
4 దు యజు[శ్శా]ఖాధ్యాయనాపస్తంబసూత్ర కౌండిన్యగోత్రోద్భవులున్నూ శ్రీమద్యాజ
5 నాది షట్కర్మ నిరతులగు కామేశ్వరభట్టారకుని వారి పౌత్రులున్నూ కొండుభట్టారకుని
6 పుత్రి[త్రు]లున్నూ చిట్టమంచి తింమ్మనభట్టు శాస్త్రులవారికి స్వస్తి॥ సకల గుణగణాలం
7 కార చంచుమలచూర కారవిశ్వవిశ్వంభరాభరణ వహనదక్ష దక్షిణ భుజాదండ్డ
8 జగనొబ్బ గండ ఆనియ మండలీకరగండ రాయచేకోలు గండరాయ మీసరగండ
9 అర్థి ప్రత్యర్థి హేమాద్రి- దాననిరత ప్రజాపరిపాలన చతుర హరణభరణ రూప
10 నారాయణ వీరనారాయణ భుజబలభీమ కోదండరామ అపరిమిత భూదాన పరశు
11 రామ అనేక నగరోపకంఠ ప్రతిష్ఠాపిత బహు విధారామ సంగ్గడి రక్షపాలక జగర
12 క్షపాలక జగదగోపాలక గుజ్జరిఘట్ట విభాళ ఘనభుజ విరాజమాన కరవాల
13 రాచూరి దుర్గవిభాళ జలదుర్గ జలధిబడ బానల స్థలదుర్గ హవనహాలాయు
14 ధ అనవరత పురోహిత కృతసోమపాన శ్రీపర్వత అహోబల నిర్మితసోపాన ధిక్కా [దిక్కాం]
15 త్తా మనోహర కీర్తి కుసుమామోద కుండిప్రభా సంహ్య [సహ్య] జా గౌతమీ
16 జలక్రీడావినోద కళింగ రాయమాన మదమర్దన మంనియరాయ మృగ

17 కంటకార వొడ్డియరాయ నిర్ధూమధామ జంత్తుర్నాట రాయ కాల్లకల్లోల ✱
18 రిరాయ బసవశంకర విరోధి నృపదానవనరసింహ్వా పాండ్యరాయ గజసిం
19 హ్వ[హ] ప్రిజ్ఞాచతుర్వి ధోపాయ శేళాదిరాయ నిత్యపరిపాలిత సత్య పల్లవాది
20 త్య రిపునరవలి గోధూమ ఘట్టనఘరట్ట అప్పయగోపయ దిశాపట్టణ సంగ్రా
21 మ సముద్దండ చండ్డ భుజాసివిఖండ్డిత కృతకీలాల ప్లవమాన బ్రిహ్మ కం
22 డీ కృష్ణవేణీ గోదావరీ మహానదీ తటీద్వయన్మధ్య దేశానేకాగ్రిహా
23 ర అగణ్యపుణ్యక్షేత్రి సత్రి బహువిధాహార పూర్వసముద్రాధీశ్వర
24 ఏకరాయస్థాపనాచార్య ఏకసింహాసనాలంకార శ్రీమత్త్రిపురాంతక దే
25 వదివ్య శ్రీపాద పద్మారాధకులైన శ్రీమతు వేమయరెడ్డిగారు వ్రాయించియి
26 చ్చిన భూదాన ధర్మశాసనం॥ మద్భుజాదండ్డ పరిపాలనమైన సాంబ్రాజ్య
27 మందు శ్రీశైలభూమిని అంమ్మన బ్రోలి శీమలో రామతీర్థం సర్వాగ్రిహారముం
28 న్నూ చీమకుర్తి భీమేశ్వర పులికొండ్ల మైలవరం కొమారపురి గ్రామ
29 ములు అయిదింట్టియుండ్డున్నూ వెలిపాలంలోనున్న చర్వలక్రింద మాంగా
30 నిలోనున్నూ ఆకుతోంటలు, చెఱకుతోంటలలోను భూమి చతుర్థాంశం
31 సర్వమాన్యంగానున్నూ మిగిలిన ముప్పాతిక భూమిని పండిన నానాఫలా
32 దులకున్ను షోడశాంశంమేరను సువర్ణాదాయానకు పంచమాంశమున్నూ
33 పెద్దచెరువునీళ్ళను యీగ్రామాలుగాక యితరగ్రామాల పండ్డిన ధాన్యానకు దశాం
34 శమున్ను శీమామూలం ప్రతిగ్రామములంద్దున్నూ పధారుబారల ఘదను
35 పెద్దవూరికి ఇన్నూరు కుంట్లలున్ను చిన్నవూరికి నూరుగుంట్ల క్షేత్రము
36 న్ను సర్వమాన్యములున్ను యీలాగు నిర్ణయంచేసి రామతీర్థం మొదలైన ఆ
37 రు గ్రామాదులయందున్ను అష్టభోగస్వామ్య స్వతంత్రములున్ను చతుర్వి
38 ధ యోగాంక సహిరణ్యోదకగాక దానధారపూర్వంగా యిప్పిస్తిమి గనుక
39 .........త్రి పారంపర్యముగున్న అంద్దుల వచ్చిన ఫలం ఆచ.........

✱ ఈ అమూల్యమైన శాసనము ఎపిగ్రాఫియా ఇండికా వాల్యూం సం॥ 21—271-272 పేజీలలో ప్రచురింపబడినది.

## IV శా॥ శ॥ 1262.

శ్లో. వరాహవదనో హరి ర్వరవసుంధరాకన్యకాం కళాధరకళోల్లస ద్విమల దంష్ట్రికాగ్రే వహన్
జగంతి పరిపాలయ న్నలఘు విక్రమప్రక్రమ స్తనూరుహబిలభ్రమ జ్జలలవాయి తాంభోనిధిః॥ 1.

శ్లో. భ్రమద్భ్రమరసుందరీ సరసమంజనోచ్చుంబన । స్రవన్మదకపోల యు క్ప్రిసృతికర్ణతాళద్యుతిః
సముద్యదరుణప్రభా లలితవామ భాగస్ఫుర । చ్ఛవి ర్గణపతి ర్మహ స్వరతు విఘ్నవిధ్వంసకః॥ 2.

శ్లో. వాణీవామకుచాగ్రకోణనివద త్ఫాలేందు రేఖోల్లస। ద్వీణావాదవినోదమోదితశుకస్ఫూర్జత్కరాగ్రప్రభా
అత్యుత్తుంగనితంబబింబయుగళీ శ్రీమద్విశుద్ధాంబరా । రాణీవాయతలోచనావతుసదారా కాని శేశావసా॥ 3.

శ్లో. విద్యావిశ్వమనోహరా హారలసద్వామాంగనాహారిణీ । రాజత్కోకిలనిస్స్వనాకమలినీకంజాతపత్రేక్షణా
శ్రీమద్భూధరకన్యకాధవభయప్రధ్వంసినీసర్వదాగౌరీగంధమదేభసుందరగతిర్భూయాద్విభూత్యైసదా॥ 4.

శ్లో. విష్ణుర్వియత్పవనవహ్ని జలోర్వితత్వ తస్మాత్రి తత్కారణకార్యమూర్తిః
సృష్టిస్థితి ప్రళయకృత్త్రిగుణాత్మశక్తి యుక్తః పురాణపురుషః పరిపాతు విశ్వమ్॥ 5.

శ్లో. సహస్రశీర్షా పురుషస్సహస్రపాత్సహస్ర నేత్రశ్చ చరాచరాత్మా
విరాడ్విధీశాచ్యుత వజ్రపాణి క్షరాక్షరాఖ్యో జయతి ప్రసన్నః॥ 6.

శ్లో. యత్పాదపద్మయుగళం జగదీశ్వరస్య బ్రహ్మాద్యశేషదివిజేంద్ర మనోవిమృగ్యమ్
యత్సంస్మృతేరఘువినాశ ముపైతి జంతు స్తస్మాదవాప జననం హిచతుర్థవర్ణః॥ 7.

శ్లో. తద్వంశజాతామలపంటరెడ్డి కులామృతాంభోనిధిపూర్ణచంద్రః
ప్రోలాభిధః ప్రాప పురాతనోర్ధ (నస్య) పూజావశాద్బ్రిహ్మణపామకార్చామ్॥ 8.

శ్లో. యదృచ్ఛయాస్వర్ణకరప్రసిద్ధిం లబ్ధ్వా న్న తాంబాపతి రాబభూవ
తతశ్చ పుత్రానపి పంచ లేభే బృందారకాధీశ్వరతుల్యమూర్తిః॥ 9.

శ్లో. తత్పుత్రేష్వథ వేమభూపతిరరి ప్రాణాపహారీ రణే.
యుధ్యద్దంతితురంగసద్బలరథ ప్రోద్యద్దవాగ్ని స్సదా
దుర్గాణ్యాకలయత్త్రమాగిరివరే ష్వాశాధిపాంశోత్కటః
శ్రీమద్భా...సురభూసురేంద్ర పదప ద్మాసక్తబుద్ధి ర్విభుః॥ 10.

శ్లో. సరాజధానీం జగతి ప్రసిద్ధాం శ్రీకుండినీ నామ పురీ మతిష్ఠత్
దిగంతభూమీశ్వరమౌళి మాలి మణిద్యుతి ద్యోతిత పాదపంకజః॥ 11.

శ్లో. యం ప్రత్యగ్దిగధీశ్వరాన్ రణముఖే జిత్వోత్తరక్ష్మాపతీన్
హత్వాప్రాగధిపాన్ సురేంద్ర నగరీం నీత్వావ యామ్యప్రభూన్
కృత్వా తద్దిగధీశ్వరార్పితనిజ ప్రాణాన్ పురారాతివ
ద్దివ్యశ్రీయుత వేమభూపతిరశాత్సర్వాంసహామండలమ్॥ 12.

శ్లో. శ్రీమద్వేమమహీశ్వ రేణయజనా ద్యుత్కృష్టధర్మస్ఫుర
ద్భూబృందారక సాత్కృతాస్థిరతర శ్రేష్ఠాష్టభోగాన్వితాః
క్ష్మాకాంతా...కుచకుంభయుగ్మ పరితః ప్రాలంబమానోల్లస
ద్ధారా మౌక్తికభాసురా ఇవ జగ ద్రమ్యాగ్రహారా బభుః॥ 13.

శ్లో. య శ్చండాంశుని శాకరాన్వయభవేష్వాద్యేషు సింహాసనా
ధీశేషు ప్రభుషు ప్రధానకుశలేష్వగ్రేశ్వర స్సర్వదా
సోయం వేమమహీపతిః పరబలం జిత్వాగ్రహారాన్ బహూన్
దత్వా విప్రవరప్రసాదజనిత శ్రీమాం శ్చకాసే ముదా॥ 14.

శ్లో. యద్దాతృత్వవిగర్వితామృతభుజాం గౌ ర త్తి ఘాసం సదా
చింతా మన్వహ మాప్య దైవతమణి శ్చింతామణిత్వం గతః

స్వర్ణాద్రి ధృతవల్కల స్థిరతప స్స్వర్భూరుహ స్సేవతే
శ్వైత్యం యాతి హితో యదోపి గణనా తావా పరేషా మహో॥ 15.

శ్లో. శ్రీవేమభూపకరనిస్సృతదానవారి సత్పాత్రహ స్తగత మిందు రవేక్ష్య యత్నాత్
నీహారపాణి రహ మిత్యభజ త్కళంకం యస్యాన్యతః ప్రకృతయే సుకృతీహ లోకే॥ 16.

శ్లో. వేమక్ష్మేశః క్షితిసురవరైః పూర్వజన్మార్జితం య
త్పుణ్యం తస్మా దిహ చ విభవ ప్రాప్తి మాలోచ్య భూయః
సత్పాత్రోద్యత్కరసరసిజ స్స్వర్ణభూగోగ్రహారై
ర్దానం దద్యా మితి చ వసుధా దైవతా న్యాబభాషే. 17.

## ఏతావత్పర్యంతపద్యజాలసంఖ్యా ౧౭

స్వస్తిశ్రీమ న్మహారాజాధిరాజ స్సమస్తజగదానందమూర్తి స్సకలదిగంతజేగీయమాన ప్రతాపనిర్జిత నిఖిలప్రతీప నృపసమూహ సంస్తూయమానశరచ్చంద్ర చంద్రికాకుంద సుధాపారావారైరావతాది సుస్వచ్ఛ విలసత్కాంతిమత్కీర్తి ర్గజరాయదేవ రాజ వేశ్యాభుజంగ స్సమ్యజ్నృత్యత్తుంగ తురంగగజరథభటనికర మహోద్యన్నరేంద్రతలగుండుగండః సము స్తదిగ్విజయ జయస్తంభకృత్పరాక్రమాక్రాంతజగదేకనాథో జగనొబ్బగండబిరుదాంకిత తత్సకలవిజయదిగంత విశ్రాంత భూసురపాలకో నిరంతరధర్మార్జితకరుణా—లనగానాశ్రయయుజ్నిధినిక్షేపపాషాణా క్షీణాగామిసిద్ధసాధ్యాఖ్యాష్టభోగ తేజస్స్వామ్యదానాధి విక్రియవినిమయయోగ్యం యథా తథా భూదేవభానార్థానంత గుణితాద్యంత ముఖ్యాగ్రహారదాన శ్రీవిరూపాక్ష బసవశంకరాంకలోహముద్రికా తామ్రశాసనస్థదాత్రను గృహీతూభయ వంశపరంపరాలంకృత పద్యగద్య విస్తృత మహనీయశాశ్వతా చంద్రార్కస్థిర...ధర్మపరాయణ శ్రీవీరభద్రధ్వజసులలిత చతురంగసేనా వినిర్జితేతర రాజన్యసద్వందిత చరణారవింద స్సకలధర్మశాస్త్ర విచార విశుద్ధాంతరంగః కాసీతిమర్గనిర్మాణచతుర శ్రీశైల శిఖరా క్రాంతసోపానరచనా శ్రేయస్సంపాదిత...స్వర్గమార్గ విచిత్రభోగభాగ్యధురంధరః శ్రీమన్మహాపంటరెడ్డివంశార్ణవ పూర్ణచంద్రః శ్రీవిశ్వనాథ త్రిపురాంతక దేవపాదారవింద మకరందాస్వాదమధుకరాయమాణ మానసః శ్రీగురుచరణారవింద భజనానంద విశుద్ధచరిత శ్రీమత్ ప్రోలయాన్నమాంబాకుమారః కుమారతుల్య శ్రీవేమభూపాలః శ్రీమద్యజనయాజనాధ్యయనాధ్యాపనదానప్రతి గ్రహషట్కర్మనిరతాయ శ్రీమత్ కౌండిన్య సగోత్ర పవిత్రయలకూచ్యన్వయాంభోధిపూర్ణసుధాకరాయ శ్రీసర్వే...శ్వరయజ్వనః పౌత్రాయ శంభుసోమయాజినః పుత్రాయ చతుర్వేదపారంగతాయ యజుశ్శాఖాధ్యాయినే షడ్దర్శనీవల్లభాయ శ్రుతి స్మృతీతిహాస పురాణసమ్యగ్విచారితశుద్ధాంతఃకరణాయ శిష్ట...మనస్తుష్టికరాయ శ్రీవల్లభశిష్టనామధేయద్విజాయ కుండినీనామనగర ప్రాగ్భాగే భద్రానదీ పశ్చిమతీరప్రాంతదేశే శ్రీకృష్ణానదీ పశ్చిమయామ్యదిక్సంధిస్థ జనపదేషు ప్రసిద్ధమంచాల్లాఖ్యగ్రామ మతిముఖ్యాగ్రహారదానం కర్తుమిచ్ఛన్..........
సకలజగద్ధిత వేదవేదాంత సర్వతంత్రస్వతంత్రైక స్మృతిపురాణేతిహాససారజ్ఞాన్ యజనయాజనాధ్యయనాధ్యాపన దానప్రతిగ్రహషట్కర్మ నిరతాన్...శమదమాది సంపన్నాన్ సంధ్యాస్నానజపహోమస్వాధ్యాయపితృతర్పణా తిథ్యవైశ్వదేవాఖ్య నిత్యకర్మానుష్ఠాననిరతాన్ నైమిత్తిక సత్కర్మచతురాన్ పితృమాతృ గురు

దేవతార్చనపరాన్ సమ్యక్ జ్ఞానశీలాన్ స్వధా స్వాహాకారార్చిత హవ్యకవ్యసంతుష్టత్రిలోకాధిష్ఠిత దేవాధిశపాత్కృత నిజమనోల్లాసాన్... భూదేవాన్ తత్తదుచితాసనోపవిష్టాన్ అర్ఘ్యపాద్యపూర్వకాఖిలాలంకార సమాయుక్తాన్ సాష్టాంగపూర్వ మభివంద్య హేమాద్ర్యాది ధర్మశాస్త్రోక్తక్రమేణ దేశకాలపాత్ర మాహాత్మ్య సభాయాం సత్పాత్రద్విజత్వం ప్రకటీకుర్వన్ ప్రార్థయతి— 18.

శ్లో. అథ వేమ మహీపతిః కదాచి చ్ఛ్రుతిసారం ద్విజబృందమర్చయిత్వా
నిగమాగమపారగం బభాషే యలకూచ్యన్వయవల్లభం విశిష్టమ్. 19.

శ్లో. అథైనమాం వేమమహీపతిం భవ త్ప్రసాదయోగ్యం సజసాష్టభోగకమ్
దదే౽గ్రహారం పరిగృహ్య సాదరా త్సంతార యా శూధయవంశజాలమ్. 20.

శ్లో. ముఖ్యాగ్రహారాన్ భువిభూసురేంద్రా వదంతి హేమాద్రిముఖా స్స్మృతీశ్వరాః
భోగాష్టకప్రాప్తఫలప్రవృద్ధ ప్రతిగృహీత్రన్వయసారభూతాన్॥ 21.

శ్లో. పౌరోహిత్యం యాజకత్వం ప్రభుత్వం జ్యోతిస్సారం హేమముద్రాపరీక్షా
సాముద్రాఖ్యం లేఖకం యాజమానం ప్రోక్తం సద్భి గ్గ్రామభోగాష్టకం హి. 22.

శ్లో. నిధిశ్చ నిక్షేపజలాశ్మసార మక్షీణమాగామ్యథసిద్ధసాధ్యే
భోగాష్ట రశ్మి ప్రకరం సదుక్తం దానాధిపత్యం క్రియవిక్రయేశం. 23.

శ్లో. ఏవమష్టవిధభోగతేజసా స్వామ్యదానముఖవేదయోగ్యతా
గ్రామదానవిధిసంభృతాబుద్ధి ర్ముఖ్యదాన మితి వేదబోధితమ్. 24.

శ్లో. తేజోభోగస్వామితాసంగ్రహీతు ర్యస్మిన్ గ్రామే వర్తతే భూరికాలం
స్మృత్యుక్తం తద్గ్రామదానం హి ముఖ్యం దాతా లోకాతీత మాప్నోతిధామ. 25.

శ్లో. ఇతి వేమమహీపతిః కరోద్య త్కుశహేమాక్షతతోయపూర్వకం
విదధేత మహాగ్రహారదానం ద్విజసంఘోత్కటశిష్టవల్లభాయ. 26.

శ్లో. శాకాబ్దే కరతర్కభాస్కరమితే (౧౨౬౨) శ్రీవిక్రమాఖ్యేసమే
చూడామణ్యుపరాగయుగ్విధు (దినే) శ్రీమార్గ రాకాతిథౌ
ప్రాదాద్వేమమహీపతిః పురవరం శ్రీవల్లభాయస్థిరం
మంచాల్లాభిధ మష్టభోగసహితం యావత్క్షితీంద్వర్కభం. 27.

శ్లో. విచింత్యదాసగ్రహణాపరాధ నివృత్తిమత్యుత్కటపుణ్యసిద్ధ్యై
శిష్టాగ్రణీ ర్వల్లభశిష్టనామా వృత్తిప్రదానాయ మన శ్చకార.

శ్లో. శ్రీమద్ధరితసగోత్రం వేమార్యన్వయలింగయజ్వనః పౌత్రం। రామేశ్వరదీక్షితపుత్రంచన్నం భట్టార్యం సాహాశుద్ధమతిః॥ 28. యుమ్మజ్జామాతరమార్యం కౌశికగోత్రంతిప్పయజ్వనఃపౌత్రం। శ్రీవేంకటేశపుత్రం బ్రహ్మభట్టం ధూళిపాళవంశభవం॥ 29. ఆమంత్రయ శాండిల్యసగోత్రరవిశ్వేశ్వరశర్మణః పౌత్రంహరిదీక్షితస్యపుత్రం వీరం భట్టం పౌణ్కుపాటవంశజనిం॥ 30. యాయం మహాంతః ఖలు వేమభూపః శ్రీకుండినీపట్టణపూర్వభాగ భద్రానదీపశ్చిమ దిగ్విభాగ। మంచాల్లనామ్నా జ్వలదగ్రహారం।దదౌకుశస్వర్ణపయోక్షతై ర్మమ॥ 31. ప్రక్షాళ్య పాదౌ సహిరణ్యపాత్రే దానం మహాముఖ్య మథస్మృతీరితం వృత్తిప్రదానం ప్రకరో మ్యహం బుధాః సం

కృత్యాదానగ్రహణానంతరాధాన్ని వర్తయధ్వం ద్విజపుంగవానాం॥ 32. తథేతి తేప్య త్రిపరిగృహ్య ముదా। కుర్వన్ ద్విజాస్సమ్య గపోచు రాదరాత్॥ శ్రీవేమభూపః కృతకృత్య ఆసీత్తుష్టా మహాభూతగణాశ్చ సర్వే। విద్యాతపస్స్వాద్విరాజమానమహీసురాక్రాంతమహాగ్రహారః 33. మంచాళ్లనామ్నా స్థిమితాన్యమాం... శంభోర్ద్విజావల్లభశిష్టముఖ్యాః 34. తత్రాగ్రిమభాగే దశకాని వేదభాగాంశ్చ కృత్వా శ్రీవేమమహీపః। క్షితిసురవరతృప్తిమాజగామేద్ధం॥ 35. అత్రమూర్ధ్నికానంతరశ్లోకసంఖ్యా ౧౯॥ సర్వంసంభూయపద్యాని షట్త్రింశత్ సంఖ్యా। ఏకచూర్ణికా॥ అథ భాగనిర్ణయః. యలకూచి సర్వేశ్వరసోమయాజినః పౌత్రాయ శంభుసోమయాజినః పుత్రాయ వల్లభశిష్టాఖ్యాయ ముఖ్యభాగః॥౧॥ వేమూరి లింగయజ్వనః పౌత్రాయ రామేశ్వరదీక్షిత పుత్రాయ చెన్నంభట్టాయ ఏకభాగః॥౧॥ ధూళిపాళ్ల తిమ్మయజ్వనః పౌత్రాయ వెంకటేశపుత్రాయ బ్రహ్మభట్టనామ్నే ఏకభాగః॥౧॥ పోణ్కుపాటి విశ్వేశ్వర పౌత్రాయ హరిదీక్షితపుత్రాయ వీరంభట్టనామ్నే ఏకభాగః॥౧॥ ఏవం భాగచతుష్టయం సమాంశం। అథైకస్మిన్ భాగ వృత్తైచతుష్టయం వర్తతే। తద్గోత్రనామధేయ పూర్వకం లిఖ్యతే యలకూచి వల్లభశిష్టభాగే దశకనిర్ణయః। కౌండిన్యసగోత్రోద్భవస్య శ్రీవిశ్వేశ్వరయజ్వనో నప్తుః సర్వేశ్వరసోమయాజినః పౌత్రస్య శంభుసోమయాజినః పుత్రస్య వల్లభశిష్టాఖ్యద్విజస్య దశకద్వయం ॥౨॥ శ్రీవత్స సగోత్రోద్భవస్య కంచిభట్ల నాగేశ్వరశర్మణో నప్తుః పెద్దిభట్ల పౌత్రస్య శేషాద్రిభట్టపుత్రస్య రామాభట్టాఖ్య ద్విజస్య దశకార్ధం గౌతమసగోత్రోద్భవస్య విరూపాక్ష దేవర నారసింహభట్టనప్తుః భావనారాయణపౌత్రస్య విశ్వనాథపుత్రస్య నృసింహభట్టారకస్య అర్ధదశకం కౌండిన్యసగోత్రోద్భవస్య యలకూచి తిరుమలభట్టనప్తుః విరూపాక్షపౌత్రస్య వీరావధానిపుత్రస్య నాగయనామధేయస్య అర్ధదశకం। కౌండిన్యసగోత్రోద్భవస్య చల్లా ఓబళభట్టారకనప్తుః వఝ్ఝలపౌత్రస్య కొండావధానిపుత్రస్య రామచంద్రభట్టారకస్య అర్ధదశకం। అథద్వితీయభాగినః హరితసగోత్రోద్భవస్య వేమూరి చెన్నభట్టనప్తుః లింగయజ్వనః పౌత్రస్య రామేశ్వరదీక్షితపుత్రస్య చన్నభట్టారకస్య ఏకదశకం। భారద్వాజసగోత్రస్య కొండూరి పర్వతభట్టనప్తుః కామాక్షిపౌత్రస్య వెంకటయ్యపుత్రస్య గోవిందయ్యాశర్మణః పాదదశకం। వశిష్ఠగోత్రోద్భవస్య వాజపేయుల తిప్పావధానినప్తుః పురుషోత్తమపౌత్రస్య పుండరీకభట్టారకపుత్రస్య కృష్ణం భట్టారకస్య త్రిపాదదశకం। యలకూచి తిమ్మావధానినో నప్తుః కౌండిన్య సగోత్రోద్భవస్య పేరుభట్టపౌత్రస్య విశ్వనాథపుత్రస్య రామలింగభట్టారకస్య ఏకదశకం। కౌండిన్యసగోత్రోద్భవస్య పెద్దిభట్టశేషభట్టనప్తుః నారసింహశర్మణః పౌత్రస్య హరిభట్టపుత్రస్య సర్వాయనామధేయస్య ఏకదశకం। అథ తృతీయభాగినః కౌశికగోత్రోద్భవస్య నారాయణభట్టనప్తుః తిమ్మయజ్వపౌత్రస్య వెంకటేశపుత్రస్య బ్రహ్మభట్టారకస్య ఏకదశకం। కౌండిన్యసగోత్రోద్భవస్య నేతిరామాభట్టానప్తుః సూర్యనారాయణపౌత్రస్య చినతిమ్మభట్టపుత్రస్య గోవిందభట్టారకస్య ఏకదశకం। కాశ్యపసగోత్రోద్భవస్య విశ్వనాథభట్ట విద్దయనామధేయస్య నప్తుః పరమేశ్వరపౌత్రస్య చంద్రావధానిపుత్రస్య చంద్రశేఖరభట్టారకస్య అర్ధదశకం। కౌండిన్యసగోత్రోద్భవస్య బండ్లమూడి నర్సంభట్టారకనప్తుః మాధవభట్టపౌత్రస్య నరసింహశర్మణః పుత్రస్య పెద్దవిస్సయ నామధేయస్య అర్ధదశకం। మౌద్గల్యగోత్రోద్భవస్య చినరావూరి అశ్వత్థభట్టనప్తుః బ్రాహ్మణాయపౌత్రస్య వెంగయనామధేయపుత్రస్య చినవీరప్పనామధేయస్య ఏకదశకం అత్ర దశకచతుష్కే పురుషాః పంచ। అథచతుర్థభాగినః కౌండిన్యసగోత్రోద్భవస్య పణుకుపాటి పెద్దిభట్లనప్తుః విశ్వేశ్వరపౌత్రస్య హరిదీక్షితపుత్రస్య వీరంభట్లనామ్న ఏకదశకం। కౌండిన్యసగోత్రోద్భవస్య యలకూచి చినపెద్దిభట్టనప్తుః విష్ణుభట్టపౌత్రస్య శంకరభట్టపుత్రస్య చినవల్లభానినః ఏకదశకం... హరితసగోత్రోద్భవస్య పోతుకూచి రామేశ్వరనప్తుః అయ్యవారిభట్టపౌత్రస్య పార్వతిభట్టపుత్రస్య మల్లికార్జునభట్టారకస్య ఏకదశకం। శృంగిభారద్వాజసగోత్రోద్భవస్య శింగావధానులగోపీనాథ

భట్టనప్తుః శ్రీగిరినాథపౌత్రస్య మధుసూదనపుత్రస్య మల్లయనామధేయస్యైకదశకం। ఏవం భాగచతుష్టయే షోడశదశకాని ప్రతిపాత్। పురుషాస్స్తదశసంఖ్యాకాః శ్లోకం॥ 36.

శ్లో. దేవద్రవ్యం గురుద్రవ్యం విప్రద్రవ్యం తథైవచ। అపేక్ష్య యాంతినరకం భక్షయంతి కులక్షయం ఏకైవభగినీ లోకే సర్వేషామేవ భూభుజాం। నభోజ్యా న కరగ్రాహ్యా విప్రదత్తా వసుంధరా। మద్వంశజాః పరమహీపతివంశజా వా। యే భూమిపాస్సతతముజ్జ్వలధర్మచింతా॥ మద్ధర్మమేవ మనిశం పరిపాలయంతు తత్పాదుకాద్వయ మహాంశిరసావహామి అథ గ్రామనివేశనిర్ణయః కౌండిన్య సగోత్రోద్భవవల్లభశిష్టహస్త ప్రమాణేన గ్రామోపకంఠసహిత గ్రామనివేశనానాం। 37.

ఏకైక భాగస్య తత్తద్దశకసహితస్య అవాంతర నివేశపూర్వకం లిఖ్యతే. గ్రామమధ్యమ భాగాదుత్తమ దేశమధ్యస్థలే కౌండిన్యగోత్రోద్భవ వల్లభశిష్టానాం నివేశభూప్రమాణం పంచాశద్ధస్తదీర్ఘం తత్ప్రమాణ మేవ ఆయామః। ఏవం చతురశ్రభూమినివేశనం। తదుత్తరభాగే శ్రీవత్సగోత్రవంచిభట్టనివేశనం ద్వాదశదీర్ఘం నవ యామప్రమాణం తత్పూర్వభాగే గౌతమగోత్రోద్భవవిరూపాక్ష దేవరనృసింహభట్టారకస్యనివేశనం భూమేః ప్రమాణం దశహస్తప్రమాణం। కౌండిన్యసగోత్రోద్భవస్య నాగయనామధేయస్య నివేశనప్రమాణం తత్పశ్చిమదిశి చతురశ్రమార్గేణ నవహస్తప్రమాణం। కౌండిన్యసగోత్రోద్భవస్య నాగయనామధేయస్య నివేశనప్రమాణం। తత్పశ్చిమదిశి చతురస్రమార్గేణ నవహస్తప్రమాణం కౌండిన్యసగోత్రోద్భవస్య చల్లా రామచంద్రభట్టారకస్య తత్పశ్చిమదిశి చతురస్రం సప్తహస్తనివేశనం॥ 38.

ఏవం వల్లభశిష్టభాగనివేశనం. అథ ద్వితీయభాగినః హరితసగోత్రోద్భవస్య చన్నంభట్టారకస్య వల్లభశిష్టహస్తప్రమాణేన గ్రామస్య పూర్వభాగే పంచవింశతిహస్తప్రమాణం చతురస్రనివేశనం। తదుత్తర భారద్వాజసగోత్ర కొండూరి గోవిందయశర్మణః చతురస్రనివేశనప్రమాణం। తద్దక్షిణదిశివశిష్ఠగోత్రోద్భవ వాజపేయులకృష్ణంభట్టారకస్య సప్తహస్తప్రమాణం చతురస్రమా। తత్పూర్వదిశి కౌండిన్యసగోత్రోద్భవ యలకూచి రామలింగభట్టారకస్య దీర్ఘచతుస్రమేణ దశహస్తదీర్ఘతావిస్తారస్తు పంచహస్తమానం। తత్పశ్చిమే కౌండిన్య సగోత్రోద్భవస్య పెద్దిభట్ల సర్వయనామధేయస్య గృహనివేశనం వృత్తాకారేణ త్రిహస్తప్రమాణం దీర్ఘతా పంచహస్తవర్తులతా ఏవం చన్నంభట్టారకభాగనివేశనం। అథ తృతీయభాగినః కౌశికగోత్రోద్భవస్య ధూళిపాళ బ్రహ్మభట్టారకస్య గ్రామస్య దక్షిణభాగే పంచవింశతిహస్తప్రమాణం చతురస్రమక్రమనివేశనం॥

తదుత్తరే కౌండిన్యసగోత్రోద్భవనేతి గోవిందభట్టారకస్య దీర్ఘేణ చతురశ్రమేణా విస్తారదీర్ఘతా పంచహస్తదశహస్తికా తత్పూర్వదిశి కాశ్యపగోత్రోద్భవస్య విశ్వనాథభట్లచంద్రశేఖరభట్టారకస్యచతురశ్రక్రమేణ ద్వాదశహస్తనివేశనం. తద్దక్షిణదిశి కౌండిన్యగోత్రోద్భవ వండ్లమూడి పెద్దవిస్సయనామధేయస్య గృహనివేశనం చతురశ్రక్రమం। దశహస్తప్రమాణం। తత్పశ్చిమే మౌద్గల్యగోత్రోద్భవస్య వీరప్ప నామధేయస్య దశహస్తప్రమాణ చతురశ్రనివేశనం. ఏవం బ్రహ్మభట్టారకభాగనివేశనం; అథచతుర్థభాగినః శాండిల్యసగోత్రోద్భవస్య వీరంభట్టనామ్నం గ్రామస్య పశ్చిమభాగే చతురశ్రక్రమేణ పంచవింశతిహస్తమానం గృహనివేశనం తత్పూర్వదిశి కౌండిన్యసగోత్రోద్భవ యలకూచి చినవల్లభధానినః చతురశ్రక్రమేణ ద్వాదశహస్తమాననివేశనం; తద్దక్షిణభాగే హరితసగోత్రోద్భవ పోతుకూరి మల్లికార్జునభట్టారస్య దీర్ఘచతురశ్రమార్గేణ ద్వాదశహస్తప్రమాణేననివేశనం॥ తత్పశ్చిమదిశి శృంగి భారద్వాజగోత్రోద్భవ శింగావధానుల మల్లయనామధేయస్య చతురశ్రక్రమేణ ద్వాదశహస్తమాననివేశనం. ఏవం లింగభట్టభాగనివేశనం। ఏవం గ్రామోపకంఠాది నివేశన విధిక్రమః॥ 39.

# తాత్పర్యము.

♦ (7 మొదలు 17 శ్లోకమువరకు) నారాయణుని పాదపద్మయుగళమునుండి నాలుగవజాతి ఉదయించెను పంటరెడ్డికులమందుపోలయ జన్మించెను. అతడు అకస్మాత్తుగా 'స్వర్ణకర'-(బంగారముచేయువాడు అను) ప్రసిద్ధినిపొందెను. అతనికి అన్నమాంబయందు ఐదుగురు కుమాళ్లు కలిగిరి. ఆ కుమాళ్ళయందు 'వేమభూపతి' రిపుభయంకరుడై దిక్పాలకాంశతో తేజరిల్లుచు అనేకములైన గిరిదుర్గముల నాక్రమించెను. అతడు సామంతరాజులచే సేవింపబడుచు, కుండినపురిరాజధానిగా భూమండలమును పరిపాలించెను. అతడు బ్రాహ్మణధర్మమును పోషించెను. బ్రాహ్మణుల కనేకాగ్రహారములను ధారపోసెను.

(18 గద్య) స్వస్తి మహారాజాధిరాజ, రాయదేవ, రాజవేశ్యాభుజంగ, నరేంద్రతిలగుండుగండ, జగనొబ్బగండ, ముఖ్యాగ్రహారదాన ఇత్యాది బిరుదాంకితుడును, శ్రీ విరూపాక్ష, బసవశంకరాంకలోహముద్రకలుగల దాత ప్రతిగ్రహీతల వంశవర్ణనలచే నొప్పునట్టి తామ్రశాసనములచే చిరస్థాయి గలిగిన కీర్తివంతుడును, చాసీతిదుర్గ నిర్మాణచతురుడును, శ్రీశైలశిఖరమువరకును సోపానముల గట్టించినవాడును. శ్రీ మహాపంటరెడ్డి వంశవృద్ధికరుడును, శ్రీ విశ్వనాథ త్రిపురాంతక దేవపాదారవింద మకరందాస్వాదన మధుకరాయ మానసుడును, శ్రీమత్ పోలయాన్నమాంబా కుమారుడును, కుమారస్వామితుల్యుడును, అగు వేమభూపాలుడు షట్కర్మనిరతుడును, కౌండిన్య సగోత్ర సంభవుడును, సర్వేశ్వర యజ్వపౌత్రుడును, శంభుసోమయాజి పుత్రుడును, అగు యలకూచివల్లభ శిష్టకు కొండిపీటికి తూర్పునను, భద్రానదికి పశ్చిమతీర ప్రాంతమునను, కృష్ణానదికి పశ్చిమదక్షిణదిక్కులు కలియుసంధినిగల దేశమందలి, మంచాళ్ళ అను ప్రసిద్ధగ్రామమును ముఖ్యాగ్రహారదానముచేయు బుద్ధికలవాడై శృతి, స్మృతి, తంత్ర, పురాణ ఇతిహాసపారగులగు బ్రాహ్మణులను పిలిపించి, అర్చించి, సాష్టాంగముగ నమస్కరించి, యలకూచి వల్లభశిష్టకు అష్టభోగ తేజస్వామ్యములు గల ముఖ్యాగ్రహారదానము చేసెను. వల్లభశిష్టదానగ్రహణమువలన కలుగు పాపనివృత్తికై మంచాళ్ల అగ్రహారములో శృతిస్మృతిపారగులగు బ్రాహ్మణులకు వృత్తులు, గ్రామనివేశనములను దానము చేసెను.

♦ V శా॥ శ॥ 1265.

శ్లో. పాయా ద్వారాహవపుషః పరమస్య పుంసో। దంష్ట్రాజగంతి శిఖరేణధరాం దధానా।
శృంగాగ్రభాగ పరిచుంబిత మేఘబింబా। సం లక్ష్యమాణ సుషమేవ శశాంకరేఖా ॥ 1

---

♦ ఈ మంచాళ్లశాసనము మూలము లోకల్ రికార్డు 12 వ వాల్యూం 16 పుటలోను, 42 వాల్యూం 382 పుటలో సేకరింపబడియున్నది. మూలతామ్రశాసనము లభించలేదు. ఈశాసనమును బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారిచే రెడ్డిరాణిపత్రిక, 1 వ సంపుటము 178, 180, 209-212 పేజీలలో నిర్దుష్టముగ ప్రచురింపబడినది. [సం]

♦ ఈ మాట్లూరిశాసనము లోకల్ రికార్డులు 57 వ వాల్యుం 114 పుటయం దీయబడినది. బ్రహ్మశ్రీ వేటూరి ప్రభాకరశాస్త్రిగారిచే రెడ్డిరాణిపత్రిక 3వ సంపుటము 365 పుటయందు ప్రచురింపబడినది. [సం]

శ్లో. లీలాద్యూత జితాంకలాధరకలాం మాళౌదృఢం కీలితా ।
మాహర్తుం యుగమున్న మయ్యుభుజయోర్విశ్లేషయంత్యా మిథః ।
పార్వత్యాః కుచకుంభ పార్శ్వయుగళే సపేృతులోలేక్షణః ।
కాలక్షేపణ మిందు మోచనవిధాకాంక్షన్ శివఃపాతువః ॥ 2

శ్లో. తమోహరేతాం తవపుష్పవంతౌ। రాకాసు, పూర్వాపరశైలభాజౌ।
రథాంగలీలామివదర్శయంతౌ। పురాపురేః పృధివీరథస్య ॥ 3

శ్లో. యస్మాశ్రానిహితం-నిరాయనిగమైర్ధేయ్యయంచయద్యోగిభిర్యల్లక్ష్మీకరపల్లవోదరగతైస్సంవాహనైర్లాలితమ్
జాతాయత్ర వియన్నదీ త్రిజగతీసంతాపనిర్వాపణీ। తస్మాదావిర భూత్పదా న్మధురిపోర్వర్ణశ్చతుర్థోవరః॥ 4

శ్లో. వినిర్మితో విశ్వసృజాప్రియత్నా త్సర్వేషు వర్ణేష్వపిసారభూతః
లోకే మహా...................................................... 5

శ్లో. తస్మాదభూద్వేమయ సైన్యనాథో వంశస్య కర్తా పరివిక్రమశ్రీః,
పృధుప్రతాపస్య భుజేనపాదే గాక్యావ నూర్యేషు గుణైర్నిబద్ధాః (?) 6

శ్లో. సంగ్రామపార్థస్య శరైర్విభిన్నా యస్యారిమూడామణయోవిచేలుః
ఆక్రామతస్సం యతిరాజవంశాప్రతాప వహ్నేరివ విస్ఫులింగాః॥ 7

శ్లో. పుత్రస్తస్య భుజాద్వినిర్జితరిపుః ప్రోలక్ష్మమాధీశ్వరః యస్యోదగ్రతరప్రతాప రవిణాసంతాపితా వైరిణః
విందం తేనచ నిర్వృతిం జలనిధిద్వీపేష్వనూపేషుచ ఛాయావృక్షసమాకులేషుసరితాంకూలేషుశైలేషుచ॥ 8

శ్లో. యత్కీర్తిగానసమయే ఫణిసుందరీణామాలోకితుం చ ముఖరాగమనంగ మూలమ్
శ్రోతుంచ గీతరచనాం యుగపన్నదక్షోనాగాధిపోన సహతే నయనశ్రుతిత్వమ్॥ 9

శ్లో. సింధోశ్శ్రీరివదొడ్డయాద్గుణనిధే ర్జాతాన్నమాంబా తతః
సాసీత్తత్పురుషోత్తమస్యదయితాసా నూతపంచక్రమాత్ (?)
సాక్ష్వీగమసూతిమాచనృపతిం శ్రీవేమపృథ్వీపతిం ।
దొడ్డక్ష్మాభుజమన్నభూమిరమణం శ్రీమల్లభూవల్లభమ్॥ 10

శ్లో. తేషాం సద్గుణోత్తర స్సురపతే శ్శ్రీవేమపృథ్వీశ్వరో హేమాద్రిప్రతిమానదాననిగతోధర్మప్రతిష్ఠాగురుః
యస్మిన్ శాసతిపాకశాసననిభేసర్వంమహీమండలం పృచ్ఛంతిక్రతుభాగదాననిరతా భూనిర్జరానిర్జరాన్ 11

శ్లో. ప్రాదాత్పుణ్యతరంగిణీ ముభయతః కృష్ణాంచగోదావరీం
విప్రేభ్యః కిలవేమభూతలపతి స్సాగ్రహారాన్ బహూన్
నైతచ్చిత్ర మనన్య రాజసుకరం నిస్సీమదానం భువో
యేన బ్రాహ్మణజాతిమాత్ర సులభావృత్తిః కృతావర్ష్యతి॥ 12

శ్లో. స్తంభాన్ కీర్తికృతేసృజంత్యకుశలాభూమీశ్వరానశ్వరాన్నిర్మాన్యకృతేర్వినిర్మలమతేశ్శ్రీవేమపృథ్వీపతేః
యేన శ్రీగిరిరప్యహోబలగిరిస్సోపానమార్గాంకితౌ విఖ్యాతౌరచితౌసనాతన యశస్స్తంభాతలంభూతలే.13

శ్లో. వేమక్షితీశోవృషమేకపాదం ఖంజప్రకారం కలికాలదోషాత్
దత్తాగ్రహారద్విజ వేదశక్త్యా పదత్రమైరస్ఖలితం చకార॥ 14

శ్లో. ధర్మాత్మజోదాశరథిః పృథుశ్చేత్యుదీర్య మాణానియుగాంతరేషు
వితర్కయే వేమనరేశ్వరస్య పుణ్యాని నామాని పురాతనాని॥ 15

శ్లో. శాకాబ్దే శరతర్క భానుగణనా యుక్తే శుభేతారణే
ఫాల్గున్యాము పరాగపుణ్యసమయే శ్రీవేమభూమీశ్వరః
పుణ్యార్థంనిజమాతులస్య కృతినః శ్రీనాగసేనాపతే
గ్రామంప్రాదిశ దష్టభోగసహితం ముట్లూరు నామాంకితమ్॥ 16

శ్లో. దత్తం మాతులపుణ్యాయ చైకభోగం తు శాశ్వతమ్,
కృత్వా గ్రామం తస్య నామ్నా రాజా నాగపురం వ్యధాత్ 17

శ్లో. ప్రాదాన్మృత్యుం జయా ర్యాయ యావనాశశ..యచ
కౌండిన్య మునిగోత్రాయసాష్టభోగం పరార్థవమ్॥ 18

## తాత్పర్యము

సమస్త వర్ణములయందును సారభూతమగు నాలుగవవర్ణమునందు. వంశకర్తయును, విక్రమ శ్రీయుతుడును అగు వేమసైన్యనాథుడు జనించెను. అతనికుమారుడు రిపుజేతయగు ప్రోలక్ష్మాధీశ్వరుడు. ఆప్రోలయకు దొడ్డయకుమార్తెయగు అన్నమాంబవలన మాచ, వేమ, దొడ్డ, అన్న, మల్ల అనుపేర్లుగల కుమాళ్ళు కలిగిరి. వారిందరిలోను వేమపృథ్వీశ్వరుడు ఇంద్రునికంటెను సర్వగుణోత్తరుడు. అతడు కృష్ణా గోదావర్యుభయతటములందు బ్రాహ్మణులకు అనేక సారాగ్రహారములను దానముచేసెను. శ్రీపర్వతాహోబిలపర్వతములకు సోపానములను కట్టించెను. శా॥ శ॥ 1265 అగు తారణ సంవత్సరమున. ఫాల్గుణమాసమున గ్రహణసమయమున శ్రీవేమ భూమీశ్వరుడు తనమేనమామయగు నాగసేనానికి పుణ్యముగా అతనిపేరున, ముట్లూరు అను గ్రామమునకు నాగపురము అను నామముంచి, ఏకభోగముగ యావనాశ..చ్ఛవుడగు మృత్యుంజయార్యునకు అష్టభోగసహితముగ దానముచేసెను.

## ◆ VI శా॥ శ॥ 1267.

1 శ్రీమల్లోకమల నీలనీరజరుచి ర్లీలావరాహ శ్చిరం నాసిప్రోథమృణాలకంద
2. శ శిసద్దంష్ట్రాంకురః పాతువః యస్మిన్నుద్వహతి క్రమేణ వి..త్వాభోగినీలాంశు
3. కాగాగాద్రార్ద్రణతిసూరివ క్షణమ భూదామోదినీమేదినీ 1 ఆసీత్కౌస్తుభ రత్నమం
4. డితతనోర్దేవస్య లక్ష్మీపతేః పాదాత్పద్మనిభ త్త్విషో భగవతీగంగేవపుణ్యోదయా।

---

◆ ఈ శాసనము ఎపిగ్రాఫియా. ఇండికా 8వ సంపుటము 13వ పుటలో ' Madras Museum plates of Anavema ' అనుపేరితో కీ॥ శే॥ జయంతి రామయ్య పంతులుగారిచే ప్రకటింపబడినది. దాన గ్రామపు సరిహద్దులు తెలుపు శాశనభాగము ప్రకటింపబడలేదు. [సం]

5. ఆకల్పస్థిరజీవనా త్రిజగతీసంతారణోద్యోగినీ పర్యాయేణ చతుర్థవ
6. ర్ణవితతి గాంభీర్యధైర్యప్రసూః 2 తద్వంశాబ్ధౌ సకల జనతాసేత్రి సం
7. పూర్ణచంద్రోజాతః కీర్తిప్రభవసదనం వేమయోవంశకర్తా । తస్యోదగ్రస్ఫుర
8. తి సతతం భాన్వతీవ ప్రతాపే నాసీత్కాంతేప్సరి మృగదృశాంహాతారావళి శ్రీః 3 తేషా
9. జనిద్విజనికాయ హితావతారః శ్రీయన్నసూరిః తనుభృతాం మరుతామివేంద్రః। వి
10. రాగ్రణీర్జగతి కోమటి ప్రోలనామాప్రత్యర్థిభూపతి భుజంగవిహంగ రాజః 4.
11. శంభోరద్రిసుతేవ పంకజభువో దేవీయథా భారతీ విష్ణోస్సాగరసంభవేవసరితాం ప
12. త్యుర్యథా జాహ్నవీ । సూర్యస్యేవసువర్చలా శశభృతః పుణ్యాయథారోహిణీరూధా
13. కోమటి ప్రోలయస్య సదృశీభార్యాన్నమాంబా సతీ 5 ఉత్సాహత్రి దివౌకసాం సుగత
14. రూన్ క్ష్మీన్ర్త్రి రేఖాయథాపుత్రాన్ కోమటి ప్రోలయా ద్గుణవతీసాసూత పంచక్రి
15. మాత్। అగ్రేమాచనృపాల మున్నతమథశ్రీవేమ పృథ్వీపతిం పశ్చాద్దోడ్డయ భూ
16. పమన్నయనృపం శ్రీమల్లయక్ష్మాపతిం 6 సత్యేనసత్వేన పరాక్రమేణ రూపేణ
17. బుద్ధ్యాచ విరాజతస్తాన్। త్రీణాయభూయోపి భువోపతీన్ద్రానూనం జనోమన్యత
18. పాండుపుత్రాన్ 7 అథ సకల బుధానామాశ్రయః పాలనాయ క్షితి తలమవ తీ
19. ర్ణో కంసముద్వివదేవః కలిసమయవిధృమ్య ద్దస్యుభూపాన్నిరస్య న్వహతి సకల
20. పృథ్వీం వేమయక్షోణిపాలః 8 దృష్టానంతరరాజభూరుహమహాసోత్రోత్సవః।
21. నిర్ఝరో మైత్రీసంగతరాజకైరవవనీ సంపూర్ణచంద్రోదయః। మాద్యన్మన్నె నృపా
22. ల తూలపవనో మ్లేచ్ఛాబ్ధికుంభోద్భవః శ్రీమాన్ కోమటివేమభూపతి రసౌవీరః
23. కథంవర్ణ్యతే 9 రణశిరసివిచిత్రం రాయచే కోలుగండ ప్రకటతరకృపాణ క్షు
24. ణ్ణగాత్రైః క్షణేన। పపథివియతి భిందం త్యర్కతాస్త త్ప్రతాప ప్రతిక్రతిమిసబింబం
25. ప్రత్యనీక క్షితీంద్రాః 10 నిత్యంత్వత్తారుణ్యాదర్ప స్ఫురితకుచ భరోదారిబృందా
26. రనారీహేలా సంచారిలీలా సుభగసురపురి ప్రాంగణారోహణా
27. యః। అ వింశాద్వంశజానామతికరుణతయా యేనపూర్వాపరాణాం నిత్యంఛా
28. నాతిదానప్రతసుకృత మహాదానవిశ్రేణికాశిల్పం 11 శ్రీమత్కాకేత వంశశేఖరమణే
29. రా వీరరుద్రాన్నృపాత్ప్రాప్తె శ్లేచ్ఛధరాధి పైరపహృతా విప్రాగ్రహారాః కలౌ। సర్వే యే
30. సముద్ధృతాస్తు మనఘం శ్రీవేమ పృథ్వీపతిం వీరం విష్ణుపరాక్రమం కథ
31. మహోస్తోతుం సమర్థాజనాః 12 శ్రీపల్లవ త్రినేత్రాంకో ధన్యోవేమమహీపతిః। శ్రీఘోడ
32. రాయ గంగాఖ్యగురుపదాబ్జ షట్పదః 13 అస్తి శ్రీగిరిపూర్వ పాదనికటాదాపూర్వ పా
33. దోనిధేర్దేశః కుండితరంగిణీముభయతః శ్రీ పూంగినామాంకితః। తస్మిన్ భాను
34. ర సౌధగోపురవతో నిత్యోత్సవాలంకృతానంద త్పౌరజనావి భాతినితరా మద్దంకినామా

35. పురీ 14 ఉద్దండమండలికమండలకాలదండో దోర్దండ విక్రమ వినిర్జి
36. త వైరిలోకః। సోయంబి భర్తి నగరీంనగరాజధీరః శ్రీవేమభూపతిరి మాం
37. జగనొబ్బగండః 15 సప్తసంతానవత్యాసీ న్మహీ వేమవిభోరితి స్పర్ధయేవ ధృతాః కీర్త్యా
38. గర్భే లోకాశ్చతుర్దశ 16 శాకాబ్దే కుధరర్తుభాను 1267 గణితే చైత్ర్యాంశ
39. శాంకేతమోగ్రస్తే విప్రగణాయవేమనృపతి ర్మాండూకశంభోః పురః। ప్రాద
40. త్తస్ఫుటమాతుకూరు మనఘప్త్సైశ్వర్యభోగాష్టకం శ్రీకృష్ణోత్తరకూలసంస్థమ
41. తులం గ్రామం మహాశ్రియనే (17) స్వనామచిహ్నితంన్వత్వా దత్తో వేమమహీభుజాక్షే
42. ష్మో భాత్యగ్రహారాణాం గ్రామో వేమవరాహ్వయః॥

## తాత్పర్యము.

చతుర్థవర్ణమునందు వంశకర్తయగు వేమయ పుట్టెను ఆతనికుమారుడుకోమటిప్రోలయ. ఆతనికిఅన్నమాంబయందు మాచ, వేమ, దొడ్డ, మల్ల అను కుమారులుకలిగిరి. వారు సత్యమునందును, పత్యమునందును పరాక్రమమునందును, రూపమునందును, బుద్ధియందును క్రమముగా పాండుపుత్రులవంటివారు. వారలలో వేమయక్షోణిపాలుడు సర్వగుణోత్తరుడు. కలికాలమందు బయలుదేరిన దస్యురాజులను జయించి, భూమిని పాలించెను. ఆతడు మదించిన మన్నెరాజులను జయించెను. ఆతడు మ్లేచ్ఛులనెడి సముద్రమునకు అగస్త్యుని వంటివాడు. కాకేతవంశశేఖరమణియగు వీరరుద్రునిచే దానమివ్వబడిన విప్రాగ్రహారములు, మ్లేచ్ఛులచే అపహరింపబడగా వేము డాయగ్రహారముల నన్నిటిని తిరిగి వశము చేసుకొని బ్రాహ్మణులకిచ్చెను. వేముడు పల్లవత్రినేత్రాంకుడు. ఘోడెరాయగంగగురుశిష్యుడు. శ్రీశైలపు తూర్పుపాదముమొదలు తూర్పుసముద్రము పరకును కుండినది కిరుప్రక్కలనున్నట్టియు దేశమునకు పూంగిదేశమని పేరు. అందు అద్దంకి యను పురముకలదు జగనొబ్బగండడగు వేముడు ఆపురమును పాలించుచున్నాడు. శాలివాహనశకము 1267 వ సంవత్సరమున చైత్రమాసమునందు, చంద్రగ్రహణసమయమున కృష్ణానదీఉత్తరఘట్టమున ఉన్న ఆతుకూరు గ్రామమునకు వేమపురమని తనపేరిడి మాండూకశంభుదేవునిసన్నిధిని బ్రాహ్మణులకు అష్టైశ్వర్యభోగములతో గూడ అగ్రహారదానము చేసెను.

## VII శా॥శ॥ 1267.

1. శాకాబ్దే రసతర్క భానుగణితే సంవత్సరే పార్థివే
కార్తిక్యా ముపరాగపుణ్యసమయే భానో శ్శుభే వాసరే
శ్రీమద్వేమనృపోష్టభోగసహితం సర్వాగ్రహారం దదౌ
గ్రామం పెర్వలినామకం ద్విజగణస్యాచంద్రమాతారకం ॥

ఈ శాసనము ఎపిగ్రాఫియా ఇండికా ఐదవసంపుటము 13 పుటలో జయంతి రామయ్యపంతులుగారిచే ప్రకటింపబడినది. దానగ్రామపుసరిహద్దులు తెలుపు తెలుగుభాగమువారిచే ప్రకటింపబడలేదు. [సం]

ఈ పెరవలి శాసనము నకలు లోకల్ రికార్డులు 57 వ సంపుటములో 131 పుటయందున్నది. [సం]

2\. ......సోయమస్మిన్ పుణ్యదినే స్నాత్వా కృష్ణానదీజలే
స్వమాతు రన్నమాంబాయాః పృథుపుణ్య సువృత్తయే
గ్రామం పెర్వలినామానం అష్టాధికశతాని చ
కృత్వాగ్రజన్మభ్యః సహిరణ్యోదకం దదౌ ॥

## తాత్పర్యము

శకవర్షములు 1266 అగు పార్థివ సంవత్సర కార్తికబహుళ అమావాస్య ఆదివారమునాడు సూర్యగ్రహణకాలమందు వేమభూపాలుడు కృష్ణానదీజలములందు స్నానముచేసి తమతల్లి అన్నమాంబ పుణ్యమునకొఱకు పెర్వలి అను గ్రామమును 108 వృత్తులుగాచేసి బ్రాహ్మణులకు సర్వాగ్రహారముగాను, అష్టభోగసహితముగాను, సహిరణ్యోదకముగా దానముచేసెను.

## VIII శా॥ శ॥ 1267.

♦ స్వస్తిశ్రీ శకవర్షంబులు 1267 అగునేంటి పార్థివసంవత్సరకార్తిక శు॥ ౧ అగునాంటి మన్వాది మహాకార్తికపుణ్యకాలమునందు స్వస్తిశ్రీ ధాన్యవాటీశ్వర అమరేశ్వర శ్రీమన్మహాదేవరకుస్వస్తి సకలగుణాలంకార చెంజిమలచూఱకార విశ్వవిశ్వంభరావహన దక్షదక్షిణభుజాదండ జగనొబ్బగండ అనియమమండలీకరగండ రాయచేకొలుగండఅర్థిప్రత్యర్థిహేమాద్రిదాననిరత ప్రజాపాలనధురత అమరచరణరూపనారాయణభుజబలభీమ కోదండరామ అపరిమితభూదానపరశురామ అనేక నగరోపకంఠ ప్రతిష్ఠాపితబహువిధారామ సంగడిరక్షపాలక జగరక్షపాలక జగదగోపాళ గుజ్జరిగట్టివిభాళ ఘనభుజవిరాజమానకరవాళ రాచూరిదుర్గవిభాళ అనవరతపురోహితకృతసోమపాన శ్రీపర్వతఅహోబలనిర్మితసోపాన దిక్కాంతామనోహరకీర్తికుసుమామోద కుండిప్రభాసంభ్యాజాగాతమిాజలక్రీడావినోద విరోధినృపదానవనరసింహ పాండ్యరాయగజసింహ ప్రజ్ఞాచతుర్విధోపాయ కేళాదిరాయ నిత్యపరిపాలితసత్య పల్లవాదిత్య రిపునరపతిగోధూమఘట్టనఘరట్ట ప్రియగోపయదికాఱపట్ట సంగ్రామసముద్దండచండ భుజానివిఖండితశత్రుకీలాలప్లవమాన పిశాచగణన్తూయమానయశోమండన అళిగియవరదశిరఃఖండన దుర్మదవైరివీరభయంకర బసువశంకర అమరేశ్వరదేవ శ్రీచరణసరసిరుహదత్తభావ దండెనగోవ బ్రహ్మకుండీ కృష్ణవేణ్ణాగోదావరీ మహానదీతటద్వయ తన్మధ్యదేశదత్తానేకాగ్రహార అగణ్యపుణ్యక్షేత్రసత్రదత్తబహువిధాహార పరపురహరణమృత్యుంజయ సంగ్రామధనంజయ ఉత్తుంగచతురంగబలసేనాసాధక త్రిపురాంతకదేవదివ్య శ్రీపాద పద్మారాధకులైన శ్రీమతు వేమయరడ్డింగారు తమతమ్ముండు మల్లయరడ్డింగారికి అక్షయపుణ్యముగాను గుడిమీది సువర్ణకలశాలు ఐదున్నూ పశిండిపట్టమున్నూ కల్పాంతరస్థాయిగాను సమర్పణసేసిరి. మంగళం మహా శ్రీ శ్రీ శ్రీ.

---

♦ ఈ శాసనము ప్రస్తుతపు గుంటూరుజిల్లాలోని అమరావతిగ్రామమునందలి అమరేశ్వరస్వామి ఆలయములోనిది. South Indian inscriptions Vol. 6 నం 213గా ప్రచురింపబడినది. ఈశాసనములో మూడు సంస్కృతశ్లోకములు కలవు. చారిత్రకవిషయములు, విశేషములేమియు లేకుండుటచే వానిని విడిచినాము.

సంపాదకుడు.

## ♦ IX శా॥ శ॥ 1277. (1267?)

" ఇతిదాతృప్రశస్తిః। అథప్రతిగ్రహీతృప్రశస్తిః॥

13. కుండీనదీ సలిలచుంబితసౌధమూలే। లక్ష్మ్యా... చెదలువాడపురీ—రమ్యే॥
శ్రీరాజమల్ల విభునారచితప్రతిష్ఠే। శ్రీరామలక్ష్మణవిభూజయతాం ప్రసిద్ధా॥

14. శాకాబ్దే శైలవార్ధి ద్యుమణిపరిమితా హ్యాశ్వినస్యావసానే॥
రాహుగ్రస్తేహిమాంశౌసుర గురుదివసే సైకతే పుణ్యనద్యాః।

......పురమధికముదాదత్తవాన్ వేమభూపతిః

15. శ్రీ రెడ్డిమల్లనామాంకిత.........యేన......

## * X శా॥శ॥ 1327?

బసవశంకర-శ్రీమల్లేశ్వరయిష్టదేవతా-శ్రీమన్మహా

♦ ఈ రెడ్డిమల్లవరపుశాసనము నెల్లూరిశాసనములు, 3వ సంపుటలో ప్రచురింపబడినది. See N. D. 1. III Ongole—mallavaram—No 73.

ఇందలి దాతృప్రశస్తియు, ఈఅనుబంధములోని VI నంబరుశాసనములోని దాతృప్రశస్తియు రెండుశ్లోకములుతప్ప మిగిలినవిసమానముగానేఉండుటచే, తిరిగిముద్రింపకవదలినాము.

1. బట్టరువర్తు వేణుగోపాలచెట్టిగారలమతమున ఈశాసనకాలము "శైలవార్ధిద్యుమణి", అనగా శా॥శ 1277 అగుచున్నది. 'వార్ధి' అనుపాఠము సందేహముతోనేవారిచ్చినారు. పైశ్లోకములో, 'రాహుగ్రస్తే, హిమాంశౌ" అనిపదవిభాగముచేసి, చంద్రగ్రహణమని ఎంచినఎడల, శాలివాహనశకము 1277 లో 'ఆశ్వీన' మాసములో చంద్రగ్రహణములేదు. 'రాహుగ్రస్తే, అహిమాంశౌ" అనివిభజించి, సూర్యగ్రహణమనిఎంచినఎడల, శా॥శ 1267 కు సరిపోవుచున్నది. కాని అపక్షములో 'వార్ధి' అనుపాఠముతప్పయి ఉండవలెను.—సంపాదకుడు.

* ఈ శాసనపు రేకులిప్పుడు, ఎపిగ్రాఫిక్ డిపార్టుమెంటువారి వంశమందున్నవి. వారి Annual report on South Indian Epigraghy for 1925 26 లో 5వనంబరుగా ఈ శాసనమును నమోదుచేయబడియున్నది. రాజమహేంద్రవరములోని గౌతమీ గ్రంథాలయములో Local Pecords వాల్యుములోనిశాసనములకునకళ్లువ్రాయించి, మూడువాల్యుములుగా భద్రపరచియున్నారు. అందలిమూడవవాల్యుములో 701 పుటలోఈశాసనమీయబడియున్నది. అందు "బందరుజిల్లాయిలాకా బెజవాడతాలూకాలోచేరిన పెదకొండపల్లిగ్రామంలోనేంచేసియున్న శ్రీ గిరి వీరేశ్వరస్వామివారు పార్వతీశ్వరస్వామివారు వగయిరాలకు అవసం పెర్మారెడ్డివారి వేమవరం అనే అగ్రహారంయిచ్చిన తామ్రశాసనంపట్టాలు 2." అని వ్రాయబడియున్నది. ఈ తామ్రశాసనపుముద్రికపై నందివాహనమున్నట్లు తెలుపబడినది.

సంపాదకుడు.

